# భారత
# స్వాతంత్ర్యోద్యమ చరిత్ర

రెండవ భాగము

**1858-1918**

(జాతీయతాభ్యుదయ కాలము)



ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య

సికింద్రాబాదు

**1976**

# ఉపోద్ఘాతము

పరాయివారైన బ్రిటిష్ వారి పరిపాలనను నిర్మూలించి సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించుటకు భారతీయులు సాగించిన ఉద్యమ చరిత్రను ఆంధ్రలోకమునకు తెలియ పరచే ఉద్దేశంతో నేను వ్రాయసంకల్పించిన గ్రంథంలో ఇది రెండవ భాగము. ఇందులో 1858 నుండి 1918 వరకు అనగా గాంధీ మహాత్ముడు రాజకీయరంగంలో ప్రవేశించునంత వరకు-స్వాతంత్ర్యోద్యమ దృష్ట్యా ప్రాధాన్యం వహించిన పరిణామాలను సమగ్రంగా వివరించాను.

ఈ పరిణామాలన్నిటికీ 1858 తర్వాత ప్రజలలో అంకురించి వృద్ధిగాంచిన జాతీయత అనే నూతనభావం మౌలికమైన ఆధారం ఇది స్వాతంత్ర్య సంపాదనమునకు దారి తీయుటయేగాక దానిని సాధ్యంచేసింది. అందుచేత ఈకాలానికి జాతీయతాభ్యుదయ కాలం అనే పేరు సర్వవిధాలా తగినట్టిది. గ్రంథంలోని రెండవ భాగంలో జాతీయతకు లభించిన ప్రాధాన్యాన్ని స్పష్టపరచుటకు ప్రయత్నించాను.

జాతీయత అంటే ఏమిటో, అందులో ఇమిడిఉన్న విశాలార్థం ఏలాటిదో, దానిచే ప్రభావితులైన ప్రజల మనోవైఖరి వారి ఆదర్శాలు ఏలాగు ఉండగలవో మొదటి అధ్యాయంలో వివరించాను. ఇంగ్లీషువిద్య, బ్రిటిష్ పరిపాలన మూలంగా దిగజారిన ఆర్థిక పరిస్థితులు, సంస్కర్తలు లేవదీసిన మతఉద్యమాలు, సంఘసంస్కరణ ఉద్యమాలు, వార్తా పత్రికలు, ఆధునికయుగంలో వెలువడిన దేశభాషలలోని వాఙ్మయము జాతీయత వృద్ధి గాంచుటకు ప్రధాన కారణములనీ, జాతీయత కూడా వీటిపై ప్రభావం వహించినదనీ, ఇవి పరస్పరాశ్రయములనీ, ప్రజల వికాసానికీ సర్వతోముఖాభివృద్ధికీ తోడ్పడినవనీ 2-6 అధ్యాయాలలో స్పష్టపరచాను. ఈ అధ్యాయాలలోని విశిష్టత ఇదియే.

జాతీయత ప్రజా జీవితానికి సంబంధించిన ఉద్యమాలన్నిటిపై ప్రభావం వహించినా రాజకీయోద్యమంపై అది వహించిన ప్రభావం అగ్రస్థానాన్ని సంపాదించింది. దీనిచే ప్రభావితులైన విద్యాధిక వర్గం వారు స్వాతంత్ర్యోద్యమంపై నాయకత్వాన్ని వహించి దానిని విజయవంతంగా సాగించినారు. పాశ్చాత్య దేశాలలో ఈలాటి విప్లవాత్మకములైన ఉద్యమాలను ఆధునిక యుగంలో ఏర్పడిన బూర్జ్వావర్గం సాగించింది. పరాయి పరిపాలన కారణంగా మనదేశంలో ఈలాటి వర్గం ఏర్పడలేదు. అందుచేత ఉద్యమాన్ని సాగించే బాధ్యతను విద్యాధిక వర్గం వహించవలసి వచ్చింది. ఇది మన ఉద్యమానికి ఒక ప్రత్యేకత. గ్రంథంలో ఈప్రత్యేకతను నిరూపించాను.

ఈబాధ్యతను నిర్వహించడంలో విద్యాధికులు ప్రథమంలో రాష్ట్రాలకు మాత్రమే పరిమితములైన రాజకీయ సంఘాలను, అటుతర్వాత 1885 లో దేశానికంతా కేంద్రంగా కృషిచేయగల అఖిల భారతజాతీయ కాంగ్రెసును (Indian National Congress), స్థాపించారు. రాజకీయ సంస్థలన్నిటిలో ఇది అగ్రస్థానాన్ని సంపాదించింది. 1918 తర్వాత దీని అధ్వర్యంలోనే గాంధీమహాత్ముడు స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించాడు. దేశచరిత్ర చాలావరకు కాంగ్రెసు చరిత్రతో ముడివడిపోయింది. ఇంతటి ప్రాధాన్యంవహించిన కాంగ్రెసు పుట్టుటకు ఏపరిస్థితులు దారితీసినవో, కాంగ్రెసుకు పితామహుడని ప్రఖ్యాతి గాంచిన హ్యూం అనే బ్రిటిష్ ప్రముఖుడు ఇందులో ఏలాటి పాత్రను వహించాడో, 8 వ అధ్యాయంలో సవిస్తారంగా వివరించాను. తొలిదశలో అతని ప్రభావంచేతనే కాంగ్రెసు మితవాదతత్వాన్ని అనుసరించింది. దానిపై నాయకత్వంవహించిన భారతీయులు మితవాదులు వీరు స్వాతంత్ర్యసంపాదనను లక్ష్యంగా పెట్టుకొనక, బ్రిటిష్ ప్రభుత్వం నుండి కొన్ని సంస్కరణలను సంపాదించుటకు మాత్రమే ప్రయత్నించారు. దీనికికూడా వారు చట్టబద్ధమైన కార్యక్రమాలను మాత్రమే వినియోగించారు. ఈవిధంగా వారి లక్ష్యంలోను, లక్ష్యసాధనలోను మితవాదతత్వం ప్రతిబింబితమైంది. 9 వ అధ్యాయంలో తొలిదశలో కాంగ్రెసు లక్ష్యాలను, అది అనుసరించిన విధానాలను, అవి ఫలప్రదం కానందుకు కారణాలను తెలియపరచాను.

కాంగ్రెసు సాధనాన విద్యాధికులు జాతీయతను బలపరచుటకుచేసిన ప్రయత్నాలు ప్రభుత్వానికి ఎంతమాత్రమూ రుచించలేదు. అది మితవాదతత్వాన్ని అనుసరించినా దానిని ద్వేషించసాగింది. దానినీ, అది వృద్ధిచేయదలచిన జాతీయతనూ బలహీన పరచుటకు అనేకవిధానాలను అనుసరించింది. వీటిలో "చీలించి పాలించు' అనే భేదో పాయం అత్యంతప్రాధాన్యం వహించింది. హిందువులనుండి ముస్లింలను వేరుచేయుటకు, జమీందార్లు మొదలైన ఫ్యూడల్ వర్గాలను కాంగ్రెసునుండి విడదీయుటకు పన్నాగాలు పన్ని విజయాన్ని కొంతవరకు సాధించింది. ముస్లింలలో ఒక ప్రధానవర్గంవారు ప్రభుత్వ విధానాలకు లొంగి, హిందువులు ఒక జాతివారని, ముస్లింలు వేరొకజాతివారనే ద్విజాతి సిద్ధాంతాన్ని సమర్ధించసాగారు. ఈ సిద్ధాంతమే తుదకు దేశవిభజనకు పాకిస్థాన్ నిర్మాణానికి దారితీసింది. ఈ పరిణామాలను 7, 10 అధ్యాయాలలో వివరించాను.

మితవాదులతత్వం ఫలప్రదం కాకపోవడంచేత 1905 నాటికి దేశంలో జాతీయ వాదులు ఒక ప్రత్యేక పక్షంగాఏర్పడి, స్వరాజ్య సంపాదనము ప్రజల లక్ష్యంగా ఉండవలెనని, దానిని సాధించుటకు చట్టబద్ధములైన కార్యక్రమాలు పనికిరావని, పరాయి పరిపాలకులు బలప్రయోగానికి మాత్రమే లొంగగలరని, బలప్రయోగం భారతదేశ పరిస్థితులలో సాయుధపోరాటరూపం ధరించడం సాధ్యంకాదని, అందుచేత బ్రిటిష్ వస్తువుల బహిష్కరణ, స్వదేశీవస్తువుల వాడకం, జాతీయ విద్యావిధానం, మొదలైన అంశాలతోకూడిన సాత్వికనిరోధ కార్యక్రమం అనుసరణయోగ్యమని ప్రతిపాదించి దానిని ప్రచారంచేశారు. ఇందుకుగాను కాంగ్రెసును తమ వశంలోకి తెచ్చుకొనుటకు 1905, 1906 లో ప్రయత్నంచేసి పాక్షికంగా విజయాన్ని సంపాదించారు; కాని మిత

వాదులు ప్రభుత్వ ఒత్తిడికిలోబడి వీరికి బద్ధవిరోధులై 1907 లో సూరటులో జరిగిన కాంగ్రెసు సమావేశంలో కాంగ్రెసునుండి వీరు పూర్తిగా నిష్క్రమించవలసిన పరిస్థితులను కల్పించారు. అదిమొదలు 1916 వరకు కాంగ్రెసు అన్ని పక్షాలతోకూడిన జాతీయసంస్థ అనే పేరును పోగొట్టుకొని, పూర్తిగా మితవాదులసంస్థగామారి ప్రభుత్వ విధానాలను సమర్థించసాగి, దేశంలో తనపలుకుబడిని పోగొట్టుకొన్నది. ఈ విషయాలన్నిటినీ 11, 12 అధ్యాయాలలో వివరించాను.

జాతీయవాదులకు కాంగ్రెసులో స్థానం లభించకపోయినా ప్రజలపై వారు ప్రభావం వహించగలిగారు. బెంగాలురాష్ట్ర విభజనరద్దుకై బెంగాలీలు సాగించిన చరిత్రాత్మకమైన వందేమాతర ఉద్యమంలో (1905-11) ఈ ప్రభావం స్పష్టంగా కనుపించింది. ఇందులో ప్రజలు విజయాన్ని సంపాదించి ప్రభుశక్తికంటె ప్రజాశక్తియే బలవత్తరమైనదని రుజువుచేశారు. విధిలేక 1911 లో ప్రభుత్వం బెంగాలురాష్ట్ర విభజనను రద్దుచేసింది. దీనికి రెండు సంవత్సరాలకు పూర్వం మితవాదులను ముస్లింలను ఫ్యూడల్ వర్గాలను తృప్తిపరచే ఉద్దేశంతో మింటోమార్లె సంస్కరణలను ప్రవేశపెట్టింది. వందేమాతర ఉద్యమాన్ని గురించి 12 వ అధ్యాయంలోను, సంస్కరణలగురించి 13 వ అధ్యాయంలోను పూర్తిగా వివరించాను.

1915 నుండి దేశవ్యాప్తంగా సాగిన హోంరూల్ ఉద్యమంలో జాతీయవాదుల ప్రభావం రెండవ పర్యాయం కనుపించింది. అదేకాలంలో బ్రిటిష్ ప్రభుత్వం ప్రథమ ప్రపంచ సంగ్రామంమూలంగా క్లిష్టపరిస్థితులను ఎదుర్కొనలేక, యుద్ధంలో భారతప్రజల సహాయాన్ని పూర్తిగా సంపాదించుటకై తన నిరంకుశవిధానాన్ని కొంతవరకు మార్చుకొని దేశంలో బాధ్యతాయుత పరిపాలనవిధానాన్ని ప్రవేశపెట్టడం తన తుదిలక్ష్యమని ప్రకటించి, దానికి మొదటిమెట్టుగా 1919లో మాంటెగు చెమ్స్‌ఫర్డు సంస్కరణలను రూపొందించింది. ఇది ప్రజలు సాధించిన రెండవవిజయంగా పేర్కొనతగినది. వీటినిగురించి 14, 15 అధ్యాయాలలో వివరించాను.

1905 తర్వాత సాయుధపోరాటం మూలంగానే పరాయిపరిపాలనను నిర్మూలించడం సాధ్యంకాగలదనీ, సాత్వికనిరోధంవంటి శాంతియుతకార్యక్రమాలు ఫలప్రదములు కాజాలవనీ విశ్వసించిన ఒక విప్లవవర్గంఏర్పడి బెంగాలు, మహారాష్ట్రము, పంజాబులలో దాని కార్యక్రమాలను సాగించింది. మామూలు చరిత్ర గ్రంథాలలో ఈ విప్లవ ఉద్యమాన్ని గురించి పూర్తి వివరాలు ఉండడంలేదు. కాని ప్రజలలో జాతీయతనూ రాజకీయ చైతన్యాన్నీ బలపరచడంలో ఈ ఉద్యమం పటిష్టసాధనంగా పనిచేసింది. దానినిగురించిన వివరాలు పాఠకులకు తెలియపరచడం అవసరమనే భావంతోను, విప్లవవర్గంవారిని గురించి అనేకులలో ఏర్పడిన అపోహలను తొలగించడం అవసరమనేభావంతోను 16 వ అధ్యాయంలో దీనినిగురించి పూర్తిగా వివరించాను.

1858-1918 మధ్య దేశంలో సంభవించిన పరిణామాలూ, ప్రజలలో అంకురించి వృద్ధిగాంచిన జాతీయతా, అఖిలభారత జాతీయకాంగ్రెసుస్థాపనా, వందేమాతర ఉద్యమం

హోంరూల్ ఉద్యమం, విప్లవఉద్యమం మొదలైనఉద్యమాలూ ప్రజలమనోవైఖరిని పూర్తిగా మార్చగలిగినవి. స్వరాజ్యసంపాదనపట్ల సుముఖత్వము పరాయిపరిపాలనపట్ల విముఖత్వము వారిలోవృద్ధిగాంచాయి. అందుచేతనేవారు గాంధీమహాత్మునికి అనుచరులై ఆయన సాగించిన స్వాతంత్ర్యోద్యమమందు అధికసంఖ్యలో పాల్గొన్నారు. ఈ అరవై సంవత్సరాలలో సంభవించినపరిణామాలు ఈకారణంచేతనే అత్యంతప్రాధాన్యాన్ని వహిస్తున్నవి. ఈ పరస్పరసంబంధాన్ని అర్థంచేసుకొనడంలో నా గ్రంథంలోని రెండవభాగం పాఠకులకు సహాయపడగలదని విశ్వసిస్తున్నాను,

## కృతజ్ఞతలు

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీజలగం వెంగళరావుగారు మొదటిభాగం ముద్రణ విషయంలో నాకు ఎంతగానో సహాయంచేశారు. అదేవిధంగా రెండవభాగం ముద్రణ విషయంలో నాకు సహాయంచేయవలసిందిగా నేను అర్థించినవెంటనే వారికి సహజమైన ఔదార్యంతో ప్రభుత్వంతరఫున నాకు గొప్పవిరాళాన్ని అందజేసి, గ్రంథకర్తలనుగౌరవించి పోషించిన పూర్వకాలపు పరిపాలకులను నా స్మరణకుతెచ్చినారు. వారికి నాకృతజ్ఞతలను సమర్పిస్తున్నాను. రచనాకార్యక్రమంలో నాకు అనేకవిధాలుగా ప్రోత్సాహంకల్పించిన ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు మండలి వెంకటకృష్ణారావుగారికి నా కృతజ్ఞతలను సమర్పిస్తున్నాను.

నాగ్రంథాన్ని వ్రాయడంలో ప్రఖ్యాత చరిత్రరచయితలైన డాక్టరు మజుందార్ తారాచంద్ మొదలైనవారిగ్రంథాలను ఆధారంగాస్వీకరించాను. ప్రతి అధ్యాయంచివర వాటినిపేర్కొన్నాను. ఆరచయితలందరికి ప్రత్యేకంగా నాకృతజ్ఞతలనుసమర్పిస్తున్నాను.

గ్రంథరచనలోను, వ్రాతప్రతిని ముద్రణకుసిద్ధపరచడంలోను, ప్రూపులు దిద్దడములోను ఉస్మానియావిశ్వవిద్యాలయ చరిత్రశాఖలో రీడర్‌గావున్న నాకుమార్తె డాక్టరు అల్లాడి వైదేహి నాకు చాలా సహాయంచేసింది. ఆమెకు నా ఆశీస్సులు.

గ్రంథమును అనాలస్యముగ ముద్రించి నాకు సహాయపడిన హైదరాబాదులోని నాట్యకళ ప్రెస్సువారికి, వారిలో ప్రధానంగా ప్రెస్ మేనేజరు శ్రీ యం. జగన్నాధరావు గారికి నాకృతజ్ఞతలు.

సికింద్రాబాదు — మామిడిపూడి వెంకటరంగయ్య
జూలై 31, 1976.

# విషయ సూచిక

# అధ్యాయము - 1

## జాతీయత - దాని లక్షణాలు

### 1

1857-58లో జరిగిన తిరుగుబాటు విఫలం కావడంతో స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో రెండవ దశ ప్రారంభమైంది. ఇది 1919 వరకు సాగి 1919 లో ఉద్యమానికి గాంధీమహాత్ముడు నాయకుడు కావడంతో మూడవ దశలో ప్రవేశించింది. ఈ దశ 1947వరకు సాగి, ఆసంవత్సరం ఆగష్టు 15న బ్రిటిష్‌వారు వారి అధికారాన్ని పూర్తిగా వదలుకోవడం, దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభించి ఒక ప్రజారాజ్యంగా రూపొందడం జరిగింది. సుమారు 800 సంవత్సరాలకాలం పరాయి వారి దాస్యానికి లొంగిపోయిన దేశం తిరిగి ప్రపంచంలో పరువు మర్యాదలతో తలయెత్తుకొని ప్రవర్తించడం సాధ్యమైంది. అంతటితో స్వాతంత్ర్యోద్యమం విజయవంతంగా ముగిసి, దేశచరిత్రలో ఒక నూతనశకం ప్రారంభమైంది. మనం ఈనాడు ఆ శకంలో ఉంటున్నాము.

రెండవదశ చరిత్రను వివరించుటకు పూర్వం ఒక ప్రధాన విషయం గురించి ప్రస్తావించడం అవసరం.

ఈనాటి మన దృష్టితో పరిశీలించి చూచిన పక్షాన బ్రిటిష్‌వారి అధికారాన్ని నిర్మూలించుటకు మనం లేవదీసిన ఉద్యమం మన దేశ చరిత్రలో మొదటి స్వాతంత్ర్యోద్యమం కానట్లు, దానికి పూర్వం ఈలాటి ఉద్యమాలు అనేకం సంభవించినట్లు కనుపిస్తుంది. కాని ఆ ఉద్యమాలకు ఈఉద్యమానికి ఒక గొప్ప భేదం ఉంది ఈఉద్యమాన్ని లేవదీసి, సాగించి, సమస్త త్యాగాలుచేసి, తుదకు విజయాన్ని సాధించిన వారు వివిధ వర్గాలకు చెందిన ప్రజలు. ఇందులో వారిదే ప్రధానపాత్ర. అందుచేత దీనికి ప్రజల ఉద్యమం అనే పేరు సర్వవిధాలా చెల్లుతుంది. దీని ఫలితంగా దేశంలో ఏర్పడిన పరిపాలనవ్యవస్థ ప్రజాప్రభుత్వంగా పరిణమించింది.

దీనికి పూర్వం దేశంలో సాగింపబడిన స్వాతంత్ర్యోద్యమాలలో ప్రజలు వహించిన పాత్ర చాలా తక్కువ, ఆలాటి పాత్రలేదని కూడ చెప్పడంలో అతిశయోక్తి ఉండదు. వాటిని లేవదీసి, సాగించి, విజయాన్ని సంపాదించిన వారు శూరాగ్రేసరులై క్షత్రియ ధర్మాన్ని అనుసరించిన వ్యక్తులు. సనాతన సంప్రదాయాను సారం వారు సైన్యాలను సమకూర్చుకొని, బలప్రయోగంచేసి యుద్ధరంగాలలో పరాయిపరిపాలకులను ఓడించి స్వరాజ్యాలను స్థాపించుకొన్నవారు. వారి లక్ష్యం దేశస్వాతంత్ర్యం కాదు. ఆకాలాల పరిస్థితులలో ఆలాటి

లక్ష్యం ఒకటి ఏర్పడడానికి అవకాశంకూడా లేదు. తమయొక్కయు, తమ వంశములయొక్కయు పేరు ప్రతిష్ఠలను నిలబెట్టుకొనడమే వారి లక్ష్యం. దానిని సాధించడంలో ప్రజల సహకారం వారికి అవసరం లేకపోయింది. సైన్యాలు వారికి సటిష్టసాధనాలైనాయి.

ఈ సత్యాన్ని నిరూపించడానికి మన దేశచరిత్రలో ఎన్నో దృష్టాంతాలు ఉన్నాయి. పరాయి వారైన గ్రీకులు (మన పూర్వులు వీరిని యవనులని చెప్పేవారు) వశపరచుకొన్న పంజాబు మొదలైన ప్రాంతాల నుండి వారి అధికారాన్ని తొలగించినవాడు క్రీ. పూ. నాల్గవ శతాబ్దం ఆఖరు భాగంలో ఉండిన మౌర్యచంద్రగుప్తుడనే యోధుడు. ఇతడు మహామేధావి అయిన చాణక్యుని సహాయంతో మౌర్యవంశ ప్రతిభను మౌర్యసామ్రాజ్యాన్ని స్థాపించినవాడు. ఇతని ప్రయత్నంలో ప్రజల పాత్ర ఉన్నట్లు కనుపించదు. ఇదే విధంగా క్రీ. శ 5 వ శతాబ్దంలో మాళవాదిపశ్చిమ ప్రాంతాలను పరిపాలిస్తుండిన శకులనే పరాయి వారిపరిపాలనను తొలగించిన వాడు గుప్త చక్రవర్తి అయిన రెండవ చంద్రగుప్తుడు. ఈ ఘనవిజయాన్ని సాధించి అతడు విక్రమాదిత్యుడనే బిరుదును వహించాడు. ఇందులో కూడా ప్రజల పాత్ర ఏలాటిదీలేదు. ఇటీవలి వరకు ప్రజలు రాజకీయాల పట్ల ఉదాసీనులుగా ఉండేవారు.

12వ శతాబ్దంనుండి పరాయివారైన ఆఫ్గనులు తురుష్కులు మన దేశంలో రాజ్యాలను సామ్రాజ్యాలను స్థాపించుకున్నారు. వారిఅధికారం ఉత్తరభారతంలోను దక్షిణభారతంలోను వ్యాపించింది. వారుదేశానికి పరాయివారు. వారిది పరాయిప్రభుత్వం. వారిమతము, సంస్కృతి ఆనాటి భారతీయులమతానికి సంస్కృతికి భిన్నమైనట్టివి. ఆలాటిపరాయివారిని ఎదురొడ్డి అధికారాననుండి వారినితొలగించుటకు ఉత్తరభారతంలో ప్రయత్నంచేసినవారు రాజపుత్రవీరులు. సామాన్యప్రజలప్రమేయం అందులోలేదు. అదేవిధంగా దక్షిణభారతంలో వారినిఎదుర్కొన్నవారు విజయనగరసామ్రాజ్యాన్నిస్థాపించిన బుక్కరాయ హరిహరరాయసోదరులు.

16వశతాబ్దంలో పరాయివారైన మొగలాయీలు దేశంపై దండెత్తి వచ్చి క్రమక్రమంగా వారి సామ్రాజ్యాధికారాన్ని స్థాపించుకొన్నారు. వారిని ఎదుర్కొని ఉత్తరభారతంలో స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొనుటకు ప్రయత్నం చేసినవారు రాణాప్రతాప్ వంటియోధులు. దక్షిణభారతంలో ఈలాటి ప్రయత్నం చేసినవాడు మహారాష్ట్ర నాయకుడైన శివాజి. ఇతడు మహారాష్ట్రంలోని ప్రజల సహాయంతో తనఉద్యమాన్ని సాగించినమాటవాస్తవమే. కాని ఇదిసాధారణంగా దేశంలో సంభవిస్తూవచ్చిన స్వాతంత్ర్యోద్యమాల లక్షణానికి ఒక మినహాయింపుగా గుర్తించడం యుక్తం. శివాజీ తర్వాత క్రమక్రమంగా ప్రజలపాత్రతగ్గడం సైనికులపాత్ర ఎక్కువ ప్రాధాన్యాన్ని వహించడము జరిగింది. పంజాబు నుండి మొగలాయీల యొక్కయు ఆఫ్గనులయొక్కయు అధికారాన్ని తొలగద్రోయడంలో శిక్కుప్రజలపాత్ర గణుతించదగినది. కాని ఇక్కడకూడా

ప్రజలందరు వీరిఉద్యమంలో పాల్గొనలేదు.

ఈ వివరణము వలన బ్రిటిష్ పరిపాలనకు పూర్వం లేవదీయ బడిన స్వాతంత్ర్యోద్యమాలలో అత్యధికం యోధాగ్రేసరులైన వ్యక్తులు లేవదీసి సాగించిన ఉద్యమాలనీ, వాటిలో ప్రజలపాత్ర చాల స్వల్పమనీ స్పష్టం అవుతుంది. బ్రిటిష్ వారి అధికారాన్ని నిర్మూలించటానికి సాగించబడిన ఉద్యమం ఈలాంటిదిగాక ప్రజల ఉద్యమంగా ప్రసిద్ధి గాంచింది. వీటిమధ్య ఉండే ఈ గొప్ప భేదాన్ని మనం గుర్తించినప్పుడే ఈ ఉద్యమంలోని విశిష్టతను మనం అర్థం చేసుకోనగలుగుతాము. 18-19 శతాబ్దాలలోని బ్రిటిష్‌వారు అంతకు పూర్వం ఉండిన భారతీయులవంటివారు కారు. వీరు తరతరాలుగా ప్రజలలో జీర్ణించుకొని పోయిన రాజకీయఔదాసీన్యాన్ని వదలి, రాజకీయ చైతన్యం గలవారై ఒక విప్లవాన్ని లేవదీసి దానిని విజయవంతంగా సాగించారు ఇది వీరిలో గలిగిన అపూర్వమైన మార్పు. ప్రపంచ మందంతటా 19 వ శతాబ్దం నుండి సామాన్య ప్రజలు వారిగాఢ నిద్రనుండి మేల్కొనడం జరిగింది. ప్రపంచ చరిత్రలో ప్రజా యుగం ప్రారంభమైంది. ప్రజాశక్తి ఎదుట మరి యే శక్తి కూడా నిలబడడం సాధ్యం కాదనేది రుజువైంది. మనదేశంలో కూడా ఇదే జరిగింది. ప్రజలు మేల్కొని తమలో లీనమై ఉండిన శక్తిని ఉపయోగించి పరాయి ప్రభుత్వాన్ని తొలగించి స్వాతంత్ర్యాన్ని సంపాదించారు. వ్యక్తుల పాత్ర కంటే ప్రజల పాత్ర ఎక్కువ ప్రాధాన్యం కలదని నిరూపించారు. ప్రజలను మేల్కొల్పిన శక్తులు ఎలాటివో మనం ఇప్పుడు తెలుసుకోనవలసి ఉన్నది.

## 2

బ్రిటిష్ వారిపై మనము సాగించిన ఉద్యమంలో ఇంకొక విశేషం కూడా ఉంది. అది ప్రజల ఉద్యమం మాత్రమే కాక జాతీయ ఉద్యమంగా కూడా రూపొందింది. దీనిని దేశంలోని ప్రజలు తాము ఒక జాతికి చెందిన వారనే భావంతో కలిసి సాగించారు. యుగయుగాలుగా రాజకీయ చైతన్యం లేని ప్రజలు రాజకీయాలయందు ఆసక్తిగలవారై ప్రవర్తించటం ఎంత అపూర్వమో జాతీయత అంటే ఏమో తెలియని వారు జాత్యభిమానంతో ఉద్యమాన్ని సాగించడం అంత అపూర్వమని తెలుసుకోనవలసి ఉంది.

ప్రజల ఉద్యమం జాతీయ ఉద్యమ రూపాన్ని ధరించవలసిన అవసరం లేదు. దేశంలో స్వాతంత్ర్యోద్యమం ప్రారంభమైన నాటికి ప్రజలు మద్రాసు, బొంబాయి, బెంగాలు, మధ్య పరగణాలు, ఉత్తర ప్రదేశ్ మొదలైన వివిధ రాష్ట్రాలలో నివసించేవారు, ఒక్కొక్క రాష్ట్రంలోని ప్రజలు ప్రత్యేకంగా స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించి, అది విజయవంతం కాగానే ఒక ప్రత్యేక స్వతంత్రరాజ్యాన్ని ఏర్పాటు చేసుకొని ఉండవచ్చు. లేదా ఉద్యమ కాలంలో వారందరు కలిసి పోరాటాన్ని సాగించినా విజయాన్ని సాధించిన తర్వాత ప్రత్యేక రాజ్యాలను నిర్మించుకొని విడిపోయి ఉండవచ్చును ఈలాంటి పరిణా

మాలలో విపరీతం ఎలాటిదీ లేదు. ప్రపంచంలో గత రెండువందల సంవత్సరాల మధ్య ఎన్నో సామ్రాజ్యాలు విచ్ఛిత్తిగాంచాయి. వాటి అధికారానికి లోబడిన ప్రదేశాలు ఇరుగు పొరుగున ఉండినా అవి కలిసి ఒకే రాజ్యంగా ఏర్పడడానికి బదులు అనేక స్వతంత్ర రాజ్యాలుగా ఏర్పడడం జరిగింది. కొన్ని ప్రదేశాలలో అతి కష్టం మీద ఆలాటి ప్రమాదం తప్పింది. దీనికి కారణం తిరుగుబాటు చేసిన ప్రజలలో జాతీయభావం లోపించి ఉండడమే.

19వ శతాబ్దంలోను 20వ శతాబ్దపు ప్రారంభంలోను యూరపు ఖండంలో ఆస్ట్రియా, టర్కీ, రషియా సామ్రాజ్యాలు ఉండేవి. టర్కీ సామ్రాజ్యంలోని గ్రీకులు, బల్గేరియనులు, రుమేనియనులు తదితరులు స్వాతంత్ర్యోద్యమాలను లేవదీసి సుల్తానుపై తిరుగుబాటు చేసి విజయాన్ని సాధించారు. కాని వీరందరు కలిసి ఒక జాతివారనే భావంతో ఉద్యమాన్ని సాగించనికారణంగా సామ్రాజ్యం విచ్ఛిన్నమైన తర్వాత దాని స్థానే నాలుగు స్వతంత్ర రాజ్యాలు ఏర్పడ్డాయి. అదేవిధంగా మొదటి ప్రపంచ యుద్ధం కారణంగా ఆస్ట్రియా రషియా సామ్రాజ్యాలు విచ్ఛిన్నమైన తర్వాత అనేక స్వతంత్ర రాజ్యాలు ఏర్పడ్డవి. తిరుగుబాటు చేసిన ప్రజలలో తాము విభిన్న జాతులకు చెందిన వారనే భావం ఉండడమే దానికి కారణం.

మధ్య దక్షిణ అమెరికాలలో ఇదే జరిగింది. ఈ భూభాగాన్ని మూడు వందల సంవత్సరాల కాలం స్పెయిన్ వారు జయించి వశపరచుకొని పరిపాలించారు. 19వ శతాబ్ది ప్రారంభాన అక్కడి ప్రజలు స్పెయిన్ వారిపై తిరుగుబాటు చేశారు. తిరుగుబాటు చేసినవారు ఒకే మతానికి చెందినవారు. వారు సాగించిన ఉద్యమం ప్రజల ఉద్యమం. కాని వారిలో జాతీయ భావం లేని కారణంగా ఒక్కొక్క రాష్ట్రంలోని ప్రజలు ఒక ప్రత్యేక స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పరచు కొన్నాయి. మెక్సికో, పెరూ, చిలీ, అర్జెంటీనా మొదలైన రాజ్యాలు ఇవి. ఒక సామ్రాజ్యంస్థానే ఇరవై రాజ్యాలు ఏర్పడ్డాయి.

రెండవ ప్రపంచ యుద్ధ ఫలితంగా ఆఫ్రికా ఖండాన నుండి అదివరలో సామ్రాజ్యాధికారాన్ని చెలాయిస్తూ వచ్చిన బ్రిటిషువారు ఫ్రెంచివారు వారి అధికారాన్ని వదలుకొని వెళ్లిపోవలసి వచ్చింది. వారికి లోబడిన ఆఫ్రికన్ ప్రజలలో జాతీయభావం లేనందున ఒక్కొక్క రాష్ట్రానికి చెందినవారు ఒక ప్రత్యేక రాజ్యాన్ని ఏర్పరచుకొన్నారు.

ఈనాటి జాతీయ రాజ్యాలలో అమెరికా అగ్రస్థానం వహిస్తున్నది. ప్రపంచంలోని రెండు అగ్రరాజ్యాలలో అది ఒకటి (సోవియట్ రషియా రెండవది). 1776 కు పూర్వం ఇందులోని రాష్ట్రాలు (అనాడు వాటి సంఖ్య 13) బ్రిటిష్ సామ్రాజ్యాధికారానికి లోబడి ఉండేవి. 1776 లో వాటిలోని ప్రజలు బ్రిటిష్‌వారిపై తిరుగుబాటుచేసి ఏడు సంవత్సరాల కాలం స్వాతంత్ర్య సమరాన్ని సాగించి విజయాన్ని సాధించారు. యుద్ధకాలంలో పదమూడు రాష్ట్రాలలోని వారు కలిసి బ్రిటిష్‌వారిపై యుద్ధాన్ని సాగించినా,

ఒక్కొక్క రాష్ట్రంలోనివారు ఒక్కొక్క స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించుకొన్నారు. ఆనాడు వారిలో జాతీయభావం పూర్తిగా నాటుకోలేదు. యుద్ధం ముగిసిన తర్వాత పదమూడు రాజ్యాలుగా వేరువేరుగా ఉండడమా, లేదా, కలిసి ఒక రాజ్యంగా ఏర్పడడమా అనే సమస్య బయలుదేరింది. జాతీయభావం విస్తారబలం లేనిదిగా ఉన్నందున ఈ రాజ్యాలలోని ప్రజలు వారి స్వతంత్రాన్ని పూర్తిగా కోల్పోవడానికి సిద్ధపడక, ఒక సమాఖ్య-ఫెడరల్-రాజ్యంగా ఏర్పడ్డారు. కొంత కాలం జరిగిన తర్వాత దక్షిణ రాష్ట్రాలు వేర్పాటు ఉద్యమాన్ని లేవదీసి, సమాఖ్యపై యుద్ధం చేశాయి. ఈ అంతర్యుద్ధం నాలుగు సంవత్సరాల కాలం (1861—65 మధ్య) అతి భీకరంగా జరిగింది. వేర్పాటు రాష్ట్రాలలోని ప్రజలు ఓడిపోయారు. అతికష్టం మీద రెండు రాజ్యాలు ఏర్పడే ప్రమాదం తప్పింది. ఈలాటి ప్రమాదం సంభవించడానికి కారణం ఆనాటి ప్రజలలో జాతీయభావం లోపించడమే. 1865 తర్వాతనే క్రమక్రమంగా అమెరికన్లలో జాతీయభావం వృద్ధిగాంచింది.

ప్రపంచ చరిత్రలోని పై సంఘటనల దృష్ట్యా మన స్వాతంత్ర్యోద్యమం ఒక జాతీయోద్యమంగా రూపొందడం గొప్ప విశేషమని చెప్పవలసి వస్తుంది. మధ్య దక్షిణ అమెరికాలలోను, ఆఫ్రికా ఖండంలోను, యూరపు ఖండంలోను జరిగినట్లే మనదేశంలో కూడా బ్రిటిష్ సామ్రాజ్యాధికారం తొలగిపోయిన తర్వాత అనేక స్వతంత్ర రాజ్యాలు ఏర్పడి ఉండవచ్చు. ప్రాచీనకాలాననుండి దేశంలో అంగ వంగ కళింగాది రాజ్యాలు యాభై ఆరు ఉండినట్లు పురాణాలు చరిత్రలు చాటుతున్నాయి. స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఆయా ప్రాంతాలలోని ప్రజలు వారి ప్రాచీన చరిత్రను స్మరించుకొని ప్రత్యేక రాజ్యాలను స్థాపించుకొనవలెనని పట్టుబట్టి యుండినపక్షాన ప్రజల ఉద్యమ ఫలితం వేరొకవిధంగా ఉండేది. దేశంలో ఈనాడు కూడా ప్రాంతీయాభిమానాలు ఎంత ప్రాబల్యం కలవిగా ఉన్నాయో దైనందిన సంఘటనలు స్పష్టపరుస్తున్నాయి. అలాటి అభిమానాలు స్వాతంత్ర్యోద్యమం సాగించినవారిలో లేకపోలేదు. కాని వాటితోపాటు జాతీయాభిమానం వారిలో ఉండినందునను, ఈ అభిమానం ప్రాంతీయాభిమానానికంటె బలంకలదిగా ఉండినందునను రాజకీయంగా దేశం విచ్ఛిన్నమయ్యే ప్రమాదం తప్పింది.

1800 ప్రాంతానకూడా దేశంలోని ఒక ప్రాంతంవారు ఇంకొక ప్రాంతంవారిని పరాయివారని భావిస్తూ ఉండేవారు. మహారాష్ట్రులు హిందూస్థానం వారి దృష్టిలోను బెంగాలీల దృష్టిలోను తదితరుల దృష్టిలోను పరాయివారు. అదేవిధంగా హిందూస్థానీయుల దృష్టిలో బెంగాలీలు పరాయివారు. సిక్కుల దృష్టిలో తక్కిన భారతీయులందరు పరాయివారు. వీరందరు కలిసి ఒక జాతిగా ఏర్పడడం స్వప్నతుల్యమని బ్రిటిషువారు భావిస్తూఉండేవారు. అలాటి జాతీయభావం ప్రజలలో లేనందుననే బ్రిటిష్‌వారు దేశాన్ని జయించగలిగారని, 1857-58 తిరుగుబాటును అణపగలిగారని మనం ఇదివరకే తెలుసుకొన్నాము.

ఇటువంటి దేశంలో ప్రజలు ఒక జాతిగా ఏర్పడి, జాతీయ భావంతో బ్రిటిష్ వారిపై పోరాటాన్ని సాగించడం ఒక అద్భుతమైన విశేషం.

ఇది ఒకవిధంగా మన అదృష్టమని కూడా చెప్పవలసిఉంది. దేశంలోని ప్రజలందరు ఒక జాతికి సంబంధించినవారనే సూత్రం ముస్లింలలోని అధిక సంఖ్యాకులకు అమోదయోగ్యం కాలేదు. వారిలో కొందరు మాత్రమే స్వాతంత్ర్యోద్యమంలో తక్కినవారితో కలిసి పాల్గొన్నారు. తాము ప్రత్యేక జాతికి చెందినవారని, దేశంలో తమకు ప్రత్యేక స్వతంత్ర రాజ్యం ఉండవలెనని అధిక సంఖ్యాకులు పట్టుబట్టారు. బ్రిటిష్‌వారు వారికి అండగా నిలబడ్డారు. దాని ఫలితంగా జాతియోద్యమం కొంత బలాన్ని కోల్పోయి దేశంలో ఇండియా పాకిస్తాన్‌లు అని రెండు స్వతంత్ర రాజ్యాలు ఏర్పడ్డాయి. ముస్లింల లోని ఒక వర్గంవారివలె శిక్కులలో ఒక వర్గంవారు, తమిళులలో ఒక వర్గంవారు సంస్థానాధీశులు కొందరు వేర్పాటు ధోరణిలో పడి, మరికొన్ని స్వతంత్ర రాజ్యాల సంస్థాపనకు ప్రయత్నించారు. కాని బ్రిటిష్‌వారు వారిని సమర్థించని కారణం మూలానను, ఇతర పరిస్థితులు కూడా వారికి అనుకూలించనందునను వారి ప్రయత్నం విఫలమయింది. ముస్లింలలో ఒక వర్గం తప్ప తక్కిన ప్రజలందరు జాతీయభావం కలవారు కావడంచేత దేశం పూర్తిగా విచ్ఛిన్నమయ్యే ప్రమాదం తప్పింది.

వైశాల్యంలోను జనసంఖ్యలోను మనదేశం చాలా పెద్దది. ఇది రష్యా మినహా యూరపు ఖండమంతటి దేశం. యూరపు ఖండంలోని ఈ విభాగంలో 26 స్వతంత్ర రాజ్యాలు ఉన్నాయి. భాషలుబట్టి, మతాలుబట్టి, నాగరికత స్థాయిలబట్టి మనదేశంలోని ప్రజలలో ఎన్నో భేదాలున్నాయి. అయినా పరిస్థితులు అనేకం 1858 తర్వాత మనకు అనుకూలించినందున ప్రజలలో జాతీయ భావం అంకురించి వృద్ధిగాంచి మనం ఒక జాతిగా బ్రిటిష్‌వారితో పోరాటం సాగించి పాకిస్థాన్ మినహాగా మన రాజకీయ ఐక్యతను స్థిరపరచుకొన్నాము. ఇంతకు పూర్వం దేశంలో సామ్రాజ్యాలు విచ్ఛిన్నమయినప్పుడు అనేక స్వతంత్ర రాజ్యాలు ఏర్పడినవి. బ్రిటిష్ సామ్రాజ్యాధికారం తొలగినపుడు ఈలాంటి దుష్పరిణామం సంభవించలేదు. దీనికి కారణం ప్రజలలో జాతీయ భావం ఏర్పడడమే. జాతీయ భావాన్ని ఆధారం చేసుకొన్న ప్రజలు స్వాతంత్ర్య సమరాన్ని సాగించారు. అందుచేతనే అనేక స్వాతంత్ర్య రాజ్యాలకు బదులు ఒక కేంద్ర ప్రభుత్వానికి లోబడిన జాతీయ రాజ్యం ఏర్పడింది. జాతీయ భావానికి ఎంతటి ప్రాధాన్యం ఉండేది ఇది స్పష్టం చేస్తుంది.

1858 తర్వాత ప్రజలలో ఈ భావం ఎలాగు అంకురించి వృద్ధిగాంచిందో, ఈ పరిణామంలో ఏ వర్గాలవారు ప్రధాన పాత్ర వహించారో, ఏ పరిస్థితులు వారికి తోడ్పడినవో, తమ పాత్ర నిర్వహణలో వారు ఏలాటి సంస్థలను నిర్మాణం చేశారో, ఏలాటి ఆటంకాలను వారు ఎదుర్కొనవలసి వచ్చిందో మనం ఇప్పుడు తెలుసుకొనవలసి ఉంది.

పై ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకొనుటకు ముందు జాతి, జాతీయత అనే మాటలలో ఇమిడిఉండే అర్థం ఏలాటిదో తెలుసుకొనడం అవసరం

మానవుని జీవితం సాముదాయిక జీవితం. అతడు ఏదో ఒక సముదాయములో పలువురి మధ్య జీవితం సాగిస్తాడు. ఇది అతనికి సహజం. అతడు ఒంటరిగా జీవించలేడు. అలాగు జీవించడం వాంఛనీయముకూడా కాదు. సముదాయములో జీవించినపుడే అతనిలో లీనమయిన మానవత్వము, వివిధ శక్తులు బహిర్గతములై వికాసాన్ని పొందే అవకాశం లభిస్తుంది. అప్పుడే అతడు వాస్తవంగా మానవుడవుతున్నాడు.

కుటుంబము, కులము, గ్రామము, పట్టణము, మొదలయినవి ఈలాటి సముదాయాలు. ఇవి సహజములయిన సముదాయాలనికూడా చెప్పవచ్చు. పుట్టుక చేతను, సన్నిహిత సంబంధము చేతను, అనుకరణము చేతను శైశవమునుండి అతనికి వీటిపట్ల అభిమానము ఏర్పడుతుంది. ఇదికూడా అతనికి సహజమని చెప్పవచ్చు. ఈ అభిమానానికి తోడు ఇతర సముదాయాలపట్ల ఔదాసీన్యమో, దురభిమానమో, ద్వేషమో, ఏర్పడటంకూడా అతనికి సహజం. సముదాయాల పట్ల అభిమాన దురభిమానాలతో రాగద్వేషాలతో మానవుడు జీవయాత్రను సాగిస్తున్నాడు. అతనిలోని ద్వంద్వాలలో ఇది ఒకటి.

ఈ అభిమానాలలో తారతమ్యం ఏర్పడడం కూడా అతని సహజలక్షణాలలో ఒకటి. కొన్నిటి పట్ల ఎక్కువ అభిమానం మరికొన్నిటి పట్ల తక్కువ అభిమానం అతడు కనుపరుస్తాడు దీనికి చాలవరకు సమాజంలోని సంస్కృతి - జీవిత విధానం, ఆశించే పురుషార్థాలు ఆధారం. అభిమానాల మధ్య పరస్పర సంఘర్షణ సంభవించినప్పుడు అతడు కొన్ని అభిమానాలను వదలడమూ, మరి కొన్నిటిని చేపట్టడమూ, లేదా ఒకదానికి అగ్రస్థానం కల్పించి దాని రక్షణకు సర్వము త్యజించడం కూడా జరుగుతుంది.

సముదాయాల గురించి అభిమాన దురభిమానాల గురించి మన అనుభవం లోనిపై వివరాల దృష్ట్యా జాతి జాతీయత అనే మాటలకు అర్థం చెప్పవచ్చు. కుటుంబము కులము మొదలయిన సముదాయాలవలెనే జాతిఅనేది ఒక సముదాయం. ఇది దేశంలోని ప్రజలందరితో కూడినట్టిది. కుటుంబము కులము గ్రామము మొదలైనవి ఏదోఒక చిన్నప్రాంతానికి పరిమితమైనట్టివి. వాటిలోని జనసంఖ్యను బట్టి కూడా అవి చిన్నవని చెప్పకతప్పదు. జాతి అలాగు కాక దేశవ్యాప్తమైన సముదాయం. జనసంఖ్యలో అది చాలాపెద్దది. జాతిపట్ల అభిమానానికి జాతీయత అని పేరు. కుటుంబాభిమానము కులాభిమానము మొదలైన వాటికంటె ఇది విశాలతరమైనట్టిది. ఇది పరిపక్వత గాంచిన దేశాలలో ప్రజలు వారిఅభిమానాలలో దీనికి అగ్రస్థానం ఇస్తారు. జాతియొక్క పరిరక్షణకు, దాని పేరు ప్రతిష్ఠల నిలుపుటకు, శ్రేయోభివృద్ధికి తమ సర్వస్వమును అర్పించుటకు సిద్ధపడుతారు. వారిపురుషార్థాలలో జాత్యభిమానం అగ్రస్థానం వహిస్తుంది.

అనాదిగా ప్రపంచంలో దేశాలున్నాయి. ఒక్కొక్క దేశంలో ప్రజలు ఉన్నారు. కాని దేశంలోని ప్రజలందరూ కలిసి జాతి అనే ఒక సముదాయంగా ఏర్పడినవారనే భావమూ ఆ సముదాయంపట్ల వారు గాఢాభిమానంతో ప్రవర్తించవలయుననే భావమూ రెండు వందల సంవత్సరాలకు పూర్వం ఎక్కడా లేదనేది చరిత్రకారుల అభిప్రాయం. కొద్దిగా ఈ భావం 16, 17వ శతాబ్దాలలో బ్రిటిష్ దేశమందు ఫ్రాన్స్ దేశమందు కనుపించింది. కాని 1789 లో ఫ్రెంచి విప్లవం సంభవించినప్పటి నుండియే అది ఒక గుర్తింప దగిన రూపాన్ని ధరించింది. విప్లవాన్ని లేవదీసిన ఫ్రెంచి ప్రజలు ఈ భావం చేత ప్రభావితులయ్యారు తామందరు కలిసి జాత్యాభిమానంతో ప్రవర్తించినగాని తాము లేవదీసిన విప్లవం స్థిరపడ జాలదనీ విప్లవాన్ని అణచివేయుట ఇతరదేశాలలోని నిరింకుశాధిపతులు పన్ను పన్నాగాలను అణచుటకు తాము సుసంఘటిత జాతిగా జాత్యభిమానంతో వారిని ఎదుర్కొనడంతప్ప వేరుసాధనం లేదనీ, ఆలాగు ఐకమత్యంతో తాము వారిని ఎదుర్కొన్నపక్షాన తమకు విజయం లభించి తీరుతుందని ఆవేశపూరితులై వారినిఎదుర్కొని విజయాన్ని సాధించి తమ విప్లవ వ్యవస్థను రక్షించుకో గలిగారు. ఫ్రెంచిజాతికి ఫ్రెంచివారి జాతీయతకు ఈ విధంగా గట్టి పునాదులు ఏర్పడినవి.

గాఢమైన ఈ జాతీయభావంతో వారు నెపోలియన్ నాయకత్వాన యూరపు ఖండంలోని దేశాలలో అనేకాన్ని జయించి, వశపరచుకొని ఒకగొప్ప సామ్రాజ్యాన్ని స్థాపించారు (1800-15). దేశసంరక్షణకు జన్మమెత్తిన జాతీయ భావం దురాక్రమణ స్వరూపాన్ని ధరించింది. ఫ్రెంచివారి దురాక్రమణ మూలంగా స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన స్పెయిన్, పోర్చుగల్, జర్మనీ మొదలైన దేశాలవారు ఫ్రెంచి వారినుండి ఒక గుణపాఠాన్ని నేర్చుకొన్నారు. ఫ్రెంచివారు సుసంఘటితమైన జాతిగా ఏర్పడి, జాత్యభిమానంతో ప్రవర్తించినట్లే తాముకూడ ఒక జాతిగా ఏర్పడి, జాతీయభావంతో వారిని ఎదుర్కొనినగాని తాముకోల్పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగీ సంపాదించడం సాధ్యంకాదని వారు గ్రహించారు. దాని ఫలితంగా యూరపు ఖండంలోని ఇతర దేశాల ప్రజలుకూడ క్రమక్రమంగా జాతులుగా (అంటే జాతి అనే పేరుగల సముదాయాలుగా) మారిపొయ్యారు. వారి జీవితంలో జాతీయతకు అగ్రస్థానం లభించింది. జాతీయ భావంతో వారు ఫ్రెంచివారి నెదుర్కొని, ఓడించి తమ స్వాతంత్ర్యాన్ని తిరిగీ రాబట్టుకోగలిగారు. జాతిఅనే సముదాయము యొక్క ఉత్కృష్టమైన విలువను, జాతీయతకుగల మహత్తర శక్తిని స్వానుభవంద్వారా వారు గ్రహించారు. అది మొదలు యూరపు ఖండంలోని ఒక్కొక్క దేశపు ప్రజలు ఒక జాతిగా రూపొందారు జాతీయత వారిలో గాఢంగా నాటుకొనిపోయింది. అంతకుపూర్వం వారిపై సామ్రాజ్యాధికారాన్ని నెరపుతూవచ్చిన టర్కీ ఆస్ట్రియా రషియా పరిపాలకులపై తిరుగుబాటు చేశారు. వారిలో కొందరు వందలాది సంవత్సరాల క్రిందట కోల్పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగీ సంపాదించుకొన్నారు.

యుగయుగాలుగా దేశాలను జయించి సామ్రాజ్యాలను స్థాపించి పరిపాలించ డంలో న్యాయవిరుద్ధం లేదనేభావం ప్రపంచమందంతట వ్యాపించి యుండేది. ఇది క్షత్రియ ధర్మంగా అందరూ ప్రశంసిస్తూ ఉండేవారు. కాని ఫ్రెంచి విప్లవ ఫలితంగా రేకెత్తిన జాతీయభావం మూలాన సామ్రాజ్యతత్వం గొప్ప దెబ్బ తిన్నది. దానిస్థానే జాతీయత ప్రశంసాపాత్రమైంది. రాజ్యాలన్నీ జాతీయ రాజ్యాలుగా ఉండవలెననే సిద్ధాంతం ప్రాబల్యం వహించింది.

దేశంలోని ప్రజలందరు జాతి అనే ఒక బృహత్తర సముదాయానికి చెందినవారనే భావంలో బహువిశాలమైన అర్థం ఇమిడిఉంది. గత రెండు వందల సంవత్సరాల ప్రపంచ చరిత్ర దానిని ప్రస్ఫుటంచేసింది. ఇంకనూ చేస్తూనేఉంది. మనకు సంబంధించినంతవరకు ఆ అర్థం ఎలాటిదో తెలుసుకొనుటకు ప్రయ త్నిస్తాం.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి", అనే వాక్యంలోని జన్మ భూమి అనాదిగా ప్రజలు అనుకొన్నట్లు వారి గ్రామానికి వారు నివసించే పరిమితప్రాంతానికి వర్తించేదికాదు. ఆ జన్మభూమి యావద్భారతదేశం. అంగ వంగ కళింగాది దేశాలుకాదు వారిది. ఆసేతు హిమాచల పర్యంతం వ్యాపించిన భారతదేశం వారిది. వారందరు భారతీయులు.

భారతదేశం వారికి మాతృదేశం కావడంచేత తల్లిని ఆరాధించినట్లు వారు దేశమాతను ఆరాధించవలసి ఉంది. అది వారి ప్రధాన కర్తవ్యం. అది మాతృ స్థానంలో ఉండడంచేత వారందరికీ పవిత్రమైనట్టిది. బంకించంద్రుడు రచించిన వందేమాతరం గేయం దీనిని స్పష్టంచేస్తూఉంది. దేశంలో అన్ని ప్రధాన భాష లలో అనాదిగా ఎంతో గేయ వాఙ్మయం ఉంది. కాని బంకించంద్రునికి పూర్వం ఈలాటి గేయాన్ని ఎవరూ రచించియుండలేదు. దీనిని ఆతడు 1882 లో రచించాడు. 1858 తర్వాత దేశంలో ఏలాటి భావవిప్లవం సంభవించిందో ఇది రుజువుచేస్తూ ఉంది. దేశభక్తి భగవద్భక్తిగా పరిగణనలోకి వచ్చింది. దుర్గ, కాళి, కామాక్షి, మీనాక్షి మొదలైన దేవతలను ఆరాధించినట్లే దేశమాతను ఆరాధించ వలెననే భావం వ్యాపించింది.

దేశం ప్రజలలో కొందరికి మాత్రమేకాక అందరికి తల్లి. అన్ని కులాల వారు, అన్ని ప్రాంతాలవారు, అన్ని మతాలవారు, అన్ని భాషలను మాట్లాడే వారు, ధనికులు, దరిద్రులు అందరూ ఆమె సంతానం. అందరూ ఒకేజాతికి చెందినవారని చెప్పడంలో గ్రహించవలసిన అర్థం ఇదే. జాతి అనేమాట పుట్టు కను స్ఫురింపజేసేమాట. ఒకతల్లి సంతానం కుటుంబానికి సంబంధించిన సమష్టి ప్రయోజనాలను సంపాదించి వృద్ధిచేయుటకు కలిసిమెలసి ఐకమత్యంతో ప్రవ ర్తించడం ఏ విధంగా కర్తవ్యమో అదే విధంగా దేశమంతటికి సంబంధించిన సమష్టి ప్రయోజనాలను సంపాదించి వృద్ధిచేయుట ప్రజలందరి కర్తవ్యం. తాము ఆంధ్రులమని, తమిళులమని, బెంగాలీలమని, మహారాష్ట్రీలమని ప్రవర్తించరాదు,

దేశాన్ని మాతృదేవతగాను, ప్రజలను జాతిగాను పేర్కొనడంలో గుర్తించవలసిన అర్థం ఇది.

దేశం, దేశంలోని ప్రజలది. అది వారి సమష్టి ఆస్తి. అది విదేశాలనుండి వచ్చిన పరాయివారిది కాదు. బ్రిటిష్ వారివంటి పరాయివారు వారికిగల అంగబలాన్ని అర్థబలాన్ని వినియోగించి దానిని జయించి పరిపాలించగలిగిన మాత్రంచేత అది వారి ఆస్తి కాజాలదు. దొంగలు దోపిడిగాండ్రు వారికిగల బలాన్ని ఉపయోగించి ఇండ్లలోని ఆస్తులను దోచుకొనడము న్యాయవిరుద్ధం అని అందరు భావిస్తాం. పరాయివారు దేశాన్ని జయించి పాలించడం ఈలాటిదే.

ఈ కారణంచేత పరాయి పరిపాలనను తొలగించి తమ దేశాన్ని తామే ఏలుకొనగల పరిస్థితిని కల్పించుట ప్రజల కర్తవ్యం. ఎవడి ఆస్తిని వాడు అన్యాక్రాంతంకాకుండా రక్షించుకొనడం, అన్యాక్రాంతమైనప్పుడు దానిని తిరిగి తన వశంలోకి తెచ్చుకొనడం వాని విధి. పరుల హస్తగతమైన తమ దేశాన్ని తిరిగి తమ వశంలోకి తెచ్చుకొనుటకు ప్రయత్నంచేయడం ప్రజల విధి. ఇది చేయని ప్రజలు వారి విధ్యుక్తధర్మాన్ని విస్మంరించిన వారవుతున్నారు. ఎవరి దేశాన్ని వారు పాలించుకొనడం ధర్మం. దీనికే ఈనాటి శాస్త్రవేత్తలు స్వయం నిర్ణయమని పేరు పెట్టారు. ప్రతి జాతి ఈ నిర్ణయానుసారం ప్రవర్తించవలసి ఉంది. "స్వరాజ్యం నా జన్మహక్కు" అని తిలక్ మహాశయుడు శంఖారావం చేయడానికి ఇదే కారణం.

పరాయి పరిపాలనను నిర్మూలించడం, స్వరాజ్యాన్ని స్థాపించడం - ఇది మాత్రమే జాతీయతకు లక్ష్యంకాదు. జాతీయతకు ఇంతకంటె విశాలమైన లక్ష్యం ఉంది. ప్రజల ఆర్థికాభివృద్ధి, వారి సాంఘికాభివృద్ధి, నైతికాభివృద్ధి, సాంస్కృతికాభివృద్ధి, వైజ్ఞానికాభివృద్ధి, ఆత్మవికాసాభివృద్ది - అన్నిరకాలైన అభివృద్ధులను సాధించడం జాతీయతకు లక్ష్యం. జాతీయత అంకురించి వృద్ధిగాంచిన కారణంగా అన్ని దేశాలలో జరిగినట్లు మన దేశంలోకూడా ప్రజల సర్వతోముఖాభివృద్ధికికృషి జరుగుతూ ఉంది.

జాతీయత ప్రజలలో ఆత్మవిశ్వాసాన్ని ఆత్మగౌరవాన్ని కలిగిస్తుంది. తమ దేశాన్ని తాము పరిపాలించుకొని, దానిని సర్వవిధాలా ఉద్ధరించగలమనే విశ్వాసం జాతీయత మూలంగా వారిలో ఉద్భవిస్తుంది. తమలో జాతీయభావం లేనందుననే తాము ఇతరులకు దాస్యం చేయవలసి వచ్చిందని తాము జాతీయభావాన్ని పెంపొందించుకొనగలిగితే దాస్య విముక్తి సులభసాధ్యం కాగలదని వారు విశ్వసించే వారవుతారు. మనలో ఇటీవలి కాలంలో ఆలాటి విశ్వాసం కుదిరింది. అందు చేతనే స్వరాజ్యాన్ని సంపాదించుకొన్నాము. ఇతరులపై ఆధారపడడం ఆత్మగౌరవానికి భంగకరమన్న సత్యాన్ని కూడా జాతీయత మూలంగా మనం నేర్చుకొన్నాం. మనం ఎవరి సహాయాన్ని అపేక్షించకుండా స్వాతంత్ర్య సమరాన్ని సాగించి విజయాన్ని సాధించడమే దీనికి తార్కాణం. అన్ని దేశాలలో జాతీయత ఆత్మగౌరవానికి దోహదకారి అయింది.

జాతీయత అనేది ఒక గొప్ప శక్తి. అన్ని శక్తులలో ఉన్నట్లే ఇందులో కూడా గుణదోషాలు కలిసి ఉన్నాయి. దీనిలోని గుణం ఇదివరలో ఐకమత్యంలేని ప్రజలలో ఐకమత్యాన్ని కల్పించడం. దేశంలో జాతీయ భావం పెంపొందడం మూలాన అన్ని కులాల వారు, వివిధ భాషలు మాట్లాడువారు, వివిధ రాష్ట్రాలలో నివసించేవారు, వివిధ మతాలకు చెందినవారు జాతి అనే సముదాయంలో కలిసిపొయ్యారు. ఇది జాతీయతకు గల నిర్మాణ శక్తి. అన్ని దేశాలలో జాతీయత ప్రజలను కలిపి, ఒక నిర్మాణశక్తిగా పనిచేసింది. కాని ఇది విచ్ఛిన్న శక్తిగా కూడా పరిణమిస్తుంది. సామ్రాజ్యాలను విచ్ఛిన్నం చేసి, ఒక సామ్రాజ్యస్థానంలో అనేక స్వతంత్ర రాజ్యాల సంస్థాపనకు దారి తీస్తుంది. ఇంతేకాదు. ఒక దేశంలో ఒక్కొక్కప్పుడు ప్రజలలో తాము రెండు జాతులకో మూడు జాతులకో చెందిన వారనే భావం ఉదయించవచ్చు. బ్రిటిష్ పరిపాలన కాలంలో మన దేశం అంతా ఒకే ప్రభుత్వానికి లోబడిన రాజ్యంగా ఉండింది. కానీ స్వాతంత్రోద్యమకాలంలో ముస్లింలు తామొక ప్రత్యేక జాతికి చెందినట్లు భావించడంచేత దేశానికి స్వాతంత్ర్యంలభించినా అది ఒక రాజ్యంగా ఉండడానికి బదులు రెండు రాజ్యాలుగా చీలిపోయింది. ఇంతేకాదు. బంగ్లాదేశంలోని ముస్లింలు తాము ఒక ప్రత్యేక జాతికి సంబంధించిన వారనే భావం కలవారు కావడంచేత పాకిస్తాన్ రెండు రాజ్యాలుగా చీలిపోయింది. జాతీయత కారణంగా ప్రస్తుతం భారత దేశంలో మూడురాజ్యాలు ఏర్పడ్డాయి, జాతీయతలో నిర్మాణశక్తితోపాటు విచ్ఛిన్నశక్తి కూడా ఉన్నదన్నదానికి ఇది ఒకతార్కాణం.

జాతి, జాతీయత అనే పదాలలో ఇమిడి ఉండే అర్థాన్ని గ్రహించడంలో పై విషయాలన్నిటినీ మనం అవగాహన చేసుకొనవలసి ఉంది. జాతీయతలోని గుణదోషాలనన్నిటిని విపులీకరించడం ప్రస్తుత విషయంకాదు. పై వివరణ వలన మనం గ్రహించ వలసిన ప్రధాన విషయం స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించి నంత వరకు జాతీయతకు గల స్థానం ఏలాటిది అనేది మాత్రమే. ఆస్థానం చాలా గొప్పదనీ జాతీయత మూలంగానే మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించు కొనగలిగినామని దాని ప్రభావంచేత ప్రజలసర్వతోముఖాభివృద్ధికి కృషి జరుగుతున్నదని, ప్రజలలో నూతన భావాలు ఉదయించడంలోలు, నూతన కార్యరంగాలలో ప్రవేశించడంలోను అది పటిష్ట సాధనమైనదని మనం గుర్తించడమే ప్రస్తుత విషయం.

చదువదగిన గ్రంథాలు :

Bharatiya Vidya Bhavan : History and Culture of the Indian Pepole Vol. X. Part II.

Haridas Mukherjee and Uma Mukerjee : The Growth of Nationalism in India (1857-1905)

Tarachand : History of Freedom Movement in India Vol, II.

# అధ్యాయము - 2

## ఇంగ్లీషు విద్య - జాతీయత

### 1

1858 తర్వాత మన దేశ చరిత్రకు ప్రధాన లక్షణం ప్రజలలో జాతీయత-తామందరు ఒక జాతికి చెందినవారనే భావం - అంకురించి వృద్ధిగాంచడం. దీని ఫలితంగానే ప్రజలుకలిసికట్టుగా స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించి విజయాన్ని సాధించారు. జాతీయత మన స్వాతంత్ర్య సంపాదనకు ఆధారమైంది.

ఈ భావం ఏలాగు అంకురించి వృద్ధిగాంచిందో, ఇందులో ఎవరు ప్రధాన పాత్ర వహించారో, వారి ఉద్దేశాలు ఎలాటివో మనం ఇప్పుడు తెలుసుకోవలసి ఉంది.

దేశంలో ఇంగ్లీషు విద్య వ్యాపించటం మూలంగా ప్రజలలో ఈ భావం అంకురించింది. ఇంగ్లీషు విద్య నభ్యసించిన విద్యార్థికులు ఇందులో ప్రధాన పాత్రను వహించారు.

జాతీయత అనే భావం ప్రపంచానికే క్రొత్తది అనీ, రెండు వందల సంవత్సరాలకు పూర్వం అది ఎక్కడా కనిపించలేదనీ ఇదివరలో తెలుసుకొన్నాం. ఈ భావం ప్రథమంలో ఇంగ్లండు, ఫ్రాంన్సు మొదలైన పాశ్చాత్య దేశాలలో అంకురించి వృద్ధిగాంచిది అది మన దేశానికి క్రొత్తదైనా, 19 వ శతాబ్దాన నుండి ఇంగ్లీషు విద్యద్వారా పాశ్చాత్య సంస్కృతితోను పాశ్చాత్య ప్రపంచం లోని ప్రసిద్ధిగాంచిన జాతీయ ఉద్యమాలతోను పరిచయం లభించినందున ఆ భావం మనలోకూడా ప్రవేశించింది. కాని ప్రథమంలో ఇది ప్రజలందరిలో ప్రవేశించలేదు. ఇంగ్లీషు విద్యను అభ్యసించినవారు మాత్రమే ఆదిలో దీనిచే ప్రభావితులైనారు. వారి ప్రచారం ప్రబోధాలమూలంగాను వారు సాగించిన కార్యకలాపాల మూలంగాను ఇది కాలక్రమాన ఇతర వర్గాలలోకూడా వ్యాపించింది, ఇప్పటికికూడా దీని వాసనకు గురికాని భారతీయులెందరో ఉన్నారు. 1858 తర్వాత ఇంగ్లీషు విద్యార్థికులు తలపెట్టిన కార్యక్రమం ఇంకాపూర్తి కాలేదు. ఇప్పటితరంవారిపై దీనిని పూర్తిచేయవలసిన బాధ్యత ఎంతైనా ఉంది.

19 వ శతాబ్ద ప్రారంభంనుండి మన దేశంలో ఇంగ్లీషు విద్య వ్యాపించ సాగింది. రామమోహనరాయ్‌వంటి దూరదృష్టిగల భారతీయ ప్రముఖుల యొక్కయు ప్రభుత్వం యొక్కయు క్రైస్తవమత ప్రచారకుల యొక్కయు ప్రయత్నాల ఫలితంగా దేశంలో ఇంగ్లీషు విద్యాలయాల సంఖ్యయు వాటిలో

విద్య నభ్యసించినవారి సంఖ్యయు 1820 నుండి క్రమక్రమంగా వృద్ధిగాంచాయి. 1857 లో కలకత్తా బొంబాయి మద్రాసులలో విశ్వవిద్యాలయాలు స్థాపించ డంతో ఈ అభివృద్ధి మరింత చురుకుగాసాగింది. 1881 నాటికి దేశంలో 63 కళాశాలలు, 2133 మాధ్యమిక విద్యాలయాలు (Secondary Schools) ఏర్పడి నవి. కళాశాలలలో 4,417 విద్యార్థులు, మాధ్యమిక విద్యాలయాలలో 249,233 విద్యార్థులు ఉండినారు. 1885 లో భారతజాతీయ కాంగ్రెసు ఏర్పడిననాటికి దేశంలో ఇంగ్లీషు విద్య నభ్యసించినవారి సంఖ్య 50,000 అనీ వారిలో పట్ట భద్రులు 6000 అనీ అంచనా వేయబడింది. దేశం మొత్తంమీద 20 కోట్ల జనాభాలో వీరి సంఖ్య చాలా స్వల్పంగా కనుపించవచ్చు. కాని దేశంలో అన్ని ఉద్యమాలపైన వారు నాయకత్వం వహించిన కారణంగా వారి ప్రభావం చాలా ఎక్కువగా ఉండింది.

ఆనాటి పాశ్చాత్య విద్యలలో మన దేశీయ విద్యలలో లేని భావాలు ఎన్నో ఉండినవి. ఇంగ్లీషు విద్య నభ్యసించినవారు వాటితో పరిచయం సంపాదిం చారు. మానవ స్వేచ్ఛ, మానవ సమానత్వం, మానవ సౌభ్రాతృత్వం, ప్రజా ప్రభుత్వం, జాతీయత మొదలైనవాటికి ఆ భావాలు ప్రాధాన్యం కల్పించాయి. ఆ భావాలను పాశ్చాత్య ప్రపంచంలో 18 వ శతాబ్దపు మేధావులు రూపొందించి, వారి రచనలద్వారా ప్రచారం చేశారు. ఇదిగాక సంప్రదాయాలను ఆచార వ్యవహారాలను, మత విశ్వాసాలను, పూజా విధులను గుడ్డిగా అనుసరించరాదనీ, వాటినన్నిటనీ హేతువాదసాధనాన నిశితంగా విమర్శించి ఆ సాధనానికి నిలబడ గల వాటిని మాత్రమే అనుసరించవలసినదనీవారు నొక్కిచెప్పి హేతువాదానికి ఒక ప్రత్యేక ప్రాధాన్యతను కల్పించారు. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం మొదలైన భావాలన్నీ దీని ఫలితములే. స్వేచ్ఛ అనగా హేతువాదానుసారం జీవించడమనీ హేతువాద విరుద్ధంగా సమాజం విధించిన నిర్బంధాలను నిర్మూలించడమనీవారు నిర్వచించారు. ఈలాటి స్వేచ్ఛ మానవులందరికీ ఉండవలెననీ, ఆలాగు ఉండడమే మానవ సమానత్వమనీ, మానవులందరు సములు కావడంచేత పరిపాలనాధికారం ఏ ఒక్కడి చేతులలోగాని, ఏ ఒక్కవర్గం చేతులలోగాని ఉండరాదనీ, ఆ అధికా రంలో ప్రజలందరు భాగస్వాములు కావలసియున్నదనీ, ఆలాటి భాగస్వామ్యంతో కూడిన పరిపాలన విధానమే ప్రజాప్రభుత్వమనీ వారు ప్రకటించారు. మానవు లలో సమానత్వం ఉండవలసినట్లే వివిధ జాతులమధ్య సమానత్వం ఉండవలెననీ, ఒకజాతి ఇంకొకజాతిని జయించి వశపరచుకొని దానిపై సామ్రాజ్యాధిపత్యం వహించడం ధర్మవిరుద్ధమనీ వారు సమర్థించారు. ఈ విధంగా వారు హేతు వాదాన్ని ఆధారం చేసుకొని పైన పేర్కొనబడిన భావాలన్నిటినీ పరిపోషిం చారు. అందుచేతనే పాశ్చాత్య చరిత్రలో 18 వ శతాబ్దానికి హేతువాదయుగం (Age of Reason) అనే పేరు ప్రచారంలోకి వచ్చింది.

మన దేశంలో ఇంగ్లీషు విద్య నభ్యసించినవారికి ఈ భావాలతోను, వీటికి ఆధారమైన హేతువాదంతోను, ఎక్కువ పరిచయం లభించింది. విద్యాలయా

లలో వీటిని సమర్థించే ఇంగ్లీషు గ్రంథాలు పాఠ్యగ్రంథాలైనాయి. విద్యావంతులు ఈలాటి పాఠ్యగ్రంథాలనేగాక ఇంగ్లీషు వాఙ్మయంలో వీటిని ప్రచారం చేసే ఉత్తమములైన ఇతర గ్రంథాలను చదవడం పరిపాటి అయింది. ఈ భావాలచే వారు ఎంతగానో ఆకర్షింపబడ్డారు. భారతీయులుకూడా స్వేచ్ఛ సమత్వములు కలవారు కావలసియున్నదనీ, వారందరు భ్రాతృభావంతో ప్రవర్తించవలెననీ, ప్రజాప్రభుత్వమూ జాతీయత వారి లక్ష్యాలలో అగ్రస్థానం వహించవలసి ఉన్నదనీ వారు విశ్వసించారు. ఈ విశ్వాసమే క్రమక్రమంగా స్వాతంత్ర్యోద్యమానికి దారి తీసింది.

ఈ భావాలకు రాజకీయరంగం మాత్రమే గురికాలేదు. జాతీయతకు జాతియొక్క సర్వతోముఖాభివృద్ధి లక్ష్యమని వారు విశ్వసించారు. అందుచేత సంఘ సంస్కర్తలు, మత సంస్కర్తలు, ఆర్థికవేత్తలు, సమాజంలో మార్పును వాంఛించినవారందరు ఈ కొత్త భావాలచే ప్రభావితులయ్యారు. కవులు, ఇతర రచయితలు, నవలలను నాటకాలను వ్రాసినవారు, చిత్రకళా విశారదులు, మేధావి వర్గానికిచెందిన తదితరులు ఈ భావాలను ప్రచారం చేశారు. వీరిలో అత్యధిక సంఖ్యాకులు ఇంగ్లీషు విద్యను నేర్చినవారు. అందుచేతనే ఇంగ్లీషు విద్య జాతీయత మొగలైన నూతన భావాలు మన దేశంలో ప్రవేశించడానికి ప్రధాన సాధనమైనదని చెప్పవలసివస్తున్నది.

ఇంగ్లీషు విద్యను అభ్యసించిన వారికి పాశ్చాత్యులు రచించిన గ్రంథాలతోనే గాక పాశ్చాత్య దేశాలలో సంభవించిన విప్లవాలతోను జాతీయ ఉద్యమాలతోను పరిచయం లభించింది. 1776 మొదలు ఒక శతాబ్దికాలం పాశ్చాత్యచరిత్రలో విప్లవ యుగంగా పేరుగాంచింది. అమెరికా స్వాతంత్ర్య యుద్ధం, ఫ్రెంచి విప్లవం, మధ్య దక్షిణ అమెరికాలలోను బాల్కన్ ద్వీపకల్పంలోను ప్రజలు లేవదీసిన స్వాతంత్ర్య ఉద్యమాలు, జర్మనీ ఇటలీ సమైక్యత సంఘటనలు ఈ శతాబ్దిలో సంభవించినట్టివి. వీటి అన్నిటిని గురించి ఇంగ్లీషు విద్యాధికులు చదవటం వీటి ప్రాధాన్యాన్ని గ్రహించటం పరిపాటి అయింది. భారతీయులందరు ఒక జాతిగా ఏర్పడి ఈలాటి ఉద్యమాన్ని సాగించగలిగిన పక్షాన దేశస్వాతంత్ర్య సంపాదన సాధ్యం కాగలదన్న భావం వారిలో అంకురించి వృద్ధిగాంచింది.

విద్యాధికులు కొందరు ఉన్నత విద్యను సంపాదించుటకు, బారిష్టర్లుగా తయారగుటకు, పోటీ పరీక్షలలో పాల్గొనుటకు, వర్తక వ్యాపారాలమూలంగా లాభంగడించుటకు, పర్యటనల పట్ల తమకు గల సరదాలను తీర్చుకొనుటకు పాశ్చాత్యదేశాలకున్నూ వాటిలో ప్రధానంగా బ్రిటన్ కున్నూ వెళ్ళడం 1858 తర్వాత పరిపాటి అయింది. 1865—1885 మధ్య సుమారు 700 మంది ఈ విధంగా వెళ్ళినట్టు ఒక అంచనా. మత రంగంలో ప్రసిద్ధిగాంచిన కేశవచంద్రసేన్ ప్రతాపచంద్రమజుందార్, న్యాయవాదులుగా ప్రఖ్యాతి సంపాదించిన ఫిరోజిషా మేతా, ఉమాచంద్రబెనర్జి, సయ్యద్ అమీరాలీ, రాజకీయరంగంలో పేరెన్నిక

గన్న సురేంద్రనాద్ బెనర్జి, దాదాబాయి నవరోజీ, ఆనందమోహన్ బోసు మొదలైన వారు వీరిలో కొందరు. వీరిలో హిందువులుగా ఉన్న వారు ఆనాటి కులకట్టుబాట్లను నిర్భయంగా జవదాటి సముద్రయానంచేసి విదేశాలలో సంచారం చేసిన సంఘసంస్కరణ ప్రియులు. బ్రిటన్ మొదలైన దేశాలలోని పరిస్థితులను స్వయంగా పరిశీలించి, అక్కడి ప్రజల వలెనే భారతీయులు కూడ ఎందుకు పురోగమించ కూడదు అనే ప్రశ్నను వేసుకొన్నవారయ్యారు. వీరు స్వదేశానికి వచ్చిన తర్వాత తమ జాతిని ఉద్ధరించి, దాని సర్వతోముఖాభివృద్ధికై పాటుబడుటకు కంకణం కట్టు కొన్నవారు. భారత దేశంలో బ్రిటీష్ వారిలో ఆనాడు ఘనీభవించిన జాత్యహంకారం బ్రిటీష్‌లోని బ్రిటిష్ వారిలో ఎక్కువగా లేకపోవడం వీరిని ఎంతగానో ఆకర్షించింది. బ్రిటన్‌లోని ప్రముఖులు వీరిని అనేక విధాలుగా ప్రస్తుతించడం చేత ఈ ఆకర్షణ మరింత బలీయమైంది. తాము సక్రమంగా ఆందోళనసాగించినపక్షాన భారతదేశంలోని బ్రిటిష్ వారి మనోవైఖరిలో మార్పురాకపోయినా బ్రిటన్ లోని వారిలో మార్పురాగలదనీ తాము వాంఛించిన రాజకీయ సంస్కరణలను వారు ప్రవేశపెట్టగలరనీ వీరు విశ్వసించడానికి ఇదే కారణం.

జాతీయతను, దానికి సంబంధించిన ఇతర భావాలను విద్యార్థులలో అంకురింప చేయడంద్వారానే గాక ఇంగ్లీషు విద్య ఇతర విధాలుగా కూడా జాతీయతకు దోహదంకల్పించింది. దేశంలోని అన్ని ప్రాంతాల వారు, అన్నికులాల వారు అన్ని మతాలవారు అన్ని భాషలను మాట్లాడేవారు ఒకే విద్యను నేర్చుకొనడంచేత వారందరి ఆశయాలలోను దృక్పథంలోను, నిర్మాణ కార్యకలాపాలలోను ఒక ఏకత్వమూ సాదృశ్యమూ ఏర్పడినవి. ఇందుచేత వారు ఒక జాతికి చెందిన వారుగా ప్రవర్తించడం సులభమైంది.

వారందరికి ఇంగ్లీషు భాష సామాన్య భాష అయింది. పూర్వకాలంలో విధ్యాధికుల మధ్య సంస్కృత భాష ఏలాటి ఐక్యతను చేకూర్చకలిగిందో ఆలాటి ఐక్యతను ఇంగ్లీషు విధ్యాధికుల మధ్య ఇంగ్లీషు భాష చేకూర్చింది. వివిధ ప్రాంతాలలోని విధ్యాధికులమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలుసాగుటకు, ఒకరిఅభిప్రాయాలు తక్కినవారు తెలుసు కొనుటకు, వివిధ ప్రాంతాలవారు కలసి సభలు సమావేశాలు జరుపుటకు తమవాంఛలను అధికారులకు తెలియపరచి వారిలో వాదప్రతివాదాలు జరుపుటకూ ఇది పటిష్ట సాధనంగా పని చేసింది. ఈలాగు కాక పాశ్చాత్యవిద్యలను ప్రాంతీయ భాషల ద్వారా నేర్చుకొనడం జరిగిఉండిన పక్షాన ఈలాటిలాభాలు చేకూరి ఉండేవికావు.

18,19 శతాబ్దాలలో పాశ్చాత్య ప్రపంచంలో జాతీయతను సమర్థించి విప్లవాలను లేవదీసినవారు మధ్య తరగతికి చెందిన వర్తకులు పారిశ్రామికులు మొదలైనవారు. తమ దేశం సుసంఘటితమై ఫ్యూడల్ భూస్వాముల పరిపాలనకు బదులు ఒక కేంద్ర ప్రభుత్వపు పరిపాలనలోకి వచ్చిన పక్షాన తమ వర్తకవ్యాపారాలు దేశమంతటా వ్యాపించుటకు ఎక్కువ అవకాశం ఉంటుందనే కారణాన వారందరు

ప్రజల సమైక్యతను జాతీయతను సమర్థించారు. పరిపాలనాధికారం భూస్వాముల లోను నిరంకుశ ప్రభువులలోను ఉండుటకు బదులు ప్రజల వశంలోకి వచ్చిన పక్షాన ప్రజలకు తాము నాయకులుగాను ప్రతినిధులుగాను ఏర్పడి అధికారాన్ని తమ హస్తగతం చేసుకొనుటకు, తద్వారా తమ లాభాలను వృద్ధిచేసుకొనుటకు ఎక్కువ అవకాశం ఉంటుందనే కారణాన ప్రజాస్వామిక విప్లవాలను జాతీయ స్వాతంత్ర్య విప్లవాలను వారు లేవదీశారు. వారి వర్తకవ్యాపారాలు, స్థాపించినపరిశ్రమలు, వాటిద్వారా వారు గడించిన ధనం, దాని మూలంగా సామాన్య ప్రజలపై వారికిలభించిన పలుకుబడి - ఇది అంతా విప్లవాలలో వారికి విజయాన్ని చేకూర్చింది. తెలుసుకొనవలసిన విషయం ఏమిటంటే పాశ్చాత్య దేశాలలో విప్లవాలనులేవదీసినవారు మధ్యవర్గానికిచెంది వర్తకవ్యాపారాలద్వారాను పరిశ్రమలద్వారాను ధనాన్ని గడించిన బూర్జ్వాలు అనేది. ఈ కారణంచేత విప్లవయుగానికి బూర్జ్వాయుగం అనేది నామాంతరమైంది.

మనదేశంలో దీనికి అన్యథాగా జరిగింది. పరాయివారైన బ్రిటిష్‌వారు మనదేశానికి పరిపాలకులు కావడంచేత భారీ వర్తక వ్యాపారాలు, బ్యాంకులు మొదలైన ఆర్థికసంస్థలు భారీపరిశ్రమలలో జనుము పరిశ్రమలవంటివి వ్యవసాయక రంగంలో అధిక లాభాలను సమకూర్చే కాఫి తేయాకు నీలిమందు తోటలు వారి వశంలోకి వచ్చాయి. ఈలాటి వనరులు ఏవీ భారతీయుల అందు బాటులోకి రాలేదు. అందుచేత దేశీయ బూర్జ్వావర్గం ఒకటి ఏర్పడడానికిగాని, అది విప్లవ ఉద్యమాలను లేవదీయడంగాని సాధ్యంకాలేదు. ఆ బాధ్యతను ఇంగ్లీషు విద్యాధికులు వహించవలసివచ్చింది. జాతీయ ఉద్యమాలన్నిటిలో వారు ప్రధానపాత్ర వహించుటకు ఆర్థికమైన ఈ కారణం చాలా ముఖ్యమైనట్టిది. సాధారణంగా విద్యాధికులు అన్ని దేశాలలో నూతన భావాలకు సృష్టికర్తలై వాటిని ప్రచారం చేయడంతో తమ బాధ్యత పూర్తిఅయినట్లు భావిస్తారు. కాని మనదేశంలో వీరు నూతన భావాలను సృష్టించి ప్రచారం చేయడమేకాకుండా వాటిని ఆచరణ సాధ్యం చేయుటకు కావలసిన సంఘాలను నిర్మాణం చేసి కార్యరంగంలో ప్రవేశించి, ప్రథమంలో ఆందోళనలు సాగించడంతో తృప్తిపడి కాలక్రమాన విప్లవోద్యమాలనన్నిటిని లేవదీసి వాటిని నడిపారు. పాశ్చాత్య దేశాలలో బూర్జ్వా వర్గం చేసిన ఘనకార్యాలన్నిటినీ మన దేశంలో ప్రథమ దశలో మేధావి వర్గంవారు చేశారు. అందుచేత భావరంగంలోనే గాక కార్యాచరణరంగంలో కూడా వారిదే ప్రధాన పాత్రఅయింది.

## 2

జాతీయత ఒక విత్తనం వంటిది. దానిని మన విద్యాధికులు విదేశాల నుండి మన దేశానికి తెచ్చి నాటినారు. నాటిన విత్తనం మొలకనెత్తి పెరగడానికి దానికి తగిన భూసారంగల క్షేత్రం అవసరం. అలాటి క్షేత్రానికి బదులు ఊసర క్షేత్రంలో దానిని నాటిన పక్షాన ఏలాటిలాభమూ ఉండదనేది అందరికీ తెలిసిన విషయమే. జాతీయత అనే విత్తనం విషయంలో కూడా ఈసత్యమే వర్తిస్తుంది.

జాతీయత అంకురించి వృద్ధిపొందడానికి మనదేశంలో ఎన్నో అనుకూలాలు ఏర్పడి ఉండినవి. ఈ విత్తనం సారవంతమైన క్షేత్రంలోనే నాటబడింది. అది అంకురించి పెరగడానికి అనుకూలించిన పరిస్థితులలో మొదటిది భారతదేశం భౌగోళికంగా ఒక వ్యక్తిత్వం గల ప్రత్యేకదేశం కావడం. ఉత్తరాన హిమాలయాలు, వాయవ్య ఈశాన్య దిక్కులలో వాటిశాఖలు, తక్కిన దిక్కులలో మహాసముద్రాలు భారతదేశాన్ని ఇతర దేశాల నుండి వేరుపరుస్తున్నాయి. అందుచేత అనాదిగా తమ దేశం ఒక ప్రత్యేక దేశం అనే భావం ప్రజలలో నాటుకొనిపోయింది. దాని ఫలితంగా తాము ఇతర దేశాలలోని ప్రజలకు భిన్నమైన వారనే భావం కూడా వారిలో వ్యాపించింది. అందుచేతనే ఎంతో కాలాననుండి వారు ఇతర దేశాల ప్రజలను మ్లేచ్ఛులని చెప్పేవారు. జాతీయత అనే క్రొత్త భావాన్ని అర్థంచేసుకొనడంలోను దానికి అనుగుణంగా కార్యకలాపాలలో పాల్గొని ప్రవర్తించడంలోను ఏనాడో ప్రకృతి సిద్ధంగా ఏర్పడ్డ ఈ భౌగోళిక ప్రత్యేకత చాలా వరకు తోడ్పడింది.

అనుకూల పరిస్థితులలో రెండవది అనాదిగా సాంస్కృతిక రంగంలో ఏర్పడిన ఏకత్వం. సాంస్కృతికంగా ప్రజల మధ్యకొంత భిన్నత్వం ఉండినా దానితోపాటు ఒక విధమైన ఏకత్వం కూడా ఏర్పడిఉండినది. ప్రజలు ఏప్రాంతం వారైనా వారి జీవితవిధానానికి వర్ణాశ్రమ ధర్మాలు ఆధారాలుగా రూపొందినాయి. అందరూవీటి పట్ల విశ్వాసం కలవారయ్యారు. వాటిని అనుసరించి జీవితయాత్రను సాగించడం వారందరికీ పరిపాటిఅయింది. అందరూ ఒకే మతాన్ని పూజావిధానాలను అనుసరించేవారయ్యారు. వేదాలు, వేదాంగాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, భారతరామాయణాది ఇతిహాసాలు, స్మృతి గ్రంథాలు అందరి గౌరవానికి పాత్రములై, అందరూ ఒకేరకమైన విశ్వాసాలతోనడిచేటట్లు చేశాయి. ప్రజల పుణ్యక్షేత్రాలు, వారికి పవిత్రములైన నదులు, పర్వతాలు, తపోవనాలు ఏదోఒక ప్రాంతానగాక అన్నిప్రాంతాలలో ఉండడం చేతను పవిత్రస్థలాలకు యాత్రలు చేయడం మోక్షసాధనం అనే విశ్వాసం అందరిలోను ఏర్పడియుండడం చేతను ఏఏటా లక్షలాదిజనం దేశమంతటా యాత్రలు చేసేవారయ్యారు. అఖిలభారత దృక్పథం కొంతవరకైనా ప్రజలలోఏర్పడడానికి ఇది ఎంతో దోహదకారి అయింది.

ప్రజలు వివిధభాషలు మాట్లాడేవారైనా సంస్కృతం పండితభాషగా ఏర్పడి భావైక్యతను పెంపొందించింది మేధావులు దీని సహాయంతో అన్ని ప్రాంతాలకు వెళ్లి రాజసభలలోను పండిత సభలలోను పాల్గొనేవారు అనేకులు సన్యాసాశ్రమాన్ని స్వీకరించి అన్నిప్రాంతాలమధ్య రాయబారులుగా ప్రవర్తించారు ఎవరు ఏప్రాంతానికి వెళ్లినా మౌలికములైన సంప్రదాయాలలోను ఆచార వ్యవహారాలలోను సాదృశ్యం ఉండిన కారణంగా పరాయిప్రాంతానికి వెళ్ళినట్లు వారు భావించేవారు కారు. వర్తకవ్యాపారాలు కూడా క్రీ. పూ. నాల్గవ శతాబ్దాననుండి దేశవ్యాప్తంగా జరుగుతూఉండేవి. ఈలాటి పరిస్థితుల ప్రభావం చేత సాంస్కృతికంగా ప్రజల మధ్య ఒక ఐక్యత ఏర్పడి ఉండినది. 1858

తర్వాత రాజకీయరంగంలో కూడా ప్రజలు కలిసి ఒక జాతికి చెందినవారనే భావంతో ప్రవర్తించవలసిందిగా విద్యాధికులు ప్రచారం సాగించినప్పుడు దీనిని ప్రజలు అర్థంచేసుకొనగలవారయ్యారు. ఒక రంగంలో ఏకత్వానికి అలవాటు పడినవారిలో ఇంకొక రంగానికి సంబంధించిన ఏకత్వాన్ని అలవరచడం సులభ సాధ్యం అవుతుంది. అందుచేతనే జాతీయత విషయంలో దేశం సారవంతమైన క్షేత్రంగా పని చేసింది

అనుకూలపరిస్థితులలో మూడవది రాజకీయ రంగంలో కూడా ఏకత్వం అవసరమనే భావం దేశానికి ప్రజలకూ పూర్తిగా కొత్తదికాకపోవడం. 2500 సంవత్సరాలుగా మనశాస్త్రవేత్తలూ క్షత్రియవర్గం వారూ ఆసేతుహిమాచలపర్యంతం వ్యాపించిన భరతఖండం ఒక చక్రవర్తి క్షేత్రంగా గుర్తించారు. చక్రవర్తి క్షేత్రం అంటే ఒక చక్రవర్తి పరిపాలనలో ఉండదగిన దేశం అని అర్థం. ఈ లక్ష్యాన్ని చక్రవర్తులనేకులు సాధించారు. మౌర్యులు, శాతవాహనులు, గుప్తులు, హర్షుడు అలాటివారు. విదేశాలనుండి వచ్చిన తురుష్కులు, ఆఫ్గనులు, మొగలాయీలు కూడా ఈ భావంచే ప్రభావితులై దేశంలో చాలా భాగాన్ని తమ పరిపాలనలోకి తెచ్చుకొన్నారు.

దేశం విస్తీర్ణంలో పెద్దదికావడంచేతను రాకపోకలకు ప్రకృతి సిద్ధములైన పర్వతాలు, అరణ్యాలు, ఎడారులు మొదలైన కొన్ని అవరోధాలు ఏర్పడిన కారణంగాను, దేశాన్ని పాలించిన సామ్రాజ్యాధిపతులు రోడ్లుమొదలైన ప్రయాణ సౌకర్యాలపట్ల తగినంత శ్రద్ధ వహించని కారణంగాను, పరిపాలన విధానం చాలా వరకు వికేంద్రీకృతంగా రూపొందడం చేతను సామ్రాజ్యాలకు స్థిరత్వం లభించలేదు. అంతమాత్రంచేత రాజకీయ ఐక్యత దేశానికి ప్రజలకు కొత్త అని భావించరాదు. ఇది చాలా ప్రాచీనకాలపు సంప్రదాయం. 19వ శతాబ్దంలో ఇంగ్లీషు విద్యాధికులు జాతీయతత్వాన్ని ప్రచారం చేసినప్పుడు వారు ప్రాచీన కాలపు సంప్రదాయాన్ని ప్రజల స్మరణకుతెచ్చారు. ప్రజలు దాని ప్రాధాన్యాన్ని విస్తార కష్టంలేకుండా గ్రహించగలిగారు. ప్రాచీన మధ్యయుగాలలో చక్రవర్తులు సృష్టించిన రాజకీయ ఏకత్వాన్ని నిలబెట్టుకొనవలసిన బాధ్యతను ప్రజలే స్వీకరించవలసియుననేదే జాతీయతలోని కొత్తదనం. దానిని ప్రజలు అర్థం చేసుకొనగలిగారు.

ఈ అనుకూలపరిస్థితుల దృష్ట్యా జాతీయత అనే విత్తనం ఊసర క్షేత్రంలో గాక సుక్షేత్రంలో నాటబడినట్లున్నూ అందుచేతనే అది అంకురించి వృద్ధిగాంచగలిగినట్లున్నూ స్పష్టం అవుతుంది.

ఇందులో బ్రిటిష్ పరిపాలన ఎక్కువగా సహకరించింది. భారతీయులలో జాతీయత పెంపొందడం తమ సామ్రాజ్యాధిపత్యానికి ప్రమాదకరమని బ్రిటిష్ వారికి తెలిసినా తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోడానికి వారు ప్రవేశపెట్టిన ఏర్పాటులన్నీ ప్రత్యక్షంగాను పరోక్షంగాను ప్రజలలో జాతీయతను వృద్ధిపరచాయి. సైన్యాలను ఒక ప్రాంతంనుండి ఇంకొక ప్రాంతానికి సులభంగా తర

లించే ఉద్దేశంతోను, విదేశశత్రువులనుండి భారత దేశంలోని తమ సామ్రాజ్యాన్ని రక్షించుకొనే ఉద్దేశంతోను, 1857-58లో సంభవించిన తిరుగుబాటువంటి వాటిని సులభంగా అణచివేసే ఉద్దేశంతోను వారు రైల్వేల నిర్మాణాన్నిగావించారు. బ్రిటన్‌లోని పరిశ్రమలకు కావలసిన భారతదేశంలోని ముడిసరకులను బొంబాయి వంటి రేవుపట్టణాలకు సులభంగా చేరవేయుటకున్నూ, బ్రిటన్ నుండి ఈలాంటి రేవుపట్టణాలకు దిగుమతి చేయబడిన బట్టలుమొదలైన వాడకపు వస్తువులను దేశంలోని వ్యాపారకేంద్రాలన్నిటికి సులభంగా చేర్చుటకున్నూ తద్వారా బ్రిటిష్ ప్రజలు గడించే లాభం అనేకరెట్లు పెరుగుటకున్నూ ఇవి ఎంతగానో ఉపకరించాయి. కాని ఈ రైల్వేలే భారతీయులలో ఐకమత్యం వృద్ధికావడానికి అనేక విధాలుగా సాధనములైనవి. వీటి మూలంగా ఒక ప్రాంతంలోని సామాన్య ప్రజలూ వర్తకులూ, పారిశ్రామికులూ తదితరులూ ఇతర ప్రాంతాలకు సులభంగా వెళ్లి అక్కడి ప్రజలతో ఎక్కువ పరిచయాన్ని సంపాదించారు. అందరిలో అఖిల భారతదృక్పథం పెంపొందడానికి ఇది ఎంతో తోడ్పడింది. రైల్వేలలో ప్రయాణం చేసేవారు వర్ణభేదాలు కులకట్టుబాట్లు పాటించడం సాధ్యంకాని కారణంగా కాలక్రమాన వాటి బిగువుతగ్గి అందరూ సమానులు అనే భావాన్ని కల్పించాయి. వీరికి తమ దేశంలోని గుడులు, గోపురాలు, స్తూపాలు, చైత్యాలు, గుహాలయాలు, మసీదులు, తాజమహల్ వంటి భవనాలు, మొదలైనవాటినిచూచే సదవకాశంలభించడంచేత తమపూర్వులు సామాన్యులుకారని, వారు వివిధరంగాలలో గర్వించదగిన కృషిచేసి అసమానమైన ఘనతను సంపాదించినవారని, తాము అట్టివారి సంతానమని వీరు భావించడానికీ వీరిలో ఆత్మగౌరవము ఆత్మవిశ్వాసము వృద్ధిపొందడానికీ రైల్వేలు సాధనాలైనాయి. రోడ్లనిర్మాణం కూడా ఈ విధంగానే ఉపకరించింది.

తమ అధికారాన్ని సుస్థిరంచేసుకొనడానికి తంతితపాలా సౌకర్యాలు బ్రిటిష్‌వారికి ఎంతో అవసరమైనాయి. కేంద్ర ప్రభుత్వపు ఆదేశాలు రాష్ట్ర ప్రభుత్వాలకు ఇతర క్రింది అధికారులకు అందచేయుటకు, అధికారులందరిమధ్య సంప్రతింపులు జరుగుటకు ఇవి పటిష్టమైన సాధనాలు. కాని ఇవి వృద్ధిగాంచడంతో ప్రజలందరు కలిసికట్టుగా ఆలోచించి పనిచేయడంకూడా సులభమైంది. ఒక రాష్ట్రంలోని విద్యాధికులూ ఉద్యమ నాయకులూ ఇతర రాష్ట్రాలవారితో సులభంగా సంప్రతింపులు జరుపగలిగారు. ఒక రాష్ట్రంలోని ప్రముఖుల నిర్ణయాలు తక్కిన రాష్ట్రాలకు వెంటనే అందడం, అందరిలో ఏకీభావం కుదరడం సుసాధ్యమైంది. వార్తాపత్రికల ప్రచురణ ఏ రాష్ట్రంలో జరిగినా అవి అన్ని ప్రాంతాలకు పంపడం సులభమైంది. ప్రజలలో ఐక్యభావం ఏర్పడుటకు ఇవి గొప్ప సాధనాలైనాయి.

బ్రిటిష్ వారికి పూర్వం దేశంలో అనేక సామ్రాజ్యాలు స్థాపింపబడ్డాయి. కాని ప్రయాణ సౌకర్యాలు సమాచార సౌకర్యాలు లోపించిన కారణంగా సామ్రాజ్యాల పరిపాలన కేంద్రీకృతంకాక వికేంద్రీకృతమైంది. రాష్ట్ర గవర్న

రులు స్థానికాధికారులు స్వతంత్రంగా వ్యవహరించేవారయ్యారు. సామ్రాజ్యాలు చాలా కాలం నిలబడకపోవుటకు ఇది ఒక ప్రధానకారణం. బ్రిటిష్‌వారు ఈ విధానాన్ని పూర్తిగా మార్చివేశారు. అధికారాన్నంతా కలకత్తాలోని గవర్నరు జనరల్ వహించాడు. రాష్ట్రాలలో గవర్నరులు ఉండినా వారు ఏలాటి స్వాతంత్ర్యం లేక అతని ఆదేశాలను శిరసావహించవలసిన వారయ్యారు. 1833 లో రూపొందిన ఈ విధానం ఒక విధంగా 1919 వరకు అమలులో ఉన్నట్లు చెప్పవచ్చు. ఈ విధానం వారి అధికారపటిష్టతకు దోహదకారి అయింది. కాని ఇదిగూడా ప్రజలలో జాతీయత అంకురించి వృద్ధిపొందడంలో సాధనమైంది. తమ కష్ట సుఖాలకు స్థానికాధికారులు కారకులుకారని, కేంద్రప్రభుత్వమే వీటికి కారణమనీ, తమ కష్టాలను తొలగించుకొనుటకు తమ సుఖాలను పెంపొందించుకొనుటకు వివిధ రాష్ట్రాలలోని ప్రజలుకలిసి కేంద్రప్రభుత్వంపై ఒత్తిడిచేయడం అవసరమనే భావం వ్యాపించింది. ఏ రాష్ట్రాలవారు ఆ రాష్ట్రాలలో మాత్రమే కార్యకలాపాలు సాగించడంవల్ల విస్తార ప్రయోజనం చేకూరదని, అందరూకలిసి వాటిని సాగించినప్పుడే కేంద్రప్రభుత్వం వారి మాటలను చెవియొగ్గి వినగలదని, వారు చేసుకొన్న నిర్ణయాలపట్ల అధికారులు కొంత శ్రద్ధ వహింపగలరనీ ప్రజలు భావించారు. అధికారం కేంద్రీకృతమైన కారణంగా ప్రజల ఉద్యమాలుకూడా కేంద్రీకృతం కావలసిన అవసరం ఏర్పడింది.

ఇతర విధాలుగాకూడా బ్రిటిష్ పరిపాలన గతకాలంనాటి సామ్రాజ్యాల పరిపాలనకంటె భిన్నంగా రూపొందింది. తమ అధికారానికి శాశ్వతత్వం కల్పించుకొనేదోరణి వారిలో అగ్రస్థానం వహించడమే ఈ భిన్నత్వానికి ప్రధాన కారణం. దీనిఫలితంగా వారు ప్రజల జీవితాన్ని పూర్తిగా మార్చివేశారు. తర తరాలుగా ప్రజలు అలవాటుపడిన భూమిశిస్తువిధానాన్ని రద్దుచేశారు. భూములపై ఆస్తిహక్కును కల్పించి సాహుకార్ల ఆధిక్యతను పెంపొందించారు. గ్రామాలకు దూరంగా న్యాయస్థానాలను స్థాపించి గ్రామపంచాయితీలకు స్వస్తిచెప్పారు. గ్రామాలలోని చేతిపనుల వినాశానికి తోడ్పడి గ్రామాల సమష్టివ్యవస్థపై దెబ్బ తీశారు. నగదు వ్యాపారపద్ధతిమూలంగా గ్రామీణ స్వయంసమృద్ధిని స్వయం పోషకత్వాన్ని రూపుమాపారు. సంస్కరణల పేరుతో వారు ప్రాచీన సంప్రదాయాలకు విఘాతం కలిగించారు. వారు ప్రవేశించనిరంగం ఒకటికూడా లేక పోయింది. సంఘంలోని ఆచారవ్యవహారాలను రక్షించడమే తమ కర్తవ్యమనీ వాటిని మార్చే అధికారం తాము వహించరాదనీ ఇంతకుపూర్వం దేశాన్ని పాలించిన ప్రభువులందరూ భావించారు. అందుచేతనే వారి పరిపాలనవిధానంలో శాసన నిర్మాణానికి ప్రాధాన్యం లేకపోయింది. బ్రిటిష్‌వారు దీనికి విరుద్ధంగా శాసనాలద్వారా ప్రజల జీవితవిధానాన్ని పూర్తిగా మార్చివేయసాగారు.

ఇందులో వారి ఉద్దేశం వారి అధికారాన్ని సుస్థిరపరచుకొనడమే. కాని ఇది ప్రజల మనోవైఖరిని పూర్తిగా మార్చివేసింది. వేలాది సంవత్సరాలుగా ప్రజలు రాజకీయాలపట్ల ఉదాసీనులుగా ఉండేవారు. రాముడు రాజ్యంచేసినా

రావణుడు రాజ్యంచేసినా తాము పట్టించుకోనవలసింది లేదనే ధోరణిలో ఉంటూ వచ్చారు. కాని బ్రిటిష్ పరిపాలనమూలంగా రాజకీయ ఔదాసీన్యం ప్రమాద కరమనే భావం ప్రజలలో వ్యాపించింది. అధికారులు ఏ నిమిషంలో ఏలాటి శాసనాలు చేస్తారో అనే భయం వారిని పీడించసాగింది. ఇది కారణంగా వారిలో రాజకీయ చైతన్యం ఉదయించింది. రాజకీయాలలో జోక్యం కలిగించుకొంటేనే తప్ప తమ జీవితం సుఖప్రదం కాజాలదనే అభిప్రాయం వారిలో వ్యాపించింది. దీనితోపాటు దేశంలోనివారంతా కలిసి కృషిచేసినప్పుడే పరాయి ప్రభుత్వం మూలంగా తాము అనుభవించవలసిన కష్టాలు తొలగగలవనే భావం వారిలో నాటుకోగలిగింది.

ఈ విధంగా బ్రిటిష్ పరిపాలన ప్రజలలో జాతీయత అంకురించి వృద్ధి గాంచుటలో సాధనమైంది. ఇది అధికారులు ఆశించిన ఫలితంకాదు. కాని తాను తలచింది ఒకటి దైవం తలచింది ఇంకొకటి అనే వాక్యానికి అనుగుణంగా ఈ పరిణామం జరిగింది. స్వాతంత్ర్యోద్యమం ప్రజలఉద్యమంగాను జాతీయోద్యమం గాను రూపొందడానికి ఇది కారణమైంది. జాతీయత అనే విత్తనం సారవంత మైన క్షేత్రంలో నాటబడినదని పై వివరణ స్పష్టం చేస్తూఉంది.

## 3

విద్యాధికులు సమర్థించిన జాతీయతను రెండుదృక్పథాలనుండి పరిశీలించ వలసిఉంది. అందులో ఒకటి అఖిలభారత దృక్పథం, రెండవది వారికిమాత్రం పరిమితమైన వర్గప్రయోజనాల దృక్పథం.

పాశ్చాత్య ప్రపంచాన్నుండి వారు గ్రహించిన భావాలు—హేతువాధార మైన విజ్ఞానము, మానవస్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము, ప్రజాప్రభు త్వము, జాతీయత మొదలైనవి దేశంలోని ప్రజలందరికి అవసరమని, వీటిని ఆధా రంచేసుకొని రాజకీయాది రంగాలలో సంస్కరణలను ప్రవేశపెట్టిన పక్షాన ఏదో ఒక వర్గంవారు మాత్రమేగాక అన్ని వర్గాలవారు, అన్నిప్రాంతాలవారు, అన్ని కులాలవారు, మతాలవారు, అన్నిభాషలు మాట్లాడేవారు పురోగమించగలరనేది అఖిలభారత దృక్పథం. అందుచేతనే ఈ భావాలను తాము ప్రచారంచేసినా వాటిమూలంగా లాభం పొందేవారు ప్రజలందరని విద్యాధికులు ఉద్ఘాటించారు. దాని ఫలితంగా కాలక్రమాన విద్యాధికులుకాని సామాన్య ప్రజలుకూడా ఈ భావాలచే ప్రభావితులై స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనడం జరిగింది,

కాని విద్యాధికుల జాతీయతలో కొన్ని వర్గప్రయోజనాలుకూడా ఉండినవి. ఇంగ్లీషు విద్యను వారు రెండు ఉద్దేశాలతో నేర్చుకొన్నారు. మొదటి ఉద్దేశం మన ప్రాచీన విద్యలలోలేని విజ్ఞానాన్ని సంపాదించడం, రెండవది కొన్ని లాభ కరములైన వృత్తులలోప్రవేశించి ఆదాయాన్ని పేరుప్రతిష్ఠలను సంపాదించడం, క్రమక్రమంగా మొదటిదానికంటె రెండవదానికి ఎక్కువ ప్రాధాన్యం లభించింది.

పాశ్చాత్యదేశాలలో ఆనాడూ ఈనాడూ విద్యాధికులు వర్తకవ్యాపారాలలోను పరిశ్రమలలోను వ్యవసాయాదులలోను ప్రవేశించి, ఈలాటి వృత్తుల సాధనాన ఎక్కువ ఆదాయాన్ని సంపాదించడం సర్వసాధారణం. కాని ఆనాడు మనదేశంలో ఇంగ్లీషువిద్యను నేర్చుకొన్నవారికి ఈవృత్తులు ఆకర్షణీయంకాలేదు. వర్తకవ్యాపారాలు, భారీ పరిశ్రమలు బ్రిటన్‌నుండి వచ్చిన బ్రిటిష్‌వారు హస్తగతం చేసుకొనడమూ, వీటిలో ప్రవేశించదలచిన భారతీయులకు అవసరమైన ప్రోత్సాహాన్ని ప్రభుత్వం అందజేయకపోవడమూ దీనికొక కారణం. విద్యాధికులలో భూస్వామిక వర్గానికి చెందినవారనేకులు ఉండినా వారికి వారిభూములను రైతులకు మక్తాలకిచ్చి శిస్తులను వసూలు చేయడం ఎక్కువ లాభకరంగా ఉండేది. ఇదిగాక ఇంగ్లీషువిద్యను నేర్చుకొన్న వారిలో అధిక సంఖ్యాకులు అగ్రవర్ణాలకు చెందినవారు. వారికి వర్తకవ్యాపారాలు కులవృత్తులు కావు. వాటిలో వారికి ఏలాటి చొరవగాని ఆసక్తిగాని ఉండినదికాదు. వారు ఈ వృత్తులలో ప్రవేశించకపోవుటకు ఇది రెండవ కారణం. దీనికి తోడు వారు నేర్చిన విద్య ఈలాటి వృత్తులకు ఉపకరించినట్టిదికాదు. అది పూర్తిగా పుస్తకపాండిత్యానికి సాధనమైనట్టిది. సాంకేతిక నైపుణ్యాన్ని సంపాదించుటకు అందులో ఏలాటి అవకాశమూ లేనట్టిది. ఈ కారణంచేతకూడా విద్యాధికులకు ఈలాటి వృత్తులు ఆకర్షణీయం కాలేదు.

ఈ పరిస్థితులలో వారికి ప్రభుత్వోద్యోగాలూ, విద్యతో ముడిపడిన కొన్ని వృత్తులూ - వైద్యం, న్యాయవాదవృత్తి, ఉపాధ్యాయవృత్తి మొదలైనవి - శరణ్యాలైనాయి. అనాదిగా మనదేశంలో విద్యకు ప్రభుత్వోద్యోగాలతో సన్నిహిత సంబంధం ఉండేది. విద్యను నేర్చుకొన్న బ్రాహ్మణాది అగ్రకులాలవారు ప్రభువుల క్రింద ఉద్యోగాలుచేసి ఆదాయాన్ని గడిస్తూ ఉండేవారు. ఆఫ్గనులు, తురుష్కులు, మొగలాయీలు మొదలైన పరాయివారి పరిపాలనలోకూడ విద్యావంతులకు ప్రభుత్వోద్యోగమే ప్రధానవృత్తిగా ఉండేది. బ్రిటిష్‌వారి హయాంలో కూడా ఇదే జరిగింది. ఇంగ్లీషువిద్యను నేర్చుకొన్నవారినే ప్రభుత్వోద్యోగాలలో చేర్చుకొనడం జరుగుతుందనే నిర్ణయం 1844 ప్రాంతాన చేయబడింది. దీని ఫలితంగానే అధికసంఖ్యాకులు ఇంగ్లీషువిద్యను నేర్చుకొనేవారయ్యారు. ఈ ఉద్యోగాలలో జీతాలుకూడా ఆకర్షణీయంగా ఉండేవి. ఈ ఉద్యోగాలలో ఎక్కువ స్థిరత్వం, సెలవులు మొదలగువాటి విషయంలో ఎక్కువ సౌకర్యాలు ఉండడం, పెన్షన్‌లు లభించడం - ఇవి అన్నీ - వీటి ఆకర్షణకు తోడ్పడ్డాయి. ఇదిగాక ఉద్యోగం చేసేవారు క్రింది పదవులలో ఉన్నా, పై పదవులలో ఉన్నా, వారికి సమాజంలో పేరుప్రతిష్ఠలు గౌరవం లభించేవి. దీనికితోడు పై అధికారులు దేశ పరిస్థితులతోను, ప్రజల కష్టసుఖాలతోను, వారి భాషలతోను ఎక్కువ పరిచయం లేనివారు కావడంచేత వారిక్రింద పనిచేసే భారతీయులపై వారు ఎక్కువగా ఆధారపడడం తప్పిందికాదు. ఈ కారణంచేతకూడా ఉద్యోగంచేసే భారతీయులకు ఎక్కువ పలుకుబడి లభించేది. ఇన్ని కారణాల ప్రభావంచేత విద్యాధికులకు

ప్రభుత్వోద్యోగాలలో చేరడం ప్రధాన లక్ష్యమైంది.

తొలిదశలో వారిలో కొందరు ఉన్నతవిద్య అవసరమైన వృత్తులలో ప్రవేశిస్తూ ఉండేవారు. కొందరు ఈ కారణంచేత వైద్యవృత్తిని చేపట్టారు. కాని వీరిలోకూడా అనేకులు కాలక్రమాన స్వంతంగా వృత్తిని సాగించుకొనుటకు బదులు ప్రభుత్వఆస్పత్రులలో ఉద్యోగం చేయసాగారు. అనేకులు ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించారు. వీరిలోకూడా అధికసంఖ్యాకులు ప్రభుత్వ విద్యాలయాలలోను, అజమాయిషీ శాఖలలోను ఉద్యోగం చేసేవారయ్యారు. కొందరు న్యాయవాది వృత్తిలో ప్రవేశించారు. రానురాను ఈలాటి వృత్తులన్నిటిలో దీనికి ప్రాధాన్యం లభించింది. ప్రభుత్వంచేసే శాసనాలు కఠినమైన సాంకేతిక భాషలో ఉన్నందునను, న్యాయస్థానాలలోని విచారణక్రమం చాలా క్లిష్టంగా తయారైనందునను, వ్యాజ్యాలసంఖ్య కాలక్రమాన అపరిమితంగా వృద్ధికావడం చేతను న్యాయవాదవృత్తికి ఎక్కువగిరాకి లభించింది. ఇందులో వందలూవేలూ సంపాదించే అవకాశం ఉండేది. మూడవ కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ప్రఖ్యాతి గాంచిన బొంబాయి న్యాయవాది బద్రుద్దీన్ త్యాబ్జీ ఆదాయం 1868 లో రూ॥ 7170లు కాగా, 1890 నాటికి రూ॥ 122,360లకు పెరిగింది. న్యాయవాదులందరికీ ఇంతటి అదృష్టం పట్టకపోయినా మొత్తంమీద వైద్యులు, ఉపాధ్యాయులు, ఇంజనీర్లు మొదలైన వారికంటె వారిస్థితి మెరుగుగా ఉండేది. కార్యనిర్వాహక శాఖలలోని కలెక్టరువంటి ఉద్యోగాలు భారతీయులకు లభించకపోయినా న్యాయస్థానాలలోని న్యాయాధీశుల పదవులు వారి అందుబాటులో ఉండేవి. వారిలో కొందరు హైకోర్టులలోకూడా న్యాయాధీశులుగా పనిచేస్తూ ఉండేవారు. ఈ కారణంచేతకూడ న్యాయవాదివృత్తి అన్ని వృత్తులకంటే ఆకర్షణీయం అయింది. సాధారణంగా న్యాయవాదులకు లౌకిక ప్రపంచంతో ఎక్కువ సంబంధం ఏర్పడడంచేత వారు ప్రజల ఉద్యమాలలో నాయకత్వం వహించేవారయ్యారు. బ్రిటన్‌నుండివచ్చిన బారిష్టరులతో భారతీయ బారిష్టరులు, ఇతర న్యాయవాదులు విజయవంతంగా పోటీ చేయగలిగారు. తెలివితేటలకున్నూ శరీరచ్ఛాయకున్నూ పరస్పర సంబంధం ఎలాటిదిలేదని వీరు ఋజువుచేశారు.

విద్యాధికులలో కొందరు వార్తాపత్రికలను నడిపి ఆదాయాన్ని సంపాదించసాగారు. వీరు ఇంగ్లీషుభాషలోనేగాక ప్రాంతీయ భాషలలోకూడా వార్తాపత్రికలను నడపసాగారు. కాని ఈ వృత్తిద్వారా ఎక్కువ ఆదాయాన్ని సంపాదించే అవకాశం ఉండేదికాదు. అందుచేత ఇది అనేకులకు అకర్షణీయం కాలేదు.

పై పరిస్థితుల ఫలితంగా కాలక్రమాన విద్యను నేర్చుకొన్నవారిలో అధిక సంఖ్యాకులు ప్రభుత్వోద్యోగాలలో చేరేవారుగాను వాటిని ఆపేక్షించేవారుగాను తయారయ్యారు. విద్యకు ఉద్యోగాలను సంపాదించడం ఒక్కటే లక్ష్యమైపోయింది. ఇది రాజకీయాలపై ఎక్కువ ప్రభావాన్ని వహించి జాతీయత వృద్ధి గాంచడంలో ఒక ప్రబలమైన సాధనంగా రూపొందింది.

## 4

తొలిదశలో ఇంగ్లీషు విద్య నభ్యసించినవారికి ప్రభుత్వోద్యోగాలు సుల భంగా లభించేవి. కాని కాలక్రమాన వారిసంఖ్య పెరగడంచేతను, ఉద్యోగాల సంఖ్య అదే దామాషాలో పెరగడం సాధ్యం కాకపోవడంచేతను వారిలో అనే కులు నిరుద్యోగులుగా జీవితం గడపవలసినవారయ్యారు. ఉద్యోగాలలో అనేకం తెల్లవారికిమాత్రమే కేటాయింపబడి ఉండడమూ, వాటిలో తమకు ప్రవేశం లేకపోవడమూ తమ దుస్థితికి కారణమని గ్రహించి, ఈ పరిస్థితిలో మార్పు చేయవలసిందిగా అధికారులను కోరారు. కాని అధికారులు ఈ కోరికపట్ల ఏలాటి సానుభూతిని చూపని కారణాన నిరుద్యోగసమస్య ఒక రాజకీయసమస్యగా రూపొంది విద్యాధికులు బ్రిటిష్ ప్రభుత్వముమధ్య పరస్పర ద్వేషానికి కారణ మైంది. దేశంలోని విద్యాధికులందరు ఒకవర్గంగాను, బ్రిటిష్‌వారు - అధికారులు, అనధికారులు - ఇంకొక ప్రత్యర్థివర్గంగాను ఏర్పడ్డారు విద్యాధికులలో జాతీయత వృద్ధిగాంచింది.

ఈ సందర్భంలో కొన్ని మౌలిక విషయాలను గుర్తించడం అవసరం. వీటిలో మొదటిది సైనికోద్యోగాలలో భారతీయులు కాలుపెట్టడానికికూడా వీలులేకపోవడం. కారన్‌వాలీసు విధించిన ఈ ఆంక్ష బ్రిటిష్ పరిపాలన అంతరించే వరకు ఆలాగే ఉండిపోయింది. ఇక మిగిలినవి సివిల్ పరిపాలనలోని ఉద్యోగాలు. ఇవి రెండు శాఖలుగా విభాగమై ఉండేవి. మొదటిదానికి కవనెంటెడ్‌శాఖ అని పేరు. జిల్లాలలోని ఉన్నతోద్యోగాలు, శెక్రటేరియట్‌లోని హైస్థాయి ఉద్యో గాలు, రాష్ట్రాల ప్రధాన కమీషనర్లు, లెఫ్టనెంటు గవర్నర్లు, గవర్నర్ జనరల్ గవర్నరుల కార్యనిర్వాహక సభలలోని సభ్యత్వాలు మొదలైనవన్ని ఈ శాఖకు సంబంధించినట్టివి. బ్రిటిష్ పరిపాలనచక్రాన్ని నడిపేవారు వీరు. అధికారదృష్ట్యా, పేరు ప్రతిష్ఠలదృష్ట్యా, జీతాలదృష్ట్యా ఈ శాఖకు ప్రాధాన్యంలభించింది.

రెండవ శాఖకు అన్‌కవనెంటెడ్ శాఖ అనిపేరు. మొదటిశాఖకు చెందని ఉద్యోగాలన్నీ దీనికి చెందినట్టివి.

జాతి, మత, కుల వివక్షలేక బ్రిటిష్ పౌరులతోపాటు భారతీయులు ఉద్యోగాలన్నిటికీ అర్హులని 1833 చార్టర్ చట్టమూ, 1858లో విక్టోరియా మహా రాణిగావించిన ప్రకటనా సాటించాయి. వీటిని వాగ్దానాలుగా భావించి భారతీ యులు ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్నారు. కాని ఇవి వాగ్దానాలుగానే ఉండి పోయాయి. అధికారులు ఆచరణలో వీటిని ఏమాత్రము పాటించలేదు.

1853 నుండి కవనెంటెడ్ ఉద్యోగాలన్నిటికి పోటీ పరీక్షలు ఆధారాలై నాయి. వీటిలో పాల్గొనే హక్కు భారతీయులకు కూడా కల్పించారు. కాని ఈ పరీక్షలు సముద్రాలకు ఆవల 6000 మైళ్ళ దూరంలో లండన్ నగరంలో జరిగేవి. అనేక కారణాలమూలంగా వీటిలో పాల్గొనడం భారతీయులకు కష్టసాధ్యం అయింది. విద్యాధికులలో ధనికులైనవారు మాత్రమే లండన్ వెళ్ళి పరీక్షలలో

పోటీచేసే స్థితిలో ఉండేవారు. కాని విద్య నభ్యసించుచున్న వారిలో అధిక సంఖ్యాకులు మధ్య తరగతికీ స్వల్పాదాయంగల కుటుంబాలకూ చెందినవారు. ఇదిగాక ఆ రోజులలో సముద్ర ప్రయాణం హిందూమత సంప్రదాయానికి విరుద్ధం అనే అభిప్రాయం వ్యాపించి ఉండింది. తెగించి సముద్ర ప్రయాణంచేసి లండన్‌కు వెళ్లడానికి అనేకులు జంకేవారు. ఆలాగు వెళ్లినా పరీక్షలన్నీ బ్రిటన్‌లోని విద్యా పద్ధతికి అనుగుణంగా ఉండినందున భారతీయులు బ్రిటిష్ వారితో సమానంగా పోటీచేసి ఉత్తీర్ణులుకావడం సులభసాధ్యం కాకపోయింది. ఈలాటి ప్రతికూల వాతావరణంలో పోటీ పరీక్షలు ప్రవేశపెట్టిన తర్వాత పదేండ్లవరకు భారతీయులెవరు కృతార్థులు కాలేదు. కృతార్థులైనవారిలో మొదటివాడు సత్యేంద్రనాథ్ టాగూరు (1863). 1887 నాటికి 1000 ఉద్యోగులలో భారతీయుల సంఖ్య 12 మాత్రమే. పరీక్షలలో పాల్గొని కృతార్థులు కానివారిలో గొప్ప మేధావులుగా తమ జీవితకాలంలో వివిధ రంగాలలో పేరుప్రఖ్యాతులు సంపాధించినవారు ఎందరో ఉండినారు. మన్‌మోహన్ ఘోస్, లాల్‌మోహన్ ఘోస్, గణితశాస్త్ర ప్రవీణుడైన ఆనందమోహన్ బోస్ ఆలాటివారిలో కొందరు. కొందరు వ్రాత పరీక్షలో కృతార్థులైనా గుర్రపుస్వారిలో నెగ్గలేక పోయ్యారు. ఐ. సి. యస్. శాఖ (కవనెంటెడ్ శాఖకు ఇది నామాంతరం) యొక్క ఉదంతం ఇదీ.

పోటీ పరీక్షలు ఆధారం కాని అన్‌కవనెంటెడ్ శాఖలోకూడా చాలా కాలం వరకు భారతీయులకు ప్రవేశం కష్టసాధ్యంగా ఉండేది. నెలకు రు. 75 లకు దానికి పైబడ్డ జీతంతోకూడిన ఉద్యోగాలలో బ్రిటిష్‌వారి యొక్కయు యూరేపియన్‌ల యొక్కయు సంఖ్య ఎక్కువగా ఉంటూవచ్చింది. 1879 లో రు. 200 లకు పైబడ్డ ఉద్యోగాలలో భారతీయులను తప్ప మరెవ్వరినీ నియమించరాదనే సూత్రం అమలులోకి వచ్చింది. అప్పటి నుండి ఈ శాఖలో బ్రిటిష్‌వారి సంఖ్య తగ్గింది. కాని యూరేపియన్ల ప్రాబల్యం తగ్గనికారణంగా విద్యాధికులకు తగినంత అవకాశం చాలా కాలంవరకు లభించలేదు. లభించినా ఇందులో జీతాలూ, పై ఉద్యోగాలకు వెళ్లే సదుపాయాలూ చాలా తక్కువ. బంకించంద్రుని వంటివాడు 18 సంవత్సరాల కాలం డిప్యుటీ కలెక్టరుగా ఉండి పెన్షన్ పుచ్చుకోవలసి వచ్చింది. అంతకంటె పై ఉద్యోగం ఆలాటి వారికికూడా కరువైంది. అతని జాతీయతకు నవలా రచనకు ఇది ఒక ప్రబలకారణం.

ఈ పరిస్థితులలో ఐ. సి. యస్. శాఖకుచెందిన ఉద్యోగాలలో తమకు ప్రవేశం సులభసాధ్యం కావలెనని విద్యాధికులు ఆందోళన సాగించారు. వార్తా పత్రికలలో దీనిని గురించి పదేపదే వ్యాసాలు వ్రాశారు. తమ రాజకీయ సంఘాలలో దీనిని గురించి చర్చించి పోటీపరీక్షలు లండన్‌లోనేగాక ఏకకాలంలో భారతదేశంలోకూడా జరపవలసిందిగా తీర్మానాలుచేసి వాటిని అధికారులకు పంపారు. నైతికంగా వాగ్దానాలను చెల్లించడం తమ కర్తవ్యమనీ, అందుకు భారతదేశంలో పరీక్షలు జరిపించడం సాధనమనీ అధికారులు గ్రహించినా రాజకీయంగా ఇది ఆచరణయోగ్యం కాజాలదని నిర్ణయించుకొన్నారు. ఏకకాల

పరీక్షల విధాన ఫలితంగా ఉన్నతోద్యోగాలలో ప్రవేశించే భారతీయుల సంఖ్య పెరిగిపోగలదనీ, ఆలాగు పెరగడం తమ పరిపాలన స్థిరత్వానికి ప్రమాదకరమనీ వారు భావించి, తమ వాదాన్ని సమర్థించుకొనడంలో విద్యాధికులను అసహ్యించుకొనడం, తూలనాడడం, హేళనచేయడం మొదలైన ప్రవర్తనలోకి దిగారు. ఇంతేకాదు. భారతీయులకు పరిపాలనదక్షత లేదనీ, వారు ఇతరుల క్రింద ఇతరుల అజమాయిషీలో మాత్రమే ఉద్యోగంచేసే అర్హతగలవారనీ, స్వతంత్రంగా పై ఉద్యోగాలలో పనిచేయుటకు కావలసిన ధైర్యంగాని బెట్టుగాని, చొరవగాని వారిలో లేదనీ, రాజ్యాలను ఏలుటకు కావలసిన అర్హత ఒక బ్రిటిష్ జాతికి మాత్రమే ఉన్నదనీ వాదించసాగారు. ఈ విధంగా తమ్మనూ తమ భారత జాతినీ తూలనాడడం విద్యాధికులు ఏ మాత్రమూ సహించరైరి. తమ యొక్కయు తమ జాతి యొక్కయు ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకొనడం తమ విధిగా భావించారు. ఇందులో, అన్ని రాష్ట్రాలలోని విద్యాధికులు అన్ని కులాలకు చెందినవారు కలిసికట్టుగా కృషిచేశారు. వారిలో జాతీయత వృద్ధి గాంచడానికి ఇది ఎంతో దోహదకారి అయింది.

అధికారులు సమర్థించదలచిన వాదం - ఇది పక్షపాతంతో కూడిన కువాదమని పేర్కొనతగినట్టిది- ఈ క్రింది విధంగా ఉండినది.

ఇంగ్లీషు గ్రంథాలను కంఠస్థంచేసి పరీక్షలలో కృతార్థులై వచ్చీరాని ఇంగ్లీషు భాషలో వ్రాయడం మాట్లాడడం నేర్చుకొనినంత మాత్రాన విద్యావంతులని పేర్కొనబడే భారతీయులకు ఉన్నతోద్యోగాలను బాధ్యతతో నిర్వహించుటకు కావలసిన అర్హత ఉన్నట్లు భావించడం హాస్యాస్పదం. ఈ అర్హత పుట్టుకతోను, శిక్షణతోను, సామాజికసంస్కృతి ప్రభావంచేతను రాదగ్గదేగాని పుస్తకపాండిత్యం మూలంగా లభించేదికాదు. ఈ వాస్తవాన్ని భారతీయ విద్యాధికులు గ్రహించడంలేదు.

భారతదేశంలోని ప్రజలలో మతం, కులం, భాష, నివసించే రాష్ట్రం మొదలైనవి కారణంగా ఎన్నో విభేదాలు ఉన్నాయి. అందరు ఒక జాతికి చెందినవారుకారు. ఇప్పుడేకాదు; ఎప్పుడూకూడా వారు ఒకేజాతికి చెందినవారు కావడంకల్ల. ఈలాటి ప్రజలలో ఏదోఒక వర్గంవారు ఉన్నతోద్యోగాలలో ప్రవేశించడమూ, పరిపాలనను సాగించడమూ తక్కిన వర్గాలవారు హర్షించజాలరు. వారు పరిపాలకులుగాను తాము వారిక్రింద పరిపాలితులుగాను ఉండడాన్ని వారు నిరసించడం తప్పదు. అది తిరుగుబాటుకుకూడా దారితీసి బ్రిటిష్ సామ్రాజ్యాధికారానికి ముప్పు తెచ్చిపెట్టవచ్చు.

ఇంగ్లీషు విద్యావంతులు స్వల్పసంఖ్యాకులు. ఏకకాలపరీక్షా విధానం ద్వారా వారు ఉన్నతోద్యోగాలలో అధికంగా ప్రవేశించి ఒక పాలకవర్గంగా ఏర్పడదలచి ఉన్నారు. ఈ పరిణామం ఇతర వర్గాలకు ప్రమాదకరం. ప్రస్తుతం విద్యావంతులలో అధికసంఖ్యాకులు హిందువులు. వారిలోకూడ బ్రాహ్మణాది అగ్రవర్ణాలకు చెందినవారు బెంగాలీలు ఎక్కువగా ఉన్నారు. పోటీ పరీక్షలను

భారతదేశంలో నిర్వహిస్తే అగ్రవర్ణాలవారు బెంగాలీలు మాత్రమే వాటిలో ఉత్తీర్ణులుకావడం, అధికార పదవులలోకి రావడం జరుగుతుంది. ముస్లింలు, శిక్కులు మొదలైన అల్పసంఖ్యాకులు, అగ్రకులాలకు చెందనివారు, బెంగాలీలు కాని వారు, ఈ పరిణామాన్ని ఎదిరిస్తారు. ఈలాగు ఎదిరించేవారిలో యోధ వర్గాలకుచెందిన పఠానులు, రాజపుత్రులు, జాటులు మొదలైనవారున్నారు. వీరిలో క్షాత్రం, పరిపాలనదక్షత, ప్రకృతిసిద్ధమైన గుణాలు. అనేక కారణాల వల్ల ఇంగ్లీషువిద్య వారిని ఆకర్షించడంలేదు. కాని, ఉన్నతోద్యోగాలలో భారతీయులకు ఎక్కువ ప్రాతినిధ్యం ఉండవలెననే సూత్రం ఆమోదయోగ్యమై ఆచరణలోకి వచ్చిననాడు ఈలాటి యోధవర్గాలకు ముస్లింలకు, శిక్కులకు ప్రాతినిధ్యం కల్పించడం యుక్తమౌతుందిగాని ఈనాటి విద్యావంతులకుకాదు. వీరు-వీరిలో ప్రధానంగా బెంగాలీలు - పిరికిపందలు, కలం ఒక్కటే వీరి ఆయుధం - వీరెన్నడూ పరాయి పాలకులపై తిరుగుబాటు చేసినవారు కారు. దీనికి కావలసిన శక్తిసామర్థ్యాలు వీరికి లేవు. వీరి సహకారం ఉన్నా లేకపోయినా ఒకటే. యోధవర్గాల సహకారం ఈలాటిదికాదు. అది లెక్కకు తీసుకొనతగినట్టిది. దానిని పోగొట్టుకొనడం ప్రాజ్ఞతకాదు. కాని ఈనాటి విద్యావంతులకు ఏకకాల పరీక్షలద్వారా ఉన్నతోద్యోగాలలో ఎక్కువగాచేరే అవకాశం కల్పించిన పక్షాన యోధవర్గాల సహకారం తప్పకుండా పోతుంది.

ఈ వర్గాలవారేకాక, సామాన్య ప్రజలకుకూడా ఇంగ్లీషు విద్యావంతులు అధికసంఖ్యలో ఉన్నతోద్యోగాలలో ప్రవేశించడం ఇష్టంలేదు. బ్రిటిష్ అధికారులవలె నిర్భయంగాను, పక్షపాతరహితంగాను, నిజాయతీతోను వీరు అధికారం చెలాయించగలరనే విశ్వాసం వారికి లేదు. ఇంతేకాక వీరు సామాన్య ప్రజలతో సన్నిహితసంబంధాన్ని పోగొట్టుకొన్నారు. వీరికి ఇంగ్లీషు భాషేగాని మాతృభాషలో సామాన్యులకు అర్థం అయ్యేటట్లు మాట్లాడేశక్తి లేదు. వీరి వేషం (పంట్లాలు, కోట్లు, షైలు, హ్యాట్లు, బూట్లు మొదలైనవి) వారికి అసహ్యంగా ఉంటూఉంది. తెల్ల దొరలను అనుకరించడమే వీరు గొప్పగా భావించేవారు. వీరు తినే ఆహారం, వీరి త్రాగుడు, వీరిలో జీర్ణించుకొనిపోయిన ఇతర అలవాటులు సామాన్య ప్రజలకు నచ్చడంలేదు. ఈ ప్రజల ప్రయోజనాలదృష్ట్యా కూడా ఇంగ్లీషు విద్యావంతులు అధికసంఖ్యలో ఉన్నతోద్యోగాలలో పాల్గొనడం గర్హించతగ్గది.

ఈలాగైతే, భారతీయులలో ఇతర వర్గాలవారిని తగిన సంఖ్యలో ఉద్యోగాలలో ఎందుకు చేర్చుకొనడంలేదు ? వారికి లాభించే విధానాలను ఎందుకు కల్పించడంలేదు ? అనే ప్రశ్నలు బయలుదేరుతవి ఆధికారులు వీటికికూడా సమాధానాలను సిద్ధపరచారు.

భారత దేశం శాంతి భద్రతలు ఆధారంగా పురోగమించడానికి బ్రిటిష్ అధికారవర్గం ఒక్కటేసాధనం. బ్రిటిష్ పరిపాలన స్థాపింప బడుటకు పూర్వం ప్రజలు శాంతి భద్రతలు అంటే ఏమిటో తెలియక భయభ్రాంతులై జీవితాలు

గడిపేవారు. రాజుల మధ్య యుద్ధాలు, పరాయిదేశాల వారి దాడులు, దోపిడి వల్లనే జీవించే కులాలవారి దుష్కృత్యాలు, గ్రామాలలోని ప్రముఖులమధ్య కక్షలు, సర్వసాధారణంగా ఉండేవి. బ్రిటిష్ వారు దేశాన్ని జయించడం మూలంగా ఈ ప్రమాదాలన్ని అంతరించాయి. ప్రజలు నిర్భయంగా జీవితం గడుపుకొనేవారయ్యారు. బ్రిటిష్ పరిపాలన సుస్థిరంగా ఉంటే ఈ శాంతియుత జీవితం సుస్థిరమవుతుంది. లేనిపక్షంలో అశాంతియథాపూర్వంగా వ్యాపిస్తుంది. బ్రిటిష్‌పరిపాలన సుస్థిరంగా ఉండడమంటే ఉన్నతోద్యోగాలన్నిటిలో వారే ఉండడం. ఈ కారణాలమూలంగా భారతీయులను ఉద్యోగాలలో ఎక్కువ సంఖ్యలో చేర్చుకొనడం దేశశ్రేయస్సు దృష్ట్యా వాంఛనీయంకాజాలదు. బ్రిటిష్ వారి శ్రేయస్సుదృష్ట్యా కూడా ఇది వాంఛనీయం కాదు. బ్రిటిష్‌వారు ఎంతో కష్టపడి ఎన్నోత్యాగాలు చేసి భారత దేశాన్నిజయించారు. దానిపై తమకు లభించిన అధికారాన్నివారు కోల్పోవడానికి అంగీకరించరు. ఆలాగు అంగీకరించడం కూడా ధర్మానికి నీతికి విరుద్ధం. వేలాదిసంవత్సరాలుగా అశాంతికి, అనాగరికతకు, మూఢనమ్మకాలకు నిలయమైన భారతదేశాన్ని తరింపజేయడమనేది పూర్తికావడానికి చాలాకాలం పడుతుంది. అదిపూర్తిఅయ్యేవరకు వారు పరిపాలన బాధ్యతను వహించడం న్యాయం. దానిని విడనాడడం పౌరుషంలేని జాతికి సహజమేమోకాని పౌరుషము, పరిపాలన దక్షతగల బ్రిటిష్ జాతికి తగినదికాదు. ప్రజలకు, యోధవవర్గాలకు, విద్యాధికులకు ఇష్టం ఉన్నాలేకపోయినా బ్రిటిష్ వారు ఈ బాధ్యతను వహించవలసి ఉంది. పరిపాలనాధికారం పూర్తిగా వారి వశంలో ఉన్నప్పుడే ఇది సాధ్యంఅవుతుంది. ఉన్నతోద్యోగ వర్గం అనేది ఇందుకుగాను నిర్మింపబడిన ఉక్కుచట్రం. అందులోకి అధిక సంఖ్యలో భారతీయులకు ప్రవేశం కల్పించడం ఉక్కుయొక్క కాఠిన్యాన్నితొలగించి మెత్తపరచడమే. అది ఎన్నడూ జరగరాని పని. ఇందులో బ్రిటిష్ వారికి స్వార్థం ఉన్నదని అనేకులు చెప్పవచ్చు. స్వార్థం ఉండడం కొంతవరకు మాత్రమేనిజం. భారతీయులను తరింపజేయడం కూడా ఇందులో కలిసిఉంది. ఇది భగవదిచ్ఛ అని కూడా చెప్పవచ్చు. ఈ బాధ్యతను నిర్వహించుటలో వెనుకాడడం భగవదిచ్ఛకు అన్యథాగా ప్రవర్తించడమే. రంగు జాతులవారినందరిని ఉద్ధరించే భారాన్ని భగవంతుడు ఈ యుగంలో శ్వేతజాతులపై మోపాడు.

ఇదీ బ్రిటిష్ వారి వాదంలోని సారాంశం. ఇందులో ఎన్ని అసత్యాలు, విపరీతాలు, ఎంతటిజాత్యహంకారం ఇమిడి ఉన్నదో ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు. ఈలాటి వాదంతో విద్యాధికుల వాంఛలను అణచివేయడానికి అధికారులు ప్రయత్నించారు.

కాని వాటిని పూర్తిగా అణచివేయడం తమ వాగ్దానాలను భంగపరచడమౌతుందనీ, అది వారి పేరు ప్రతిష్టలకు భంగకరమనీ వారు గ్రహించారు. అందుచేత విద్యాధికుల కళ్ళనీళ్ళు తుడిచే మార్పులను కొన్నిటిని చేశారు.

1869 లో ఒక పథకాన్ని ప్రవేశపెట్టి ఏటేట ఉన్నతవిద్యను ఆర్జించుట

కున్నా పోటీపరీక్షలలో పాల్గొనుటకున్నా ఇంగ్లండుకు వెళ్లే భారతీయులలో తొమ్మండుగురికి విద్యార్థి వేతనాలను ఇయ్యడానికి అంగీకరించారు. కాని ఇది ఒక సంవత్సరం మాత్రమే అములులో ఉండింది 1870 లో దీనిని రద్దుచేసి, పార్లమెంటు ఇంకొక ఏర్పాటును గావించింది. దీనికి సంబంధించిన చట్టం ప్రకారం ఏ యేట పోటీపరీక్షలలో నెగ్గే మొత్తం అభ్యర్థులలో ఆరవవంతు స్థానాలకు పరీక్షలతో నిమిత్తంలేకుండా గవర్నరు జనరల్ అర్హులైనవారిని నియమించే అధికారం కలవాడయ్యాడు. కాని 1879 వరకు ఇది అమలులోకి రాలేదు. భారతదేశంలోని అధికారవర్గంవారికి ఈ మార్పు ఎంతమాత్రం ఇష్టంలేని కారణంగా వారు దీనిని అమలుపరచే విషయంలో ఏవో లేనిపోని ఆక్షేపణలను తెలియపరచసాగారు.

ఇది ఈలాగు ఉండగా గోరుచుట్టుపై రోకటి పోటు అన్నట్లు 1876 లో పోటీపరీక్షలో పాల్గొనే అభ్యర్థుల వయస్సును 21 నుండి 19 కి తగ్గించారు. అంతటి తక్కువ వయస్సులో భారతదేశంలో ఉన్నత విద్యను పూర్తిచేసుకొని లండన్‌కు వెళ్లి పోటీపరీక్షలో పాల్గొనడం సాధ్యంకాకపోయింది. ఏకకాల పరీక్షా విధానాన్ని ప్రవేశపెట్టకపోవడమేగాక ఈలాటి అవరోధాన్ని కల్పించడం విద్యార్థికుల క్రోధాన్ని మరింత పెంచింది. వారు దేశవ్యాప్తంగా ఈ విషయాన్ని గురించి ఆందోళన జరపడానికి సిద్ధపడ్డారు. లండన్ పరీక్షలో ఉత్తీర్ణుడై ఉద్యోగంలో ప్రవేశించి, ఏదో ఒక స్వల్పమైన పొరపాటు కారణంగా ఉద్యోగాననుండి తొలగింపబడిన సుప్రసిద్ధవక్త సురేంద్రనాథ్ బానర్జీ దీనికి నాయకత్వం వహించి 1877 లోను 1879 లోను దేశమందంతటా ప్రచారం సాగించాడు. అధికారులు ఆందోళన తీవ్రతను గుర్తించి 1870 లో చేసిన చట్టాన్ని 1879 లో అమలులో పెట్టారు.

ఏకకాల పరీక్ష విధానాన్నిగాని వయస్సును పెంచడంగాని వారికి ఆమోదయోగ్యం కాలేదుకాని, 1870 చట్టాన్ని అనుసరించి వారు సుమారు 100 ఉద్యోగస్థానాలను కవనెంటెడ్ శాఖ నుండి వేరుచేశారు. వాటిలో పోటీపరీక్షలతో నిమిత్తంలేకుండా గవర్నరు జనరల్ తనకు ఇష్టంవచ్చినవారిని నియమించగలిగాడు. ఈ నియామకంలో విద్యకు ప్రాధాన్యం కల్పించడానికిబదులు, కులానికి, మతానికి, అంతస్తుకు ప్రాధాన్యం కల్పించబడింది. ముస్లింలు మొదలైనవారికి ప్రవేశం లభించింది. అర్హతలేనివారు కొందరు ఉద్యోగాలలో ప్రవేశించడం జరిగిందనీ, దానిమూలంగా పరిపాలనసౌష్టవం తగ్గిందనీ కొంత కాలానికి అధికారులు గ్రహించి అర్హతను అనుసరించి నియామకం చేయసాగారు. ఈ విధానం 1891 వరకు అమలులో ఉండింది. తర్వాత ఇందులో కొన్ని మార్పులు చేయడంచేత కేటాయింపబడిన ఉద్యోగాలన్నీ రాష్ట్రీయ ఉద్యోగాలవర్గంలో చేర్చబడ్డాయి. ఆయా రాష్ట్రాలలోని పరిస్థితులకు అనుగుణంగా వీటి నియామకం జరగసాగింది. ఈలాగు కేటాయింపబడిన ఉద్యోగాల సంఖ్య 108. కాని ఈ మార్పులేవీ విద్యావంతులకు ఆమోదయోగ్యం కాలేదు. వారు వాంఛించింది

పోటీపరీక్షలో సులభంగా పాల్గొనే అవకాశం. అధికారుల దయాదాక్షిణ్యాల ద్వారా ఉద్యోగాలను సంపాదించడం వారి లక్ష్యంకాదు. ఇంతేగాక కేటాయింప బడిన ఉద్యోగాలలో అనేకం కార్యనిర్వాహశాఖకు చెందినట్టివికాక న్యాయ శాఖకు సంబంధించినట్టివి. దీనికితోడు వాటి జీతాలుకూడా కవనెంటెడ్ ఉద్యోగుల జీతాలకంటె తక్కువగా ఉండేవి. అందుచేత వారు ఈ విషయాన్ని గురించి తమ సంఘాలద్వారా ఆందోళనను సాగిస్తూనేవచ్చారు. 1885 లో భారతజాతీయ కాంగ్రెసు నిర్మాణం జరిగిన తర్వాత దాని సాంవత్సరిక సమావేశాలలో ఈ విషయాన్ని గురించి తీర్మానాలు చేయడం మామూలైంది. వీటి ఫలితంగా పోటీపరీక్షలలో పాల్గొనే విద్యార్థుల వయస్సు 1891 లో 21 కి పెంచబడింది. ఏకకాలపరీక్షా విధానాన్ని ప్రవేశపెట్టుటకు చాలా కాలంవరకు అధికారులు అంగీకరించలేదు.

## 5

ఉన్నతోద్యోగాల విషయమై వాద ప్రతివాదాలు జరుగు చుండిన ఈ కాలంలో విద్యాధికుల ప్రాబల్యాన్ని పలుకుబడిని రూపుమాపే ఉద్దేశంతో అధికారులు మరి రెండు ప్రయత్నాలను గావించారు. వాటిలో మొదటిది ఉన్నత విద్యావ్యాప్తిని అరికట్టడానికి ఉద్దేశింపబడింది. రెండవది విద్యాధికులు నడిపే దేశభాషా వార్తాపత్రికల స్వాతంత్ర్యాన్ని నిర్మూలించుటకు ఉద్దేశింప బడింది.

1858కి పూర్వం విద్యాధికులు ప్రభుత్వ విధానాలను చాలావరకు సమర్థిస్తూ వచ్చారు. కాని అటుతర్వాత వారు వాటిని విమర్శించే వారుగా తయారయ్యారు. వార్తాపత్రికలను — వాటిలో ఎక్కువగా దేశభాషా పత్రికలను — రాజకీయ సంఘాలను ప్రధానంగా ఇందుకు గాను వినియోగించ సాగారు. ఇది అధికారులకు ఎంతమాత్రమూ నచ్చలేదు. ప్రభుత్వ వ్యయంతో స్థాపించబడ్డ కళాశాలలు ఈలాటి విమర్శకులను తయారుచేసే సాధనాలు కావడం వారికి ఆమోదయోగ్యం కాలేదు. ఉన్నత విద్యాధికుల సంఖ్యను పెరగకుండా చేయడం అవసరమనే నిర్ణయానికి 1870 ప్రాంతాన వారు వచ్చారు. కళాశాలలను స్థాపించి నడిపించడం ప్రభుత్వం వహించ వలసిన బాధ్యత కాదనీ, ఆబాధ్యత దానధర్మాల పట్ల ఆసక్తి గల వ్యక్తులు గాని సంఘాలు గాని వహించ దగినట్టి దనీ, అందుకుగాను ఎవరైనా కార్యక్రమాలను చేపట్టిన పక్షాన వారు చేసేఖర్చులలో కొంతభాగాన్ని గ్రాంటుల రూపంలో ఇవ్వడం జరుగుతుందనీ ప్రభుత్వం ప్రకటించింది. దీని అంతరార్థాన్ని విద్యాధికులు గ్రహించి దానిని నిరసిస్తూ గొప్ప ఆందోళనను లేవదీశారు.

ఈప్రకటన సందర్భంలో క్రైస్తవ మిషనరీల ప్రభావం కూడా అధికంగా కనుపించింది. ఉన్నత విద్యావ్యాప్తి విద్యాధికులను క్రైస్తవులుగా చేయడానికి పటిష్ట సాధనము కాగలదని వారు ప్రథమంలో భావించారు. కాని వారి ఆశయం సిద్ధించకపోవడమేకాక ఇంగ్లీషువిద్య నభ్యసించినవారు వారి స్వీయ

మతాలపట్ల ఎక్కువ శ్రద్ధాభక్తులు కలవారుకావడం, దానిని సంస్కరించి పునరుద్ధరించడానికి గొప్ప ప్రయత్నాలు చేయడం పరిపాటి అయింది. ఈ ప్రయత్నాలను ఎలాగైనా అరికట్టడం తమధ్యేయంగా మిషనరీలు పెట్టుకొని, బైబిలు బోధకు అవకాశంలేని ప్రభుత్వ కళాశాలలను మూతవేయడమూ, ప్రయివేటు కళాశాలలకు గ్రాంటుల నివ్వడమూ ఒక పటిష్ఠసాధనమనే నిర్ణయానికి వచ్చారు. కళాశాలలను స్థాపించుటకూ గ్రాంటు నిబంధనలను వినియోగించుకొనుటకూకావలిసిన ద్రవ్య వసతులు తమకు ఉన్నట్లు దేశీయులకు లేదనీ, ఈ కారణంచేత బైబిలు బోధించుటకు వీలగునట్లు తాము కళాశాలలను అధిక సంఖ్యలో స్థాపించుకొనవచ్చుననీ వారు అభిప్రాయపడి అధికారులను తమ వైపునకు త్రిప్పుకోకలిగారు.

ఈ సందర్భంలో మిషనరీలు ఇంకొక విధంగా కూడా తమ వాదాన్ని బలపరుచుకొన్నారు. సామాన్య ప్రజలను ఎక్కువ సంఖ్యలో క్రైస్తవులుగా మార్చే ఉద్దేశంతో వారు అనేక కరపత్రాలను పుస్తకాలను దేశభాషలలో ప్రకటిస్తూ వచ్చారు. కాని ప్రజలు అక్షరాస్యులు కాని కారణం చేత వీటిని చదవడం వారికి సాధ్యం కాలేదు. అందుచేత ప్రభుత్వం ఉన్నత విద్యావ్యాప్తికే చేసే ఖర్చును దేశభాషల ద్వారా ప్రాథమిక విద్యా వ్యాప్తికే చేసిన పక్షాన క్రైస్తవ మతవ్యాప్తి సులభసాధ్యం కాగలదని వారు అభిప్రాయపడి, ప్రభుత్వం దీనిపట్ల సుముఖత్వాన్ని వహించేటట్లు చేశారు. ఉన్నత విద్యారంగాన నుండి ప్రభుత్వం విరమించ దలచడానికి ఇది కూడా ఒక కారణమైంది. కారణాలు ఏవైనా మొత్తం మీద విద్యాధికుల ప్రాధాన్యాన్ని రూపుమాపడం అధికారుల ధ్యేయంఅనేది స్పష్టం అయింది. విద్యాధికులు ఒక వర్గంగాను ఉన్నతోద్యోగాలను అనుభవిస్తూ పరిపాలన చక్రాన్ని త్రిప్పుతున్న బ్రిటిష్ ఉద్యోగులు ఇంకొక వర్గంగాను ఏర్పడడం జరిగింది. రాజకీయ రంగంలోని పోరాటమంతా చాలవరకు వీరి మధ్య జరగడం ఆనాటి చరిత్రకు ఒక ప్రధాన లక్షణమైంది.

ప్రభుత్వాన్ని విమర్శించడంలో విద్యాధికులు వార్తా పత్రికలను ఒక ప్రధానసాధనంగా వినియోగిస్తూ వచ్చారు. వీటిలో దేశభాషలలోనివి ప్రభుత్వ విధానాలను మరింత తీవ్రంగా విమర్శించడం పరిపాటి అయింది. 1863 నుండి ప్రతిరాష్ట్రంలోను ఆలాటి పత్రికలలో ప్రచురించబడ్డ ప్రధాన రచనలను ఇంగ్లీషు లోకి తర్జుమా చేసి, వాటిని గురించి వారం వారం నివేదికలను తయారుచేసి రాష్ట్ర ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వానికి సమర్పించే విధానం అమలులోకి వచ్చింది. దాని ఫలితంగా దేశ భాషలలోని వార్తా పత్రికల తీవ్రధోరణిని అధికారులు గ్రహించి వాటిపై నిర్బంధాలను విధించడం అవసరమనే నిర్ణయానికి వచ్చి లిట్టన్ ప్రభువు గవర్నరు జనరలుగా ఉండిన కాలంలో 1878 న దేశభాషా వార్తా పత్రికల చట్టం అనే పేరుతో ఒక చట్టం చేశారు. దీని ఫలితంగా ఈ లాటి వార్తా పత్రికల యొక్కయు, వాటిని నడిపే విద్యాధికుల యొక్కయు

స్వాతంత్ర్యం చాలావరకు తగ్గింది. నిర్బంధాలను దేశభాషా పత్రికల మీద మాత్రమే విధించడం, ఇంగ్లీషు పత్రికలపై విధించక పోవడం విద్యాధికులను మరింత ఎక్కువగా క్రోధావేశుల గావించింది. వారు మామూలు ధోరణిలో ఆందోళనను సాగించారు. బ్రిటిష్‌లోని లిబరల్ పక్షంవారు వీరిపట్ల సానుభూతి కల వారయ్యారు. 1880లో బ్రిటన్‌లో జరిగిన సాధారణ ఎన్నికలలో వారు గెలిచి అధికారానికి రావడం, లిట్టన్ స్థానే రిప్పన్ ప్రభువు గవర్నరు జనరల్ లుగా నియామకంకావడం, అతడు ఈ చట్టాన్ని రద్దుచేయడం జరిగింది. ఈలాటి స్వల్పమార్పులు జరిగినా మొత్తం మీద విద్యాధికవర్గం ఉద్యోగివర్గం—ఈ రెండు వర్గాలమధ్య ఏర్పడిన ద్వేషం తగ్గలేదు, వారి ఆశయాలు భిన్నం కావడమే దీనికి కారణం. విద్యాధికులు తమ దేశాన్ని పాలించుకొనే అధికారంలో కొంత భాగా నైనా సంపాదించదలచినవారు. ఆ అధికారాన్ని పూర్తిగా అనుభవిస్తున్న బ్రిటిష్ ఉద్యోగులు అందులో సహస్రాంశానైనా వదలుకొనుటకు ఇష్టంలేని వారు. వీరి మధ్య పొత్తుకుదరడం అసంభవం. ఈ అధికారవిభజన విషయమై ఏర్ప డిన భిన్నభావాలే స్వాతంత్ర్యోద్యమానికి జన్మస్థానం.

ఇతర దేశాలలో ఉన్నతఉద్యోగి వర్గంకాక, ప్రభువు (లేదా అమెరికాలో ఉన్నట్లు ఒక అధ్యక్షుడు) మంత్రి మండలితో కూడిన ఒక పాలకవర్గం ఉండడం పరిపాటి. పరిపాలనకు సంబంధించిన నిర్ణయాలను చేసే స్వతంత్రాధికారులు వీరే. ఉద్యోగివర్గానికి చెందినవారు ఈ నిర్ణయాలను అమలుపరచే వారుగా మాత్రమే ఉండేవారు. బ్రిటిషపరిపాలన కాలంలో భారతదేశంలోని రాజకీయ వ్యవస్థ దీనికి భిన్నంగా ఏర్పడింది. ఉన్నతోద్యోగివర్గమే పాలకవర్గంగా రూపొందింది. బ్రిటిష్ నుండి వచ్చిన గవర్నరు జనరల్, మద్రాసు బొంబాయిల గవర్నరులు గవర్నరు జనరల్ కార్యనిర్వాహక సభలోని ఇద్దరు ముగ్గురు సభ్యులు తప్ప పాలక వర్గానికి చెందిన వారు మరెవ్వరులేరు. వీరుకూడా దేశానికి కొత్తవారు కావడం చేతను, పరిస్థితులు తెలియని వారు కావడంచేతను, అయిదు సంవత్స రాల కంటె ఎక్కువ కాలం పదవులలో ఉండని వారు కావడం చేతను పరిపా లనకు సంబంధించిన నిర్ణయాలను చేయడంలో ఉన్నతోద్యోగులపై ఆధార పడడం తప్పింది కాదు. మద్రాసుబొంబాయిలు తప్ప తక్కిన రాష్ట్రాలకు ఉద్యోగివర్గానికి చెందిన వారే అధినేతలుగా నియమింపబడేవారు. గవర్నరు జనరల్, గవర్నరుల కార్యనిర్వాహక సభలలో వీరే అధిక సంఖ్యాకులు. ఈ కారణాలమూలంగా ఉన్నతోద్యోగులే దేశానికి పాలకులయ్యారు. ఉద్యోగి వర్గంలోకి భారతీయులకు ప్రవేశం కల్పించిన పక్షాన పాలనాధికారంలో కూడా వారు భాగస్వాములు కాగలరనే భయం వారినిపట్టి పీడించసాగింది. వారి వితండ ధోరణికి దేశంలో ఏర్పడ్డ రాజకీయవ్యవస్థకారణమైంది.

## 6

దేశంలో విద్యాధికుల సంఖ్య పెరిగినా ఆ పెరుగుదల అన్ని రాష్ట్రాలలో అన్ని మతాల వారిలోను, అన్ని భాషలను మాట్లాడే వారిలోను, అన్ని కులాల

వారిలోను ఒకే స్థాయిలో జరగలేదు. ఈ తరతమ భేదం జాతీయత వృద్ధి గాంచడంపై ప్రభావాన్ని వహించింది. ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్న వారే ప్రథమంలో జాతీయాభిమానం అంటే ఏమిటో అర్థం చేసుకొని, ఆలాటి అభిమానం కలవారయ్యారు. వారే ఎక్కువగా రాజకీయ రంగంలో కృషిచేశారు. అన్ని ఉద్యమాలలో వారే నాయకత్వం వహించారు. తక్కిన వారు ఇంగ్లీషు విద్యపట్ల శ్రద్ధవహించునాటికి వారికి ముందు విద్య నేర్చు కొన్న వారు ఉద్యోగాలలోను న్యాయవాదివృత్తి మొదలైన వృత్తులలోను ప్రవేశించి స్థిరపడ్డారు. అందుచేత వీరి మధ్య పోటీ సంభవించడం తప్పిందికాదు. ఈ పోటీలో క్రొత్త వారికి వెంటనే విజయం లభించని కారణాన రెండువర్గాల మధ్య ఒక విధమైన విరోధం ఏర్పడడం, ఈ విరోధాన్ని ఆసరాగా తీసుకొని అధి కారులు స్వార్థానికై వినియోగించు కొనడం, జరిగింది. ఈ ప్రయత్నంలో అధి కారులు వివిధ మతాలవారిమధ్య, వివిధ కులాలవారిమధ్య చీలికలనులేవదీసి వేర్పా టు భావాలను వృద్ధిచేశారు. ఇది కారణంగా జాతీయోద్యమం కొంత బలాన్ని కోల్పోవడం, ప్రముఖవర్గాలవారు కొందరు బ్రిటిష్‌పరిపాలనను సమర్థించి వారితో సహకరించడం జరిగింది. విద్యాభివృద్ధిలో కాలాధారమైన ముందువెనుకలు ఏర్ప డటం రాజకీయాలపై ఏలాంటిప్రభావాన్ని వహించాయో గుర్తించడం అవసరం. బ్రిటిష్‌వారు చాణక్యనీతిని భేదోపాయాన్ని వినియోగించుటకు ఇది అవ కాశాన్ని కల్పించింది.

ఈ తారతమ్యం అనేకులమధ్య ఏర్పడినా హిందువులు ముస్లింల మధ్య ఏర్పడిన దానిని ఎక్కువగా బ్రిటిష్‌వారు తమ స్వార్థానికై వినియోగించు కొన్నారు. అనేక విధాలుగా వీరిమధ్య చీలికలను పెంపొందించారు. తుదకు హిందువులు ఒక జాతివారని, ముస్లింలు వేరొక జాతివారని భావించుటకు కావలసిన పరిస్థితులనన్నిటినీ సృష్టించి, స్వాతంత్ర్యోద్యమం పట్ల ముస్లింలలోని అధిక సంఖ్యాకులను విముఖులుగ జేసి, దేశంలో రెండు స్వతంత్రరాజ్యాలను ఏర్పరచి, వెళ్ళిపొయ్యారు.

1881లో దేశంలోని మొత్తం జనాభాలో హిందువులశాతం 73.21, ముస్లింలశాతం 22 36గా ఉండినా కళాశాలలలో చదివేవారిలో హిందువుల శాతం 89.41గాను ముస్లింలశాతం 3.65గాను ఏర్పడింది. హిందూ విద్యార్థుల సంఖ్య 4,327గాను ముస్లిం విద్యార్థులసంఖ్య 197గాను ఉండినవి. ప్రాథమిక మాధ్యమిక స్థాయిలలో ఇంతటివైపరీత్యం లేకపోయినా మొత్తంమీద ఇంగ్లీషు విద్య ముస్లింలను ఎక్కువగా ఆకర్షించలేక పోయిందని గుర్తించడం అవసరం.

ఈ వైపరీత్యానికి హిందువులు కారణంకాదు. దీని కంతా తరతరాలుగా ఏర్పడిన ముస్లిం సాంఘికవ్యవస్థ ప్రధానకారణం. హిందువులలో మధ్యతరగతి ఏర్పడినట్లు వారిలో మధ్య తరగతి ఏర్పడలేదు. వారిలో ఉన్నతశిఖరాన నవాబులు, జమీందార్లు, తాలూకాదార్లు మొదలైన వారితో కూడిన ఒక అల్పసంఖ్యాక ధనికవర్గం, క్రింది అంతస్థులో కటిక దారిద్ర్యానికి గురి అయిన రైతువర్గం ఉంటూ వచ్చాయి. ధనికవర్గానికి ఉద్యోగాపేక్ష లేనికారణంగా

ఇంగ్లీషు విద్యవారిని ఆకర్షించిందికాదు. క్రింది అంతస్థులోని వారు పేదరికాన్ని అనుభవించేవారు కావడంచేత పిల్లలను ఇంగ్లీషు విద్యాలయాలకు పంపించలేక పోయినారు. విద్యలో వారు వెనుకబడిపోయినందుకు ఇదే ప్రధానకారణమని చెప్పుటకు ఇంకొక ఆధారంకూడా ఉంది.

దేశంలోని ముస్లింలలో సగభాగం బెంగాలు రాష్ట్రంలోనివారు. వీరిలో కొన్ని వందలకుటుంబాలు మాత్రం విదేశాలనుండి వచ్చిన పఠాన్‌లు, షేక్కులు మొదలైనవారి సంతతికి చెందినవారు. సిరిసంపదలన్నీ వీరివే. తక్కిన రెండు కోట్లముస్లింలు 12, 13 శతాబ్దాలలో హిందువులలోని క్రిందికులాలకు చెంది, ఇస్లాంమతాన్ని స్వీకరించినవారు. మతం మార్చుకొనడం ద్వారా వారి ఆర్థికస్థితి ఏవిధంగా కూడా మెరుగుపడలేదు. అంతకుపూర్వం రైతులుగాను కూలీలుగాను ఏలాటిదారిద్ర్యాన్ని అనుభవిస్తూ వచ్చారో ఆలాటిదారిద్ర్యాన్నే తర్వాత కూడా అనుభవిస్తూవచ్చారు. అందుచేతనే వారు వారి పిల్లలను ఇంగ్లీషు విద్యాలయాలకు పంపలేక పోయారు. కాని ఈనాటి ఉత్తర ప్రదేశ్‌లో ముస్లింల ఆర్థిక స్థితి ఇంతకంటె ఎంతో మెరుగుగా ఉండేది. అనేక శతాబ్దాలుగా ఈ ప్రాంతం భారతదేశంలోని ముస్లింసంస్కృతికి కేంద్రంగా వర్ధిల్లింది. ముస్లింలలో అనేకులు భూస్వాములుగాను ఉద్యోగాలు చేసేవారుగాను ప్రసిద్ధిగాంచారు. బెంగాలులో ఇంగ్లీషు విద్య ప్రవేశపెట్టబడిన తర్వాత చాలా కాలంగడిచిన పిమ్మటనే ఈ రాష్ట్రంలో దానికి ప్రవేశం లభించింది. మధ్యతరగతికిచెందిన ముస్లింలు అనేకులు ఇక్కడ నివసించేవారు కావడం చేత వారు ఇంగ్లీషువిద్యను నేర్చుకొనడంలోను ఉద్యోగాలు సంపాదించడంలోను హిందువులకంటే కూడా ఎక్కువ ఉత్సాహాన్ని ప్రదర్శించారు. జనాభాలో వారిశాతం 13.4 మాత్రమే అయినా 1881లో విద్యాలయాలలోని వారి శాతం 20గాను, 1887లో 29గాను ఉండినది. పంజాబులో కూడా ఈలాటి పరిస్థితి కనుపించింది. దేశం మొత్తంపైన ఇంగ్లీషు విద్యలో ముస్లింలు వెనుకబడిఉండినా కొన్ని రాష్ట్రాలలో వారు హిందువుల వలె ముందంజవేయగలిగారనే విషయాన్ని గుర్తించ వలసిఉంది. వారివెనుకబడిన తనం ప్రధానంగా బెంగాలు రాష్ట్రానికి మాత్రమే వర్తిస్తుంది.

ఈలాటిస్థానిక భేదాలను అధికారులు గాని ముస్లిం నాయకులు గాని గమనించక ముస్లింలు అందరు వెనుకబడిన వారనే అభిప్రాయాన్ని వ్యాపింప జేశారు. బెంగాలులో హిందూ విద్యాధికుల ఆందోళన తీవ్రరూపం ధరించిన కారణంగా ముస్లింల విద్యాసమస్య చాలా ప్రాధాన్యాన్ని వహించింది.

ఆర్థిక పరిస్థితులతోపాటు మరికొన్ని కారణాలుకూడా ముస్లింలను వెనుకబడిన వారుగా చేసింది. వారిలో మతం పట్ల ఎక్కువ అభిమానం ఉండేది. మతాధారమైన విద్యయే వాస్తవమైన విద్య అనీ, ఇంగ్లీషువిద్యా దీనికి తోడ్పడేది కాదనీ పాశ్చాత్యుల నుండి నేర్చుకొనదగిన విషయాలు ఏవీ లేవనీ, అన్ని విషయాలు పర్షియన్, అరబ్బీ భాషలలోని గ్రంథాలలో ఉన్నట్టివే అనీ, ఈ భాషలకు ప్రాధాన్యం లభించని ఇంగ్లీషు విద్యావిధానం ప్రయోజన రహితమనీ వారిపై నాయ

కత్వాన్నివహించిన మత బోధకులు ప్రచారాన్ని సాగించారు. ఇది కూడా వారి వెనుకబడినతనానికి కారణమైంది.

1869–70 వరకు అధికారులు ముస్లింల విద్యపట్ల ఏలాటి ప్రత్యేక శ్రద్ధను వహించలేదు. కాని అప్పటికి విద్యాధికులైన హిందువులు — వారిలో ప్రధానంగా బెంగాలీలు — జాతీయాభిమానం కలవారై ప్రభుత్వ విధానాలను అతి తీవ్రంగా విమర్శించేవారయ్యారు. వీరిని ప్రతిఘటించడం అధికారులకు చాలా అవసరంగా కనుపించి, దానిని తీర్చుకొనడంలో ముస్లింలకు ప్రత్యేక సదుపాయాలు కల్పించడం ఒక పటిష్ట సాధనమనే భావం వారిలో నాటుకొన్నది.

విద్యలో వెనుకబడినవారు దేశంలో ముస్లింలుకానివారు ఎందరో ఉండినా వారి విషయాన్ని అధికారులు ఏవిధంగాను పట్టించుకొనకుండా ముస్లింలపైన మాత్రమే అభిమానం చూపుటకు కొన్ని కారణాలు ఉండినవి. వారు అనేక సంవత్సరాల క్రిందట లేవదీసిన వాహాబీ ఉద్యమం 1869 నాటికి కూడా ప్రాబల్యాన్ని కోల్పోలేదు. వారిమూలంగా ఎప్పటికైనా తమ అధికారానికి ప్రమాదం సంభవించగలదనే భయం బ్రిటిష్‌వారినిపీడించసాగింది. 1871 సెప్టెంబరులో ఒక వాహాబీ కలకత్తా న్యాయస్థానంలో ప్రధానన్యాయమూర్తిని హత్యచేశాడు. 1872 లో గవర్నరు జనరల్ మేయోకుకూడా ఇదేగతి పట్టింది. వీటిఫలితంగా అధికారుల భయం మరింత పెరిగింది. ముస్లింల విద్యపట్ల ఉద్యోగాలపట్ల ప్రత్యేక శ్రద్ధను చూపిన పక్షాన ఈ తిరుగుబాటు ఉద్యమం సమసిపోగలదని అధికారులు అభిప్రాయపడ్డారు. ఇదిగాక హిందువులు పిరికివారనీ, ముస్లింలు పౌరుషవంతులనీ, 1857-58 తిరుగుబాటులో ముస్లింలదే ప్రధానపాత్ర అనీ, ఎన్నటికైనా ప్రజల తిరుగుబాటు జరిగేపక్షాన అది ముస్లింల తిరుగుబాటుగానే ఉంటుందనీ, అందుచేత వారిని తృప్తిపరచడం బ్రిటిష్ సామ్రాజ్య స్థిరత్వానికి అవసరమనీ అధికారులు భావించసాగారు. తమకు పూర్వం భారతదేశాన్ని పాలించినవారు ముస్లింలని, తమ అధికారం స్థాపితం కావడంచేత నష్టపడినవారు వీరేఅని, వారికి లాభం చేకూర్చే విధానాలను ప్రవేశపెట్టడం ధర్మమనీ అధికారులు తమ పక్షపాతధోరణిని సమర్థించుకొన్నారు. వీటి అన్నిటికి తోడుగా ఇంకొక విషయం కూడా వారిని ప్రోత్సహించింది. హిందూమతం భారతదేశానికి మాత్రమే పరిమితమైనట్టిది. ఇతర దేశాలలో హిందువులకు ఏలాటి పలుకుబడి లేదు. ఇస్లాం మతం భారతదేశానికి ఆవల పశ్చిమ మధ్య ఏషియాలోను, ఉత్తర ఆఫ్రికాలోను, ఆగ్నేయ ఏషియాలోను వ్యాపించినట్టిది. భారతదేశంలోని ముస్లింలకు ఏదైనా బ్రిటిష్‌వారి మూలంగా అన్యాయం జరిగినా, న్యాయం జరగకపోయినా అది యావత్ ముస్లిం ప్రపంచపు అసంతృప్తికి కారణమై పశ్చిమ ఏషియాలోను, ఆఫ్రికాలోను బ్రిటిష్‌వారి అధికార విస్తరణకు ఆటంకం కలిగించవచ్చు. ఈ పరిస్థితిలో భారతదేశంలోని ముస్లింలకు ప్రత్యేక సదుపాయాలను అందజేసిన పక్షాన ఈలాటి ఆటంకం తొలగి అందరి సానుభూతిని సంపాదించే అవకాశం ఏర్పడుతుంది. ఈలాటి కారణాలన్నిటిఫలితంగా ముస్లింల విద్యపట్ల ఇతర సదుపాయాల

పట్ల ప్రత్యేక శ్రద్ధను చూపుటకు అధికారులు 1870 తర్వాత సిద్ధపడ్డారు.

ముస్లిం నాయకులు కొందరు కోరినట్లు ప్రాథమిక మాధ్యమిక విద్యాలయాలలో ఉర్దూభాషను బోధనాభాషగా ప్రవేశపెట్టారు. ముస్లింలు అందరికీ ఉర్దూ మాతృభాష కాకపోయినా వారిలో ఐకమత్యం వృద్ధిగాంచుటకు ఇది అవసరమని నాయకులు అభిప్రాయపడడంచేత ఈ మార్పు జరిగింది. ఈలాటి సదుపాయాలను ఆచరణయోగ్యం చేసే నిమిత్తం ప్రత్యేక ముస్లిం విద్యాలయాలను స్థాపించి వాటి పోషణకుగాను ఎక్కువ గ్రాంటులను మంజూరుచేశారు. ఇంగ్లీషు నేర్చుకొనే ముస్లిం విద్యార్థులకు పర్షియన్ అరబ్బీ భాషలను నేర్చుకొనుటకు సదుపాయాలను కల్పించారు.

ఈ మార్పుల మూలంగా ఇంగ్లీషువిద్య ముస్లింలకు ఎక్కువగా ఆకర్షణీయమైనట్లు కనుపించకపోయినా వారిలో వేర్పాటుభావాన్ని మాత్రం పెంపొందించింది. హిందువులు, క్రైస్తవులు, పార్శీలు మొదలైనవారితో కలిసి ఒకే విద్యను నేర్చుకొనుటకు బదులు వారు ప్రత్యేక విద్యాలయాలలో ప్రత్యేక విద్యను నేర్చుకొనేవారయ్యారు. తక్కినవారితోకలిసి విద్యను నేర్చుకొన్నవారుకూడా పర్షియన్ అరబ్బీ భాషలపట్ల ప్రత్యేకశ్రద్ధను వహించినవారు కావడంచేత వారి సాంస్కృతిక దృక్పథం తక్కిన భారతీయవిద్యాధికుల దృక్పథానికంటె భిన్నమై తామొక ప్రత్యేక జాతికి చెందినవారనే భావాన్ని వారిలో వృద్ధిపరచింది. వీటి అన్నిటి ఫలితంగా భారతీయులందరు ఒకేజాతికి చెందినవారనే భావానికి బదులు ముస్లింలు ఒక ప్రత్యేక జాతికి చెందినవారనే భావానికి ప్రాబల్యం లభించింది.

ఇన్ని సదుపాయాలు అనుభవించడంమూలాన క్రమక్రమంగా ముస్లింలు హిందువులతోనూ తదితరులతోనూ సమానంగా పోటీపరీక్షలలో పాల్గొని ఉద్యోగాలను సంపాదించే అవకాశం ఏర్పడినా అధికారులు ఉద్యోగాల విషయంలో కూడా వారికి ప్రత్యేక సదుపాయాలను కల్పించారు. పోటీపరీక్షలతో సంబంధం లేని ఉద్యోగాలలో సాధ్యమైనంతవరకు ముస్లింలను అధికసంఖ్యలో నియమించవలసిందిగా కేంద్రప్రభుత్వం 1885లో రాష్ట్రప్రభుత్వాలను ఆదేశించింది. ఈ విధానంకూడా వారిలో వేర్పాటుభావాన్ని మరింతగా వృద్ధిచేసింది.

విద్యాభివృద్ధి విషయంలో మతదృష్ట్యా మాత్రమేగాక ఇతరవిధాలుగా కూడా తారతమ్యాలు ఏర్పడ్డాయి. బ్రిటిష్ పరిపాలన ముందుగా స్థాపింపబడిన కోస్తా ప్రాంతపు బెంగాలు మద్రాసు బొంబాయి రాష్ట్రాలలో ఇంగ్లీషువిద్య ఎక్కువగాను ఉత్తరప్రదేశ్, అస్సాం, మధ్యప్రదేశ్, పంజాబు మొదలైన రాష్ట్రాలలో చాలా తక్కువగాను వ్యాపించింది. దీని ఫలితంగా కోస్తా రాష్ట్రాలలో జాతీయోద్యమం అంకురించి వృద్ధిగాంచినట్లు ఇతర రాష్ట్రాలలో అంకురించి వృద్ధిగాంచలేదు. వీటిలో ఈ మార్పు కొంత ఆలస్యంగా జరిగింది. 1918-19 ప్రాంతాన గాంధీమహాత్ముడు రాజకీయాలపై నాయకత్వం వహించేవరకు కోస్తా రాష్ట్రాలే రాజకీయాలకు కేంద్రంగా ఉండేవి. అటుతర్వాత పరిస్థితులు మారి గుజరాత్, ఉత్తరప్రదేశ్ మొదలైనవి ప్రాధాన్యం వహించాయి. దీనితో

బెంగాలు ప్రాధాన్యం కొంతవరకు తగ్గింది. విద్యాభివృద్ధికి రాజకీయ చైతన్యానికీగల పరస్పర సంబంధాన్ని ఈ పరిణామం స్పష్టంచేస్తూ ఉంది.

తొలిదశలో విద్యాభివృద్ధి ఎక్కువగా బెంగాలులో జరిగింది. ఉద్యోగాలకు ఇంగ్లీషువిద్య అవసరం కావడంచేత బెంగాలీలు బెంగాలులోనేగాక ఒరిస్సా, బీహారు, ఉత్తరప్రదేశ్, పంజాబు, అస్సాం మొదలైన రాష్ట్రాలన్నిటిలో ఉద్యోగాలను అనుభవించేవారయ్యారు. వీటిలో ఇంగ్లీషువిద్య వ్యాపించునాటికి స్థానిక విద్యావంతులు బెంగాలీలతో పోటీ చేయవలసివచ్చింది. అందుచేత ఈ రెండు వర్గాలమధ్య కొంత అసూయ అసహనం ఏర్పడడం, స్థానికులలో జాతీయాభిమానంతోపాటు ప్రాంతీయాభిమానం అంకురించి వృద్ధిగాంచడం జరిగింది. చాలాకాలాననుండి ఒరిస్సా బీహార్లు బెంగాలురాష్ట్రంలో కలిసిఉండేవి. కాని వీటిలోని విద్యార్థులలో ఉద్యోగాలు కారణంగా ప్రాంతీయాభిమానం ఏర్పడడంతో వీరు ప్రత్యేక రాష్ట్రాలను కోరేవారయ్యారు. ఇదేవిధంగా మొదటినుండి ఆంధ్ర జిల్లాలు మద్రాసురాష్ట్రంలో కలిసిఉండేవి. కాని రాజధానియైన మద్రాసు తమిళ ప్రాంతంలో ఉన్నందునను, ఇంగ్లీషువిద్య ప్రథమంలో మద్రాసులోను ఇతర తమిళ జిల్లాలలోను వ్యాపించినందునను, ఆంధ్ర జిల్లాలలో ఈలాటి వ్యాప్తి జరిగేనాటికి ఈ జిల్లాలలో తమిళులు అధిక సంఖ్యలో ఉద్యోగాలలో ఉండడం, వారితో ఆంధ్ర విద్యార్థులు పోటీపడటం తప్పిందికాదు. క్రమక్రమంగా ఇది ప్రత్యేక ఆంధ్రరాష్ట్రఉద్యమానికి దారితీసింది. బొంబాయి రాష్ట్రంలో కర్ణాటక జిల్లాలలోకూడా ఈలాటి పరిస్థితులే ఏర్పడడంతో కర్ణాటకులుకూడా ప్రత్యేక రాష్ట్రాన్ని కోరేవారయ్యారు. అన్ని ప్రాంతాలలో ఒకే కాలంలో ఒకేస్థాయిలో విద్యాభివృద్ధి జరగకపోయినందున జాతీయాభిమానంతోపాటు ప్రాంతీయాభిమానం వృద్ధిపొందడం జరిగింది. ఈ రెండు అభిమానాల మధ్య సమన్వయాన్ని కూర్చడం ఒక సమస్యగా ఏర్పడింది. ఈ సమస్యకు ఇతర కారణాలుకూడా ఉండినా విద్యావ్యాప్తికి సంబంధించిన తారతమ్యాలు వాటిని బలపరచినట్లు చెప్పవచ్చు.

విద్యావ్యాప్తికి సంబంధిచిన తారతమ్యాలు కులాలమధ్య కూడా కనుపించాయి. ప్రథమదశలో బెంగాలు రాష్ట్రంలో బ్రాహ్మణ కాయస్థ వైద్య కులాలవారు, మద్రాసు బొంబాయి రాష్ట్రాలలో బ్రాహ్మణులు అధిక సంఖ్యలో ఇంగ్లీషు విద్యనభ్యసించారు. వీరు అనాదిగా విద్యారంగంలో ప్రాధాన్యం వహించినట్టివారు. హిందూసమాజంలోని వర్ణవ్యవస్థకు ఇది ఒక లక్షణం. ఈ సనాతనసంప్రదాయానుసారంగా పైన పేర్కొన్న కులాల వారు ఇంగ్లీషువిద్యను మొదట నేర్చుకొన్నారు. అందుచేత వారేఎక్కువగా ఉద్యోగాలలో ప్రవేశించడం జరిగింది. తక్కిన కులాలలోని ధనికులు కూడా చాలా కాలం వరకు ఇంగ్లీషు విద్యపట్ల శ్రద్ధవహించలేదు. వారు శ్రద్ధవహించునాటికి బ్రాహ్మణాదులు ఉద్యోగాలలో స్థిరపడిపోయారు. వీరి మధ్య పోటీఏర్పడడం, మద్రాసు బొంబాయి రాష్ట్రాలలో బ్రాహ్మణేతర ఉద్యమం బయలుదేరడం, అందులో చేరిన వారనే

కులు తొలిదశలో స్వాతంత్ర్యోద్యమం పట్ల విముఖులై బ్రిటిష్ పరిపాలనను సమర్థించడం జరిగింది. ఇది జాతీయాభిమాన కులాభిమానాల మధ్య సంఘర్షణకు దారితీసింది.

ఇదేవిధంగా జమీందార్లు తాలూకాదార్లు అనాదిగా ధనికవర్గానికి చెందినవారుకొందరు ఇంగ్లీషు విద్య పట్ల ఆసక్తి చూపలేదు. ప్రముఖ వర్గాల వారు ఈ విధంగా అనాసక్తులు కావడం బ్రిటిష్ అధికారులకు ఆశాభంగం కలిగించింది. బ్రిటన్‌లో ఈ వర్గాలకు చెందిన వారే ఎక్కుగా విశ్వవిద్యాలయాలలో ప్రవేశిస్తూ ఉండేవారు. భారతదేశంలో కూడా అలాగే జరుగుతుందని అధికారులు భావించారు. కాని పరిణామం అన్యథాగా రూపొందింది. అలాగు రూపొందినా బ్రిటిష్ వారికి దానిమూలంగా ఎక్కువ నష్టంకలగలేదు. ఈ వర్గాల వారు మధ్య తరగతికి చెందిన విద్యాధికులతో జాతీయోద్యమంలో కలియడం మాని బ్రిటిష్‌పరిపాలనను సమర్థించే వారయ్యారు.

విద్యాభివృద్ధి విషయంలో పరిపరి విధాలుగా ఏర్పడిన తారతమ్యాలు జాతీయోద్యమంపై ప్రభావం వహించినవనే విషయాన్ని గుర్తించడం అవసరం. విద్యావిషయంలో వివిధ వర్గాల మధ్య ఏర్పడిన తారతమ్యాలు జాతీయత పట్ల కూడా వారిలో తరతమభేదాలను కల్పించాయి.

## 6

1858 తర్వాత విద్యాధికులలో జాతీయతవృద్ధిగాంచడంలో భారతదేశంలోని బ్రిటిషవారి జాత్యహంకారం ఒకగొప్ప సాధనంగా పరిణమించింది. 1858 కి పూర్వంకూడా వారిలో ఈఅవలక్షణం ఉండేది-కాని అది అటుతర్వాత కొన్ని పరిస్థితుల ప్రభావంచేత హద్దులుమీరి తారాపథాన్ని అందుకొన్నది.

1857-58లో సంభవించిన మహత్తరమైన తిరుగుబాటును వారు అణచగలగడం ఈ పరిస్థితులలో ఒకటి. ఆసంఘటనలో ఉభయపక్షాల వారు ఒకరిపట్ల ఇంకొకరు అతి దారుణంగా ప్రవర్తించారు. బ్రిటిష్‌వారు విజయాన్ని సాధించినవారు కావడంచేత భారతీయులపై పగదీర్చుకొనే ధోరణిలోపడి వారిని సర్వవిధాలా అవమానపరచడానికి కృతనిశ్చయులయ్యారు.

కంపెనీ పరిపాలనకాలంలో భారత బ్రిటన్ దేశాలమధ్య రాకపోకలు చాలా ఆలస్యంతో కూడుకొని ఉండేవి. ఒక దేశాననుండి ఇంకొకదేశాన్ని చేరడానికి ఆరునెలలుపట్టేది. ఆకారణంచేత బ్రిటన్ నుండి అధికారులుగాను అనధికారులుగాను భారతదేశానికి వచ్చినవారు సంవత్సరాలకాలం ఇక్కడ ఉండిపొయ్యేవారు. తరుచూ సెలవులమీద స్వదేశానికి వెళ్లడం, తమ బంధువులను స్నేహితులను చూడడం కష్టసాధ్యంగా ఉండేది. ఆపరిస్థితులలో వారుభారతదేశంలోని ప్రముఖవర్గాల వారితో దగ్గరసంబంధం పెట్టుకొనడం, వారివిందులలోను పండుగలలోను వినోదాలలోను పాల్గొనడం జరుగుతూ ఉండేది. వారిలో కొందరు భారతీయ స్త్రీలను పెండ్లాడడం కూడా ఉండేది. ఈ పరిస్థితులలో రెండు

జాతులవారి మధ్య కొంతవరకైనా స్నేహసంబంధాలు ఏర్పడి ఉండేవి.

కాని పొగయోడలు వాడుకలోకి రావడం మూలానను, 1869లో సూయజుకాలువ నిర్మాణం జరగడం మూలానను 15 రోజులలో భారతదేశాన నుండి బ్రిటన్‌కు వెళ్లడం సాధ్యమైంది. దీని ఫలితంగా ఇక్కడి బ్రిటిష్‌వారు తరుచుగా స్వదేశానికి వెళ్లడం, అక్కడి తమవారితో సంబంధాలు బలవరచుకొనడం, భారతదేశంపట్ల భారతీయులపట్ల అభిమానం తగ్గడం జరిగింది. తమ అధికారానికి ఆర్థికలాభానికి ఈదేశం ఒక సాధనగా మాత్రమే వారు పరిగణించసాగారు. ఎప్పుడెప్పుడు నాలుగుడబ్బులు కూడబెట్టుకొని స్వదేశానికి వెళ్ళిపోవడమా అనేదే వారికి లక్ష్యం అయింది.

ప్రయాణసౌకర్యాలు ఏర్పడిన కారణంగా బ్రిటన్ నుండి భారతదేశానికి స్త్రీలు రావడం సులభమైంది. ఇందుచేత పురుషులు వారినే వివాహమాడడం, భారతదేశపు స్త్రీలతో ఏలాటి సంబంధాలు పెట్టుకొనవలసిన అవసరం లేకపోవడం జరిగింది. బ్రిటిష్‌స్త్రీలు భారతీయులపట్ల మరింత చులకనభావం కలవారయ్యారు. వీరిమధ్య ఏలాటి సంబంధం లేక పోవడమే దీనికి కారణం. పురుషులు స్త్రీలు ప్రత్యేక క్లబ్బులను స్థాపించుకొని, తమతీరుబడి కాలాన్నంతా వాటిలో గడపడం, ఆక్లబులలోకి ప్రముఖులైన భారతీయులనుకూడా రానీకపోవడం పరిపాటిఅయింది. అధికార అనధికార బ్రిటిష్‌వారి ప్రపంచం ఒకప్రత్యేక ప్రపంచంగా రూపొందింది. దీనికిన్నీ భారతీయుల ప్రపంచానికీ మధ్య ఒకఅఖాతం ఏర్పడింది. తాము స్వర్గవాసులైనట్లు భారతీయులు భూలోకవాసులైనట్లు బ్రిటిష్‌వారు ప్రవర్తించసాగారు.

ఈలాటి పరిస్థితుల ప్రభావంచేత భారతీయులను సర్వవిధాలా అవమానపరచడం వారికి లక్షణమైంది. వారినికొట్టడం, తన్నడం, తిట్టడం వారికొక క్రీడగా పరిణమించింది. తెల్లదొర వీధులలో నడుచునప్పుడు తక్కినవారు ఒక పక్కకు తొలగిపోయి అతనికి సలాము చేయవలసిందే. గుర్రంపైస్వారి చేసే భారతీయుడు వెంటనేదిగి నమస్కారం చేయవలసిందే ఆన్యథాగా ప్రవర్తించిన వారికి పాదతాడనం తప్పేదికాదు. అర్జీలు దాఖలు చేసుకొనేవారు అధికారుల కాళ్లమీద పడడం మనవారికి అలవాటు. కాని అధికారులువారిపట్ల సానుభూతి చూపుటకు బదులు వారిని కాళ్లబూట్లతో తన్నడం జరిగేది. రైలుపెట్టెలలో తెల్లవారితో ప్రయాణం చేయడానికి సాహసించిన భారతీయులు ఎంతటిగొప్పవారైనా వారికి కూడా ఇదేగతిపట్టేది. ఒకప్పుడు తన నౌకరుపట్ల ఆగ్రహాన్ని ప్రదర్శించిన పోలీసు అధికారి తనవద్ద పనిచేసే బ్రాహ్మణకాన్‌స్టేబిల్ తలపైన పాదరక్షలు పెట్టాడట! తేయాకుతోటల యజమానులు - వీరందరు తెల్లదొరలు- కూలివాండ్ర విషయంలో అమానుషంగా ప్రవర్తించడం సర్వసాధారణమైంది. గర్భిణీ స్త్రీలను కూడా వారు ఇదేవిధంగా హింసించేవారు.

ఇంగ్లీషు విద్యనభ్యసించిన కారణంగా తమపట్ల తెల్లదొరలు ఎక్కువ గౌరవంతో ప్రవర్తించగలరని విద్యాధికులు అభిప్రాయపడుతూ ఉండేవారు.

కాని అలాటిది ఏదీజరగలేదు. విద్యాగంధం లేని వారిపట్ల వారు ఏలాగు ప్రవర్తించేవారో అదేవిధంగాను ఒక్కొక్కప్పుడు అంతకంటే హీనంగాను - వీరి పట్ల ప్రవర్తించేవారు. ఈలాటి అవమానానికి తమవారంతా గురికావడం విద్యాధికులకు మరింత క్రోధావేశాలను కలిగించింది. ఈలాటి ప్రవర్తనను ప్రదర్శించిన తెల్లవారిలో అనేకులు ఏలాటి విద్యగాని సంస్కారంగాని లేనట్టి సామాన్యులు. తాము పాలక జాతికి చెందినవారనే అహంకారంచేత వారీలాగు ప్రవర్తించడం పరువుమర్యాదలుగల భారతీయులెవ్వరు సహించరైరి. వారిలో - విద్యాధికులతోసహా - జాతీయాభిమానం అంకురించి వృద్ధిగాంచడానికి ఇది ఒక బలమైన కారణమైంది.

బ్రిటిష్‌వారు చట్టబద్ధమైన వ్యవస్థను చట్టసమత్వాన్ని ప్రవేశపెట్టారు. కాని అవి భారతీయుల మధ్య సంభవించే వివాదాల పరిష్కారానికి మాత్రమే వినియోగమైనాయి. తెల్లవారు భారతీయులపై ఏలాటి నేరాలు చేసినా వారు శిక్షనుండి తప్పించుకొని పొయ్యేవారు. న్యాయాధీశులు వారికి శిక్షవిధించినా అది చాలా తక్కువ శిక్షగా ఉండేది. హత్యగావించిన వారికి మరణశిక్ష మామూలైనా హంతకులు తెల్లవారైన పక్షంలో వారు చేసిన నేరం హత్యకాదనీ, ప్రాణాలను కోల్పోయినవారు ఏదో జబ్బుచేత పీడింపబడుచుండిన వారనీ న్యాయస్థానాలవారు వారికి స్వల్పశిక్ష విధించడం మామూలైంది. భారతీయులకు అన్యాయం జరుగుతున్నదని వార్తాపత్రికలు మొరపెట్టుకొన్నా అది ఒక అరణ్యరోదనమై పోయింది. దానిని ఆలకించేవారు లేక పొయ్యారు. లిట్టన్‌వంటి రాజప్రతినిధులు కొందరు న్యాయవిచారణలోని లోపాలను ఖండించిన మాట వాస్తవమే. కాని దాని వలన ఏలాటి లాభమూ లేకపోయింది. న్యాయస్థానాలలో జాతివిచక్షణ లోతుగానాటుకొని పోయింది.

ఇదేకాలంలో పాశ్చాత్య శాస్త్రవేత్తలు కొందరు హేతువాదానికి నిలబడని సిద్ధాంతాలను కొన్నిటిని ప్రతిపాదించి, ప్రకృతి సిద్ధంగా శ్వేతజాతివారు ఉత్తములనీ, ప్రపంచాన్ని జయించి పాలించుటకు గల అర్హతలన్నీ వారికే కలవనీ, రంగుజాతులవారు వారికి సర్వదాలోబడి ఉండేటట్లు సృష్టిజరిగినదనీ ప్రచారం చేయసాగారు. వారు వ్రాసిన గ్రంథాలకు ఆరోజులలో చాలా ప్రాబల్యంలభించింది. బ్రిటిష్‌వారిలో జాత్యహంకారం ప్రబలడానికి ఇదికూడా ఒకసాధనమైంది. భారతీయులు భయానికేగాని నయానికి లొంగరనే దురభిప్రాయం కూడా వీరిలో వ్యాపించింది. తాము దేశాన్ని జయించిన కారణంగా తమమానప్రాణాలు భారతీయుల మానప్రాణాలకంటే ఎక్కువ విలువగలిగినవనీ, విలువలేని భారతీయులప్రాణాలకు నష్టం కలిగించినా అందులో అవినీతిగాని అధర్మంగాని లేదని కూడా వారు భావించసాగారు.

భారతదేశంలోని తమ సామ్రాజ్య భవిష్యత్తును గురించి బ్రిటిష్ ప్రముఖులు కొందరు కంపెనీ పరిపాలన కాలానుండి తమ అభిప్రాయాలను వ్యక్తం చేస్తూఉండేవారు. వారిలో కొందరు తమసామ్రాజ్యం శాశ్వతంగా ఉండజాలదనీ,

ప్రపంచచరిత్రలో ఇతర సామ్రాజ్యాలు కాలవాహినిలో కలిసిపోయినట్లు తమది కూడా ఏనాటికో ఒకనాటికి అదృశ్యం కావడం తప్పదనీ, కాని ఆనాటికి భారతీయులు స్వయంగా తమదేశాన్ని తామే పాలించుకొనగల శక్తిసామర్థ్యాలను సంపాదించడం అవసరం అనీ, ఆలాగువారిని తర్ఫీదుచేయడం తమకర్తవ్యమనీ చెప్తూ ఉండేవారు. ఈలాటి వారిసంఖ్య చాలా స్వల్పమైనా కొందరైనా ఈలాగు భావించడం గణనీయం. కాని 1858 తర్వాత ఈవిధంగా భావించేవారి సంఖ్యపూర్తిగా తగ్గిపోయింది. బ్రిటిష్‌సామ్రాజ్యం శాశ్వతంగా నిలబడతగ్గదని, ఆలాగు అది నిలబడేటట్లు చేయడం తమకర్తవ్యం అనీ అధికారులందరూ భావించసాగారు. వారిజాత్యహంకారానికి, భారతీయులపట్ల వారి నిరాదరణకు ఇది కూడా కారణమైంది.

దీని ఫలితంగా వారు విద్యాధికులపట్ల విరోధభావం కలవారయ్యారు. తమ పరిపాలన విధానాన్ని విమర్శించడంలో విద్యాధికులు చూపసాగినపట్టుదల వారి కెంతమాత్రమూ నచ్చలేదు. ఎన్నటికైనా తమసామ్రాజ్యానికి వీరిమూలంగానే ప్రమాదం సంభవించగలదనీ, అది జరగకపూర్వమే వారిని అణచివేయడం అవసరమనీ వారు భావించసాగారు. ఈ రెండు వర్గాలమధ్య విరోధం ప్రబలడానికిన్నీ, విద్యాధికులలో జాతీయత వృద్ధిగాంచుటకున్నూ, అధికారులపట్ల వారి ద్వేషం ముదురుటకున్నూ ఇది దోహదకారి అయింది.

ఈసందర్భంలోనే అధికారులు జమిందారులను, క్షాత్రాన్ని ప్రదర్శించే శిక్కులు మొదలైన వర్గాలను, అల్పసంఖ్యాకులైన ముస్లింలను, విద్యలో వెనుకబడిన కులాల వారినీ విద్యాధికులపట్ల విరోధం వహించేవారుగా ఉసికొల్పడంకూడా వారనుసరించిన రాజనీతికి ఒకలక్షణం అయింది. చతుర్విధోపాయాలలో భేదోపాయంవారిని అత్యధికంగా ఆకర్షించింది దీనితో వారు దానోపాయాన్నికూడా మిళితంచేసి, ఈవర్గాలవారికి ప్రత్యేకములైన సదుపాయాలు కల్పించారు.

ఈవిధంగా 1858 తర్వాత బ్రిటిష్‌వారిలో వృద్ధిగాంచిన జాత్యహంకారమూ దానితో సన్నిహిత సంబంధం గల వారిరాజనీతి విద్యాధికులలోని జాతీయతను మరింతగా వృద్ధి చేసింది.

చదువదగిన గ్రంథాలు :

B. T. Mceully : English Education and Origins of Indian Nationalism.

Bharatiya Vidya Bhavan Vol—10.

Tara chand: History of Freedom Movement in India Vol, II.

Eric Stokes : The English utilitarians and India.

# అధ్యాయము - 3

## ఆర్థిక పరిస్థితులు - జాతీయత

"ధనమూల మిదం జగత్" అనే పెద్దల వాక్యం ఒకటి ఉంది. ధనం లేనిదే మానవజీవితం సాగదని దానిభావం. అర్థం ధనం అనేవి పర్యాయపదాలు. ఆర్థిక పరిస్థితులంటే అర్థోత్పత్తికి దాని పంపకానికి వినియోగానికి సంబంధించిన పరిస్థితులు. ఇవి 1858 తర్వాత చాలా వరకు దిగజారిపోవడమూ, దానికి బ్రిటిష్‌పరిపాలనవిధానం కారణంకావడమూ ప్రజలలో జాతీయత పెంపొంద డానికి సాధనాలైనాయి. ఏవిధంగా ఇవి సాధనాలైనాయో తెలుసుకోవడం అవసరం.

అర్థోత్పత్తికి వ్యవసాయము, పరిశ్రమలు, వర్తక వ్యాపారాలు, ప్రయాణ సౌకర్యాలు, సమాచారసౌకర్యాలు సాధనాలు. వీటిలో ఒక్కొక్క దాని విష యంలో 1858 తర్వాత విప్లవాత్మకములైన మార్పులు సంభవించాయి. వీటి ఫలితంగా ఉత్పత్తి అయిన వస్తుసముదాయం కొంతవరకు పెరిగినా బ్రిటిష్ పరి పాలన మూలంగా ఏర్పడిన ఆర్థిక రాజకీయవ్యవస్థ కారణంగా ఆ పెరుగుదలలో కొన్నివర్గాలు మాత్రమే ఎక్కువ భాగస్వాములు కావడం, అధిక సంఖ్యాకులైన సామాన్య ప్రజలకు అందులో స్వల్పభాగం మాత్రమే లభించడం జరిగింది. దీని మూలంగా దేశంలో దరిద్రులసంఖ్యయు దారిద్ర్యమూ విపరీతంగా పెరిగింది. జాతీయత వృద్ధిగాంచడంలో దీని ప్రభావం ఎంతైనా ఉంది.

వ్యవసాయరంగలో బ్రిటిష్ వారు ప్రవేశపెట్టిన మార్పులన్నిటిలో భూమిపై వ్యక్తులకు ఆస్తిహక్కు కల్పించడం అగ్రస్థానం వహిస్తూఉంది. వీరి పాలనకు పూర్వం గ్రామంలోని భూములన్నిటిపైన గ్రామస్థులందరికి సాము దాయకంగా ఆస్తి హక్కు ఉండేది. గ్రామపెద్దలు భూములను వ్యవసాయార్థం రైతుల మధ్య పంపకం చేయడం, జలాధారాలను వ్యవసాయానికి కావలసిన ఇతర వనరులను నిర్మాణం చేసి వాటిని తగిన స్థితిలో ఉంచడం, వ్యవసాయాన్ని అన్నివిధాలుగా నియమబద్ధం చేయడం సంప్రదాయంగా ఉండేది. గ్రామానికి కావలసిన వివిధములైన పంటలను కావలసినంతవరకు రైతులు పండించేవారు. గ్రామానికి వెలుపల వాటిని విక్రయించి లాభాలుసగడించే ఉద్దేశం ఉండేదికాదు. ఉన్నా, దాని ప్రభావం చాలా తక్కువ. గ్రామంలో రైతులుకానివారు- కమ్మర్లు, కుమ్మర్లు, చర్మకారులు మొదలైనవారు- తాము తయారుచేసిన వస్తు సామగ్రిని రైతులకు అందజేసి, వాటికి బదులుగా రైతులనుండి ధాన్యాదులను

గ్రహించి తమ జీవితాన్ని సాగించుకొనేవారు. ఈ విధానంలో ఒక గ్రామంలోని వారు ఇతర గ్రామాలపై తమ అవసరాలనుతీర్చుకొనే విషయంలో ఆధారపడే వారు కారు. ఏ గ్రామానికి ఆ గ్రామం స్వయం సమృద్ధంగాను స్వయంపోషకంగాను ఉండేది. వ్యవసాయమంతా గ్రామీణ వ్యవస్థతో ముడిపడి ఉండడం గుర్తించవలసిన విషయం. గ్రామస్థులందరు ఒక సమిష్టికుటుంబానికి చెందిన వారన్నట్లు జీవించేవారు. గ్రామంలో ఎవడు కూడా నిరాధారంగా జీవితం గడప వలసిన అవసరంలేదు. అందరి జీవితం పరస్పరాశ్రయంగా ఉండేది. ప్రజలకు వారివారిగ్రామాలపై గాఢాభిమానం ఏర్పడడానికి ఇదే కారణం.

బ్రిటిష్‌వారు వారిదేశంలో భూమిపై వ్యక్తులకు అస్తి ఉండవలెననే విధానానికి అలవాటు పడినవారు కావడంచేత దానిని మనదేశంలో ప్రవేశపెట్టారు. శాశ్వత శిస్తువిధానం ద్వారా బెంగాలు, బీహారు, ఒరిస్సా, ఉత్తరమద్రాసులలో వందలాది గ్రామాలలోని భూములపై జమీందార్లకు ఆస్తిహక్కును కల్పించారు. ఉత్తరప్రదేశ్, అయోధ్యరాష్ట్రాలలో దీనిని కొద్దిగా మార్చి తాలుకాదార్లకు ఆస్తిహక్కును ప్రసాదించారు. మద్రాసు, బొంబాయి మొదలైన రాష్ట్రాలలో రైతువారి శిస్తువిధానాన్ని ప్రవేశపెట్టి వారువారు సాగుచేసే భూములపై రైతులకు ఆస్తిహక్కులు కల్పించారు. ఈ విధంగా ఆస్తిహక్కును అనుభవించే వారు జమిందార్లైనా తాలుకాదార్లైనా రైతులైనా భూములపై ఆస్తిహక్కు వ్యక్తుల దనీ గ్రామ సముదాయానిది కాదనీ ఏర్పడింది. దీని ఫలితంగా వ్యక్తి జీవితానికి ప్రాధాన్యం, సమిష్టి జీవితానికి గొప్పనష్టమూ సంభవించింది. గ్రామీణవ్యవస్థకు గొప్పదెబ్బతగిలింది.

భూములపై వ్యక్తులకు ఆస్తిహక్కులభించడంమూలాన పాశ్చాత్య దేశాలలో లభించిన లాభాలు మనదేశంలో లభించలేదు. జమీందార్లుగాని తాలుకాదార్లుగాని పాశ్చాత్యదేశాలలోనిభూస్వాముల మోస్తరుగా వ్యవసాయంలో పెట్టుబడులు పెట్టి స్వయంగా దానిఅభివృద్ధికి పాటుబడలేదు. రైతులనుండి గరిష్ట ప్రమాణంలో శిస్తులు వసూలు చేసి సుఖంగా కాలక్షేపం చేసేవారయ్యారు. ఈ శిస్తులభారం మూలంగా రైతుల స్థితి దిగజారిపోయింది. జమీందారులను కాదని రైతుల రక్షణకై బ్రిటిష్ ప్రభుత్వం చాలాకాలం వరకు ఏలాటి చర్యలను తీసుకొనలేదు. తమ అధికారాన్ని స్థిరపరచుకొనుటకు జమీందార్ల సహాయం అవసరం అనేభావమే వారి ఔదాసీన్యానికి కారణం.

రైతువారి ప్రాంతాలలో రైతుల స్థితికూడా ఈలాగే తయారైంది. ఆస్తిహక్కు వారికి లభించినా దానిని లాభకరంగా వినియోగించుకొనగల స్తోమత వారికి లేకపోయింది. ప్రభుత్వం భూములపై విధించిన శిస్తు రైతుల శక్తికి మించినట్టిది. దీనికితోడు వారు దానిని నగదు రూపంలో పంటలు పండినా పండకపోయినా చెల్లించవలసిన వారయ్యారు. పాతపద్ధతిలో పండినపంటలో ఒక భాగాన్ని ఇచ్చుకొనేవారు. అందుచేత పంటలు తగ్గినప్పుడు ఈ భాగం కూడా తగ్గేది. కాని నగదు విధానంలో ఈలాటి తగ్గుదలకు అవకాశం లేక

పోయింది. సకాలంలో పన్నులు చెల్లించని పక్షంలో భూములను వేలంవేసి అన్యాక్రాంతంచేసే విధానం కూడా అమలులోకి వచ్చింది. ఈ ప్రమాదాన నుండి తప్పించుకొనుటకు రైతులకు సాహుకార్లవద్దనుండి అధిక వడ్డీలతో అప్పులు చేయడం తప్ప మార్గాంతరం లేకపోయింది. కాలక్రమాన ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తులభారంతో సాహుకార్లకుచెల్లించ వలసిన వడ్డీలభారంపెరిగి రైతులు కుంగిపోవడం తప్పింది కాదు. కష్టపడి పని చేసి పంటలు పండిచడం రైతుల వంతుగాను ఏలాటి కష్టమూ చేయవలసిన అవసరంలేక ఫలితంలో చాలా భాగాన్ని వశపరచుకొని అనుభవించడం సాహుకార్లవంతుగాను ఏర్పడింది. ఈ విధంగా గ్రామప్రాంతాలలో కష్టంచేసే వర్గంఒకటి, కష్టం చేయవలసిన అవసరంలేని వర్గం ఇంకొకటి ఏర్పడ్డాయి. రైతులకు వ్యవసాయంలో ఉత్సాహం తగ్గడానికి ఇది కారణమైంది.

దీనిమూలంగా కాలక్రమాన ఇంకొక పరిణామంకూడా సంభవించింది. రైతులలో అనేకులు శిస్తులబాధను ఋణబాధను భరించలేనివారై తమభూములను సాహుకార్లకు అమ్మివేయడం, వ్యవసాయకూలీలుగాగాని సాహుకార్ల భూములను అధిక శిస్తులను ఇచ్చుకొంటూ సాగుచేసే మక్తాదారులుగాగాని మారిపోవడం తప్పిందికాదు. ఈ విధంగా రైతుల భూములను వశపరచుకొన్నవారు గ్రామాలలోని సాహుకార్లు మాత్రమేకాదు. పట్నమాసాలలో ఎక్కువ ఆదాయాన్ని గడించే న్యాయవాదులు, ప్రభుత్వోద్యోగులు, ఉపాధ్యాయులు తదితరులు కూడా తాము కూడబెట్టిన ధనంతో రైతుల భూములను కొని వారుచెల్లించే అధికమక్తాల మూలంగా ఎక్కువ లాభం పొందేవారయ్యారు. వీరిలో ఎవరికీ వ్యవసాయాభివృద్ధిలో శ్రద్ధలేదు. ఆధునికములైన పనిముట్లు, యంత్రాలు, రసాయనిక ఎరువులు మొదలైనవాటిని ఉపయోగించి పాశ్చాత్య దేశాలలోని భూస్వాములవలె వ్యవసాయాన్ని ఆధునికం చేయుడంలో వీరికి శ్రద్ధగాని ఉత్సాహంగాని లేకపోయింది. రైతులను పీడించి లాభాలను గడించడం ఒక్కటే వీరిని ఆకర్షించింది. కష్టంచేయవలసిన అవసరంలేకుండా రైతులు పండించిన పంటలో భాగస్వాములైన వర్గంలో వీరు కూడా చేరారు. జీవశాస్త్ర పరిభాషలో పరాన్నభుక్కులు—పారసైట్సు—అనేవర్గం ఒకటిఉంది. వీరందరుసమాజంలో పరాన్నభుక్కులుగా తయారయ్యారు. వీరికే గైరుహాజరీ భూస్వాములు ( Absentee Landlords ) అనే పేరు ప్రచారంలోకి వచ్చింది.

ప్రాచీన కాలపు గ్రామవ్యవస్థలో రైతులు స్వానుభవం నిమిత్తంగాను గ్రామంలోని చేతి పనులను చేసే వారి అనుభవం నిమిత్తంగాను పంటలు పండిచేవారు. గ్రామానికి ఆవల పంటలను అమ్మి లాభాలను గడించే అవకాశంగాని అవసరంగాని వారికి ఉండేదికాదు. కాని బ్రిటిష్‌వారు ప్రవేశ పెట్టిన భూమిశిస్తు విధాన ఫలితంగా ఈలాటి అవసరమూ అవకాశమూ ఏర్పడింది, ప్రభుత్వానికి చెల్లించ వలసిన భూమిశిస్తు నగదు రూపంలో చెల్లించడానికి రైతులు తప్పనిసరిగా తమ పంటలలో కొంతభాగాన్ని విక్రయించవలసిన వారయ్యారు. సాహుకార్ల

కుచెల్లించవలసిన వడ్డీలు కూడా నగదు రూపంలో ఉండేవి. అందుచేత రైతులు తమ పంటలో కొంతభాగాన్ని విధిగా సమీపంలోని వర్తక కేంద్రాలకు పంపి అమ్మే అలవాటుకు లోబడిపోయారు. దీని ఫలితంగా వారికి బాహ్యప్రపంచంతో సంబంధం ఏర్పడి వారిదృక్పథం కొంత విశాలతరమైంది.

ఈ సంబంధం ఇంకొక విధంగాకూడా బలపడింది. బ్రిటిష్‌వారు వారి దేశంలోని పరిశ్రమలకు కావలసిన పత్తి జనుము మొదలైన ముడిపదార్థాల ఉత్పత్తిని భారతదేశంలో వృద్ధిచేయడంపట్ల ఎక్కువ శ్రద్ధను వహించి దానికి కావలసిన సదుపాయాలను ప్రోత్సాహాన్ని కల్పించారు. అనేక ప్రాంతాలలో రైతులు ఆహారపంటలను సాగుచేయడానికి బదులుగా వీటిని సాగుచేసేవారయ్యారు. వీటిని వర్తక కేంద్రాలలో అమ్మకం చేయడం వారికి అవసరం అయింది. దానికి తగినట్లుగా ప్రభుత్వంవారు రైళ్లను రహదార్లను నిర్మాణం చేశారు. రైతులలో వ్యాపారదృష్టి బాహ్యప్రపంచం తోటిసంబంధం దాని మూలంగా మరింత బలపడింది. తమబాగోగులకు తమగ్రామం ఒక్కటే ఆధారం అనేభావం సన్నగిల్లింది. గ్రామీణ సాముదాయక వ్యవస్థ నిర్జీవం కావడానికి ఇది కూడా ఒక కారణమైంది.

ఇంతేకాదు, ఇదేకాలంలో బ్రిటన్‌లో తయారైన బట్టలు, లోహసామగ్రి, పింగాణీ వస్తువులు, ఇతర వాడుకసామానులు భారతదేశంలోకి ఎక్కువగా దిగుమతి కావడం, అవి స్వదేశవస్తువుల కంటె చౌకగా ఉండడం, వాటిని కొనుటకు గ్రామీణ ప్రాంతాలలోని వారు అలవాటు పడడం జరిగింది. దీని ఫలితంగా గ్రామాలకు దూరప్రాంతాలలో ఉండే వర్తక కేంద్రాలతో సంబంధం ఏర్పడి క్రమక్రమంగా పెరిగింది. గ్రామంలోని చేతిపనివాండ్రు తయారుచేసే వస్తువులకు గిరాకి తగ్గింది. చేతిపనులలో అనేకం అదృశ్యమైపోయాయి. చేతిపనివారికీ రైతులకూ మధ్య యుగయుగాలుగా ఏర్పడిన సంబంధం దీనితో అడుగంటింది. ఎవరికి వారే యమునాతీరే అన్నట్లుగా గ్రామాలలోనివారు జీవించసాగారు. గ్రామస్థులతోటి సంబంధానికన్నా బాహ్య ప్రపంచంతోటి సంబంధం బలపడింది.

ఇతర కారణాల ప్రభావంచేతకూడా గ్రామీణ వ్యవస్థ చాలాదెబ్బతిన్నది. గ్రామ సమీపాన ఉండే అడవులలోని పచ్చికబయళ్లకు గ్రామస్థులు వారిపశువులను పంపుతూ ఉండేవారు. గ్రామపెద్దలు దీనికి సంబంధించిన ఏర్పాటులన్నిటినీ చేస్తూ ఉండేవారు. కాని ప్రభుత్వం అడవులను వశపరచుకొని పుల్లరివసూలు చేసే పద్ధతిని ప్రవేశపెట్టడంతో పెద్దల పెత్తనానికి అవసరం లేకపోయింది. అడవులలోనుండి వ్యవసాయ పనిముట్లకు వంట చెరుకుకు రైతులు కట్టెలు కొట్టుకొనేవారు. ప్రభుత్వం దీనిపైనకూడా నిర్బంధాలు విధించింది. రుసుములు చెల్లించేవారికి ఈ సదుపాయాలు లభించేటట్లు ఏర్పాటు చేసింది. పన్నుల మూలంగా లాభాలను గడించడం ప్రభుత్వం యొక్క లక్ష్యం అయింది. దాని ఫలితంగా నగదుకు ఎక్కువ అవసరం కలిగి రైతులు క్రయ విక్రయాలలో దిగి

బాహ్యప్రపంచంతో ఎక్కువ సంబంధం కలవారయ్యారు.

ఒకప్పుడు పరిపాలకులు గ్రామాన నుండి రాబట్టవలసిన పన్నుల నన్నిటినీ సమిష్టిగా గ్రామపెద్దల నుండి వసూలు చేసేవారు. బ్రిటిష్‌వారి వ్యవస్థలో ఈపద్ధతిమారి, ఒక్కొక్క రైతునుండి ప్రత్యేకంగా పన్నులు వసూలుచేసే పద్ధతి అమలులోకి వచ్చింది. అనాదిగా గ్రామంలోని వివాదాలను గ్రామపెద్దలు పరిష్కరించేవారు. బ్రిటిష్‌పాలనలో ఇదికూడా మారింది. వివాదాలలోకి దిగినవారు గ్రామాలకు దూరంలో ఉండే న్యాయస్థానాలకు వెళ్లి వాటి సహాయాన వివాదాలను పరిష్కరించు కొనవలసిన వారయ్యారు. వీటి అన్నిటి ఫలితంగా ప్రజలకు బాహ్య ప్రపంచంతో సంబంధం పెరిగింది.

ఈమార్పులు జరుగుచుండిన కాలంలో వ్యవసాయంలో ఇతర దేశాలలో జరిగినట్లు మన దేశంలో ఏలాటి అభివృద్ధి జరగకపోవడమేగాక కొంత నష్టంకూడా సంభవించింది దీనికి ప్రధానకారణాలు రెండుఅనిచెప్పవచ్చు ఒకటి దేశంలో జనాభా పెరగడం; రెండు బ్రిటన్‌లోని పరిశ్రమల పోటీకి నిలబడలేక దేశీయ పరిశ్రమలు క్షీణించడం. ఈరెండు కారణాల ప్రాబల్యంచేత ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు వ్యవసాయం ఒక్కటే జీవనాధారం అయింది. అనేక ప్రాంతాలలో బీడు భూములు వ్యవసాయయోగ్యంగా రైతులు మార్చారు. సాగులోకి వచ్చిన భూముల విస్తీర్ణం పెరిగింది. కాని జనాభా పెరుగుదలకు చేతిపనులను కోల్పోయిన వారి పెరుగుదలకు అనుగుణంగా ఈవిస్తీర్ణం పెరుగలేదు. అందుచేత ఒక్కొక్క రైతు సాగుచేసే పొలంయొక్క విస్తీర్ణం చాలా తగ్గింది. అనేకులు ఒకటి రెండు ఎకరాలను మాత్రమే సాగుచేసేవారు. రుణబాధ శిస్తులబాధ పెరగడం చేత అనేకులు తాము సాగుచేసే భూమిలో కొంతభాగాన్ని కోల్పోయ్యారు, ఈలాటి కారణాల ప్రాబల్యంచేత సాగుబడి కమతాల పరిమాణం చాలా తగ్గింది.

ఒకటి రెండు ఎకరాలను సాగుచేసే రైతులకు వ్యవసాయంలో నూతన విధానాలను ప్రవేశపెట్టడం తలకు మించిన భారంగా ఏర్పడింది. పాతపద్ధతుల ప్రకారం సాగుచేయడానికి కావలసిన నాగలి మొదలైన పనిముట్లను పశువులను కొనగల సామర్థ్యం అనేకులకు లేకపోయింది. పశువులు లేనివారికి ఎరువులు కూడా లేనట్లే. ఈపరిస్థితులలో వ్యవసాయం వెనుకబడిపోవడం తప్పిందికాదు. ఇతరదేశాలలో ఇదేకాలంలో ఎకరా నుండి పండే పంటలు రెండు మూడురెట్లు పెరిగాయి. మనదేశంలో ఇవి పెరగకపోవడమే కాకుండా పెట్టుబడి పెట్టేశక్తి సామర్థ్యాలు రైతులలో అధిక సంఖ్యాకులకు లేకపోవడంచేత తరిగిపోయాయి. ఆహారపదార్థాలకు విదేశాలపైన ఆధారపడవలసిన అవసరంకూడా ఏర్పడింది.

ఈదుర్భర పరిస్థితులలో మామూలు కాలంలోకూడా — అంటే పంటలు బాగా పండిన కాలంలోకూడా - నలభై శాతం ప్రజలు చాలీచాలని ఆహారంతోను, ఒకపూట తిండితోను తృప్తిపడవలసిన వారయ్యారు. మరిక్షామాలు సంభవించినప్పుడు వారిస్థితేగాక మధ్య తరగతికి చెందినవారి స్థితికూడా మరింత

దుర్భరమయ్యేది. 1858 తర్వాత క్షామం చాలాతరచుగా సంభవించసాగింది. 1860-1908 మధ్య ఇరవై సంవత్సరాలు క్షామానికి గురి అయినాయి. వాటిలో 1866లో ఒరిస్సా బెంగాలులోనిది, 1868-69లో ఉత్తరప్రదేశ్ రాజస్థాన్‌ల లోనిది, 1876-77లో బొంబాయి మదరాసులలోనిది, 1878,90లో ఉత్తర ప్రదేశ్, పంజాబు, కాశ్మీరులలోనిది, 1896–97లో ఉత్తరప్రదేశ్, మద్రాసు, బొంబాయి, మధ్య పరగణాలలోనిది, 1899–1900లో బొంబాయి, మధ్యపర గణాలు, విదర్భ, పంజాబు, అజ్మీరులలోనిది. లక్షలాది జననష్టానికి దారితీశాయి. 1876-77లో సంభవించిన క్షామంలో 50లక్షల జనం, 1896-97లో సంభవించిన దానిలో 45లక్షలజనం, 1899-1900లో 12లక్షలజనం ప్రాణాలను కోల్పో య్యారు. విపరీతంగా పెరిగిన ధరలను పెట్టి తిండిగింజలను కొనగల సామర్థ్యం లోపించడమే దీనికి ప్రధానకారణం. ప్రజలు అనుభవించవలసిన దారిద్ర్యానికి ఇంతకంటె తార్కాణం అవసరం లేదు.

వ్యవసాయం పురోగమించక పోవడానికి గ్రామీణ ప్రజల దుర్భరదారి ద్ర్యానికి జాతీయతకు ఏలాటి సంబంధం ఏర్పడిందో మనం ఇప్పుడు తెలుసు కొనవలసి ఉంది.

ప్రాచీన గ్రామవ్యవస్థలో ప్రజల దృక్పథం సంకుచితమై వారివారి గ్రామాలకు మాత్రం పరిమితమై ఉండేది. ఈవ్యవస్థ క్షీణించి వాణిజ్య దృష్ట్యా పంటలను పండించే అలవాటు ఏర్పడ్డతర్వాత ప్రజలు వర్తక కేంద్రాల ద్వారా దేశమంతటితో సంబంధం కలవారయ్యారు. దీనిమూలంగా వారిలో విశాలమైన అఖిల భారత దృక్పథం ఏర్పడడానికి అవకాశం లభించింది. తమ బాగోగులకు తమ గ్రామంలోని పరిస్థితులు ఆధారం కావనీ యావద్దేశంలోని పరిస్థితులు ఆధా రం అనే భావం వారిలో వ్యాపించింది. దేశంలోని ప్రజలందరితో తమకు సంబం ధం ఉన్నట్లు వారు గ్రహించిన కారణంగా వారిలో జాతీయత అంకురించి క్రమక్రమంగా వృద్ధిగాంచింది.

గ్రామీణ వ్యవస్థ మారినందున వారి వ్యవసాయ రంగంలోని సమస్యలన్నీ జాతీయసమస్యల రూపాన్ని ధరించాయి. పంటలు పుష్కలంగా పండడం పండక పోవడం అనేదానిపట్ల దేశంలోని ప్రజలందరు శ్రద్ధవహించవలసిన వారయ్యారు. వర్తకవ్యాపారాలద్వారా ఒక ప్రాంతంలో పండిన పంటలు తక్కిన ప్రాంతాలకు రవాణాకావడం మామూలైంది. పంటలు పుష్కలంగా పండితే ధరలు తగ్గడం దాని మూలంగా దేశంలోని ప్రజలందరు సుఖంగా జీవించడం, ఒక ప్రాంతంలో పంటలకు నష్టం కలిగినపక్షాన ధరలు పెరగడం దానిమూలంగా ఇతర ప్రాంతాల లోని ప్రజలుకూడా నష్టపడడం పరిపాటిఅయింది. వ్యవసాయాభివృద్ధి, భూమి శిస్తు విధానం, రైతుల రుణబాధ, జలాధారాల నిర్మాణం, క్షామ నివారణ పథకాలు మొదలైన విషయాలపట్ల రైతులుమాత్రమేగాక దేశంలోని ప్రజ లందరు శ్రద్ధవహించవలసిన వారయ్యారు. రాజకీయ సంఘాలను స్థాపించి వాటి ద్వారా ప్రజల సమస్యలను ప్రభుత్వదృష్టికి తెచ్చిన విద్యాధికులు వ్యవసాయ

సమస్యలను గురించి క్షుణ్ణంగా ఆలోచించి నిర్ణయాలు చేయడమూ, వాటిని ప్రభుత్వదృష్టికి తేవడమూ, వాటిని గురించి ఆందోళన జరపడమూ వారి కార్య కలాపాలలో ఒక ప్రధానాంశమైంది. ఈ విధంగా వ్యవసాయ రంగంలోని పరిస్థితులు జాతీయతను పెంపొందించే సాధనాలలో ప్రాధాన్యం వహించాయి.

ప్రాచీనకాలపు గ్రామ వ్యవస్థలో ప్రజలు వారి వారి గ్రామాలలోని పెద్దలపై తమ బాగోగులకు ఆధారపడేవారు. గ్రామంలోని పరిపాలనాధికార మంతా పెద్దల చేతులలో ఉండేది. ఈ వ్యవస్థను బ్రిటిష్‌వారు పూర్తిగా మార్చారు. దీని ఫలితంగా ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వంపైనా, వారు నియమించిన అధికారులపైనా, ఆధారపడవలసిన వారయ్యారు. ప్రభుత్వస్థానంలో ఎవరుఉంటే వారిపైన ఆధారపడడం, వారి సహాయాన్ని అర్థించడం ప్రజలకు సహజం. ప్రజలను రక్షించడం ప్రభువుల ప్రథమ కర్తవ్యం అనేది సంప్రదాయ సిద్ధంగా అన్ని దేశాలలో ఆమోదాన్ని పొందిన సూత్రం. కాని భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వం దీనికి విరుద్ధంగా ప్రవర్తించసాగింది. స్వదేశమైన బ్రిటన్‌లోని ప్రజల ప్రయోజనాలదృష్ట్యా భారతదేశాన్ని పాలించడం దానికి ప్రధాన లక్షణ మైంది. భారతదేశాన నుండి బ్రిటన్‌లోని పరిశ్రమలకు కావలసిన పత్తి జనుము మొదలైన ముడి సరుకులను చౌకగా పండించి ఎగుమతి చేసే విషయంలో మాత్రమే అది శ్రద్ధవహించింది. దీనికి మినహాగా వ్యవసాయ రంగంలో ఉత్పన్న మైన సమస్యల గురించిగాని రైతులు పడుతున్న బాధలు గురించిగాని అది పట్టించుకోలేదు. ఆనాడు బ్రిటన్‌లోను ఇతర పాశ్చాత్య దేశాలలోను వ్యవసా యాభివృద్ధికై నూతన విధానాలెన్నో ఉపయోగంలోకి వచ్చాయి. భారత దేశంలో వాటిని ప్రవేశపెట్టి వ్యవసాయాన్ని ఆధునికం చేయడం ప్రజల శ్రేయస్సుదృష్ట్యా అవసరమని అధికారులు గ్రహించినవారు కారు. రైతులను రుణబాధ నుండి విముక్తిచేయుటకు 1900 తర్వాతగాని వారు సహకార పరపతి సంఘాలను స్థాపించలేదు. రైతుల భూములను వ్యవసాయం చేయని సాహు కార్లు తదితరులు వశపరచుకొనరాదనే చట్టాన్నికూడా చాలా ఆలస్యంగా చేశారు. అదికూడా ఒక పంజాబు రాష్ట్రానికి మాత్రమే పరిమితమైంది. దేశాన్ని పాలించే ప్రభుత్వం పరాయి ప్రభుత్వం కావడంచేతనే రైతుల కష్టసుఖాల గురించి అది ఏలాటి శ్రద్ధను వహించలేదనీ, జాతీయప్రభుత్వం దేశంలో ఏర్పడితే తప్ప తమకు మోక్షం కలుగదనీ రైతులు తదితరులు భావించసాగారు. వారిపై నాయకత్వంవహించిన విద్యాధికులు ఈ భావాన్ని బలపరచారు. వ్యవసాయ రంగంలోని పరిస్థితులు ఈ విధంగా జాతీయతను పెంపొందించాయి.

## 2

అర్థోత్పత్తికి రెండవసాధనం పరిశ్రమలు. వీటిలో పనిచేసేవారు పత్తి మొదలైన ముడి వస్తువుల నుండి బట్టలు మొదలైన వాడకం పదార్థాలను ఉత్పత్తి చేస్తారు. అనాదిగా భారతదేశం నాణ్యమైన పదార్థాలను తయారుచేసే

పరిశ్రమలకు ప్రసిద్ధిగాంచినట్టిది. తూర్పు ఇండియా సంఘంవారు ఈలాటి సరుకులను పాశ్చాత్య దేశాలకు ఎగుమతి చేసేవారు. రెండు శతాబ్దాల కాలం ఈ వ్యాపారం చాలా బాహుళ్యంగా జరిగింది.

దేశంలోని పరిశ్రమలు చాలా వరకు గృహపరిశ్రమలుగా ఉంటూ వచ్చాయి. వాటిలో పనిచేసేవారంతా వారివారి ఇండ్లలో కుటుంబంలోని వారందరి సహాయంతో వస్తువులను తయారుచేయడం మామూలు. ఆ రోజులలో ఆవిరిశక్తి విద్యుచ్ఛక్తి మొదలైన వాటి సహాయాన నడిచే యంత్రాలు ఉపయోగంలోకి రాలేదు. అందుచేత పెద్దపెద్ద ఫ్యాక్టరీలకు అవసరం ఏర్పడ లేదు.

పరిశ్రమలలో కొన్ని, రాజుల యొక్కయు ప్రముఖవర్గాల యొక్కయు భోగభాగ్యాలకు అవసరాలైన వస్తువులను తయారుచేసేవి. ఇవి బంగారం, వెండి, నవరత్నాలు, దంతం మొదలైన వాటితో కూడుకొన్నట్టివి. వీటిలో ప్రత్యేకమైన నైపుణ్యాన్ని తరతరాలుగా సంపాదించిన పనివాండ్రు ఎందరో ఉండేవారు. ఇదే విధంగా కత్తులు, కటారులు, బల్లాలు, కవచాలు మొదలైన యుద్ధ పరికరాలను తయారుచేయడం లశులాదులకు కులవృత్తిగా ఉండేది. ఈలాటి వారిలో కొందరు రాజులు స్థాపించిన కార్ఖానాలలో పనిచేసేవారు.

సిరిసంపదలతో తులతూగేవారి ఉపయోగార్థం వస్తువులను తయారుచేసేవారు రాజధానీ నగరాలలోను ఇతర పట్టణాలలోను నివసిస్తూఉండేవారు. అందుచేత ఇవి పరిశ్రమలకు ప్రధాన కేంద్రాలుగా ఉండేవి. యాత్రీకులు అధిక సంఖ్యలో వెళ్ళే వారణాసి మధుర కంచి మొదలైన నగరాలుకూడ ఈలాటి పరిశ్రమలకు ఇతర పరిశ్రమలకు కేంద్రాలుగా ఉండేవి.

ఇవిగాక ప్రతిగ్రామంలోను గ్రామీణుల వాడుక నిమిత్తం సామాన్య వస్తువులను తయారుచేసే పరిశ్రమలు ఉండేవి. నేత, వడ్రంగం, కమ్మరం, కుమ్మరం, తోళ్లపరిశ్రమ మొదలయినవి ఈలాటివి - ఆయాకులాల వారికి ఇవి కులవృత్తులుగా ఉండేవి. తరుచుగా వీరికి మాన్యాలు ఉండడం చేత వీరు గ్రామాలలో స్థిరంగా నివసిస్తూ ఉండేవారు.

బ్రిటిష్ పరిపాలన దేశంలో వ్యాపించి స్థిరపడిన తర్వాత పరిశ్రమలలో అనేకం క్షీణదశలోకి వచ్చాయి. వీటిని పోషిస్తూవచ్చిన సంస్థానాధీశులూ వారి అనుచరులూ అదృశ్యమయ్యారు. బ్రిటిష్అధికారుల అలవాటులు వీరి అలవాటులకు భిన్నంకావడం చేత ఈ పరిశ్రమలలో తయారయ్యే వస్తువులు వారికి అవసరం లేకపోయింది. యుద్ధపరికరాలకు సంబంధించిన పరిశ్రమలుకూడా ఈ కారణం మూలాననే క్షీణించి పోయాయి.

1800 నాటికి బ్రిటన్‌లో యంత్రాలతో పనిచేసే పరిశ్రమలు వృద్ధిలోకి వచ్చాయి వీటిపైన యాజమాన్యం వహించిన ప్రముఖ వర్గాలవారు భారత దేశాననుండి వచ్చే దూదిబట్టలు, పట్టుబట్టలు మొదలైనవాటిపై అత్యధిక సుంకాలను విధించేటట్లు ప్రభుత్వంపై ఒత్తిడి తేవడంచేత బ్రిటన్‌లో వీటికి గిరాకీ

తగ్గడం, భారతదేశంలో వీటిని తయారుచేస్తూ వచ్చిన పరిశ్రమలు క్షీణించడం జరిగింది.

ఇదిగాక బ్రిటన్‌లో యంత్రసహాయాన తయారయ్యే సరుకులు చౌకగా తయారు కావడం, వాటిని భారతదేశంలోకి విరివిగా దిగుమతి చేయడం పరిపాటి అయింది. వీటిధరలు చౌకగా ఉండడం చేతను, రైళ్లు మొదలైన రవాణా సౌకర్యాలు కారణంగా అవి దేశంలోని వివిధప్రాంతాలకు సులభంగా చేరడం చేతను మారుమూలలలోని గ్రామప్రజలు కూడా క్రమక్రమంగా వీటిని కొను టకు అలవాటుపడిపోయారు. స్వదేశ వస్తువులకు గిరాకితగ్గి వాటిని తయారుచేసే వారు కులవృత్తులను మానుకొని వ్యవసాయంలో ప్రవేశించవలసిన వారయ్యారు. విదేశీపరిశ్రమలతో పోటిచేయలేక దేశియ పరిశ్రమలు క్షీణించాయి.

దీనికి తోడు ప్రముఖ వర్గానికిచెందిన భారతీయులందరు అధికారంలోఉన్న బ్రిటిష్‌వారిని అనుకరించేవారయ్యారు. బ్రిటిష్‌వారు వాడేవస్తువులను వాడడం వారికి పరిపాటి అయింది. అలాటి ప్రవర్తనమూలంగా తమకు బ్రిటిష్‌వారి నుండి గౌరవమర్యాదలు లభించగలవనే ధోరణిలో వారు పడిపోయ్యారు. ఇంగ్లీషు విద్యను అభ్యసించినవారు ఈ విధంగా ప్రవర్తించడంలో ముందంజ వేశారు. వీరందరికి బ్రిటిష్‌వారిదుస్తులు, ఇండ్లలో వారుఉపయోగించే కుర్చీలు, బల్లలు, మేజాలు, ఇతరవస్తువులు ఆకర్షణీయమైనాయి. వారి వినోదాలకు ఆట లకు విలాసాలకు ప్రాధాన్యం లభించాయి. వారు వారికి కావలసిన వస్తుసామ గ్రిని బ్రిటన్ నుండి తెప్పించుకొనేవారు. వారిని అనుకరించే భారతీయులుకూడా బ్రిటన్‌లో తయారైనవస్తువులపై మోజుకలవారయ్యారు. జమీందార్లు తాలూ కాదార్లు ధనికవర్గానికి చెందిన తదితరులు తమ ఇండ్లను బ్రిటన్‌లోని ఇండ్ల మోస్తరుగా అలంకరించుకొనడం పరిపాటి అయింది. ఆహారవిషయంలోను, పానీ యాల విషయంలోను ఇదే జరిగింది. ప్రముఖవర్గాలలో విదేశవస్తువులపట్ల ఉత్సా హం స్వదేశీవస్తువులపట్ల నిరుత్సాహం పెరిగిపోయింది. ఈ పరిస్థితులలో దేశీయ పరిశ్రమలు క్షీణించడం తప్పిందికాదు.

ప్రభుత్వ కార్యాలయాలకు కావలసిన కాగితం, కలాలు, పెన్సిలులు మొదలైన వస్తువులు, ఆసుపత్రులకు కావలసిన మందులు పరికరాలు, ఇతర పరిపాలన శాఖలకు కావలసిన వస్తుసామగ్రి, సైనికదళాలకు కావలసిన సమస్త ఆయుధాలు దుస్తులు, -ఈలాటి వాటినన్ని- బ్రిటన్ నుండి తెప్పించకొనడం ప్రభుత్వానికీ అలవాటైంది. ఏటేట వీటికిగాను కోట్లకొలది రూపాయిలు ఖర్చ య్యేది. ఈ ఖర్చంతా భారతదేశంలోనే జరిగి ఉండినపక్షాన ఎన్నోభారీపరిశ్రమలు నెలకొనేవి. ప్రాచీన మధ్యయుగాలలో దేశాన్ని పాలించిన రాజులందరు వారికి కావలసిన వస్తుసామగ్రిని తయారుచేయుటకు కార్ఖానాలను స్థాపించేవారు. ఈ పద్ధతి ప్రజలకు వివిధములైన వృత్తులను కల్పించి వారి పురోభివృద్ధికి ఎంతగానో తోడ్పడేది. బ్రిటిష్‌వారు ఈ సనాతన విధానానికి స్వస్తిచెప్పి ప్రజలను నిరుద్యో గుల గావించి దేశదారిద్ర్యానికి దారి తీశారు. వారి పరిపాలన కాలంలో ఆర్థిక

పరిస్థితులు దిగజారుటకు ఈవిధానం ఒక ప్రధాన కారణమైంది.

పాశ్చాత్యదేశాలలో యంత్రయుగం ప్రవేశించిన తర్వాత ఫ్యాక్టరీపరిశ్రమలతో పోటీచేయలేక గృహపరిశ్రమలు క్షీణించాయి. కాని ఈవిషయంలో ఆదేశాలకూ మనదేశానికి ఏలాటి పోలికా లేకపోయింది. ఆదేశాలలో ఫ్యాక్టరీ పరిశ్రమలు నెలకొనడంచేత గృహపరిశ్రమలలో వృత్తులు కోల్పోయిన వారందరు ఫ్యాక్టరీలలో కార్మికులుగా పనిచేసి ఆదాయాన్ని గడించగల వారయ్యారు. వారు నిరుద్యోగాన్ని ఎదుర్కొనవలసిన అవసరం ఏర్పడలేదు. మన దేశంలో గృహపరిశ్రమలస్థానే ఫ్యాక్టరీ పరిశ్రమలు స్థాపితంకాలేదు. అందుచేత అనాదిగా నేత, కమ్మరం, వడ్రంగం మొదలైన కులవృత్తుల ద్వారా జీవితం సాగిస్తూవచ్చిన వారందరు గత్యంతరం లేక వ్యవసాయదార్లుగానో నిరుద్యోగులుగానో జీవితం గడపవలసిన వారయ్యారు. దీనిమూలంగా వ్యవసాయరంగంలో ఏలాటి పరిణామాలు సంభవించాయో తెలుసుకొన్నాం. పరిశ్రమలు క్షీణించడం చేత దేశంలో దరిద్రుల సంఖ్య దారిద్ర్యమూ పెరిగి పోయాయి.

దేశం పరాయిపాలనలో ఉన్నందున ఫ్యాక్టరీ పరిశ్రమల స్థాపనకు అవకాశం లభించలేదు ఈలాటి పరిశ్రమలను స్థాపించి లాభదాయకంగా నడపడానికి కావలసిన ముడిపదార్థాలు కార్మికజనం దేశంలో విరివిగా ఉండినా ఈ విషయంలో ప్రభుత్వం అనుసరించిన విధానం అలాటి పరిశ్రమల స్థాపనకు ప్రతిబంధకంగా ఏర్పడింది. బ్రిటన్‌లోని ఫ్యాక్టరీ పరిశ్రమలతో పోటీచేయగల పరిశ్రమలు భారతదేశంలో స్థాపితం కావడం ప్రభుత్వానికి ఎంతమాత్రం ఇష్టం లేకపోయింది. శైశవదశలో ఆలాటి పరిశ్రమలకు ప్రభుత్వరక్షణ ఎంతైనా అవసరం. ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా మొదలైన దేశాలలోని ప్రభుత్వాలు తమతమ దేశాలలోని ఫ్యాక్టరీ పరిశ్రమలు బ్రిటన్‌లోని ఫ్యాక్టరీ పరిశ్రమలతో పోటీచేయలేని శైశవదశలో ఉన్నప్పుడు బ్రిటిష్ సరుకులపై అధిక సుంకాలను విధించడం ద్వారాను ఇతర మార్గాలద్వారాను వాటికి ప్రత్యేక రక్షణను కల్పించి కాలక్రమాన ఇవివృద్ధిలోకి వచ్చేటట్లు చేశారు. మనదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వం దీనికి అన్యథాగా ప్రవర్తించింది. భారతీయులచేత బ్రిటన్‌లో తయారైన వస్తువులను కొనిపించడమే దాని ప్రధాన లక్ష్యం అయింది. అందుచేత బ్రిటిష్ సరుకులపై సుంకాలను విధించడం దానికి ఆమోదయోగ్యం కాలేదు ప్రభుత్వం మూలాన ఫ్యాక్టరీ పరిశ్రమలకు లభించవలసిన రక్షణ మనదేశంలోని వాటికి లభించలేదు. అందుచేత వాటిని స్థాపించడం కష్టసాధ్యం అయింది.

ఆరోజులలో బ్రిటన్‌లో అర్థిక శాస్త్రవేత్తలందరు స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ ఉండేవారు. వివిధ దేశాలమధ్య వ్యాపారం స్వేచ్ఛగా జరిగితే ప్రజలకు కావలసిన వస్తుసామగ్రి చౌకగా లభించగలదనేది ఈ సిద్ధాంతానికి మౌలిక లక్షణం. ఆనాటి పరిస్థితులలో ఇది బ్రిటిన్‌కు చాలా లాభకారిగా ఉండేది. బ్రిటన్‌లో పరిశ్రమలు వృద్ధిగాంచినా ప్రజలందరికీ కావలసిన ఆహార పదార్థాలు పండించుటకు కావలసిన వసతులు లేకపోయింది. విదేశాల నుండి

స్వేచ్ఛగా ఆహారపదార్థాలను దిగుమతి చేసుకొనడమూ, వాటికి బదులుగా బ్రిటిష్ పరిశ్రమలలో తయారైన వస్తువులను మార్పిడి చేసుకొనడమూ అవసరంగానూ లాభదాయకంగానూ ఏర్పడింది. ఆదేశపు పరిస్థితుల దృష్ట్యా స్వేచ్ఛా వ్యాపార సిద్ధాంతం హేతుబద్ధంగా ఉండింది. కాని పారిశ్రామికంగా వెనుకబడిన దేశాలకు ఇది లాభకారి కాదని ఇతర దేశాలలోని అర్థశాస్త్రవేత్తలు రుజువుచేశారు. వారి సలహాల ననుసరించి ఇతర దేశాలవారు ఈ సిద్ధాంతాన్ని అనుసరించక, విదేశాలనుండి వచ్చే సరుకులపై సుంకాలు మొదలైన ఆంక్షలు విధించి, తమ పరిశ్రమలకు రక్షణ కల్పించుటకు సంసిద్ధులయ్యారు. మనదేశంలోని ఆనాటి అర్థశాస్త్రవేత్తలు - వారిలో ప్రధానంగా మహదేవగోవిందరనడే- స్వేఛ్ఛా వ్యాపార సిద్ధాంతం మనదేశానికి అనుగుణంకాదనీ, ప్రభుత్వం మన ఫ్యాక్టరీ పరిశ్రమలకు ప్రత్యేక రక్షణ కల్పించవలెననీ వాదించారు. కాని స్వదేశానికి నష్టం కలిగించే విధానాన్ని చేపట్టడం బ్రిటిష్ ప్రభుత్వానికి అంగీకారం కాలేదు. అందుచేత అధికారులు ఈవాదంలోని సుగుణాన్ని గ్రహించలేక పొయ్యారు,

విదేశాల నుండి దిగుమతులుగావచ్చే సరుకులపై సుంకాలను విధించి ఆదాయాన్ని సమకూర్చుకొనడం అన్ని ప్రభుత్వాలు అన్ని కాలాలలో అనుసరించే సనాతన విధానం. దీని ననుసరించి మన దేశంలోని బ్రిటిష్ ప్రభుత్వం అన్ని దేశాలనుండి వచ్చే సరుకులపై సుంకాలను విధించినట్లు బ్రిటన్ నుండి వచ్చే బట్టలు మొదలైనవాటిపై సుంకాలను విధిస్తూ ఉండేది. ఇందులో ఉద్దేశం దేశంలోని పరిశ్రమలకు ప్రత్యేకంగా రక్షణ కల్పించడంకాదు. కాని అన్ని ప్రభుత్వాలు అనుసరించే ఈ సామాన్య విధానాన్నికూడా బ్రిటన్‌లోని పారిశ్రామిక వర్గాలు ఆక్షేపించడం మామూలైంది. వారి వొత్తిడికి లొంగిపోయి ప్రభుత్వం వీటిని రద్దుచేయడమో, చాలా వరకు తగ్గించడమో జరిగింది. 1878-79 లో దేశంలో గొప్ప క్షామం సంభవించి ప్రభుత్వపు ఖర్చులు విపరీతంగా పెరిగాయి. అలాటి క్లిష్టపరిస్థితులలోకూడా ప్రభుత్వం బ్రిటిష్ దిగుమతులపై సుంకాలను విధించడాన్ని బ్రిటన్‌లోనివారు ఆక్షేపించారు. కొన్ని సంవత్సరాల తర్వాత ఆదాయందృష్ట్యా $3\frac{1}{2}$ శాతం సుంకాలను విధించినప్పుడు భారతదేశంలో మిల్లులు ఉత్పత్తిచేసే బట్టలపై ఇదే శాతాన ఎక్సైస్ పన్నును విధించవలెసిందిగా బ్రిటన్‌లోని వారు పట్టుబట్టగా ప్రభుత్వం ఆక్షేపణీయమైన అలాటి పన్నును విధించి స్వదేశ సరకుల ధరలను పెంచింది. దేశంలోని రాజకీయ చైతన్యంగల వారందరు దీనిని తీవ్రంగా విమర్శించినా ఇందులో ఏలాటిమార్పు జరగలేదు. ప్రభుత్వం యొక్క ధ్యేయం భారతీయుల ప్రయోజనాలను వృద్ధిచేయడానికి బదులు బ్రిటిష్ ప్రజల ప్రయోజనాలను వృద్ధిచేయడంగా పరిణమించింది.

ప్రభుత్వం ఈలాటి ప్రతిబంధకాలు కలిగించినా దేశంలోని ధనికవర్గాల వారు కొందరు సాహసించి బొంబాయిలోను దాని పరిసరాలలోను దూది మిల్లులను నెలకొల్పి యంత్ర సహాయాన బట్టలను తయారుచేయసాగారు.

దేశంలో స్థాపింపబడ్డ ఫ్యాక్టరీ పరిశ్రమలలో దీనికి అగ్రస్థానం లభించింది. దీనితో పాటు కలకత్తా ప్రాంతాన జనుము మిల్లులు స్థాపింపబడినవి. కాని వాటిపై యాజమాన్యం వహించినవారిలో అధికసంఖ్యాకులు బ్రిటిష్ సాహుకార్లు. అందుచేత లాభాలన్నీ బ్రిటన్‌కు తరలిపొయ్యేవి. ఈ రెండు పరిశ్రమలుగాక ఖనిజ పరిశ్రమ కొంత అభివృద్ధిజెందింది. వీటి మినహాగా ప్రథమ ప్రపంచ సంగ్రామం వరకు భారీపరిశ్రమలేవీ స్థాపింపబడలేదు.

ఈ విధంగా ప్రాచీనకాలపు గృహపరిశ్రమలు క్షీణించడం, వాటిస్థానే నవీనాలైన ఫ్యాక్టరీ పరిశ్రమలు స్థాపితం కాకపోవడం, స్థాపితమైన వాటికి ప్రభుత్వం రక్షణ కల్పించకపోవడం, స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతప్రాబల్యాన బ్రిటన్‌లో తయారైన వివిధములైన సరుకులు ప్రజలను ఆకర్షించడం, జాతీయతకు బలం చేకూర్చాయి. పరాయివారు దేశాన్ని పాలించడంచేతనే ఈలాటి అనర్థాలు దేశానికి ప్రమాదం కలిగిస్తున్నవనే భావం విద్యాధికులలోనే గాక రాజకీయ చైతన్యం గలవారందరిలో గాఢంగా నాటుకొనిపోయింది. పరిపాలించే అధికారంలో ప్రజాప్రతినిధులు భాగస్వాములు కావలసిఉన్నదనే విశ్వాసం అందరికీ కలిగింది. వ్యవసాయ రంగంలోనేగాక పారిశ్రామిక రంగంలోని ఆర్థికపరిస్థితులు విషమించడం ప్రజలలో జాతీయభిమానం పెంపొందడానికీ పరాయి ప్రభుత్వం పట్ల ద్వేషం జనించడానికీ కారణమైంది.

## 3

1858 తర్వాత దేశంలోని రవాణా సౌకర్యాలు బాగా పెరిగాయి. వీటిలో రైళ్ళు ప్రధానస్థానం వహించాయి. రైళ్ల నిర్మాణంలో ప్రభుత్వం శ్రద్ధవహించడానికి నాలుగు కారణాలున్నట్లు చెప్పవచ్చు.

1857-58 తిరుగుబాటు ఫలితంగా దేశంలోని సైన్యాలను ఒక ప్రాంతాన నుండి ఇంకొక ప్రాంతానికి తరలించడానికి తగిన ఏర్పాటు అవసరమనే గుణపాఠాన్ని అధికారులు నేర్చుకొన్నారు. ఈ అవసరం రైళ్ల నిర్మాణం ద్వారా పూర్తిగా తీరగలదనే నిర్ణయానికి వారు వచ్చారు. ఇదిగాక బ్రిటన్‌లోని పారిశ్రామికులుకూడా భారతదేశాన నుండి వారికి కావలసిన ముడి సరుకులు బొంబాయివంటి రేవుపట్టణాలకు సులభంగా చేరడానికిన్నీ, వారు తయారుచేసిన వాడకం సరుకులు ఈలాటి రేవుపట్టణాలనుండి దేశంలోని వివిధప్రాంతాలకు సులభంగా చేరడానికిన్నీ రైళ్లు పటిష్టసాధనమని భావించి, వాటి నిర్మాణంపట్ల శ్రద్ధవహించవలసినదిగా ప్రభుత్వాన్ని వొత్తిడిచేశారు. రైళ్ల వ్యాప్తికి ఇది కూడా ఒక కారణంగా పనిచేసింది. దీనికితోడు ఆ రోజులలో బ్రిటన్‌లోని సాహుకారీ వర్గాలవారు చాలా పెట్టుబడి ధనాన్ని సమకూర్చుకోగలిగారు. పారిశ్రామిక విప్లవం మూలానను వర్తకవ్యాపారాలు పెరగడం మూలానను ఈ సమకూర్చుకొనడం వారికి సులభమైంది. కాని వారి పెట్టుబడి ధనానికి లాభదాయకమైన వినియోగం బ్రిటన్‌లో లభించలేదు. అందుచేత వారు భారత

దేశంలో రైళ్ల నిర్మాణానికై దానిని వినియోగించి అధిక వడ్డీలను లాభాలను సంపాదింపదలచి, వారికి అవసరమైన సదుపాయాలన్నిటినీ ప్రభుత్వ సహాయాన సంపాదించారు. ఇదికూడా రైళ్ల నిర్మాణానికి ఒక గొప్ప ప్రోత్సాహాన్ని కల్పించింది.

వీటిఅన్నిటితోపాటు దేశంలో క్షామాలు తరుచుగా సంభవించడం, వాటిమూలంగా లక్షలాది జనానికి ప్రాణనష్టం కలగడం ప్రభుత్వాన్ని ఆందోళన పరచాయి. ఈ సమస్యలపరిష్కారానికి సూచనలను చేయవలసినదిగా ప్రభుత్వం నియమించిన కమీషన్ ఒకటి 1880 ప్రాంతాన రైళ్ళనిర్మాణంచురుకుగా జరిగిన పక్షాన క్షామకాలంలో ఒక ప్రాంతాననుండి ఇంకొక ప్రాంతానికి ఆహారపదార్థాలను రవాణాచేయడం సులభసాధ్యం కాగలదని, క్షామబాధను తగ్గించుటకు ఇది ప్రబలసాధనమని అభిప్రాయపడ్డారు. ప్రభుత్వం ఈ అభిప్రాయంతో ఏకీభవించి రైళ్ళ విషయంలో ఎక్కువ శ్రద్ధనువహించింది.

ప్రథమదశలో కొన్ని సంవత్సరాల కాలం బ్రిటిషు పెట్టుబడిదార్లకు రైళ్ళ నిర్మాణ విషయంలో ప్రభుత్వం ఇచ్చిన హామీల ఫలితంగా రైళ్ళ నిర్మాణం పెట్టుబడిదార్లకు లాభాలను సమకూర్చినా ప్రభుత్వానికి నష్టదాయకమైంది. కాని క్రమక్రమంగా ఈ హామీల విధానాన్ని రద్దుచేసి ప్రభుత్వమే స్వయంగా నిర్మాణరంగంలో ప్రవేశించింది. కాలక్రమాన రైలుమార్గాల పొడువు బాగా పెరిగింది. 1868-69 లో వీటిపొడవు 4016 మైళ్లు కాగా 1905-6 నాటికి ఇది 28,604 మైళ్ళకు పెరిగింది. 1869 లో ప్రయాణీకుల సంఖ్య ఒక కోటి అరవైలక్షలు కాగా 1906 నాటికి ఇది 27 కోట్లను దాటింది.

ఇదే కాలంలో తంతితపాలా సౌకర్యాలు కూడా పెరిగాయి. 1860-61లో తంతితీగెల పొడవు 11,093 మైళ్ళు, 1910-11 లో అది 74,828 మైళ్ళకు పెరిగింది. దీనితోపాటు తపాలాసౌకర్యాలు కూడా వృద్ధిగాంచాయి. 1862లో తపాలాఫీసులద్వారా నాలుగుకోట్ల డెబ్బైలక్షల ఉత్తరాలు, వార్తాపత్రికలు, పార్సెలులు బట్వాడాకాగా 1905-6నాటికి ఈ సంఖ్య సుమారు 65 కోట్లకు పెరిగింది.

రవాణా సౌకర్యాలు సమాచారసౌకర్యాలు పెరగడంతో దేశంలోని ప్రజలమధ్య ఆర్థికసమైక్యత వృద్ధిగాంచింది, ఒక ప్రాంతంలోని ధరలకు ఇంకొక ప్రాంతంలోని ధరలతో సమన్వయం కుదిరింది. వివిధ ప్రాంతాలమధ్య వ్యాపారం పెరిగింది. వర్షాభావంవల్ల ఒక ప్రాంతంలో క్షామం సంభవించినప్పుడు తక్కిన ప్రాంతాలనుంచి ఆహారపదార్థాలు చేరడం మూలాన ప్రజల మధ్య స్నేహసౌహార్థాలు బలపడినవి. అందరి కష్టసుఖాలు పరస్పరాశ్రయాలనే భావము, అందరూ ఒకే జాతికి చెందిన వారనే భావము, అందరి ప్రయోజనాలు ఒకే మోస్తరైనట్టివనే భావము, వాటిని సంపాదించుటకు అందరూ కృషిచేయడం అవసరమనే భావము వ్యాపించాయి. వీటిఅన్నిటి ఫలితంగా జాతీయతకు గట్టి పునాదులు ఏర్పడ్డాయి.

ఇదేకాలంలో పొగయోడలు విరివిరిగా వాడుకలోకి వచ్చాయి. 1869లో సూయిజ్ కాలువ నిర్మాణం జరిగింది. వీటిఫలితంగా భారతదేశ బ్రిటన్ల మధ్య, భారతదేశ ఇతర దేశాలమధ్య, నౌకాయానం సులభతరమై వర్తక వ్యాపారాల అభివృద్ధికి ప్రోత్సాహంకలిగింది. దేశంలోపల ఆంతరంగిక వ్యాపారంవృద్ధిగాంచి నట్లేవిదేశవ్యాపారంకూడా వృద్ధిగాంచింది.

నౌకాయానం సులభం కావడం చేత బరువైన ముడిసరుకులను కూడా చౌకగా బ్రిటన్‌కు ఇతర దేశాలకు ఎగుమతి చేయడమూ, బ్రిటన్ నుండి మరింత చౌకగా వాడకం వస్తువులను భారతదేశానికి దిగుమతి చేయడమూ సులభసాధ్యమైంది. 1878-9లో 61 కోట్ల రూపాయల విలువగల సరుకులు ఎగుమతికాగా 1906-7 నాటికి వీటి విలువ 177 కోట్లకు పెరిగింది. ఇదేవిధంగా దిగుమతుల విలువ 1861–62లో 22కోట్లుకాగా 1906-07 నాటికి 127 కోట్లకు పెరిగింది.

విదేశవ్యాపారం పెరిగినా దాని మూలంగా దేశంలోని ప్రజలకు విస్తార లాభంచేకూరలేదు. లాభంలోని చాలా భాగం భారతదేశంలోని బ్రిటిష్‌వర్తకులు బ్రిటన్‌లోని పారిశ్రామిక యజమానులు కార్మికులు అనుభవించారు ఆనాటి విదేశవర్తకంలో చాలాభాగం బ్రిటిషువర్తక కంపెనీల అధీనంలో ఉండేది. వర్తకం కూడా బ్రిటన్‌లో తయారైన సరకులు భారతదేశంలోని ప్రజలకు సులభంగా అందేలాగునను, భారతదేశంలోని ముడిసరుకులు బ్రిటన్‌కు చౌకగా చేరే లాగునను రూపొందింది. ప్రపంచ వర్తక కేంద్రాలలో ముడిసరుకులకు ఏర్పడిన ధరలు భారతీయరైతులకు గిట్టుపాటుకాలేదు. వారిని రక్షించుటలో ప్రభుత్వం తగిన చర్యలు తీసుకొనలేదు.

ఆనాటి విదేశవ్యాపారం ఇంకొక విధంగా కూడా భారత దేశానికి నష్టం కలిగించింది. బ్రిటన్ నుండి భారతదేశానికి దిగుమతి అయిన సరకుల విలువ కంటే భారతదేశాననుండి బ్రిటన్‌కు ఎగుమతి అవుతూ వచ్చిన సరుకుల విలువ ఎక్కువగా ఉండేది. ఈ రెండు విలువల మధ్య 1890-91 వరకు సుమారు 18 కోట్లరూపాయల భేదం ఉండేది. అంటే మనం ఏటేట 18 కోట్ల రూపాయల విలువ గల సరుకులను ఏలాటి ప్రతిఫలాన్ని పొందక బ్రిటన్‌కు ఉచితంగా పంపవలసిన వారయ్యాము. 1903-04 నాటికి ఈ మొత్తం 27 కోట్లకు పెరిగింది. దీనినే ఆనాటి మన అర్థశాస్త్రవేత్తలు—దాదాబాయి నౌరోజి, రమేశచంద్ర దత్తు మొదలైనవారు—డ్రెయిన్ (Drain) అని చెప్పేవారు. ఇది ఒక విధంగా భారతదేశం బ్రిటన్‌కు చెల్లించే కప్పమని చెప్పవచ్చు

ఇందులో చాలాభాగానికి హోంచార్జిస్ (Home Charges) అనే పేరు ప్రచారంలోకి వచ్చింది. మనదేశాన్ని పాలించడంలో బ్రిటిష్‌వాడు వారి దేశంలో మన తరపున చేసే ఖర్చులని దీని అర్థం. ఇండియా కార్యదర్శి జీతబత్యాలు, అతని ఆఫీసుఖర్చులు, అతని సభలో సభ్యులుగా ఉండేవారిజీతబత్యాలు భారతదేశంలో ఉద్యోగంచేసి, ఉద్యోగాననుండి విరమించిన తర్వాత బ్రిటన్‌కు వెళ్ళిపోయినవారి పింఛనులు—ఈలాటి ఖర్చులనేకం ఈహోంచార్జిలలో ఉండేవి.

భారతదేశానికి సంబంధించిన ఖర్చులెన్నో వీటిలో కలిసి ఉండేవి. ఒక పర్యాయం టర్కీసుల్తాను లండన్‌కు బ్రిటిష్ ప్రభుత్వపు అతిథిగా వెళ్ళాడు. అతనికి ఇండియా కార్యదర్శి ఇచ్చిన విందుల ఖర్చులన్నీ భారతదేశం భరించవలసివచ్చింది. బ్రిటిష్ వారు భారతదేశాన్నేగాక కెనడా, ఆస్ట్రేలియా మొదలైన దేశాలను కూడా ఆ కాలంలో పాలిస్తూ ఉండేవారు. కాని వాటిపాలనకై బ్రిటిష్‌వారుచేసిన ఖర్చులను బ్రిటిష్ ప్రభుత్వమే వహించేది ఒక భారతదేశం విషయంలోనే వాటిని భారతీయులు భరించ వలసిన వారయ్యారు. ఇందులోని అన్యాయాన్ని అధర్మాన్ని వారు గుర్తించక పోవడం ఒక విపరీతమని చెప్పడంతప్పదు. ఈ విధంగా 19వ శతాబ్దంలో ప్రతిఫలరహితంగా భారతదేశాన నుండి బ్రిటన్‌కు చేరిన ధనం రూ 6,080,172,021లు అని అంచనావేయబడింది. యంత్రసహాయాన ఫ్యాక్టరీ పరిశ్రమలను నడుపుటకు కావలసిన పెట్టుబడిధనంలో చాలా భాగం బ్రిటిష్‌వారు ఈవిధంగా సంపాదించారు. ఆధునికయుగంలో పారిశ్రామికంగా మారిన ఇతర దేశాలవారు విదేశాలనుండి పెట్టుబడి ధనాన్ని రుణంగా సంపాదించారు. బ్రిటిష్‌వారు ఏలాంటి రుణం చేయకుండా తమ పరిశ్రమలను అభివృద్ధి చేసుకొని పారిశ్రామికరంగంలో అగ్రస్థానం వహించుటకు భారతదేశానుండి వారు తరలించి తీసుకొనిపోయిన ధనం ప్రధానకారణం. ఇది వారి సిరిసంపదలకు కారణంకాగా భారతీయుల కటికదారిద్ర్యానికి కారణం అయింది.

దాదాబాయి మొదలైన భారతీయ అర్థశాస్త్రవేత్తలున్నూ, బ్రిటిష్ అర్థశాస్త్రవేత్తలు కొందరున్నూ ఈ నగ్న సత్యాన్ని ప్రచారంచేశారు. దీని చేత భారతదేశంలోని ప్రజలు ప్రభావితులై బ్రిటిష్‌వారి వశంలో ఉండిన పరిపాలనాధికారాన్ని తమవశంచేసుకోవలసిన అవసరాన్ని గుర్తించారు. ఇది వారి జాతీయతను బలపరచి క్రమక్రమంగా స్వాతంత్ర్యోద్యమానికి దారితీసింది.

## 4

దేశీయ పరిశ్రమలు క్షీణిస్తున్న ఈకాలంలో దేశాభిమానపూరితులైన విద్యాధికులు కొందరు వాటి పునరుద్ధరణకై కొన్ని ప్రయత్నాలు చేశారు. పరాయిపరిపాలకులలో హృదయ పరివర్తనం కలిగి దేశీయ పరిశ్రమలపట్ల అభిమానం ఏర్పడేవరకు తాము చేతులు ముడుచుకొని కూర్చుండడం ప్రాజ్ఞత కాదనీ ప్రభుత్వంతో నిమిత్తం లేకుండా ఆత్మవిశ్వాసంతోను స్వశక్తితోను తాము ఈప్రయత్నాలను సాగించడం తమకర్తవ్యమనీ వీరు భావించారు. 1905 తర్వాత వందేమాతరం ఉద్యమం కారణంగాను 1919 తర్వాత గాంధీ మహాత్ముని ప్రచార ఫలితంగాను ప్రాబల్యం గాంచిన స్వదేశీ ఉద్యమానికి బీజావాపనం చేసినవారు వీరే.

ఈలాటివారిలో బెంగాలు రాష్ట్రంలో ఈ కార్యక్రమాన్ని నడిపించిన వాడు నబగోపాల్ మిత్ర. ఇతనికి ఈ విషయంలో 1866 ప్రాంతాన జాతీయ భావాభివృద్ధి సంఘం అనే పేరుతో ఒక సంఘాన్ని స్థాపించిన రాజనారాయణ

బోసుమార్గదర్శి. ఆరోజులలో ఇంగ్లీషు విద్య నభ్యసించిన బెంగాలీ యువకులు పాశ్చాత్య సంస్కృతిపట్ల వ్యామోహం కలవారై విచక్షణా రహితంగా పాశ్చాత్యులను అనుకరించడం పరిపాటిగా ఉండేది. ఈలాటి వ్యామోహాన నుండి వారిని విముక్తులచేసే ఉద్దేశంతో బోసు తన సంఘాన్ని స్థాపించి కొంత విజయాన్ని సాధించాడు. అతడు చూపిన మార్గంలో నడిచే ఉద్దేశంతో మిత్ర 1867లో కలకత్తాలో హిందూమేల అనే సంస్థను స్థాపించాడు. ఒక బెంగాలీ ప్రజలలోనేగాక యావద్భారత ప్రజలలో జాతీయ చైతన్యం కలిగించడమే అతని ఉద్దేశం. ఇందుకగాను అతడు ఏటేట దేశంలోని వివిధ ప్రాంతాలలో తయారైన వస్తువుల ప్రదర్శనాన్ని ఏర్పాటుచేసి స్వదేశ వస్తువులపట్ల ప్రజలకు గాఢాభిమానం కలగడానికి దానిని ఒక పటిష్ట సాధనంగా ఉపయోగించాడు. ఈ ప్రదర్శనలు 1880 వరకు చాలా విజయవంతంగా కొనసాగాయి. ప్రదర్శనలతోపాటు అతడు కవిసమ్మేళనాలను కూడా ఏర్పాటు చేసేవాడు. బెంగాలీ భాషలో ప్రధానంగా జాతీయగీతాలను రచించినవారు ఈ సమ్మేళనాలలో పాల్గొన్న కవులే. బింకించంద్రునికి వీరు మార్గదర్శకులయ్యారు.

ఈలాటి స్వదేశీ ఉద్యమాన్ని మహారాష్ట్రంలో గణేశవాసుదేవజోషి. 1872 ప్రాంతాన ప్రారంభించి పటిష్టంగా నడిపాడు. ప్రజలందరు సాధ్యమైనంత వరకు విదేశీ వస్తువుల వాడకాన్ని మాని స్వదేశవస్తువులను వాడవలసిందిగా ప్రచారం చేశాడు. దీనిచే ప్రభావితులైన వారిలో కొందరు ఏ పరిస్థితులలో కూడా తాము విదేశవస్తువులను వాడమని శపథం చేశారు. ఈ ఉద్యమం గుజరాతు రాష్ట్రానికి కూడా వ్యాపించింది. కొవ్వొత్తులు, సబ్బులు, సిరా మొదలైన సామాన్య వస్తువులను తయారుచేసే పరిశ్రమలను కొన్నిటిని వీరు స్థాపించారు వీరుకూడా అనేక వస్తుప్రదర్శనలను ఏర్పాటు చేశారు. విద్యాధికులైన వీరికి సాంకేతికనైపుణ్యం ఎక్కువగా లేనందునను, పరిశ్రమలకు కావలసిన మూలధనం వీరు సమకూర్చలేనివారు కావడంచేతను ఈ పరిశ్రమల మూలంగా గొప్ప ఫలితం చేకూరకపోయినా ఈలాటి నిర్మాణాత్మకములైన ఉద్యమాల మూలంగా ఆర్థికరంగంలో జాతీయత వృద్ధిగాంచడం గర్తించ దగిన విషయం. శైశవదశలో ఉన్న జాతీయతకు మిత్ర జోషి మొదలైనవారు బలాన్ని చేకూర్చారు.

## 5

1858 తర్వాత ప్రభుత్వంకూడా అనేక ఆర్థిక చిక్కులను ఎదుర్కొనవలసివచ్చింది. ఖర్చులు విపరీతంగా పెరిగి పోవడంచేత కొత్త పన్నులను విధించవలసిన అవసరం ఏర్పడింది. ఈపన్నులలో కొన్ని ప్రజలకు అపరిచితములైనవి కావడంచేత వాటిని ప్రతిఘటించే సందర్భంలో దేశవ్యాప్తమైన ఆందోళనను లేవదీశారు. అన్ని రాష్ట్రాలవారు కలసికట్టుగా కృషిచేయడం, వాటిలో జాతీయత మరింత బలపడడం జరిగింది. ఆర్థిక పరిస్థితులు దిగజారడం జాతీయతకు ఏలాగు సహకారి అయిందో ప్రభుత్వంయొక్క ఆర్థికవిధానం కూడా ఆలాగే

జాతీయతను పెంపొందించిందని గుర్తించడం అవసరం.

కంపెనీ పరిపాలన కాలంలోకూడా యుద్ధాలు కారణంగా ప్రభుత్వం ఖర్చులకు తగినట్లు పన్నులద్వారా ఆదాయాన్ని పెంచుకొనే స్థితిలో లేకుండా ఉండేది. బడ్జెటులో (ఆదాయవ్యయపట్టికలో) లోటు తప్పేదికాదు, 1857-58 తిరుగుబాటు ఫలితంగా ఈలోటు మరింత పెరిగింది. తిరుగుబాటును అణిచేసందర్భంలో ప్రభుత్వఖర్చులు మితిమీరి పోయాయి. అధిక మొత్తంలో అప్పులు చేయడం అవసరమైంది. చెల్లించవలసిన వడ్డీలు పెరిగిపోయాయి.

ఈక్లిష్టపరిస్థితిని ఎదుర్కొనుటకు 1859లో లైసెన్స్పన్ను నొకదానిని ప్రభుత్వం తలపెట్టింది. వృత్తిలమూలంగా వ్యక్తులు సంపాదించే ఆదాయాన్ని ఆధారంగా చేసుకొని వారివద్దనుండి పన్నులు వసూలు చేయడం దీని ఉద్దేశం. ఇది ఒకవిధమైన ప్రత్యక్షపన్ను. ఈలాటి పన్నులు దేశానికికొత్త. ఇది వర్తక వ్యాపారాలు చేసేవారికి మాత్రమే వర్తించేది. జమీందార్లు మొదలైన భూస్వాములు దీనిని చెల్లించవలసిన అవసరంలేదు. ఇది కొత్తపన్ను కావడం చేతను, ఎక్కువగా ఆదాయం సంపాదించే భూస్వాములకు ఇది వర్తించక పోవడంచేతను కలకత్తాలోని బ్రిటిష్ వర్తకులు తదితరులు దీనిని ప్రతిఘటించడంలో నాయకత్వం వహించారు. అన్నిరాష్ట్రాలకు ఈ ఆందోళన వ్యాపించింది. బ్రిటిష్వారి ప్రతిఘటనను ఎదుర్కొనలేక ప్రభుత్వం ఈపన్నును ఉపసంహరించుకొన్నది. పన్నుల విషయంలో దేశవ్యాప్తమైన ఆందోళన ఈపన్నుతో ప్రారంభమైన విషయం గుర్తించడం అవసరం.

1860లో లైసెన్స్ పన్నుస్థానే ఆదాయపు పన్నును విధించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఆదాయపు పన్నుకూడా దేశానికికొత్త. కాని ఈ మధ్యకాలంలో ప్రభుత్వం ఏలాగో బ్రిటిష్వర్తకులను అనునయించ గలిగింది. దీనిని ప్రతఘటించే విషయంలో వారు ఎక్కువ శ్రద్ధను వహించలేదు. దీనిని ప్రతిఘటించిన వారిలో అధిక సంఖ్యాకులు ధనిక వర్గాలకుచెందిన భారతీయులే. వారు దేశవ్యాప్తంగా ఆందోళనను జరిపినా ఆర్థిక చిక్కులను ఎదుర్కొనుటకు మార్గాంతరం లేనికారణాన ఆదాయపన్నును విధించడం తప్పిందికాదు. ఈపన్ను అయిదు సంవత్సరాలు మాత్రమే అమలులో ఉండేటట్లు ప్రభుత్వం హామీ ఇవ్వడంచేత ప్రజల అసంతృప్తి కొంత తగ్గింది.

1870 తర్వాత ఈ హామీ ప్రకారం ప్రవర్తించడం ప్రభుత్వానికి సాధ్యం కాలేదు. ఖర్చులు పెరుగుతూనే వచ్చాయి. దేశంలో ధరలు పెరగడం. ఉద్యోగుల జీతాలు పెంచవలసిన అవసరం ఏర్పడం దీనికి ప్రధానకారణాలు. అందుచేత 1870లో ఆదాయపు పన్నును తిరిగీ విధించడం తప్పిందికాదు ఇది పన్నులు వసూలుచేసే ఉద్యోగుల అవినీతికి లంచగొండి తనానికి నిరంకుశత్వానికి దారితీస్తుందనీ, ప్రజల ఆదాయాన్ని నిర్ణయించే మిషతో వారిని అనేకవిధాలుగా ఇబ్బంది పెట్టడం తప్పదనీ అనేకులు వాదించారు. అనేక పట్టణాలలో హరతాళ్లు, కొన్ని ప్రాంతాలలో దౌర్జన్యకాండలు సంభవించాయి. ప్రజలు అనేక

విధాలుగా వారి నిరసనను తెలియపరచారు. 1860లో జరిగినట్లే అన్ని రాష్ట్రాలలోని వారు కులమత వివక్షతలేక ఈ ఆందోళనను కలిసికట్టుగా సాగించారు. ప్రభుత్వంపట్ల అసంతృప్తి బాహుళ్యంగా వ్యాపించింది. 1875లో ఈపన్ను రద్దు చేయబడింది.

ఇదేకాలంలో ప్రప్రథమంగా మునిసిపల్ సభలను జిల్లాబోర్డులను స్థాపించడం జరిగింది. ఇవికూడా ఇండ్లపన్ను, రోడ్డుసెస్సు మొదలైన కొత్త పన్నులకు దారితీసి ప్రజలలో మరింత అసంతృప్తిని కలిగించాయి. పరాయి ప్రభుత్వంపట్ల విముఖత్వమూ ద్వేషమూ బలపడడానికి ఈలాటి పన్నులన్నీ పటిష్ట సాధనాలైనాయి.

పన్నులగురించి దేశవ్యాప్తంగా ఆందోళన జరుగుతుండిన ఈకాలంలో మరిరెండు పరిణామాలుకూడా సంభవించాయి. రాజకీయ చైతన్యంగల విద్యాధికులూ ఇతర ప్రముఖ వర్గాలవారూ ప్రభుత్వవ్యయ విధానాన్ని తీవ్రంగా విమర్శించసాగారు. పరిపాలన శాఖలలోను సైనికదళాలలోను అత్యధికంగా తెల్లవారిని ఉద్యోగులుగా నియమించడం మూలాననే ప్రభుత్వఖర్చులు మితిమీరి పెరిగిపోతున్నవని వీరు వాదించసాగారు. తెల్లవారికి బదులు భారతీయులను నియమించిన పక్షాన వారికియ్యవలసిన జీతబత్యాలు తక్కువ కావడంచేత ప్రభుత్వఖర్చులు తగ్గే అవకాశము ఎంతైనా ఉన్నదనిన్నీ, ఇదిజరిగిన పక్షాన కొత్తపన్నులకు అవసరం ఉండదనీ వారు సహేతుకంగా నివేదికలను సమర్పించారు. భారతదేశం తరపున బ్రిటన్‌లో అధికారులు చేసే హోంచార్జీలనే ఖర్చులు భారతీయులు భరించవలసినవి కావని, వాటిని భారతీయులపై రుద్దడం అన్యాయమనీ వీరు తీవ్రంగా వాదించారు. రైళ్ళు మొదలైన వాటివిషయంలో కూడా బ్రిటిష్ పెట్టుబడిదార్ల ప్రయోజనాలకుగాను అనవసరములైన ఖర్చులు జరగడాన్నికూడా ప్రభుత్వదృష్టికి వీరు తెచ్చారు. ప్రభుత్వం అనుసరించే ఆర్థిక విధానాన్ని క్షుణ్ణంగా విచారణ చేయుటకు ఒక కమీషన్‌ను ఏర్పరచడం అవసరమని కూడా వీరు వాదించారు. ప్రభుత్వం ఎదుర్కొనవలసిన చిక్కులన్నిటికీ తెల్లజాతి ఉద్యోగులకుగాను చేసే ఖర్చులూ బ్రిటన్‌లోని ప్రజల ప్రయోజనాల పట్ల ప్రభుత్వం వహించిన పక్షపాతమూ ప్రధాన కారణాలనే నిర్ణయానికి వీరు వచ్చారు. ఈ వాదాన్ని సాగించడలోను, ఈనిర్ణయానికి రావడంలోను అన్ని రాష్ట్రాలలోని వారు ఐకమత్యంతో ప్రవర్తించారు. వీరి వాదంలో ఉన్న సహేతుకత్వాన్ని అధికారులలో కొందరు, బ్రిటన్‌లోని పార్లమెంటు సభ్యులు కొందరు గుర్తించడం కూడా జరిగింది.

ఈఆందోళన సందర్భంలోనే ఇంకొక పరిణామం కూడా సంభవించింది. బ్రిటన్‌లోని రాజకీయ వ్యవస్థలో పన్నులను విధించే అధికారం ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులకు మాత్రమే ఉండవలెననేదే మూలసూత్రం అని చెప్పవచ్చు. బ్రిటిష్‌వారి రాజ్యాంగ చరిత్ర అంతా ఈ సూత్రాన్ని ఆచరణయోగ్యంగా చేయడంతో ముడిపడినట్టిది. అమెరికాను పాలించడంలో ఈ సూత్రాన్ని

పాటించని కారణంచేతనే బ్రిటిష్‌వారిపై అమెరికనులు స్వాతంత్ర్య యుద్ధాన్ని సాగించి, బ్రిటిష్‌సామ్రాజ్యాన నుండి వేరుపడి స్వతంత్రులయ్యారనేది భారతీయ విద్యాధికులకు తెలియని విషయంకాదు. భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వం "ప్రాతినిధ్యంలేక పన్నులు ఉండరాదు" (No Taxation without Representation) అనే బ్రిటిష్‌రాజ్యాంగ మౌలికసూత్రానికి భిన్నంగా దేశాన్ని పాలించడం ప్రభుత్వఖర్చులు పెరగడానికీ, ప్రజలపై భరించలేని పన్నులు విధించడానికీ ప్రధాన కారణమనీ, శాసనసభలలో ప్రజలకు ప్రాతినిధ్యం లభించినగాని వారికి న్యాయం జరగదనీ స్పష్టం చేశారు. ఇందులో కొంత సత్యం ఉన్నట్లున్నూ, ప్రజల అభిప్రాయం తెలియని కారణం చేతనే 1857-58 తిరుగుబాటును నివారించలేక పోయినట్లును, అధికారులు గ్రహించారు. పరిపాలన విధానంలో-అందులో ప్రధానంగా శాసనాలను చేయడంలో - ప్రజాభిప్రాయానికి ప్రాధాన్యం కల్పించే ఉద్దేశంతో 1861లో శాసనసభలకు సంబంధించిన చట్టాన్ని ఒకదానిని పార్లమెంటుచేసి, కేంద్రశాసనసభలోను, మద్రాసు బొంబాయి రాష్ట్ర సభలలోను, కొందరు భారతీయులకు సభ్యత్వం కల్పించారు. ఒక శతాబ్దంగా బ్రిటిష్‌వారు దేశాన్ని పాలించేవారైనా పరిపాలనలో భారతీయులకు సంబంధం ఏర్పడడంలో ఇదే మొదటిమెట్టు.

పై వివరణవలన ప్రభుత్వం 1858 తర్వాత ఎదుర్కొన్న ఆర్థికసమస్యలు చిక్కులు ప్రజలలో జాతీయత వ్యాపించడానికి ఒక సాధనమైనదని స్పష్టం చేస్తుంది. జాతీయత అంకురించి వృద్ధిగాంచడంలో అనేక పరిస్థితుల ప్రభావం కనుపిస్తుంది. వాటిలో ప్రభుత్వం అనుసరించిన ఆర్థిక విధానానికి ప్రాధాన్యం ఉండడం గుర్తించతగ్గది.

చదువ దగిన గ్రంథాలు :

Bhavan - Vol X - 1st and 2nd parts

Tarachand - Vol II and III.

Dadabhai Nowrogi - Poverty and un-British rule in India.

R. C. Dutt : Economic History of India and India in Victorian age.

Ranade : Essays.

# అధ్యాయము - 4

## మత ఉద్యమాలు - జాతీయత

### 1

దేశంలోని ప్రజలలో జాతీయత అంకురించి వృద్ధిగాంచడంలో మతసంస్కరణ గొప్పప్రభావాన్ని వహించింది. ఇదే విధంగా జాతీయత కూడా మత సంస్కరణకు దారితీసింది. విద్యాధికులలో జాత్యభిమానము జాతిపట్ల విశ్వాసము పెంపొందడంచేత మతసంస్కరణ జరిగినట్లు చెప్పవచ్చు. ఇందుచేత మత సంస్కరణ జాతీయత—ఈ రెండూ పరస్పరాశ్రయాలుగా రూపొందాయి.

మతసంస్కరణ దేశానికి కొత్తకాదు. వేదయుగంలో ఏర్పడిన మతంలో కాలక్రమాన ఎన్నోమార్పులు సంభవించాయి ఉపనిషత్తులు, షడ్దర్శనాలు బహుప్రాచీన కాలంలో జరిగిన మార్పులను సూచిస్తున్నాయి. తర్వాత వర్ధిల్లిన బౌద్ధ జైనాలు మతంలో మరికొన్ని మార్పులను ప్రవేశ పెట్టాయి. మధ్య యుగంలో ముస్లింల పరిపాలన దేశంలో స్థాపితం కావడంచేతను, దానిఫలితంగా ఇస్లాం మత ప్రచారం చురుకుగా జరగడం చేతను మతంలో అనేక మార్పులు వచ్చాయి. ఉభయమతాల మధ్య సామరస్యం కల్పించే ఉద్దేశంతో వాటిలోని ప్రధానసత్యాలన్నిటినీ సమన్వయ పరచి గురునానక్, కబీరు మొదలైనవారు మతతత్వంలోను ఆచారాలలోను అనేక మార్పులగావించి అనుచరులనేకులు సంపాదించారు. మోక్షసాధనకు భక్తి ఒక్కటే మార్గమని ప్రబోధించిన చైతన్యుడు, రామానందుడు, వల్లభాచార్యులు, తుకారాం, రామదాసు మొదలైనవారు ఇస్లాం మతం చేత ప్రభావితులైనట్లు చరిత్రకారులనేకుల అభిప్రాయం. మధ్యయుగంలో హిందూ ఇస్లాంమతాలమధ్య పోటీ ఏర్పడడం చేత ముస్లింలు హిందూమతము మూలానను, హిందువులు ఇస్లాంమతంమూలానను వారివారి మతాలలో అనేక సంస్కరణలు చేసుకోనడం జరిగింది.

బ్రిటిష్ పరిపాలన ఫలితంగా ఇంగ్లీషు విద్యవ్యాపించి పాశ్చాత్య సంస్కృతితో విద్యాధికులకు సంబంధంకలగడం చేతను, క్రైస్తవమతాన్ని ప్రచారంచేసే ఉద్దేశంతో మిషనరీలనేకులు దేశానికి రావడంచేతను మత చరిత్రలో నూతన శకం ప్రారంభమైంది. మధ్యయుగంలో హిందూ ఇస్లాంమతాలమధ్య పోటీఏర్పడినట్లు, 19వ శతాబ్దంలో ఈ రెండు మతాలకు క్రైస్తవమతంతో పోటీఏర్పడింది. క్రైస్తవమత ప్రచారకులు ఈ రెండు మతాలలో అనేక లోపాలున్నట్లును, వాటి మూలంగా పరమార్థాన్ని సాధించి మోక్షాన్ని

పొందడం సాధ్యం కానట్లును, మానవులుతరించుటకు క్రైస్తవ మతం ఒక్కటే సాధనమైనట్లును ప్రచారం సాగించి, నయానను భయానను ప్రజలలో కొందరిని తమమతంలోకి చేర్చుకొనగలిగారు. వీరి ప్రయత్నాలను ప్రతిఘటించి తమమత మతాలను రక్షించుకొనడం అవసరమని ప్రముఖులైన హిందువులు ముస్లింలు భావించారు. దీని ఫలితంగా ఈ రెండు మతాలలోను—అందులో ప్రధానంగా హిందూమతంలోను— కొత్తదృక్పథం ఏర్పడడం, అనేకమార్పులు రావడం జరిగింది. మధ్య యుగంలో ఇస్లాంమతాన్ని ఎదుర్కొని హిందూమతం నిలబడి నట్లే, ఆధునిక యుగంలో క్రైస్తవమతాన్ని ఎదుర్కొని హిందూమతం నిలబడి తన వ్యక్తిత్వాన్ని చైతన్యాన్ని సుస్థిరంచేసుకోకలిగింది.

పరిణతగాంచిన హిందూ ఇస్లాం క్రైస్తవ మతాల వంటి మతాల మధ్య ఎన్నో పోలికలున్నాయి. సృష్టిస్థితి లయకర్త అయిన భగవంతుడొకడున్నాడనే విశ్వాసం, అతని మహిమలను తెలియపరచే వేదాలు ఉపనిషత్తులు భగవద్గీత బైబిలు కురాన్ మొదలైన గ్రంథాలను పవిత్ర గ్రంథాలుగా భావించి వాటి లోని విషయాలన్నిటినీ నమ్మడం, అతని అనుగ్రహాన్ని సంపాదించి తరించుటకు ప్రార్థనలు పూజాపునస్కారాలు సాధనాలని గుర్తించడం, పవిత్రగ్రంథాలను వ్యాఖ్యానించుటకు పూజాపునమస్కారాలను చేయించుటకు బ్రాహ్మణులు, పాధరీలు, ఉలేమాలవంటి ఒక పౌరోహితవర్గాన్ని ప్రత్యేకించడం— అన్నిమతాలకు ప్రధాన లక్షణాలు. మతాలలోని సంస్కరణలన్నీ ఈ లక్షణాలకు సంబంధించి నట్టివి. మత ఉద్యమాలన్నీ వీటికి సంబంధించినట్టివే.

ఈ సందర్భంలో హిందూమతానికి తక్కిన మతాలకు ఒక భేదం ఉండడాన్ని గుర్తించడం అవసరం. హిందూమతం ఇతర మతాల వారిని తనలో చేర్చుకొనుటకు ప్రయత్నంచేయదు. మతం అనేది భగవంతుని చేరుటకు మార్గం అనీ, ఒక్కొక్క మతం అందుకై ఏర్పడిన ఒక ప్రత్యేక మార్గం అనీ, వీటిలో ఏ మార్గాన్ని అనుసరించినా భగవంతుని చేరడం సాధ్యమనీ, ఈ కారణంచేత మతాలమధ్య పోటీ ఏర్పడ వలసిన అవసరంలేదనీ హిందూమతం బోధిస్తుంది. క్రైస్తవ ఇస్లాం మతాలు ఈ వాదాన్ని అంగీకరించవు. తమతమ మతాలలో మాత్రమే సత్యం ఉన్నదనీ, మానవులందరు తమమతాన్ని స్వీకరించడం అవసర మనీ, అప్పుడుగాని వారు మోక్షాన్ని సంపాదించలేరనీ ఈ రెండు మతాల నమ్మకం. ఏదోవిధంగా ఇతర మతాలవారిని తమ మతంలో చేరునట్లు ప్రోత్స హించడం వీటి లక్ష్యం. ఇందుచేతనే మధ్య యుగంలో హిందూ ఇస్లాంలమధ్యను ఆధునికయుగంలో హిందూ ఇస్లాంక్రైస్తవ మతాల మధ్యను పోటీఏర్పడడం జరిగింది.

హిందువులను క్రైస్తవులుగా మార్చే ప్రయత్నంలో క్రైస్తవ మత ప్రచారకులు హిందూమతాన్ని పరిపరివిధాల విమర్శించి ఖండించారు. ఈ విమర్శనలను ఖండనలను ఎదుర్కొనడంలో హిందువులు తమమతాన్ని గురించి పునరాలోచన చేయడం, దానిలోని లోపాలను సరిదిద్దుకొని దానిని శుద్ధపర

చడం, దానిలోని ఉత్కృష్టతను నిరూపించడం అవసరం అయింది. 19వ శతాబ్దాన నుండి దేశంలో ప్రఖ్యాతిగాంచిన మత ఉద్యమాలన్నీ ఈ అవసరాన్ని తీర్చుటకు ఉద్దేశింపబడి నట్టివి.

ప్రథమంలో ఈ ఉద్యమాలను తలపెట్టినవారు ఇంగ్లీషు విద్య చేతను పాశ్చాత్యసంస్కృతి చేతను ప్రభావితులైన విద్యాధికులు, వీరిలో రెండుశాఖలు ఏర్పడినట్లు చెప్పవచ్చు. ఒకశాఖకు చెందినవారు పాశ్చాత్య ప్రపంచంలో ప్రాబల్యంగాంచిన విజ్ఞానశాస్త్ర (Science) దృష్ట్యా మతాన్ని విమర్శించారు. ఈశాస్త్రానికి ప్రయోగాత్మకమైన హేతువాదం ఆధారం. హేతువాదం (Reason) ద్వారా తెలుసుకొన్న జ్ఞానమే వాస్తవమైన జ్ఞానమనీ. హేతువాదానికి నిలబడగల సత్యమే వాస్తవమైన సత్యమని, విజ్ఞానమని. విజ్ఞానశాస్త్రం ప్రతిపాదిస్తుంది. మతసత్యాలేవీ— భగవంతుని అస్తిత్వము, పూజాపునస్కారాల ప్రభావం, పవిత్రగ్రంథాలలోని విషయాలలో అనేకం- హేతువాదానికి నిలబడేవి కావు అందుచేతనే భగవంతు డున్నాడని కొందరు, లేడని మరికొందరు, ఉన్నదీ లేనిదీ నిర్ణయించడం సాధ్యంకాదని యింకొక వర్గంవారు అనాదిగా వాదించడం, వీరిమధ్య ఏలాటి సామరస్యం కుదరకపోవడం జరుగుతూ ఉంది. మానవులలో ఆస్తికులతోపాటు నాస్తికులు సంశయాత్ములు ఉంటూ ఉన్నారు. యూరోపు ఖండంలో విజ్ఞానశాస్త్రం 15వ శతాబ్దానము నుండి వృద్ధిగాంచడం మూలాన నాస్తికుల యొక్కయు సంశయాత్ముల యొక్కయు సంఖ్య పెరిగింది, మతం పట్ల భక్తిశ్రద్ధలు సన్నగిల్లాయి,

భారతదేశంలో ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్నవారిలో మొదటి తరానికి చెందినవారనేకులు విజ్ఞానశాస్త్రంచేత ప్రభావితులై నాస్తికులుగా ప్రవర్తించారు. మతంలో మూఢనమ్మకాలు తప్ప మరేవీ లేవని భావించి హిందూమతాన్ని తూలనాడి హేళనచేసే ధోరణిలో వీరు పడిపోయ్యారు. మతమే అవసరంలేదని వీరు భావించారు. కాని వీరికి సమాజంలో ఎక్కువ పలుకుబడి లభించలేదు మతాన్ని దూషించడంతో పాటు వీరు మతం నిషేధించిన మద్యపానం, గోమాంసభక్షణ, మొదలైన దురలవాటులకు లోబడిన వారయ్యారు వీరికి ప్రాబల్యం చేకూరక పోవడానికి ఇది ఒక కారణమైంది.

దీనికి తోడు హిందూమతాభిమానులైన ఆస్తికులు వీరివాదాన్ని ఖండించగలిగారు. విజ్ఞానశాస్త్రం ఇంద్రియ గోచరమైన భౌతిక ప్రపంచానికి సంబంధించిన రహస్యాలను సత్యాలను కనుగొనుటకు మాత్రమే సాధనమనీ, ఇంద్రియాలకు గోచరంగాని అతీంద్రియ ప్రపంచం ఒకటి ఉన్నదనీ, దానిని తెలుసుకొనుటకు యోగంవంటి సాధనాంతరాలున్నవనీ, ద్రష్టలు, ఋషులు, యోగులు, తాపసులు, ఆలాటి సాధనాలను ఉపయోగించి ఇంద్రియాలకు ప్రత్యక్షంగా గోచరించని సత్యాలను తెలుసుకొనగలిగినారనీ, అలాటి సత్యాల సముదాయమే మతమనీ, నాస్తికుల వాదాన్ని ఎదుర్కొన్నారు. ఇందుచేత కూడా నాస్తిక శాఖ ప్రాబల్యాన్ని సంపాదించలేకపోయింది,

ఇంగ్లీషు విద్యనభ్యసించినవారిలో రెండవ శాఖకు చెందినవారు మానవ జీవితంలో మతానికి గొప్ప ప్రాధాన్యం ఉన్నదని విశ్వసించినవారు. అది ఆముష్మిక సౌఖ్యానికి గాక ఐహిక సౌఖ్యానికి కూడా పటిష్ట సాధనమని భావించినవారు, మానవ సమాజం పరస్పర సంఘర్షణకు లోనుగాక సుస్థిరంగా నిలబడుటలోను, మానవులమధ్య ప్రేమాభిమానాలు పెంపొందడంలోను సహజీవనంసాధ్యమగుటలోను మతం వహించే పాత్ర అమోఘమైనట్టిదని వీరు నమ్మినవారు. హిందువులలో కొందరు స్వీయమతాన్ని విడనాడి క్రైస్తవమతంలో చేరడాన్ని వీరు గర్హించారు. హిందూమతంలోలేని సత్యాలు క్రైస్తవ మతంలో ఉన్నట్లు పరిగణించడం హాస్యాస్పదమని వీరు నిరూపించారు.

క్రైస్తవ మత ప్రచారకుల దృష్టిలో ఏవి హిందూమతంలోని లోపాలో అవి హిందూమత మౌలిక సిద్ధాంతాలకు సంబంధించినట్టివి కావనీ, మౌలికములైన పవిత్ర గ్రంథములేవీ వాటిని సమర్థించడం లేదనీ, అవి నిప్పును కప్పిన నివురు వంటివి అనీ, కాల ప్రభావంచేత మతంలోకి దొడ్డిత్రోవద్వారా ప్రవేశించినట్టివనీ, నివురును తొలగించిన పక్షాన శుద్ధమైన నిప్పుయొక్క వెలుగు ప్రస్ఫుటమైనట్లే కాల మహిమచే మౌలిక సత్యాలను కప్పిన లోపాలను తొలగించిన పక్షాన శుద్ధమైన హిందూ మతతత్వం వెలుగులోకి రాగలదని, ఆ తత్వం క్రైస్తవ మత తత్వానికి ఏవిధంగాను తీసిపోనట్టిదికాదని స్వీయమతాభిమానులైన ఇంగ్లీషు విద్యాధికులు వాదించి, లోపాలను తొలగించి శుద్ధమైన తొలికాలపు హిందూమత స్వరూపాన్ని ప్రస్ఫుటంచేసి, తదనుసారం హిందూమతాన్ని సంస్కరించారు.

## 2

ఈ సంస్కర్తలకు పితామహుడని పేర్కొన వలసినవాడు రాజారామ మోహన రాయ్ (1774-1833). ఇతడు బెంగాలు రాష్ట్రంలోని ఒక శిష్ట బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి పెరిగినవాడు. గొప్పమేధావి. అప్పటికాలాను సారంగా పర్షియన్ అరబ్బీ భాషలను నేర్చుకొని ముస్లింల పవిత్ర గ్రంథమైన ఖురానును చక్కగా అర్థంచేసుకొని అది ప్రతిపాదించిన ఏకేశ్వరతత్వం చేతను విగ్రహారాధన నిషేదంచేతను ప్రభావితుడైనాడు. తర్వాత సంస్కృతభాషను నేర్చుకొని వారణాసిలోని శాస్త్రవేత్తల సహాయంతో హిందూమత గ్రంథాలను అధ్యయనం చేశాడు. అటుతర్వాత హిమాలయ ప్రాంతాలలోను టిబెటు దేశంలోను సంచారంచేసి బౌద్ధమతంలోని రహస్యాలను గ్రహించాడు. కాలక్రమాన బెంగాలు రాష్ట్రంలోని క్రైస్తవ మతప్రచారకులతో సన్నిహితసంబంధాన్ని సంపాదించి బైబిలు గ్రంథాన్ని క్షుణ్ణంగా పరిశీలించి దాని తొలిరూపానికి సాధనాలైన హిబ్రూ గ్రీకు భాషలను నేర్చుకొన్నారు. ఈవిధంగా అనేక భాషలలోను అనేక మతాలలోను పాండిత్యాన్ని సంపాదించి దానిసహాయంతో హిందూమత సిద్ధాంతాలలోని గుణదోషాలను పరిశోధింప బూనుకొన్నాడు. అతని గొప్పతనమంతా ఇందులోనే కనుపిస్తుంది. మొదటితరానికి చెందిన ఇంగ్లీషు విద్యాధికులు హిందూ

మత గ్రంథాలను చదవలేక, వీటితో ఎలాటిసంబంధమూలేని ఇంగ్లీషు గ్రంథాల సహాయంతో హిందూమతాన్ని ఖండించినట్టివారు. అందుచేతనే వీరి ఖండనలకు విలువ లేకపోయింది.

రామమోహన రాయ్ 1805-1814 మధ్యన కొన్ని సంవత్సరాలకాలం తూర్పు ఇండియా కంపెనీ క్రింద ఉద్యోగంచేసి 1814 తర్వాత తనకాలాన్ని మత సంస్కరణకై ప్రధానంగా వినియోగించాడు. ఆధునిక యుగంలో మత ఉద్యమాలను సాగించిన వారిలో అతడు మొదటివాడు. అతడు సూచించిన సంస్కరణలు బెంగాలు రాష్ట్రంలోని విద్యాధికులపై అత్యధిక ప్రభావం వహించాయి. కొన్ని సంస్కరణల విషయంలో బ్రిటిష్ అధికారులు కూడా అతని చేత ప్రభావితులయ్యారు.

ఆనాటి క్రైస్తవ మత ప్రచారకులు హిందూమతంలో బహు దేవతారాధన, విగ్రహారాధన, వర్ణవివక్షణ అనే గొప్పలోపాలు మూడు ఉన్నట్లును, ఆ కారణంచేత అది అనుసరణయోగ్యం కానట్లును ప్రచారంచేశారు. దీనిని ప్రతిఘటించడం అవసరమని రాయ్ నిర్ణయించుకొన్నాడు. ఈ మూడు లక్షణాలను హిందూమతానికి మౌలికములైన వేదాలు, ఉపనిషత్తులు, వేదాంత సూత్రాలు సమర్థించడం లేదని. ఇవి “ఏకమేవాద్వితీయంబ్రహ్మ” అనే ఏకేశ్వర సిద్ధాంతాన్ని ప్రతిపాదించునట్టివి అని, వీటిలో విగ్రహారాధన గురించిగానీ తరతమ భేదంతో కూడు కొన్న వర్ణవ్యవస్థగురించిగాని ఏలాటి ప్రస్తావనలేదనీ, ఇవి మధ్యకాలంలో హిందూమతంలో ప్రవేశించిన అవాంఛనీయములైన లక్షణాలనిన్నీ వీటిని ఆధారం చేసుకొని హిందూమతాన్ని ఖండించడం క్రైస్తవ మత ప్రచారకుల అజ్ఞానానికి తార్కాణమన్నాడు. హిందువులు విగ్రహారాధన మాని, వర్ణ విభేదాలను విసర్జించి, ఏకేశ్వరోపాసనను అనుసరించవలసి ఉన్నదని ప్రచారం చేశాడు. ఈ సంస్కరణలు జరిగినప్పుడే హిందువులు వాస్తవమైనట్టిన్నీ శుద్ధమైనట్టిన్నీ మౌలికమైనట్టిన్నీ హిందూమతాన్ని అవలంబించిన వారవుతారు. వారి మౌలిక గ్రంథాలన్నీ ఈ లాటి వైదిక మతాన్నే ప్రతిపాదిస్తున్నాయి అని అతడు అనేక గ్రంథాలను రచించి రుజువు చేశాడు. ఈ సందర్భంలోనే అతడు కొన్ని ఉపనిషత్తులను, వేదాంతసూత్రాలను బెంగాలీ భాషలోకి అనువదించాడు.

ఉపనిషత్తులు ఈశ్వరుని బ్రహ్మ అని పేర్కొనడంచేత ఆ పేరుతోనే ఈశ్వరుని పూజించడం సమంజసమని రాయ్ బోధించాడు. విద్యాధికులుకొందరు అతనికి అనుచరులయ్యారు. వీరందరు కలిసి 1828లో కలకత్తా నగరాన బ్రహ్మ సమాజమును స్థాపించారు. ఈ సమాజ సభ్యులు వారం వారం క్రైస్తవుల వలె కలిసి సామూహిక ప్రార్థనలు జరపడం, భక్తి గీతాలు పాడడం, ప్రసంగాలు చేయడం పరిపాటి అయింది. ఒక విధంగా వీరు క్రైస్తవులను అనుకరించిన వారయ్యారు,

బ్రహ్మసామాజిక మతం ఒక ప్రత్యేక మైన మతంకాదని, అది హిందూ మతంలో ఒక భాగమగుటయే గాక వాస్తవమైన హిందూమతమని రాయ్

ప్రచారంచేశాడు. హిందువులందరు దీనిని అనుసరించ వలసినదిగా అతడు వాంఛించాడు. ఈ విధంగా హిందూమతసంస్కరణకు సంబంధించిన మొదటి ఉద్యమం బయలు దేరింది.

రాయ్ ప్రజ్ఞ బహుముఖ మైనట్టిది. వర్ణవిభేదాలు, కులతత్వాలు, సతీ సహగమనం, బహుభార్యాత్వం, స్త్రీల నిర్బంధ వైధవ్యం మొదలైనవి మతంలో సంబంధం లేనట్టి దురాచారాలనీ వీటిని నిర్మూలించడం హిందూమతానికి విరుద్ధం కాదనీ, వీటిని నిర్మూలించడం అత్యావసరమనీ రాయ్‌నిరూపించి సంఘ సంస్కరణోద్యమానికి పునాదులు వేశాడు. ఇతని ప్రోద్బలం చేత బ్రిటిష్ అధికారులు 1829లో సతీసహగమనాన్ని నిషేధిస్తూ ఒక చట్టం చేశారు. పరిపాలకులు పరాయి వారైనప్పటికీ సంఘంలోని దురాచారాలను చట్టం ద్వారా నిర్మూలించడం వారి కర్తవ్యమనే సూత్రాన్ని ఇతడు సమర్థించాడు. తర్వాతి కాలంలో దీనిని గురించి సంఘ సంస్కర్తలలో అభిప్రాయభేదాలు బయలు దేరాయి.

ఆనాటికి బ్రిటిష్ పరిపాలన దేశమందంతటా వ్యాపించలేదు. అది సుస్థిరంగా కూడా నాటుకోలేదు. అధికారాననుండి వారిని తొలగించి దేశస్వాతంత్ర్యానికి ప్రజలుపాటుపడడం అవసరమనే సమస్య బయలు దేరలేదు. బ్రిటిష్ పరిపాలన మూలంగాను, ఇంగ్లీషు విద్యమూలంగాను భారతీయులకు లాభమే గాని ఏలాటి నష్టమూ కలగదని రాయ్ భావించాడు మసల్మింలపరిపాలన కంటే వీరి పరిపాలన ఉత్తమమైనదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. కాని అతడు అన్ని రంగాలలో వ్యక్తిస్వేచ్ఛ ఉండడం అవసరమని విశ్వసించిన వాడు కావడం చేత బ్రిటిష్ పరిపాలకులు భారతీయుల వాక్స్వాతంత్ర్యానికి పత్రికాస్వాతంత్ర్యానికి ఇతర స్వాతంత్ర్యాలకు ఏలాటి భంగం కలిగించ రాదని వారికి నచ్చచెప్పాడు. ఆకాలానికి అతని రాజకీయ ఆశయాలు అత్యున్నతములని చెప్పడంలో ఏలాటి అతిశయోక్తి లేదు.

ఈ విధంగా మతరంగంలోనే గాక ఇతర రంగాలలో కూడా అమోఘమైన కృషిగావించి రాయ్ 1833 లో ఇంగ్లండులో దివంగతుడయ్యాడు. సముద్రయానం హిందువులు చేయరాదనే మధ్యయుగ సూత్రాన్ని లక్ష్యపెట్టక సముద్రయానం చేసిన ఆధునిక హిందువులలో అతడు మొదటివాడని గుర్తించడం ఈసందర్భంలో సముచితం. అతని స్వాతంత్ర్యప్రియత్వానికి, ధైర్యానికి ఇది ఒక నిదర్శనం.

ఏకేశ్వరోపాసనను సమర్థిస్తూ విగ్రహారాధనను వర్ణవిభేదాలను ఖండిస్తూ ఏర్పడిన బ్రహ్మసమాజం కాలక్రమాన ఇంగ్లీషు విద్యాధికులనేకులను ఆకర్షించి హిందువులు క్రైస్తవులుగా మారడాన్ని అరికట్టింది. ప్రథమ దశలో కలకత్తా నగరము బెంగాలు రాష్ట్రము దీనికి ప్రధాన కేంద్రములైనాయి.

రాయ్ అనంతరం సమాజ ప్రాబల్యానికి కృషి చేసినవాడు దేవేంద్రనాథ ఠాగూరు (1817 - 1903). టాగూరు కుటుంబం కలకత్తాలోని ప్రముఖ

టుంబాంలో ఒకటి. దేవేంద్రనాధుని తండ్రి ద్వారకనాధ టాగూరు సమాజా
కి కొంత ద్రవ్యసహాయం చేశాడు. దేవేంద్రనాధుడు 1838లో సమాజ సభ్యు
య్యాడు. ఇతడు ఆధ్యాత్మిక విషయాలలో ఆసక్తిగలవాడు. 1839లో ఇతడు
త్వబోధినీ సభను స్థాపించి దానిద్వారా మత చర్చలు సాగించాడు. ఇతడు
మాజానికి ఒక ప్రత్యేక నియమావళిని రూపొందించి, దానికి కట్టుబడిన వారు
మాత్రమే సభ్యులగుటకు అర్హులని నిర్ణయించాడు. సమాజ సిద్ధాంతాలను
ప్రచారం చేసే ఉద్దేశంతో తత్వబోధిని అనే పత్రికను అక్షయకుమార దత్తు అనే
మేధావి సంపాదకత్వాన నడిపాడు. బెంగాలు రాష్ట్రంలోని ప్రధాన పట్టణాలలో
సమాజశాఖలను స్థాపించి దాని పలుకుబడిని వృద్ధి చేశాడు.

సామాజికులు హిందూమత గ్రంధాలకు అనుగుణంగా ప్రవర్తించవలెననీ
తాము హిందువులనే మాటను వారు సర్వదాజ్ఞాపకముంచు కొనవలెననీ దేవేంద్ర
నాధుడు విధించాడు. హిందూమతాన్ని సంస్కరించుటకు ఇది గొప్ప సాధనము
కాగలదని అతని విశ్వాసము. దీనికితోడు అతడు సంఘసంస్కరణము పట్ల ఎక్కువ
శ్రద్ధను వహించలేదు. ఈకారణాలవల్ల యువతరం వారనేకులు అతడు పురోగామి
కాడనియు, అతని నాయకత్వంలో సమాజం వృద్ధిగాంచే అవకాశం సన్నగిల్లే
ప్రమాదం ఉన్నదనియు భావించి కేశవచంద్రసేన్ నాయకత్వాన అతనిపై తిరగ
బడ్డారు. దాని ఫలితంగా సమాజం "ఆది సమాజము", "అఖిలభారత సమాజము"
అనే పేర్లతో రెండు శాఖలుగా చీలిపోయింది. అఖిలభారత సమాజానికి కేశవచంద్ర
సేన్ నాయకుడయ్యారు.

కేశవచంద్రుడు (1838-84) గొప్ప మేధావి, అనర్గళంగా ఉపన్యసించే
మహావక్త, ఇతనిలో మతాసక్తి ఒక అగ్నిజ్వాలవలె వెలిగింది, ఇతని నాయకత్వం
లో బ్రహ్మసమాజ చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమైంది. ఆధ్యా
త్మికసత్యం ఒక హిందూమతంలో మాత్రమేగాక తక్కిన మతాలలో కూడా
ఉన్నదనీ, వాటిలో ప్రధానంగా క్రైస్తవమతం ఈ దృష్ట్యా ఎక్కువ విలువ
కలిగినట్టిదనీ, వివిధ మతాలలోని సత్యాలను బ్రహ్మసామాజికులు గ్రహించి ఒక
సర్వసమ్మతమైన మతాన్ని ప్రచారం చేయడం వారనుసరించదగిన మార్గమనీ
ఇతడు అభిప్రాయపడి దీనికి అనుగుణంగా సమాజ సిద్ధాంతాలలో మార్పులు
చేశాడు, హిందూమతం పట్ల ఒక విధమైన విముఖత్వాన్ని ప్రదర్శించాడు.
క్రైస్తవ మతంపట్ల ఎక్కువ శ్రద్ధను వహించాడు. దీనిమూలంగా బ్రహ్మమతం
విశ్వవ్యాప్తం కాగలదని విశ్వసించాడు.

ఇంతేకాక భారతీయులు తరించుటకు మత సంస్కరణ ఎంత అవసరమో
సంఘ సంస్కరణకూడా అంత అవసరమని భావించి, దాని విషయంలోకూడా
ఎక్కువ కృషిని గావించాడు. బ్రహ్మసమాజ సభ్యులు సంఘంలోని దురా
చారాలకు కట్టుబడరాదని శాసించాడు. స్త్రీలవిద్యకు ప్రాధాన్యం కల్పించారు.
బాల్య వివాహాలు జరుగరాదని, వర్ణాంతర వివాహాలు జరుగవలెనని. వివాహా
ల్లో మంత్రతంత్రాలకు స్థానం ఉండకూడదని తీవ్ర ప్రచారం చేశాడు. అధి

కారులుకూడా కొంతవరకు అతనితో ఏకీభవించి 1872లో లౌకిక వివాహచట్టాన్ని (Civil Marriage Act) ఒకదానిని చేశారు. తాము హిందూ ముస్లిం క్రైస్తవ మతాలలో దేనికీ చెందనివారని ప్రకటించుకొన్న యువతీ యువకులు సంప్రదాయ బద్ధమైన విధానాలతో నిమిత్తం లేక ఈ చట్టానుసారం వివాహ మాడుటకు అవకాశం ఏర్పడింది. దీనిని వినియోగించ దలచిన యువతుల వయస్సు 14కు కంటెను యువకుల వయస్సు 18కి కంటెను తక్కువగ ఉండరాదని చట్టం విధించింది. బ్రహ్మసమాజ సభ్యులలో అనేకులు ఈ చట్టానుసారం వివాహమా డడం చేత వారిలో బాల్య వివాహాల సంఖ్య తగ్గింది. ఇంతేగాక వారిలో వర్ణాంతర వివాహాల సంఖ్య కూడా పెరిగింది.

కేశవచంద్రుడు సంఘసంస్కరణంపట్ల ఉత్సాహంతోపాటు బ్రహ్మసమాజ సిద్ధాంతాలకు అఖిలభారత వ్యాప్తి లభించుటకై గొప్పకృషి చేశాడు. ఈ ఉద్దేశంతో అతడు 1864లో బొంబాయి మద్రాసు రాష్ట్రాల లోను, 1868లో ఉత్తరప్రదేశ్ లోను పర్యటించి. బహిరంగ సభలలో ఉపన్యాసాలు చేసి ప్రముఖు లనేకుల సానుభూతిని సంపాదించాడు. వీటి ఫలితంగా బొంబాయి పూనా నగరాలలో మహాదేవ గోవింద రానడె, రామకృష్ణ బండార్కరు మొదలైన ప్రముఖుల ఆధ్వర్యాన ప్రార్థన సమాజాలు స్థాపితములైనాయి. మద్రాసులోని ప్రముఖులు కొందరు దక్షిణ భారత బ్రహ్మసమాజమనే పేరుతో ఒక సంఘాన్ని స్థాపించారు. కేశవ చంద్రుడు సాగించిన ఈ ఉద్యమం ఆధునిక యుగంలో విద్యాధికులు సాగించిన మొదటి అఖిల భారత ఉద్యమంగా ప్రఖ్యాతి గాంచింది.

కేశవచంద్రుడు గొప్ప దేశాభిమాని. వైజ్ఞానిక సాంకేతిక శాస్త్రాలలో భారతదేశం పాశ్చాత్యుల నుండి నేర్చుకొనవలసిన విషయాలు అనేకం ఉన్నా ఆధ్యాత్మిక విజ్ఞానంలో పాశ్చాత్యులు భారతదేశంనుండి నేర్చుకొనవలసిన విషయాలు అనేకం ఉన్నట్లు సగర్వంగా ఘోషించాడు. ఆనాటి విద్యాధికులందరి వలెనే అతడు బ్రిటిషు పరిపాలనను సమర్థించి బ్రిటన్‌లో సంచారం చేసినప్పుడు అక్కడి ప్రముఖుల మన్ననలకు పాత్రుడై ఆధ్యాత్మిక రంగంలో భారతదేశం సాధించిన ఉత్కృష్టతను వారికి తెలియపరచాడు. భారతజాతిపట్ల అతనికి ఉండిన గౌరవ విశ్వాసాలకు ఇది గొప్ప తార్కాణం. తర్వాతి కాలంలో స్వామి వివేకానందుడు యోగి అరవిందఘోషు ఈ అభిప్రాయానికి కార్యరూపం కల్పించారు.

ఈలాటి ఉన్నతాశయాలతో అతడు వివిధ రంగాలలో కృషిచేసి బ్రహ్మసమాజాభివృద్ధికి ఎనలేని సేవ చేశాడు. కాని హిందూ మతాననుండి బ్రహ్మసమాజం చీలిపోయి ఒక ప్రత్యేక మతంగా ఏర్పడడం అతని అనుచరులలో అనేకులకు రుచించలేదు. అతనిలోని క్రైస్తవ మత పక్షపాతం కూడా వారినిరనకు పాత్రమైంది. ఇంతేగాక అతడు ప్రచారం చేసిన సంఘ సంస్కరణ సిద్ధాంతాలకు విరుద్ధంగా పదమూడు సంవత్సరాల కుమార్తెను పదహారు సంవత్సరాల కూచి బీహారు మహారాజునకు ఇచ్చి హిందూమత సంప్రదాయానుసారం మంత్రతంత్రాలతో వివాహాన్ని జరిపాడు. ఈ కారణాలన్నిటి మూలంగా అనుచరులనేకులు

ంతని నుండి విడిపోయి "సాధారణ బ్రహ్మసమాజ" మనే పేరుతో ఒక ప్రత్యేక గాఖనుస్థాపించుకొన్నారు. దీనితో సమాజము మూడు శాఖలుగా చీలిపోయింది.

పండిత శివనాథశాస్త్రి నాయకత్వాన సాధారణ బ్రహ్మసమాజం ంనేక ప్రాంతాలలో వ్యాపించింది. వాటిలో ఆంధ్రప్రాంతం ప్రధాన మైనట్టిది. రఘుపతి వెంకటరత్నం నాయుడు, కందుకూరి వీరేశలింగం పంతులు బ్రహ్మమతం చేత ప్రభావితులై దాని సిద్ధాంతాలను ఆంధ్రదేశంలో ప్రచారం చేశారు. కాని, శివనాథశాస్త్రి ఆధ్వర్యంలో సంఘసంస్కరణ రంగంలో- ందులోనూ ప్రధానంగా స్త్రీల విద్యా విషయంలో- ఎక్కువ కృషి జరిగింది. అస్పృశ్యుల ఉద్ధరణకై సామాజికులు ప్రత్యేకంగా పాటుపడ్డారు; శిశు శరణా లయాలను స్థాపించారు, క్షామ బాధితుల రక్షణాది సంఘ సంక్షేమ కార్యక్రమా లలో పాల్గొన్నారు. మద్యపాన నిషేధ విషయంలో శ్రద్ధవహించారు. వివిధము లైన ఈలాటి కార్యక్రమాలను ఆంధ్ర ప్రాంతలోని నాయకులు ఎక్కువగాసాగిం చారు.

వివిధ రంగాలలో వారు ఇంతటి కృషిచేసినా 1878లో సంభవించిన చీలిక మూలాన వారి ప్రాబల్యం చాలావరకు సన్నగిల్లింది. బ్రహ్మసమాజంవారు క్రై స్తవ మతాన్ని అనుకరించేవారని, హిందూమతానికంటే వారికి క్రైస్తవమతం పట్ల ఎక్కువ గౌరవాభిమానాలు ఏర్పడిందని, హిందూ మతంలోని గుణదోషా లను నిర్ణయించడంలో క్రైస్తవ మతాన్ని వారు గీటురాయిగా ఉపయోగిం చారని, వారిది ఒక విధంగా దేశీయ ఉద్యమంగా కాక విదేశీ ఉద్యమంగా రూపొందడం జరిగిందని హిందుపులనేతలు అభిప్రాయబడ్డారు. వారి పలుకుబడి తగ్గుటకు ఇదికూడా ఒక కారణంగా పరిణమించింది.

ఈనాడు దేశంలో బ్రహ్మసమాజకుల సంఖ్య 5000 ఉండవచ్చు. కాని 19వ శతాబ్దంలో మతసాంఘిక రంగాలలో ఈసమాజం ఒక పటిష్టమైన ఉద్యమంగా కృషి చేసిందని చెప్పడంలో ఏలాటి అతిశయోక్తి లేదు. దానికి సంఖ్యాబలం లేకపోయినా "గంగ గోవుపాలు గంటెడైనను చాలు" అనే సూక్తి దాని విష యంలో ఎంతగానో వర్తిస్తుంది. స్వల్ప సంఖ్యాకులైన సామాజికులు మత రంగం లో నూతన సంచలనాన్ని చైతన్యాన్ని కల్పించారు. సాంఘిక రంగంలో అనేక సంస్కరణలను ప్రవేశపెట్టారు. ప్రధానంగా స్త్రీల ఉద్ధరణకై వారు అపారమైన కృషిచేశారు. బెంగాలులో ఉన్నతవిద్య నభ్యసించి, ప్రజాఉద్యమా లలో బహిరంగంగా పాల్గొన్న స్త్రీలనేతలు బ్రహ్మసమాజ కుటుంబాలకు చెందినవారు. సమాజ ప్రభావంచేత తదితరులుకూడా సంఘసంస్కరణమందు శ్రద్ధ వహించారు.

రాజకీయరంగంలో వారు ప్రత్యక్షంగా ఎక్కువ కృషి చేయలేదు. కాని శివనాథశాస్త్రివంటివారు స్వాతంత్ర్య సంపాదనము ప్రజల తుదిలక్ష్యంగా ఉండ వలెనని, మతసంస్కరణా సంఘ సంస్కరణా ఆ సంపాదనకు సాధనాలనీ, ఇవి విజయాన్ని సాధించినగాని రాజకీయ స్వాతంత్ర్యం లభించదనే అభిప్రాయాన్ని

వ్యక్తం చేశారు. ఇంతేగాక మానవస్వేచ్ఛకు మానవ సమానత్వానికి వారు కల్పించిన ప్రాధాన్యం రాజకీయరంగంపై ప్రభావం వహించింది. ఈ విధంగా వారు జాతీయతను బలపరచారు. బెంగాలులోనూ అఖిలభారత స్థాయిలోనూ ప్రఖ్యాతిగాంచిన ఆనందమోహన్ బోస్, సురేంద్రనాథ బానర్జీ మొదలైన రాజకీయనాయకులు బ్రహ్మసమాజ సభ్యులే.

ఈ కారణాలన్నిటిచేత బ్రహ్మసమాజ ఉద్యమం ఆధునిక చరిత్రలో ప్రముఖ స్థానాన్ని వహిస్తున్నది. జాత్యభిమానాన్ని బలపరచడంలో అది గొప్ప సాధనమైంది. ఆధ్యాత్మికరంగంలో పాశ్చాత్యులు భారతీయులనుండి నేర్చుకొనవలసిన సత్యాలు అనేకం ఉన్నవని నిరూపించి, బ్రహ్మసమాజం జాతీయ గౌరవాన్ని నిలబెట్టగలిగింది.

### 3

ఆధునిక యుగంలోని మత ఉద్యమాలలో రెండవది ఆర్యసమాజ ఉద్యమం. ఈ సమాజాన్ని 1875లో దయానంద సరస్వతి (1824-1883) స్థాపించాడు. ఇది స్వచ్ఛమైన దేశీయ ఉద్యమంగా ప్రఖ్యాతి గాంచింది.

దయానందుని తొలిపేరు మూలశంకరుడు. ఇతడు సౌరాష్ట్రంలోని ఒక శిష్ట శైవ బ్రాహ్మణకుటుంబంలో 1824లో జన్మించాడు. ఇతనికి ఇంగ్లీషు విద్యతోగాని పాశ్చాత్య సంస్కృతితోగాని ఏలాటి సంబంధం లేకపోయినా ఇంగ్లీషు విద్యాధికుల ఊహకుఅందని విప్లవాత్మకములైన మార్పులను హిందూ మతంలో ప్రవేశపెట్టాడు. ఇదియే అతనిలోని ప్రతిభ.

బాల్యంలోని కొన్ని అనుభవాలు కారణంగా అతడు విగ్రహారాధనను ఖండించే వాడయ్యాడు. మానవుని జీవితంలో మరణానికిగల ప్రాధాన్యం ఏలాటిది అనే సమస్య బాల్యాననుండి అతనిని పీడించసాగింది. అందుచేత జీవిత రహస్యాలను తెలుసుకొనడంలో అతనికి చిన్నవయస్సునుండి గొప్ప ఉత్సాహము శ్రద్ధ జనించాయి. తన జీవితాన్ని జ్ఞానసంపాదనకు అంకితంచేయ సమకట్టి, తల్లిదండ్రులు తలపెట్టిన వివాహాన్ని నిరాకరించి, సన్యాసాశ్రమాన్ని 21వ ఏట స్వీకరించాడు.

అనాదిగా భారతదేశంలోని సన్యాసులు ప్రవర్తించినట్లే అతడు యోగ సాధనలను చేస్తూ, కొండలలోను, గుహలలోను, అరణ్యాలలోను సంచరించుచూ, దొరికిన ఆహారంతో తృప్తిపడుతూ, ఆహారం లభించనప్పుడు ఉపవాసం చేస్తూ, తనకు జ్ఞానభిక్షపెట్టగల గురువును అన్వేషిస్తూ 15 సంవత్సరాల కాలం గడపి, తుదకు 1860లో అంధుడైన విరజానందుడనే మహాయోగిని సందర్శించ గలిగాడు. అతడు దయానందుని శిష్యునిగా స్వీకరించి నాలుగు సంవత్సరాల కాలం తత్వవిద్యలన్నిటిని అతనికి నేర్పాడు. అతడు విగ్రహారాధనను పూర్తిగా ఖండించినవాడు. వేదమొక్కటే ప్రమాణ గ్రంథమని, సమస్త సత్యాలు అందులో ఉన్నట్లు విశ్వసించినవాడు. స్మృతులు, పురాణాలు మొదలైన ఇతర

ంథాలు ఈ సత్యాలనుకప్పిపుచ్చి మూఢనమ్మకాలకు దారితీసినట్లు భావించిన ాడు. ఈ దోరణిలో అతడు దయానందునికి తత్వబోధ గావించి, ఆ తత్వాన్ని జలందరికీ బోధించవలసినదిగా అతనిని ఆదేశించి, ఆ ఆదేశానుసారం అతడు చుకొనుటయే తనకతడు ఇయ్యదగిన గురుదక్షిణ అని తన అభిప్రాయాన్ని క్తపరచాడు. దయానందుడు అతడు కోరిన దక్షిణ ఇచ్చునట్లు ప్రతిజ్ఞచేసి త్వ ప్రచారాన్ని సాగించాడు.

సంప్రదాయానుసారంగా దేశంలోని మతబోధకులు చేసినట్లె అతడు దేవా యాలలోను ప్రజలు గుమిగూడిన ఉత్సవాలలోను యాత్రా స్థలాలలోను సంగాలు చేస్తూ, పండితులతో తన తత్వాన్ని గురించి శాస్త్రార్థ చర్చలు స్తూ వేదముల ఉత్కృష్టతను పాటించుచూ దేశసంచారం చేశాడు. ఒక సమ యంలో అతడు శాస్త్రవిద్యలన్నిటికి అనాదిగా కేంద్రమైన కాశీనగరానికి వెళ్ళి హారాజావారి ఆధ్వర్యాన సమావేశమైన ఉద్దండ శాస్త్రవేత్తల సమావేశంలో గ్రహారధనను ఖండిస్తూ శాస్త్రచర్చ చేసి, వేదాలు విగ్రహారాధనను సమర్థి న్నవా అనే ప్రశ్నకు సమాధానం కోరాడు. కాని శాస్త్రవేత్తలు దానికి మాధానం చెప్పలేకపొయ్యారు. అయినా వారు ఓటమిని అంగీకరించక వెళ్ళి ొయ్యారు. దయానందుడు విజయం తనదే అని సంతోషించి వివిధ ప్రాంతా లో తన తత్వాన్ని ప్రచారంచేస్తూ కాలం గడిపాడు.

1873లో అతడు కలకత్తాకు వెళ్ళి కేశవచంద్రసేన్ మొదలైన బ్రహ్మ మాజ నాయకులతో సంప్రతింపులు జరిపాడు. విగ్రహారాధన ఖండన విషయం లోను ఏకేశ్వరోపాసన విషయంలోను వారతనితో ఏకీభవించినా వేదాలుమాత్రమే ప్రమాణ గ్రంథాలనేతత్వం వారికి అంగీకారయోగ్యం కాలేదు. వారి క్రైస్తవ త పక్షపాతం అతనికి నచ్చిందికాదు. వారి బోధలన్నీ విదేశీయాలని వాటిని ర్శించాడు.* ఈలాటి కారణాలచేత వారిమధ్య ఏకీభావము కుదరక బ్రహ్మ మాజము, ఆర్యసమాజము వేర్వేరుగా ప్రచారం సాగించవలసి వచ్చింది. ఒక

* "వీరియందు స్వదేశభక్తి మిక్కిలి తక్కువగ నున్నది. వీరు క్రైస్తవుల మాచారములనే విశేషించి యనుకరించుచున్నారు...... తమ దేశ ప్రశంస ఎంత త్రము చేయరు. తమ పూర్వుల గొప్పతనమును ప్రకటించుటకు మారుగా వారిని టికొలది నిందించుచున్నారు. ఉపన్యాసములలో క్రైస్తవాది ఆంగ్లేయుల ప్రశంసను నసార జేయుచుందురు. బ్రహ్మాది మహర్షుల పేరుగూడ నెత్తరు...... తమ తల్లి, ండ్రి, తాత మొదలగువారి మార్గమును వదలి, తదితర విదేశీయ మతముపై నింత శ్వాసము కలిగి యుండుటయు, పరదేశస్థ సంస్కృత విద్యను చదువక, తమకుదామే ద్వాంసులమని చెప్పుకొనుటయు, నాంగ్లేయభాష నభ్యసించి పండితాభిమానులై టాలున నొక క్రొత్తమతమును ప్రవేశపెట్టుటయందు బ్రవృత్తులగుటయు జనులకు ర్యమును, వృద్ధిని గలుగజేయుపను లెట్లుకాగలవు ?" (దయానందుని సత్యార్థ ప్రకా ము - ఆదిపూడి సోమనాధరావు అనువాదము, 524 - 25 పుటలు).

విషయంలో మాత్రం దయానందుడు వారి సలహాను పాటించాడు. అదివరకు అతడు చర్చలను ప్రసంగాలను సంస్కృతభాషలో సాగిస్తూ వచ్చాడు. వారు ప్రజలభాషలో మాట్లాడడం ఎక్కువ ప్రయోజనకారి కాగలదని అతనికి సూచించారు. అతడు దానికి అంగీకరించి అది మొదలు హిందీభాషను ఉపయోగించ సాగాడు.

1870 నుండి తన తత్వానికి ఒక గ్రంథంద్వారా సమగ్రమైన రూప కల్పన చేయడంలో నిమగ్నుడయ్యాడు. నాలుగు సంవత్సరాలకాలం దానిని గురించి ఆలోచించి 1875లో "సత్యార్థ ప్రకాశ" అనే గ్రంథాన్ని హిందీలో రచించి ప్రకటించాడు. ఇందులో ఆర్యసమాజ తత్వాన్ని పూర్తిగాను విపులంగాను వివరించాడు.

జీవాత్మ పరమాత్మలు వేరువేరు కావనీ, బ్రహ్మపదార్థం ఒక్కటే సత్యమనీ ప్రపంచమంతా మాయ అనీ, పాపపుణ్యాలు మంచి చెడుగులు శరీరాన్నే గాని ఆత్మను అంటవనీ, కర్మను చేసేది శరీరమనీ, ఆత్మ సాక్షీభూతం మాత్రమే అని ప్రతిపాదించే అద్వైతాన్ని అతడు పూర్తిగాఖండించి ఈశ్వరుడు మానవుడు వేరువేరనీ ఆరాధ్యుడైన ఈశ్వరుడును ఆరాధించే మానవుడును ఏకంకాని కారణంచేతనే పూజావిధానం అవసరమవుతున్నదనీ నిరూపించే ద్వైతమతాన్ని సమర్థించాడు. అతని ఆధ్యాత్మిక తత్వానికి ద్వైతం ఆధారం.

దీనితోపాటు సమస్త సత్యాలు వేదంలో ఇమిడి ఉన్నట్లు, దానిలో లేని సత్యాలు బైబిలు, కొరాన్‌వంటి ఇతర మతగ్రంథాలలో లేనట్లు ఈ కారణంచేత ఒక హిందువులకేగాక మానవకోటి కంతకు వేదం ప్రమాణ గ్రంథం కావలసినట్లు, మానవులందరు తరించుటకు వైదికమతం ఒక్కటే సాధనమైనట్లు ఉద్ఘాటించాడు. అతని బోధలలోని విశిష్టత ఇందులోనే ఉన్నది. ఈ విశిష్టతకు సంబంధించిన రెండు మూడు విషయాలు గుర్తించవలసి ఉంది.

వేదము ఒక్కటే ప్రమాణ గ్రంథమనడం వీటిలో మొదటి విషయం. సాధారణంగా హిందువులు వేదముతోపాటు ఉపనిషత్తులు, షడ్దర్శనాలు, స్మృతులు, పురాణాలు మొదలైనవాటిని కూడా పవిత్ర గ్రంథాలుగా పాటిస్తారు. కాని ఇది వారిలో గొప్ప పొరపాటని అతడు పదేపదే నొక్కిచెప్పాడు. అనేక గ్రంథాలను ప్రమాణాలుగా స్వీకరించడంచేతనే హిందూమతంలో శాఖోపశాఖలు బయలుదేరి, హిందువులు ఆధ్యాత్మికబలాన్ని నైతికబలాన్ని కోల్పోయినట్లును సుసంఘటితంగా వారు ఇతర మతాలను ఎదుర్కొనలేకపోయినట్లును అతడు వాదించాడు. క్రైస్తవులకు బైబిలు ఒక్కటే ప్రమాణ గ్రంథం; ముస్లింలకు కొరాన్ ఒక్కటే ప్రమాణ గ్రంథం. వారి బలానికంతా ఇది ప్రధాన కారణంగా భావించి, వారి మోస్తరుగానే హిందువులందరు ఒకే గ్రంథాన్ని ప్రమాణ గ్రంథంగా స్వీకరించినప్పుడే వారు ఇతరమతాల పోటీకి నిలబడగలరని, వేదం ఒక్కటే ప్రామాణిక గ్రంథం అగుటకు సర్వవిధాలా అర్హత గలిగినట్టిదని నిరూపించాడు. వేదం బహు ప్రాచీనమైనట్టిది. ప్రపంచంలోని

మతగ్రంథాలలో అది మొదటిది. ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించిన మౌలిక సత్యాలన్నీ అందులో ఉన్నాయి అని అతడు వేదాన్ని ప్రశంసించాడు.

ఇంతేగాక వేదం ఒక హిందువులకేగాక మానవకోటికంతా ప్రమాణ గ్రంథం అనీ, వైదిక మతం ఒక్కటే మానవులందరు అనుసరించవలసినదనీ, వారు తరించుటకు సాధనాంతరం లేదనీ అతడు ఉద్ఘాటించడంలో కూడా ఒక అపూర్వమైన విషయం ఉంది. ఈ ఉద్ఘాటన హిందూమత సంప్రదాయానికి విరుద్ధమైనట్టిది. విభిన్నమతాలు విభిన్నమత గ్రంథాలు భగవంతుని చేరుటకు వేర్వేరు మార్గాలనీ, వీటిలో తరతమభేదాలు లేవనీ, ఏమార్గాన్ని అనుసరించినా భగవంతుని చేరడం సాధ్యంకాగలదని,అందుచేత ఇతర మతాలవారిని హిందూమతంలోచేరవలసినట్లు ప్రోత్సహించడం అవసరం కాదని. చాలాకాలాన నుండి హిందువులు విశ్వసించారు. దయానందుని బోధ దీనికి విరుద్ధమైనట్టిది. కాని తన బోధను అనుసరించడమే హిందువుల కర్తవ్యమని పదే పదే చెప్పాడు. వేయి సంవత్సరాలుగా హిందూమతం ఇతర మతాలదాడి నుండి తన్ను రక్షించుకొనడంలోనే కాలం గడిపింది. ఇకమీదట ఈలాగు జరుగకూడదు. హిందువులు ఇతర మతాలపై దాడిచేసి, ఆ మతాల వారందరినీ హిందువులుగా మార్చి, సనాతనమైన తమ మతం యొక్క ఆధిక్యతను నిలబెట్టుకొన వలసిన తరుణం ఆసన్నమైంది. "ఆక్రమణ రక్షణకు పటిష్ట సాధనం" అనే వాక్యం (Attack is the best means of defence) ఒకటి యుద్ధశాస్త్రంలో ఉంది. ఆ వాక్యానుసారం హిందువులు ప్రవర్తించినప్పుడే వారి మతానికి స్థిరత్వం లభిస్తుంది. ఇందులో స్వలాభం ఉన్నట్లు ఎవరూ అనుకొనవలసినది లేదు. వైదికమతం ఒక్కటే ముక్తిసాధనం కావడం చేత ముస్లింలు క్రైస్తవులు తదితరులు ఆ మతాన్ని స్వీకరించిన పక్షాన ముక్తిని సాధించిన వారవుతారు. ఈ విధానం వారికి లాభకరమే గాని నష్టకరం కాదు. ఘంటాపథంగా దయానందుడు ప్రకటించిన ఈ అభిప్రాయాలు హిందువులలో నూతన ఉత్తేజాన్ని ఉత్సాహాన్ని ఆత్మ విశ్వాసాన్ని గౌరవాన్ని కల్పించాయి. ప్రాచీన యుగంలో భారతీయులు విదేశాలకు వెళ్లి వారి సంస్కృతిని అక్కడి ప్రజలలో వ్యాపింపజేయడాన్ని దయానందుడు వారిస్మృతిపథంలోకి తెచ్చాడు. తాను సూచించిన మార్గాన్ని హిందువులు అనుసరించని పక్షంలో భారత దేశాననుండి హిందూమతం నిర్మూలం కావడం, ఉత్తర భారతం ముస్లిం మతానికి దక్షిణ భారతం క్రైస్తవ మతానికి పూర్తిగా నిలయం కావడం తప్పదన్నాడు,

ఈ సందేశానికి అంతర్భాగంగా ఇంకొక అంశాన్ని కూడా అందులో చేర్చాడు. ఇందులో కూడా ఒక విశేషం ఉంది. వందలాది సంవత్సరాలుగా హిందువులనేకులు ఇస్లాంమతంలో చేరిపోయ్యారు. ఇటీవల కాలంలో వారిలో కొందరు క్రైస్తవమతాన్ని స్వీకరించారు. ఇతర మతాలను స్వీకరించిన వారిని తిరిగి హిందూమతంలో చేర్చుకొనడం హిందూమతానికి విరుద్ధంగా పరిగణింపబడింది. ఇది హిందూమతంలోని గొప్ప లోపమని, దాని బలహీనతకు కారణ

మని, ఇతర మతాలలో చేరిన హిందువులను తిరిగి హిందూమతంలోకి చేరేటట్లుగా ప్రోత్సాహించి, వారిని హిందూమతంలో చేర్చుకొనడం హిందువుల కర్తవ్యమని అతడు ప్రబోధించాడు. ఈ విధానానికి "శుద్ధి" అని నామకరణంచేశాడు. ఇది ముస్లింల యొక్కయు క్రైస్తవుల యొక్కయు క్రోధానికి కారణంకావచ్చు. కాని వారు తరతరాలుగా హిందూమతంపట్ల దయాదాక్షిణ్యాలు లేక ప్రవర్తించినందుకు "శుద్ధి" విధానం తగిన ప్రతిక్రియ అని అతడు సమాధానం చెప్పాడు.

దయానందుడు బహుదేవతారాధనను ఖండించి ఏకేశ్వరోపాసనను సమర్థించాడు. హిందువులు అనేక శాఖోపశాఖలుగా చీలిపోయి పరమతాల దాడిని ఎదుర్కొన లేకపోవుటకు బహుదేవతారాధన ఒక ప్రధాన కారణమన్నాడు. వేదం ఏకేశ్వరోపాసననే ప్రతిపాదిస్తున్నది. ఇంతేకాదు, వేదం ప్రతిపాదించిన ఈశ్వరుడే పూజార్హుడు. బైబిలు కొరాన్‌లలోని ఈశ్వరుడు ఈలాటివాడుకాదు అతడు సర్వశక్తి సంపన్నుడు కాడు. మానవకోటి నంతను సమానంగా ప్రేమించేవాడు కాడు. వారిలో కొందరి పట్ల పక్షపాతం, మరికొందరి పట్ల విరోధంవహించినవాడు. వైదిక మతంలోని ఈశ్వరుడు సర్వశక్తిసంపన్నుడు. మానవులందరిని సమానంగా అనుగ్రహించేవాడు.

విగ్రహాలను పూజించడం భగవంతున్ని పూజించడం కాదు. విగ్రహం ప్రాణంలేని శిల. అందులో భగవంతుడున్నాడని భావించడం ఒక భ్రమ. వైదిక మతం దీనిని సమర్థించడంలేదు—అని స్పష్టపరచాడు.

వేదం ఆధ్యాత్మిక జ్ఞానాన్నే గాక లౌకిక జ్ఞానాన్ని కూడా బోధిస్తుంది. పాశ్చాత్యులు ఇటీవల కాలంలో వృద్ధిచేసిన వైజ్ఞానిక సాంకేతిక శాస్త్రాలు. ఆవిరి యంత్రం రైళ్ళు మొదలగు వాటిని గురించిన జ్ఞానము బీజరూపంలో వేదంలో ఉంది అని దయానందుని అభిప్రాయం దీనిననుసరించి అతడు వేదానికి భాష్యం వ్రాశాడు. కొన్నిసందర్భాలలో అతడు వేదవాక్యాలకు విపరీతార్థం కల్పించినట్లు అనేకులు చెప్పడం కద్దు, కాని వేదంయొక్క సంపూర్ణత్వాన్ని నిరూపించుటకు అతడు ఈ మార్గాన్ని అనుసరించాడు.

దయానందుడు మతబోధను మాత్రమే చేసినవాడు కాడు, దేశం సర్వవిధాలా హీనస్థితిలో ఉండడము, ప్రజలు దురాచారాలకు లోనై జవ సత్వాలు కోల్పోయి ఉండడము అతనికి ఎంతో విచారం కలిగించింది. అందుచేత అతడు సంఘంలో జరగవలసిన సంస్కరణలను సూచించి ఆర్యసమాజ మతావలంబకులందరు వాటికి అనుగుణంగా జీవితాన్ని సాగించడం విధి అని ఉద్బోధించాడు. ఈ సందర్భంలో అతడు ఆనాటి వర్ణ వ్యవస్థను ఖండించి వర్ణ విభాగమునకు జన్మము గాక గుణమొక్కటే ఆధారమని నిరూపించాడు. వర్ణాంతర వివాహాలు వాంఛనీయమన్నాడు. అందరు వేదాధ్యయనానికి అర్హులని, దానిని అనాదిగా ప్రతిఘటించిన బ్రాహ్మణులు స్వలాభపరులని తమ ఆధిక్యతను నిలబెట్టుకొనుటకే వారు విద్యలనన్నిటిని తమ హస్తగతం చేసుకొన్నారని ఆలాటి వర్ణం ఒకటి సంఘంలో ఉండడం హిందువుల పతనానికి కారణమన్నాడు. అన్ని రంగాలలో స్త్రీలు

పురుషులతో సమానమైన హక్కులు కలవారని, దానికి తగినట్లు వారు సమస్త విద్యలను నేర్చుకొని, అన్నిరంగాలలో కృషి చేయవలసినదిగా ఆదేశించాడు. హిందువుల బలహీనతకు, పరాయి వారు వారిని జయించి పరిపాలించుటకు బాల్య వివాహాలు కారణమనిన్నీ, యువకుల కనిష్ట వివాహ వయస్సు 25 సంవత్సరాలుగను యువతుల వయస్సు 16 సంవత్సరాలుగను ఉండదగినవని నిర్ణయించాడు. అస్పృశ్యత ఉండరాదని, అస్పృశ్యుల ఉద్ధరణకు సర్వవిధాలా ప్రయత్నాలు జరపవలసిందిగా ఆదేశించాడు. సముద్రయాన నిషేధం కూడదన్నాడు. విదేశాలకు వెళ్లకపోవడం చేతనే హిందువులు, ప్రపంచ జ్ఞానంలేక కూపస్థమండూకాలవలె జీవితాన్ని గడిపే వారయ్యారని, వారిలో ధైర్యసాహసాలూ చొరవావృద్ధి కావడానికి విదేశాలకు వెళ్లడం పటిష్ట సాధనమని, ప్రాచీన కాలంలోని హిందువులు విదేశాలకు వెళ్లి వర్తక వ్యాపారాలను వృద్ధి చేసుకొని సిరిసంపదలతో వర్థిల్లారని ప్రజలకు జ్ఞాపకం చేశాడు. దయానందుని ప్రజ్ఞ అతి విశాలమైనట్టిది, అది బహుముఖమైనట్టిది కూడా. ప్రజలు సర్వతోముఖంగా అభివృద్ధి చెందడం అవసరమని భావించి మత సంస్కరణతోపాటు సంఘసంస్కరణకు ప్రాధాన్యం కల్పించాడు.

రాజకీయాలు కూడా అతనిని ఆకర్షించాయి. సత్యార్థ ప్రకాశలో వాటిని గురించి కూడా చర్చించాడు. ప్రతిదేశాన్ని ఆదేశంలోని వారే పరిపాలించడం ఆదర్శ విధానమని చెప్పాడు. కాని భారతదేశంలో ఇది వెంటనే జరగడం సాధ్యం కాదన్నాడు. మతంలోను సంఘంలోను ప్రవేశించిన లోపాలన్నీ తొలగినప్పుడే ప్రజలు బలంకలవారై దేశాన్ని పాలించుటకు కావలసిన అర్హతను సంపాదింపగలరనీ, ఆ లోపాలను తొలగించుటకు చురుకుగా అన్ని ప్రయత్నాలు జరగవలసి ఉన్నదని ఉద్ఘాటించాడు.[1] పాశ్చాత్తులలో — ప్రధానంగా బ్రిటిష్ వారిలో బుద్ధిబలం. శరీరబలం, ధైర్యసాహసాలు, దేశాభిమానం, మొదలైన సుగుణాలు ఎన్నో ఉండడం చేతనే వారు విదేశాలను జయించి పరిపాలిస్తున్నారు. [2] ఆలాటి గుణాలను భారతీయులు కూడా సంపాదించిన పక్షాన వారికి

---

1. "విదేశీయుల కార్యావర్తమందు రాజ్యమేర్పడుటకు కారణము లెవ్వి యనగా! స్వదేశీయుల పరస్పరవిరోధము, మతభేదము, బ్రహ్మచర్యలోపము, విద్య చదువకుండుటయు చదివింపకుండుటయు, బాల్యావస్థయందు అస్వయంవర వివాహములు, విషయాసక్తి, మిథ్యాభాషణాది దుర్లక్షణములు, వేదవిద్య ప్రచారములేకపోవుట, ఈ మొదలగు దుష్కర్మములే కారణములు." దయానందుని సత్యార్థప్రకాశము. ఆదిపూడి సోమనాథరావు అనువాదము - 354 పుట).

2 యూరోపియనులు బాల్యావస్థయందు వివాహముచేసికొనరు. వారు పిల్లలకును, పిల్లవాండ్రకును విద్యాశిక్షలనలవరతురు. స్వయంవరవివాహములు గావింతురు. దుర్మార్గుల యుపదేశములగొనక తాము విద్యావంతులయియుండుటచే నొకరివలలో జిక్కుపడరు. ఏపనిచేసినను పరస్పరము వితర్కించి సభలలో నిశ్చయించుకొని చేయుచున్నారు.

తప్పక స్వాతంత్ర్యం లభిస్తుంది. వాటిని సంపాదించని పక్షాన దాస్యం తప్పదు, అని తెలియ చెప్పాడు.

బెంగాలు లో పర్యటించిన తర్వాత దయానందుడు బొంబాయి రాష్ట్రమునకు వెళ్లి అక్కడి ప్రార్థన సమాజములు చేయుచుండిన కార్యక్రమాలను పరిశీలించి తన తత్వమును అనేక సభలలో ప్రచారంచేసి రనడే మొదలైన వారి ప్రశంసలకు పాత్రుడైనాడు.

భారత దేశములో మత బోధలు గురు పరంపరల ద్వారా జరుగుట సాంప్రదాయము. కాని దయానందుడు తన బోధలకు స్థిరత్వమును కల్పించు విషయములో ఈ సంప్రదాయము ననుసరించక బ్రహ్మ సమాజ ప్రార్థన సమాజముల వారు పాశ్చాత్యులనుండి గ్రహించిన సమాజ పద్ధతిని అనుకరించాడు. ఇందుకుగాను అతడు 1875లో మొదటి ఆర్యసమాజాన్ని సౌరాష్ట్రములో స్థాపించాడు. వేదములను వైదికమతమును సృష్టించి వాటిని భారత దేశమంతట వ్యాపింపజేసినవారు ఆర్యులగుట చేత తన సమాజమునకు ఆర్య సమాజమని, తన మతమునకు ఆర్య మతమని అతడు సముచితముగా నామకరణము చేశాడు. క్రమక్రమముగా సమాజ శాఖలు గుజరాత్, రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్, పంజాబులలో నెలకొన్నాయి.

ఈ శాఖలన్నిటిలో పంజాబు లోనివి ఎక్కువ ప్రాబల్యాన్ని పలుకుబడిని సంపాదించగలిగినాయి. అందుచేత పంజాబు ఆర్య సమాజానికి కేంద్రమనే ప్రఖ్యాతి గాంచింది. ముస్లింల తాకిడి వలన ఎక్కువ నష్టమును పొందినవారు పంజాబు లోని హిందువులు. దయానందుడు ప్రచారం చేసిన ఆర్య మతము వారి కెంతగానో ఉత్తేజకరమైనది ఆర్యమతం ఇస్లాంకంటె ఉత్కృష్టమైనదని అతడు నిరూపించడం వారికెంతో గర్వకారణమైనది. తాము తలయెత్తుకొని తిరగగల అవకాశం లభించినట్లు వారు భావించారు. ఇస్లాం మతాన్ని ఎదిరించి జయించుటకు దయానందుని మతబోధ పటిష్ట సాధనంగా వారు గ్రహించారు. ఆర్యమతం ద్వారా సనాతన సిద్ధాంతములను నవనాగరికులు కోరే సంస్కరణలతో దయానందుడు సమన్వయ పరచాడు. ఈ సమన్వయం ఇంగ్లీషు విద్యాధికులను ప్రత్యేకంగా ఆకర్షించింది. అందుచేత వారిలో అనేకులు సమాజ సభ్యులై దాని అభివృద్ధికి పాటుబడినారు.

1877లో ఆర్య సమాజీకులు అనుసరించవలసిన దశసూత్రా నియమావళిని

---

తమ జాత్యభివృద్ధికొఱకు తనువును మనమును ధనమును ధారపోయుచున్నారు. సోమరితనము వదలి ఎప్పుడును పనిచేయుచుందురు... సుమారు వంద సంవత్సరముల పైనుండి యురోపియను లీదేశమునకువచ్చి నివసించుచున్నారు. ఇంతవరకును మొద్దుగుడ్డలు మొదలగునవి తమ దేశమున దొడుగుచుండిన విధముననే తొడుగుచున్నారు. కాని మీయందనేకులు (భారతీయులు) వారి ననుకరించుచున్నారు.'' దయానందుని సత్యార్థప్రకాశ, ఆదిపూడి గోపాలరావు అనువాదము, 526 – 27పుటలు)

దయానందుడు రూపొందించాడు. వీటిలో మొదటి సూత్రము: "వాస్తవ జ్ఞానమునకు వేదములు జన్మస్థానములగుటచే సామాజికులందరు వాటిని అధ్యయనముచేయ వలెను", అని విధించుచున్నది. తక్కిన సూత్రములు అన్ని మతముల వారికీ అంగీకార యోగ్యములైన నైతిక సూత్రములు. ఆరవసూత్రము, "ఆర్య సమాజము యొక్క ప్రధాన లక్ష్యము మానవసేవ- అనగా మానవులందరి శారీరక ఆధ్యాత్మిక సాంఘిక శ్రేయస్సును వృద్ధిచేయుట" అని నిర్వచిస్తున్నది. ఈ సూత్రాన్ని అనుసరించి ఆర్యసమాజము వారు స్త్రీ పురుషుల నిమిత్తము ఉన్నత విద్యాలయాలను స్థాపించి నడిపించసాగారు. వారి కార్యక్రమాలలో ఇది ప్రధానస్థానం వహించింది. ఆధునిక పద్ధతిన ఈ విద్యాలయాలు ఇంగ్లీషు నేర్పగా కొందరు సామాజికులు ప్రాచీన కాలపు గురుకుల పద్ధతిన మరికొన్ని విద్యాలయాలను స్థాపించారు. ఇదిగాక వారు అత్యంత ఉత్సాహముతో అనేక సంఘ సంక్షేమ కారక్రమాలను సాగించడంలో శ్రద్ధ వహించారు.

మాంసాహార విషయంలోను విద్యాపద్ధతి విషయంలోను సమాజ సభ్యుల మధ్య కొన్ని అభిప్రాయభేదాలు పొడగాంచి, వారు రెండు శాఖలుగా కొన్ని సంవత్సరాల తర్వాత చీలిపోయినా వారి ప్రాబల్యం దీని మూలంగా సన్నగిల్ల లేదు. పంజాబులో ప్రధానంగాను తక్కిన ఉత్తరాది రాష్ట్రాలలో కొంతవరకును వారొక చైతన్యవంతమైన వర్గంగా ఏర్పడి జాతీయ జీవితానికి దోహదం చేశారు.

దయానందుడు స్థాపించిన అర్యసమాజం జాతీయతను ఎంతగానో బల పరచింది. తాము ఎందులోను పాశ్చాత్యులకు గాని తదితరులకుగాని తల యొగ్గవలసినది లేదని, తమ మతమే ఉత్కృష్టమైనదని, అది ఇతరులకు కూడా అనుసరణ యోగ్యమని, తమ పూర్వులు ప్రపంచానికంతా జ్ఞానభిక్ష పెట్టినవారని దయానందుడు చేసిన ప్రభోధము వలన అర్యమతావలంబకులే గాక హిందువులందరు గర్వపడ్డారు. తాముకూడా తమ పూర్వులవలె అన్ని రంగాలలో ఘనతను సంపాదించడం సాధ్యమనే విశ్వాసం వారిలో కలిగింది. ఆర్య సమాజానికి చెందిన లజపత్‌రాయ్ వంటివారు కాలక్రమాన రాజకీయ నాయకులై స్వాతంత్ర్యోద్యమంలో ఘనమైన పాత్రను వహించారు. రాజకీయాభివృద్ధికి స్వాతంత్ర్య సంపాదనమునకు దేశమంతటా ఒకే మతము, ఒకేభాష ఉండడం అవసరమని ప్రచారం చేసినవారిలో దయానందుడు అగ్రస్థానం వహిస్తున్నాడు. ఈ కారణం చేత కూడా అతని ఉద్యమానికి ప్రాధాన్యం లభిస్తున్నది.

## 4

మత ఉద్యమాలలో మూడవది వివేకానందుని నాయకత్వాన రామకృష్ణ పరమహంసుని శిష్యులు ప్రారంభించినట్టిది. ఇందుకుగాను వారు 1886లో రామకృష్ణమఠాన్ని, 1897లో రామకృష్ణ సేవాశ్రమాన్ని స్థాపించారు.

రామకృష్ణపరమహంస 1836లో బెంగాలులోని కామార్పుకూర్

(కామారిపుష్కరము) అనే కుగ్రామంలో ఒక పేదబ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. అతని తొలిపేరు గంగాధర చట్టోపాధ్యాయ. దయానందుని వలె ఇతడు కూడ ఇంగ్లీషు విద్యతోగాని పాశ్చాత్య సంస్కృతితోగాని ఏలాటి సంబంధమూలేనివాడు. వీధిబడిలో చదువు ప్రారంభించాడు గాని అందులో కూడా ఎక్కువ అభివృద్ధి సాధించలేదు. బాల్యమందుండి పారమార్థిక చింతగల వాడై, పౌరాణికుల పురాణ పఠనములను వ్యాఖ్యానములను గ్రామానికి వచ్చు సన్యాసులబోధలను వింటూ మూర్ఛలలో భగవంతుని గూర్చి ప్రలాపించుచూ 20 ఏండ్ల వయస్సు వచ్చువరకు కాలంగడిపాడు.

1855వ సంవత్సరాన కలకత్తాలో దక్షిణేశ్వరమున రాణిరాసమణి క్రొత్తగా నిర్మించిన కాళికాలయములో అర్చకుడైనాడు. తాను పూజించు కాళికా దేవి నిర్జీవ శిలావిగ్రహము కాదనియు సాక్షాత్ లోకమాత అనియు విశ్వసించి అనేక సాధనలను జేసి ఆమెను ప్రత్యక్షముగ చూడగలిగాడు. అంతటితో తృప్తిగాంచక వివిధ మతములు విభిన్నరీతులలో చిత్రించిన భగవంతుని సాక్షాత్కారము పొందదలచి ఆయామతములలో చేరి, వాటికి ప్రత్యేకములైన ప్రక్రియలన్నిటినీ ఆచరించి, వాటిలోని విశిష్టతను బోధించగల ప్రముఖులతో సాంగత్యము చేసి శాక్తేయము, వైష్ణవము, ఇస్లాము, క్రైస్తవము మొదలగు మతములలోని రహస్యముల గ్రహించి మహాశక్తిని, శ్రీకృష్ణుని, అల్లాను, ఏసుక్రీస్తును సందర్శించ గల వాడైనాడు. ఈ అనుభవ ప్రభావం చేత అన్ని మతములవారు పూజించు భగవంతుడు ఒక్కడే అనియు, అన్ని మతముల గమ్యము ఒక్కటే అనియు వాటిమధ్య ద్వేషముగాని శత్రుత్వముగాని ఉండ వలసిన అవసరము లేదనియు గ్రహించి సర్వమతసామరస్యమునకు తన బోధలలో ప్రాధాన్యము కల్పించాడు. ఇదేకాలమున అతడు భైరవ బ్రాహ్మణీ అను యోగిని సహాయాన శాక్తేయ యోగసాధనలను, అటుతర్వాత తోతాపూరి అనే యతివరేణ్యుని శిక్షణ ద్వారా అద్వైత వేదాంతమును దానికి సంబంధించిన సమస్తసాధనలను నేర్చుకొన్నాడు.

కాలక్రమాన అతడొక గొప్ప తత్వవేత్తఅనియు భగవంతుని సాక్షాత్కారమును పొందిన వాడనియు ప్రఖ్యాతిగాంచినాడు. అతని బోధలను విని ఆధ్యాత్మిక జీవితమునకు సంబంధించిన సందేహములన్నిటిని తీర్చుకొనే ఉద్దేశముతో కేశవచంద్రసేన్ మొదలైన విద్యాధికులు ఇతర జిజ్ఞాసులు తదితరులు అతనిని సందర్శించసాగారు. అతడు వారందరికి సులభగ్రాహ్యమగునట్లుగా క్లిష్టవిషయము, లన్నిటిని సామాన్యభాషలో దృష్టాంతముల సహాయాన తెలియపరిచి, వారి సందేహములన్నిటినీ తీర్చగలిగాడు. వారందరికి అతని పట్ల గురుభావము ఉదయించినది. అతడు భారతీయ ఋషుల పరంపరకు చెందినవాడనియు అవతారపురుషుడనియు అందరు భావించసాగారు ఈ విధముగ అతడు విసుగువేటలు లేక తన్ను సందర్శించిన వారందరికి వారివారి శక్తిసామర్థ్యాలకు అనుగుణముగా ఆధ్యాత్మిక తత్వాన్ని నిత్యజీవితంలో దానికిగల ప్రాధాన్యాన్ని బోధిస్తూ 1886లో కాలధర్మ

మొందాడు.

రామకృష్ణుని ఉపదేశాలలో రెండు మూడు విశేషాలు ఉన్నట్లు చెప్ప వచ్చును. ఆనాడు వైజ్ఞానిక సాంకేతిక శాస్త్రాల వ్యామోహం చేత భారతదేశం లోని విద్యాధికులూ పాశ్చాత్య ప్రపంచంలోని ప్రజలూ ఐహికసౌఖ్య మొక్కటే మానవుడు వాంఛించ దగిన సౌఖ్యమనే భావంతో ఆధ్యాత్మిక జీవితప్రాధాన్యాన్ని విస్మరించిన వారయ్యారు. ఇది మానవశ్రేయస్సుకు భంగము కలిగించే పరిణామమనీ, వ్యక్తులమధ్యను, జాతులమధ్యను సంఘర్షణకు దారి తీయునని మనశ్శాంతికి ప్రపంచశాంతికి భంగకరము కాగలదని, ప్రాచీన కాలపు భారతీయ, తత్వవేత్తలు చెప్పినట్లు మానవుడు ధర్మార్థకామమోక్షములనే చతు ర్విధపురుషార్థములన్నిటినీ పరస్పరవైరుధ్యము లేక సాధించవలెనని, ఈనాటి వారివలె ధర్మమోక్షములను విస్మరించి అర్థకామములను మాత్రమే సాధింపదల చుట సర్వవిధాలా ప్రమాదకరమని అతడు ఉద్ఘాటించాడు. అతని బోధనలలో ఇది అగ్రస్థానాన్ని వహిస్తున్నది.

ఆధ్యాత్మికతత్వములన్నిటిలో అద్వైతతత్వము ఉత్కృష్టమైనదని స్వానుభవముచే అతడు తెలుసుకొని దానినే తన శిష్యులకు బోధించాడు. అద్వైతతత్వమనగా భగవంతుడు మానవులందరిలో ఉన్నట్లును, ఆ కారణంచేత వారందరు సమానమైనట్లును భావించుట. భగవంతుని సేవించుట అనగా మానవులందరిని సేవించుట. మానవ సేవను విడనాడి భగవంతుని చేరదలచుట స్వలాభమును కోరుటయే. అందుచేత సమాజములో జ్ఞానులు అజ్ఞానులకును, బలవంతులు బలహీనులకును, ధనికులు దరిద్రులకును సేవజేసి వారిని కూడ తమతో సమానులుగ జేసినప్పుడే వారు అద్వైతతత్వమును ఆచరణలో పెట్టిన వారగుచున్నారు. రామకృష్ణుడు అద్వైత తత్వమునకు ఈలాటి అర్థాన్ని కల్పించి మోక్షసాధనకు ప్రజాసేవ ప్రధానసాధనమని ఉద్ఘాటించాడు. ఇందులోనే అతని బోధలకొక విశిష్టత ఉన్నట్లు అతని శిష్యులలో అగ్రగణ్యుడైన వివేకానం దుడు పునరుద్ఘాటించి రామకృష్ణ సేవాశ్రమాల ద్వారా దానిని అచరణ యోగ్యం చేశాడు. "ప్రతి జీవియు సాక్షాద్భగవత్స్వరూపమని గ్రహించి, చేయవలసినది జీవసేవ అని రామకృష్ణుడు పలికాడు.

సర్వమత సామరస్యసమానత్వాలను నిరూపించడము రామకృష్ణుని బోధలలో మూడవ విశేషం. ఇందులోనే అతనికిని దయానందునికిని గొప్ప భేదం. అతడొక సమయాన చెప్పిన మాటలు ఇవి : "పెద్దచెరువునకు అనేకమైన రేవులుండును. స్నానముచేయుటకు గాని, పాత్రలో నీరు తీసుకొనిపోవుటకు గాని, ఈ రేవులలో దేనిలో దిగినను నీటినీ చేరవచ్చును. ఒక రేవు మరిమొక రేవు కంటె శ్రేష్ఠమైనదని వాదులాడుట వ్యర్థము. అటులనే బ్రహ్మానంద సరో వరమునకు అనేకమైన రేవులున్నవి. ప్రపంచ మందలి ప్రతి మతము అట్టిమొకా నొక రేవు. వినిర్మలహృదయుడవై నీవీ రేవులలో దేనియందు ప్రవేశించిను తన్మూలమున బ్రహ్మానందమను జలమును జేరగలవు. కావున నా మతము మరి

యొకని మతము కంటే శ్రేష్టమని వాదులాడబోకుము." ఈ భారతీయ సంప్రదాయాన్ని రామకృష్ణుడు పునరుద్ఘాటించాడు. వివిధ మతాలకు నిలయమైన భారతదేశమునకు ఈ పునరుద్ఘాటన ఎంతగానో అవసరమైనట్టిది.

బహుదేవతారాధనను విగ్రహారాధనను ఖండించువారిని కూడా రామకృష్ణుడు మందలించాడు. "ఒకే బంగారముతో వేర్వేరు నామరూపములుగల నగలు చేయబడు చందమున ఒకే భగవానుడు వివిధ దేశకాలములలో వివిధ నామరూపములలో ఆరాధింపబడుచున్నాడు. వేర్వేరు భావముల, వేర్వేరు విధానముల నాత డారాధింపబడుచున్నాడు - అనగా భగవంతుని కొందరు తండ్రియనియు, గొందరు తల్లియనియు, గొందరు సఖుడనియు, గొందరు నాధుడనియు, గొందరు సన్నిధానమనియు మరికొందరు తమ చిన్న ముద్దుబిడ్డడనియు భావన చేసి యారాధించుచున్నారు — ఈ వివిధ భావసంబంధములన్నిటి మూలమునను ఆరాధింపబడు వాడు ఒకే భగవానుడు", అని బోధించాడు.

విగ్రహారాధన విషయములో రామకృష్ణుడు చెప్పిన మాటలలో కొన్ని : "మేడ కట్టుచుండు కాలమున పరంజా చాల ఆవశ్యకము. కాని కట్టడపుపని ముగిసిన వెనుక పరంజాతో ఎవ్వరికి పని ఉండదు. అటులనే విగ్రహారాధన ప్రారంభమున ఆవశ్యకమే. కాని సాక్షాత్కారము పొందినవాడు ప్రతి వస్తువును-విగ్రహమును-సమస్తము - భగవత్స్వరూపములుగనే కాంచును. అట్టి వాని దృష్టిలో విగ్రహము మృణ్మయముకాదు, చిన్మయము'. విగ్రహారాధనను తీవ్రముగ ఖండించుచుండిన కేశవచంద్రసేనుతో రామకృష్ణుడు పలికిన మాటలు: "ఈ విగ్రహములు ఎందుచే నీ మనస్సులో రాయి, గడ్డి, కర్ర అనుభావములను గల్గింపవలెను ? నిత్యానంద ప్రజ్ఞానమయియగు అలజగన్మాతయే ఈ రూపములన్నిటను వెల్గొందుచున్నదని నీవేల గ్రహింపరాదు?"

ఈవిధముగ సమకాలిక సంస్కర్తల వాదములలోని లోపాలను సమరస భావంతో చూపెట్టుచూ, యుగయుగాల అనుభవ ఫలితంగా పరిణామము గాంచిన భారతీయ ఆధ్యాత్మిక తత్త్వాన్ని రామకృష్ణుడు పునరుద్ధరించి, జాతి గౌరవాన్ని నిలబెట్టాడు.

## 5

రామకృష్ణుని శిష్యులలో అగ్రగణ్యుడు వివేకానందస్వామి. ఇతడు రామకృష్ణుని బోధనలను ప్రపంచమందంతటా ప్రచారంచేశాడు. ఇంతేగాక రామకృష్ణుడు సూత్రప్రాయంగా సూచించిన సత్యాలన్నిటినీ విపులీకరించి వాటిని సాంఘిక ఆర్థికాది రంగాలన్నిటిలో క్రియాత్మకం చేసాడు. ఆధ్యాత్మిక జీవితం ఒక ప్రత్యేక జీవితం కాదనీ, అది జీవిత రంగాలన్నిటిలో సన్నిహిత సంబంధం కలదనీ, ఆసంబంధం క్రియారూపం ధరించినప్పుడే దానికి సార్థకం లభిస్తుందనీ వివేకానందుడు నిరూపించాడు. అతడు ప్రతిపాదించిన వేదాంతం అనుష్ఠాన వేదాంతం,

వివేకానందుని తొలిపేరు నరేంద్రదత్త. అతడు 1863లో కలకత్తాలో ఒక మధ్యతరగతి కాయస్థకుటుంబంలో జన్మించాడు. కలకత్తా విశ్వవిద్యాలయం లో పట్టభద్రుడై పాశ్చాత్య తత్వగ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. కొంతవరకు బ్రహ్మసమాజం చేతకూడా ఆకర్షితుడయ్యాడు. మతప్రచారకులని ప్రఖ్యాతిగాంచిన వారిని దర్శించి, "భగవంతుని స్వయముగా చూచితిరా" అనే ప్రశ్నకు సమాధానాన్ని వాంఛించాడు. కాని ఎవరుకూడా సమాధానం చెప్పలేక పోయ్యారు.

ఆ పరిస్థితులలో అతడు 1881 లో రామకృష్ణుని సందర్శించాడు. రామ కృష్ణుడు అతనిని కౌగలించుకొని, "వచ్చావా నాయనా, ఎన్నాళ్ళనుండియో నీకుగాను నిరీక్షిస్తూవచ్చాను", అని అతనిని చేరదీశాడు. నరేంద్రుడు తన మామూలు ధోరణిలో, "మీరు భగవంతుని చూచారా" అనేప్రశ్నను వేశాడు. రామకృష్ణుడు వెంటనే, "నేను నిన్ను ఇప్పుడు చూచుచున్నట్లే - ఇంతకంటే స్పష్టంగా - భగవంతుని చూచాను" అని జవాబుచెప్పాడు. ఇతడే తనకుగురువనే భావం నరేంద్రునికి కలిగింది. అది మొదలు రామకృష్ణుని నిర్యాణం వరకు అతడు తరుచుగా రామకృష్ణుని కలుసు కొనడము, అతని ముఖతా సమస్త ఆధ్యాత్మిక సత్యాలను నేర్చుకొనడము, దానితోపాటు యోగసాధనలను ఆచరించడము జరిగి, తుదకు అతడుకూడ భగవత్సాక్షాత్కారాన్ని పొంద గలిగాడు. అతనితోపాటు మరికొందరు యువకులుకూడ రామకృష్ణుని శిష్య వర్గంలో చేరారు.

1886లో నిర్యాణంగాంచుటకు పూర్వం రామకృష్ణుడు నరేంద్రునితో, "నీవు మానవకోటిని తరింపజేయుటకు జన్మించిన నారాయణుడవు. నీవు శిష్య వర్గమునకు నాయకుడవై ఈ కార్యమును సాధించవలసి ఉన్నది" అని చెప్పాడు. ఆ ఆదేశానుసారం నరేంద్రుడు తన సహచరులతో సన్యాసాశ్రమాన్ని స్వీకరించి రామకృష్ణుని నుండి తాను నేర్చిన ఆధ్యాత్మిక తత్వాన్ని భారతదేశమందే గాక ప్రపంచమంతటా ప్రచారం చేయుటకు కంకణం కట్టుకొని దానికి మొదటి మెట్టుగా రామకృష్ణ మఠాన్ని స్థాపించాడు. వారితో కలిసి వేదాంత గ్రంథాలనన్నిటినీ అధ్యయనం చేశాడు. తర్వాత దేశసంచారం చేసి సర్వవిధాలా ఆనాడు దేశం పతనమైపోయిన విషయాన్ని గ్రహించి, దానిని సముద్ధరించడమే తన కర్తవ్యంగా నిర్ణయించుకొన్నాడు.

దీనికి ప్రాతిపదికగా అమెరికా మొదలైన పాశ్చాత్య దేశాలకు వెళ్ళి అద్వైత వేదాంతంలోని ఉత్కృష్టతను అక్కడివారికి తెలియపరచి భారతదేశం పట్లను భారతజాతి పట్లను రెండుమూడు శతాబ్దాలుగా ఏర్పడిన దురభిప్రాయాన్ని మార్చ కృతనిశ్చయుడై. అమెరికాలోని షికాగో నగరంలో 1893లో జరుగ నున్న విశ్వమత మహాసభకు భారత ప్రతినిధిగా వెళ్లి ఉపన్యసించిన పక్షాన తన ఈప్సితం చక్కగా నెరవేరగలదని భావించి. కొందరి అభిమానుల ద్వారా ఆర్థిక సహాయాన్ని సంపాదించి, 1893లో షికాగో చేరాడు. దీనితో అతని జీవితం

లోనే గాక ఆధునిక భారతదేశ చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభ మైంది.

అక్కడ సమావేశమైన మహాసభలో ప్రాక్పశ్చిమ ఖండాలలో తత్వవేత్త లని ప్రఖ్యాతిగాంచిన పండిత ప్రకాండులు వందల సంఖ్యలో ఉండినారు. వారి ఉపన్యాసాలను వినుటకు పదివేల జనం గుమిగూడి ఉండినారు. అప్పటికి కాషాయ వస్త్రధారిగా వారిమధ్య ఆశీనుడైన వివేకానందుని వయస్సు 30 సంవత్సరాలు మాత్రమే. అతడు గొప్ప తత్వవేత్తగా ప్రఖ్యాతి సంపాదించినవాడు కాడు. కాని అతనిలో ఆత్మవిశ్వాసం మూర్తీభవించి ఉండినది. దానిని ఆధారం చేసుకొని అతడు ఉపన్యాస వేదికపై నిలబడి ఇతర ఉపన్యాసకులందరూ దినాల తరబడి వారివారి మతాల ఉత్కృష్టతను ప్రశంశిస్తూ, మానవులు తరించుటకు ఆయా మతాలు మాత్రమే సాధనాలని ఉపన్యసించగా వివేకానందుడు వారికి భిన్నంగా సర్వమత సామరస్యాన్ని సమానత్వాన్ని ప్రతిపాదిస్తూ వేదాంత తత్వంలోని విశిష్టత ఇందులోనే ఉన్నదనీ మానవ జాతుల మధ్య పోటీలు సంఘర్షణలు అంత రించి ఏకీభావమూ సహజీవనమూ ఏర్పడుటకు వేదాంత తత్వం ఉపదేశించే సర్వ మత సామరస్యం ఒక్కటే సాధనం అనీ గంభీరోపన్యాసం చేశాడు. ఈ ఒక్క ఉపన్యాసంతో అతడు అమెరికన్లను వశపరచుకొనగలిగాడు. ఎవరూ అందజే యుటకు సాహసించని సందేశాన్ని అతడు విశ్వమత మహాసభ ద్వారా మానవ కోటికంతా అందజేశాడు. మహాసభలో అటుతర్వాత నాలుగు పర్యాయాలు ఉపన్యసించాడు. శాస్త్ర చర్చలకు గాను ప్రత్యేకింపబడిన సమావేశాలలో అనేక పర్యాయాలు పాల్గొన్నాడు. మొదటి ఉపన్యాసం చేసిన మరునాడే అమెరికా లోని ప్రముఖ వార్తా పత్రికలన్నీ అతనిని ప్రశంసిస్తూ సంపాదకీయ వ్యాసాలు ప్రకటించాయి. వాటిలో ఒక పత్రిక, "విశ్వమత సభలోని ప్రతినిధులలో నిస్సం శయంగా వివేకానందుడే అగ్రగణ్యుడు, అతని ఉపన్యాసం విన్నతర్వాత అంతటి అధ్యాత్మిక విద్వత్తుగల దేశానికి ఈ దేశానుండి మతప్రచార నిమిత్తం క్రైస్తవ ప్రచారకులను పంపుటకంటే తెలివిమాలినతనం ఇంకొకటి లేదు, అని వ్రాసింది. మత మహాసభలో శాస్త్ర చర్చలపై అధ్యక్షత వహించిన తత్వవేత్త " సనాతన ధర్మమువలె సర్వమత మహాసభను అమెరికా ప్రజలను అత్యద్భుత రీతిన నరికట్టిన మతసంస్థయు దత్ప్రతినిధియగు వివేకానందస్వామి వంటి మహా వక్తయు లేడనుట నిస్సంశయము. స్వామి ఉపన్యాసమన్నచో సభ్యుల కపరిమి తోత్సాహము, ఆనందము. మత మహాసభయందును, నా యధ్యక్షతన జరుప బడిన శాస్త్రశాఖా సమావేశములందును నాతడనేక పర్యాయములు ఉపన్యసిం చెను. క్రైస్తవులు కానిండు, క్రైస్తవేతరులు కానిండు, — సభారంజకులై మించిన వక్తలలో నెప్పుడును నాతడే యగ్రగణ్యుడు. అతడెచటికేగిన నచట కరిగి వేలకొలది జనులాతడు పల్కు ప్రతి శబ్దమును ఆత్రముతో నాలకించు వారు. క్రైస్తవులలో స్వమతాభిమాన పూరితులగు సనాతనులు సహితము వివేకానందుడు సాక్షాన్న రేంద్రుడని పల్కిరి," అని ప్రశంసించాడు.

అటుతర్వాత సుమారు నాలుగు సంవత్సరాలకాలం వివేకానందుడు ప్రముఖుల యొక్కయు ప్రజల యొక్కయు ఆహ్వానాలను పురస్కరించుకొని అమెరికా యందంతటను వేదాంత తత్వమును గురించి ప్రచారముచేసి, శిష్యుల నేకులను సంపాదించి, ప్రచారము శాశ్వతముగా సాగుటకు అనేక నగరాలలో వేదాంత కేంద్రాలను స్థాపించి, వాటిలో తత్వబోధ చేయుటకు రామకృష్ణ మఠములో శిక్షణ పొందిన సన్యాసులను నియమించి 1897లో అమెరికాను వదలి, ఇంగ్లండులో అనేక సమావేశాలలో వేదాంత తత్వాన్ని గురించి ఉపన్యాసాలు చేసి, అటుతర్వాత ఫ్రాన్స్, స్విట్జర్లాండు, జర్మని మొదలైన దేశాలలో కూడా తత్వబోధ గావించి 1898లో స్వదేశానికి వచ్చి చేరాడు.

ఒక దిగ్విజయ యాత్రను సాగించి భారతీయ ఆధ్యాత్మిక మహా సామ్రాజ్యాన్ని స్థాపించిన మహావీరునిగా భారతీయులందరు అతనికి స్వాగతమొసంగారు. విశ్వమత మహాసభలో అతడు గావించిన ఉపన్యాసాలు, అతడు పొందిన ప్రశంసలు, భారతదేశాన నూతన సంచలనాన్ని నూతన ఉత్తేజాన్ని కలిగించాయి. "వివిధ రాష్ట్రములలో జనులు వివేకానందుని కీర్తించుటయే గాక వివేకానందజనకమగు సనాతన ధర్మమద్వితీయమని గుర్తింపసాగిరి. చైతన్య విరహితమై నిద్రాణమైయున్న భారతదేశము వివేకానంద భానూదయ తేజమున మేల్కాంచి భావిభాగ్య ఫలసూచకమై విజృంభించసాగెను". అని వివేకానంద జీవిత చరిత్రకారుడు వ్రాసిన మాటలలో ఏలాటి అతిశయోక్తిలేదు.

విదేశాలలో వేదాంతతత్వాన్ని వ్యాపించవలసిన అవసరం ఉన్నా భారత దేశాన్ని ఆ తత్వంద్వారా ఉద్ధరించడం అంతకంటే ఎక్కువ అవసరమని వివేకానందుడు గ్రహించి అందుకుగాను 1898 నుండి విసుగు వేసటలు లేక నిరంతరం తన సహచరుల సహాయంతో కృషిచేశాడు. రామకృష్ణ మఠానికి నియమ నిబంధనలను రూపొందించి సుస్థిరత్వాన్ని కల్పించాడు. మాయావతీ నగరంలో ఒక శాఖను స్థాపించి మఠంలో పనిచేయుటకు మఠంయొక్క ఆశయాలను నెరవేర్చుటకు యోగ్యులైన సన్యాసుల శిక్షణకు దానిని కేంద్రంగా చేశాడు. తత్వ ప్రచారానికై "ప్రబుద్ధభారత" మొదలైన పత్రికలను ప్రకటించాడు. ప్రజలు తరించుటకు కావలసినది మానవసేవ అని రామకృష్ణుడు బోధించిన సూత్రాన్ని క్రియాత్మకం చేసే ఉద్దేశంతో రామకృష్ణ సేవాశ్రమం అనే పేరుతో ఒక ప్రత్యేక సంస్థను స్థాపించాడు. ఇది అనుష్ఠాన వేదాంతం కార్యరూపం ధరించడంలో పటిష్టసాధనం అయింది. ఈ పనులను సాగిస్తూ అతడు నిర్విరామంగా దేశసంచారం చేస్తూ ఏయే ప్రాంతాలలో ఏలాటి కార్యక్రమాలను చేపట్టడం అవసరమో అనుచరులకు తెలియపరచాడు. 1899 లో రెండవ పర్యాయం అమెరికాకు యూరోపులోని దేశాలకు వెళ్లి అనేక మహాసభలలో పాల్గొన్నాడు. దేశాన్ని వివిధరంగాలలో ఏలాగు ఉద్ధరించడం అనేసమస్య ఒక్కటి పట్లనే అతడు ఈ పర్యటనను ముగించుకొని తిరిగి వచ్చిన తర్వాత తన దృష్టినంతా కేంద్రీకరించాడు. అందుకుగాను వివిధ మార్గాలను అన్వేషించాడు, తన ఉత్సాహంతో

సహచరులందరిని ప్రభావితుల గావించాడు. కాని ఈ నిరంతర కృషిచే అతని ఆరోగ్యం చెడింది. క్రమక్రమంగా రోగపీడితుడై తుది నిమిషంవరకు భారతదేశ విముక్తినే వాంఛిస్తూ 1902 లో 39 వ వయస్సున అకాలమరణానికి గురి అయ్యాడు. దేశం ఒకమహా మేధావిని, నిర్మాణశీలుని, మహావీరుని, త్యాగిని కోల్పోయింది.

మత ఉద్యమాలను సాగించిన వారందరిలో వివేకానందుడు అగ్రస్థానాన్ని వహిస్తున్నాడు. అతడు గొప్ప దేశాభిమాని, భారతదేశానికి అనాదిగా గొప్ప ఆధ్యాత్మిక సంపద ఉన్నదనీ, భారతజాతి స్థిరత్వానికి ఇది ప్రధాన కారణమనీ, దేశంయొక్క భవిష్యత్తుకూడా దీనిపై ఆధారపడి ఉన్నదనీ, అన్ని సంపదలకు ఇది జన్మస్థానమనీ అతడు విశ్వసించాడు. నాలుగు సంవత్సరాలు అమెరికా పర్యటనను పూర్తిజేసుకొని స్వదేశానికి వచ్చిన వెంటనే ఒక మహాసభలో ఉపన్యసిస్తూ, "మనము ప్రపంచమునకు కొంతబోధింపవలసి యున్నామని చెప్పియుంటిని. ఈ కారణము చేతనే, ఈశ్వరేచ్ఛవలననే, మనజాతికి శతాబ్దముల కొలది మహోపద్రవములు తటస్థించినను, దాదాపు వేయి సంవత్సరములుగా విదేశీయుల పరిపాలనక్రింద పడియున్నను పరదేశీయులు మనలను ఎంతగా అణగ ద్రొక్కుచున్నను, ఈ మనజాతి ఇంకను సజీవముగ నిలచియున్నది. దీనికి చావులేదు. ఇది అమరము. ఇది భగవంతుని యెడల ప్రతిపత్తిగలిగిన మతధర్మమునకును ఆధ్యాత్మజ్ఞానమునకును కాణాచియైయుండుటయే ఇందుకుకారణము, అని తెలియపరచాడు. ఈ ఆధ్యాత్మజ్ఞాన సంపదను భారతీయులనెన్నటికిని విడనాడ కూడదని హెచ్చరించినాడు.

ఈ జ్ఞానమంతయు ప్రాచీనకాలపు వేదాంతతత్వమందున్నది. ఈనాటి హిందూమతంలోని మూఢనమ్మకాలు, అర్థంలేని ఆచారాలు ఆ తత్వంతో సంబంధంలేనట్టివి. వీటినన్నిటిని నిర్మూలించి ఆశుద్ధతత్వాన్ని, పునరుద్ధరించి ప్రచారం చేయడం ప్రస్తుతం జరగవలసిఉంది, అని అన్నాడు.

వేదాంతతత్వం ప్రతిమానవుడు భగవత్స్వరూపి అని ప్రతిపాదిస్తున్నది. క్రైస్తవులు భావించునట్లు మానవులు పాపులుకారు. అందరిలోను భగవదంశ ఉండడం చేత మానవులందరు సమానులు. అందరు సుఖించుటకు అర్హులు. కాని అందరు సుఖించటంలేదు. ఈ పరిస్థితులలో వేదాంతతత్వానికి క్రియా రూపం కలిగించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది అది అనుష్ఠాన యోగ్యం కావలసిఉంది. ఈ అనుష్ఠానానికి భగవంతుని సేవించుటకు మానవసేవయే ఏకైక సాధనమనే సూత్రం ఆధారం. దేశంలో అధికసంఖ్యాకులు దారిద్ర్య పీడకు గురియైఉన్నారు. వారిని అజ్ఞానం ఆవరించిఉంది. అనేకులు క్షామబాధితులుగను, వరదబాధితులుగను, వ్యాధిబాధితులుగను కాలం గడపవలసిన వారుగా ఉన్నారు. అనేకులు అస్పృశ్యులుగా భావింపబడుతూ మానవత్వానికి దూరులుగా ఉన్నారు. వీరెవరూ సుఖమన్నది ఏమిటో తెలియక జీవితాన్ని సాగిస్తున్నారు. అనుష్ఠాన వేదాంతం వీరందరి సుఖజీవితానికి సాధనం కావలసిఉంది.

అప్పుడే అది సార్థక్యాన్ని పొందుతుంది. ఈ ఉద్దేశం కొనసాగుటకే వివేకానందుడు రామకృష్ణ సేవాశ్రమాన్ని స్థాపించాడు. కామినీకాంచనాలను విసర్జించి సర్వసంగపరిత్యాగులైన సన్యాసులే మానవసేవ చేయుటకు పూర్తి అర్హత గలవారని అతడుభావించాడు. సన్యాసులు కాంక్షించవలసినది స్వీయ మోక్షప్రాప్తి మాత్రమే కాదు. అది స్వార్థమును సాధించదలచుటయే. మానవసేవ అంతకంటె ఉత్కృష్టమైన లక్ష్యం. ఈ లక్ష్యాన్ని సాధించినప్పుడే సన్యాసాశ్రమం సార్థక్యాన్ని పొందుతుంది అని అతడు ఉద్ఘాటించాడు.

దేశంలోని వివిధ రంగాలలో సంస్కరణలు జరగవలసి ఉన్నాయి. కాని పాశ్చాత్యులను అనుకరించడం దీనికి ఎంతమాత్రమూ సాధనం కాకూడదు. భారతీయులలో ఎన్ని లోపాలున్నవో అన్ని లోపాలూ రూపాంతరాలలో పాశ్చాత్యులలోకూడా ఉన్నాయి. అందుచేతనే వారిని అనుకరించడం ప్రమాదకరం. ఈనాటి భారతీయ విద్యాధికులలో ఈ దోషం ఎంతగానో కనుపిస్తున్నది. దీనిని విసర్జించి భారతీయులు ఆత్మవిశ్వాసం కలవారై ప్రాచీనులు వారికి ప్రసాదించిన వేదాంతతత్వం యొక్క అమూల్యతను గ్రహించి తదనుసారంగా అవసరములైన సంస్కరణలను చేసుకొనడమే ఉత్తమమార్గం. "మీకు ఆత్మవిశ్వాసము సున్నయైనచో, ఇప్పుడేకాదు ఎప్పటికిని మీకు ముక్తిలేదు, లేదు, లేదు...మనము ఇద్దరమా ముగ్గురమా, ముప్పదిమూడు కోట్ల ప్రజలముగదా ? ఏ పదుగురు పరదేశీయులో గడచిన వేయి సంవత్సరములుగా దౌర్జన్యముతో, రాక్షసత్వముతో, మనలను కాలరాచి మనపై ప్రభుత్వము చెలాయించుట ఎట్లు సంభవించెను ? వారికి ఆత్మవిశ్వాసమున్నది; మనకు లేదు'', అని ఉద్ఘాటించాడు.

వివేకానందుని దృష్టి బహువిశాలమైనట్టిది. దేశ పునరుద్ధరణకు దేశాభిమానం పటిష్ట సాధనమన్నాడు. "ఈ మన దివ్య భారతమాతయే మన అధిష్ఠాన దైవతముగ నుండుగాక ! అంతవరకును ఇతర వ్యర్థదేవతలు మన మనస్సుల నుండి అదృశ్యమై పోవుదురుగాక ! ఈమె ఒక్కతెయే జాగ్రదావస్థలో నున్న దేవత ! మూర్తీభవించిన మన జాతియొక్క స్వరూపము. సర్వత్ర ఆమె చేతులే, సర్వత్ర ఆమే పాదములే, సర్వత్ర ఆమె కర్ణములే, ఆమెయే సర్వమును ఆవేశించియున్నది. తక్కిన దేవతలందరును నిద్రించుచున్నారు. వ్యర్థపు దేవతల వెంటబడి, మన చుట్టును ఆవరించి వెలుగు దైవతమును, ఈ విరాణ్మూర్తిని పూజింపజాలకున్నామే ! ఈ దేవతను మనము అర్చించిన పిమ్మట తక్కిన దేవతలందరిని పూజించుట కర్హులమగుదుము'' అని ప్రజలందరిని దేశాభిమాన పూరితులుగ జేయ సంసిద్ధుడయ్యాడు.

ఈ విధముగ వివేకానందుడు మతమునకు విశాలార్థమును కల్పించి, భారతీయుల జీవిత విధానమంతటిని దానిచేత ప్రభావితం చేశాడు. విద్యాధికుల దృష్టిని ప్రాచీన భారత విజ్ఞానంవైపు మరల్చాడు. పాశ్చాత్యుల సంస్కృతిపట్ల వారికిగల వ్యామోహాన్ని తగ్గించాడు. ప్రముఖవర్గానికి చెందినవారందరిలో

జాతీయతను బలపరచాడు. గతంలో తమ జాతి వివిధ రంగాలలో అనేక విజయాలను సాధించినట్టిదనీ, భవిష్యత్తులోకూడా అలాటి విజయాలను సాధించగల శక్తి దానికి కలదనీ, అందుకుగాను ప్రజలందరు సుసంఘటితులై కృషిచేయవలసి ఉన్నదనీ ఉద్బోధించాడు. వీటి అన్నిటిమూలంగా నవభారత నిర్మాతలలో అతడు అగ్రశ్రేణికి చెందినవాడయ్యాడు. భారతీయులు అనాగరికులనీ సంస్కృతి లేనివారనీ పాశ్చాత్యులలో అంతకుపూర్వం వ్యాపించిన దురభిప్రాయాన్ని తొలగించి భారతదేశంపట్ల గౌరవం కలవారినిగా వారిని మార్చాడు. అతడు సాధించిన ఆశయాలలో ఇది ఎక్కువ ప్రాధాన్యాన్ని వహిస్తున్నది.

## 6

విద్యాధికులలో జాతీయతను బలపరచిన నాల్గవ మత ఉద్యమము దివ్యజ్ఞాన ఉద్యమం. దివ్యజ్ఞానము బ్రహ్మజ్ఞానానికి పర్యాయపదం. ఈ ఉద్యమంలో భారతీయుల నాకర్షించిన విశేషాలను కొన్నిటిని గుర్తించవలసి ఉంది.

ఈ ఉద్యమాన్ని ప్రారంభించి సాగించినవారు పాశ్చాత్యులు. రషియా దేశపు జమీందారీ వంశములలో నొకదానికి చెందిన శ్రీమతి బ్లావట్స్కీ, ఆల్కాట్ అనే ఒక అమెరికా ప్రముఖుడు సహచరులు కొందరి సహాయంతో 1875 లో న్యూయార్కు నగరంలో దివ్యజ్ఞాన ప్రచారం నిమిత్తం దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించారు. 1879 లో వారు భారతదేశానికి వచ్చి, అనేక నగరాలలో సమాజ శాఖలను నెలకొల్పి 1882 లో మద్రాసు నగర పరిసరగ్రామమైన అడయారును తమ కార్యకలాపాలకు ప్రధాన కేంద్రంగా చేసుకొన్నారు. వీరిది ప్రపంచవ్యాప్తమైన ఒక అంతర్జాతీయ ఉద్యమం. దీనిని నడిపించుటకు భారతదేశాన్ని కేంద్రంగా చేసుకొనడం భారతీయులకు గర్వకారణమై వారిని ఉత్తేజపరిచింది.

గుర్తించవలసిన విషయాలలో ఇంతకంటె ప్రధానమైనది ఇంకొకటి ఉంది. దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించి నడిపించిన పాశ్చాత్యులు సమస్త మతాలకు ఆధ్యాత్మిక విద్యలకు ప్రాచ్యదేశాలే జన్మస్థానాలని, వాటిలోకూడా భారతదేశమే ప్రధానస్థానమనీ, వీటినుండియే పాశ్చాత్యులు వారి ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ఇదివరలో సంపాదించినారనీ భవిష్యత్తులోకూడా వీటినుండియే జ్ఞానాన్ని సంపాదించవలసిన వారనీ విశ్వసించి ఈ అభిప్రాయాన్నే వివిధ దేశాలలోని సమాజ శాఖలద్వారా ప్రపంచ మందంతట ప్రచారం చేశారు. వీరు ప్రచారంచేసిన సిద్ధాంతాలలో పాశ్చాత్య ప్రపంచానికి ఒక విధంగా కొత్తవి అయిన పునర్జన్మ సిద్ధాంతం, కర్మ సిద్ధాంతం చాలా ప్రాధాన్యాన్ని వహించాయి. ఈ రెండూ భారతదేశంలో పుట్టి పెరిగిన వైదిక బౌద్ధ మతాలలోని ప్రధాన సిద్ధాంతాలు. వీటికితోడు భారతదేశంలో అనాదిగా ఆచరణలోనున్నట్టి యోగసాధనలకూ యోగదృష్టికి వీరు అత్యంత ప్రాధాన్యాన్ని కల్పించి వాటి మహత్తును పాశ్చాత్యులకు తెలియపరచారు. ఈ విధంగా వీరి ప్రయత్నాల మూలాన భారతీయ తత్వాలలోని విశిష్టతను పాశ్చాత్యులు గ్రహించడం,

భారతదేశాన్ని వారొక విధంగా పుణ్యభూమిగా భావించడం దేశంలోని విద్యాధికులందరికి గర్వకారణం అయింది.

ఇంతేగాక రెండు మూడు శతాబ్దాలుగా క్రైస్తవులూ పాశ్చాత్య ప్రపంచంలోని తదితరులూ హిందూమతం అనేక మూఢవిశ్వాసాలకూ అనేక దురాచారాలకూ నిలయమైనట్లు, భారతీయులు ఆలాటి మతాన్ని విసర్జించి క్రైస్తవ మతాన్ని స్వీకరించినప్పుడే వారు తరించగలరనీ ప్రచారంచేస్తూ వచ్చారు. దివ్యజ్ఞాన సమాజంలోని పాశ్చాత్యులు ఈ ప్రచారానికి విరుద్ధంగా హిందూమతంలోని విశ్వాసాలను ఆచారాలను బహుదేవతారాధన విగ్రహారాధన మొదలైన పూజా విధానాలను సహేతుకంగా సమర్థించారు. పాశ్చాత్యులైన వారు ప్రపంచంలోని వివిధ మతాలను అధ్యయనంచేసి వాటిలోని గుణదోషాలను నిర్ణయించే ప్రయత్నంలో ఈ విధంగా హిందూమతాన్ని సమర్థించడం దేశంలోని విద్యాధికులకు ఎంతగానో ఆకర్షణీయంగాను గర్వకారణంగాను మనశ్శాంతిని బలపరచే సాధనంగాను పరిణమించింది. దేశంలోని ఆనాటి విద్యాధికులు ఒక విధంగా త్రిశంకుస్వర్గవాసులై ఆధ్యాత్మిక విషయాలలో దారీతెన్నూ తెలియక డోలాయమాన మనస్సులుగలవారై ఉంటూవచ్చారు. వైజ్ఞానిక సాంకేతిక శాస్త్రాల ప్రభావంచేత వారిలో నాస్తికత, హిందూ మతాచారాల పట్ల విముఖత్వం ప్రబలాయి, కాని యుగయుగాలుగా సమాజంలో మన్ననకు పాత్రమైన సంప్రదాయాలనన్నిటినీ పూర్తిగా వదలుకోనడం వారికి అంగీకారయోగ్యంకాలేదు. ఈ విధంగా వారు ఏఒక్క మార్గాన్నీ అనుసరించేవారుగాక సంశయాత్ములై ఉంటూ వచ్చారు. ఈలాటి సందిగ్ధావస్థలో విద్యాధికులైన పాశ్చాత్యులనేకులు హిందూమత తత్వమే ప్రపంచానికంతా జ్ఞానసాధనమనీ, అందులోని పూజావిధానాలన్నీ సమర్థింపదగినవనీ, ప్రకటించడం దేశంలోని విద్యాధికులు ఒకనిశ్చితాభిప్రాయానికి వచ్చేటట్లు చేశాయి. దయానందుడు రామకృష్ణుడు సనాతన ధర్మాన్ని ప్రశంసించిన మాటవాస్తవమే. కాని వీరు హిందువులు. హిందువులు హిందూమతాన్ని ప్రశంసించడంలో ఏలాటి విశేషంలేదు. ఈ లాగుకాక దివ్యజ్ఞాన సమాజంద్వారా పాశ్చాత్యులైనవారు ఈలాటి ప్రశంసలను చేయడం విద్యాధికులకు ఎంతగానో తృప్తి కలిగించింది. తమ మతం, తమ పూర్వులు ప్రతిపాదించిన ఆధ్యాత్మికతత్వం, ప్రశస్తమైనట్టివి అనేభావం వారిలో బలపడింది. అలాటి తత్వాన్ని రూపొందించిన ఋషులు తమపూర్వులని, తామువారి సంతతికి చెందినవారని గర్వించసాగారు. వారి సంశయాత్మత తొలగి హిందూమతంపట్ల వారికిగల శ్రద్ధాభక్తులు ఇనుమడించాయి. వారిలో అనేకులు దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులయ్యారు.

ఈలాగు పరిపరి కారణాలమూలంగా దివ్యజ్ఞాన సమాజం విద్యాధికులపై ప్రభావం వహించింది. 1893లో శ్రీమతి అనిబిసెంటు భారతదేశానికి వచ్చి, సమాజంద్వారా వివిధరంగాలలో ఘనమైన పాత్రను వహించడం చేత ఆ

ప్రభావం అనేకరెట్లు పెరిగింది. ఈమె గొప్పమేధావి. ప్రపంచ విఖ్యాతిని సంపాదించిన మహావక్త. స్వదేశమైన బ్రిటన్‌లో అనేక ప్రజా ఉద్యమాలలో పాల్గొని ప్రసిద్ధిగాంచినట్టిది. ఒకప్పుడువైజ్ఞానికశాస్త్రంలోను హేతువాదంలోను సంపూర్ణ విశ్వాసంకలదై, నాస్తికురాలై నాస్తికతత్వాన్ని ప్రచారం చేసినట్టిది. 1889లో— అప్పటికి ఆమె వయస్సు 42 సంవత్సరాలు- ఆమె బ్లావెట్స్కీ రచించిన గుప్తవిద్య "(Secret Doctrine)" అనే ఉద్గ్రంధాన్ని ఒకే పత్రికలో విమర్శ నిమిత్తం చదివి దానిచే ప్రభావితురాలై ,ఆస్తికతకు కేంద్రం అయిన దివ్యజ్ఞాన సమాజంలో చేరింది. 1893లో దివ్యజ్ఞాన ప్రచారకురాలుగా మొదటిసారి భారతదేశానికి వచ్చి వేనకువేలు ప్రజలసమావేశాలలో అనర్గళంగా ఉపన్యాసాలు గావించి విద్యార్థికులను ఆకర్షించింది. అనేక సంవత్సరాలకాలం నాస్తికత్వాన్ని ప్రచారంచేసిన ఒక మేధావి స్వానుభవంచేత అందులోని లోపాలను గ్రహించి, భగవంతుని అస్తిత్వాన్ని ప్రచారం చేయడం విద్యార్థికులలో హిందూమతంపట్ల శ్రద్ధాభక్తులు కలిగించింది.

వాస్తవానికి భారతదేశమే తన స్వదేశమనీ, పూర్వజన్మలో తాను భారతావనిలో జన్మించి దేశానికి ఎంతో రుణపడి ఉన్నట్టిదనీ, ఆ రుణాన్ని తీర్చుకొనుటకు తనకు ఈ జన్మలో అవకాశం కలిగినదనీనీ ఆమె విశ్వసించి, దానిని ఆధారం చేసుకొని 1893నుండి తన జీవితాంతం వరకు— 40 సంవత్సరాలకాలం-- విసుగువేసటలు లేక భారతదేశంలోనే ఎక్కువకాలం గడపి, మత సాంస్కృతిక విద్యారంగాలలోను సంఘసంస్కరణ ఉద్యమంలోను, రాజకీయాలలోను అమోఘమైన కృషి గావించి విద్యార్థికుల మన్ననలకు పాత్రురాలగుటయేగాక వారందరిని దేశాభ్యుదయ కార్యక్రమాలన్నిటిలో పాల్గొనేటట్లు చేసింది. పురోభివృద్ధికంతకూ ఆధ్యాత్మిక విద్యతో కూడిన విద్యావిధానం ప్రధాన సాధనమనీ, ప్రభుత్వం ప్రవేశపెట్టిన విద్యావిధానంలో ఆలాటి విద్యకు స్థానం లేకపోవడం ఒకగొప్ప లోపమనీ భావించి, వారణాసిలో ఒక కేంద్ర హిందూ విద్యాలయాన్ని స్థాపించింది. ఇదే కొన్నిసంవత్సరాలైన తర్వాత ఈనాటి హిందూవిశ్వవిద్యాలయంగా మారింది. ఇంతేగాక ఆమె బాల్యవివాహ నిషేదం, అస్పృశ్యతా నివారణ, స్త్రీవిద్య మొదలైన సంఘసంస్కరణ కార్యక్రమాలను నిర్వహించింది. 1914 తర్వాత రాజకీయాలలో ప్రవేశించి స్వాతంత్ర్యోద్యమానికి మొదటి మెట్టుగా అంతరంగిక స్వపరిపాలన ఉద్యమాన్ని (Home Rule Movement) నడిపించింది. ఈ విధంగా దేశంయొక్క పునరుద్ధరణకు ఆమె సర్వతోముఖమైన కృషిగావించింది.

దివ్యజ్ఞాన సమాజం సనాతన హిందూమత ఉత్కృష్టతను ప్రపంచమంతటా పాటించి, అంతర్జాతీయ రంగంలో భారత దేశానికి ఒక గౌరవాన్ని కల్పించింది. సమస్తమూ భారతీయులు పాశాతత్యులనుండియే గ్రహించవలసి ఉన్నదనే భావానికి బదులుగా పాశ్చాత్యులే భారతీయులనుండి గ్రహించవలసిన విషయాలు అనేకం ఉన్నవనే భావాన్ని వ్యాపింపజేసింది. ఈ విధంగా తమ

దేశానికి గొప్ప గౌరవం లభించడం విద్యాధికులలో నూతన చైతన్యాన్ని ఆత్మవిశ్వాసాన్ని కలిగించడంలో సాధనమైంది. వారిలో జాతీయాభిమానం వృద్ధిపొందింది. ఈ కారణంచేత ఆధునిక కాలపు మత ఉద్యమాలలో దివ్యజ్ఞాన ఉద్యమానికి ఒక ప్రధానస్థానం లభించింది.

7

పైన పేర్కొనినప్రధాన ఉద్యమాలు నాలుగేకాక చిల్లర ఉద్యమాలు దేశంలోని వివిధ ప్రాంతాలలోను వివిధ శాఖలలోను ఎన్నో బయలుదేరాయి. ఒకానొక సమయాన వివేకానందుడు, "ప్రతిజాతికి ఒక భిన్న జీవనవైఖరి, ఒక ప్రత్యేక జీవనోపపత్తి ప్రపంచ జీవనమున అది నిర్వహింపవలసిన ఒక విశిష్ట కర్తవ్యము కలదు" అనీ, భారతజాతికి ఆధ్యాత్మిక జీవితంపట్ల ఆసక్తియే ఆ జీవనవైఖరి అనీ ఉద్ఘాటించాడు. ఆధునిక యుగంలో బయలుదేరిన ఉద్యమాలు ఈ సత్యాన్ని సాటిస్తున్నాయి.

ఈ ఉద్యమాలలో కొన్ని సిద్ధాంతాలలోను ఆచారాలలోను మౌలికములైన మార్పులను వాంఛించినట్టివి. బ్రహ్మసమాజం వాటికి మార్గదర్శకమైనట్టిది. మరికొన్ని ఉద్యమాలు అలాంటివికాక, సిద్ధాంతాలలోగాని ఆచారాలలోగాని గొప్ప మార్పులేవీ అవసరంలేదనీ, వాటిని చక్కగా అర్థంచేసుకొని అనుసరించడమే వాంఛనీయమనీ ఉద్బోధించాయి. ఇవి ప్రాచీన సంప్రదాయాలను సమర్థించినట్టివి. రామకృష్ణుడు, దివ్యజ్ఞాన సమాజంవారు ఈ ఉద్యమాలకు మార్గదర్శకులయ్యారు. ఈలాటి వాటిలో కంచి సుబ్బారావు తలపెట్టిన మాధ్వ మత ఉద్యమం, మైసూరులో గోవిందాచార్యస్వామి సాగించిన శ్రీవైష్ణవ ఉద్యమం, కుంభకోణంలో ప్రారంభింపబడిన స్మార్త ఉద్యమం, శైవులు లింగాయతులు వారి వారి శాఖల పునరుజ్జీవనార్థం సాగించిన ఉద్యమాలు చరిత్ర రచయితల దృష్టిని ఆకర్షించాయి.

బెంగాలు రాష్ట్రంలో వృద్ధిగాంచిన చైతన్య ఉద్యమంకూడా ఈకోవకు చెందినట్టిది. ఈ సందర్భంలో ప్రసిద్ధ రచయితగా పేర్గాంచిన బంకించంద్రచటర్జీ ప్రతిపాదించిన కృష్ణావతారతత్వం ప్రాధాన్యం వహిస్తున్నది. ఇతడు బెంగాలీ భాషలో కృష్ణచరిత్ర అనే ఉద్గ్రంధాన్ని రచించి శ్రీకృష్ణుడు చారిత్రక పురుషుడనీ, అతడు సర్వవిధాలా పరిపక్వతగాంచిన మహానుభావుడనీ, అతడు బోధించిన భగవద్గీత సనాతనతత్వాన్ని ఉపదేశించే గ్రంథాలలో అగ్రస్థానం వహించినట్టిదనీ నిరూపించాడు. అప్పటినుండి భారత దేశమందంతటా భగవద్గీత పారాయణ గ్రంథంగా స్వీకరింపబడింది. విదేశాలలోకూడా హిందూమతసారం అంతా భగవద్గీతలో ఇమిడి ఉన్నదనేభావం వ్యాపించింది. కృష్ణుని భక్తులు విదేశాలలో ప్రాధాన్యం వహించుటకు బంకిం చంద్రుని రచనలు ప్రధాన హేతువని చరిత్ర రచయితులనేకుల అభిప్రాయం.

మూడవకోవకు చెందిన ఉద్యమాలు మధ్యే మార్గాన్ని అనుసరించి నట్టివి. హిందూమతంలో జరగవలసిన మార్పులు కొన్ని వున్నా అవి స్వల్పములనీ, ప్రాచీన సంప్రదాయాలలో గౌరవించదగినవి ఎన్నో వున్నవనీ, వాటిని విసర్జించరాదనీ ఈ ఉద్యమాలను సాగించినవారు అభిప్రాయపడినారు. గుజరాటులో స్వామి నారాయణుడు, బెంగాలులో శివనారాయణ పరమహంస, మద్రాసులో సాధారణ ధర్మసభవారు, పంజాబులో దేవసమాజాన్ని స్థాపించిన వారు, సత్సంగోద్యమకర్త రాధాస్వామి, ఈలాటివారు. "బాబా" లనేకులు ఈకోవకు చెందినవారు. దేశంలో మతచైతన్యం సజీవంగావున్న విషయాన్ని ఈ ఉద్యమాలన్నీ ప్రస్ఫుటం చేశాయి.

## 8

మత ఉద్యమాలు అనేకవిధాలుగా జాతీయతను బలపరచాయి. వీటిని లేవ దీసి సాగించినవారు రాజకీయాలలో ప్రత్యక్షంగా విస్తారం పాల్గొనకపోయినా వారందరు భారతీయుల తుదిలక్ష్యం స్వరాజ్య సంపాదనమని భావించారు. స్వరాజ్యమనే మాటను ప్రప్రథమంగా వాడినవాడు దయానందుడు. రాజకీయంగా దేశం పతనం కావడానికి ప్రజల మతాలలోను సాంఘిక కట్టుబాట్ల లోను, నీతి నియమాలలోను ప్రవేశించిన లోపాలే కారణమనిన్నీ, మత సంస్కరణద్వారా వాటిని నిర్మూలించడం సాధ్యమనిన్నీ, అవి నిర్మూలమైన వెంటనే రాజకీయ స్వాతంత్ర్యం లభించితీరుతుందనీ వీరు విశ్వసించారు.

వీరిలో అనేకులు అఖిలభారత దృక్పథం కలిగినవారు. మతసంస్కరణ ప్రాతిపదికగా ప్రజలందరిలో ఐకమత్యాన్ని పెంపొందించి జాతీయతను బలపరచదలచినవారు. ఇందుకుగాను కేశవచంద్రసేనుడు వివిధ రాష్ట్రాలలో పర్యటించి తాను తలపెట్టిన సంస్కరణలను వాటిలోని విద్యాధికులకు ఆమోద యోగ్యం చేశాడు. దయానందుడుకూడా ఈలాటి ప్రయత్నమే గావించాడు. వివేకానందుడు ఇందునిమిత్తం అనేక పర్యాయాలు కన్యాకుమారి మొదలు హిమాలయపర్వతంవరకు సంచారంచేసి జ్ఞానపూరితములును ఆవేశపూరితములును అగు ఉపన్యాసాల ద్వారా ప్రజలలో దేశాభిమానాన్ని జాతీయాభిమానాన్ని వృద్ధిచేశాడు. అతడు తలపెట్టిన సేవాకార్యక్రమాలు ధనికులు దరిద్రులు అగ్ర కులాలవారు అస్పృశ్యులు వివిధవర్గాలకు చెందిన ప్రజలందరు ఒక జాతివారనే భావాన్ని పెంపొందించుటకు ఉద్దేశింపబడినట్టివి. ప్రజలందరు కలిసి సర్వవిధాలా దేశోద్ధరణకు కృషిచేయవలసినట్లుగా మతసంస్కర్తలు ప్రబోధం గావించారు. వారి బోధలు మతరంగానికి మాత్రమే పరిమితమైనట్టివికావు.

వర్తమాన కాలంలో దేశం పతితమైనట్లు కనిపించినా ప్రాచీన కాలంలో భారతజాతి అన్నిరంగాలలో ఘనవిజయాన్ని సాధించి, ఉత్తమమైన సంస్కృతిని ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రపంచంలోని ఇతర దేశాలకు అందజేసి వాటి పురోభి

వృద్ధికి ఎంతగానో తోడ్పడినట్టిదనీ, ఆలాటి కార్యక్రమాలను భవిష్యత్తులో కూడా చేపట్టి మానవకోటినంతా తరింపజేయడం భారతీయులకు సాధ్యం కావడమేగాక అది వారు వహించవలసిన బాధ్యత అనికూడా మత సంస్కర్తలు బోధించారు. ఒకప్పుడు వివేకానందుడు, "నా పూర్వుల గురించి లజ్జనొంద కుండుట నా జీవిత ధర్మములలో ఒకటిగా భావించుచున్నాను. నాకున్నంత గర్వము ప్రపంచంలో ఎవ్వరికిని ఉండదు. కాని కపటము లేకుండ చెప్పుచు న్నాను — నా గర్వము నన్ను గురించికాదు. నా పూర్వులను గురించి...... ప్రాచీన ఆర్య సంతానములారా! ఈశ్వరానుగ్రహము వలన మీకును అట్టి గర్వభావము కలుగుగాక! మీ పూర్వుల విషయమై అటువంటి విశ్వాసము మీ రక్తములోనికి చొరబారుగాక! అయ్యది మీ జీవితములతో సారూప్యము పొందుగాక! అయ్యది ప్రపంచము యొక్క మోక్షమునకై ఉపచరించుగాక", అని పలికాడు. ప్రపంచంలో జాతీయత బలపడడంలో గతాన్ని గురించిన ఈ లాటి గర్వం ఒక పటిష్టసాధనంగా పనిచేసింది. భారతదేశంలోని మత ఉద్య మాలు దీనికి విశేషంగా తోడ్పడ్డాయి.

ఇంకొక విధంగాకూడా స్వాతంత్ర్యోద్యమానికి మత ఉద్యమాలు దోహదం చేశాయి. పరాయివారి దాస్యాననుండి విముక్తిగాంచడమే స్వాతం త్ర్యోద్యమం యొక్క లక్ష్యం. బ్రిటిష్‌వారు వారి సైన్యాలతో రాజకీయంగా దేశాన్ని జయించి వశపరచుకొన్నట్లే క్రైస్తవ మిషనరీలు ప్రభుత్వ సహాయం తోను ప్రచారసాధనానను దేశాన్ని ఆధ్యాత్మికంగా జయించి క్రైస్తవ మతాన్ని ఏకైక మతంగా స్థాపించుటకై సమస్త ప్రయత్నాలను చేశారు. కాని దేశంలో బయలుదేరిన మత ఉద్యమాలు ఈ ప్రయత్నాలను ప్రతిఘటించి మత స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేయగలిగాయి. మతరంగంలో సాధింపబడ్డ ఈ విజయం క్రమక్రమంగా రాజకీయాలపై ప్రభావం వహించి స్వాతంత్ర్యోద్య మానికి దారితీసింది.

ఇంతేగాక మత ఉద్యమాలను లేవదీసిన వారందరు పరాయివారి సహాయం లేక స్వీయశక్తిని ఆధారం చేసుకొని తమ ఉద్యమాలను నడిపించి సంపూర్ణ విజయాన్ని సాధించారు. ఈ కారణంచేత వీరిలోను, వీరిద్వారా ప్రజలలోను ఆత్మవిశ్వాసం ఎంతగానో వృద్ధిపొందింది. రాజకీయ రంగంలోకూడా పట్టుద లతో కృషిసాగించిన పక్షాన తమకు విజయం తప్పకుండా చేకూరగలదనే భావం వారిలో అంకురించి వృద్ధిగాంచింది. ఈ విధంగాకూడా మత ఉద్యమాలు స్వాతంత్ర్య సంపాదనకు సాధనాలైనాయి.

చదువదగిన గ్రంథాలు :

Bharatiya Vidya Bhavan; Vol X.

Tarachand : History of Freedom Movement Vol II.

Haridas Mukerjee & Umamukerjee; The Growth of Nationalism in India.

Hiemsath : Indian Nationalism and Hindu Social Reform.

చిరంతనానందస్వామి : వివేకానందుని జీవితం.

చిరంతనానందస్వామి : శ్రీరామకృష్ణ బోధామృతము.

దయానందసరస్వతి : సత్యార్థప్రకాశ : ఆదిపూడి సోమనాథరావు తెనిగింపు.

# అధ్యాయము - 5

## సంఘ సంస్కరణము – జాతీయత

సంఘంలోని దురాచారాలను నిర్మూలించి, వాటిస్థానే సదాచారాలను నెలకొల్పడమే సంఘ సంస్కరణము. 19 వ శతాబ్దంలో ఇంగ్లీషు విద్యాధికులు రాజకీయ, ఆర్థిక, ఆధ్యాత్మిక రంగాలలో కృషిచేసినట్లే సాంఘికరంగంలో కూడా కృషిచేశారు. ఈనాటి సాంఘిక వ్యవస్థ 19 వ శతాబ్దానికి పూర్వం, వేలాది సంవత్సరాలుగా ఉండినట్టి వ్యవస్థ కాదు. అది చాలావరకు మారింది. ఇంకా మారుతూ ఉంది. దీనికంతకు విద్యాధికులలో అంకురించి వృద్ధిగాంచిన జాతీయత ప్రధాన కారణం.

సంఘసంస్కరణము దేశానికి కొత్తకాదు. అన్నికాలాలలో కొందరు సంస్కర్తలు దానికై కృషిచేస్తూవచ్చారు. ప్రాచీనకాలంలో జైనులు బౌద్ధులు సంఘంలో బ్రాహ్మణ వర్ణానికి లభించిన ఆధిక్యతపై తిరుగుబాటుచేసి, అలాటి ఆధిక్యత క్షత్రియ వర్ణానికి ఉండవలసినట్లుగా ప్రచారం చేశారు. కాని దీని మూలంగా వర్ణవ్యవస్థలో గొప్ప మార్పు ఏదీ రాలేదు. ఇదేవిధంగా బౌద్ధులు వారి మతసంఘంలో స్త్రీలకుకూడా గౌరవస్థానం కల్పించారు. సన్యాసాన్ని స్వీకరించుటకు పురుషులకు ఏలాటి అర్హత కలదో అలాటి అర్హత స్త్రీలకుకూడ కలదని ప్రతిపాదించి స్త్రీలనేకులను సంఘంలో సభ్యులుగా చేర్చుకొన్నారు. కాని దీనిమూలంగా లౌకికజీవితంలో స్త్రీలస్థితి మారలేదు. ఇదిగాక అన్నికాలాలలో ఒకవర్ణానికి చెందినవారు ఇంకొక వర్ణానికి చెందిన ధర్మాన్ని స్వీకరించడంకూడా సంభవించింది. బ్రాహ్మణవర్ణానికి చెందినవారు రాజ్యాలను స్థాపించి క్షత్రియులుగా పరిగణింపబడ్డారు. శూద్రకులాలకు చెందినవారు రాజ్యాధికారాన్ని సంపాదించి తాము క్షత్రియులమని ప్రకటించుకొన్నారు. కొండజాతులవారనేకులు ఈలాగే చేశారు విదేశాలనుండి వచ్చి, దేశంలో రాజ్యాలను వశపరచుకొన్న వారుకూడా క్షత్రియులయ్యారు బ్రాహ్మణేతరులు యజ్ఞోపవీతాన్ని ధరించి, బ్రాహ్మణఆచారాలను స్వీకరించి, తాము బ్రాహ్మణులని చెప్పుకొన్నారు. ఈలాటి మార్పులను ఎవరూ ఎక్కువగా ప్రతిఘటించలేదు. వర్ణవ్యవస్థయే ఉండరాదని భావించి దాని నిర్మూలనమునకై కృషిచేసినవారు లేకపోయినా, వర్ణాలమధ్య ఈలాటి మార్పులు సంభవించుచుండడము గుర్తించవలసిన విషయం. సంఘంలో ఈలాటి చలనం కలుగుతూనే వచ్చింది.

ఇదేవిధంగా మధ్యయుగంలో భక్తిమతాన్ని ప్రబోధించిన నానక్, కబీరు,

రామానందుడు, వల్లభాచార్యులు, చైతన్యుడు, తుకారాం మొదలగువారున్నూ విశిష్టాద్వైతమతాన్ని ప్రతిష్ఠించిన రామానుజుడున్నూ, భక్తిసాధనాన భగవంతుని చేరే విషయంలో అన్నివర్ణాలవారు అన్నికులాలవారు సమానులని, చండాలులకుకూడ ఈలాటి అర్హత కలదని, భగవంతుని సాన్నిధ్యంలో కులాలమధ్యగాని, స్త్రీపురుషులమధ్యగాని ఏలాటి తరతమ భేదాలు ఉండరాదని ప్రచారం చేశారు. ఉత్సవాలలో అన్నికులాలవారు కలిసి పాల్గొనడం పరిపాటి అయింది. భక్తాగ్రేసరులని ప్రఖ్యాతిగాంచి ప్రజల మన్ననకు పాత్రులైనవారిలో క్రింది కులాలవారు, అస్పృశ్యులు, స్త్రీలు ఎందరో ఉండినారు. ఈ ఉద్యమాలన్నీ ఒక విధంగా మానవ సమత్వాన్ని ప్రతిపాదించినట్టివి. బసవుని వీరశైవముకూడ ఈలాటిదే.

దేశంలో అన్ని కాలాలలో సాంఘిక కట్టుబాట్లపై తిరుగుబాటుచేసిన వ్యక్తులు అనేకులు ఉండడంకూడా ఈ సందర్భంలో గుర్తించదగిన విషయం. సన్యాసాశ్రమాన్ని స్వీకరించినవారిలో అనేకులు ఈలాటివారు. మామూలు గృహస్థులు లోబడవలసిన నియమ నిబంధనలకు ఆచారాలకు వీరు అతీతులుగ ప్రవర్తించారు. వీరు స్వచ్ఛందంగా తమ ఇష్టానుసారం జీవించేవారయ్యారు.

ఈ విధంగా అన్నికాలాలలో సంఘంలో కొంత సంచలనము, మార్పులు పట్ల శ్రద్ధఉన్నట్లు కనుపించినా, వీటి ఫలితతంగా సంఘంయొక్క మౌలిక లక్షణాలలో చెప్పుకోదగ్గ మార్పు జరగలేదు. జైనులు, బౌద్ధులు, భక్తిమార్గ ప్రబోధకులు ప్రతిపాదించిన మార్పులు ఒక ఆధ్యాత్మిక రంగానికి మాత్రమే పరిమితమైనవి. వీటి ఫలితంగా ప్రజల లౌకిక జీవిత వ్యవస్థలో మార్పులు జరగలేదు. ఇవి కులాలమధ్య, స్త్రీపురుషులమధ్య నిత్యజీవితంలో ఏర్పడిన తరతమ భేదాలను నిర్మూలించలేకపోయినవి. చాతుర్వర్ణ వ్యవస్థ, కులకట్టుబాట్లు, యధాపూర్వంగానే ఉండిపోయినవి. సంఘసంస్కరణ వీటిమూలంగా జరగలేదు.

19 వ శతాబ్దంలోని సంఘ సంస్కరణోద్యమం వీటికన్నిటికి పూర్తిగా భిన్నమైనట్టిది. ఇది లౌకికజీవితంలో అనాదిగ ఏర్పడిన దురాచారాలను నిర్మూలించుటకు ఉద్దేశింపబడినది. ఈ ఉద్యమాన్ని ప్రారంభించి నడిపించినవారు లౌకిక దృష్టిగల ఇంగ్లీషు విద్యాధికులు. వీరిలో మత సంస్కర్తలుకూడా కొందరు ఉండినా ఈలాటివారు తలపెట్టిన సంఘసంస్కరణముయొక్క లక్ష్యము మోక్షసాధనము కాదు. మత సంస్కరణమును సంఘసంస్కరణముతో వీరు జోడించినా ఈ రెండూ రెండు ప్రత్యేక రంగాలుగా వీరు భావించినారు. సతీసహగమనము, నిర్బంధ వైధవ్యము మొదలైన ఆచారములు మతముతో ఏలాటి సంబంధము లేనివని వీరు ప్రచారం చేశారు. ఐహిక జీవితమును సుఖప్రదముగ చేయదలచి వీరు సంఘ సంస్కరణమునకు పూనుకొన్నారు. సంఘములో ప్రవేశించిన దురాచారాల మూలమున ప్రజలలో అధిక సంఖ్యాకులు అజ్ఞానులై సుఖజీవితమునకు దూరమగుచున్నారనియు, అనేక కష్టములకు బాధలకు గురిఅగుచున్నారనియు, వాటిని తొలగించుట ఆస్తికులందరియొక్క కర్తవ్యమనియు ఈలాటి స్మృత

సంస్కర్తలు ప్రబోధించారు. వీరి ప్రబోధమునకు "మానవసేవయే మాధవసేవ" అనే సూత్రము ఆధారము. ఇందులోకూడ వీరిది లౌకికదృష్టియేగాని ఆధ్యాత్మిక దృష్టి కాదు.

ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్న విద్యార్థులు ఏక కాలంలో మత సంస్కరణమునకు సంఘసంస్కరణమునకు పూనుకొనుటకు వారిలో అంకురించి వృద్ధిగాంచిన జాతీయత మూలకారణము. వారిలోని జాతీయాభిమానము వారి కార్యక్రమములన్నిటికి జన్మస్థానము. జీవితరంగములన్నిటిలో భారతజాతి వృద్ధి గాంచవలెననుట వీరి ప్రధానాశయమయ్యెను. అలాటి సర్వతోముఖాభివృద్ధి జరిగినప్పుడే భారతజాతి పాశ్చాత్య ప్రపంచములో పేరుప్రఖ్యాతులను సంపాదించిన బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ జాతులవంటి జాతులతో సమానముగ తల ఎత్తుకొని తిరుగుట సాధ్యము కాగలదని, అలాటి అభివృద్ధిని సాధించుటకు తాము కృషిచేయుట తమ విద్యుక్త ధర్మమని విశ్వసించినవారు. అనాటి మత సంస్కరణము సంఘసంస్కరణమునకు దారితీసెనని భావించుటకు బదులు, విద్యార్థుల జాతీయత అన్ని సంస్కరణములకు దారితీసినట్లు గుర్తించుటయే సహేతుకము కాగలదు.

భారతీయుల మతములోను సాంఘిక జీవితములోను అనేక లోపములుండుటచేతనే పరాయివారు దేశమును జయించగలిగిరనియు, ఆ లోపములన్నిటిని తొలగించుకొనినగాని పరాయి పరిపాలనను తొలగించి స్వాతంత్ర్యమును సంపాదించుట సాధ్యము కాదనియువారు భావించిన కారణమున వారు మత సంస్కరణముతోపాటు సంఘ సంస్కరణమునకు పూనుకొనిరి. తాము తలపెట్టిన సంఘసంస్కరణ కార్యక్రమములన్నియు స్వాతంత్ర్య సంపాదమునకు సాధనములుగవీరు భావించిరి. బెంగాలులో సంఘసంస్కరణమునకు పితామహుడైన రామమోహనరాయ్,అతనితర్వాత బ్రహ్మసమాజముపై నాయకత్వమువహించిన కేశవచంద్రసేన్ మొదలైనవారు, మహారాష్ట్రములో సంఘ సంస్కరణరంగమందు నాయకత్వమువహించిన రానడే, బంధార్కరు మొదలైనవారు, మద్రాసులోను ఆంధ్రప్రాంతమందును సంస్కరణోద్యమము సాగించిన వీరేశలింగంపంతులు తదితరులు ఈలాగు భావించినవారు. ఇందుచేతనే వీరు బ్రిటిష్ పరిపాలనను సమర్థించినారు[1]. మనలోని లోపములు తొలగునంతవరకు వారి పరి

1. "ఇంచుమించుగా నన్ని విషయములందును సమానముగా వృద్ధినొందుచుండుటయే యభివృద్ధియగునుగాని పక్కిన విషయములం ధమదశలోనుండి యొక్క విషయమునందు మాత్రము వృద్ధిజెందుట నిజమైన యభివృద్ధి కాదు. అట్టి యేకదేశాభివృద్ధి వలన దేశ క్షేమకరములు కలుగవలసినంత కలుగనేరవు...... కాబట్టి రాజ్యాంగవిషయమయిన స్వాతంత్ర్యములతోడి పాటుగా జ్ఞాన నీతుల విషయమునను, మతవిషయమునను కులాచార విషయమునుకూడ నభివృద్ధిపొందుట యత్యంతావశ్యకము క్రూరములయిన దురాచారములకు దాసులమయి మనయింటనుండు స్త్రీల కష్టముల నివారింపలేనివారము

పాలనము నందుండుట అవసరమని వీరు అభిప్రాయపడిరి.

జాతీయతతోపాటు ఇంగ్లీషువిద్య ఇంకొక విధముగకూడ విద్యాధికులు సంస్కరణోద్యమమునందు అభిమానము కలవారినిగ చేసెను. వీరు హేతువాదము, మానవత సమానత్వము, మానవసౌభ్రాతృత్వములనే భావములచే ప్రభావితులైనవారు. వీరు చదివిన పాశ్చాత్య గ్రంథములందు ఈ భావములు ప్రాధాన్యము వహించియుండెను. ఇదిగాక 18వ శతాబ్దపు ఆఖరు భాగమున పాశ్చాత్య ప్రపపంచములో సంభవించిన అమెరికా విప్లవము ఫ్రెంచి విప్లవము మొదలైన వాటికి ఇవి ఆధారములుగ నుండెను. భారతదేశములోని విద్యాధికులలో అనేకులు ఈ విప్లవములచే ప్రభావితులైనవారు, అందుచేత ఈలాటి భావములను ఆధారముచేసుకొని వారు భారతదేశములోని సమాజజీవితమందలి గుణదోషములను పరిశీలించి, సంఘములోని ఆచారములలో ఏవి దురాచారములో ఏవి సదాచారములో నిర్ణయించిరి. ఈ నిర్ణయానుసారము వీరికి మూడు మౌలిక లోపములున్నట్లు స్పష్టమయ్యెను.

వీటిలో మెదటిది స్త్రీలకు సంఘములో గౌరవస్థానము లేకపోవుట; రెండవది మానవ సమత్వమునకు పరమ విరుద్ధమగు వర్ణవ్యవస్థయు దానితో సన్నిహిత సంబంధముగల కులభేదములు; మూడవది సంఘములో అయిదవవంతు జనము అస్పృశ్యులుగ భావింపబడుట. వీటిలో ఏదికూడా హేతువాదమునకు నిలబడునట్టిదికాదు. ప్రాచీన కాలమున ఏర్పడిన ఆచారములు, ప్రాచీనకాలపు స్మృతులు వీటికి ఆధారములు. మానవులు అనుసరించు ఆచారములకు వాటి ప్రాచీనతగాని పూర్వీకుల ధర్మశాస్త్రములుగాని ఆధారముగనుండరాదనియు వాటిని హేతువాదముద్వారా సమర్థించుటకు సాధ్యమైనప్పుడే అవి ఆచరణ యోగ్యము కాదగినవనియు, అట్టి సమర్థనము సాధ్యముకానప్పుడు వాటిని నిర్మూలించి వాటిస్థానే హేతువాదమునకు నిలబడగల ఆచారములను నెలకొల్పుట కర్తవ్యమనియు సంఘసంస్కర్తలు ప్రచారము గావించిరి. ఇంతేగాక ఈ ఆచారములన్నియు మానవసమత్వమునకు పరమవిరుద్ధములు. పుట్టుకమాత్రమే కారణముగను, అర్హతతో నిమిత్తములేకను ఇవి స్త్రీపురుషుల మధ్య కులాల మధ్య కృత్రిమములగు భేదములను కల్పించునట్టివి. వారివారి అర్హతకు మానసిక ప్రవృత్తికి అనుగుణములైన వృత్తులను చేబట్టుటకు కావలసిన స్వేచ్ఛకు భంగముకలిగించుచున్నట్టివి. పంక్తి భోజనము, ఆహారాది విషయములలోను, వివాహ సంబంధముల విషయములలోను అనవసరములైనట్టియు అర్థరహితములైనట్టియు నిర్భంధములను విధించుచున్నట్టివి. సామాజిక జీవితములో ఎవరికిని పూర్తిస్వేచ్ఛ ఉండుట సాధ్యముకానిమాట వాస్తవమే. సమాజములోని వారందరు కొన్ని నియమములకు లోబడి ప్రవర్తించుట కూడ అవసరమే. కాని

---

రాజ్యాంగ స్వాతంత్ర్యములను పొంది దేశముయొక్క కష్టముల నెట్లు నివారింపగలుగుదుము?" (1888 ప్రాంతమున వీరేశలింగం పంతులుగారు చెప్పిన మాటలు.)

ఈ కార్యముచేత సమాజములోని వారికి ఎలాటి స్వేచ్ఛ ఉండరాదనియు, వారి జీవితము పూర్తిగ నియమబద్ధముగనుండవలెననియు విధించుట మానవులు అనుభవించదగిన స్వేచ్ఛకు వారిలోని వ్యక్తిత్వము బహిర్గతమై వృద్ధిగాంచుటకు ఆటంకముల కలిగించుటతప్పదు. ఈలాటి వృద్ధి జరిగినప్పుడే జీవితము సార్థకమగుచున్నది. ఇదీ సంస్కర్తల వాదము. ఇంతేగాక ప్రజలలో కులభేదములుండుటచేత వారిలో సౌభ్రాతృత్వభావము లోపించుచున్నది. అందరు ఒక జాతిగ రూపొంది, కలిసికట్టుగ దేశస్వాతంత్ర్య సౌభాగ్యములకు కృషిచేయుట సాధ్యము కాకున్నది. ఇందుచేతనే పరాయివారు దేశమును జయించి పరిపాలించగలిగిరి. వర్ణవ్యవస్థయు, కులములమధ్య తరతమ భేదములు, అస్పృశ్యత మొదలైనవి నిర్మూలమైనగాని భ్రాతృత్వభావము జాతీయత వృద్ధిగాంచజాలవు. ఇవి వృద్ధిగాంచినగాని దేశమునకు ఏ రంగములోకూడ విముక్తి లభించదు. ఈలాటి అభివృద్ధిమూలముననే పరాయి ప్రభుత్వమును తొలగద్రోసి స్వాతంత్ర్యమును సంపాదించుట సాధ్యమగును. ఈ భావములు పాశ్చాత్య గ్రంథములనుండి విద్యాధికులు గ్రహించి, వాటిచే ప్రభావితులైన కారణముగ వారు సంఘసంస్కరణోద్యమమును ప్రారంభించి సాగించిరి.

విద్యాధికులను సంస్కరణాభిలాషులుగ చేయుటలో క్రైస్తవ మత ప్రచారకుల కార్యక్రమాలు కూడ కొంత ప్రభావము వహించినవి. వీరు విద్యాలయములను ఆసుపత్రులను స్థాపించియు, బీదలకు ఆర్థిక సహాయము చేసియు, అస్పృశ్యుల చేరదీసియు తమ మత ప్రచారమును సులభసాధ్యము చేసుకొనుచుండిరి. స్త్రీలకు ప్రత్యేక విద్యాలయములను స్థాపించి, వారివిద్యాభివృద్ధికి పాటుబడిన వారిలో వీరే మొదటివారు. ఈసాధనముల నుపయోగించి వారు కొందరిని క్రైస్తవులుగ మార్చగలిగిరి. జాతీయాభిమానముగల విద్యాధికులు వీరి మత ప్రచారమును అరికట్టుటకు తాముకూడ ఈలాటి కార్యక్రమములను సాగించుటకు సిద్ధపడిరి. హిందూమత సంస్కర్తలు కూడ ఇట్టిభావము కలవారైరి. ఇందుచేతనే సంఘసంస్కరణోద్యమమునకు ఇంగ్లీషు విద్యయు, పాశ్చాత్య గ్రంథములలోని భావములు, పాశ్చాత్య ప్రపంచములోని విప్లవ సంఘటనలు మాత్రమేగాక క్రైస్తవమత ప్రచారకుల కార్యక్రమములు మార్గదర్శకములైనట్లు చెప్పవలసియున్నది.

ఈ సందర్భముననే "మానవసేవయే మాధవసేవ" అనే సూక్తి మరింత ప్రాధాన్యము వహించెను. అందరిలో భగవంతుడున్నాడని బోధించిన వేదాంతాది మతతత్వాలను ఈ దృష్టితో వ్యాఖ్యానించడముకూడా జరిగినది. ఈ తత్వాలు ఆచరణయోగ్యములగుటకు మానవసేవ అవసరమన్న విశ్వాసము వ్యాపించినది. దీనికి ఎక్కువ ప్రాబల్యమును కల్పించినవాడు వివేకానందుడు. ఇతని గురువైన రామకృష్ణుడు వేదాంతము అనుష్ఠాన యోగ్యము కావలసిఉన్నదని బోధించినాడు. ఈప్రబోధముచే ప్రభావితుడైన వివేకానందుడు దేశంలో మూడు నాలుగుకోట్ల ప్రజ అస్పృశ్యులుగ పరిగణింపబడుటను గర్హించి వారి విముక్తికై

పాటుబడుట మతసంస్కర్తల ప్రధమ కర్తవ్యమని ప్రచారము సాగించినాడు. కోట్లకొలది ప్రజలు నిరుపేదలై కనీస అవసరములను తీర్చుకొనలేక సమస్త బాధలను అనుభవించుచుండుటను గూడ గర్హించి వారి సహాయార్థము కృషి చేయవలసిన అవసరమును తన అనుచరుల దృష్టికి తెచ్చినాడు. ఐహిక సుఖము అభివృద్ధి గాంచినగాని ఆధ్యాత్మికాభివృద్ధి సాధ్యము కాజాలదనిన్నీ ఆకలిబాధను కూడ తీర్చుకొనలేనివారికి ఆధ్యాత్మికబోధ చేయ ప్రయత్నించుట వెర్రి అనిన్నీ ఆయన ఉద్ఘాటించాడు. అమెరికాలోను ఇతర పాశ్చాత్య దేశాలలోను పర్యటించినప్పుడు సామాన్యుల సహాయార్థము ధనికులు తదితరులు ఎంతయో శ్రద్ధను వహించడము ఆయన గుర్తించాడు. వారు వాస్తవముగ వేదాంతమును అనుష్ఠించేవారని ఆయన భారతీయులకు తెలియపరచాడు. వీటి అన్నిటి ప్రభావము చేతనే ఆయన రామకృష్ణ మఠముతోపాటు రామకృష్ణ సేవాశ్రమమును స్థాపించి సంఘ సంస్కరణ కార్యక్రమములకు ప్రాధాన్యము కల్పించినాడు. దివ్యజ్ఞాన సమాజము వారుకూడ అస్పృశ్యుల ఉపయోగార్థము ప్రత్యేక విద్యాలయములను స్థాపించుటకుకూడ ఇదియే కారణము. మధ్యయుగములో దేశమందు అక్కడక్కడ కొన్ని శైవమఠములకు అనుబంధములుగ వైద్యశాలలు ఉండినమాట వాస్తవమేకాని ఆనాటి మతసంస్కర్తలు ఇట్టి కార్యక్రమాలకు ఎక్కువ ప్రాధాన్యము కల్పించినవారుకారు. 19, 20 శతాబ్దములలో ఈ దృక్పధము పూర్తిగ మారి మతప్రచారము సంఘసంస్కరణ, సంఘసేవా కార్యక్రమములతో జోడించుట జరిగినది.

## 2

1818 ప్రాంతమున సతీసహగమన నిషేదము గురించి రామమోహనరాయ్ గావించిన ప్రచారముతో ప్రారంభమైన సంఘసంస్కరణోద్యమము ఇప్పటివరకు కొనసాగుచునే ఉన్నది. ఈ మధ్యకాలములో—అందులో ప్రధానముగ 19వ శతాబ్దములో — సంస్కర్తల మధ్య కొన్ని అభిప్రాయభేదములు ఏర్పడిన కారణమున ఉద్యమము కొంత బలహీనతగాంచి ఆశించిన ఫలితములను చేకూర్చలేకపోయినది. ఆ అభిప్రాయభేదములు ఏలాటివో తెలుసుకొనడము అవసరము.

1. ప్రధమదశలో మత సంస్కర్తలే సంఘ సంస్కరణ ఉద్యమములో శ్రద్ధవహించింది. బెంగాలులోని ఉద్యమమునకు ఇది ప్రధాన లక్షణము. ఆ రాష్ట్రమందు బ్రహ్మసమాజమును స్థాపించిన రామమోహనరాయ్, వారి అనుచరులలో ప్రధానులైన అక్షయకుమారదత్తు (1820—86), కేశవచంద్రసేన్ (1838—84) మొదలైనవారు నిర్భంద వైధవ్యము, బాల్య వివాహము, బహుభార్యాత్వము మొదలైన ఆచారములను నిర్మూలించుటకును, వర్ణాంతర వివాహములను ప్రోత్సహించుటకును, స్త్రీల విద్యాభివృద్ధికిని ఎక్కువగ కృషి చేసిరి. కేశవచంద్రసేన్ బ్రహ్మసమాజ సభ్యులందరు ఈలాటి సంస్కరణలను

తప్పక అనుసరించవలసినదిగ విధించెను. వారిలో కొందరు దీనికి సమ్మతించక అతనినుండి విడిపోయిరి. తక్కినవారు అతనితో సహకరించిరి. ఇదిగాక ఇతడు బ్రహ్మసమాజీకులందరు మంత్రతంత్రములతో నిమిత్తము లేక వివాహముల చేసుకొనవలసినదిగా నిర్ణయించి, ఆ నిర్ణయానుసారము 1872 లో ప్రభుత్వ మొక శాసనము గావించునట్లు ప్రోత్సహించెను. ఈ దేశీయ వివాహశాసనము (Native Marriage Act) ప్రకారము వివాహము చేసుకొనువారు హిందు, ముస్లిం, క్రైస్తవ, బౌద్ధ, జైన, పార్సీ, శిక్కు మతములలో దేనికిని చెందని వారని ప్రకటించుకొనవలెను. వధువు కనీస వయస్సు 14 సంవత్సరములుగను, వరుని కనీస వయస్సు 18 సంవత్సరములుగను ఉండవలెను; వారి వర్ణమేదియో ప్రకటించుకొనరాదు. విడాకులు (Divorce) విధానము వారికి వర్తించును. బ్రహ్మసమాజకులలో అధికసంఖ్యాకులు ఈ శాసనము ప్రకారము వివాహమాడ సాగిరి. దీని ఫలితముగ వారు హిందూమతము నుండి విడిపోయి, ఇంకొక ప్రత్యేక మతమునకు చెందినవారైరి.

ఈ పరిణామములు కారణముగ సంఘ సంస్కరణమునకు సిద్ధపడినవారందరు హిందూమతము నుండి విడిపోవుట తప్పదను అభిప్రాయము బెంగాలులో వ్యాపించెను. బ్రహ్మసమాజమునకు చెందినవారిలో అధికసంఖ్యాకులు తాము హిందువులుకానట్లు ప్రకటించిరి. దీని ఫలితముగ హిందూమతాభిమానులలో సంఘసంస్కరణముపట్ల ఒక విధమైన విముఖత్వము ఏర్పడెను. బెంగాలులో కాలక్రమమున ఉద్యమము బలహీనతగాంచుటకు ఇది ఒక కారణమయ్యెను.

మహారాష్ట్రము, గుజరాత్ మొదలైన పశ్చిమ భారత ప్రాంతములోని సంస్కర్తలకు బ్రహ్మసమాజీకుల విధానము అంగీకారయోగ్యము కాలేదు. మహారాష్ట్రములోకూడ మత విషయములందు బ్రహ్మసమాజముతో ఏకీభవించి విగ్రహారాధనను ఖండించినట్టిన్నీ ఏకేశ్వరోపాసనను సమర్థించినట్టిన్నీ ప్రార్థన సమాజ ఆధ్వర్యమునను ఈ సమాజముపై నాయకత్వము వహించిన మహాదేవ గోవిందరానడే, రామకృష్ణ భండర్కారు మొదలైనవారి ప్రచార ఫలితముగను సంఘసంస్కరణోద్యమము వ్యాప్తిగాంచెను. కాని వీరు తాము హిందువుల మనియే చెప్పుకొని హిందూమతమునకు సంబంధించిన వ్రతములను ఆచారములను అనుసరించుచుండిరి. విగ్రహారాధన ఖండనముగాని ఏకేశ్వరోపాసనముగాని హిందూమతమునకు విరుద్ధములని వీరు భావించలేదు. ఇదిగాక సంస్కర్తలు వాంఛించిన స్త్రీల పునర్వివాహము, రజస్వలానంతర వివాహము, కులకట్టుబాట్ల సడలింపు మొదలైన మార్పులు ధర్మశాస్త్ర విరుద్ధములు కావని వీరిలో అనేకులు వాదించిరి. ఈ కారణముచేత సంఘసంస్కర్తలు హిందూ సంఘమును విడనాడి ఒకే ప్రత్యేక మతమునకు చెందినవారన్న అభిప్రాయమును వీరు తిరస్కరించిరి. సంస్కర్తలు హిందూ సంఘమందే ఉండినపక్షమున ప్రజలలో సంస్కరణోద్యమమును వ్యాపింపజేయుట సులభసాధ్యము కాగలదనియు, దానిని విడనాడినపక్షమున ఇది కష్టసాధ్యమగుననియు వీరు విశ్వసించిరి. బెంగాలులోని

బ్రహ్మసామాజికులు 1872 చట్టము ననుసరించి వివాహములు జరుపుకొనినట్లు వీరు ఆ చట్టమును అనుసరించుట కిష్టపడినవారు కారు. ప్రార్థన సమాజములో చేరినవారందరు సంస్కరణముల ప్రకారము తమ జీవితమును సాగించవలెనను వాదముకూడ వీరు అంగీకరించలేదు. మతముయెక్క లక్ష్యము భగవత్సాన్నిధ్యమును చేరుట అనియు సంఘ సంస్కరణలక్ష్యము దీనికి భిన్నమైనట్టిదనియు, ఈ రెండింటికిని ముడిపెట్టుట సహేతుకము కాదనియు వీరు భావించిరి.

ఇదిగాక మహారాష్ట్రమందును గుజరాతునందును ప్రార్థనసమాజము స్థాపింపబడుటకు (1867) పూర్వమందుండి కొందరు సంఘ సంస్కరణ కార్యక్రమములను సాగించుచుండిరి. వీరు మతసంస్కరణముపట్ల ఎక్కువ శ్రద్ధను వహించినవారుకారు. 1840 లో స్థాపింపబడిన పరమహంస మండలివారు, 1848లో స్థాపింపబడిన విద్యార్థుల సారస్వత వైజ్ఞానిక సంఘమువారు, సంస్కర్తలని ప్రఖ్యాతిగాంచిన బాలగంగాధరశాస్త్రి జింభేకర్ (1812–46) మేతాజి దుర్గారాం మంఛారాం (1809–76) మొదలైనవారు స్త్రీల పునర్వివాహము, కులభేదముల నిర్మూలనము, మతముమార్చుకొనిన హిందువులను తిరిగీ హిందూ మతములో చేర్చుకొనుట, సముద్రయానము, స్త్రీల విద్యాభివృద్ధి మొదలైన సంస్కరణములను సమర్థించి, వాటికి అనుగుణముగ కొన్ని కార్యక్రమములను సాగించిరి. లోకహితవాది అని ప్రఖ్యాతిగాంచిన గోపాలహరిదేశ్‌ముఖ్ (1823-92), జ్యోతిబ గోవిందపూలె (1827-90) కూడ ఈ వర్గమునకు చెందినవారు. హిందూ సంఘము పతనమగుటకు బ్రాహ్మణుల ఆధిక్యతయు, ప్రాచీన విద్యలు వారి వశమగుటయు ప్రధానకారణమని వీరు భావించి, ఆ ఆధిక్యతను నిర్మూలించుటకు వీరు ఎక్కువగ కృషిచేసిరి. ఈ సందర్భములో పూలే 1851 లో ఆడపిల్లలకు పూనాలో ఒక ప్రత్యేక విద్యాలయమును, అస్పృశ్యులకు రెండు విద్యాలయములను స్థాపించెను. వీరిద్దరు స్త్రీల పునర్వివాహమునకు గొప్ప కృషి గావించిరి. క్రిందికులాలవారి ఉద్ధరణకై పూలె 1873లో సత్యశోధక సమాజమును స్థాపించెను. తర్వాత కాలమున మహారాష్ట్రములో బయలుదేరిన బ్రాహ్మణేతర ఉద్యమమునకు ఇతడు పితామహుడు. ఈ సంస్కర్తలందరు మతముతో ఏలాటి సంబంధమును పెట్టుకొనక సంఘసంస్కరణోద్యమమును నడిపించిరి. హిందూమతమును విడనాడినగాని సంఘసంస్కరణోద్యమము జయప్రదము కాజాలదని బెంగాలు బ్రహ్మసామాజికుల అభిప్రాయముతో వీరు ఏకీభవించినవారు కారు.

ఆర్యసమాజమును స్థాపించిన దయానంద సరస్వతికూడ వివాహము, ఆహారము, వేషము మొదలైన వాటికి సంబంధించిన ఆచారములుగాని, కులకట్లుగాని మతముతో సంబంధము లేనట్టివనియు, మతమును మార్చుకొనవలసిన అవసరములేక వాటిని మార్చుకొనవచ్చుననియు ప్రచారము చేసెను. వివేకానందుడు కూడ ఈ విధముగనే భావించెను. దివ్యజ్ఞాన సమాజమువారుకూడ సంఘసంస్కరణమునకును హిందూమతమునకును మధ్య పరస్పర వైరుధ్యము లేదని

హిందూమత ధర్మములను విడనాడక సంఘసంస్కరణ కార్యక్రమములు సాగించి దురాచారము లన్నిటిని మార్చుట సాధ్యమనియు ప్రబోధము గావించిరి.

మద్రాసులోను ఆంధ్రప్రాంతమందును మతసంస్కరణముపట్లగాని సంఘసంస్కరణముపట్లగాని ఎక్కువ శ్రద్ధతో కృషిచేసినవారి సంఖ్య చాలా తక్కువ. అలాగు కృషిచేసినవారిలో రఘుపతి వెంకటరత్నంనాయుడు కందుకూరి వీరేశలింగంపంతులు బ్రహ్మసమాజమందు సభ్యులై సంఘసంస్కరణమునకు పాటుబడినవారు. కాని సర్. టి. మాధవరావు, దివాన్‌బహదూరు రఘునాధరావు వంటివారు హిందూమతమును విడనాడకయే సంఘ సంస్కరణ విషయమై కృషిగావించిరి.

ఈ పరిణామములన్నిటిని పరిశీలించిన పక్షమున సంఘములోని దురాచారములను నిర్మూలించి వాటిస్థానే సదాచారములను నెలకొల్పు కార్యక్రమములను సాగించు సందర్భమున హిందూమతమును విడనాడవలసిన అవసరము లేదనియే సంఘ సంస్కర్తలలో అధిక సంఖ్యాకులు భావించిరనియు ఇదియే సరియైన అభిప్రాయమనియు స్పష్టము కాగలదు.

(2) మతమునకు సంఘ సంస్కరణమునకు మధ్య ఉండదగిన సంబంధము గురించి మాత్రమేగాక పాశ్చాత్య సంఘములను సంఘసంస్కరణ విషయములో అనుకరించడము సముచితమా అనేవిషయాన్ని గురించి సంస్కర్తలలో అభిప్రాయ భేదములు ఏర్పడినవి. ప్రథమదశలో సంస్కరణములన్నిటికి హేతువాదము ఆధారముగ ఉండవలెనని సంస్కర్తలు భావించినా వారు పాశ్చాత్య సంఘాలను అనుకరించే వారయ్యారు. పాశ్చాత్య సంఘాలు హేతువాదానుసారం నిర్మాణమైనవనేభావం వారిలో ఏర్పడింది. ఆసంఘాలలో ఏలాటిఆచారాలు ప్రాధాన్యం వహించినవో వాటినే భారతీయులు అనుసరించడం సహేతుకమన్న అభిప్రాయం వారిలో వ్యాపించింది. దేశీయ విద్యలకంటె పాశ్చాత్య విద్యలు ఉత్తమములనీ, ఆ విద్యలు నేర్చుకొనుటకు ప్రజల భాషలకంటే ఇంగ్లీషు భాషయే తగినసాధనమనీ వారు భావించినట్లే పాశ్చాత్యసంఘాలలో వర్ణవ్యవస్థ లేకపోవడంచేత భారతదేశంలోకూడా ఆలాటివ్యవస్థ ఉండరాదని, పాశ్చాత్య సంఘాలలో స్త్రీలకు గోషా పద్ధతిలేదు గనుక భారతదేశంలోకూడా ఆ పద్ధతి ఉండరాదని, స్త్రీలు పురుషులు కలిసి స్వేచ్ఛగా తిరగడమే సదాచారమని వారు భావించారు. పాశ్చాత్యసంఘం వీరికి ఒకగీటురాయిగా ఏర్పడింది. కానీ కాలక్రమాన ఈ దృక్పథం సరియైనది కాదని కొందరు సంస్కర్తలు అభిప్రాయపడ్డారు. పాశ్చాత్య సంఘాలలోకూడా ఎన్నో లోపాలు ఉండడము వారి దృష్టిని ఆకర్షించింది. పాశ్చాత్య సంఘాలలో వర్ణభేదములు లేకపోయినను వృత్తులనుబట్టి ఆదాయమునుబట్టి తీవ్రమైన వర్గభేదములు ఉండడము, రాజకీయరంగంలోను ఉద్యోగాల విషయంలోను స్త్రీలకు పురుషులతో సమానత్వము లేకపోవడమును వారు గుర్తించారు.

ఇదిగాక ప్రపంచంలో ఏ సంఘమూ హేతువాదమునకు అనుగుణముగా

నిర్మాణమైనట్టిదికాదు. చారిత్రకముమైన పరిస్థితులను ఆధారంచేసుకొని ఆచారాలు ఏర్పడడం జరుగుతుంది. ఈ పరిస్థితులు అన్నిదేశాలలో ఒకే విధంగా ఉండవు. అందుచేత ఒక సంఘాన్ని అనుకరించి ఇంకొక సంఘం మారవలెనని వాదించడము వెర్రితనము.

ఇంతేగాక భారతీయుల ఆచారాలలో ఎన్నో ఉత్తమముమైనవి ఉన్నవి. అవి శాశ్వతమైన విలువ కలిగినట్టివి. వారిజీవితము నిరాడంబరమైనట్టిది. కులాల మధ్య పోటీకి బదులు సహకారము దానికి ఆధారము. విద్యలు, కళలు నశించక తరతరాలుగా నిలబడి ఉండుటకు ఇదిఒక ప్రధాన కారణము. ప్రపంచములోని ప్రాచీనకాలమందు పేరుప్రఖ్యాతులుగాంచిన గ్రీకు, రోమన్, ఈజిప్టు, పారశీక నాగరికతలు శాశ్వతముగ నిలబడలేకపోయినవి. భారతీయుల నాగరికత సంస్కృతి ఈలాగుకాక ఒక స్థిరత్వమును సంపాదించ గలిగినవి. అందుచేత జాతీయ దృక్పథంతోనూ, ఉత్తమముమైన సంప్రదాయాలకు అనుగుణంగానూ సంస్కరణలను ప్రవేశపెట్టుట ఉచితముకాగలదు గాని గుడ్డిగా పాశ్చాత్య సంఘాలను అనుకరించడము ఎన్నటికిని ప్రాజ్ఞతకాజాలదు. ఈలాగు అనుకరించడము భారతీయుల ఆత్మగౌరవమునకు పరమవిరుద్ధము. క్రమక్రమముగ ఈ భావము సంస్కర్తలలో బలపడెను.

(8) జాతీయ దృక్పథంతో సంస్కరణములు జరగవలెనను అభిప్రాయము బలపడిన కారణంగా మరికొన్ని వాదోపవాదాలు బయలుదేరినవి. రాజకీయ సంస్కరణలు మొట్టమొదట జరగవలెనా లేక సంఘసంస్కరణ మొదట జరగవలెనా అనే ప్రశ్న ప్రాధాన్యం వహించింది. రాజకీయాలలో మితవాదులుగా ఉండిన వారిలో గోఖలే వంటివారు సంఘంలోని దురాచారాలన్నీ నిర్మూలనమైనగాని రాజకీయ స్వాతంత్ర్యాన్ని గాని పురోభివృద్ధినిగాని సాధించడం సాధ్యంకాదనీ, సంఘసంస్కరణము ప్రథమంలో జరగడము అవసరమని అభిప్రాయ పడినారు. కులభేదములు, అస్పృశ్యత నిర్మూలమైనగాని భారతీయులందరు ఒకే జాతిగ ఏర్పడడము సాధ్యముకాదని, జాతీయిత బలపడినగాని స్వాతంత్ర్య సంపాదనము సాధ్యము కాదని, అందుచేత సంఘసంస్కరణపట్ల ఎక్కువ శ్రద్ధను వహించవలసి ఉన్నదని వాదించారు. కాని మితవాదులలో తెలాంగు వంటి వారు, తిలక్ వంటి రాజకీయ అతివాదులు ఈ అభిప్రాయాన్ని తిరస్కరించారు. సంఘసంస్కరణ ఒక బృహత్ ఉద్యమమనీ, అది రెండుమూడు దశాబ్దాలలో పూర్తికాజాలదని, అది పూర్తి అయ్యేవరకు పరాయి ప్రభుత్వం దేశంలో ఉండవలెనని వాదించడము శాశ్వతంగా ఆ ప్రభుత్వము ఉండవలెనని వాదించడమే అని వీరు అభిప్రాయపడినారు. ఇంతేగాక స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్న పాశ్చాత్య దేశాలలో గాని ప్రాచ్యదేశాలలో గాని సాంఘిక జీవితంలో లోపాలే లేనట్లు భావించరాదు. అలాటి లోపాలు ఉన్నా అవి స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నవి. అందుచేత రాజకీయ పురోభివృద్ధికి సంఘసంస్కరణమునకూ పరస్పర సంబంధం ఉన్నట్లు భావించడము ప్రాజ్ఞత కాజాలదు. తిలక్

వంటి వారి దృష్టిలో దేశం అనుభవిస్తున్న కష్టాలన్నిటికీ పరాయి ప్రభుత్వమే మూలకారణం. ఇది తొలగితేనే తప్ప ఏ రంగంలోకూడా-- ఆర్థిక రంగంలో గాని సాంఘిక రంగంలో గాని- పురోభివృద్ధి సాధించడం సాధ్యంకానిపని. అందు చేత దేశంలోని నాయకులందరు వారి దృష్టిని రాజకీయ స్వాతంత్ర్య సంపాద నలో కేంద్రీకరించడం అవసరం. అని తిలక్ వంటివారు వాదించారు. తిలక్ కూడా సంఘసంస్కరణమును వాంఛించిన వాడే. కాని దీనిని రాజకీయాలతో ముడిపెట్టడం అతనికి అంగీకారం కాలేదు.

ఈలాగు అతడును అతనితో ఏకీభవించినవారును వాదించడానికి ఇంకొక ప్రబలకారణం కూడా ఉండినది. రాజకీయరంగంలో పురోభివృద్ధిని స్వల్పసంఖ్యాకులైన విద్యాధికులు సాధించడం కష్టసాధ్యమని, సామాన్యప్రజలు కూడా వీరితో కలసినప్పుడే పరాయి ప్రభుత్వం వీరుకోరే సంస్కరణలను ప్రవేశపెట్టుటకు అంగీకరించగలదని వీరు భావించారు. దేశంలోని సామాన్య ప్రజలకు వారిమతం పట్ల ఆచారాల పట్ల గాఢమైన విశ్వాసం ఉండడంచేత వారి మతాన్ని ఆచారాలను ఖండించిన పక్షాన రాజకీయ కార్యక్రమాలలో వారి సహకారాన్ని సంపాదించడం కల్ల. అలాటి సహకారాన్ని సంపాదించుటలో మతంపట్ల ఆచారాల పట్ల వారికి ఉండే భక్తి శ్రద్ధలను రాజకీయాలకై విని యోగించుకొనిన పక్షాన వారి సహకారాన్ని సంపాదించడం సాధ్యమౌతుంది. వారు అనుసరించే ఆచారాలన్నీ దురాచారాలని, వారి ఉత్సవాలు విగ్ర హారాధనతోను బహుదేవతారాధన తోను కూడుకొన్నట్టివి అని, వాటిని సంస్క రించడం అవసరమని వారి మధ్య ప్రచారం సాగిస్తూ రాజకీయాలలో వారి సహకారాన్ని సంపాదించ ప్రయత్నించడం వ్యర్థముకావడం తప్పదు. ఈ విధంగా ఆలోచించి, తిలక్ ప్రజల భక్తికి పాత్రమైన గణపతి ఉత్సవాలకు రాజ కీయ ప్రాధాన్యం కల్పించి ప్రజలలో జాతీయ భావాలను బలపరచ గలిగాడు. ఇందుచేతనే సంఘసంస్కరణ ప్రచారంపట్ల అతడు విముఖుడయ్యాడు.

అధికారుల వైఖరికూడా ఈ విముఖత్వాన్ని బలపరచింది. రాజకీయ సంస్కరణలకై విద్యాధికులు సాగించుచుండిన ప్రచారాన్ని అరికట్టే ఉద్దేశంతో అధికారులలో కొందరు సంఘసంస్కరణము జరిగి, కులభేదాలు, అస్పృశ్యత, ఇతర దురాచారాలు నిర్మూలనమైనగాని బ్రిటన్‌లోని ప్రజాస్వామికము వంటి పరిపాలన విధానమును భారతదేశంలో ప్రవేశపెట్టడం వ్యర్థ మనిన్నీ, ఈకారణం చేత విద్యాధికులు తమపలుకుబడిని మొట్టమొదట సంఘసంస్కరణ కార్యక్ర మాలలో వినియోగించి, అవి జయప్రదమైనతర్వాతనే వారు రాజకీయ సంస్క రణలను కోరడం ఉచితమని ప్రచారం చేయసాగారు. ఈ ప్రచారం తిలకుకు ఎంతమాత్రం రుచింపలేదు. అధికారులు విద్యాధికుల దృష్టిని రాజకీయ రంగాన నుండి మరలించి, తమ అధికారాన్ని సుస్థిరం చేసుకొనే దురుద్దేశంతో ఈ ప్రచారాన్ని సాగిస్తున్నారని గ్రహించాడు. దీనికి విరుగుడుగా రాజకీయ పురోభివృద్ధి మొట్టమొదట జరగవలసి ఉన్నదనే తిరుగు ప్రచారాన్ని సాగిం

చాడు. రాజకీయరంగంలో అతివాదులుగా ప్రఖ్యాతిగాంచిన అరవిందుడు, బిపిన్ చంద్రపాల్, లజపత్‌రాయ్ మొదలైనవారు అతనితో ఏకీభవించారు. సంఘసంస్కరణము, రాజకీయ సంస్కరణము-- ఈ రెండింటిలో ఏదిముందు, ఏది వెనుక జరగడం ఉచితమనే వాదంలో రాజకీయ సంస్కరణలే ముందు జరగడం ఉచితమన్న వాదం బలపడింది.

(4) ఈ సందర్భంలోనే ఇంకొక వాదం కూడా బయలుదేరింది. రాజకీయ సంస్కరణలను వాంఛించిన విద్యాధికులు 1885లో భారతజాతీయ కాంగ్రెసును (Indian National Congress) స్థాపించారు. ఇది అప్పటినుండి ఏటేటా సమావేశమై రాజకీయ విషయాలగురించి చర్చించి తీర్మానాలను గావించి వాటిని అధికారులకు పంపడం పరిపాటి అయింది. విద్యాధికులలో అనేకులు సంఘసంస్కరణమును కూడ వాంఛించినవారు. కాంగ్రెసు సమావేశాలలో దానిని గురించికూడ చర్చలు జరిపి తీర్మానాలను చేయడం ఉచితమని వీరిలో కొందరు భావించారు. కాని 1886 సమావేశానికి అధ్యక్షుడైన దాదాభాయి నవరోజి కాంగ్రెసు వేదికను రాజకీయ చర్చలకు మాత్రమే వినియోగించవలెననీ, సంఘసంస్కరణల చర్చలకు ఇది వినియోగం కాకూడదనీ హెచ్చరించాడు. ఇదియే సరియైన విధానమని కాంగ్రెసు నాయకులు భావించి, సంఘసంస్కరణ సమస్యలను కాంగ్రెసు సమావేశాలలో చర్చించడం మానుకొన్నారు. రాజకీయాలలో విద్యాధికులందరు ఏకీభావం కలవారైనా సంఘసంస్కరణ విషయంలో అలాటి ఐక్యత కుదరడం కష్టసాధ్యమని, సంస్కరణ సమస్యలు. అన్ని రాష్ట్రాలలోను అన్ని కులాలలోను ఒకవిధమైనట్టివి కావని, వాటిని పరిష్కరించుకొనడంలో ఆయా రాష్ట్రాల వారు ఆయాకులాలవారు ప్రత్యేకంగా కృషిచేయడమే సముచితమనీ, కాంగ్రెసులో అవి చర్చకు వచ్చిన పక్షాన అభిప్రాయ భేదాలు ప్రాబల్యంగాంచి రాజకీయ ఐక్యతకు భంగం కలిగించే ప్రమాదం ఉన్నదనీ దాదాభాయి నవరోజి వెలిబుచ్చిన అభిప్రాయంతో నాయకులందరు ఏకీభవించారు.

దీని ఫలితంగా కాంగ్రెసు సమావేశాలు ముగిసిన తర్వాత ఒకరోజు సంఘసంస్కరణాభిమానులు అదే పందిటిలో వారి సమావేశాన్నే ప్రత్యేకంగా జరిపి, సంస్కరణ విషయాలను అందులో చర్చించడం పరిపాటి అయింది. సంస్కరణోద్యమం కాంగ్రెసుతో సంబంధంలేనట్టి ఉద్యమమనే భావం బలపడుటకై 1887లో మహదేవ గోవింద రానడే అఖిలభారతసాంఘిక సంస్థ (All India Social Conference) ను స్థాపించాడు. కాంగ్రెసు మోస్తరుగానే ఇదికూడా ఏటేట సమావేశాలు జరుపుకొంటూ ఉండేది. కాని ఈ సమావేశాలు కాంగ్రెసు జరిగే ప్రదేశంలోనే జరుగుతూ ఉండేవి.

కాని ఇదికూడా తిలకుకు ఆమోదయోగ్యంకాలేదు. 1895లో కాంగ్రెసు పూనానగరంలో సమావేశమైన సందర్భంలో సంఘసంస్కరణ సమావేశం కాంగ్రెసు పందిటిలో జరగరాదని తిలక్ పట్టుపట్టాడు. దానిని గురించి అనేక

తర్జనభర్జనలు జరిగినవి. తుదకు వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెసు కమిటీలలో అధిక సంఖ్యాకులు సంఘసంస్కరణ సమావేశం కాంగ్రెసు పందిటిలో జరగ వచ్చునని చెప్పారు. అయినా, రానడే సమావేశాన్ని ఆ పందిటిలో జరపడం ప్రాజ్ఞత కాదనిభావించాడు. కమిటీలన్నీ ఏకగ్రీవంగా దానికి ఆమోదం తెలుపక పోవడం దీని కొక కారణం. ఇదిగాక పూనాలో సంఘ సంస్కరణకు పూర్తి విరోధులైన అతివాదులు కొందరు కాంగ్రెసు పందిటిని అగ్నిహోత్రునిపాలు చేయుటకు సిద్ధపడడం ఇంకొక కారణం. ఆరోజులలో సంఘ సంస్కరణపట్ల సుముఖులూ విముఖులూ మధ్య ఎంతటి తీవ్రమైన విరోధం ఏర్పడిందో ఈ ఉదంతం స్పష్టంచేస్తూ ఉంది. అయినా తర్వాతి సమావేశాలన్నీ కాంగ్రెసు పందిటి లోనే జరుగుతూ వచ్చినవి. కాంగ్రెసు వేరుగాను సంఘ సంస్కరణ సభ వేరు గాను సమావేశమైనా కాంగ్రెసులో మితవాదుల ప్రాబల్యం ఎక్కువగా ఉండడం చేత ఈ రెండు సంస్థలమధ్య సౌహార్ద్రం చెడలేదు.

(5) ఇదేకాలంలో సంస్కర్తల మధ్య ఇంకొకవిషయాన్ని గురించికూడా తీవ్రమైన అభిప్రాయ భేదాలు ఏర్పడినవి. సంస్కరణలను ప్రవేశ పెట్టడంలో ప్రభుత్వ సహాయాన్ని అర్థించి శాసనాలను చేయవలసిందిగా కోరడమా లేక ప్రభుత్వ సహాయాన్ని అర్థించక ప్రజాభిప్రాయాన్ని మార్చి సంస్కరణలను ప్రవేశపెట్టుకొనడమా అనేదే ఈ విషయం. 1857-58 తిరుగుబాటుకు పూర్వం ప్రభుత్వం చేసిన శాసనాల ద్వారా సతీసహగమనము, శిశుహత్యలు నిషేదింప బడినవి. స్త్రీల పునర్వివాహంకూడా ప్రభుత్వశాసనం సమర్థించింది. కాని దేశంలో జాతీయభావం అంకురించి వృద్ధిగాంచిన ఫలితంగా ఈ విషయంలో 1860 తర్వాత సంస్కర్తలమధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు ఏర్పడినవి. ఇవి 1884-1891 మధ్య ఉచ్చస్థాయిని అందుకొన్నవి.

1884 లో మలబారి అనే పార్సీ విద్యాధికుడు బాల్యవివాహము, స్త్రీల పునర్వివాహముల గురించి రెండు కరపత్రములను ప్రచురించి బాల్యవివాహమును నిషేదించవలసినట్లుగాను స్త్రీల పునర్వివాహమును ప్రోత్సహించునట్లుగాను శాసనములను చేయవలసిందిగా ప్రభుత్వాన్ని అర్థించాడు. వీటిని గురించి అతని సంపాదకత్వంలో వెలువడుచున్న పత్రికలలో ప్రచారం సాగించాడు. ఈ ప్రచారంలో ఇతర వార్తాపత్రికల సంపాదకులు సంఘ సంస్కర్తలు పాల్గొన్నారు. మలబారి కోరినట్లు ప్రభుత్వం శాసనాలను చేయడమును కొందరు సమర్థించారు; మరికొందరు దానిని తీవ్రంగా ఖండించారు. ఖండించినవారిలో తిలక్ అగ్రస్థానాన్ని వహించాడు. అందుకుగాను తన పత్రికలను - మరాటా, కేసరి పత్రికలను-వినియోగించాడు.

ఈ రెండు వర్గాలమధ్య రాజీ కుదర్చదలచి బాల్యవివాహాలను నిషేదించు టకు బదులు గర్భాదాన కనిష్ట వయస్సును 10 నుండి 12 కు పెంచుతూ ప్రభుత్వం శాసనం చేయవలసిందిగా కొందరు సూచనలను చేశారు. 1860 లో కనిష్ఠ వయస్సు 10 సంవత్సరాలుగా ఉండవలెనని ప్రభుత్వం శాసనం చేసింది.

దానిని సవరిస్తూ 12 సంవత్సరాలు కనిష్ట వయస్సుగా ఉండవలసినట్లు ఒక సవరణను చేయవలసిందిగా వీరు కోరారు. ఇదివరకే అమలులో ఉండే శాసనాన్ని సవరించడమును ఎవరూ ప్రతిఘటించరని వీరు భావించారు.

కాని తిలక్ దీనినికూడా ప్రతిఘటించాడు. అతడు సంఘ సంస్కరణము నకు విముఖుడుకాడు. 1890 లో రానడే మొదలైన సంస్కర్తలతో కలసి వివాహాలలో దుబారా ఖర్చులు ఉండరాదని, బహుభార్యాత్వము నిషేదించవలెనని, స్త్రీలకు విద్య నేర్పవలెనని, బాల్యవివాహాములు ఆచరణయోగ్యము కాదని ఒక విన్నపముపై సంతకముచేసి, వీటి అన్నిటికీ తాను బద్ధుడైనట్లు శపథము చేసినాడు. తన కుమార్తెలకు ఇంగ్లీషు చదువు చెప్పించాడు. 16 సంవత్సరముల వయస్సు వచ్చిన తర్వాతనే వారికి వివాహాము చేసినాడు. కాని సంఘ సంస్కరణ విషయములలో ప్రభుత్వమునకు ఏలాటిజోక్యము ఉండరాదనే కారణమున అతడు గర్భాదాన బిల్లును ప్రతిఘటించాడు.

బ్రిటిష్ ప్రభుత్వము పరాయి ప్రభుత్వము. భారతీయుల మతములోగాని, మతముతో సంబంధముగల ఆచారములలోగాని అది జోక్యము కలుగజేసుకొనుట ప్రమాదకరము. ఈలాటి జోక్యము భారతీయుల ఆత్మగౌరవమునకు భంగకరము. పరాయి పరిపాలన దాస్యమునుండి విముక్తిగాంచుటయే తుది లక్ష్యముగ పెట్టుకొన్న భారతీయులు సంఘ సంస్కరణమునకై దానిపై ఆధారపడుట సిగ్గుచేటు. విద్యాధికులు ప్రజలను విద్యావంతులుగజేసి, ప్రజాభిప్రాయమును మార్చి, స్వయముగ సంస్కరణలను ప్రవేశపెట్టుకొనుటయే గౌరవప్రదము. గత కాలములో సంఘంలో అనేక మార్పులు ఈలాగే జరిగినవి. ఈ విధానమును విస్మరించి పరాయి ప్రభుత్వమును శాసనములు చేయవలసినదిగ అర్థించుట తమ నిస్సహాయతను అంగీకరించుటయే. కాని ప్రజలు నిస్సహాయులు కారు. స్వతంత్రముగ వారు సంస్కరణలు చేసుకొనుటకు సమర్థులు - అని తిలక్ వాదించాడు. గర్భాదాన చట్టము 1891 లో ప్రభుత్వము చేసినను తిలక్ అభిప్రాయముతో అనేకులు ఏకీభవించిరి. ఈ వాదోపవాదముల ధోరణిని ప్రభుత్వము గ్రహించి 1929 వరకు సంఘ సంస్కరణమును గురించి మరి ఏలాటి శాసనమును చేయలేదు.

విద్యాధికుల దృక్పథాలలో ఈలాటి భేదాలు ఏర్పడిన కారణంగాను, 1900 తర్వాత రాజకీయరంగంలో మితవాదుల ప్రాబల్యం తగ్గి అతివాదుల ప్రాబల్యం పెరగడంచేతను, జాతీయతకు సంబంధించిన సిద్ధాంతాలలో గొప్ప మార్పులు సంభవించడంచేతను సంస్కరణ ఉద్యమం కొంత బలహీనతగాంచింది. రాజకీయాల దృష్ట్యా ఉద్యమాన్ని నడిపించవలసిన అవసరం ఏర్పడింది. వర్ణవ్యవస్థ, కుల భేదాలు, అస్పృశ్యత-వీటి విషయమై ఎక్కువ కృషిజరిగింది. ఈ కృషికి చాలావరకు రాజకీయాలు కారణమైనవి. బ్రాహ్మణేతర ఉద్యమం మహారాష్ట్రంలోను, దక్షిణ భారతంలోను బలపడడము, హరిజనోద్ధరణకై

అంబేద్కరువంటి నాయకులు, మహాత్మాగాంధి కృషి చేయడము దీని ఫలితములు.

3

ప్రథమదశలో సంఘసంస్కరణోద్యమం, ఉద్యమాభిమానులైన రామ మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహదేవ గోవిందరానడే, కందు కూరి వీరేశలింగం పంతులు మొదలైన వ్యక్తులద్వారాను, వారు స్థాపించిన సభలు పత్రికలు ద్వారాను సాగింది. ఆరోజులలో ప్రయాణ సౌకర్యాలు చాలా తక్కువ. అందుచేత ఒక రాష్ట్రంలోని సంస్థలకు ఇంకొకదానిలోని సంస్థలకు ఎక్కువ సంబంధం ఉండేదికాదు. వ్యక్తులయొక్కయు, సంస్థల యొక్కయు కార్యక్రమాలు ఆయా రాష్ట్రాలకు పరిమితమై ఉండేవి. ఈ దృష్ట్యా 1864 లో కేశవచంద్రసేన్ మద్రాసు, బొంబాయిలకు, 1868 లో ఉత్తరప్రదేశ్‌కు చేసిన పర్యటనలు ప్రత్యేక ప్రాధాన్యాన్ని వహిస్తున్నవి.

బెంగాలులో సంస్కరణ కార్యక్రమాన్ని బ్రహ్మసమాజం చేపట్టింది. మహారాష్ట్రంలో గుజరాతులోను ప్రార్థన సమాజస్థాపనకు పూర్వమూ, అటు తర్వాతనూ సంఘసంస్కరణ సభలు అనేకం ఏర్పడినవి. 1840 లో స్థాపితమైన పరమహంస మండలి, 1848 లో స్థాపితమైన విద్యార్థి సాంస్కృతిక వైజ్ఞానిక సభ, బొంబాయి నగరంలోని గుజరాతీవారు 1851 లో స్థాపించిన బుద్ధివర్ధక హిందూసభ, దాదాబాయి నవరోజి మరికొందరు నెలకొల్పిన జ్ఞానప్రసారిక మండలి, గుజరాత్‌లో 1844 లో మంచారాం స్థాపించిన మానవధర్మ సభ, అహమదాబాదులో 1848 లో స్థాపితమైన గుజరాతీభాషా సభ, 1873 జ్యోతిబ గోవిందపూలే పూనాలో స్థాపించిన సత్యశోధక మండలి ఈలాటి సభలలో కొన్ని. 1864 లో కేశవచంద్రసేన్ మద్రాసు రాకమూలంగా అక్కడ వేద సమాజము స్థాపింపబడినది. 1871 లో శ్రీధరుల నాయుడు కలకత్తాకు వెళ్ళి అక్కడి బ్రహ్మసమాజీకులతో సంప్రతించి వచ్చినతర్వాత దీనిపేరు దక్షిణభారత బ్రహ్మసమాజమని మార్చబడెను. ఇది శివనాథశాస్త్రి సాధారణ బ్రహ్మసమాజ ముతో దగ్గిరసంబందంకలదియై తనకృషిని సాగించినది. దీనికి బుచ్చయ్యపంతులు కార్యదర్శిగాను రఘుపతి వెంకటరత్నంనాయుడు అధ్యక్షుడుగాను ఎన్నుకోబడి నారు. 1878లో వీరేశలింగంపంతులుగారు రాజమండ్రిలో ప్రార్ధనాసంఘ సంస్కార సమాజమును 1884లో స్త్రీ పునర్వివాహసమాజమును స్థాపించిరి. ఈ సభలన్నీ ఆయా ప్రాంతాలలో సంస్కరణములగురించి ప్రచారముసాగించి, తదను సారంగా కొన్నిసంస్కరణలను ప్రవేశపెట్టగలిగినవి.

సంస్కర్తలు ఈలాటి సభలతోపాటు కొన్ని పత్రికలను స్థాపించి వాటి సాధనాన తమప్రచారమును సాగించిరి. కొందరు గ్రంధరచనకుకూడా పూనుకొనిరి. ఇందులోకూడా రామమోహనరాయ్ వీరికి మార్గదర్శకుడయ్యెను.

పత్రికలలోను గ్రంథములలోను అనేకం దేశభాషలలో ప్రకటితముకావడము ప్రత్యేకంగా గుర్తించవవలసిన విషయం. బ్రహ్మసమాజకుడైన అక్షయకుమార దత్తు సాగించిన తత్వబోధినీపత్రిక, ఈశ్వరచంద్ర విద్యాసాగరు 1850లో ప్రచురించిన "హిందూ వితంతువుల పునర్వివాహం" అనే గ్రంథము, 1830 ప్రాంతాన బొంబాయిలో బాలగంగాధరశాస్త్రి జంభేకరు సాగించిన బొంబాయి దర్పణ పత్రిక, గోపాలహరీదేశ్‌ముఖ్ (లోకహితవాది) రచించిన శతపత్రము, 1872లో పూలేరచించిన గులామ్‌గిరి గ్రంథము, 1874లో వీరేశలింగంపంతులుగారు ప్రారంభించిన వివేకవర్ధని మాసపత్రిక, వారిరచనలు, ఇదేకాలమున ఆంధ్ర ప్రాంతమున వెలువడిన పురుషార్థప్రదాయిని, మరికొన్ని పత్రికలు సంఘసంస్కరణమునుగురించి ప్రచారము సాగించుచుండెను. సంఘసంస్కరణమును సమర్థించిన వారిలో పరవస్తు వెంకటరంగాచార్యులు ఒకరు. సభల కార్యక్రమాలలోను, పత్రికలలోను, గ్రంథములలోను స్త్రీలు అనుభవించుచుండినబాధలను తొలగించడము, వారి ఉద్ధరణము, వారివిద్య ఎక్కువప్రాధాన్యము వహించెను.

సంస్కరణోద్యమ రెండవదశలో స్థానిక సభలకుతోడు అఖిలభారత జాతీయ సాంఘిక మహాసభ (National social conference) సంస్కరణల విషయమై కృషిచేయసాగినది అప్పటికి రైల్వేలనిర్మాణము చాలావరకు జరిగిన కారణంగా విద్యాధికులు సంస్కర్తలు ఒక ప్రాంతమునుండి ఇంకొక ప్రాంతమునకు ప్రయాణము సాగించడము సులభసాధ్యమయ్యెను. ఇదిగాక 1885లో అఖిల భారత జాతీయకాంగ్రెసు (Indian national congress) స్థాపింపబడినది. ఇదేవిధముగ అఖిలభారత సంస్కరణమహా సభను స్థాపించుట సాధ్యమనీ వాంఛనీయమనీ సంస్కర్తలు నిర్ణయించి, 1887లో ఆలాటిసభను స్థాపించిరి ఇందులో ప్రధానపాత్రను వహించినవాడు మహాదేవగోవిందరానడే. ఇది మొదలు 1901లో ఆయన మృతిచెందువరకు దానిఅభివృద్ధికై ఆయన సర్వవిధాలా పాటుబడినాడు

మొదటినుండి సాంఘిక మహాసభ ఏటేట కాంగ్రెసు సమావేశమైన చోటనే సమావేశమై, సంఘసంస్కరణ విషయములగురించి చర్చలు సాగించి తీర్మానములను చేయడము పరిపాటి అయినది. కాంగ్రెసు సమావేశాలకు హాజరైన ప్రతినిధులలో అనేకులు సాంఘిక సమావేశాలలో పాల్గొనేవారయ్యారు. వీరందరు భారతజాతి సర్వతోముఖముగ అభివృద్ధి కావలెననియు, ఆలాటి అభివృద్ధికి సంఘసంస్కరణము ఒక ప్రధాన సాధనమనియు విశ్వసించినవారు. ఇదికారణంగా సంస్కరణోద్యమము కూడ కొంతవరకు అఖిలభారత దృక్పథంతో సాగుట సాధ్యమైనది.

సాంఘిక మహాసభ చేసిన తీర్మానాలు సాధరణంగా ఆయారాష్ట్రాలలోని సభలకు సిఫారసుల రూపంలో పంపబడుతూ ఉండేవి. తప్పకుండా ఫలాని సంస్కరణ జరగవలెనని ఆదేశించడం సముచితం కావనే అభిప్రాయం బలపడియుండడమే దీనికి కారణం. అన్ని రాష్ట్రాలలో సాంఘిక సమస్యలు ఒకే విధమైనవి

కాకపోవడం చేతను, ఆయా రాష్ట్రాలలోని పరిస్థితుల దృష్ట్యా వాటిలోని సంఘ సంస్కరణ సభలు అఖిలభారత సభచేసిన సిఫారసుల ననుసరించి స్థానిక సమస్యలను పరిష్కరించుకొనడం వాంఛనీయమనే భావం వ్యాపించడం చేతను ఈ విధానం అనుసరణ యోగ్యమైంది. స్థానిక సంస్థలమధ్య సమన్వయం చేకూర్చడము వాటికి నైతికబలమును సమకూర్చడము జాతీయ సాంఘిక సభయొక్క ప్రధానాంశమైనది.

జాతీయ సభచేసిన సిఫారసులలో చాలాభాగం స్త్రీల ఉద్ధరణకు సంబంధించినట్టివి. కులభేదాల నిర్మూలనము, అస్పృశ్యతా నివారణము కూడా మౌలిక సమస్యలుగా పరిగణింపబడినా, ఇవి సభయొక్క దృష్టిని ఎక్కువగా ఆకర్షించినట్టివి కావు. బాల్యవివాహాలు. బహుభార్యాత్వము, కులీన వివాహ పద్ధతి, నిర్బంధ వైధవ్యము వధూవరులమధ్య వయస్సులో విస్తారభేదం ఉండడము, కన్యాశుల్కము, వరశుల్కము, వివాహాలలో ఖర్చులతో కూడిన ఆడంబరాలు, వితంతువుల కేశ ఖండనాదులు— వీటిని నిషేధించడము అవసరమన్న అభిప్రాయం సభలోని అధిక సంఖ్యాకులలో వ్యాపించియుండెను. దీనికి అనుగుణంగా శిఫారసులు చేయబడేవి. ఇదిగాక స్త్రీలకు విద్య నేర్పవలసిన అవసరమునుగూడ వారు గుర్తించి, దానిని ప్రోత్సహించుటకు కావలసిన చర్యలను తీసుకొనవలసినదిగా స్థానికసభలను కోరడం జరిగేది.

వీటికితోడు కొన్ని స్థానిక సమస్యలుకూడా సభవారి దృష్టిని ఆకర్షించినవి. దేవదాసీల విధానము, భోగం మేళాలు దక్షిణభారతంలో ఎక్కువగా ఉండేవి. సభకు వెళ్ళిన దక్షిణభారత ప్రతినిధులు వీటి నిర్మూలనము గురించి తీర్మానాలు చేయవలసిందిగా కోరుతూ ఉండేవారు. మరికొందరు దేవాలయాలను చట్టబద్ధము చేయడము, విద్యాలయాలలో మతబోధ, నీతిబోధల అవసరము. త్రాగుడును తగ్గించవలసిన అవసరము, వివిధ కులాల మధ్య పంక్తి భోజనములను ప్రోత్సహించడము, వర్ణాంతర వివాహాల ఆవశ్యకత మొదలైన విషయాల గురించికూడా సభ కొన్ని సిఫారసులను చేయడం పరిపాటిగా ఉండేది.

సంస్కర్తలనేకులు వర్ణవ్యవస్థలోను కులకట్టుబాటులలోను అస్పృశ్యతను నివారించుటలోను శ్రద్ధ వహించిన వారైనా వీటివిషయమై జరగదగిన కార్యక్రమముల గురించి అభిప్రాయభేదాలనేకం ఉత్పన్నం కావడంచేత 1900 వరకు వీటి విషయమై చెప్పుకోతగిన తీర్మానాలు చేయబడలేదు. ప్రప్రథమంగా 1900లో అస్పృశ్యుల హీనస్థితిని మార్చవలసిన అవసరమును సభవారు గుర్తించి దానిని గురించి ఒక తీర్మానం చేశారు. ప్రజల ప్రతిఘటన తీవ్రంగాలేని విషయాల గురించి మాత్రమే అభివృద్ధిని సాధించడము ( Progress along the lines of least resistence ) ఉత్తమ విధానమని ఒకప్పుడు కాశీనాథ త్ర్యంబక తెలాంగు చెప్పిన మాటలను సభవారు అనుసరించేవారయ్యారు. బ్రిటన్‌లో కూడా అప్పటివరకు హార్బర్టుస్పెన్సర్ ప్రతిపాదించిన పరిణామ సిద్ధాంతం

(Theory of Evolution) ప్రాబల్యంగాంచి ఉండేది. ఈ సిద్ధాంతం భారతదేశం లోని సంఘసంస్కర్తల పై ఎక్కువ ప్రభావాన్ని వహించింది. మార్పుతనంతట జరుగుననీ, దానికి ఒక క్రమపద్ధతి ఉన్నదనీ, తొందరపడి సంఘంలో మార్పులు తెచ్చుటకు ప్రయత్నించడం ప్రకృతి సూత్రాలకు విరుద్ధమని అతడు ప్రతిపాదించాడు. దీనిచేత ప్రభావితులైన సంస్కర్తలు ఇది తెలాంగు చెప్పిన మాటలకు అనుగుణంగా ఉన్నట్లు భావించి క్రమక్రమంగా సోపాన పద్ధతిన సంస్కరణలు జరుగుటయే మంచిదని నిర్ణయించిరి.

కాని ఇది సంస్కర్తలలో కొందరికి అంగీకారయోగ్యం కాలేదు. ఇదికాక సంఘసంస్కరణ ఉద్యమములో నాయకత్వము వహించి పేరుప్రఖ్యాతుల సంపాదించిన వారిలో అనేకులు వారి ప్రచారానుసారంగా ప్రవర్తించలేకపొయ్యారు. తెలాంగు 8, 10 సంవత్సరాల వయస్సులోనే తనకుమార్తెలకు వివాహం చేశాడు. రానడే మొదటి భార్య మరణించిన తర్వాత వితంతువును వివాహమాడునని సంస్కర్తలు అభిప్రాయపడినారు, కాని తండ్రియొక్క ఒత్తిడికి లొంగిపోయి ఆయన 11 సంవత్సరాల కన్యను-రమాబాయిని- వివాహమాడినాడు. క్రైస్తవ మిషనరీలు ఏర్పాటు చేసిన తేనేటి విందులో పాల్గొని సనాతనుల ఒత్తిడికి లొంగి ప్రాయశ్చిత్తం చేసుకొన్నాడు. సంస్కర్తలు చిత్తశుద్ధితో ప్రచారం చేసేవారు కారని, వారి మాటలకు చేతలకు మధ్య ఏలాటి సంబంధం లేదనీ అనేకులు అభిప్రాయపడి, ఉద్యమాన్ని హేళన చేయసాగారు. ప్రజాభిప్రాయానికి తలవంచక, తాము నమ్మిన విధానాన్ని అనుసరించడమే సంస్కర్తలు అనుసరించవలసి ఉన్నదని కొందరు, ఉద్యమ నాయకులను ఖండించేవారయ్యారు. కాని జాతీయసభపై రానడే నాయకత్వము వహించుచుండిన కాలంలో ఈ ఖండనలకు ఎక్కువ విలువ లేకపోయింది. 1901లో అతడు మరణించిన తర్వాత నారాయణ గణేశ్ చంద్రవర్కారు దానిపై నాయకత్వము వహించి సంస్కరణోద్యమం చురుకుగా జరిగే విధానాన్ని ప్రవేశపెట్టాడు. సమస్తకష్టాలను ఎదుర్కొని సంస్కర్తలు వారి విశ్వాసాలకు అనుగుణంగా వారి ప్రవర్తనను సరిదిద్దుకొని, ఇతరులకు మార్గదర్శకులైనప్పుడే ఉద్యమం విజయవంతం కాగలదని ప్రచారం సాగించాడు. కాని దీని మూలంగా ఎక్కువ మార్పులు జరగలేదు. పైన సూచించినట్లు 1900 తర్వాత తిలక్ వంటి అతివాదులూ గోఖలే మొదలైన మితవాదులూ మధ్య అభిప్రాయ భేదాలు ప్రాబల్యంగాంచిన కారణంగా ఉద్యమం చాలావరకు చల్లబడింది.

అఖిలభారత స్థాయిలో ఉద్యమం చల్లబడినా ఆయా రాష్ట్రాలలోని సభలు వాటి కార్యక్రమాలను సాగిస్తూనే వచ్చినవి. ఈ సభలలో కొన్ని అన్ని కులాల విద్యార్థికులు కలిసి స్థాపించినట్టివి. మరికొన్ని ఒక్కొక్క కులానికి చెందినవారు మాత్రమే స్థాపించినట్టివి. తక్కినవి సంస్కరణోద్యమంలో శ్రద్ధవహించిన మత సంఘాలు.

వీటిలో కుల సంఘాలు మూఢవ దశలో ఎక్కువ ప్రాధాన్యం వహించ

గలిగాయి. ఇవి ఆయా కులాలకు మాత్రమే పరిమితం కావడంచేత అనుకొన్న కార్యక్రమాలు చురుకుగా సాగడం సాధ్యమైంది. ఉత్తరభారతంలో ఇవి చాలా ప్రాధాన్యాన్ని వహించాయి. వీటిలో కాయస్థ సభ, వైశ్య సభ, జాట్ సభ, శిక్కు సభ, రాజపుత్ర సభలు ఆయా కులాలలో అనేక సంస్కరణలను ప్రవేశ పెట్టగలిగినవి. వీటిలో అనేకం స్త్రీల ఉద్ధరణ కార్యక్రమాలను, స్త్రీ విద్యాభి వృద్ధికి చెందిన కార్యక్రమాలను చేపట్టి విజయవంతంగా సాగించగలిగినవి. తమ తమ కులాలకు చెందినవారిని విదేశాలకు పంపి, వారి ఉన్నత విద్యకు తోడ్పడి నట్టివి, దీని ఫలితంగా మధ్య యుగపు సముద్రయాన నిషేధం తొలగిపోయింది.

మూడవదశలో మహారాష్ట్రంలో బ్రాహ్మణేతర ఉద్యమం బలపడింది. పూలే దీనిని ప్రారంభించాడు. సంఘంలో బ్రాహ్మణులు యుగయుగాలుగా సంపాదించిన అధిక్యతను నిర్మూలించడము దీని ప్రధానాశయము. పూలే అనం తరం దీనిపై కొల్హాపూరు మహారాజు నాయకత్వం వహించాడు. సంస్థానంలో అన్ని ఉద్యోగాలలో బ్రాహ్మణేతరులను నియమించాడు. బ్రాహ్మణ పురోహి తులతో నిమిత్తం లేకుండా బ్రాహ్మణేతర పురోహితుల ఆధ్వర్యాన వివాహాది కార్యాలను నడిపించసాగాడు. క్రమక్రమంగా రాజకీయశక్తులు కారణంగా ఈ ఉద్యమం 20వ శతాబ్దంలో బలపడింది.

ఇదేవిధంగా డాక్టరు అంబేద్కరు హరిజనుల ఉద్ధరణకై కార్యక్రమాలనేకం సాగించాడు. వీటిలోకూడా సంఘసంస్కరణ దృష్టికంటే రాజకీయ దృష్టి ప్రాబల్యం వహించింది. వీరికికూడా ఎన్నికలలో పాల్గొనే హక్కు క్రమక్రమంగా లభించడంచేత వారిసహకారాన్ని సంపాదించడము పై కులాలవారికి అవసరమైంది. హరిజనోద్ధరణ కార్యక్రమాలలో వారుకూడా పాల్గొనే వారయ్యారు. వారి సహకారం లేనిదే దేశస్వాతంత్ర్యం సంపాదించడం సాధ్యంకాదనే భావం వ్యాపించడంచేత మహాత్మాగాంధీ వారిఉద్ధరణకు గట్టిగా కృషిచేశాడు.

సంఘసంస్కరణపట్ల శ్రద్ధవహించిన మతసంఘాలలో 20వ శతాబ్దాన పంజాబులోని ఆర్యసమాజం ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. సమాజ సభ్యులు స్త్రీల ఉద్ధరణకున్నూ, వారి విద్యావ్యాప్తికిన్నీ ఎక్కువ కృషిచేశారు. సభ్యు లలో బాల్యవివాహం అంతరించింది. వితంతు వివాహాల సంఖ్యకూడా పెరిగింది. ఇదిగాక కొంతకాలం గడచిన తర్వాత, వేదమంత్రసహితంగా అస్పృశ్యులను అధిక సంఖ్యలో సమాజంలో చేర్చుకొనడం జరిగింది. వారికి సంఘంలో గౌరవ స్థానం లభించుటకు సమాజం గొప్ప కృషిని సాగించింది.

సంఘ సంస్కరణ ఉద్యమంలో దివ్యజ్ఞాన సమాజంకూడా చాలా శ్రద్ధ వహించింది ప్రథమంలో సమాజంవారు హిందూమత ఉత్కృష్టతను పాటిస్తూ ప్రాచీనకాలపు సంప్రదాయాలను ప్రశంసిస్తూ వచ్చారు. కాని కాలక్రమాన వీరు ఈ ధోరణిని మార్చుకొని అనిబెసెంటు నాయకత్వాన స్త్రీల ఉద్ధరణకు సంబంధించిన కార్యక్రమాలను చేపట్టారు. వారి విద్యకు, బాల్యవివాహాల రద్దుకు, బహుభార్యాత్వ నిర్మూలనమునకు, అన్ని వర్ణాలవారు కలిసి పంక్తిభోజనం

చేయుటకు, వర్ణాంతర వివాహాల ప్రోత్సాహనకు, కృషిచేశారు. విద్య పూర్తి అగువరకు బ్రహ్మచర్యమును అనుష్ఠించవలసిన నియమాన్ని వారి విద్యాలయాలలో ప్రవేశపెట్టారు. లౌకికవిద్యతోపాటు మతబోధ నీతిబోధలకు ప్రాధాన్యం కల్పించారు. సంఘ సంస్కరణము జాతీయ సంప్రదాయాలకు అనుగుణంగా జరగవలెననే భావానికి ప్రాధాన్యం కల్పించారు.

ఈ విధంగా, 19, 20 శతాబ్దాలలో వివిధ సంస్థల సాధనాన సంఘ సంస్కరణ ఉద్యమం కొనసాగింది.

## 4

సంఘ సంస్కరణోద్యమాన్ని ప్రారంభించి సాగించిన విద్యాధికులు స్త్రీల ఉద్ధరణ, కులభేధాల నిర్మూలనము అస్పృశ్యతా నివారణము పరిష్కరించ వలసిన మౌలిక సమస్యలుగా గుర్తించినను 19 వ శతాబ్దంలో వారు స్త్రీల ఉద్ధరణ విషయంలోనే ఎక్కువ శ్రద్ధవహించారు. సంస్కర్తలలో అధిక సంఖ్యాకులు బ్రాహ్మణాది అగ్రవర్ణాలకు చెందినట్టివారు. ఆనాటి స్త్రీల సమస్యలలో అనేకం అగ్రవర్ణాలలోని స్త్రీలకు సంబంధించినట్టివి. వాటితో సంస్కర్తలకు ప్రత్యక్ష పరిచయం ఉండేది. అస్పృశ్యుల సమస్యలతో ఆలాటి సన్నిహిత పరిచయం వారికిలేదు. స్త్రీల సమస్యలమూలంగా బాధలనుభవించేవారు తమ కుటుంబాలలోను తమ బంధువర్గాలలోను ఉండిన స్త్రీలు. ఆ సమస్యలు వారి దృష్టిని ఎక్కువగా ఆకర్షించడం, వాటి పరిష్కార విషయంలో వారు ఎక్కువ శ్రద్ధవహించడం సమాజం. తక్కిన రెండు మౌలిక సమస్యలు ఈలాటివికావు.

19 వ శతాబ్ద ప్రారంభాన స్త్రీలు అనుభవించుచుండిన బాధలు వారి పుట్టుకతో ఆరంభమై యావజ్జీవం వారిని వెంటాడుచుండినవి. కొన్ని కులాల వారు - వారిలో ప్రధానంగా క్షత్రియ కులాలవారు - ఆడ సంతానం కలగడము ఒక శాపంగా భావించేవారు. ఆడ పిల్లలకు తగిన వరుడు దొరకకపోవడము, దొరికినా వారి వివాహాలకై చేయవలసిన రకరకములైన ఖర్చులు దుర్భరముగా ఉండడము దీనికి ప్రధాన కారణం. ఈ బాధను తప్పించుకొనడానికి వారు పిల్ల పుట్టగానే హత్యచేయడము ఒక ఆచారంగా ఉండేది. ఈలాటి శిశు హత్యలు పాపకారణమని తల్లిదండ్రులు భావించేవారుకారు. నిర్దయులై వారు దీనికి పూనుకొనడము సంస్కర్తలయొక్కయు సంస్కరణాభిమానులైన బ్రిటిష్ అధికారులయొక్కయు దృష్టిని ఆకర్షించింది.

అన్ని అగ్రకులాలలో అతిబాల్యమందే ఆడపిల్లలకు వివాహము చేయడము సదాచారంగా పరిగణింపబడేది. రజస్వలానంతరం వారికి వివాహాలు చేసిన పక్షంలో తల్లిదండ్రులకు కన్యాదాన ఫలం దక్కదని అనుకొనేవారు. ఈ మూఢ విశ్వాసం ప్రబలిఉండడంచేత సాధారణంగా ఆడపిల్లలకు 5-10 సంవత్సరాల మధ్య వివాహాలు జరిగేవి. కొందరికి 5 సంవత్సరాలకు ముందే వివాహాలు జరుగుతూ ఉండేవి. ఈ ఆచారంమూలంగా అనేక అనర్థాలు సంభవించినా తల్లి

దండ్రులుగాని కుల పెద్దలుగాని వాటిని పట్టించుకొనేవారుకాదు. శుల్కానికి ఆశపడి పసిపిల్లలను వృద్ధులకు కట్టిపెట్టడంకూడా జరిగేది. అలాటి దాంపత్యం దుఃఖభాజనమై ఒక్కొక్కప్పుడు అవినీతికికూడా దారితీసేది. కాని ఏదోవిధంగా పిల్లకు వివాహము జరగడము ఉచితమని భావించిన పెద్దలు వీటిని గురించి ఆలోచించేవారు కారు.[1]

బాల్యంలోనే వివాహాలు జరగడంచేత బాలవితంతువుల సంఖ్య ఎక్కువగా ఉండేది. వితంతువులందరు యావజ్జీవం నిర్బంధంగా వైధవ్యం అనుభవించవలసిన వారు. వయస్సుతో నిమిత్తంలేకుండా వితంతువులకు కేశఖండనము తప్పేది కాదు. కురూపులై, ముఖములో బొట్టులేక, తలపైన ముసుగుతో, ఆహారాది విషయాలలో అసహజములైన నియమనిష్టలతో కాలం వెళ్లబుచ్చేవారు. భర్త ఆస్తిలో వారికి భాగం ఉండేదికాదు. కుటుంబంలోను బంధువర్గంలోను చాకిరి చేస్తూ వారు జీవితాన్ని సాగించవలసి ఉండేది. అనేక సందర్భాలలో వారు అవినీతికి పాల్పడడం, భ్రూణహత్యలు జరగడం తప్పేదికాదు. వారి జీవితం నరకకూపంలోని జీవితంగా ఉండేది.[2]

---

1. "చిన్నతనములోనే వివాహము చేయుటచేత వరులకు విద్య నశించును చదువుకో దగిన కాలములోనే సంసారము మీదపడుటచేత పెద్ద పరీక్షలకు చదువుకొనుటకు వీలులేక యల్పములైన యుద్యోగములకాశపడి చదువు మానుకోవలసినవారగుచున్నారు...... స్త్రీలకు పిన్నవయస్సులోనే సంతానము కలుగుచుండుటచేత, అకాలమునందు కాచిన కాయలవలె పిల్లలు బలహీనులుగాను, రోగపీడితులుగాను నుందురు ... పిన్న యీడులో నున్న తల్లులకు దేహదౌర్బల్యము కలుగుటయు వయసులోనే ముసలితనము వచ్చుటయు నల్పాయుష్మంతురాండ్రగుటయు సంభవించుచున్నది (1881 లో వీరేశలింగం పంతులు గారు వివేకవర్ధనిలో వ్రాసిన మాటలు), ఇంతేగాక," భూతదయను ముఖ్యముగా పాటించువారమన్న ప్రతిష్ఠ వహించిన హిందువులమయిన మనము మన దేశమున బుట్టిన నిరపరాధినులయిన ముద్దు బాలికలను నిర్దాక్షిణ్యముతో ధనాశాఘాతావేశమత్తులయి యున్న పితృరూపధారులగు ఘోరరాక్షసులు పనికిమాలిన వారికి విక్రయించెడి దురాచారమును" వారు గర్హించిరి.

2. సుఖపడవలసిన స్త్రీలు దుఃఖములపాలగుట భగవదేచ్ఛకు విరుద్ధమనియు, నిర్బంధ వైధవ్యము వ్యభిచారమునకును భ్రూణహత్యలకును దారిదీయునట్టిది అనియు వీరేశలింగం పంతులుగారు వాదించి, "నొసటలోని కుంకుమ బొట్టును పొయిలోని బూడిద బొట్టుగాను, చేతుల బంగారు కంకణములు రాగి పట్టెలుగాను; మెడలోని ముత్యాల హారములు తులసిపూసల పేరులుగాను, సరిగెపట్టు చీరలు అంచులేని పనికిమాలిన ముదిగుడ్డలుగాను, మెత్తని పరుపులు కటికనేలను తాటిచాపలుగాను మారుటకంటె క్రూరమైన ఆచారము మరియొకటి ఉండునా ? ... చిన్నప్పటినుండియు చమురురాచి పెంచుకొని నిత్యమును దువ్వుకొనుచు ప్రాణముతో సమానముగ చూచుకొనుచున్న తల వెండ్రుకలను మంగళ

వితంతువులు నిర్బంధవైధవ్యాన్ని అనుభవించవలసిన వారైనా పురుషులు ఎన్నిపర్యాయాలైనా వివాహం చేసుకోవచ్చు. కొందరు నాలుగైదు పర్యాయాలుకూడా వివాహం చేసుకొనేవారు బహుభార్యాత్వం నిషేధం కాకపోవడంచేత కొందరు పురుషులు ఏకకాలంలో ఇద్దరుముగ్గురు భార్యలతో సంసార సుఖాలను అనుభవిస్తూ ఉండేవారు. సంఘంలో పురుషులకు ఒక న్యాయం స్త్రీలకు ఇంకొక న్యాయం ఉండేది. ఇది ధర్మవిరుద్ధమని ఎవరూ భావించేవారు కారు. ఈలాటి అన్యాయం జరగరాదని సంఘసంస్కర్తలు వాదించి దానిని రూపుమాపుటకు ప్రయత్నించడం సహజమే.

బహుభార్యాత్వపుఫలితంగా సవతులమధ్య పోరు సంభవించి అనేక స్త్రీల జీవితం దుర్భరమయ్యేది. బెంగాలులోని కులీన వివాహ విధానంలో ఒకనికి 50, 60 పిల్లలను అంటగట్టేవారు. అందరు భార్యలను భరించడం ఎవడికీ సాధ్యంకాదు. వివాహితులైన పిల్లలు పుట్టింట్లోనే ఉండిపొయ్యేవారు. భర్త ముఖం చూడడానికికూడా వీరికి అవకాశం ఉండేదికాదు. వీరొకవిధంగా నిర్బంధవైధవ్యాన్ని అనుభవించవలసి ఉండేది. వీరికి సవతులపోరు లేకపోయినా దాంపత్య సుఖానికి దూరులయ్యేవారు.

కుటుంబాలు సమిష్టిగా ఉండడంచేత వివాహితులైన స్త్రీలు అత్తగారి నిరంకుశత్వం మూలానను, తోడికోడండ్రతో కలహాల మూలంగాను ఎన్నో బాధలను అనుభవిస్తూ ఉండేవారు.

శాస్త్రగ్రంధాలలోను, పురాణేతిహాసాలలోను వివాహం ఒక పవిత్ర సంస్కారంగా వర్ణిత మౌతున్నది. అగ్నిహోత్రుని సాక్షిగా మంత్రతంత్రాలతో వివాహం జరగడం ఈ పవిత్రతను వ్యక్తపరుచటకే, కాని వాస్తవ జీవితంలో పై పరిస్థితుల ఫలితంగా వివాహం పవిత్రతను కోల్పోయి స్త్రీలకు ఒక బంధంగా ఏర్పడింది. జీవితానికంతా మూఢవిశ్వాసాలు ఆధారం కావడంచేత వివాహంలో ఉండవలసిన పవిత్రత అడుగంటింది.

ఈలాటి మూఢవిశ్వాసాలే సతీసహగమనానికి దారితీసింది. నిర్బంధ వైధవ్యానుండి తప్పించుకొనదలచిన స్త్రీలకు చనిపోయిన భర్త చితిపై పడి ప్రాణములను పోగొట్టు కొనడం తప్ప వేరే మార్గంలేక పోయింది, ఇదిఒక దారుణమైన రాక్షస కృత్యమనే భావం బంధువర్గంలో ఉండేదికాదు. వారందరు సహగమనాన్ని ప్రోత్సహిస్తూ ప్రశంసిస్తూ ఉండేవారు. సహగమనం చేసిన స్త్రీ ధన్యురాలనే భావం వ్యాపించి ఉండేది.

ఇందుచేతనే పుట్టినది మొదలు గిట్టేవరకు స్త్రీ జీవితం నరకబాధలతో కూడినట్టిదిగా చరిత్ర రచయితలు చెప్తూఉంటారు.

ఇది అంతా మామూలు కుల స్త్రీల జీవిత విధానం. వీరుగాక, కొన్ని

---

వాని కఱకు కత్తుల కొప్పగించుటకంటె మానవతుల కొక్కసారిగా తల కొట్టివేయుట యుత్తమముగా తోచదా ?" (వీరేశలింగం పంతులుగారు వ్రాసిన మాటలు).

రాష్ట్రాలలో దేవదాసీలనే పేరుతో కొందరు స్త్రీలు ఉండేవారు. పేరునకు వీరు దేవదాసీలైనా వీరు వంశ పారంపర్యంగా వేశ్యావృత్తిని అనుసరిస్తూ ఉండేవారు. ఈలాటి కులం ఒకటి సంఘంలో ఉండడం సిగ్గుచేటు అనే భావం ఏర్పడలేదు. నాట్యంలో వీరే ఎక్కువగా పాల్గొనే వారు (అందుచేతనే ఆనాటి నాట్యప్రదర్శనలకు భోగం మేళాలనే పేరు వ్యవహారంలోకి వచ్చింది). వివాహాలలో వీటిని ఏర్పాటు చేయడం గౌరవంగా భావించేవారు. సంస్కర్తలలో కొందరు ఇవి అవినీతికి దారితీసేవి అని గుర్తించి, వాటి నిషేధానికి ఎంతో కృషిచేశారు. 19వ శతాబ్దంలో ధనికులు మధ్యతరగతికి చెందిన లాయర్లు ఉద్యోగస్తులవంటి విద్యావేత్తలు వేశ్యలను ఉంచుకొనడం గౌరవమని భావించేవారు. బాహాటంగా వారు వేశ్యాగృహాలకు వెళ్లేవారు. వీరేశలింగం పంతులు గారి రచనలలో వీరి ప్రస్తావన ఉండడము గుర్తించదగిన విషయం.

వీటి అన్నిటికీ తోడు స్త్రీలు విద్య నేర్చుకొనుటకు ఏలాటి అవకాశమూ ఉండేదికాదు. విద్యనేర్చుకొన్న స్త్రీలు వైధవ్యం అనుభవించవలసి వస్తుందనే మూఢవిశ్వాసం కొన్ని రాష్ట్రాలలో వ్యాపించి ఉండేది. కొన్ని రాష్ట్రాలలో వేశ్యలు మాత్రమే చదువు నేర్చుకొనేవారు. ఈ కారణంచేత స్త్రీ విద్యపట్ల విముఖత్వం వ్యాపించింది. అనేక రాష్ట్రాలలో స్త్రీలకు ఘోషా పద్ధతి ఉండడం చేత వారు విద్యాలయాలకు వెళ్లి విద్యనభ్యసించడం సాధ్యంకాక పోయింది. బాల్య వివాహాలు కూడా ఈలాటి ఆటంకాన్నే కలిగించినవి. స్త్రీలకు ఉద్యోగాలతో నిమిత్తం లేకపోవడం చేత వారికి విద్య అవసరం లేదని అనేకులు భావించేవారు. కారణాలేవైనా మొత్తంమీద స్త్రీలు విద్యావిహీనులై జీవితాన్ని సాగిస్తూ ఉండేవారు.

1835 మార్చి తే. 21 దిన కలకత్తాలోని సమాచార దర్పణమనే పత్రికలో ఒక స్త్రీ తండ్రులను సహోదరులను ఉద్దేశించి ప్రశ్నల రూపంలో ప్రకటించిన ఒక లేఖ ఆనాటి స్త్రీల కడగండ్లను కంటికి కట్టినట్లు వివరిస్తున్నది. ఆ ప్రశ్నలు ఈ క్రింది విధంగా ఉండినవి.

1. నాగరికత గాంచిన దేశాలలో స్త్రీల చదువు నిమిత్తం చేయబడిన ఏర్పాటులవంటి ఏర్పాటులు మా చదువుకై ఎందుకు చేయబడడంలేదు ?

2. ఇతర దేశాలలోని స్త్రీలవలె పురుషులతోను స్త్రీలతోను బహిరంగంగా కలిసి తిరిగే స్వేచ్ఛమాకు ఇయ్యకపోవుటకు కారణమేమి?

3. 4, 5, 10, 12, సంవత్సరాల వయస్సులోనే మమ్ము పశువుల వలె చదువుగాని, ఐశ్వర్యంగాని, అందంగాని లేనట్టి పురుషుల వశం చేయుటకు కారణమేమిటి? మా భర్తలను మేము ఏల వరించుకొనరాదు? . . . . .

4 వివాహమనే పేరుతో ఎక్కువ ధనం ఇచ్చినవారికి మమ్ము ఎందుకు విక్రయిస్తున్నారు? మమ్ము కొనుగోలుచేసిన మా భర్తలు ప్రాణవిహీనములైన వస్తువులవలె మాపట్ల ప్రవర్తిస్తున్నారు గదా? వారు చెల్లించిన శుల్కాన్ని స్త్రీ ధనంగా మాకు ఇయ్యక మీరే ఎందుకు అనుభవిస్తున్నారు? ఈలాటి దురాచా

రాలను సహించిన పక్షంలో ప్రభుత్వం భగవంతునిదృష్టిలో నేరం చేసినట్లై భావింప బడతారు గదా?

5. అనేక భార్యలను పెండ్లాడిన వానికి మమ్ము ఎందుకు అంటగడ్తు న్నారు? అనేక భార్యల పట్ల ఆలాటినాడు వాని ధర్మాన్ని నిర్వహించడం సాధ్యమా ?

6. భార్య చనిపోయిన తర్వాత భర్త పునర్వివాహం చేసుకొనడం న్యాయ మైతే భర్త చనిపోయిన తర్వాత భార్య పునర్వివాహం చేసుకొనడం ఎందుకు న్యాయం కాదు? పురుషునికిగల దాంపత్య సుఖవాంఛ స్త్రీకి లేదా? ఈలాటి ప్రకృతి విరుద్ధములైన ఆచారముల ద్వారా సంభవించే అనర్థాలను మీరు అరి కట్టగలరా ?

పై ప్రశ్నలకు న్యాయసమ్మతమైన సమాధానాలను ఇచ్చుటకు మీరు ప్రయత్నించి కరుణాళువులై మీ సన్నిహిత బంధువులు అనుభవిస్తున్న బాధల నుండి వారిని విముక్తి చేయండి. ఇదీ ఆలేఖలోని ప్రధాన విషయం.

ఈలాటి విలాపాలు వ్యర్థం కాలేదు. క్రమక్రమంగావిద్యాధికులైన సంఘ సంస్కర్తలు స్త్రీలకు జరుగుచున్న అన్యాయాలను నిర్మూలించుటకు గొప్ప కృషి సాగించాయి.

సనాతనులు వీరిని ప్రతిఘటించారు. సతీసహగమనము వంటి హృదయ విదారకమైన ఆచారాన్ని కూడా వీరు సమర్థించారు. వీరేశలింగం పంతులు వంటివారు స్త్రీలకు విద్యనేర్పడం అవసరమని ప్రచారం సాగిస్తూ ఉన్నప్పుడు స్త్రీ విద్య అనర్థాలకు దారితీయగలదని కొక్కొండ వెంకటరత్నం పంతులు మొదలైన వారు పత్రికల ద్వారా తిరుగు ప్రచారాన్ని కొనసాగించారు. అజ్ఞా నాంధకారంచే - ఆవరింపబడిన సామాన్య ప్రజలు వారి సంఖ్యాబలంతో సనాత నులకు సహాయపడే వారయ్యారు. ఇన్ని అవరోధాలు వారి కార్యక్రమాలకు అడ్డుతగిలినా సంస్కర్తలు ధైర్యాన్ని విడనాడక వారి ప్రచారాన్ని సాగిస్తూ సంస్కరణలను ప్రవేశపెట్టగలిగారు. తొలిదశలో ప్రభుత్వం కూడా వారి మాట లకు చెవియొగ్గి అవసరములైన శాసనాలను కూడా చేసింది.

సంస్కరణోద్యమం సతీసహగమన నిషేధాన్ని ప్రతిపాదించిన రామమో హన రాయ్‌తో 1818లో ప్రారంభమైంది. దీని ఫలితంగా గవర్నరు జనరల్ బెంటింక్ 1829లో సతీసహగమనాన్ని నిషేధిస్తూ శాసనం చేశాడు. సనాతనులు వేనకువేలు సంతకాలతో దానిని రద్దుచేయవలసినదిగా ఒక వినతి పత్రాన్ని బ్రిటన్ లోని అధికారులకు సమర్పించారు. ఆ పరిస్థితిలో రామమోహనరాయ్ స్వయంగా బ్రిటన్‌కు వెళ్లి, శాసనానికి సుముఖంగా ప్రచారం చేసి, శాసనానికి స్థిరత్వం కల్పించి, అచ్చటే మృతిజెందాడు.

శిశుహత్యా నిషేధాన్ని గురించి అధికారులే రాజస్థాన్‌లోను ఇతర ప్రాం తాలలోను క్షత్రియ నాయకులతోను మహారాజులతోను సంప్రతించి, నిషేధా నికి వారి అంగీకారాన్ని సంపాదించి, అటు తర్వాత దురాచారాన్ని నిషేధిస్తూ

శాసనం చేశారు. క్రమక్రమంగా 1870 నాటికి ఈ ఆచారం అదృశ్యమైంది.

1829లో సతీసహగమనాన్ని నిషేధిస్తూ శాసనం చేయబడిన తర్వాత బెంగాలులోని సంస్కర్తలు స్త్రీ పునర్వివాహ విషయమై గొప్ప ప్రచారాన్ని సాగించారు. ఇందులో కలకత్తా సంస్కృత కళాశాల ప్రధానాచార్యులైన ఈశ్వరచంద్ర విద్యాసాగర్ అగ్రస్థానం వహించాడు. స్త్రీ పునర్వివాహం శాస్త్ర సమ్మతమని ప్రాచీనకాలపు ధర్మశాస్త్రాల సహాయంతో రుజువుచేసి, 1850లో పునర్వివాహానికి అనుకూలంగా ఒక గ్రంథాన్ని ప్రచురించాడు. ప్రభుత్వంకూడా ఆయనతో సహకరించి 1856లో స్త్రీ పునర్వివాహానికి అనుకూలంగా శాసనం చేసింది. విద్యాసాగర్ ఈలాంటి వివాహాలు చేసుకొన్న వారికి ప్రత్యేక ఆర్థిక సహాయం చేస్తూవచ్చాడు. వితంతువుల విద్యాభివృద్ధికి తోడ్పడినాడు. వీటి ఫలితంగా పునర్వివాహముచేసికొన్న వితంతువులసంఖ్య ఎక్కువగా పెరగకపోయినా క్రమక్రమంగా ప్రజాభిప్రాయంలో మార్పు రాసాగింది. మహారాష్ట్రంలో విష్ణుశాస్త్రిపండితుడు, మద్రాసులోను ఆంధ్రప్రాంతంలోను వీరేశలింగంపంతులు గారు ఈ విషయమై గొప్ప కృషిచేశారు. అనేక వితంతు శరణాలయాలను స్థాపించారు ఈ వితంతువులందరు పునర్వివాహం చేసికొనకపోయినా, విద్యను నేర్చుకొని, ఏదోఒక ఉద్యోగంలో ప్రవేశించి, గౌరవంగా జీవితాన్ని సాగించగల వారయ్యారు.

1872 లో చేయబడిన దేశీయ వివాహ శాసనం (National marriage Act) బాల్యవివాహాల నిషేధానికి కొంతవరకు తోడ్పడింది.

ఇదేకాలంలో స్త్రీల విద్యకై గొప్ప కృషి జరిగింది. ఇందులో క్రైస్తవ మిషనరీలు మార్గదర్శకులైనా క్రమక్రమంగా హిందూసంఘంలోని నాయకులు దీనిపట్ల శ్రద్ధవహించి స్త్రీలకు ప్రత్యేకంగా అనేకవిద్యాలయాలను స్థాపించారు. సనాతనులు దీనిని ప్రతిఘటించినా ఫలితం వారికి దక్కలేదు. స్త్రీల విద్యా వ్యాప్తికి తోడ్పడినవారిలో ఈశ్వరచంద్రవిద్యాసాగర్, మహారాష్ట్రంలో కార్వే పండితుడు, ఆంధ్రలో వీరేశలింగం పంతులుగారు ప్రఖ్యాతిగాంచారు.

సంస్కర్తల కృషిఫలితంగా 20వ శతాబ్దం ప్రారంభమగునాటికి స్త్రీల స్థితి చాలావరకు మారింది. శాసనాలతో నిమిత్తంలేకుండానే ఇది జరిగింది. విద్యనార్జించిన స్త్రీలే ముందుకువచ్చి సంస్కరణకార్యక్రమాలను సాగించారు. ఘోషాపద్ధతి చాలావరకు సడలింది. స్త్రీల ఉద్ధరణ విషయంలో సనాతనుల ప్రతిఘటన తగ్గింది. మొత్తంమీద ఈ రంగంలో సంస్కర్తలు గొప్ప విజయాన్ని సాధించారు,

19వ శతాబ్దపు ఆఖరు భాగాననుండి దేశంలో ఏర్పడిన పరిస్థితులు ప్రచారంతో నిమిత్తం లేకుండానే సంస్కరణలకు దారితీశాయి. రైళ్ళలో ప్రయాణం చేసేవారు, బస్తీలలోని పూటకూటి ఇండ్లలో భోజనం చేసేవారు, నగరవాసం చేసేవారు, ఫ్యాక్టరీలు మొదలైనవాటిలో కలిసి పనిచేయవలసిన స్త్రీ పురుషులు, కార్మికులు, కులాచారాలను అనుసరించడం కష్టసాధ్యమైంది. వాటి తొలిబిగువు

క్రమక్రమంగా సడలింది. 20వ శతాబ్దంలో జరిగిన రాజకీయ సంస్కరణల మూలంగాను, అంబేడ్కరు మొదలైనవారు లేవదీసిన ఉద్యమాల ఫలితంగాను అస్పృశ్యులు ఆత్మగౌరవంకలవారై తక్కిన కులాలవారికి లోబడి జీవితాన్ని సాగించడం కొంతవరకు మానుకొన్నారు. ఎన్నికలలో వారి సహాయంకూడా అవసరం కావడంచేత వారిపట్ల గౌరవభావంతో ప్రవర్తించడం అగ్రకులాలవారికి అవసరమైంది. ఈ విధంగా బాహ్యాపరిస్థితులు మారడంచేత కులకట్టుబాట్లు సడలడం ఎంతవరకు సాధ్యమో అంతవరకు సడలినాయి. కులాలమధ్య చాలా వరకు సమానత్వం ఏర్పడింది. జరగవలసిన మార్పులు ఇంకా అనేకంఉన్నా అవి ప్రచారంతో నిమిత్తం లేకుండా పరిస్థితుల ప్రభావంచేత మారడం జరుగుతూవుంది.

చదువదగిన గ్రంథాలు :

Bharatiya Vidya Bhavan; Vol X.

Tarachand : History of Freedom Movement Vol II.

Hiemsath : Indian Nationalism and Hindu Social Reform.

అక్కిరాజు రమాపతిరావు : వీరేశలింగం పంతులు : సమగ్ర పరిశీలన.

వీరేశలింగం పంతులు : స్వీయచరిత్ర.

# అధ్యాయము - 6

## వార్తాపత్రికలు - జాతీయత

19వ శతాబ్దంలో జాతీయాభిమానాన్ని పెంపొందించడంలో వార్తాపత్రికలు గొప్ప పాత్రను వహించిన కారణంగా వాటిచరిత్రను తెలిసికొనడం అవసరం.

తొలిదశలో పత్రికలను స్థాపించి నడిపించినవారు అధికారేతర బ్రిటిష్ వారు. 1780లో వారిలో ఒకడు కలకత్తా నగరంలో ఒక పత్రికను ప్రారంభించాడు. తర్వాత మరికొందరు కలకత్తాలోను బొంబాయి మద్రాసులలోను కొన్ని పత్రికలను స్థాపించినారు. కాని ఇవి ఏవీ ఉన్నత స్థాయికి చెందినవికావు. దేశంలోని బ్రిటిష్‌వారు మాత్రమే వీటిని ఎక్కువగా చదివేవారు. ఈలాటి వారి సంఖ్య కూడా చాలా తక్కువ. వీరు బాధ్యతారహితంగా కంపెనీ పరిపాలన విధానాలను విమర్శించడమేగాక అధికారుల వ్యక్తి జీవితాలను దూషిస్తూ ఉండేవారు. ఇందుచేత పత్రికలపై నిర్బంధాలను విధించవలసిన అవసరం ఏర్పడింది. నిర్బంధాలకు లోబడనివారిని దేశాననుండి బహిష్కరించి బ్రిటిన్‌కు పంపివేసేవారు. ఈ పత్రికలు దేశీయుల సమస్యలపట్ల ఏలాటి శ్రద్ధను వహించ లేదు. వాటిమూలంగా దేశానికి ఏలాటి ప్రయోజనము చేకూరినది కాదు. కాని వాటిపై ప్రభుత్వం విధించిన నిర్బంధాలను నిరసిస్తూ పత్రికా స్వేచ్ఛ బ్రిటిష్ పౌరుల ప్రాథమిక హక్కులలో ప్రధానమైనదని వీరు ఉద్ఘాటించారు. ఈ ఉద్ఘాటన కాలక్రమాన భారతీయులపై ప్రభావం వహించింది. తాము కూడా బ్రిటిష్ పౌరులు కావడంచేత తమకుకూడా ఈలాటి హక్కు ఉన్నదనే భావం వారిలో వ్యాపించి, పత్రికా స్వేచ్ఛకై వారు పోరాటాన్ని సాగించడంలో ఒక ప్రధాన సాధనమైనది. ఈ పత్రికల మూలమున భారతీయులకు లభించిన గొప్ప ప్రయోజనము ఇది ఒక్కటే.

వార్తాపత్రికల చరిత్ర వాస్తవంగా 1818 నుండి ప్రారంభమైనదని చెప్పవచ్చు. కలకత్తా సమీపాన ఉన్న సిరాంపూరులోని క్రైస్తవ మిషనరీలు 1818 ఏప్రిలులో దిగర్శనమనే మాసపత్రికను — ఇందులో బెంగాలీ ఇంగ్లీషు భాషలు రెండూ వాడబడినాయి - మే నెలలో సమాచార దర్శనమనే బెంగాలీ వారపత్రికను స్థాపించినారు వీటిలో మొదటిది చాలాకాలం నిలబడలేదు. రెండవది మాత్రం అపుడపుడు అంతరాయాలకు లోబడినా 1851 వరకు

సాగింది. ఇందులో వారు వ్యవహారంలో ఉన్న బెంగాలీభాషను వాడి దాని అభివృద్ధికి పునాదులు వేసినారు. ఇదిగాక దీనిలో వారు మతానికి, సంఘసంస్కరణానికి, పాశ్చాత్య విజ్ఞానవ్యాప్తికి ప్రాధాన్యం కల్పించినారు. రాజకీయాల ప్రమేయం చాలా స్వల్పంగా ఉండేది. క్రైస్తవ మతవ్యాప్తియే దీనీ లక్ష్యంగా ఉండేది. 1818లో మిషనరీలే ఫ్రండ్ ఆఫ్ ఇండియా (Friend of India) అనే ఇంగ్లీషు పత్రికను స్థాపించినారు. ఇది పరిపాలన విషయాలలో బ్రిటిష్‌వారి మనోవైఖరిని వ్యక్తిపరచే ప్రధాన పత్రికగా రూపొందింది. 1875లో ఇది స్టేట్స్‌మన్ (Statesman) అనే ఇంకొక ప్రఖ్యాతపత్రికతో కలిసిపోయి ఇప్పటి వరకు సాగుతూఉన్నది.

భారతీయులచే నడుపబడిన మొదటి పత్రిక కలకత్తాలో 1818 మే నెలలో వెలువడిన బెంగాలీ గజట్ అనే వారపత్రిక. ఇది బెంగాలీ భాషాపత్రిక. కాని ఇది ఒక సంవత్సరంలో ఆగిపోయింది. అటుతర్వాత 1821లో సంవాద కౌముద అనే ఇంకొక వారపత్రిక వెలువడినది. దీనికి రామమోహనరాయ్ సంపాదకుడు కాకపోయినా, వారి రచనలు ఇందులో తరచుగా ప్రకటితములయ్యేవి. వాస్తవముగ వారే ఈ పత్రికను నిర్వహిస్తూ వచ్చారు. ఇది సతీ సహగమన నిషేధం మొదలైన సంస్కరణములను సమర్థించే పత్రికగా పరిణమించింది సంస్కరణములను ప్రతిఘటించిన సనాతనులు కొందరు దీనికి జవాబుగా సమాచార చంద్రిక అనే ఇంకొక పత్రికను స్థాపించినారు. ఈ విధంగా రెండు వర్గాలమధ్య స్పర్ధలు బయలుదేరి పత్రికల సంఖ్య పెరుగుటలో గొప్ప సాధనమైనది.

ఈలాటి పత్రికలలో రామమోహనరాయ్ ద్వారకానాథటాగోరు వంటి కలకత్తా ప్రముఖుల సహాయంతో స్థాపించిన వంగదూత ఒకటి. ఇది బెంగాలీ, పారసీకము, హిందీ ఇంగ్లీషు భాషలలో వెలువడినది. వేరే 1830 ప్రాంతాన ఇంకొక పత్రికను స్థాపించినారు. ఇదిగాక జ్ఞానాన్వేషిణి అనే వారపత్రిక ఈ వర్గానికి చెందినదే. ఇది ప్రభుత్వ విధానాలు కొన్నిటిని విమర్శించిన కారణంగా అధికారుల తీవ్రచర్యలకు గురిఅయినది. ఇదియు, ఎన్‌క్వైరర్ (Enquirer) అనే ఒక ఇంగ్లీషు పత్రికయు ఆనాటి యువకతరం వారి అభిప్రాయాలను వ్యక్తపరుస్తూ, వంగదేశ పునర్వికాసానికి ఎంతగానో తోడ్పడినవి.

సనాతనులు సాగించిన రెండవ పత్రిక సంవాద పూర్ణచంద్రోదయము. ఇది సాంస్కృత రాజకీయ మాసపత్రికగా ప్రారంభమై కొంతకాలము గడచిన తర్వాత దినపత్రికగా మారినది. సంవాద ప్రభాకరము అనే సనాతనుల పత్రికను ఈశ్వరచంద్రగుప్తుడనే ప్రఖ్యాత బెంగాలీ రచయిత స్థాపించినాడు. ఇదికూడా దినపత్రికగా మారినది. ఇది స్త్రీల విషయంలో ప్రాచీన సంప్రదాయాలను సమర్థించినట్టిది. బంకించంద్రుడు, నీల్‌దర్పన్ నాటకాన్ని రచించి ప్రఖ్యాతిగాంచిన దీనబంధుమిత్రుడు మొదలైనవారు ఇందులో వారి వ్యాసాలను ప్రచురించి ప్రజల ఆదరణకు అది పాత్రమగుటలో ఎక్కువగా సహాయపడినారు.

19 శతాబ్ద ప్రారంభాన కొంత కాలమువరకు పారసీక భాష అధికారభాషగా ఉండినది. ప్రముఖ వర్గాలవారు దీనితో పరిచయము సంపాదించియుండిరి. ఈ కారణముచేత పారసీకభాషలో కలకత్తా, లక్నో, ఢిల్లీ మొదలైన నగరాలలో కొన్ని పత్రికలు వెలువడినవి. వాటిలో కలకత్తాలో ఒకదానిని 1822 లో రామమోహనరాయ్ స్థాపించినాడు. దాని మొదటి సంచికలో దేశీయ పత్రికల ఆశయాలు ఏలాటివిగ ఉండవలెనో ఆయన వివరించాడు. భారతీయుల విజ్ఞానాభి వృద్ధికి అవి తోడ్పడవలెనని, ఆనాడు అమలులో ఉన్న శాసనాలతోడను పరిపాల కుల సంప్రదాయాలతోడను ప్రజలకు పరిచయము కలిగించవలెననీ, ప్రజల వాస్తవ పరిస్థితినీ వారు ఎదుర్కొనే కష్టాలనూ ప్రభుత్వానికి తెలియపరచి వాటిని తొలగించుటకు చేయదగిన సంస్కరణములను అధికారులకు సూచించవలెననీ అతడు ఉద్ఘాటించాడు. అతడు ఈ లక్ష్యాలను సాధించుటకు సర్వవిధాలా ప్రయత్నంచేసి, ఇతర పత్రికా సంపాదకులకు మార్గదర్శి అయ్యాడు. ఇతర దేశీయ పత్రికలు చాలావరకు ఆయన అడుగుజాడలలోనే నడిచినవి. ఆ కాలపు విద్యాధికులందరివలెనే ఆయన బ్రిటిష్ పరిపాలనను తన పత్రికలలో సమర్థించి అది చాలా కాలం వర్ధిల్లితేగాని దేశం పురోగమించడం సాధ్యంకాదనే అభిప్రా యాన్ని వ్యక్తంచేశాడు. బ్రిటిష్ పరిపాలనమూలంగా నెలకొన్న శాంతిభద్రత లను, ప్రజలకు అధికులు అల్పులు అనే భేదంలేకుండా లభించిన న్యాయ సమత్వాన్ని ప్రత్యేకంగా ప్రశంసించాడు. ఢిల్లీ మొదలైన నగరాలలోని పారసీక పత్రికలు, ఉర్దూ పత్రికలు బ్రిటిష్ పరిపాలనను తీవ్రంగా విమర్శించినా ఆయనకు ఆలాటి విమర్శ ఎంతమాత్రమూ రుచించలేదు.

ఆ కాలంలో వెలువడిన హిందీ పత్రికలలో మొదటిది కాన్పూరు నుండి 1826 లో ప్రకటితమైన ఉదంతమార్తాండము. కాలక్రమాన హిందీ పత్రికల సంఖ్య పెరిగింది.

1830 నాటికి కలకత్తాలో మూడు బెంగాలీ దినపత్రికలు పదమూడు ఇంగ్లీషు పత్రికలు ఉండినవి. 1835 లో తాత్కాలిక గవర్నరు జనరలుగా అధికా రంలో ఉండిన మెట్కాఫు పత్రికలపై నిర్బంధాలను చాలావరకు సడలించిన కారణంగా దేశంలోని వార్తా పత్రికల సంఖ్య అభివృద్ధిగాంచింది. 1857 నాటికి వాటి సంఖ్య నూటికి మించినది. వీటిలో మతము, నీతి, ప్రాచీన సంప్రదాయాలు, ఆధునికులు తలపెట్టిన సంస్కరణములు, సారస్వతము, పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రము, ఆర్థికవ్యవహారాలు, పరిపాలన విధానాలు, ప్రపంచ చరిత్ర మొదలగు వివిధ విషయాల వివరణ ఉండేవి. ఈ విధంగా అవి ప్రజల జ్ఞానాభివృద్ధికి ఎంత గానో తోడ్పడినవి. వీటిలో ఆనాటి ప్రజాభిప్రాయము వ్యక్తమయ్యేది. ఇందులో బెంగాలు రాష్ట్రము అగ్రస్థానాన్ని నాయకత్వాన్ని వహించగలిగింది.

బొంబాయి రాష్ట్రంలో పత్రికా రచన అంత చురుకగా జరగకపోయినా 1822 నుండి అనేక పత్రికలు వెలువడినవి. ఇందులో పార్శీలు నాయకత్వాన్ని వహించి గుజరాతీ భాషలో 1831 నాటికి అయిదు పత్రికలను ప్రకటించినారు.

అటుతర్వాత గొప్ప ప్రఖ్యాతి సంపాదించిన గుజరాతీ పత్రిక దాదాభాయి నౌరోజి సంపాదకత్వాన 1851 లో వెలువడిన రస్తగపతరు (Rast Gaftar) అనే పక్షపత్రిక. బొంబాయిలో బాలశాస్త్రి జంభేకర్ 1832 లో స్థాపించిన బొంబాయి దర్పణము మొదటి మరాటీభాషా పత్రిక. ఆంగ్ల సారస్వతములోని విశిష్టతను దేశీయులకు తెలియపరచుట, దేశ శ్రేయస్సుకు ప్రజల సౌభాగ్యానికి సంబంధించిన విషయాల గురించి చర్చలు సాగించి వాటి ప్రాధాన్యాన్ని ప్రజల దృష్టికి తెచ్చుట, తన పత్రికయొక్క లక్ష్యమని మొదటి సంచిక సంపాదకీయములో అతడు స్పష్టపరచాడు. దీనిని సాధించుటకై అతడు గొప్ప ప్రయత్నము చేసి చాలవరకు ఫలితము పొందగలిగాడు. కాని ఈ పత్రిక 1840 లో ఆగిపోయినది. అయినా అతడు ఆ సంవత్సరంలో దిగ్దర్శని అనే మాసపత్రికను ప్రారంభించి కొంతకాలం సాగించినాడు. అతని సహచరులలో ఒకడైన భావ్ మహాజన్ ప్రభాకర్ అనే పత్రికను విడుదల చేసినాడు. 1842 లో క్రైస్తవ మిషనరీలు జ్ఞానోదయమనే పత్రికను స్థాపించినారు. 1848 ప్రకటితమైన జ్ఞానప్రకాశిక పూనాలో మొదటి మరాటీ పత్రిక.

మద్రాసు రాష్ట్రంలో పత్రికల ప్రకటన చాలా మందకొడిగా సాగినది. తొలిదశలో ఇతర రాష్ట్రాలలో జరిగినట్లే ఇక్కడకూడా అధికారేతర బ్రిటిష్‌వారు కొన్ని పత్రికలను స్థాపించి అధికారుల క్రోధానికి గురి అయినారు. 1847 నాటికి ఇంగ్లీషులో ఒక దినపత్రిక, వారానికి మూడు పర్యాయాలు వెలువడే మూడు పత్రికలు, రెండు పర్యాయాలు వెలువడే పత్రికలు రెండూ ఉండినవి. రెండు పర్యాయాలు వెలువడే పత్రికలలో "క్రెసెంటు" (Crescent) ఒకటి. ఆనాడు మద్రాసులో ప్రజల హితమునకై అనేక ఉద్యమములలో పాల్గొనుచుండిన గాజుల లక్ష్మి నరసు శెట్టి 1844లో దీనిని స్థాపించి నిర్వహించాడు. క్రైస్తవ మిషనరీల ప్రచారమును ఎదుర్కొనుటలోను, ఉద్యోగుల అక్రమములను విమర్శించడములోను ఈ పత్రిక ద్వారా అతడు అపారమైన కృషిగావించినాడు. 1857కు పూర్వం వెలువడిన తెనుగు పత్రికలలో వృత్తాంతిని (1838-51), వర్తమాన తరంగిణి (1842-68) ప్రధానంగా పేర్కొనదగినవి. ఆ రోజులలో పత్రికలకు చందాల మూలంగా వచ్చే ఆదాయం చాలాతక్కువగా ఉండడం చేత వృత్తాంతిని నిలిచిపోయినట్లును, వర్తమాన తరంగిణిలో మంచికాగితాలను వాడడము కష్టసాధ్యమైనట్లును తెలియవస్తున్నది. ఆనాటి ప్రభుత్వ విధానాలు ప్రాజ్ఞతతో కూడుకొన్నవైనప్పటికి వాటిని గురించి తెనుగు పత్రికలలో ఆక్షేపణలు జరుగుతున్నవనీ హిందువులు ఈ విషయంలోనేగాక ఇతర విషయాలలో కూడా అనేక దురభిప్రాయాలాకు గురి అవుతున్నారని బౌరిన్ దొర వ్యాఖ్యానించి, దానికి ఉదాహరణంగా వర్తమాన తరంగిణిని పేర్కొన్నాడు. ఈ పత్రిక బ్రిటిష్ ప్రభుత్వము ముస్లింల ప్రభుత్వానికంటె ఉత్తమమైనప్పటికీ ఇందులో అనేక లోపములు ప్రవేశించినట్లు అభిప్రాయపడి ఆ సందర్భంలో ఇతర పత్రికల అభిప్రాయాలను కూడా ప్రకటించినది.

ఉత్తరహిందూస్థానములో బ్రిటిష్ పరిపాలన స్థాపితమగుటకు చాలా కాలము పట్టెను. 1849లో గాని పంజాబు పూర్తిగా వారి వశమునకు రాలేదు. అందుచేత ఈ ప్రాంతంలో పత్రికల ప్రకటన ఆలస్యంగా జరిగినది. 1857 నాటికి ఢిల్లీ, కాన్పూరు, మీరట్టు, వారణాసి మొదలైన నగరాలలో ఇంగ్లీషులో ఏడు పత్రికలు సాగుతూ ఉండినవి. ఇవిగాక పారసీక ఉర్దూ భాషలలో 16 పత్రికలు నిర్వహింపబడినట్లు ఒక అంచనా. హిందీలోకూడా కొన్ని పత్రికలు ప్రకటితములగుచుండెను.

1818-58 మధ్య వెలువడిన పత్రికలు ప్రజలపై ఎంతటిప్రభావము వహించెనో అంచనా వేయడము కష్టసాధ్యము. పత్రికలకు చందాల చెల్లించ గలవారి సంఖ్య చాలా స్వల్పంగా ఉండేది. ప్రకటనల మూలంగా వాటికి ఎక్కువ ఆదాయం లభించే అవకాశం ఉండేదికాదు. అందుచేతనే వాటిలో అనేకం అకాల మరణానికి గురి అయినవి. ఈ పరిస్థితులలో వాటి ప్రభావం చాలా స్వల్పంగా ఉండేదని కొందరి అభిప్రాయము. కాని చందాదారుల సంఖ్య ఎక్కువకాక పోయినా పత్రికలను చదివేవారి సంఖ్య ఎక్కువగానే ఉండినదనీ, ఆకారణం చేత వాటి ప్రభావం ఎక్కువగానే ఉండినదనీ మరికొందరి అభిప్రాయం. రెండవ అభిప్రాయంలోనే ఎక్కువ సత్యం ఉన్నట్లు చెప్పవచ్చును.

ఈ కాలంలో వార్తా పత్రికలను నడిపిన భారతీయులు బ్రిటిష్ పరిపాలన పట్ల పూర్తి విశ్వాసం కలవారు. పరిపాలనలోని లోపాలను మాత్రం వారు విమర్శిస్తూ వాటిని తొలగించుటకు జరగవలసిన సంస్కరణములను సూచిస్తూ ఉండేవారు. కాలక్రమాన ఆంగ్లేయ సాంమ్రాజ్యంలో తెల్లవారు నివసించే వలస రాష్ట్రాలలోని స్వపరిపాలన విధానమును బ్రిటిష్‌వారు భారతదేశంలోకూడా ప్రవేశ పెట్టగలరని వారు నమ్మినవారు, స్వాతంత్ర్య సంపాదనము పట్ల, విప్లవ తత్వము పట్ల వారు విముఖులుగా ఉండిరి. ఈ మనోభావం వారి పత్రికలలో ప్రస్ఫుటమౌతూ వచ్చినది. ఇంతేగాక వారు పత్రికలను ఎక్కువగా మత సంస్కరణము సంఘ సంస్కరణము పాశ్చాత్య విజ్ఞాన వ్యాప్తిని గురించి ప్రచారము గావించుటకు వినియోగించిరి. ఇది వారు నిర్వహించిన దేశభాషా పత్రికలకే గాక ఇంగ్లీషు పత్రికలకు కూడా ప్రధాన లక్షణమైనది.

ఈకాలంలో బ్రిటిష్ వారు ఇంగ్లీషులో అనేక పత్రికలను నిర్వహించినారు. వీటికి వ్యవహారంలో ఆంగ్లోయిండియన్ పత్రికలనే పేరు లభించినది, వాటిలో ఫ్రండ్ అవ్ ఇండియా (Friend of India), హర్కారు (Harkaru), ఇంగ్లీషు మాన్ (English man), బాంబే టైంసు (Bombay Times), మద్రాసు యునైటెడ్ సర్వీసుల గజెటు (Madras United Services Gazette), లాహోరు క్రానికల్ (Lahore Chronicle), సిటిజన్ (Citizen), మద్రాసు స్పెక్టేటర్ (Madras Spectator) ప్రాధాన్యాన్ని వహించినట్టివి. అధికారులపై వీటి ప్రభావం ఎక్కువగా ఉండేది. అధికారేతర బ్రిటిష్‌వారు కూడా వీటిచే ప్రభావితులైనారు.

వీటిధోరణి భారతీయుల ప్రయోజనాలను వృద్ధి చేయుటకాదు. బ్రిటిష్ పరిపాలనను సుస్థిరపరచడమూ, అనధికార బ్రిటిష్ వర్తకులు, తోటయజమానులు, పారిశ్రామికులు మొదలైనవారి లాభాలకూ సదుపాయాలకూ రక్షణ కల్పించడమూ, వీటి ప్రధాన లక్ష్యాలు. బెంటింగ్‌కు దేశీయులకు ఉద్యోగాలలో ఎక్కువగా ప్రవేశము కల్గించుటను ఇవి తీవ్రముగా ఖండించినవి. అవకాశము లభించినపుడంతా దేశీయుల పట్ల ఈలాటి మనోవైఖరిని ఇవి ప్రదర్శిస్తూ ఉండేవి. ఉన్నతాశయాలుగల మెకాలే వంటివారు ఈ వైఖరిని ఆక్షేపించడము ఈ సందర్భంలో గుర్తించదగినది.

ఈ ధోరణి 1857–58 తిరుగుబాటు కాలములో అన్ని హద్దులను అతిక్రమించి తారాపథాన్ని అందుకొన్నది. సిపాయీలలో కొందరు తిరుగుబాటు చేసిన కారణంగా భారతీయులందరు ప్రభుభక్తి లేని వారనీ, వారిలో తిరుగుబాటు మనస్తత్వం పూర్తిగా నాటుకొన్నదనీ, వారందరినీ తిరిగి తలఎత్తకుండా అణచివేయడమే అధికారుల కర్తవ్యమనీ, అందుకుగాను లక్షలాది జనాన్ని హత్యజేసినా ఏలాటి అన్యాయము లేదనీ ఈ పత్రికలు ప్రచారాన్ని సాగించి, కొందరు సైనికాధికారుల రాక్షసకృత్యాలను సమర్థించినవి. ఆనాటి గవర్నరు జనరల్ క్యానింగు ప్రజలను భూస్వాములను శాంతింపజేయుటకు తీసుకొన్న చర్యలను అవి పూర్తిగా ఖండించినవి. దేశీయవార్తా పత్రికలలో ఏవో కొన్ని ఇదేవిధంగా బ్రిటిష్ పరిపాలన పట్ల ద్వేషాన్ని ప్రచారం చేసినవి. ఈ పరిస్థితులను గమనించి ఒక సంవత్సరకాలం పత్రికలన్నిటిపై గవర్నరు జనరల్ కఠిన నిర్బంధాలను విధించి అమలుపరచవలసి వచ్చింది.

ఈ విధంగా మొత్తంమీద దేశంలోని వార్తా పత్రికలలో భారతీయుల సంపాదకత్వాన ఉండిన పత్రికల మనోవైఖరిలోను ఆంగ్లోఇండియన్ పత్రికల మనోవైఖరిలోను 1818--58 మధ్య గొప్ప భేదం ఏర్పడినట్లు చెప్పవచ్చును; ఇది కాలక్రమాన వృద్ధిగాంచిందే గాని తగ్గలేదు.

## 2

1858 తర్వాత దేశీయ పత్రికలయొక్కయు ఆంగ్లో ఇండియన్ పత్రికలయొక్కయు ధోరణి పూర్తిగా మారినది. దేశీయ పత్రికలలో జాతీయాభిమానం వృద్ధిగాంచి, అతివాదానికి దారితీసింది. ఆంగ్లో ఇండియన్ పత్రికలలో జాత్యహంకారం పెరిగి భారతీయులపట్ల విరోధభావం ఉచ్ఛస్థాయిని అందుకొన్నది. దేశీయ పత్రికలు ఉత్తర ధృవంలోను, ఆంగ్లో ఇండియన్ పత్రికలు దక్షిణ ధృవంలోను ఉన్నట్లు అనిపించింది. వాటిమధ్య ఏలాటి సామరస్యంలేక పోయింది.

ఆనాటి దేశీయ పత్రికలలో కొన్ని గొప్ప ఖ్యాతిని సంపాదించగలిగినవి. వాటిలో మొదటిది హిందూ పేట్రియట్ (Hindu Patriot). దీనిని కలకత్తాలో ఘోసు సోదరులు ముగ్గురు 1853 లో స్థాపించినారు. అది త్వరలోనే హరిష్

చంద్రముఖర్జీ సంపాదకత్వంలోకి వచ్చి ఆనాటి పత్రికలలో అగ్రస్థానాన్ని వహించగలిగినది. అతడు అధికారులకు భయపడక స్వతంత్రంగా ప్రభుత్వ విధానాలను విమర్శించేవాడు. కాని అతనిది అతివాద ధోరణికాదు. సమభావంతో గుణదోషాలను వ్యక్తపరచేవాడు. ప్రభుత్వ విధానాలను విమర్శించవలసినప్పుడు మొగమాటంలేక విమర్శించినా వాటిని సమర్థించవలసినప్పుడు ప్రజాభిప్రాయానికి భిన్నంగాకూడా సమర్థించేవాడు. ఈ కారణంచేతనే గవర్నరు జనరల్ డల్‌హౌసీ చేసిన పునర్వివాహ చట్టాన్ని సమర్థించాడు. 1857-58 తిరుగుబాటులో భారతీయులు పాల్గొనడం ప్రాజ్ఞతకాదన్నాడు. కాని బ్రిటిష్ సైనికాధిపతుల రాక్షసకృత్యాలను ఖండించాడు. అప్పటి గవర్నరు జనరల్ ప్రజలపట్ల శాంతివిధానాన్ని అనుసరించడంచేత ఆంగ్లోఇండియన్ పత్రికల ఖండనలకు గురికాగా ఆ విధానమే ఉత్తమమైనదని అతనిని పూర్తిగా సమర్థించినాడు. 1860 లో బెంగాలులో నీలిమందు తోటల తెల్లయజమానులు పెట్టు బాధలను భరించలేక రైతులు సాత్వికనిరోధ పద్ధతిని తిరుగుబాటుచేశారు. ఆ సందర్భంలో అతడు రైతుల పక్షము వహించి, వారితరపున ప్రభుత్వానికి అనేక మహజర్లలను సమర్పించి వారికి సర్వవిధాలా తోడ్పడి ప్రభుత్వ విధానాలలో మార్పు తేగలిగినాడు. మార్పుజరగని పక్షంలో ఇది గొప్ప విప్లవముగా రాష్ట్రమందంతా వ్యాపించడం తప్పదని అన్నాడు. ఈ విధంగా తన పత్రిక సాధనాన ప్రజలకు అఖండ సేవజేసి 36 వ ఏట 1860 లో అకాలమృత్యువుకు గురిఅయినాడు.

అతని తర్వాత పత్రికను నడిపే బాధ్యతను కృష్ణదాసుపాల్ వహించాడు. ఇతడుకూడ కడుస్వేచ్ఛతోను సమభావంతోను పత్రికను సాగించి ప్రజల మన్ననలనేగాక ప్రభుత్వ ప్రశంసలనుకూడ అందుకోకలిగినాడు. 1874 లో భారతదేశానికి ఆంతరంగ స్వపరిపాలనను (Home Rule) బ్రిటిష్‌వారు ప్రసాదించవలసిన ఆవశ్యకతనుగూర్చి ప్రచారం చేశాడు. తెల్లవారు నివసించే వలసలకు ఆలాటి పరిపాలన లభించినప్పుడు వాటికంటె విస్తీర్ణంలోనూ జనసంఖ్యలోనూ ఎన్నిరెట్లో పెద్దదైన భారతదేశానికి అది లభించకపోవడము అన్యాయమని ఉద్ఘాటించాడు. భారతదేశపు నాగరికత సంస్కృతి బహుప్రాచీనమైనదనిన్నీ పాశ్చాత్య సంస్కృతికంటె కొన్ని విషయాలలో ఉత్తమమైనదనిన్నీ చెప్పి తన వాదాన్ని సమర్థించాడు. దానిని సంపాదించుటకు ప్రజలు సర్వవిధాలా ప్రయత్నము చేయవలసినదిగా అర్థించాడు. హిందూ పేట్రియట్ మితవాదులైన భూస్వాముల పక్షాన ప్రకటితమగుచున్న పత్రిక. అయినా అతడు ఈలాటి కోరికను వ్యక్తపరచాడు. ఇది దేశీయులనేకులకు విస్మయం కలిగించింది. ప్రభుత్వం దాని అసమ్మతినికూడా తెలియపరచింది. కాని అతడు ఏమీ జంకలేదు. 1905 తర్వాతగాని దేశంలో స్వరాజ్య సంపాదన ప్రజల లక్ష్యము కావలెననే నినాదము బయలుదేరలేదు. అంతకు 30 సంవత్సరాలకు పూర్వమే దీనిని గురించి కృష్ణదాసుపాల్ ప్రచారం చేయడం జాతీయత బలపడుతున్నదానికీ, పత్రికలు ఏ విధంగా దానికి దోహదం కల్పించుచుండిన దానికీ ప్రబల నిదర్శనము,

అతడు 23 సంవత్సరాల కాలం పేరుప్రతిష్టలతో పత్రికను నిర్వహించినాడు.

బెంగాలులో ప్రసిద్ధిగాంచిన పత్రికలలో రెండవది 1861లో ప్రారంభమైన ఇండియన్ మిరర్ (Indian mirror). ఇది వారపత్రికగా ప్రారంభమై కొంత కాలం తర్వాత దినపత్రికగా మారింది. ఇది ప్రథమదశలో బ్రహ్మసమాజ సిద్ధాంతాలను ప్రచారంచేసే పత్రికగా ఉండి కాలక్రమాన రాజకీయాలను చర్చించ సాగినది. ఇది నరేంద్రనాథ్ సేన్ సంపాదకత్వాన భారతీయుల హక్కులను రక్షించుటలోను ప్రభుత్వాననుండి వారికి లభించవలసిన సదుపాయాల సూచించి వివరించడంలోను గొప్పపాత్రను వహించింది.

1868లో శిశిరకుమారఘోసు సంపాదకత్వాన స్థాపితమైన అమృతబజారు పత్రిక కొంతకాలానికి పత్రికలన్నిటిలో అగ్రస్థానాన్ని గడించ గలిగింది. ఇది ప్రథమంలో బెంగాలీ భాషా వారపత్రికగా ఉండి తర్వాత ద్విభాషా (బెంగాలీ, ఇంగ్లీషు) పత్రికగామారి, 1878లో దేశభాషా పత్రికలపై లిట్టన్ప్రభువు విధించిన ప్రత్యేక నిర్బంధాలనుండి తప్పించుకొనే ఉద్దేశంతో ఇంగ్లీషు భాషాపత్రికగా రూపొందింది. 1891లో ఇది దినపత్రికగా అవతరించి ఈనాటివరకు ప్రఖ్యాతి గాంచిన అఖిలభారత పత్రికలలో ఒకటిగ దేశీయుల ప్రశంసకు పాత్రమైనది. ఇది బ్రిటిష్‌వారి జాత్యహంకారాన్ని, భారతీయులపై వారుగావించే అత్యాచారాలను తీవ్రంగా ఖండిస్తూ, దీనికంతకు విరుగుడు భారతదేశంలో పార్లమెంటరీ పరిపాలన విధానాన్ని ప్రవేశపెట్టుటయే అని 1870లో దాని అభిప్రాయాన్ని వ్యక్తంచేసి, అదిమొదలు అవకాశము లభించినప్పుడంతా దానిని ప్రచారం చేసింది. అది బెంగాలులోని ప్రజలపైననేగాక అన్ని రాష్ట్రాలలోని ప్రజలపై అత్యంత ప్రభావాన్ని వహించ గలిగింది.

భారతీయులకూ బ్రిటిష్‌వారికీ మధ్య పొత్తుకుదురుట అసంభవమని అది పదేపదే ఉద్ఘాటించింది. ఈఉద్ఘాటన అది బెంగాలీ భాషాపత్రికగ ఉన్నరోజులలోనే మొదలైనది. 1878లో లిట్టన్ప్రభువు చేసిన వార్తాపత్రికల చట్టం ప్రధానంగా ఆ పత్రికను ఉద్దేశించినట్టిది అని అప్పటివారు భావించిరి.

బ్రిటిష్ వారి దుష్పరిపాలనను అంతరింప జేయుటకు బెంగాలీలు కృతనిశ్చయులై ఉన్నారని, వారిని అణచివేయుటకు అధికారులు అదేవిధంగా దృఢ సంకల్పులై ఉన్నారని, అధికారులను ఎదుర్కొను సందర్భంలో వేలాది బెంగాలీలు ప్రాణత్యాగం చేయుటకు సిద్ధపడి ఉన్నారని, భగవంతుడు బలహీనుల పట్ల పక్షపాతి కావడం చేత వారికి విజయం తప్పక లభించగలదని ఉద్రేకపూరితంగా రచనలను సాగించింది.

ఈ ధోరణి ఇతర బెంగాలీ పత్రికలలో కూడా వ్యక్తమైనది. ఆ సందర్భంలోనే "జాతివైరత" అనేమాట బ్రిటిష్ భారతీయుల మధ్య పరిణమించుచున్న సంబంధాన్ని తెలియపరచుటకు వ్యవహారంలోకి వచ్చింది. సుప్రసిద్ధ రచయిత బంకించంద్రుడు ఈ ధోరణిలోనే కొన్ని పత్రికలకు వ్యాసాలు వ్రాశాడు. తన సంపాదకత్వాన వెలువడిన వంగదర్శనంలో దీనిని విపులపరచాడు.

ఈలాటి మనో వైఖరితో సాగిన ఇంకొకపత్రిక "బెంగాలి" (Bengalee) ఇది ఇంగ్లీషు భాషాపత్రిక. 1879లో సురేంద్రనాధ బ్యానర్జి దీనికి సంపాదకుడై అమృతబజారు పత్రికతో సమానంగా జాతీయాభిప్రాయాన్ని బలపరచాడు. ప్రధానంగా భారతీయులకు ఉన్నతోద్యోగాలన్నిటిలో బ్రిటిష్ వారితో సమానంగా ప్రవేశము లభించవలసిన అవసరాన్ని ఈ పత్రిక ద్వారా ఉద్ఘాటించాడు.

ఇంతటి తీవ్ర ధోరణిలో కాకపోయినా, జాతీయ దృక్పధాన్ని బలపరచుటకు, సామాన్యప్రజలు అనుభవించు కష్టాలను ప్రభుత్వ దృష్టికి తెచ్చి, వాటిని తొలగించుటకు సాధనాలను సూచించుటకు, ప్రజల సహకారంతో పరిపాలనను సాగించవలసినదిగా ప్రభుత్వాన్ని ప్రోత్సహించుటకు, అందుకుగాను భారతీయులను శాసన సభలలోను ఉన్నతోద్యోగాలలోను నియమించవలసినదిగా అధికారులను ప్రోత్సహించుటకు, 1858లో విక్టోరియా మహారాణి తన ప్రకటన ద్వారా చేసిన వాగ్దానాలను చెల్లించవలసినదిగా వారిని కోరుటకు, మద్రాసు లోని ప్రముఖులు కొందరు "హిందూ" పత్రికను స్థాపించినారు. ఇదిప్రథమంలో ఇంగ్లీషు వారపత్రికగా ఉండి, తర్వాత దినపత్రికగా మారి, ఇప్పటివరకు పేరు వడసిన పత్రికలలో ఒకటిగా సాగుచున్నది. దీనికి జి. సుబ్రహ్మణ్య అయ్యరు మొదటి సంపాదకుడు. వీరే కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత తమిళములో స్వదేశ మిత్రన్ అనే పత్రికను స్థాపించినారు. ఈ రెండు పత్రికలు దక్షిణ భారత ప్రజలలో రాజకీయాల పట్ల ఆసక్తిని కలిగించుటలోను వారిలో జాతీయాభి మానాన్ని బలపరచుటలోను ప్రధాన సాధనాలుగా పనిచేసినవి.

ఈ కాలంలో అన్ని రాష్ట్రాలలో దేశీయ పత్రికల సంఖ్య చురుకుగా పెరిగినది. 1876 నాటికి బొంబాయి రాష్ట్రంలో మరాటి, గుజరాతి, హిందూస్థాని, పారశీక భాషలలో 62, ఈనాటి ఉత్తరప్రదేశ్‌లోను మధ్యప్రదేశ్‌లోను 60, బెంగాలులో 28, మద్రాసులో 19 ఉన్నట్లు ఒక అంచనా. సుమారు లక్ష మంది వాటికి చందాదారులుగా ఉండిరి. కాని వాటిని చదివేవారి సంఖ్య ఇంత కంటె ఎక్కువగా ఉండెను. వాటిలో ప్రాబల్యాన్ని వహిస్తున్న అతివాదధోరణి ప్రభుత్వ భయసందేహాలకు గురియై కొన్ని సంవత్సరాలనుండి వాటిలో ప్రచురితములయ్యే ప్రధాన రచనలను ఇంగ్లీషులోకి వారంవారం తర్జుమా చేసి రాష్ట్ర ప్రభుత్వాలకు, కేంద్ర ప్రభుత్వానికి అందజేయుటకు ప్రతిరాష్ట్రంలో ఒక ప్రత్యేక అధికారిని నియమించారు. అప్పటినుంచి అనేక సంవత్సరాలకాలం ఈ ఏర్పాటు అమలులో ఉండి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనుటలో ప్రభుత్వానికి గొప్పసాధనమైనది. ఇది దేశభాషలలో వెలువడిన పత్రికల ప్రాధాన్యానికి ఒక గొప్ప తార్కాణము.

బొంబాయి రాష్ట్రంలో వివిధ భాషలలో ప్రకటితములైన పత్రికలు 1858 తర్వాత తొలిదశలో మతము, సంఘసంస్కరణము, విజ్ఞాన వ్యాప్తికి ప్రాధాన్యం కల్పించినా త్వరిత కాలంలోనే రాజకీయాల వైపు దృష్టిని మరలించినవి. వాటిలో పూనాలో ప్రకటితములైనవి అతివాద ధోరణిని అనుసరించినవి.

1818 వరకు మహారాష్ట్రులు బ్రిటిష్ వారితో సమానంగా సామ్రాజ్య సంపాదనకై పోటీ పడడం దీనికి ప్రధానకారణం. ఈలాటి పత్రికలలో బాలగంగాధర తిలక్ స్థాపించిన కేసరి, మరాటా అనే పత్రికలు అగ్రస్థానాన్ని వహించినాయి. కేసరి మరాటి భాషలోను, మరాటా ఇంగ్లీషు భాషలోను ప్రకటితము లైనట్టివి. 1881లో వీటిని కొందరు స్నేహితుల సహాయంతో తిలక్ ప్రారంభించినా, 1887లో కేసరి, 1891లో మరాటా అతని స్వాధీనంలోకి పూర్తిగా వచ్చినవి. వాటికి సంపాదకుడై పేరు ప్రఖ్యాతులతో వాటిని నడుపగలిగాడు.

"స్వరాజ్యం నా జన్మహక్కు. దానిని ఎలాగైనా సంపాదించి తీరుతాను" అని భారతీయులకు అతడు బహూకరించిన నినాదానికి అనుగుణంగా వీటిని నిర్వహించాడు. వీనిలో ప్రచురితములైన రచనలు రాజద్రోహమును జాతిద్వేషమును పురికొల్పు నట్టివిగా ఉన్నదనే నేరానికి 1897లో 18 నెలల కారాగార శిక్షను, 1908-14లో ఆరు సంవత్సరాల ద్వీపాంతర వాస శిక్షను అతడు అనుభవించాడు. ఈ పత్రికల ద్వారా స్వాతంత్ర్య సమరంలో కొద్దిమంది విద్యార్థులేగాక సామాన్య ప్రజలుకూడా అధిక సంఖ్యలో పాల్గొనవలెనని, అప్పుడు గాని సమరం విజయవంతము కాజాలదని ప్రచారము సాగించి వారిలోకూడా రాజకీయాల పట్ల ఆసక్తిని జాతీయాభిమానమును వృద్ధిచేశాడు. ఈ పత్రికల ప్రభావము దేశవ్యాప్తి గాంచినది.

ఈ విధంగా 1858కి పూర్వం వెలువడిన పత్రికలకు 1858 తర్వాత వెలువడిన వాటికీ గొప్ప భేదం ఏర్పడింది. ఇది ప్రజల మనోభావాలలో ఏలాటి పరిణామం సంభవించిందో స్పష్టపరుస్తూ ఉంది.

1858 తర్వాత ఆంగ్లో ఇండియన్ పత్రికల ధోరణికూడా మారింది. 1857_58లో సంభవించిన తిరుగుబాటును బ్రిటిష్‌వారు పూర్తిగా అణచివేయగలిగిన కారణంగా వారిని ఎదిరించి నిలబడగల వారు దేశంలో ఎవరూ లేరనీ, తాము ఏలాటి విధానాలను అనుసరించినా భారతీయులు లొంగి పోతారేగాని తిరిగీ తిరుగుబాటు ప్రయత్నం చేయజాలరనీ వారిలో అభిప్రాయం నాటుకొన్నది. దీనిఫలితంగా వారిలో జాత్యహంకారం ముదిరింది. ఈ మనోవైఖరిని ప్రదర్శించుటలో ఆంగ్లో ఇండియన్ పత్రికలు ప్రధాన పాత్రను వహించినాయి.

1861లో బొంబాయి టైంసు, టైంసు ఆఫ్ ఇండియా (Times of India) గా మారింది అదే కాలంలో వెలువడిన పత్రికలలో అలహాబాదులోని పైనియర్ (Pioneer 1865), మద్రాసు మెయిల్ (Madras Mail 1868), 1876లో లాహోరులో స్థాపితమైన సివిల్ అండ్ మిలిటరీ గెజెటు (Civil and Military gazette), ప్రధానంగా పేర్కొనదగినవి వీటిలో పైనియర్ బ్రిటిష్ నిరంకుశ సామ్రాజ్య తత్వాన్ని ప్రదర్శించేటట్టిదిగాను లాహోరు పత్రిక బ్రిటిష్ ఉద్యోగుల ప్రత్యేక ప్రయోజనాలను వ్యక్తపరచేదిగాను ప్రఖ్యాతి గాంచినాయి.

1858 తర్వాత ఉర్దూ పత్రికలు హిందీ పత్రికలు అనేకం ప్రకటితము లైనవి.

ఈ కాలంలో ఆంధ్రదేశంలో ప్రసిద్ధిగాంచిన ఇంగ్లీషు పత్రికలు ఏవీ లేక పోయినా కొన్ని సామాన్య పత్రికలు వెలువడినవి. వాటిలో కోకనాడ అడ్వ టైసర్ (Cocanada Advertiser), రాజమండ్రిలో ప్రకటితమైన గోదావరి ఎడ్యుకేషనిష్టు (Godavari Educationist) పేర్కొనదగినవి.

ఇవిగాక తెనుగుభాషలో దాదాపు ఇరవై మాసపత్రికలు వారపత్రికలు ప్రకటితములగుచూ ఉండేవి. వీటిలో సంఘసంస్కరణము, మతసంస్కరణము, సారస్వత విషయాల గురించిన చర్చలు ఎక్కువగా ఉండినా రాజకీయాలుకూడా వాటి దృష్టిని ఆకర్షించినాయి. పరిపాలనా విధానంలోని లోపాలను సూచించి, వాటిని తొలగించవలసిన అవసరాన్ని పరిపాలకులకు తెలియజేయడంలో అవి శ్రద్ధవహించాయి. ప్రజల దారిద్ర్యం పెరిగిపోతున్నదనీ, వ్యవసాయ దార్లకు కావలసిన నీటి సదుపాయాలు ఇతర సౌకర్యాలు లభించడం లేదని, క్షామకాలంలో లక్షలాది జనం ప్రాణాలను కోల్పోయినా అధికారులు పట్టించుకొనడంలేదని, ఉన్నతోద్యోగాలలో భారతీయులకు ప్రవేశం ఉండడం లేదని, ముస్లింలపట్ల పక్షపాతం ఎక్కువగా వహిస్తున్నారని, ఉద్యోగులలో లంచగొండితనం పెరిగిపోతున్నదని ఈ పత్రికలన్నీ విమర్శించాయి. ఆనాటి ప్రఖ్యాత రచయితలు వీరేశలింగం పంతులు, కొక్కొండ వెంకటరత్నం పంతులు, పరవస్తు వెంకటంగాచార్యులు మొదలైనవారు పత్రికల నిర్వహణలో ప్రధాన పాత్రను వహించడం గుర్తించదగినది. ప్రజలలో విజ్ఞానవ్యాప్తికి వీరి పత్రికలు ఎంతో తోడ్పడినవి.

## 3

మొదటినుండి అధికారులు పత్రికలపై అనేక నిర్బంధాలను విధిస్తూనే వచ్చారు. వారు ఆమోదించిన రచనలు మాత్రమేవీటిలో ప్రకటితము కావలెనని గవర్నరు జనరల్ వెల్లస్లీ ఒక చట్టాన్ని చేశాడు, కాని హేస్టింగ్సు ప్రభువు 1818లో దీనిని రద్దుచేసి పత్రికలకు కొంత స్వేచ్ఛను కల్పించాడు. అదిమొదలు అధికారులలో ఈవిషయమై తీవ్రమైన అభిప్రాయభేదాలు ఏర్పడి, వారు రెండు వర్గాలుగా చీలిపొయ్యారు. ఒక వర్గంవారు నిర్బంధాలను ఇంకొక వర్గంవారు స్వేచ్ఛను సమర్థించేవారయ్యారు.

నిర్బంధాలను సమర్థించినవారు పత్రికాస్వేచ్ఛ సంపూర్ణస్వాతంత్ర్యాన్ని అనుభవించే దేశాలకూ ప్రజాస్వామికంగల దేశాలకూ మాత్రమే వర్తించదగినదని, పరాయి పరిపాలనకు లోబడినట్టి భారతదేశంవంటి దేశాలకు వర్తించదని వాదించారు. ప్రజాస్వామికాన్ని అనుభవించే బ్రిటన్‌వంటి దేశాలలో ప్రజలు ప్రభుత్వ చర్యలను విమర్శించేహక్కు కలిగిఉండడం ఎంతైనా అవసరం,

అప్పుడుగాని ప్రజాభిప్రాయాన్ని ఆధారం చేసికొని పరిపాలనను సాగించడం సాధ్యంకాదు. కాని పరాయి పరిపాలనకు లోబడిన దేశాలలో ఈలాటిహక్కు ప్రజలకు ఉండడం పరిపాలకులకు ప్రమాదకరం. పత్రికలు తమ స్వేచ్ఛను దుర్వినియోగంచేసి పరాయి పరిపాలకుల పేరు ప్రతిష్టలకు భంగకరంగా ప్రవర్తించవచ్చు. ప్రజలకుఉండవలసిన ప్రభుభక్తిని నిర్మూలించవచ్చు. ప్రజలలో తిరుగుబాటుధోరణి ప్రబలవచ్చు. అందుచేత పత్రికలపై నిర్బంధాలను విధించడమే పరాయిప్రభుత్వ స్థిరత్వానికి సాధనం. ఇదిగాక భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వము స్వతంత్ర ప్రభుత్వముకాదు. అది బ్రిటన్‌లోని పార్లమెంటుకు లోబడినట్టిది. పరిపాలనలో గుణదోషాలకు బ్రిటన్‌లోని ప్రభుత్వమే బాధ్యత వహించవలసి ఉన్నది. ఈపరిస్థితులలో బ్రిటన్‌లోని ప్రజలకు మాత్రమే పత్రికా స్వేచ్ఛ ఉండతగ్గది. ఇదీ నిర్బంధాలను సమర్థించినవారి వాదం. ఉదారస్వభావులనీ భారతీయుల శ్రేయస్సును కోరేవారనీ ప్రఖ్యాతిగాంచిన మన్‌రో, ఎల్ఫిన్‌స్టన్ మొదలైనవారుకూడా వీరితో ఏకీభవించారు.

కాని ఈ వాదం బ్రిటిష్‌వారందరికీ నచ్చినదికాదు. అలాటివారి సంఖ్య స్వల్పమైనా వారు పత్రికాస్వేచ్ఛను సమర్థించడం గుర్తించదగ్గది. భారతీయుల నుండి పన్నులు వసూలుచేసి, శాంతి భద్రతలను రక్షించడం మాత్రమే పరిపాలకుల దృక్పథంగా ఉండరాదు. పాశ్చాత్య విజ్ఞానాన్ని అందజేయడంకూడా పరిపాలకుల కర్తవ్యాలలో అగ్రస్థానం వహించవలసి ఉన్నది. ఇందుకు పత్రికలు ఎంతగానో కృషిచేస్తున్నవి. ఆలాటి కృషి విజయవంతం కావడానికి పత్రికలకు స్వేచ్ఛ ఉండడం చాలా అవసరం. ఇదిగాక విజ్ఞానవ్యాప్తి మూలంగా భారతీయులు ప్రభుభక్తి కలవారవుతారేగాని అధికారులపై తిరుగుబాటుచేసేవారు కాజాలరు. ఇంతేకాదు, పరాయి పరిపాలకులకుకూడా ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొని, సాధ్యమైనంతవరకు ప్రజల అవసరాలనుబట్టి పరిపాలనను సాగించడమే ధర్మం. ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనుటకు వార్తా పత్రికలకంటె పటిష్ట సాధనం ఇంకొకటిలేదు. ఇదీ పత్రికల స్వేచ్ఛను సమర్థించినవారి వాదం.

1823 లో తాత్కాలిక గవర్నరు జనరల్‌గా ఉండిన ఆడం పత్రికలపై కఠిన నిర్బంధాలను విధించిన సందర్భంలో రాజారామమోహనరాయ్ వాటిని రద్దుచేయించవలసినదిగా కలకత్తాలోని ఉన్నత న్యాయస్థానానికి ఒక మహజరును సమర్పించాడు. ఆరోజులలో ప్రభుత్వం చేసే చట్టాలకు ఉన్నత న్యాయస్థానం ఆమోదం తెలుపవలసిన అవసరం ఉండేది. కాని న్యాయస్థానం రామమోహనరాయ్ వినతిపత్రాన్ని త్రోసిపుచ్చింది. అటుతర్వాత అతడు దానిని బ్రిటన్‌లోని అధికారులకు పంపాడు. కాని వారుకూడా నిర్బంధాలను తొలగించలేదు. అయినా ఆ పత్రంలో పత్రికాస్వేచ్ఛను సమర్థిస్తూ ఆయన వ్యక్తంచేసిన అభిప్రాయాలు, వాటి ఔన్నత్యమూ గాంభీర్యమూ భారతదేశంలోనేగాక బ్రిటన్‌లోకూడా అనేకుల మన్ననలకు పాత్రమైనాయి. అజ్ఞానంమూలాన వెనుకబడి ఉన్న భారతీయులకు విజ్ఞానాన్ని అందజేయుటకూ, ప్రజలు అనుభవించే కష్టాలనూ పరిపాలన

లోని లోపాలనూ అధికారులకు తెలియజేయుటకూ పత్రికతే ఉత్తమసాధనా లనీ, వాటికి స్వేచ్ఛ ఉన్నప్పుడే అవి వాటి బాధ్యతను చక్కగా నిర్వహించడం సాధ్యమౌతుందని ఆయన ఉద్ఘాటించాడు. ప్రజాస్వామికంగల దేశాలలో పార్ల మెంటువంటి సభలద్వారా ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనే అవకాశం ఉన్నది. అలాటి సభలులేని భారతదేశంలో స్వేచ్ఛగా కృషిచేయగల వార్తా పత్రికలుతప్ప ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనుటకు సాధనాంతరాలు లేవు. ప్రజాభిప్రాయం తెలియని పక్షంలో ప్రభుత్వం అనేక పొరబాట్లనుచేసే ప్రమాదం ఎంతైనా ఉన్నది. దాని మూలంగా ప్రభుత్వ స్థిరత్వానికి ఎక్కువ భంగం కలగ వచ్చు. ఇంతేగాక వాక్స్వాతంత్ర్యమూ పత్రికాస్వాతంత్ర్యమూ మానవుల మౌలిక హక్కులలో ఒకటిగా సమకాలపు విజ్ఞుల అభిప్రాయం. పాశ్చాత్య దేశాలలోని విజ్ఞులందరు ఈ అభిప్రాయాన్ని సమర్థించారు. ఇది మానవులందరికీ వర్తించవలసిన హక్కు. ఇదీ రామమోహనరాయలవారి వాదంలోని సారాంశం.

ఆయన సమర్పించిన పత్రం వెంటనే ఫలప్రదం కాకపోయినా 1835 లో తాత్కాలిక గవర్నరు జనరల్‌గా ఉండిన మెట్కాఫ్, ఆడం విధించిన నిర్బంధా లను చాలావరకు తొలగించాడు. పత్రికలకు చెప్పుకోదగ్గ స్వేచ్ఛ లభించి వాటి సంఖ్య వృద్ధిగాంచింది. 1857-58 లో సంభవించిన తిరుగుబాటు కాలంలో క్యానింగు కొన్ని నిర్బంధాలను విధించినా అవి ఒక సంవత్సర కాలం మాత్రమే అమలులో ఉండినాయి.

పైన వివరించినట్లు 1860 తర్వాత అమృతబజారు, వంగదర్శనీ మొద లైన బెంగాలీభాషలో ప్రకటితములైన పత్రికలలో అతివాదధోరణి వృద్ధిగాంచి అధికారుల భయాందోళనలకు కారణమైంది. దేశీయులు సాగించే ఇంగ్లీషు పత్రిక లలో ఈలాటి రచనలు ప్రకటితములైనా ఎక్కువ ప్రమాదం లేదని అధికారులు భావించారు. వాటిని చదివేవారి సంఖ్య స్వల్పంగా ఉండడమూ, వాటిలోని రచనలను ఆంగ్లోఇండియన్ పత్రికలు ఖండించే అవకాశం ఉండడమూ, ఈ భావా నికి కారణం. కాని భాషాపత్రికలు ఈలాటివి కావు. వాటిని చదివేవారి సంఖ్య ఎక్కువ. వీరు ప్రాజ్ఞతగల నగరవాసులేగాక రచనలలోని గుణదోషాలను గ్రహించలేని పల్లెప్రాంతాలలోని వారుకూడా. వారు వీటిని యథాతథంగా విశ్వసించి పరాయి ప్రభుత్వంపై తిరుగుబాటుచేసే ప్రమాదం ఎంతైనా ఉన్నదని అధికారులు అభిప్రాయపడి ప్రత్యేకంగా భాషా పత్రికలపైన నిర్బంధాలను విధిస్తూ లిట్టన్ ప్రభువు రాజప్రతినిధిగా ఉన్నప్పుడు 1878లో దేశభాషా పత్రికల చట్టాన్ని ( Vernacular Press Act) చేశారు. ఇది దేశభాషలలోని పత్రి కలకు మాత్రమే వర్తించేటట్టిది.

కాని ఈ విధంగా ఇంగ్లీషు భాషా పత్రికలపై విధించని నిర్బంధాలను దేశ భాషా పత్రికలపై విధించడము గొప్ప ఆందోళనకు దారితీసింది. ఇది సహేతుక మైన విచక్షణ కాదని బ్రిటన్‌లోని లిబరల్ పక్షమువారు కూడా అభిప్రా యపడినారు. వారు అధికారంలోకి వచ్చినవెంటనే లిట్టన్ ప్రభువు తన పదవికి

రాజీనామా చేశాడు. అతని స్థానంలో లిబరల్ పక్షానికి చెందిన రిప్పన్ ప్రభువు రాజప్రతినిధిగా వచ్చాడు. అతడు 1882 లో దేశభాషా పత్రికల చట్టాన్ని రద్దు చేసి విద్యాధికుల కృతజ్ఞతకు పాత్రుడయ్యాడు. దీని ఫలితంగా అన్ని పత్రికలకు సమాన స్వేచ్ఛ లభించింది.

ఇది మొదలు కొంతకాలం పత్రికల అతివాద ధోరణి తగ్గింది, 1885లో అఖిలభారత జాతీయ కాంగ్రెసు (Indian National Congress) స్థాపితమైనది. అప్పటినుంచి అనేక పత్రికలు దాని మితవాద ధోరణిని సమర్థించసాగినవి. కాని ఇదిచాలా కాలం నిలబడలేదు. కాంగ్రెసు మితవాద తత్వాన్నికూడా ఆంగ్లో ఇండియన్ పత్రికలు ఘాటుగా విమర్శించడమూ, బ్రిటిష్‌వారిలో దినదినాభివృద్ధి గాంచుతున్న జాత్యహంకారమూ, నీలిమందు తేయాకు తోటల యజమానులు కార్మికులపై స్త్రీలు పురుషులు అనే వివక్షతలేకుండా గావించే దౌర్జన్యాలు 1891 నాటి గర్భాదాన చట్టము, 1893లో సంభవించిన హిందూ ముస్లింల కొట్లాటలు, 1896లో ప్లేగు నివారణ పేరుతో అధికారులు తీసుకొన్న కఠిన చర్యలు, కర్జన్ ప్రభువు యొక్క- నిరంకుశత్వము,- ఇవి అన్నీ- దేశీయ పత్రికల ఉద్రేకానికి కారణమై, అవి అతివాద ధోరణిలో పడి ప్రభుత్వ విధానాలను తీవ్రంగా విమర్శించడం పరిపాటి అయింది. ఈలాటి పత్రికలు అధికంగా బెంగాలులోను మహారాష్ట్రంలోను ఉండినా వాటి ప్రభావం దేశమంతటా కనుపించింది.

1880 తర్వాత అనేక సమస్యలు ప్రత్యేకంగా దేశీయ పత్రికల దృష్టిని ఆకర్షించాయి. ప్రభుత్వం విధించే దుర్భరమైన పన్నులు, ఆదాయంలో చాలా భాగం సైన్యానికి ఉన్నతోద్యోగుల జీతాలకూ వినియోగము కావడము, ఉన్నతోద్యోగాలలో ఎక్కువ జీతాలు పుచ్చుకొనే తెల్లవారు మాత్రమే ప్రవేశాన్ని సంపాదించడము, ఆలాటి అవకాశం విద్యాధికులై అన్ని విధాలా అర్హత గల భారతీయులకు లభింపక పోవడము, ఏటేట కోట్లకొలది ధనం అనేక రూపాలలో బ్రిటన్‌కు తరలిపోవడము, భారతీయులపై దౌర్జన్యమునకు పూని, వారిని వికలాంగులుగా జేసినా, హత్యగావించినా, నేరస్థులు తెల్లవారైనప్పుడు న్యాయస్థానాలు పక్షపాత దృష్టితో వారికి తగిన శిక్షను విధించకపోవడము, ఉద్యోగాలలోను ఇతర రంగాలలోను "విభజించి పాలించు" సూత్రాన్ని ఆధారం చేసుకొని ముస్లింలకు ప్రత్యేక సదుపాయాలను కల్పించడము, రెండవ ఆఫ్‌గన్ యుద్ధానికి, మూడవ బర్మా యుద్ధానికి, కర్జన్ ప్రభువు కాలంలో టిబెటుపై దాడికి కోట్లకొలది ధనాన్ని ఖర్చుపెట్టడము, క్షామాల తీవ్రత పెరగడము, క్షామబాధితుల సహాయార్థం సకాలంలో తగిన సహాయం చేయకపోవడము, పరిశ్రమల రక్షణకై ఏలాటి సహాయం చేయకపోవడమేగాక బ్రిటన్ నుండి దిగుమతి అయ్యే సరుకుల వాడకానికి ఎంతగానో సహాయపడడము, రైతుల కష్టాలను ఋణ బాధలను తగ్గించుటకు కావలసిన చర్యలను తీసుకొనక పోవడము- ఇవి అన్నీ దేశీయ పత్రికల నిశిత విమర్శలకు గురిఅయినవి.

దేశీయ పత్రికల విమర్శల మూలంగాను, ఇతర దేశాలలోని జాతీయోద్యమాల గురించి విప్లవాల గురించి అవి అందజేసే సమాచారాల మూలంగాను విద్యాధికులకే గాక సామాన్య ప్రజలకు కూడా రాజకీయాల పట్ల ఆసక్తి పెరిగింది. పూర్వకాలము నాటి ఔదాసీన్యము తగ్గుముఖం పట్టింది. జాతీయాభిమానం, పరాయి పరిపాలనపట్ల ద్వేషము పెరిగినాయి. దేశీయులంతా సంకుచిత మనస్తత్వాలను విడనాడి కలిసికట్టుగా కృషిచేసినగాని పరిపాలకుల వైఖరిలో మార్పురాదని, దేశాభిమానంగల ప్రజలందరు ఆలాటి కృషి చేయడం వారి ప్రథమ కర్తవ్యంగా గ్రహించడం అవసరమనీ వార్తా పత్రికలను చదివే వారు గ్రహించి, ఇతరులలో కూడా ఆలాటి భావం వ్యాపించడానికి ప్రయత్నం చేశారు. ఈవిధంగా జాతీయతను బలపరచడంలో దేశీయ పత్రికలు గొప్ప పాత్రను వహించినాయి.

ఆంగ్లో ఇండియన్ పత్రికలుకూడా పరోక్షంగా జాతీయతను బలపరచాయి అని చెప్పవచ్చు. అవి భారతీయులను అనేక విధాలుగా తూలనాడడము, స్వతంత్రంగా బాధ్యతతో దేశాన్ని పాలించుకొనే శక్తి వారికి లేదని ప్రచారం చేయడము, హానికరములైన ప్రభుత్వ విధానాలను కూడా సమర్థించడము, బ్రిటిష్ పరిపాలన పట్ల ప్రజలలో ద్వేషభావాన్ని బలపరచాయి. ఇది అప్రత్యక్షంగా ప్రజలలో జాతీయతను పెంపొందించింది. వార్తా పత్రికల మూలంగా ప్రజల మనోవైఖరి మారడంలో ఆంగ్లో ఇండియన్ పత్రికలు కూడా కొంత సహాయపడినవని గుర్తించడం అవసరం.

## 4

జాతీయతపై వార్తా పత్రికలు ఎంతటి ప్రభావం వహించాయో అంతకంటె ఎక్కువ ప్రభావం 1850 తర్వాత దేశభాషలలో వృద్ధిగాంచిన నూతన వాఙ్మయం వహించింది. దేశంలో అనేక భాషలు ఉండినా, అన్నిభాషలలోని వాఙ్మయాలు కొద్దిగానో గొప్పగానో జాతీయతాభివృద్ధికి తోడ్పడినవి. ఈ సందర్భంలో కొన్ని ప్రధాన విషయాలను గుర్తించడం అవసరం.

ఈ కాలంలో అన్నిభాషలలో ఒక వచన వాఙ్మయం అంకురించి వృద్ధిలోకి వచ్చింది. అంతకు పూర్వం వచనంలో వ్రాసిన గ్రంథాలు చాలా సక్రృత్తుగా ఉండేవి. ఇదిగాక కొత్తగా రూపొందిన వచన వాఙ్మయం గ్రాంథిక భాషలో గాక శిష్ట వ్యవహార భాషలో వృద్ధిగాంచింది. అందుచేత దీనిని పండితులే గాక సామాన్య ప్రజలు కూడా చదివి అర్థంచేసుకొనగల వారయ్యారు. పాశ్చాత్య సంస్కృతితో విద్యాధికులకు కలిగిన సంబంధం మూలంగా వారిలో ఉదయించిన జాతీయత, దేశాభిమానము, ప్రజాస్వామికము మొదలైన వాటిని గురించిన నూతన భావాలతో సామాన్యులు కూడా పరిచయాన్ని సంపాదించ గలిగారు.

ఈ వచన వాఙ్మయాన్ని సృష్టించడంలో తొలిదశలో క్రైస్తవ మిష

నరీలు, ప్రభుత్వ శాఖలలోని బ్రిటిష్ ఉద్యోగులు, గొప్పపాత్రను వహించారు. మతబోధ చేయుటకు మిషనరీలకు ఈలాటి వాఙ్మయం అవసరమైంది. వారు స్థాపించి నడిపించిన ప్రాథమిక విద్యాలయాలలో చరిత్ర, భూగోళము, విజ్ఞాన శాస్త్రము, మొదలైన విషయాలను బోధించుటకు పాఠ్యగ్రంథాలు అవసరమైనాయి. ఈ అవసరాలను తీర్చే ఉద్దేశంతో వారు మతగ్రంథాలను దేశభాషలలోకి తర్జుమా చేయడమేగాక వివిధవిషయాలగురించి పాఠ్యగ్రంథాలను తయారుచేసి వచన వాఙ్మయానికి పునాదులు వేసినారు.

ఈ కాలంలోనే కొత్తగా బ్రిటిష్ నుండి భారతదేశానికి వచ్చిన బ్రిటిష్ ఉద్యోగులకు శిక్షణ ఇచ్చే నిమిత్తం కలకత్తాలో స్థాపింపబడిన ఫోర్టువిలియం కళాశాలలోను, మద్రాసు బొంబాయిలలో అదే ఉద్దేశంతో ఏర్పాటుచేయబడిన కళాశాలలలోను దేశ భాషలను నేర్పవలసి వచ్చింది. అందుకు నియమింపబడిన ఉద్యోగులు దేశీయ పండితుల సహాయంతో సులభశైలిలో గ్రంథాలను తయారుచేశారు. ఈ సందర్భంలోనే మిషనరీలు ఉద్యోగులు తత్పూర్వం దేశభాషలలో వెలువడిన ఉత్తమ గ్రంథాలను అచ్చువేసి, అవి శిథిలముకాకుండా రక్షించారు. తెలుగు భాషకై ఈ విధంగా అమోఘమైన కృషి చేసినవాడు సి. పి. బ్రౌన్. కాని ఈలాటి వారనేకులు బెంగాలి, మహారాష్ట్రము, గుజరాతి, తమిళము, కర్ణాటకము మొదలైన భాషలు వృద్ధికావడంలో తోడ్పడినారు. ఇందుకుగాను వారు సులభ వ్యాకరణాలను నిఘంటువులను తయారుచేశారు. భాషాభివృద్ధికి కావలసిన అంగములన్నిటినీ వారు సిద్ధపరచారు. బ్రౌన్ ఆలాటి వారిలో ఒకడుమాత్రమే.

వీరందరికి సహాయపడిన పండితులు తదితరులు వీరి కృషివలన ప్రభావితులై సులభశైలిలో వచన గ్రంథాలను వ్రాయబూనుకొన్నారు. వీరిలో అనేకులు ఇంగ్లీషు వాఙ్మయంతో పరిచయాన్ని సంపాదించినవారు. ఆ వాఙ్మయంలో నవలలు, కథలు, నాటకాలు, అన్ని శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలు అనేకం ఉండడం వారి దృష్టిని ఆకర్షించింది. దేశభాషలలోకూడా ఆలాటి గ్రంథాలు ఉన్నప్పుడే అవి అభివృద్ధిగాంచగలవని వారు భావించారు. దీని ఫలితంగా దేశభాషా వాఙ్మయం ఒక వైవిధ్యాన్ని సంపాదించగలిగింది. ఈ రకరకములైన గ్రంథాలు ప్రజల విజ్ఞానాభివృద్ధికి ఎంతగానో సహాయపడినవి.

ఇందులో బెంగాలీ రచయితలు మార్గదర్శకులయ్యారు. ఇతర భాషలలోని గ్రంథకర్తలు ఇంగ్లీషు వాఙ్మయం చేతనేగాక బెంగాలీ వాఙ్మయం చేతకూడా ప్రభావితులైనారు.

ఈలాగు రూపొందిన బెంగాలీవాఙ్మయంలో జాతీయతకు దేశాభిమానానికి సంబంధించినట్టిది చాలాప్రాధాన్యాన్ని వహించింది. అన్ని రంగాలలోచైతన్యాన్ని కోల్పోయి వెనుకబడివున్న ప్రజలను చైతన్యవంతులుగామార్చి, దేశీయ సంస్కృతిపట్ల చరిత్రపట్ల వారికి గౌరవాభిమానములు కలిగించుటలో ఇది బలీయమైన సాధనమైనది. బెంగాలీవాఙ్మయంలో దేశాభిమానము ఒక మతముగా

భావించబడినది. ఆ భావాన్ని వ్యక్తపరచే ఉద్దేశంతోనే వారు రకరకాల గ్రంథాలను - నవలలు, నాటకాలు, కావ్యాలు మొదలైనవాటిని - వ్రాసినారు. ప్రాచీనములైన మహాభారతరామాయణాది గ్రంథాలకు, భగవద్గీతకు, జాతీయత దృష్ట్యా వ్యాఖ్యానాలను తయారుచేసి వారి నాటకాలలోను నవలలలోను కావ్యాలలోను వాటిని ప్రవేశపెట్టినారు. ఈ దృష్టితోనే దేశచరిత్రకు సంబంధించిన వాఙ్మయాన్ని వారు రూపొందించి భారతదేశపు ప్రాచీన వైభవాన్ని ప్రశంసించారు. భారతీయ సంస్కృతి అనేక రంగాలలో పాశ్చాత్య సంస్కృతి కంటె ఉత్తమమైనదని వారు ప్రజలకు భోధించగలిగారు. ఈలాటి వాఙ్మయాన్ని సృష్టించుటలో బెంగాలీ రచయితలెందరో ప్రఖ్యాతిగాంచినారు. వారిలో ఆనందమఠమనే నవలను వ్రాసి, అందులో వందేమాతరగేయానికి ప్రత్యేక స్థానాన్ని కల్పించిన బంకించంద్రుడు అగ్రస్థానాన్ని వహించినాడు. అతని ఇతర నవలలు, శ్రీకృష్ణచరిత్ర, అతడు స్థాపించి నడిపించిన వార్తాపత్రికలు ఈదృక్పథాన్ని ప్రస్ఫుటం చేస్తూఉన్నాయి. అతడూ తదితరులూ రచించిన వందేమాతరంవంటి గేయాలను సభలలోను సమావేశాలలోను గానంచేయడం పరిపాటి అయింది. దీనిఫలితంగా అక్షరాస్యులుకాని ప్రజానీకంకూడా జాతీయాభిమానము దేశాభిమానము కలవారైరి.

ఇతర దేశభాషలలోకూడా కాలక్రమాన దేశాభిమాన పూరితములైన నవలలు, నాటకాలు, చారిత్రక గ్రంథాలు, కావ్యాలు అభివృద్ధిగాంచాయి. అన్ని ప్రాంతాలలోని ప్రజలు ఈలాటి గ్రంథాలను చదివి, ఈలాటి గేయాలను విని దేశాభిమానపూరితులై కాలక్రమాన స్వాతంత్ర్యసమరంలో పాల్గొనుటకు సిద్ధపడినారు. ఒక్కొక్క భాషలో వెలువడిన దేశభక్తి వాఙ్మయాన్ని వివరిండం సాధ్యంకాని కారణంచేత ప్రస్తుతం ఆలాటి వివరణకు పూనుకొనలేదు.

ఆంధ్రభాషలో వచనవాఙ్మయాన్ని సృష్టించి, దానికి వైవిధ్యం కల్పించినవారు కందుకూరి వీరేశలింగంపంతులుగారు. కాని 1907కు పూర్వం దేశభక్తికి సంబధించిన గ్రంథాలేవి ఆంధ్రభాషలో వెలువడలేదు 1907నాటికి బెంగాలులో బయలుదేరిన వందేమాతర ఉద్యమప్రభావం ఆంధ్రదేశములోకి వ్యాపించింది. ముట్నూరు కృష్ణారావువంటి ఆంధ్రులు కొందరు బెంగాలుకువెళ్ళి అక్కడి రాజకీయాలచే ప్రభావితులైనారు. 1907లో బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశంలో పర్యటనను సాగించి కాకినాడ, రాజమండ్రి, బెజవాడ, బందరు మొదలైన నగరాలలో స్వరాజ్యాన్ని గురించి, స్వదేశ ఉద్యమాన్ని గురించి, జాతీయ విద్యావిధాన ప్రాధాన్యాన్ని గురించి ఉద్రేకపూరితములైన ఉపన్యాసాలను గావించినాడు. వీటిచేత ఆనాటి నాయకులు, ప్రజలు ప్రభావితులైనారు. వీటి అన్నిటి ఫలితంగా కాలక్రమాన దేశభక్తివాఙ్మయం ఆంధ్రభాషలో వృద్ధిగాంచింది.

ఇది రెండుపాయలుగా ప్రవహించింది. ఒకటి యావద్భారత దేశాభిమానమునకు సంబంధించినట్టిది. రెండవది ఆంధ్రదేశాభిమానమునకు సంబంధించినట్టిది. ఏ పాయకు సంబంధించినా ఈవాఙ్మయం ప్రజలలో జాతీయత అంకురించి

వృద్ధిగాంచడంలో గొప్ప పాత్రను వహించింది.

ఈఒక్కొక్క పాయలో రెండుశాఖలు ఏర్పడినట్లు చెప్పవచ్చు. ఒకశాఖలో నవలలు, నాటకాలు, కావ్యాలు మొదలైనవి వెలువడినవి. రెండవశాఖలో పద్య రూపంలో ఖండకావ్యాలు, గేయాలు వెలువడినవి. ఈ రెండవ శాఖలోని గేయాలు సామాన్యప్రజానీకంపై ఎక్కువ ప్రభావాన్ని వహించాయి.

దేశీయాభిమాన పూరితములైన పద్యాలను తొలుదొల్త రచించినవారు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు. 1907 లో బిపిన్ చంద్రపాల్ రాజమండ్రికి విచ్చేసిన సందర్భంలో వీరు

"భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగ దూడలై ఏడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతుల బిగియబట్టి"

అనే పద్యాన్ని రచించి సభలో చదివారు. ఇది పరాయి పరిపాలన ఫలితంగా భారతదేశానికి ఏర్పడిన దుర్దశను కండ్లకు కట్టినట్లు వివరిస్తున్నది. తర్వాత 1908 లో లాలా లజపతిరాయ్ బ్రిటిష్ పరిపాలకులచే బంధీకృతుడై బర్మాలో నిర్బంధ శిక్షను అనుభవించుటకు పంపబడినప్పుడు లక్ష్మీనరసింహంగారు ఈ క్రింది పద్యాలను రచించినారు.

"చెరసాలల్ పృదు చంద్రశాలలె యగున్ చేదోయి గీలించు న
య్యరదండల్ విరిదండలయ్యెడును, హేయంబైన చోడంబలే.
పరమాన్నంబగు మోటు కంబళులు దాల్పన్ పట్టుసెల్లాలగున్
స్థిరుడై యే నరుడాత్మ దేశమును భక్తింగొల్చు నవ్వానికిన్"

భరత ఖండంబె యొక పెద్ద బందిఖాన
అందులోనున్న ఖైదీలు హిందు జనులు
ఒక్కగది నుండి మార్చి వేరొక్క గదిని
బెట్టుటేగాక చెరయంచు వేరు గలదె.

ఈ పద్యాలు రెండూ బహుళ వ్యాప్తిని గాంచాయి.

అటు తర్వాత దేశభక్తి పూరితములైన పద్యాలను గేయాలను రచించిన వారిలో గురజాడ అప్పారావు, దువ్వూరి రామిరెడ్డి, వేదుల సత్యనారాయణ శాస్త్రి, మంగిపూడి వెంకటశర్మ, రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, తుమ్మల సీతారామమూర్తి, జాషువా మొదలైన వారెందరో ఉన్నారు. వారందరిని పేర్కొనడం సాధ్యంకాని పని. 1919 తర్వాత సత్యాగ్రహోద్యమం బయలుదేరిన తర్వాత జాతీయ గేయాల రచన చాలా చురుకుగా సాగినది. పరాయి పరిపాలనముపై ప్రజల ఏవగింపు, స్వాతంత్ర్య సంపాదనము పట్ల వారికి గల దీక్ష, అందుకై వారు చేయుటకు సిద్ధపడ్డ త్యాగాలు, గాంధీ మహాత్ముని నాయకత్వము- వీటి నన్నిటిని గురించి గేయాలను రచించి పాడడం, సర్వసాధారణమైంది. ఈలాటి రచనలను చేసినవారిలో గరిమెళ్ళ సత్య

నారాయణ అగ్రస్థానం వహిస్తున్నారు. ఆయన వ్రాసిన "మాకొద్దు ఈతెల్లదొర తనము" అనే గేయం ఉద్యమ కాలంలో వందేమాతర గేయానికంటె కూడా ఎక్కువ వ్యాప్తిని సంపాదించింది. "ఆ రోజులలో ఆయన పాటలు నోటికిరాని సామాన్యుడైన తెలుగువాడు లేడు. ఆయనను జాతీయ గేయకవితా సార్వభౌముడనుట తప్పు, ఆయన జాతీయ కవి సార్వభౌముడు'' అని విశ్వనాథ సత్యనారాయణ వంటి వారు ప్రశంసించినారు.

ఆంధ్ర దేశాన్ని, ఆంధ్ర జాతిని, ఆంధ్ర భాషను, ఆంధ్ర పౌరుషమును, వారి ప్రాచీన ఔన్నత్యమును, వారి శిల్పకళా నైపుణ్యమును, సంగీతము, నాట్యము, చిత్రలేఖనము మొదలగు వాటిలో వారు సంపాదించిన ప్రఖ్యాతి—వీటి నన్నిటిని గేయాలను రచించిన వారు ఎంతగానో ప్రశంసించి ఆ నాటి ప్రజల స్మరణకు తెచ్చారు. దీనికితోడు ఆంధ్రుల ప్రస్తుత దుర్దశ పట్ల వారు ఎంతో విచారమును వ్యక్తపరిచారు. కాని కాలక్రమాన ఆంధ్రులకు ఉజ్జ్వల భవిష్యత్తు లభించగలదని వారు ప్రజానీకానికి ఉత్సాహము కలిగించారు.

నవలలు, నాటకాలు, చారిత్రక గ్రంథాలు కావ్యాలు మొదలగు వాటిని రచించిన కవులు గత కాలంలో రాజపుత్రులు, శిక్కులు, మహారాష్ట్రులు మొదలైన వారు హిందూ ధర్మాన్ని నిలబెట్టుటకు, పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగి సంపాదించుటకు ముస్లింలతో చేసిన పోరాటములనూ వాటిలోవారు ప్రదర్శించిన పరాక్రమమునూ అభివర్ణించారు. ప్రతాపసింహుని చరిత్రను కావ్యశైలిలో రచించిన రాజశేఖర కవియు, శివాజీ చరిత్రను ఆ శైలిలోనే రచించిన గడియారం శేషాశాస్త్రియు, ఈ సందర్భములో ప్రత్యేకముగ పేర్కొనవలసిన వారు.

19 వ శతాబ్దంలో బెంగాలులో జరిగినట్లే 20 వ శతాబ్దంలో ఆంధ్ర దేశంలో కవులు భారత రామాయణాదులలోని సంఘటనలను జాతీయతపట్ల ప్రజలకు ఉత్సాహము కలుగు రీతిని పరాయివారైన బ్రిటిష్‌వారి పరిపాలనపట్ల ద్వేషము కలుగు విధముననూ వ్యాఖ్యానించారు. దువ్వూరి రామిరెడ్డిగారి "ద్రౌపదీ సందేశము", చామర్తి రాజశేఖరరావుగారి "పాంచాలీ స్వాంతనము" కరుణశ్రీ గారి "ధనుర్భంగము", ఈలాటివి.

ఈలాగు పరి పరి విధాలుగా ఆంధ్ర దేశంలో దేశభక్తి వాఙ్మయము అభివృద్ధి గాంచినది. రచయితలలో జాతీయత అంకురించిన కారణంగా వారీలాటి వాఙ్మయాన్ని సృష్టించినారు. వీటి ఫలితంగా సామాన్య ప్రజానీకంలో జాతీయత వృద్ధి గాంచి, వారు స్వాతంత్ర్య సమరంలో పాల్గొని దానిని విజయవంతంగా సాగించునట్లు వారిని ప్రోత్సాహ పరచినది.

చదువదగిన గ్రంథాలు :

Bharatiya Vidya Bhavan- The History and cnlture of the Indian People Vols IX X and XI.

Tarachand : History of the Freedam Movement in India Vols 2 and 3

Haridas Mukherjee and Uma Mukherjee : The Growth of Nationalism in India.

M. Venkatarangaiah : The Freedom struggle in Andhra Pradesh (Andhra) Vols l and II.

బం. గో. రే. : బ్రౌన్ లేఖలు.

అక్కిరాజు రమాపతిరావు : వీరేశలింగం పంతులు : సమగ్ర పరిశీలన.

సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము.

గురజాడ రాఘవశర్మ : జాతీయగీతాలు.

# అధ్యాయము - 7

## రాజకీయోద్యమము - ప్రభుత్వవిధానాలు

జాతీయభావం బొత్తిగాలేని ప్రజలలో ఆలాటిభావం అంకురించి వృద్ధి గాంచడం 1858 తర్వాత భారతదేశచరిత్రకు ప్రధాన లక్షణమని సోదాహరణంగా ఇదివరకు వివరించాము. ప్రజలలో జాతి, మతం, భాష, కులం, నివసించే ప్రాంతాలు మొదలైన వాటిని బట్టి భేదాలు ఏర్పడి ఉన్నా వారందరికి ఒకేదేశం మాతృభూమిగా ఉండడంచేత వారందరూ ఒకజాతికి సంబంధించిన వారనేది జాతీయతకు ప్రధానలక్షణము. దేశం తమదిఅని, దానిని పరిపాలించుకొనేహక్కు ప్రకృతి సిద్ధంగా తమదేనని, పరాయివారు దానిని పాలించడం న్యాయవిరుద్ధ మని, ఆలాటి పరిపాలనను తొలగించి, తమ జన్మహక్కును అనుభవించడం వెంటనే సాధ్యం కాకపోయినా ఆలాటిహక్కును క్రమక్రమంగానైనా సంపాదించడం తమకర్తవ్యమని, జాతీయతచే ప్రభావితులైనవారు భావించడం సహజం. అందుకుగాను వారు ప్రయత్నాలను చేయడంకూడా సహజమే. ఈ కారణం చేతనే జాతీయత స్వాతంత్ర్యోద్యమానికి ఆధారం అవుతున్నది.

ఇదిగాక జాతీయతచే ప్రభావితులైనవారు ఎందులోకూడా తమజాతి ప్రపంచంలోని ఇతర జాతులకంటే తక్కువస్థాయిలో ఉండరాదని, అన్నిజాతుల కంటే మిన్నగా ఉండవలెననీ భావించడం సహజము. అందుచేతనే వీరు మత రంగంలోను, సాంఘికరంగంలోను, సారస్వతరంగంలోను నూతన ఉద్యమాలను లేవదీసి, వాటిని విజయవంతంగా సాగించి జాతియొక్క పునర్వికాసానికి ఘనమైన కృషిచేశారు. ఆర్థికరంగంలోకూడా ప్రభుత్వ సహాయం లేకపోయినా కొంత అభివృద్ధిని సాధించగలిగారు. ఈ ఉద్యమాలన్నిటికీ జాతీయాభిమానం ప్రధానకారణము. వీటి ఫలితంగా జాతీయతకూడా మరింత బలపడింది. వీటిని గురించి ఇంతవరకు వివరించడమైనది. జాతీయత ప్రాబల్యంగాంచిన ఫలితంగా రాజకీయరంగంలో ఏలాటిమార్పులు జరిగినవో ఇప్పుడు వివరించవలసి ఉన్నది.

సాధారణంగా ప్రతిరంగంలోనూ అభివృద్ధి అనేది 'రెండు భిన్నదృక్పథాలు గలవారి మధ్య సంఘర్షణ ఏర్పడినప్పుడే జరుగుతుంది. ఇది చరిత్రలో కనుపించే ప్రస్ఫుటమైన సత్యము. 1858 తర్వాత సంస్కర్తలకూ సనాతనులకూ మధ్య సంఘర్షణ సంభవించడం చేతనే సంస్కరణోద్యమాలు బయలుదేరి పురోగమించగలిగాయి. రాజకీయరంగంలోకూడా ఇదే జరిగింది. ఈరంగంలో ప్రభు

త్వం ఒకపక్షంగాను, రాజకీయ చైతన్యంగల ప్రజావర్గం ఇంకొక పక్షంగాను ఏర్పడినాయి. వీటిమధ్య సంభవించిన సంఘర్షణల ఫలితంగా రాజకీయరంగంలోని మార్పులన్నీ సంభవించాయి.

పరాయిపరిపాలనకు లోబడిన భారతదేశంవంటి దేశంలో ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్య మూడువిషయాలను గురించి సంఘర్షణ సంభవించే అవకాశం ఉంటుంది. వాటిలో మొదటిది పరాయి పరిపాలన సాగుతూఉండడమూ లేక అది అంతరించడమూ అనేది. కాని 1905కు పూర్వం దీనిని గురించి ఉభయపక్షాల మధ్య ఏలాటి సంఘర్షణా సంభవించలేదు. ప్రజాపక్షానికి చెందిన వారందరు-విద్యాధికులతోసహా - బ్రిటిష్ పరిపాలనపట్ల సుముఖంగా ఉండినారు. ఆ ప్రభుత్వం కొంతకాలం ఉంటేనేగాని దేశం పురోగమించడం సాధ్యంకాదనీ, బ్రిటిష్ వారినుండి భారతీయులు నేర్చుకొనదగిన విషయాలు ఎన్నో ఉన్నవనీ, బ్రిటిష్ పరిపాలన ఉంటేనేతప్ప వాటిని నేర్చుకొనడం జరగదనీ, అది జరిగిన తర్వాత గాని భారతీయులు స్వతంత్రంగా తమదేశాన్ని తామే పాలించుకొనడానికి అర్హులుకారని వీరు విశ్వసించారు. అందుచేత వారిపరిపాలనను అంతమొందించడానికి ప్రజాపక్షంవారు ఏలాటి ఉద్యమాలను తలపెట్టినవారుకారు. 1879లో మహారాష్ట్రంలో వాసుదేవబల్వంతఫడ్కే ఒక తిరుగుబాటును లేవదీసినా దానికి ప్రజల సహకారం ఏలాటిదీ లభించని కారణంగా అది విఫలమైంది.

సంఘర్షణకు దారితీసే రెండవ విషయం దేశాన్ని పాలించడానికి పరాయి వారు నిర్మాణం చేసిన యంత్రాంగం (Machinery of Government). బ్రిటన్‌లోని పార్లమెంటు, దానికి బాధ్యత వహించిన మంత్రిమండలి (Cabinet), ఇండియామంత్రి (Secretary of State for India) అతనికి సలహాలు ఇచ్చుటకు ఏర్పడిన ఇండియా కౌన్సిలు (India Council) యంత్రాంగంలో ఉచ్చస్థానంలో ఉండిన సంస్థలు. వీటిని గురించి రెండు పక్షాలమధ్య ఏలాటి సంఘర్షణా ఉత్పన్నం కాలేదు, ఒక ఇండియా కౌన్సిల్ విషయంలో కొన్ని అభిప్రాయ భేదాలు పొడసూపినవి - ఇందులోని సభ్యులు భారతదేశంలో ఉన్నత ఉద్యోగ పదవులనుండి విరమించి పింఛన్‌పుచ్చుకొన్న వృద్ధులు. వీరందరు భారతీయుల పట్ల ఏలాటి సానుభూతీ లేనివారు, బ్రిటిష్‌వారి నిరంకుశ పరిపాలనను, ఉన్నత ఉద్యోగవర్గపు ప్రత్యేకపు అధికారాలను సదుపాయాలను సమర్థించేవారు. అభివృద్ధికరములైన మార్పులు ఎంతటి స్వల్పములైనా వాటిని నిరోధించడం వీరికి పరిపాటి అయింది. అందుచేత ఈ కౌన్సిలును రద్దు చేయవలసిందిగా ప్రజాపక్షం వారు కోరుతూవచ్చారు. జాతీయ కాంగ్రెసు నిర్మాణం జరిగిన తర్వాత ఏటేట అదిచేస్తూవచ్చిన తీర్మానాలలో దీనికి ప్రాధాన్యం లభించింది. ఇదితప్ప ఉచ్చస్థాయిలోని యంత్రాంగంలో ప్రజాపక్షంవారు ఏలాటి మార్పులూ కోరలేదు. కొన్ని రాజకీయసంఘాలు భారతీయులకు బ్రిటన్‌లోని పార్లమెంటులో కొంత ప్రాతినిధ్యం ఉండడం అవసరమని సూచించాయి. కాని దానిని గురించి గొప్ప ఆందోళన ఏలాటిదీ జరగలేదు.

దేశంలోని పరిపాలనయంత్రాంగంలో ఉన్నతస్థాయిలో గవర్నరుజనరల్, ఆర్గురు సభ్యులతోకూడిన అతని కార్యనిర్వాహక కౌన్సిల్ (Executive Council), శాసననిర్మాణానికి ఈకౌన్సిలు సభ్యులూ మరికొందరు సభ్యులతో కూడిన ఒకసభ, ఉండేవి. ఇవిగాక మద్రాసు, బొంబాయి రాష్ట్రాల పరిపాలనకు ఒక్కొక్క గవర్నరు, ఒక కార్యనిర్వాహకసభ ఉండేవి. బెంగాలు, ఈనాటి ఉత్తరప్రదేశ్, పంజాబులు, లెఫ్టనెంటు గవర్నరుల ఆధీనంలోను, అస్సాం మధ్య పరగణాలు చీఫ్‌కమిషనర్ల ఆధీనంలోను ఉంటూవచ్చినవి.

వాస్తవంగా ఈయంత్రాన్ని నడిపే అధికారాన్ని, బాధ్యతను, వహించిన వారు ఉన్నత ఉద్యోగివర్గానికి చెందినవారు. వీరు లండన్‌లో జరిగే పోటీపరీక్షలలో ఉత్తీర్ణులైనవారు. 1887 నాటికి వీరిసంఖ్య 890. వీరిలో 16గురు మాత్రమే భారతీయులు.

దేశంలో ఏర్పడిన ఈ యంత్రాంగం విషయమై ప్రభుత్వానికి ప్రజా పక్షానికీ మధ్య కొన్ని సంఘర్షణలు సంభవించాయి. రాజకీయ రంగంలో ప్రజాపక్షం వారు లేవదీసిన ఆందోళనలో ఇవి ఎక్కువ ప్రాధాన్యాన్ని వహించాయి. వీటిలో ఒక సంఘర్షణ ఉన్నతోద్యోగాలలో భారతీయులకు బ్రిటిష్‌వారితో సమానమైన అవకాశాలు లభించవలె ననేది. పోటీ పరీక్షలు లండన్‌లోనే గాక భారతదేశంలో కూడా జరగవలెననీ, వాటిలో పాల్గొనే అభ్యర్థుల వయస్సు 22–23 సంవత్సరాలుగా ఉండవలెనని ప్రజా పక్షంవారు పదే పదే తీర్మానాలు చేసి అధికారులకు వినతి పత్రాలను సమర్పించారు. ఈ విషయంలో విద్యాధికులు చేసిన కృషి గురించి, తీర్మానాలను సమర్థిస్తూ వారు చూపిన కారణాల గురించి ఇదివరలో వివరించాము. కాని అధికారులు వీరి వాదాన్ని పెడచెవిన బెట్టారు. దానిని అనేక విధాలుగా ఎదుర్కొన ప్రయత్నించారు. వారి ప్రతిఘటన ఏలాటిదో ఇదివరలో వివరించాము. ప్రజాపక్షంవారు మొత్తంమీద ఈ విషయంలో ఆశాభంగాన్ని పొందారు. ఉద్యోగాల విషయంలో ప్రభుత్వం కొన్ని మార్పులు చేసినా వాటి ఫలితంగా భారతీయులకు ఎక్కువ సంఖ్యలో ఉన్నత స్థాయి లోని ఉద్యోగాలు లభించలేదు. వారు రెండవ స్థాయిలోని ఉద్యోగాలతోను, అంతకంటె తక్కువ స్థాయికి సంబంధించిన వాటితోను తృప్తి పడవలసిన వారైనారు.

పరిపాలన యంత్రంలో ప్రజాపక్షంవారు కోరిన రెండవ మార్పు శాసన సభలకు సంబంధించినట్టిది. వీటిలో ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులకు కొంత ప్రవేశం ఉండవలసిందిగా వారు వాంఛించారు. ఇది సహేతుకమైన వాంఛ అని వారు రెండు విధాలుగా సమర్థించారు. బ్రిటన్‌లోని బ్రిటిష్ వారివలెనూ, కనడా ఆస్ట్రేలియా మొదలైన రాష్ట్రాలలో నివసించే తెల్లవారివలెనూ భారతీయులు కూడా బ్రిటిష్ పౌరులనిన్నీ, ఒక సామ్రాజ్యంలో పౌరులుగా ఉన్నవారందరి హక్కులు ఒకే విధంగా ఉండడం న్యాయమనీ, బ్రిటన్‌లోని పార్లమెంటులో బ్రిటిష్ పౌరులకు. వలస రాష్ట్రాలలోని శాసనసభలలో ఆయా రాష్ట్రాల వారికి ప్రాతినిధ్యం ఉన్నట్లే భారతదేశంలోని శాసన సభలలో భారతీయులకు ప్రాతి

నిధ్యం ఉండడం పౌరుల మధ్య సమానత్వానికి అనుగుణంగా ఉంటుందనీ వారు వాదించారు. కాని ఈ వాదం అధికారులకు ఏమాత్రం నచ్చలేదు. పౌరులలో తెల్లవారి మధ్య, రంగు జాతులవారి మధ్య ఏనాటికీ సమానత్వం ఉండదనీ, ఉండ రాదనీ వారు స్పష్టపరచారు.

ఇదిగాక ఇంకొక విధంగా కూడా ప్రజాపక్షంవారు వారి వాదాన్ని పరి పోషించ ప్రయత్నించారు. ఇంగ్లీషు విద్య మూలంగా వారు చదివిన బ్రిటిష్ రచయితల తత్వగ్రంథాలన్నీ పరిపాలన విధానాలన్నిటిలో ప్రజాస్వామికము ఉత్తమమైనట్టిదిగా ఉద్ఘాటిస్తున్నాయి. బ్రిటన్‌లోను, ఇతర పాశ్చాత్య దేశాలు పెక్కింటిలోను పరిపాలనము ఈ విధానం ద్వారానే జరుగుతున్నది. నిరంకుశ విధానాన్ని ఎవరూ సమర్థించడం లేదు. ఈలాటి ఉత్తమ విధానాన్ని కొంతవర కైనా భారతదేశంలో ప్రవేశపెట్టడం బ్రిటిష్‌వారి కనీస ధర్మం. దానిని పూర్తిగా ప్రవేశపెట్టవలసిందిగా ఎవరూ వాంఛించడంలేదు. పాక్షికంగా దానిని ప్రవేశ పెట్టడంమూలాన బ్రిటిష్ వారి అధికారానికి గొప్ప ప్రమాదం ఏలాటిదీ కలు గక పోవడమేగాక దానిమూలంగా వారికి ప్రయోజనం కూడా చేకూరుతుంది, భారతదేశంవంటి ప్రజాబాహుళ్యంతోకూడిన దేశాన్ని, ప్రజల సంప్రదాయాలను, ఆచార వ్యవహారాలను మనస్తత్వాన్ని ఎరగని ఏకొద్దిమంది అధికారులు పరి పాలించడం ప్రమాదకరము. ఈ అజ్ఞానం మూలంగానే 1857-58 తిరుగుబాటు సంభవించింది. శాసన సభలలో భారతీయులకు కొంత ప్రాతినిధ్యం కల్పిస్తే, వారిద్వారా ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనే అవకాశం అధికారులకు లభిస్తుంది. దానిమూలంగా వారు తొందరపడి, ప్రజలకు రుచించని శాసనాలను చేయడం, ఉత్తరువులు జారీచేయడం, తప్పుతుంది. ఇది వారి పరిపాలన సౌష్టవానికి స్థిరత్వానికి ఎంతైనా అవసరం. ఈలాటి అవసరం ఉన్నట్లు 1858 తర్వాత బ్రిటిష్ ప్రముఖులు పలువురుకూడా అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. అందుచేత భారతీయుల ప్రయోజనాల దృష్ట్యా మాత్రమేగాక, బ్రిటిష్‌వారి ప్రయోజనాల దృష్ట్యాకూడా ప్రజాస్వామిక సూత్రాలకు అనుగుణంగా కొన్ని మార్పులనైనా చేయడం సమంజసమని ప్రజాపక్షం వారు వాదించారు.

ఇంతేకాదు. శాసన సభలలో తమకు ప్రాతినిధ్యం లభించిన ఫలితంగా ప్రజలు ప్రభుత్వం పట్ల ఎక్కువ భక్తితో ప్రవర్తిస్తారు. ప్రభుత్వానికి ఎంతటి సైనికబలమూ నౌకాబలమూ ఉన్నా ప్రజాదరణ లేని పక్షంలో ఈబలం సార్థకం కాజాలదు. వీటితో ప్రజామోదాన్ని సంపాదించ గలిగినప్పుడే పరిపాలన ఏలాటి ఒడుదుడుకులు లేక సాగుతుంది. అన్ని కాలాలలో, అన్ని దేశాలలో ప్రభువులు ప్రజామోదాన్ని సంపాదించడానికి ఈ కారణంచేతనే గొప్ప ప్రయత్నాలు చేయడం జరిగింది. రాజనీతికి ఇదిఒక ప్రధాన లక్షణము. బ్రిటిష్‌వారు కూడా ఈలాటి ప్రయత్నం చేయడం ప్రాజ్ఞత. అందుకు ప్రజా ప్రతినిధులతో కూడిన శాసన సభలు ఒక పటిష్టసాధనం. ఇదీ విద్యాధికులు నిర్మాణం చేసిన పక్షంవారి వాదం. వారు స్థాపించి సాగించిన రాజకీయ సంఘాలన్నీ- కొన్ని మినహా

యింపులకు లోబడి- ఈ వాదాన్ని బలపరచాయి.

కాని బ్రిటన్‌లో అధికార వర్గానికి చెందిన వారిలో అధిక సంఖ్యాకులు, భారతదేశంలో అధికారాన్ని వహించిన బ్రిటిష్ వారిలోను, అనధికారులలోను బహు సంఖ్యాకులు ఈవాదాన్ని ప్రతిఘటించారు.

ఈ ప్రతిఘటనకంతకూ వారిలో కరడుకట్టుకొన్న జాత్యహంకారం ప్రధాన కారణము. 19 వ శతాబ్దం ఆఖరుభాగాన వారు ప్రపంచంలో చాలా భాగానికి పరిపాలకులు కావడంతో ఇది మరింత ముదిరింది. జాత్యహంకారము, సామ్రాజ్యతత్వము పరస్పరాశ్రయాలైనాయి. దీని ఫలితంగా వారు భారత దేశంలో ప్రజాపక్షంవారు కోరిన పరిమిత ప్రజాస్వామికాన్నికూడా గర్హించారు.

బ్రిటిష్ పరిపాలన స్థాపించబడటానికి పూర్వం భారతదేశం అరాచకానికి, అంతర్యుద్ధాలకు పరాయివారి దండయాత్రలకు గురియైనదనీ, బ్రిటిష్ పరిపాలన మూలంగానే ఈ పరిస్థితులు పూర్తిగామారి దేశంలో శాంతిభద్రతలు నెలకొనడం, ప్రజలు నెమ్మదిగా జీవితాన్ని సాగించడం, సాధ్యమైనదనీ, ఈ నూతన పరిస్థితులు చెక్కుచెదరకుండా ఉండటానికి బ్రిటిష్ పరిపాలన శాశ్వతంగా ఉండడమొక్కటే సాధనమని, ప్రజాపరిపాలన ఎంతమాత్రం స్థాపించినా అది బ్రిటిష్ అధికారానికి గొడ్డలిపెట్టు కాగలదనీ, అందుచేత దానికి పరిపాలన విధానంలో ఏలాటిస్థానం ఉండరాదనేది వారి వాదంలోని సారాంశము.

ఇదిగాక యుగయుగాలుగా భారతీయులు నిరంకుశ ప్రభుత్వానికి అలవాటుపడినవారు. ప్రజాపరిపాలనను నిర్వహించుటకు కావలసిన అనుభవంగాని నైపుణ్యంగాని వారికి లేదు. పాశ్చాత్యులొక్కరే ఆ విధానాన్ని సాగించడంలో నైపుణ్యంగలవారు. ఏ దేశం ఏ పరిపాలనా విధానానికి అలవాటుపడినదో, ఆ విధానాన్ని అనుసరించడమే దానికి క్షేమాన్ని చేకూరుస్తుంది. భారతీయులకు నిరంకుశ విధానమే శ్రేయోదాయకము.

భారతదేశంలోని ప్రజలలో మతభేదాలు, భాషాభేదాలు, కులభేదాలు మొదలైన భేదాలు లెక్కలేకుండా ఉన్నాయి, ఎన్నుకోబడిన ప్రతినిధి ఒక మతానికి చెందినవాడైతే తక్కిన మతాలవారు అతని ప్రాతినిధ్యాన్ని అంగీకరించరు. ప్రజలందరి ఆమోదాన్ని పొందగల ప్రతినిధిని ఎన్నుకొనడము ఈలాటి దేశంలో సాధ్యంకాదు. బ్రిటిష్‌వారు పరాయివారైనా వారు అందరి ఆమోదాన్ని పొందగలుగుతారు.

బ్రిటిష్‌వారు దేశాన్ని సైనికబలంతో జయించి వశపరచుకొన్నారు. వారి పరిపాలన స్థిరత్వానికి అదే ఆధారం. ప్రజానురాగం, ప్రజాదరణ వారికి అనవసరం. వాటిని సంపాదించడానికి ప్రయత్నించడం వ్యర్థప్రయాస. పరాయి వారు ప్రజాదరణను సంపాదించడం కల్ల. ఇంతకూ ప్రజాస్వామికాన్ని కోరే ఇంగ్లీషు విద్యాధికులు అల్పసంఖ్యాకులు. సామాన్య ప్రజలు, జమీందార్లు. భూస్వాములు, క్షాత్రానికి ప్రసిద్ధిగాంచిన ముస్లింలు, శిక్కులు, రాజపుత్రులు మొదలైనవారు దానిని వాంఛించడంలేదు. ఇంతేకాదు. వారు ఈ విధానాన్ని

ఖండిస్తున్నారు. బ్రిటిష్ వారికి వీరి అభిమానము ఆదరణ అవసరముగాని ప్రజా పక్షానికి నాయకులైన విద్యాధికుల అభిమానంకాదు

ఈ విధంగా బ్రిటిష్‌వారు శాసనసభలలో భారతీయులకు కొంతవరకైనా ప్రాతినిధ్యం ఉండవలెననే వాంఛను తిరస్కరించారు.

కాని దీనిని పూర్తిగా తిరస్కరించడం వారికి సాధ్యంకాలేదు. విద్యాధికులు వారి సంఘాలద్వారాను, వారి వార్తాపత్రికలద్వారాను, వారి సభలు సమావేశాలద్వారాను ప్రజలపై కొంత పలుకుబడిని సంపాదించగలిగారు. అధికారులు వారిని ఎంతగా తూలనాడినా ప్రజాబాహుళ్యంలో అనేకులు వారి మాటలను శ్రద్ధతో ఆలకించేవారైనారు. వారు సమావేశపరచిన సభలకు వేల కొలది జనం రావడమే దీనికి తార్కాణము. వారిని తృప్తిపరచడం అధికారులకు అవసరమైనది. అందుకుగాను 1892 లో పార్లమెంటు ఇండియా కౌన్సిల్ చట్టాన్ని (Indian Councils Act) చేసింది.

దీని ఫలితంగా కేంద్రంలోని శాసనసభలో కార్య నిర్వహణశాఖకు చెందని అదనపు సభ్యుల కనిష్ఠ సంఖ్య 6 నుండి 10 కి, గరిష్ఠ సంఖ్య 12 నుండి 16 కు పెంచబడింది. వీరిలో సగం సభ్యులు అనధికారులుగా ఉండవలెననే నిర్ణయం జరిగింది. ఈ నిర్ణయానుసారం ఇది మొదలు 10 మంది అనధికారులు సభ్యులుగా నియమితులైనారు. మద్రాసు, బొంబాయి, బెంగాలు, ఉత్తరప్రదేశ్ లలోని శాసనసభలలో ఒక్కొక్కటి ఒక ప్రతినిధిని, కలకత్తా వర్తక సంఘం ఒక ప్రతినిధిని ఎన్నుకొనడం జరిగింది. తక్కిన అయిదుగురిని గవర్నరు జనరల్ నియమించేవాడు. ఈ నియామకంలో అతడు ముస్లింలకు, మరికొందరు ప్రత్యేక వర్గాలవారికి ప్రాతినిధ్యం కల్పించాడు. ఎన్నికల విధానం ఒక విధంగా ఈ చట్టంమూలాన కొంత ప్రాధాన్యం వహించింది. దీనితోపాటు ముస్లింల ప్రత్యేక ప్రాతినిధ్యం, ఇతర వర్గాల ప్రత్యేక ప్రాతినిధ్యం అమలులోకి వచ్చాయి. ఈ వర్గ ప్రాతినిధ్యం బ్రిటిష్ పరిపాలనకు ఒక ప్రధాన లక్షణంగా తయారై, "విభజించి పరిపాలించు" (Divide and Rule) అనే సూత్రానికి ప్రధానస్థానం కల్పించినది.

ఇదే విధంగా మద్రాసు బొంబాయి రాష్ట్రాల శాసనసభలలో అదనపు సభ్యుల కనిష్ఠ సంఖ్య 4 నుండి 8 కి గరిష్ఠ సంఖ్య 8 నుండి 20 కి పెంచబడినది. వీరిలో సగానికి తక్కువకాకుండా అనధికారులు సభ్యులుగా ఉండవలెనని నిర్ణయించారు. వీరిలో కొందరిని స్థానికసంస్థలు ఎన్నుకొనే విధానం అమలులోకి వచ్చినది. తక్కిన వారిని గవర్నరులు నియమించేవారు. బెంగాలు, ఉత్తర ప్రదేశ్ శాసనసభలలో గరిష్ఠ సంఖ్య వరసగా 12 నుండి 20 కి, 9 నుండి 15 కు పెంచబడింది.

శాసనసభలు ప్రశ్నలు వేయడానికి, బడ్జెటును చర్చించడానికి అధికారాలు సంపాదించాయి.

కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లుగా ప్రజాపక్షంవారు అనేక సంవత్స

రాలు జరిపిన ఆందోళన ఫలితంగా అనధికారులు కొందరు శాసనసభలలో సభ్యత్వాన్ని సంపాదించగలిగారు. 20 కోట్ల జనంతోకూడిన దేశంలో ఇంతటి స్వల్ప సంఖ్యలో ప్రజలకు సభ్యత్వాన్ని కల్పించడం అంత చెప్పుకోతగ్గ విశేషం కాకపోయినా ప్రభుత్వంవారు కొంతవరకైనా ఎన్నికల విధానాన్ని ప్రవేశ పెట్టడం గుర్తించదగిన విషయం. ప్రజాస్వామిక విధానానికి ఇది ఒక మెట్టుగా ఏర్పడింది. దీని మూలంగా ప్రభుత్వపు నిరంకుశాధికారం ఏవిధంగాకూడా తగ్గకపోయినా ప్రజాభిప్రాయాన్ని తెలియపరచడానికి ప్రజాపక్షం వారికి కొంత అవకాశం లభించినది. 1892 చట్టపు ప్రాధాన్యం ఇదే.

ప్రభుత్వపక్షం ప్రజాపక్షాలమధ్య సంఘర్షణకు దారితీయగల విషయం పరిపాలన యంత్రాంగం అనీ, ఆ సంఘర్షణ ఏలాటిరూపం ధరించినదీ, దాని ఫలతంగా ఏలాటిమార్పులు జరిగినదీ ఇంతవరకు వివరించాము. ఈ వివరణ మూలంగా ఉన్నతోద్యోగాల విషయంలోగాని, శాసనసభలలో ప్రజల ప్రాతినిధ్యం విషయంలోగాని ప్రజాపక్షంవారు వాంఛించిన మార్పులు బహుస్వల్ప పరిమాణంలో జరిగినవని తేలినది. ఆందోళనకు తగిన ఫలితం వారికి లభించలేదు.

ఈ విషయాలలో ప్రభుత్వం ఇంత మొండిపట్టు పట్టడానికి కారణాలు లేకపోలేదు. వాటిలో మొదటిది వారి సామ్రాజ్యాధికారానికి వారి సైనిక బలమే మూలాధారమనే విశ్వాసము. అందుచేతనే 1858 తర్వాత వారు దానిని అనేక విధాల బలపరచుకొన్నారు. 1860 ప్రాంతంలో దాని సంఖ్యా బలం 205,000గా ఉండేది. 1885 నాటికి అది 227,500కు పెరిగింది. ఇదిగాక ఇందులో తెల్లవారి సంఖ్యకూడా పెరుగుతూ వచ్చింది. ఫిరంగీ దళాలనుండి భారతీయులు తొలగింపబడినారు. ఏదళంలోకూడా ఒకే కులంవారు, ఒకే మతంవారు ఉండటానికి వీలులేనట్లుగాను, అన్నిదళాలలోను అన్నికులాలవారు మతాలవారు కలిసి ఉండేటట్లుగా సైనిక నిర్మాణం జరిగినది. ఒకే కులానికి, ఒకే మతానికి చెందినవారు ఏదైనా ఒకదళంలో ఉండిన పక్షాన వారందరూ కలిసి తిరుగుబాటుచేసే ప్రమాదం ఎక్కువగా ఉండగలదనేభావంతో ఈలాటి మిశ్రమదళాలను నిర్మాణం చేశారు. పరిపాలనావిధానంలో "విభజించి పాలించడం" అనే సూత్రం ఎంతటి ప్రాధాన్యాన్ని వహించిందో అంతటి ప్రాధాన్యాన్ని అది సైనిక నిర్మాణంలో కూడా వహించింది.

ఇదిగాక బ్రిటిష్‌వారి మొండిపట్టుకు ఇంకొక కారణం కూడా ఉండినది. దేశాన్ని పాలించడంలో వారు "విభజించి పాలించడం" అనే సూత్రాన్ని అనుసరించ సాగారు. 1858 తర్వాత ఈ చాణక్యనీతి వారి పరిపాలనావిధానానికి ప్రధాన లక్షణంగా రూపొందింది. ముస్లింలకు ప్రత్యేక సదుపాయాలను కల్పించి హిందువుల నుండి వారిని విడదీసి వారు ప్రత్యేక జాతివారనే భావాన్ని బలపరచారు. ఇదే విధంగా జమీందారులు, భూస్వాములు మొదలైన ఫ్యూడల్ వర్గాలను విద్యాధికుల నుండి చీలదీశారు. ఈలాటి వర్గం తమ పక్షంలో ఉన్నంత

కాలం స్వల్ప సంఖ్యాకులైన విద్యాధికుల మూలంగా తమకు ఏలాటి ప్రమాదం సంభవించదని వారు భావించారు. అలాగే సైన్యంలో శిక్కులు, జాటులు, రాజ పుత్రులు, గూర్ఖాలు, ముస్లింలు మొదలైన వారిని ఎక్కువ సంఖ్యలో చేర్చుకొని వారందరిని బ్రిటిష్‌పరిపాలన పట్ల భక్తిగలవారినిగా చేసుకొన్నారు. ఈ చాణక్య నీతిమూలంగా తమ సామ్రాజ్యం సుస్థిరంగా ఉండగలదనే విశ్వాసం వారిలో కుదిరింది. విద్యాధికులప్రచారంమూలంగాను, వారు నిర్మాణంగావించిన సంఘాలు మూలంగాను, ఇతర పరిస్థితుల మూలంగాను ఉద్యమాల మూలం గాను ప్రజలలో జాతీయ భావం బలపడుతూ ఉండినా ఈ మార్పును అధికారులు పూర్తిగా తూలనాడారు. అనేకభేదాలతో కూడుకొన్న భారతీయులు ఎన్నటికీ వాస్తవంగా ఒక జాతిగా నిర్మాణమై, తమ సామ్రాజ్యానికి ప్రమాదం కలిగించడం కల్ల అనే భావం అధికారులలో ముదిరినది. తమ కండ్లఎదట భారతీయులలో కలుగుతున్న మార్పులను వారు గుర్తించలేకపోయినారు.

ప్రభుత్వానికీ, ప్రజాపక్షానికీ మధ్య సంఘర్షణకు దారి తీయగల మూడవ విషయం దైనందిన పరిపాలనలో ప్రభుత్వం అనుసరించే విధానాలు. 1858 తర్వాత ప్రభుత్వం అనుసరించిన విధానాలలో అనేకం ఈలాటి సంఘర్షణకు దారి తీశాయి.

1857-58 తిరుగుబాటు కారణంగా ప్రభుత్వపు ఖర్చులు విపరీతంగా పెరిగిపోయాయి. అటుతర్వాత కాలక్రమాన సైనికబలం వృద్ధికావడంచే తను, అందులో తెల్లవారిశాతం పెరగడంచేతను, సామ్రాజ్యవ్యాప్తికై దేశానికి వెలుపల జరిగిన రెండవఆఫ్గన్ యుద్ధం వంటి యుద్ధాలలో భారత సైన్యాలు పాల్గొనడంచేతను, దేశపరిపాలనలోకూడా ఉద్యోగసిబ్బంది ఖర్చులు పెరగడం చేతను, మామూలు పన్నుల ద్వారా వసూలైన ఆదాయం ప్రభుత్వానికి చాలకపోయినది. అందుచేత లైసెన్సు పన్ను, ఆదాయపు పన్నులవంటి ప్రత్యక్ష పన్నులను విధించ వలసివచ్చింది. ఈ పన్నులు దేశానికి కొత్తవి కావడం చేతను, వాటిని విధించి వసూలు చేయడంలో అధికారులు నిరంకుశం గాను నీతిరహితంగాను ప్రవర్తించే అవకాశం ఉండడం చేతను ప్రజలు వాటిని ప్రతిఘటించారు. కొన్ని ప్రదేశాలలో హర్తాలులు, బందులు జరిగాయి. ప్రతి ఘటించిన వారిపై ప్రభుత్వం కఠిన చర్యలు తీసుకొనడంచేత ప్రజలలో అలజడి అసంతృప్తి వ్యాపించినాయి. ఈ పన్నులకుతోడు ఉప్పుపన్ను మొదలైన పాత పన్నులను కూడా పెంచవలసిరావడంచేత అలజడి మరింత ఎక్కువఅయినది.

ఇదేకాలంలో రోడ్లూ, ఆరోగ్యము, ప్రాథమికవిద్య మొదలైనవాటికి కొన్ని పన్నులను, శిస్తులను, ప్రత్యేకంగా విధించారు. ఈలాటివన్నీ స్థానిక ప్రయోజనాలనీ, వాటికిగాను ప్రభుత్వం చేయవలసిన ఖర్చులను ఆయా స్థానాలలో-అంటే పట్టణాలలోను, జిల్లాలలోను, తాలూకాలలోను - నివసించే ప్రజలు మాత్రమే భరించడం యుక్తమనే కొత్త సూత్రాన్ని ఆధారంచేసుకొని

ఈలాటి పన్నులను విధించారు. దీని మూలంగా పన్నుల భారం మరింత పెరిగిపోతున్నదని ప్రజలు భావించసాగారు. మునిసిపాలిటీలలోగాని ఇతర స్థానిక సంస్థలలోగాని ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులకు స్థానం లేకపోవడం వారి ఆగ్రహానికి కారణమైనది.

అన్ని దేశాలలోనూ, అన్ని కాలాలలోనూ దిగుమతులపై సుంకాలను విధించి ప్రభుత్వం ఆదాయాన్ని సంపాదించడం పరిపాటి. భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వం చాలాకాలాననుండి ఈ విధానాన్ని అనుసరిస్తూ వచ్చినది. కాని 1858 తర్వాత బ్రిటన్‌లోని మిల్లు యజమానులు తాము భారతదేశానికి పంపే బట్టలు మొదలైన సరుకులపై సుంకాలను విధించరాదని అధికారులను ఒత్తిడి చేయసాగారు. వారి ఒత్తిడిని ఎదుర్కోలేక ప్రభుత్వం సుంకాలను రద్దు చేయడమో లేక తగ్గించడమో జరిగింది. దీనిమూలంగా కోల్పోయిన ఆదాయాన్ని భర్తీచేయడానికి ప్రజలపై ఇతరపన్నులను విధించవలసివచ్చినది. సుంకాలను విధించినప్పుడు భారతదేశంలో తయారైన మిల్లుబట్టలపైనను, నూలు పైనను ఎక్సైస్‌పన్నును విధించడం జరిగినది. దీనిమూలంగా దూది పరిశ్రమకు చాలానష్టం సంభవించినా ప్రభుత్వం తన విధానాలను చాలాకాలం వరకూ మార్చుకోలేదు. పారిశ్రామికుల అలజడికి ఇది కారణమైనది.

సైన్యానికీ, యుద్ధాలకూ, ఉద్యోగులజీతాలకూ ఎక్కువసొమ్ము ఖర్చు కావడంచేత రైతులకుఅవసరమైన జలాధారాలనిర్మాణానికిగాని, ఇతరసదుపాయాలకుగాని, తగినంతప్రమాణంలో ఖర్చుచేయడానికి సొమ్ము లేకపోయింది. క్షామకాలంలో ప్రభుత్వం అవసరమైనచర్యలను తీసుకొనడం సాధ్యంకాలేదు. దేశంలో అత్యధికజనానికి వ్యవసాయమే ప్రధానవృత్తిగా ఉండేది. వ్యవసాయం పట్ల ప్రభుత్వంచూపిన నిర్లక్ష్యం వారి అసంతృప్తికి కారణంగా పరిణమించింది.

1870 తర్వాత ఉన్నతవిద్యకై ప్రభుత్వం ఖర్చుచేయరాదనే నిర్ణయం జరిగింది. దీనిమూలంగా విద్యారంగంలో మిషనరీల ప్రభావం బలపడినది. 1858లో విక్టోరియామహారాణి ప్రజలమతంపట్ల ప్రభుత్వం ఏలాటిజోక్యం కలిగించుకోదని హామీ ఇచ్చినా, అధికారులు అనేకవిధాలుగా మిషనరీల మతప్రచారానికి తోడ్పడుతూనేవచ్చారు. ఇది విద్యాధికుల తీవ్ర విమర్శకు గురి అయింది.

"విభజించి పరిపాలించు" అనేసూత్రానికి అనుగుణంగా ముస్లింలకు ప్రత్యేక సదుపాయాలను కల్పించడం, జమీందారులను గొప్ప భూస్వాములను, శిక్కులు మొదలైనవారిని జనసామాన్యంనుండి విడదీసి తమకు సన్నిహితులుగా చేసుకొనడం విద్యాధికులు విమర్శించసాగారు. జాతీయతను బలపరచడానికి వారు కృషిచేయడమూ, దానిని నిరోధించడానికి ప్రభుత్వంవారు కొన్ని వర్గాలవారిని చేరదీయడమూ రెండు పక్షాలమధ్య సంఘర్షణ సంభవించేటట్లుచేశాయి.

పై విషయాల గురించి రెండవ మూడవ అధ్యాయాలలో పూర్తిగా వివరించడం జరిగింది. వాటిని గురించి తిరిగి ఇచ్చట వివరించవలసిన అవసరం

లేదు. ఈ విధానాలమూలంగా దేశంలో అలజడి అసంతృప్తి వ్యాపించినదనే దాన్ని మాత్రమే గుర్తించవలసి ఉంది.

ఈ అలజడి, అసంతృప్తి మూలంగా ప్రభుత్వంపై తిరుగుబాటు సంభవించే ప్రమాదం ఉన్నట్లు అనేకులు భయపడినారు. ఆలాటివారిలో కాంగ్రెసు పితామహుడుగా ప్రఖ్యాతిగాంచిన హ్యూం అనే బ్రిటీష్ ప్రముఖుడు ఒకడు. ఇతడు యువకుడుగా పోటీపరీక్షలో కృతార్థుడై 1849లో ఉద్యోగిగా భారతదేశానికి వచ్చాడు. 1849 మొదలు 1867 వరకు జిల్లా కలెక్టరుగా పనిచేశాడు. బ్రిటీష్‌వారు భారతీయుల ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని పరిపాలనను సాగించడం వారి ప్రధాన కర్తవ్యమని ఉద్ఘాటించి, విద్యావ్యాప్తికి, త్రాగుడు నిర్మూలనానికి, సంఘ సంస్కరణానికి, తెల్లవారి జాత్యహంకార నిర్మూలనానికి ఘనంగా కృషి చేశాడు. క్రమక్రమంగా అతడు ఉన్నత పదవులలోకి వచ్చి కేంద్రప్రభుత్వంలో కార్యదర్శులలో ఒకడయ్యాడు. కాని తక్కిన ఉద్యోగులు అతనివిధానాలను, భారతీయులపట్ల అతడు ప్రదర్శించిన సానుభూతిని విమర్శించి లిట్టన్ రాజప్రతినిధిగా ఉండిన కాలంలో అతని ఉన్నతోద్యోగానికి అడ్డు తగిలారు. అంతటితో అతడు ఉద్యోగంనుండి విరమించి, ఫించన్ పుచ్చుకొని స్వదేశానికి వెళ్ళడానికిబదులు భారతదేశంలోనే భారతీయుల అభివృద్ధికి కృషి చేసే ఉద్దేశంతో ఉండిపోయాడు. అతడు అధికార పదవులలో ఉండిన కాలంలో ప్రజల స్థితిగతులనుగురించి అధికారులు అనధికారులు వార్తాపత్రికల సంపాదకులు తదితరులు తయారుచేసిన నివేదికలను రచనలను పరిశీలించి, ప్రజలలో అలజడి, అసంతృప్తి ఏర్పడిఉన్నదన్న విషయాన్ని తాను గ్రహించడమేగాక దానిని రాజప్రతినిధుల దృష్టికి తెచ్చాడు. కాని వారు అతనిఅభిప్రాయాలను లక్ష్య పెట్టలేదు. అతడు ఉద్యోగంనుండి 1882లో విరమించి, భారతీయుల శ్రేయస్సుకై కృషిచేయుటకు నిర్ణయించుకొనడానికి ఇదికూడా ఒక కారణమైనది.[1]

బాధలు దుర్భరములైనప్పుడు సామాన్య రైతులు కూడా భూస్వాములపై తిరుగుబాటు చేయడానికి వెనుదీయరనీ, దానిమూలంగా ప్రభుత్వం ఎదుర్కోవలసిన సమస్యలు క్లిష్టరూపం ధరించగలదని 1858 తర్వాత సంభవించిన సంఘటనలలో కొన్ని రుజువు చేశాయి. 1859-62లో బెంగాలులోని

---

1. 1879 నుండి అతడు దివ్యజ్ఞానసమాజానికి సన్నిహితుడైనాడు. దాని ఆశయాలలో అగ్రస్థానం వహించిన అఖిల మానవ సోదరభావము, అన్నిమతాలకు ఆర్యావర్తన జన్మభూమి అనీ, ఆర్యావర్తం నుండి ప్రపంచమంతా తెలుసుకోదగిన సత్యాలు అనేకం ఉన్నవని, పాశ్చాత్యులు కూడా వాటిని తెలుసుకొని తరించగలరని ఆ సమాజం ప్రచారం చేసిన విషయము అతనిపై గొప్ప ప్రభావం వహించి భారతీయుల శ్రేయస్సుకై అతడు కృషి గావించుటకై తీసుకొన్న నిర్ణయాన్ని మరింత బలపరచింది దివ్య జ్ఞానసమాజం మూలంగా అతడు భారతదేశంలోని విద్యాధికులకు పరిచితుడై వారి విశ్వాసానికి పాత్రుడైనాడు. ఈ కారణాలన్నిటి మూలంగా 1882 మొదలు భారత రాజకీయ రంగంలో అతడు గొప్పపాత్రను వహించగల వాడైనాడు.

నీలిమందు తోటల రైతులు తెల్లభూస్వాములపైన చేసిన తిరుగుబాటు, 1873లో అదే రాష్ట్రంలోని పబ్నాజిల్లా రైతుల తిరుగుబాటు, 1875లో దక్కన్ రైతులు భూస్వాములపైన సాహుకార్లపైన చేసిన తిరుగుబాటు ఈలాటి సంఘటనలలో కొన్ని. ఆనాటి అనధికార రాజకీయసంఘాలలో నాయకత్వంవహించిన విద్యార్థులు, వార్తాపత్రికల సంపాదకులు, ఈ సంఘటనలలో రైతులను సమర్థించి వారికెంతో సహాయపడడం ప్రభుత్వ దృష్టిని ఆకర్షించినది. విద్యార్థులనాయకత్వంలో సామాన్యప్రజలు తిరుగుబాటు చేసినపక్షంలో ఆ తిరుగుబాటులు 1857-58లో సంభవించిన సిపాయీల తిరుగుబాటుకంటే ప్రమాదకరం కాగలదని అధికారులు భావించారు. హ్యూం వంటి వారు ఈ భావాన్ని బలపరచారు.

1876లో బ్రిటన్‌లోని టోరీ పక్షానికి చెందిన లిట్టన్ ప్రభువు రాజప్రతినిధిగా భారతదేశానికి వచ్చి అనుసరించినవిధానాలు ఈ దృష్ట్యా చాలా ప్రాధాన్యాన్ని వహిస్తున్నాయి. టోరీపక్షంవారు సామ్రాజ్యతత్వంలో పూర్తి విశ్వాసం కలవారు. మానవకోటిలో శ్వేతజాతివారు పాలకులుగాను రంగుజాతులవారు పాలితులుగాను ఉండేటట్లు సృష్టి జరిగిందని నమ్మినవారు. ఈ విశ్వాసాలకు అనుగుణంగా లిట్టన్‌ప్రభువు ఆఫ్గనిస్థానాన్ని వశపరచుకొనడానికి రెండవ ఆఫ్గన్‌యుద్ధాన్ని సాగించాడు. దేశంలో గొప్పక్షామం సంభవించి గ్రామీణప్రజలు నానాబాధలను అనుభవిస్తూ ఉండిన కాలంలో పెద్ద అట్టహాసంతో 1877లో ఢిల్లీ దర్బారును జరిపి విక్టోరియా మహారాణీ కైసరిహింద్ (హిందూదేశపు చక్రవర్తి) అనేబిరుదును వహించడాన్ని ప్రకటించాడు. దేశీయపత్రికలపై నిర్బంధాలను విధిస్తూ 1878లో దేశీయ పత్రికాచట్టాన్ని చేసి, దానిద్వారా విద్యార్థుల నోరును మూయడానికి నిర్ణయించుకొన్నాడు. ఆయుధాలను ధరించడానికి తెల్లవారికి మాత్రమే హక్కు కలదనీ భారతీయులకు ఆలాటి హక్కు లేదనీ ఒకచట్టాన్ని (Arms Act) గావించాడు. ఉన్నత ఉద్యోగాలవిషయమై 1833 చార్టరు చట్టంలోను, 1858నాటి విక్టోరియా మహారాణి ప్రకటనలోను చేసిన వాగ్దానాలను రద్దుచేయవలసినదిగా బ్రిటన్‌లోని అధికారులకు సూచించాడు. ఈ విధానాలన్నీ విద్యార్థులలోను, ప్రజాపక్షంలోను, అంతకు పూర్వం ఏర్పడిన అసంతృప్తికి మరింత బలాన్ని చేకూర్చినాయి. కాని 1880లో బ్రిటన్‌లోజరిగిన ఎన్నికలఫలితంగా టోరీ పార్టీకి బదులు లిబరల్‌పార్టీ అధికారంలోకి వచ్చినందువల్ల లిట్టన్ రాజప్రతినిధిపదవినుండి నిష్క్రమించవలసి వచ్చింది. అతనిస్థానే లిబరల్‌పక్షానికి చెందిన రిప్పన్ ప్రభువు రాజప్రతినిధిగా భారతదేశానికి వచ్చి నాలుగు సంవత్సరాలకాలం అధికారాన్ని వహించాడు. అతనిరాకతో దేశంలోని రాజకీయవాతావరణం మారిపోయినది. అతని పదవీకాలంలో దేశానికి రాజకీయంగా లాభం కలగగలదనే విశ్వాసం ప్రజాపక్షం వారిలో రేకెత్తినది.

లిబరల్ పక్షానికి చెందినవారిలో సామ్రాజ్య తత్వం కొంత తగ్గుస్థాయిలో

ఉండినది. వారు ఉన్న సామ్రాజ్యంతో తృప్తిపొంది, దానిని విస్తరించవలసిన అవసరం లేదని భావించారు. ఇదిగాక సామ్రాజ్యాధికారానికిలోబడిన భారత దేశాన్ని ప్రధానంగా భారతీయులప్రయోజనాలదృష్ట్యా పరిపాలించవలసిన దనీ, బ్రిటిషువారి ప్రయోజనాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇయ్యరాదనీ ఉద్ఘాటించారు. బ్రిటిష్ సామ్రాజ్యం శాశ్వతంగా నెలకొనడం సాధ్యంకాదనీ, అన్ని సామ్రాజ్యాలు అంతరించినట్లే అదికూడా ఎన్నిటికో ఒకనాటికి కాలగర్భంలో కలిసిపోవడం తప్పదని, ఆలాంటిసమయం ఆసన్నంకాకముందే భారతీయులు వారిదేశాన్ని వారు స్వతంత్రంగా పాలించుకొనే అర్హత గలవారు కావడం అవసరమనీ, ఆ అర్హతను వారు సంపాదించేటట్లు వారిని తర్ఫీదు చేయడం బ్రిటిష్ వారి కర్తవ్యమనీ, క్రమక్రమంగా ప్రాతినిధ్య ప్రభుత్వవిధానాన్ని దేశంలో ప్రవేశపెట్టి పరిపాలనలో వారికి భాగస్వామ్యం కల్పించడం దీనికి మార్గమనీ, ఈ మార్గాన్ని అనుసరించడంలో విద్యాధికుల సహకారాన్ని సంపాదించడం ప్రాజ్ఞత అనీ వారు భావించారు. లిబరల్ పక్షానికిచెందిన రిప్పన్ ప్రభువు ఈ తత్వాన్ని తన పదవీకాలంలో కొంతవరకైనా ఆచరణలో పెట్టడానికి కృత నిశ్చయుడైనాడు.

ఈలాటి అభిప్రాయాలే గలిగిన హ్యూం పదవీ విరమణ చేసిన తర్వాత సిమ్లా నగరంలో కాపురం పెట్టినాడు. అది భారత దేశానికి వేసవికాలపు రాజధాని. రిప్పన్ కూడా భారతదేశానికి వచ్చినతర్వాత 5 నెలలు అక్కడేఉండడం చేత వారిద్దరు అప్పుడప్పుడు కలుసుకొనడం, దేశపరిపాలననుగురించి చర్చించడం సాధ్యమైనది. రిప్పన్‌కు హ్యూం సన్నిహితుడైనాడు. ఈ కారణంచేత విద్యాధికులపై ఇతని ప్రభావం పెరిగినది. రాజకీయరంగంలో ఇతనికృషికి ప్రాధాన్యమూ, గౌరవమూ లభించాయి. రిప్పన్‌కాలంలో ఇతడు ఒకవిధంగా రాజప్రతినిధికీ, విద్యాధికులకూ మధ్య ఒక రాయబారిగా తయారైనాడు.

లిబరల్ తత్వాన్ని అనుసరించి రిప్పన్ తలపెట్టిన కార్యక్రమాలన్నింటిని బ్రిటిష్‌లోని టోరీలు, భారతదేశంలో ఉద్యోగంచేసి పించను పుచ్చుకొన్న ఉద్యోగులు, ఇండియాకౌన్సిలుసభ్యులలో అనేకులు, భారత దేశంలోని బ్రిటిష్ వారిలో అధికసంఖ్యాకులు ప్రతిఘటించారు. వారి ప్రతిఘటనను ఎదుర్కొనడంలో రిప్పన్‌కు విద్యాధికుల సహాయం అవసరమైనది. వారందరూ ఏకకంఠంతో తన కార్యక్రమాలలోని లోపాలను విమర్శించడానికి బదులు వాటిని సమర్థించిన పక్షంలో తన దేశీయుల ప్రతిఘటనను ఎదుర్కొనడం సులభ సాధ్యం కాగలదని అతడు భావించాడు. ఈ సందర్భంలో అతడు హ్యూం ను ఎక్కువగా వినియోగించుకొన్నాడు.

పదవి స్వీకారం చేసిన వెంటనే రిప్పన్ ప్రభువు ఆఫ్‌గన్ స్థానంతోటి యుద్ధాన్ని ముగించి, ఆ దేశం నుండి భారత సైన్యాలను ఉపసంహరించాడు. ఇది విద్యాధికులకు చాలాతృప్తిని కలిగించింది. 1882 లో దేశీయవార్తా పత్రికల చట్టాన్ని రద్దుచేసి, విద్యాధికుల కృతజ్ఞతకు పాత్రుడైనాడు. ప్రాతి

నిధ్య పరిపాలన ప్రవేశపెట్టడానికి మొదటిమెట్టుగా స్థానికసంస్థలలో - మునిసిపాలిటీలు, జిల్లా బోర్డులు, తాలూకా బోర్డులు మొదలైన వాటిలో– ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులకు ఎక్కువ సంఖ్యలో ప్రాతినిధ్యం కల్పిస్తూ, రోడ్లు, విద్య, ఆరోగ్యం మొదలైన స్థానికవ్యవహారాల పరిపాలనను వారి వశం చేయడానికి నిర్ణయించి, ఆ నిర్ణయానుసారం చట్టాలు చేయవలసిందిగా రాష్ట్రప్రభుత్వాలను ఆదేశిస్తూ 1882 మే నెలలో ఒక అధికార పత్రాన్ని విడుదల చేశాడు.

ఇది మొత్తపుపరిపాలన యంత్రాంగంలో బహుస్వల్పమైన మార్పు అయినా ఇది క్రమక్రమంగా రాష్ట్ర పరిపాలనలోను, కేంద్ర పరిపాలనలోను, ప్రాతినిధ్య పరిపాలనకు దారితీయగలదని, దానిఫలితంగా బ్రిటిష్‌వారి అధికారం తొలగిపోవడం తప్పదనీ గోరంతలను కొండంతలు చేస్తూ టోరీలు, ఇండియా కౌన్సిలులోని సభ్యులు, బ్రిటన్‌లోని తదితరులు కొందరు, భారతదేశంలో ఉన్నతోద్యోగి వర్గానికి చెందిన వారిలో అనేకులు, ప్రతిఘటించారు. కాని దేశంలోని విద్యాధికులందరు దీనిని పూర్తిగా సమర్థించారు. వారిని సమర్థించే వారినిగా చేయడంలో రిప్పన్ సలహాతో (ఇది రహస్యంగా ఇచ్చిన సలహా) హ్యూం గొప్ప పాత్రను వహించాడు. విద్యాధికులు రిప్పన్‌కు సన్నిహితులైనారు.

శాసన సభలలో కూడా భారతీయులకు కొంత ప్రాతినిధ్యం కల్పించవలసిందిగాను, పోటీపరీక్షలను ఏకకాలంలో బ్రిటన్‌లోను, భారత దేశంలోను జరపవలసిందిగాను, అభ్యర్థులవయస్సును 21 సంవత్సరాలకు పొడిగించవలసిందిగాను రిప్పన్ బ్రిటన్‌లోని అధికారులకు సిఫారసులు చేశాడు గాని వారు ఈలాటి మార్పులకు తగిన సమయం రాలేదని వాటిని ప్రవేశ పెట్టడానికి సమ్మతించరైరి. తాను చేయదగిన ప్రయత్నాన్నిన్ని శక్తివంచన లేకుండా రిప్పన్ చేశాడన్న విశ్వాసం విద్యాధికులకు కలిగింది. అతడు వారి గౌరవాభిమానాలకు మరింత పాత్రుడైనాడు.

1883 ఫిబ్రవరిలో రిప్పన్ పదవీకాలంలో మితిమీరిన వాదోపవాదాలకు గురి అయిన ఇల్బర్టు బిల్ (Ilbert Bill) అనే పేరుగాంచిన బిల్లును శాసన సభలో ప్రభుత్వం ప్రవేశపెట్టింది. కార్యనిర్వాహక సభలో సభ్యుడైన ఇల్బర్టు దీనిని ప్రవేశపెట్టడంచేత దీనికి ఆ పేరు వ్యవహారంలోకి వచ్చింది. అంతకు పూర్వం కలకత్తా, మద్రాసు, బొంబాయి నగరాలలో తప్ప తక్కినప్రదేశాలలో నేరంచేసిన యూరోపియన్లను విచారణచేసి శిక్షించే అధికారం యూరోపియన్ జిల్లా మేజిస్ట్రేటులకేగాని భారతీయులైన జిల్లా మేజిస్ట్రేటులకు ఉండేది కాదు. 1882 వరకు భారతీయులెవ్వరు జిల్లా మేజిస్ట్రేటు పదవులలోకి రానికారణంగా ఈ నియమం ఏలాటి విమర్శకూ గురికాలేదు. కాని 1882 నాటికి పోటీపరీక్షలలో ఉత్తీర్ణులై ఉన్నతోద్యోగివర్గానికి చెందిన భారతీయులిద్దరు జిల్లా మెజిస్ట్రేటు పదవిలోకి వచ్చారు. ఒకే ఉన్నతోద్యోగి వర్గానికి చెందిన వారిలో అధికారవిషయంలో ఈలాటి తారతమ్యం ఉండడం

చాలా అసంగతమని బ్రిటన్‌లోని మంత్రి మండలి సమ్మతి తోను, భారతదేశం లోని రాష్ట్రప్రభుత్వాల సమ్మతితోను రిప్పన్ ప్రభుత్వం ఈ బిల్లును ప్రవేశ బెట్టినది. అయినా దీనిని ప్రతిఘటిస్తూ భారతదేశంలోని బ్రిటిషు వారందరు—అధికారులు, అనధికారులు- ఒక గొప్ప ఆందోళనను లేవదీశారు. హీనజాతికి చెందిన భారతీయులకు ఉన్నత జాతికిచెందినవారిని విచారణచేసి శిక్షించే అధికారం ఎన్నటికీ ఉండరాదనీ, అలాటి అధికారం బ్రిటిష్ సామ్రాజ్యానికి గొడ్డలి దెబ్బవంటిదనీ, వాదిస్తూ వీరందరూ కలిసికట్టుగా దేశమందంతటా సభలూ సమావేశాలూ జరిపి, రిప్పన్‌ను ఈ బిల్లు విషయంలోనే గాక సమస్త విషయాలలో తూలనాడినారు. యూరోపియన్‌ల హక్కులపరిరక్షణార్థం దేశంలో ఒక యూరోపియన్ రక్షణ సంఘాన్ని (European Defence Association) స్థాపించారు. దీనికార్యకలాపాలకు లక్ష యాభై వేలరూపాయల నిధిని సేకరించారు. బ్రిటన్‌లోని టోరీలు వార్తాపత్రికల సంపాదకులు వారివాదాన్ని గట్టిగా సమర్థించారు. వీరిలో కొందరు రిప్పన్‌ను బంధించి రహస్యంగా బ్రిటన్‌కు పంపివేయడానికి ఒక కుట్రనుకూడా పన్నినారు.

ఈ పరిస్థితులలో ఇల్బర్టు బిల్లును యథాతథంగా చట్టం చేయడం ప్రాజ్ఞత కాదనే భావంతో ప్రతిఘటించిన వారితో ఒక రాజీ చేసుకొని, నేరంచేసిన యూరోపియనులను విచారణచేసి శిక్షించవలసివచ్చినప్పుడు అర్థసంఖ్యా బలంగల యూరోపియన్ జూరర్లు ఉండవలెననే సవరణను బిల్లులో ప్రవేశపెట్టి రిప్పన్ దానిని చట్టం చేశాడు, మెజిస్ట్రేటులు భారతీయులైనా, జ్యూరర్లు యూరోపియనులు కావడం చేత నేరంచేసినవారు శిక్షనుండి తప్పించుకొనే అవకాశం యథాపూర్వంగా ఉండినది. న్యాయవిచారణలో జాతివిచక్షణ పూర్తిగా తొలగలేదు.

ఈ ఆందోళన కాలంలో విద్యాధికులు రిప్పన్‌ను పూర్తిగా సమర్థించారు. కాని తుదకు అతడు రాజీకి దిగడం వారికి ఆమోదయోగ్యం కాలేదు. దానిని గురించి వారు ఘాటుగా వార్తాపత్రికలలో వ్రాయడమూ, సభలలోను సమావేశాలలోను విమర్శించడమూ సమంజసం కాదనే భావంతో హ్యూం వారితో సంప్రతించి రిప్పన్‌పట్ల వారికదివరకు కలిగిన సుహృద్భావానికి అంతరాయము కలగకుండా చేశాడు. పరిస్థితులు విషమించిన కారణంగా రిప్పన్ ఈలాటి రాజీలోకి దిగవలసిన వాడైనాడని, భారతీయుల పట్ల అతనికిగల సానుభూతిలో ఏలాటి మార్పూ సంభవించలేదని, వారిపట్ల బద్ధవిరోధం వహించినవారు దేశంలోని అధికార అనధికార బ్రిటిషువారని, వారి విరోధాన్ని ఎదుర్కొనడం కోసం భారతీయులుకూడా కలసికట్టుగా ఒక కేంద్ర సంఘాన్ని స్థాపించి, దాని సాధనాన తమ కార్యక్రమాలను సాగించడం వారి ప్రధానకర్తవ్యమని, వారికి నచ్చచెప్పాడు. ఈసలహాలోని సుగుణాన్ని విద్యాధికులు గ్రహించి అలాటి సంఘాన్ని స్థాపించడానికి 1884, 1885లో ప్రయత్నం చేశారు- 1885 డిసెంబరులో స్థాపింపబడిన భారతజాతీయ కాంగ్రెసు (Indian National Congress) ఆ ప్రయత్నాల ఫలితమే. ఇల్బర్టు బిల్లు సందర్భంలో యూరోపియనులు లేవదీసిన

ఆందోళన ఈ విధంగా దేశీయ రాజకీయాలలో గొప్పమార్పునకు దారి తీసింది. ఒక్కొకప్పుడు చెడుగునుంచికూడా సత్ఫలితాలు లభించగలవన్న దానికి ఇది ఒక నిదర్శనమని చెప్పవచ్చు.

ఈ సందర్భంలో రిప్పన్ ప్రభువు 1882లో కలకత్తా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో ఉపన్యసిస్తూ విద్యార్థికులను ఉద్దేశించి చెప్పిన మాటలుకూడా ఈలాటి పరిణమానికి క్రమక్రమంగా దారి తీశాయి. ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని గౌరవించడానికి సంసిద్ధంగా ఉన్నా దేశంలో ఒక్కొకరాష్ట్రంలోని వారు, ఒక్కొకవర్గానికి చెందినవారు ఒకే విధమైన అభిప్రాయాన్ని కలిసి కట్టుగా వ్యక్తం చేయడానికిబదులు వివిధములైన అభిప్రాయాలను వ్యక్తం చేయడం మూలాన ప్రజాభిప్రాయం ఏదో తెలుసుకోనడం కష్టసాధ్యంగా ఉన్నదనీ, ఈ పరిస్థితి మారవలసిన అవసరం ఉన్నదనీ, అతడు ఉద్ఘాటించాడు. ఈ ఉద్ఘాటనలోని సత్యాన్ని విద్యార్థికులు గ్రహించి, అప్పటినుండి దేశంలో ఒక కేంద్ర రాజకీయసంఘం ఏర్పడిన పక్షాన ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేయడానికి ఎక్కువ అవకాశం లభిస్తుందని భావించి అందుకుగాను 1882-85 మధ్య ప్రయత్నాలు చేశారు. ఈ విధంగా రిప్పన్ ఇచ్చిన సలహాకూడా కాంగ్రెసు స్థాపనకు దారితీసింది.

ఇల్బర్టు బిల్లు విషయంలో ఆంగ్లోఇండియనులందరు మూకఉమ్మడిగా చేసిద ఆందోళన ఫలితంగా రిప్పన్ ప్రభువు 5 సంవత్సరాల కాలం పూర్తికాక ముందే తన పదవికి 1884 సెప్టంబరులో రాజీనామా చేశాడు. ఇది విద్యార్థికులకు కొంతవిచారం కలిగించింది, కాని ఈ సందర్భంలో అతని పట్ల తమకృతజ్ఞతను అందరూ కలిసి తెలియపరచవలసిందిగా నిర్ణయించుకొని కుల జాతి మత భేదాలను పాటించకుండా అందరు 1884 డిసెంబరులో కలకత్తా నుండి బొంబాయికి అతడు ప్రయాణం చేసినప్పుడు వేలాది జనంతో కూడిన వీడ్కోలు సభలూ సమావేశాలూ జరిపి, వీడ్కోలుపత్రాలను అతనికి సమర్పించారు. దేశంలో ఒక విధంగా జాతీయ ఏకత్వం ఏర్పడినదన్న దానికి ఈ సమావేశాలు, వీడ్కోలు పత్రాలు సాక్షీభూతములైనవి, ఈ ఏకత్వం సుస్థిరంగా ఉండవలెననే వాంఛ విద్యార్థికులలో ప్రబలి 1885లో అది కార్యరూపం ధరించి కాంగ్రెసు సంస్థాపనకు దోహదకారి అయినది.

ఈ విధంగా పరి పరి విధాలుగా రిప్పన్ పదవీ కాలంలోని సంఘటనలనేకం కలిసి కాంగ్రెసు సంస్థాపనకు దారితీశాయి.

చదవదగిన గ్రంథాలు.

S.R. Merhotra : Emergence of the Indian National Congress.
Anil Seal : Emergence of Indian Nationalism.
Bharatiya Vidya Bhavan Vol X.
Tarachand : Vol. II.

# అధ్యాయము - 8

## రాజకీయోద్యమము. భారత జాతీయ కాంగ్రెసు పుట్టుక

### 1

1858 తర్వాత ప్రభుత్వపక్షం ప్రజాపక్షం అనే రెండు పక్షాలు ఏర్పడడమూ, వాటి మధ్య సంఘర్షణలు సంభవించడమూ రాజకీయోద్యమానికి ప్రధాన లక్షణమని, ఈ సంఘర్షణకు ప్రభుత్వ యంత్రాంగంలో ప్రజాపక్షంవారు సూచించిన మార్పులపట్ల ప్రభుత్వం విముఖత్వం వహించడమూ దైనందిన పరిపాలనలో ప్రభుత్వం అనుసరించిన విధానాలూ కారణాలనీ, క్రిందటి అధ్యాయంలో వివరించాము. ఈ వివరణ ఆనాటి ప్రభుత్వదృక్పథం ఎలాటిదో తెలియపరుస్తుంది. ఇప్పుడు ప్రజాపక్షంవారు తమ కార్యక్రమాలను నడుపుకొనడానికి స్థాపించిన రాజకీయసంఘాలను గురించీ, వాటి పరిణామాన్ని గురించీ, తెలుసుకోవలసి ఉన్నది.

ప్రభుత్వ కార్యకలాపాలు సాగడానికి ఒక పటిష్ఠమైన యంత్రాంగం ఉన్నది. దాని విధానాలను విమర్శించడానికీ ఎదుర్కొనడానికీ, ప్రజాపక్షం వారికికూడా ఒక పటిష్ఠమైన యంత్రాంగం ఏర్పడడం అవసరము. ఆ పక్షంవారు ఈ అవసరాన్ని రాజకీయసంఘాల ద్వారా తీర్చుకొనదలచారు. వారికృషి వీటితో ముడిపడి పోయినది.

ఈలాటి సంఘాలు దేశానికి క్రొత్త. కాని ఇంగ్లీషువిద్యను నేర్చుకొన్న మేధావి వర్గంవారు బ్రిటన్‌లో ఇటువంటి సంఘాలు కృషిచేసి ప్రభుత్వం ద్వారా తమ వాంఛలను తీర్చుకొనడమూ, భారతదేశానికివచ్చిన అధికారేతర బ్రిటిష్ వారు ఈలాటిసంఘాలను స్థాపించుకొనడమూ చూచి తాము కూడా ఈలాగే చేసిన పక్షాన పరిపాలకుల నుండి తాము వాంఛించినఫలితాలను సంపాదించడం సాధ్యం కాగలదని 1840 నుండి వాటిని స్థాపించినారని గ్రంథం మొదటి భాగంలో వివరించాము. బ్రిటిష్ పరిపాలన కాలంలో ప్రజలకు కొంత వాక్‌స్వాతంత్ర్యము, సభలు సమావేశాలు జరుపుకొనే స్వాతంత్ర్యము, సంఘాలను నిర్మాణం చేసుకొనే స్వాతంత్ర్యము లభించినందున ప్రజాపక్షంవారు సంఘాలను స్థాపించుకొనడం సాధ్యమైనది.

1858 నాటికి కలకత్తాలో బ్రిటిష్ ఇండియా సంఘము, బొంబాయిలో బొంబాయి సంఘము, మద్రాసులో మద్రాసు దేశీయ సంఘము కృషిచేస్తూ వచ్చాయి. కాని వీటిలో ఏదీకూడా స్థిరత్వాన్ని చేకూర్చుకోలేకపోయినది.

వీటిస్థానే కాలక్రమాన క్రొత్తసంఘాలు బయలుదేరాయి. ఇది ఒకవిధంగా సహజ పరిణామం అని చెప్పవచ్చు.

సమాజం అనేది అనేక పొరలతోకూడిన సముదాయము. ఒక్కొక్క పొరలో ఒక వర్గం ప్రాధాన్యం వహిస్తుంది. జమీందారులు, వర్తకులు, మేధావులు, మధ్యతరగతివారు, రైతులు, కార్మికులు, అగ్రకులాల వారు, క్రింది కులాలవారు, అస్పృశ్యులు, ఆదివాసులు — వివిధ వర్గాలకు చెందిన వారు. వీరందరిలో ఒకేదశలో రాజకీయచైతన్యం అంకురించదు. కొన్ని వర్గాలవారు ముందుగాను, మరికొన్నివర్గాలవారు అటుతర్వాతను రాజకీయాల పట్ల ఆసక్తి కలవారవుతారు. నూతన వర్గాలలో రాజకీయచైతన్యం కలిగినప్పుడు అంతకుపూర్వం ఏర్పడినసంఘాలు వాటి ప్రయోజనాలను తీర్చక పోవడంచేత ఇవి నూతన సంఘాలను స్థాపించుకొంటవి. ఇదిగాక ఒకే సంఘంలో కాలక్రమాన చీలికలు సంభవించవచ్చు. తరాల మధ్య అంతరాలు ఏర్పడి యువకుల ఆశయాలు వృద్ధుల ఆశయాలకంటే భిన్నంగా ఉండవచ్చు. ఈలాటి పరిణామాల కారణంగా పాతసంఘాల స్థానంలోగాని, వాటికి అదనంగాగాని క్రొత్తవి ఏర్పడుతవి. ఈ సందర్భంలో ఇంకొక పరిణామాన్నికూడా గుర్తించవలసి ఉన్నది.

ప్రథమదశలో సంఘాలు ఆయారాష్ట్రాలకుమాత్రమే పరిమితమై ఉండేవి. వీటిమధ్య పరస్పరసంప్రతింపులు జరగడం చాలా ప్రయోజనకరమనిన్నీ, దేశానికంతా వీటితోపాటు ఒక కేంద్రసంఘం ఏర్పడడం లాభదాయకమనిన్నీ నాయకులు గ్రహించినా, దేశంలో ప్రయాణ సౌకర్యాలు, తంతి తపాలా సౌకర్యాలు శైశవదశలో ఉండిన కారణంగా వారి అభిప్రాయాలు ఆచరణ సాధ్యం కాలేదు. కాని 1870 నాటికి ఈలాటి సౌకర్యాలు అభివృద్ధి గాంచినాయి. అందుచేతను, మరికొన్నిపరిణామాల ఫలితంగాను సంఘాలమధ్య సంప్రతింపులు సాధ్యమైనాయి. కేంద్రసంఘ స్థాపనవిషయమైకూడా ప్రయత్నాలు సాధ్యమైనాయి. తుదకు వీటి ఫలితంగా దేశానికంతా అఖిలభారత కాంగ్రెసు (Indian National Congress) 1885 డిశంబరు ఆఖరున ఒక కేంద్రసంఘంగా అవతరించినది. దీనితో రాజకీయసంఘాల చరిత్రలోను, రాజకీయోద్యమ లోను ఒక నూతనశకం ఆరంభమైనది. ప్రజాపక్షంవారికృషికి ఒకపె సాధనం ఏర్పడినది. తుదకు స్వాతంత్ర్యోద్యమం చాలావరకు దీని ఆధ్వర్యా సాగింది.

పైన సూచించిన పరిణామాలన్నీ ఒక్కొక్కరాష్ట్రంలో ఏవిధంగా సాగినవో ఇప్పుడు తెలుసుకోవలసి ఉన్నది.

1858 నాటికి కలకత్తాలో బ్రిటిష్ ఇండియన్ సంఘం ప్రజాపక్ష రాజకీయాలలో ప్రధానపాత్ర వహించి ఉండినది. ఇందులో సభ్యత్వం వహించడానికి పౌరులందరూ అర్హులైనా, జమీందారులలో రాజకీయచైతన్యం ఎక్కువగా ఉండడం చేతను, ఆదాయాన్ని స్వయంకృషిచే సంపాదించుకొనవలసిన అవ

పరం లేక రాజకీయాలలో పాల్గొనడానికి కావలసిన తీరుబడికాలం వారికి ఉండడంచేతను, వారే ఈ సంఘంలో ఎక్కువ సంఖ్యలో సభ్యులుగా చేరినారు. సాంవత్సరిక చందా రు 50 లు కావడం మూలాన మధ్య తరగతి వారు, తదితరులు సభ్యులు కాలేకపొయ్యారు. 1870 వరకూ సంఘం చాలా చురుకుగా పనిచేసినది. ప్రభుత్వం ప్రవేశపెట్టినబిల్లులలోని గుణదోషాలను చర్చించి తన అభిప్రాయాన్ని అధికారులకు అందజేయడం, దేశంలో జరగవలసిన సంస్కరణలను గురించి వారికి నివేదికలను సమర్పించడం, దాని కార్య క్రమాలలో ప్రాధాన్యం వహించాయి. ప్రజాస్వామిక దేశాలలో ప్రతిపక్షంచేసే పనులను అది చేయగలిగినదనే ప్రఖ్యాతిని సంపాదించినది. అది మితవాద ధోరణితో కార్యక్రమాలను సాగించడంచేత ప్రభుత్వం దాని అభిప్రాయాలను గౌరవిస్తూ వచ్చినది.

కాని 1870 నాటికి అది ప్రజాదరణను కోల్పోయినది. అప్పటికి కలకత్తాలోను జిల్లా కేంద్రాలలోను లాయర్లు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, ప్రభుత్వోద్యోగులు మొదలగువారితోకూడిన మధ్యతరగతి ఏర్పడినది. ప్రజాస్వామికము, స్థానికస్వపరిపాలనము మొదలైన విషయాలలో వీరి దృక్పథం జమీందార్ల దృక్పథంకంటే భిన్నంగా ఏర్పడినది. వీరికి బ్రిటిష్ ఇండియా సంఘంలో తగిన ప్రాతినిధ్యం లభించలేదు. ఇంతేగాక జమీందార్లకూ రైతులకూమధ్య శిస్తులను గురించి, కౌలుదాదీ పద్ధతిని గురించి వివాదాలు బయలుదేరినవి. కొన్ని జమీందారీలలో రైతులు తిరుగుబాటుచర్యలలోకి దిగారు దీనినంతను పరిశీలించి ప్రభుత్వం రైతులప్రయోజనార్థం ఒక కౌలుదారీ చట్టాన్ని చేయడానికి సిద్ధపడినది. కాని జమీందార్లు దానిని ప్రతిఘటించారు. బ్రిటిష్ ఇండియాసంఘం జమీందార్లను సమర్థించసాగినది. ఈ పరిస్థితులలో అది పూర్తిగా జమీందార్ల సంఘం అనే అభిప్రాయం బలపడి మధ్యతరగతివారు తమ ఆశయాలు సిద్ధించడానికి ఇంకొక సంఘం ఏర్పడవలెననే నిర్ణయానికి వచ్చారు.

కాని ఆనాడు మధ్యతరగతివారిలో పెక్కు చీలికలు ఏర్పడి ఉండినవి. వారిలో కొందరికి అమృతబజారు పత్రికకు సంపాదకుడైన శిశిర్ కుమార్ ఘోష్ నాయకుడైనాడు. ఇతడు హిందూసంప్రదాయానికీ తూర్పుబెంగాలుకూ చెందినవాడు. మరికొందరికి సురేంద్రనాథ్ బ్యానర్జి, ఆనందమోహన్ బోసు మొదలైనవారు నాయకులైనారు. వీరు బ్రహ్మసమాజానికి చెందినవారు. ఇంగ్లండులో విద్యాభ్యాసముచేసి అక్కడి రాజకీయాలచే ప్రభావితులైనవారు. శిశిరకుమార్ ఘోషూ వీరూ వేరువేరుగా ఒక రాజకీయసంఘాన్ని స్థాపించడానికి ప్రయత్నం చేశారు. ప్రథమంలోఘోష్ ప్రయత్నం ఫలించి 1875 లో ఇండియాలీగ్ అనే సంఘం స్థాపితమైనది. సురేంద్రనాథ్ మొదలైనవారు ఇందులోచేరి కృషిచేయడానికి సిద్ధపడినా, ఘోష్ విధానాలు వారికి ఆమోదయోగ్యం కాకపోవడంచేత 1876 లో వారు ఇండియన్ సంఘం (Indian Association) అనేపేరుతో ఇంకొక సంఘాన్ని స్థాపించినారు. దీనితో ఇండియాలీగు కొంతకాలం పోటీచేసి నిలబడలేక పోయినది. 1878నాటికి రాజకీయరంగాననుండి అదినిష్క్రమించడం

తప్పినదికాదు. అప్పటికి జమీందార్లతో కూడిన బ్రిటిష్ ఇండియన్‌సంఘం మధ్యతరగతివారితోకూడిన ఇండియన్ సంఘం మిగిలిపోయాయి.

ఈ రెండింటిలో ఇండియన్‌సంఘం ప్రజలదృష్టిని ఎక్కువగా ఆకర్షించినది. ఇది బెంగాలులోని జిల్లా కేంద్రాలలోను, ఉత్తరభారతంలోని రాష్ట్రాలలోను కొన్నిశాఖలను స్థాపించి, దాని కార్యకలాపాలను విస్తృత పరచుకోగలిగినది. రైతుల సమస్యలపట్ల ప్రత్యేకశ్రద్ధ వహించి, వారితో సన్నిహిత సంబంధాన్ని వృద్ధి చేసుకొనడానికై గ్రామప్రాంతాలలోకూడ సభలను, సమావేశాలను ఏర్పాటుచేసి గ్రామీణ ప్రజలలో కొంతరాజకీయ సంచలనం కలగడానికి తోడ్పడినది. స్థానిక స్వపరిపాలన విషయమై ప్రచారం సాగించినది. ఇది అంతా సంఘానికి ప్రజాదరణను సంపాదించగలిగింది.

ఇండియన్‌సంఘంలో ఇంతకంటె ప్రధానంగా రెండువిశేషాలు కనుపించాయి. దానినాయకులైన బ్యానర్జీ బోసులు బ్రిటన్‌లో విద్యాభ్యాసము చేసినకాలంలో యూరపుఖండంలోని జాతీయోద్యమాలచే ప్రభావితులైనారు. వాటిలో ఇటలీ స్వాతంత్ర్యానికి ఘనమైనకృషి గావించిన మ్యాజినీ వారిదృష్టిని ఎక్కువగా ఆకర్షించాడు. ఇతడు యువక ఇటలీ (Young Italy) అనేపేరుతో యువకులతో కూడిన ఒక సంఘాన్ని నిర్మాణంచేసి వారిని దేశాభిమాన పూరితులుగా చేశాడు. బ్యానర్జి బోసులు అతనిని మార్గదర్శిగా స్వీకరించి కలకత్తాలో ఒక విద్యార్థిసంఘాన్ని స్థాపించి విద్యార్థులను రాజకీయరంగంలో ప్రవేశపెట్టారు. వారికి బ్యానర్జీ నాయకుడైనాడు. వారు అతని ఉద్యమాలలో అతనికి కుడిభుజమై ఎంతగానో సహాయపడినారు. ఈపరిణామం అధికారులదృష్టిని ప్రత్యేకంగా ఆకర్షించింది.

ఇంతేగాక బ్యానర్జీ ఇండియన్‌సంఘాన్ని దేశానికంతా ఒక కేంద్రరాజకీయ సంఘంగా రూపొందించడానికి ఘనమైన కృషిని గావించాడు. బెంగాలులోను ఉత్తరభారతంలోను దీనిశాఖలను నిర్మాణం చేయడంలో ఇదే అతని ఉద్దేశం. బొంబాయి మద్రాసులలో ఏర్పడిన సంఘాలుకూడా దీని శాఖలుగా వ్యవహరించడం వాంఛనీయమనే భావాన్ని వ్యక్తపరిచాడు. కాని ఈవిధానానికి అవి సమ్మతించలేదు. దీనిమూలంగా తాముతమ వ్యక్తిత్వాన్ని కోల్పోవడమూ ఇండియన్ సంఘనిర్ణయాలను అనుసరించేవారుగా తయారుకావడమూ తప్పదని వారుఅభిప్రాయపడినారు. ఒక రాష్ట్రంలోనివారు ఏర్పరచినసంఘం దేశానికంతా కేంద్రసంఘంగా రూపొందడానికిబదులు అన్నిరాష్ట్రాలప్రతినిధులు కలిసి సమాలోచనలు జరిపి ఒకకేంద్రసంఘాన్ని స్థాపించడం ఇంతకంటె ఉత్తమవిధానమని వారుభావించారు. తుదకు దీనికి అనుగుణంగానే జాతీయకాంగ్రెసు నిర్మాణం జరిగింది. బ్యానర్జీతలపెట్టింగి కేంద్రీకృత విధానం. వీరు తలపెట్టీ తుదకు అచరణసాధ్యమైనట్టిది సమాఖ్య (Federal) విధానం. అనేకభాషలు, అనేకమతాలు, అనేకజాతులు ఏర్పడిన దేశానికి ఇదే అనుగుణమైనట్టిదని పరిపాలనవిధానంలో కాలక్రమాన జరిగిన పరిణామాలు స్పష్టపరిచాయి. అయినా బ్యానర్జీప్రయత్నం

రాజకీయ నాయకులలో అఖిలభారతదృక్పధాన్ని, కేంద్రసంఘఆవశ్యకతను బలపరచిందనుటలో అతిశయోక్తిలేదు. అందుచేతనే కాంగ్రెసునిర్మాణానికి పునాదులు వేసినవారిలో అతడొకడని దేశచరిత్ర గుర్తిస్తున్నది.

ఆనాడును తర్వాత అనేకసంవత్సరాలవరకును బ్యానర్జీ ప్రజారంగంలో గొప్పపాత్రను వహించడానికి ప్రత్యేకకారణం ఉన్నది. అతడు లండన్‌లోజరిగిన పోటీపరీక్షలో ఉత్తీర్ణుడై ఉన్నతోద్యోగంలో ప్రవేశించినా, ఏదోఒక స్వల్పనేరం చేసినట్లు ఆరోపణజరిగి దానిఫలితంగా ఉద్యోగాన నుండి తొలగింపబడినాడు. ఇది చాలా అన్యాయమని, తానుభారతీయుడుకావడంచేతనే ఈలాగు జరిగిందని అతడుభావించి అదిమొదలు భారతజాతిని రాజకీయంగా ఉద్ధరించే కార్యక్రమాలలో కృషిచేయుటకు బద్ధకంకణుడైనాడు. అతడు గొప్పవక్త. కలకత్తాలోని ఒకకళాశాలలో అధ్యాపకుడై విద్యార్థులకు సన్నిహితుడైనాడు. బెంగాలీఅనే పత్రికను సంపాదకుడుగా నిర్వహించాడు.

బ్యానర్జీ నాయకత్వాన ఇండియన్ సంఘం ప్రజాదరణనను సంపాదించుచుండిన కాలంలో బ్రిటిషు ఇండియన్ సంఘం ప్రజాదరణను కోల్పోయింది. అది చాలాకాలం మనుగడ సాగించినా జమీందార్ల వర్గప్రయోజనాలకు మాత్రమే కృషి చేస్తూ, ప్రభుత్వానికి సన్నిహితమై పోయింది.

## 2

బెంగాలులోఉండినట్లు బొంబాయిలో తీరుబడిగల జమీందారీ వర్గం ఏదీ ఉండలేదు. బొంబాయి ప్రధానంగా వ్యాపారకేంద్రం. అందులోని ప్రముఖులు వర్తకవ్యాపారాలలో కృషిచేస్తూ సంపన్నులైనవారు, రాజకీయాలలో పాల్గొనుటకు విస్తారం తీరుబడి లేనివారు, వ్యాపారంలో ఎక్కువలాభం సంపాదించుటకు అవకాశం ఉన్నట్లు రాజకీయాలలో అలాటి అవకాశం ఏదీలేదు, దేశాభిమానపూరితులై స్వార్థరహితంగా ప్రజాహితకార్యక్రమాలలో పని చేయదలచినవారికి మాత్రమే ఆనాడు రాజకీయాలు అకర్షణీయంగా ఉండేవి. వర్తకుల మనస్తత్వం దీనికి అన్యథాగా ఉండిన కారణంగా బొంబాయిలో రాజకీయకృషి బెంగాలులో జరిగినంత చురుకుగా జరగలేదు. ప్రముఖ వర్గాలవారి ప్రభావం రాజకీయాలపై ఏవిధంగా ఉంటుందో ఇది స్పష్టం చేస్తుంది.

1852లో ఏర్పడిన బొంబాయిసంఘం 1853 చార్టరు సవరణ సందర్భంలో వినతి పత్రాన్ని సమర్పించినతర్వాత చురుకుగా రాజకీయాలలో కృషి చేయడం మానుకొన్నది. 1857-58 తిరుగుబాటు కాలంలో అది ప్రభుభక్తిని ప్రదర్శించినా దానినాయకులలోకొందరిని ప్రభుత్వం అనుమానాస్పదులుగా భావించింది. దీనిఫలితంగా రాజకీయాలపట్ల వారికి ఉండినఉత్సాహం మరింత తగ్గినది. 1861-65లో అమెరికాలో అంతర్యుద్ధం సంభవించిన కారణంగా బ్రిటన్ మొదలైన దేశాలకు అమెరికానుండి పత్తి దిగుమతికావడం తగ్గినది.

వాటికి భారతదేశపు పత్తి శరణ్యమైంది. అందుచేత దానికి గిరాకీ పెరిగి వర్తకులు అధికలాభాలు సంపాదించే అవకాశం ఏర్పడినది, వారి దృష్టి ఇందులో కేంద్రీకృతం కావడంచేత బొంబాయి సంఘం చాలా వరకు పనిచేయడం మానింది. 1867లో దీనిని పునరుద్ధరించడానికి దాదాబాయి నవరోజీ వంటివారు కొంత ప్రయత్నం చేశారు. కాని దీనిమూలంగా ఎక్కువ లాభం చేకూరలేదు. పోటీపరీక్షల గురించి, శాసనసభలలో భారతీయులప్రాతినిధ్యంగురించి, పెరిగి పోతున్న పన్నుల భారాన్ని గురించి, ఏవోకొన్ని తీర్మానాలను చేసిందిగాని మొత్తంమీద అది రాజకీయచైతన్యాన్ని కోల్పోయిన సంఘంగా మారిపో యింది. మునిసిపల్ వ్యవహారాలగురించి ప్రముఖ వర్గంలో చీలికలు ఏర్పడడం కూడా దీని బలహీనతకు కారణమైనది. క్రమక్రమంగా సభ్యులసంఖ్య తగ్గింది. చందాలమూలంగా వసూలయ్యే ఆదాయం ఖర్చులకు సరిపోని పరి స్థితి ఏర్పడినది.

దీని స్థానే మహాదేవగోవింద రనడే వంటి యువకులు "నగరసంఘం" (Town Association) అనేసంఘాన్ని స్థాపించదలచారు. కాని వారిప్రయత్నం సఫలం కాలేదు. ఫిరోజిషా మెహతా, బదురుద్దీన్ త్యాబ్జీ, కాశీనాథ తెలాంగు మొదలైనవారు 1871లో పశ్చిమ ఇండియా సంఘాన్ని (Western Indian Association) స్థాపించారు. ఇదికూడా రెండుమూడు సంవత్సరాలకంటె ఎక్కువకాలం పనిచేయలేదు. ప్రముఖ వర్గానికి చెందిన వర్తకులసహకారం లభించకపోవడం దీనికొక కారణం. 1885లో తెలాంగు, త్యాబ్జీ, మెహతా మొదలైనవారు బొంబాయిరాజధానిసంఘం (Bombay Presidency Association) స్థాపించేవరకు బొంబాయినగర రాజకీయాలు స్తంభించి పోయినవి.

బొంబాయిరాష్ట్రప్రజల రాజకీయాభిప్రాయాలను వ్యక్తం చేయగల కీర్తి ప్రతిష్ఠలు పూనానగరంలో 1871లో స్థాపితమైన సర్వజనైక సభకు దక్కా యి. అప్పటినుండి 10, 15 సంవత్సరాల వరకు భారతదేశంలోని రాజకీయ సంఘాలలో ఇదిఒక విధంగా అగ్రస్థానాన్ని వహించింది.

పూనానగరంలో ప్రజలు రాజకీయరంగంలో ఘనమైనకృషి చేయు టకు కావలసిన అనుకూల పరిస్థితులు ఎన్నో ఏర్పడి ఉండినవి. అది మహారాష్ట్రు లకు కేంద్రం. బొంబాయిలో గుజరాతీలు, మహారాష్ట్రులు, పార్సీలు, ముస్లింలు సమాన ప్రాధాన్యాన్ని వహించినవారు కావడంచేత వీరిలో ఏ ఒక్క రికీ అది చెందిననగరం కాలేదు. వీరందరు కలిసి కృషిచేయగలిగినప్పుడే అక్కడి రాజకీయాలు ప్రాధాన్యం వహించుటకు అవకాశం, కాని అలాటికలయిక సులభసాధ్యం కాలేదు. పూనానగరం ఈలాగుకాక మహారాష్ట్రులకు మాత్రమే ప్రధాన నగరంగా ఉండినది. రాజకీయనాయకులు కలిసికట్టుగా కృషిచేయడం సాధ్యమైంది. మహారాష్ట్రులలో దేశాభిమానమూ స్వాతంత్రా భిలాషా తక్కినవారికంటె ఎక్కువగా ఉండినది. తాము శివాజీ నాయకత్వాన

తదుపరి పీష్వాల నాయకత్వాన మొగలాయీ సామ్రాజాధికారాన్ని
గించి స్వరాజ్యాన్ని స్థాపించుకొన్న వారనీ, దేశంలో చాలాభాగాన్ని సామ్ర
జ్యాధికారంతో పరిపాలించగలిగిన వారనీ, వారెన్నడూ మరచినవారు కా
ఈ భావాలు వారిని ఆవేశపూరితులుగా చేయడమే గాక తిరిగీ తాము ఏన
కైనా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొనగల వారనే విశ్వాసాన్ని వారిలో
త్తించాయి. దీనికి తోడు మహారాష్ట్రులందరు చిత్పవన్ శాఖకు చెం
బ్రాహ్మణుల నాయకత్వాన్ని అంగీకరించినారు. ఇదికూడా వారిలోని
న్యాన్ని ఐక్యతను బలపరచింది. పూనాలో జమీందార్లుగాని వర్తకులు
ప్రముఖవర్గంగా ఏర్పడలేదు. ఇంగ్లీషువిద్య నభ్యసించి జాతీయతచే ప్రభావితు
మేధావులు ప్రముఖ వర్గంగా ఏర్పడినారు- ఇదికూడా పూనా నగరం
రాజకీయ చైతన్యానికి కారణభూతమైనది. వీరు మహారాష్ట్రంలోనేగాక, చ
పట్లలో ఉండిన స్వదేశీ సంస్థానాలలోను, మధ్యపరగణాలలోను ఉద్యోగా
చేరి మహారాష్ట్రుల పలుకుబడిని బలపరచారు.

ఈలాటి వాతావరణానికి కేంద్రమైన పూనానగరంలో 1870న సర్వజ
సభ స్థాపితమైనది. ఇందులో చేరదలచిన ప్రతిసభ్యుడూ ప్రజలలో 50మంది స
తిని సంపాదించిన వాడుగా ఉండవలెననే నియమముండేది. ఆకారణం
సభ్యులు ప్రజాప్రతినిధులనీ, సభ ప్రజాప్రతినిధులసభ అనీ ప్రఖ్యాతిగాంచి
ఇది దాని ప్రత్యేకలక్షణమని చెప్పవచ్చు. ఇది అధికారులదృష్టిని ఆక
ప్రజాప్రతినిధులతో కూడినసభ తమఅధికారానికి ఎక్కువ ప్రమాదం కలిగి
గలదనే భావం వారిలో కలిగేటట్లు చేసింది. 1871లో మహాదేవ గోవింద ర
పూనాకు సబ్‌జడ్జీగా వచ్చాడు, అతడు సభలో సభ్యుడై అది సక్రమంగా
పద్ధతి ననుసరించి ప్రజలసమస్యలను క్షుణ్ణంగా చర్చించి, నివేదికలను తయా
చేసి, వాటిని ప్రభుత్వానికి అందజేయడంలోను, ప్రజలలో రాజకీయాల గుర
విజ్ఞానాన్ని వ్యాపింపజేయడంలోను 27సంవత్సరాల కాలం గొప్పకృషిని గా
చాడు. అతడు ఏ ప్రాంతంలో ఉద్యోగం చేసినా సభాకార్యక్రమాల పట్ల అ
శ్రద్ధ తగ్గలేదు. అతనితో ఇతర నాయకులందరు సహకరించి సభకు పేరు ప్ర
తులను సంపాదించారు. క్షామకాలంలో గ్రామాలకు దీనిప్రతినిధులు
ప్రజలఇక్కట్లు గురించి పరిశీలించి, ప్రభుత్వాననుండి వారికి సహాయం లభి
టట్లు పాటుపడేవారు. అపరిమితఖర్చులతోను అతిజాప్యంతోను కూ
ప్రభుత్వ న్యాయస్థానాలద్వారా ప్రజలు తమవివాదాలను పరిష్కరించుకొ
పంచాయతీల మూలంగా పరిష్కరించుకొనుట ఉత్తమవిధానమని ఆలాటి న్యా
స్థానాలను అక్కడక్కడ సభ స్థాపించింది. బ్రిటన్‌లోని పార్లమెంటులో
తీయులకు ప్రాతినిధ్యం ఉండవలెనని సూచించింది 1877లో ఢిల్లీ దర్బా
ప్రతినిధులను పంపి తక్కినరాష్ట్రాలనుండి వచ్చిన ప్రతినిధులతో సంప్రతి
అఖిలభారత వార్తాపత్రికల సంస్థ ఒకటి ఉండవలెనని బ్యానర్జీ ప్రతిపాదిం
తీర్మానాన్ని బలపరచి అలాటి సంస్థ ఏర్పడడంలో గొప్పకృషిని గావించి

దర్బారుకు ఆహ్వానితులైన భారతీయులను ఉద్దేశించి ఒక బహిరంగలేఖను ప్రకటించి, దానిద్వారా అఖిలభారత సమస్యల పట్ల వారు శ్రద్ధ వహించ వలసినదిగాను, అందుకుగాను ఒకేకేంద్ర రాజకీయ సంఘాన్ని స్థాపించ వలసినదిగాను వారికి తెలియ పరిచింది. దర్బారు సమయాన్ని వినోదాలకు మాత్రమే వినియోగించక ఈలాటి ప్రజాహిత కార్యక్రమాలకై వినియోగించడం వారి ధర్మమని ఉద్ఘాటించింది. అనేక సమయాలలో బెంగాలులోని ఇండియన్ సంఘంతో సహకరించి, దానితో కలిసి కొన్ని కార్యక్రమాలను సాగించింది. ఈలాటి సహకారం అఖిలభారత దృక్పథాన్ని బలపరచడమేగాక అది ఆచరణ సాధ్యం కావడంలోను కేంద్రసంఘం స్థాపితం కావడంలోను దోహదకారి అయింది.

ఇదేకాలంలో బ్రాహ్మణుల ఆధిక్యతను నిరసిస్తూ ఫూలే బ్రాహ్మణేతర ఉద్యమాన్ని మహారాష్ట్రంలో లేవదీశాడు. సర్వజనైక సభలో బ్రాహ్మణుల నాయకత్వం అతనికి రుచించలేదు. అతడు 1873లో సత్యశోధకమండలిని స్థాపించి బ్రాహ్మణేతరుల యొక్కయు అస్పృశ్యుల యొక్కయు అభివృద్ధికి పాటుబడినాడు. వారు సర్వజనైక సభతోగాని (అటుతర్వాత) కాంగ్రెసుతోగాని సహకరించరాదనిన్నీ, బ్రిటిష్ పరిపాలకుల సాధనాననే వారు తరించగలరనిన్నీ ప్రచారం చేశాడు.

భారతదేశం వంటి వి స్తీర్ణాధిక్యంగల దేశంలోని ప్రజలలో భిన్న దృక్పథాలు ఏర్పడడం సహజం. అన్ని వర్గాలవారు సమానస్థాయిలో లేని కారణంగా ఈలాటి పరిణామం తప్పనిసరి అయింది. కాని అన్నివర్గాలవారి పురోభివృద్ధికి సంఘాలు, సమావేశాలు సాధనాలు కావడం గుర్తించ వలసిన విషయం. 1858 తర్వాత లౌకిక విషయాల గురించి చర్చలు సాగించి కార్యక్రమాలను జరిపించడంలో ఇవి ప్రముఖ పాత్రను వహించాయి. దేశానికి ఇది కొత్తఅయినా ప్రజలు ఈసాధనాన్ని విశేషంగా వినియోగించుకొన్నారు. ప్రజాస్వామికం ఏర్పడడంలో ఇవి అత్యంత ప్రాధాన్యాన్ని వహించాయి.

బ్రాహ్మణేతర ఉద్యమంమూలంగానేగాక మరికొన్ని కారణాలఫలితంగాకూడా పూనానగర రాజకీయాలలో క్రమక్రమంగా కొన్ని చీలికలు ఏర్పడినాయి. రనడేమితవాదతత్వము, సంఘసంస్కరణాభిలాష రాజకీయ నాయకులలో కొందరికి నచ్చలేదు. వారిలో చిప్లంకార్, తిలక్, నాంజోషి అగర్కార్లు ప్రధాన పాత్రను వహించారు. 1879లో చిప్లంకార్ ప్రభుత్వోద్యోగానికి రాజీనామాచేసి ప్రజాసేవకు తన జీవితాన్ని అంకితంచేశాడు. పరాయి ప్రభుత్వంక్రింద ఉద్యోగం చేయడం భారతీయుల ఆత్మగౌరవానికి భంగకరమని భావించినవారిలో ఇతడొకడు. వీరందరు ఇంగ్లీషువిద్య జాతీయభావం వృద్ధికావడంలో సాధనంకావలెనని భావించి అందునిమిత్తం కొన్నివిద్యాలయాలను స్థాపించారు. జాతీయదృక్పథం ప్రజలలో బలపడుటకు కేసరి అనే మరాటిభాషా పత్రికను, మరాట అనే ఇంగ్లీషుభాషా పత్రికను స్థాపించారు. కాలక్రమాన పూనానగరంలో రనడే గోఖలేల నాయకత్వాన ఒక మితవాదవర్గము, తిలక్

నాయకత్వాన ఒక అతివాదవర్గమూ ఏర్పడి భారతరాజకీయాలలో ఒక నూతన శకం ప్రారంభమైనది.

3

1853లో చార్టరుచట్ట సవరణ సందర్భంలో ఏర్పడిన మద్రాసుదేశీయ సంఘం 1862 వరకు చురుకుగా పనిచేసింది. అదిపంపిన వినతిపత్రం తక్కిన రాష్ట్రాలు పంపిన వినతిపత్రాలకంటే బ్రిటన్‌లో ఎక్కువ గుర్తింపు సంపాదించింది. భూమిశిస్తును వసూలుచేయడంలో ఉద్యోగులు రైతులను చిత్రవధ (Torture) చేస్తున్నట్లు అది ఆరోపించింది. ఆవిషయాన్నిగురించి పూర్తి దర్యాప్తు జరపవలసిందిగా మద్రాసుప్రభుత్వాన్ని బ్రిటన్‌లోనిఅధికారులు కోరగా అందుకుగాను 1854–55లో ప్రభుత్వం ఒక కమీషనును నియమించింది. దేశీయసంఘం ఈవిషయమై పూర్తిఆధారాలను సేకరించి కమీషన్‌కు సమర్పించింది. అది చేసిన ఆరోపణ సత్యమేనని కమీషన్ నివేదికను సమర్పించింది. చిత్రవధనుఆపుటకు ప్రభుత్వం తగినచర్యలు తీసుకొన్నది. సంఘంద్వారా ప్రజలకు కలిగిన లాభాలలో ఇది అగ్రస్థానం వహిస్తున్నది.

అటుతర్వాత సంఘం న్యాయవిచారణవిధానంలో జరగవలసిన సంస్కరణలగురించి, మిషనరీలదుష్ప్రచారాన్ని గురించి, తిరున్వేలిలో సంభవించిన మతకలహాలగురించి, ప్రత్యేకపన్నులభారాన్ని గురించి, మరికొన్ని విషయాలగురించి ప్రభుత్వానికి వినతి పత్రాలను సమర్పించింది. కాని 1862 తర్వాత అది చైతన్య విహీనమై పనిచేయడం మానుకొన్నది. అదిమొదలు సుమారుఇరవై సంవత్సరాలకాలం రాష్ట్రంలో ప్రజాపక్షాన రాజకీయజీవితం స్తంభించింది.

దీనికి మద్రాసురాష్ట్రంలోని సామాజికపరిస్థితులు కారణం. ఈ రాష్ట్రంలో ఒకటిరెండు జిల్లాలలోతప్ప తక్కినప్రాంతాలలో జమీందారులులేరు. బొంబాయిలో ఉన్నట్లు ఐశ్వర్యవంతులైన వర్తకులుకూడా లేరు. విద్యావ్యాప్తి కూడా అంత ఎక్కువగా జరగలేదు. విద్యార్థులసంఖ్య పరిమితంగా ఉండినందున అందరికీ ఉద్యోగాలు లభిస్తూవచ్చింది. ఆందోళనలో దిగే నిరుద్యోగవర్గం ఏర్పడినదికాదు. లాయర్లు డాక్టర్లు మొదలైన మధ్యతరగతికిచెందిన విద్యార్థుల సంఖ్యకూడా పరిమితంగా ఉండినది. దేశీయుల సంపాదకత్వంలో వెలువడిన వార్తాపత్రికల సంఖ్య చాలాతక్కువగా ఉండినది. ఈలాటి పరిస్థితులలో రాజకీయరంగాలలో ప్రజానాయకులకృషి తగ్గుముఖంపట్టడంలో ఆశ్చర్యపడవలసింది లేదు.

ఈకాలంలో రాజకీయసంఘాలకృషి స్తంభించినా ఇతరవిషయాల గురించి చర్చలుసాగించే సంఘాలుకొన్ని బయలు దేరినాయి. ఇవి అప్పుడప్పుడు రాజకీయాలగురించి తీర్మానాలు చేయసాగాయి. ఈలాటివాటిలో 1852 లో వెంకట్రాయులునాయుడు స్థాపించిన హిందూచర్చాసంఘం (Hindu Debating Society), 1868లో మీర్ ఇబ్రహీంఆలీ స్థాపించిన తిరువలిక్కేణి సారస్వతసంఘం (Triplicane Literary Society) ప్రధానంగా పేర్కొనదగినవి. సారస్వత

సంఘంలో కృషిచేసినవారిలో కొందరు 1878 లో హిందూపత్రికను, 1884 లో మద్రాసు మహాజనసభను స్థాపించినారు.

1880లో రిప్పన్ ప్రభువు రాకతో తక్కినరాష్ట్రాలవలెనే మద్రాసులో కూడా రాజకీయ చైతన్యం చెలరేగింది. అతడు తలపెట్టిన స్థానికస్వపరిపాలన సంస్కరణముయొక్క ప్రాధాన్యమును నాయకులుకొందరు గ్రహించారు. హిందూపత్రికకు సంపాదకుడైన సుబ్రహ్మణ్యఅయ్యార్ దానినిగురించి దక్షిణ జిల్లాలలో ప్రచారం సాగించాడు. అందుకుగాను అనేక బహిరంగసభలను సమావేశ పరచాడు. తక్కిన రాష్ట్రాలలోని ప్రముఖులు చేసినట్లు ఇక్కడకూడా సుబ్రహ్మణ్యఅయ్యార్ మొదలైనవారు రిప్పన్ పదవీ కాలాన్ని పొడిగించవలసినదిగా అధికారులకు వినతిపత్రాలను సమర్పించారు. 1884లో రిప్పన్ మద్రాసుకువచ్చిన సంధర్భంలో ఆహ్వానసభలను సమావేశపరచి అతనిని సన్మానించారు. రాజకీయచైతన్యం ఈవిధంగా పునరుద్ధరణమగుచుండిన కాలంలో మద్రాసుకు గవర్నరైన గ్రాంట్ డప్ చర్యలు ప్రజల అసంతృప్తికి దారి తీశాయి. వాటిని గురించి పై అధికారులకు తెలియపరచవలసినఅవసరం ఏర్పడింది. వీటిఅన్నిటి ఫలితంగా 1884 మే 16న మద్రాసు మహాజనసభ స్థాపింప బడింది.

ఇందులో సభ్యులైనవారనేకులు యువకతరానికి చెందినవారు. జిల్లాకేంద్రాలలో ఆనాడు ఏర్పడిన సంఘాలు దీనికి అనుబంధంగా పనిచేశాయి. రిప్పన్ వీడ్కోలుసభలో పాల్గొనుటకు సభాప్రతినిధులుకొందరు 1884 ఆఖరున బొంబాయికి వెళ్ళి, అక్కడ సమావేశమైన ఇతర రాష్ట్రాల నాయకులతో సంప్రతించారు. అన్నిరాష్ట్రాల ప్రతినిధులతోకూడిన ఒక జాతీయ సమావేశం జరగడం అవసరమనే నిర్ణయానికి వీరందరు వచ్చారు. 1885 డిశంబరులో ఆ సమావేశమే కాంగ్రెసుగా అవతరించింది.

మొదటినుండి కోస్తారాష్ట్రాలైన బెంగాలు, బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో ఇంగ్లీషువిద్య ఎక్కువగా వ్యాపించడంచేత రాజకీయాలపట్ల విద్యాధికులలో ఎక్కువ ఆసక్తి ఏర్పడి, రాజకీయ సంఘాల స్థాపనకు దారి తీసింది. అయోధ్య, ఉత్తరప్రదేశ్ పంజాబులు కొంత ఆలస్యంగా బ్రిటిష్ పరిపాలనలోకి వచ్చాయి. వాటిలో ఇంగ్లీషువిద్యకూడా ఆలస్యంగా వ్యాపించింది. దీనిఫలితంగా కోస్తారాష్ట్రాలలో అంకురించివృద్ధిగాంచిన రాజకీయచైతన్యం ఈ రాష్ట్రాలలో వ్యాపించుటకు చాలాకాలం పట్టింది. అయినా వీటిలోకూడ కొన్నిసంఘాలు స్థాపింప బడినాయి. అయోధ్యలో 1861లో స్థాపితమైన తాలూకాదార్లసంఘం ఆలిగర్ లో సయ్యదుఅహమద్ ఖాన్ స్థాపించిన బ్రిటిష్ఇండియన్ సంఘం, పంజాబులో 1865లో లీట్నర్ అనే విద్యాధికారి స్థాపించిన పంజాబు సంఘం ఈలాటివి. ఆలీఘర్ సంఘం నాలుగుసంవత్సరాలు మాత్రమేపనిచేసింది. తక్కిన సంఘాలు మరికొంతకాలం పనిచేసినా అవి ప్రజలసమస్యలపట్ల ఏలాటిశ్రద్ధను వహించలేదు. అందుచేత వాటినిగురించి ఎక్కువగా తెలుసుకొనడం అనవసరం.

ప్రభుత్వవిధానాలను విమర్శించుటకు, జరగవలసిన సంస్కరణలను ప్రభు

త్వానికి సూచించుటకు, ప్రజలలో రాజకీయచైతన్యాన్ని వృద్ధిచేయుటకు రాజకీయసంఘాలు 1858 తర్వాత ఎక్కువగా కృషిచేయడం గుర్తించవలసిన విషయం. దీనిఫలితంగా రాజకీయాలలో ప్రభుత్వంమాత్రమేగాక ప్రజలు కూడా పాత్రదారులయ్యారు. నవభారతనిర్మాణానికి ఇది ఒక ప్రత్యేకలక్షణం.

## 4

బ్రిటిష్ పరిపాలనకాలంలో దేశానికంతా ఒక కేంద్రప్రభుత్వం ఏర్పడడం పరిపాలనా సౌష్టవానికి స్థిరత్వానికి ఒక పటిష్ట సాధనమైంది. అలాగే ప్రభుత్వ చర్యలను విమర్శించుటకును, దానినుండి తాము వాంఛించినప్రయోజనాలను రాబట్టుకొనుటకును ఒక్కొక్కరాష్ట్రానికిమాత్రమే పరిమితములైన రాజకీయ సంఘాలను స్థాపించడమేగాక దేశానికంతా ఒక కేంద్రరాజకీయసంఘాన్ని స్థాపించుకొనడం అవసరమనే భావం 1851 నాటికే ఏర్పడింది. కలకత్తాలో ఆనాడు స్థాపింపబడిన బ్రిటిష్ఇండియన్సంఘం దేశానికి కేంద్రసంఘంగా రూపొంద దలచింది. కాని మద్రాసు బొంబాయీలలో స్థాపితములైనసంఘాలు తమ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకొని దీనికి అనుబంధమైన శాఖలుగా వ్యవహరించుటకు సమ్మతించని కారణంగా దీని ఆశయం సిద్ధించలేదు. ఆనాటి పరిస్థితులలో ఒకరాష్ట్రంలోని సంఘానికి తక్కినరాష్ట్రాలసంఘాలు లోబడివ్యవహరించడం వాంఛనీయంగా కనుపించకపోవడంలో ఆశ్చర్యపడవలసింది ఏదీలేదు.

ఈలాగుకాక అన్నిరాష్ట్రాలలోని సంఘాలప్రతినిధులూ ప్రముఖులూ కలిసి పరస్పరం సంప్రతించుకొని ఒక కేంద్రసంఘాన్ని స్థాపించుకోవచ్చు. ఆలాగు జరిగినపక్షంలో ఏరాష్ట్రంకూడా దాని వ్యక్తిత్వాన్ని కోల్పోయేప్రశ్న ఉండదు. కాని దేశంలో ప్రయాణసౌకర్యాలు సమాచారసౌకర్యాలు శైశవ దశలో ఉండినందున ఆలాటి సంప్రతింపులు సాధ్యంకాలేదు. అందుచేత కేంద్ర సంఘస్థాపన కొంతకాలంవరకు జరగలేదు. తుదకు 1885 ఆఖరున ఇది ఏలాగు సాధ్యమైనదో మనమిప్పుడు తెలుసుకోవలసి ఉన్నది.

అన్ని రాష్ట్రాలకుచెందిన భారతీయులు కలిసి ఒక కేంద్రసంఘాన్ని స్థాపించుకొనడం మొదటిసారిగా బ్రిటన్లో జరిగింది. ఉన్నత విద్యలకూ పోటీ పరీక్షలలో పాల్గొనుటకూ బ్రిటన్కు వెళ్లిన యువకులూ తదితరులలో కొందరూ కలిసి భారతదేశపు రాజకీయ సాంఘికాది విషయాలను చర్చించుటకూ, భారత దేశపు పరిపాలనలోని లోపాలను బ్రిటిష్ప్రజలకు తెలియపరచుటకూ, భారతీయుల గురించి వారిలోనాటుకొన్న అపోహాలను తొలగించుటకు 1865 లో లండన్ ఇండియా సంఘాన్ని స్థాపించారు. కాని ఇది చాలాకాలం పనిచేయలేదు.

ఈలాటి ఉద్దేశాలతోనే బ్రిటన్లోని భారతీయులు 1866 లో తూర్పు ఇండియా సంఘాన్ని ( East India Association ) స్థాపించారు. కాని ఇందులో భారతీయులేగాక భారతదేశంలో ఉద్యోగాలుచేసి, పించన్ పుచ్చుకొని, స్వదేశానికి తిరిగివెళ్లిన బ్రిటిష్వారు, తదితరులుకూడా సభ్యులయ్యారు. మొత్త

మీద తొలిదశలో భారతీయులసంఖ్య ఎక్కువగా ఉండేది. వీరిలో దాదాభాయి నవరోజీ సంఘకార్యక్రమాలను నిర్వహించడంలో ప్రధానపాత్రను వహించాడు. అన్ని రాష్ట్రాలకు చెందిన భారతీయులు ఇందులో సభ్యులుగా ఉడడంచేత దీనినే భారతదేశానికి కేంద్ర సంఘంగా దాదాభాయి మొదలైనవారు రూపొందించ దలచి, అందుకుగాను బొంబాయి, కలకత్తా, మద్రాసులలో దాని శాఖలను స్థాపించ ప్రయత్నించారు. కాని బొంబాయిలోమాత్రమే 1869లో వారు స్థాపించినశాఖ కొంతకాలం చురుకుగా పనిచేసింది. ఇది భారతదేశాన్నిగురించి లండన్‌లోనిసంఘానికి సమాచారాన్ని అందిస్తూ, దానికి కొంత ద్రవ్యసహాయాన్నికూడా సమకూర్చింది. కాని క్రమక్రమంగా ఇందులోని సభ్యులసంఖ్య తగ్గి అది చైతన్యవిహీనమై పోయింది. బొంబాయిలోనిప్రముఖులకు రాజకీయాలపట్ల ఎక్కువఆసక్తి లేకపోవడం దీనికొక కారణం. ఇదిగాక లండన్ సంఘంలో బ్రిటిష్‌సభ్యులసంఖ్య పెరగడం, పించన్‌పుచ్చుకొన్న బ్రిటిష్‌సభ్యులకు భారతదేశంపట్ల వాస్తవమైన అభిమానం లేకపోవడం, వారు గ్రుడ్డిగా అధికారుల విధానాలను సమర్థించేవారు కావడం, ఇంకొక కారణం, అందుచేత బొంబాయి శాఖలోనివారు దీనికి సహాయంచేయడం మానుకొన్నారు. 1881 నాటికి ఈ శాఖ రాజకీయరంగాననుండి నిష్క్రమించింది. మద్రాసుశాఖ మొదటినుండీ నిర్జీవంగానే ఉండిపోయింది. ఈలాటిసంఘాలు మరికొన్ని అప్పుడప్పుడు బ్రిటన్‌లో స్థాపింపబడుతూ వచ్చాయి. వీటిలో ఏదికూడా సొష్టవంగా పనిచేయలేదు. భారతీయుల ప్రయోజనాలను సాధించుటకు కృషిచేయగల కేంద్ర సంఘం భారతదేశంలోనే స్థాపితంకావలెననీ, అందులో భారతీయులే ప్రాధాన్యం వహించవలెననీ, తూర్పు ఇండియా సంఘం, దీనివంటి ఇతర సంఘాలు రుజువుచేశాయి. ఇవి ఈ గుణపాఠాన్ని భారతీయులకు నేర్పినాయి. వీటిని గురించి ఇక్కడ ప్రస్తావించుటకు ఇదియేకారణం.

కేంద్రసంఘాన్ని స్థాపించుటకై సురేంద్రనాథ్ నాయకత్వాన ఇండియన్‌సంఘం చేసిన కృషిని గురించీ, ఆ విషయంలో సర్వజనైకసభ వెలిబుచ్చిన అనుకూల అభిప్రాయాలను గురించి ఈ రెండు సంఘాలు కలిసి నిర్వహించిన కొన్ని కార్యక్రమాలగురించి ఇదివరలో వివరించాము. ఈ సందర్భంలో 1877 నుండి మరికొన్నిపరిణామాలు జరిగాయి.

ఢిల్లీదర్బారుకువెళ్లిన వార్తాపత్రికలసంపాదకులు దేశీయపత్రికల సంఘాన్ని స్థాపించడమేగాక ఏటేట ఏదోఒకనగరంలో ఒకటిరెండుపర్యాయాలు పత్రికా సంపాదకుల సమావేశం జరగవలెననీ, ఆ సమావేశంలో పత్రికల హక్కులనుగురించి మాత్రమేగాక దేశానికి సంబంధించిన విషయాలన్నిటిని గురించికూడా చర్చలు జరగవలెననీ నిర్ణయించారు. ఇది ఒకవిధంగా దేశానికి కావలసిన కేంద్ర సంఘంగా కృషిచేయగలదని వారు భావించారు. ఈ నిర్ణయాన్ని అనుసరించి 1878 లో కలకత్తానగరాన ఇండియన్‌సంఘం వార్తాపత్రికల సమావేశాన్ని ఏర్పాటుచేసింది. పూనానుండి సర్వజనైకసభా ప్రతినిధులు

అందు ప్రధానపాత్రను వహించారు. అటుతర్వాత ఈలాటి సమావేశం ఇంకొకటి బొంబాయి నగరంలో జరిగింది. దీనితర్వాత ఇటువంటి సమావేశాలు జరగకపోయినా కేంద్ర సంఘస్థాపనోద్యమంలో ఈ రెండు సమావేశాలు మార్గదర్శకములై ప్రాధాన్యం వహించాయి.

1876 లో బ్రిటన్‌లోని అధికారులు పోటీపరీక్షలలో పాల్గొనే అభ్యర్థుల వయస్సును 21 నుండి 19 కి తగ్గించారు. ఇది ఉన్నతోద్యోగాలలో ప్రవేశించ దలచిన అన్ని రాష్ట్రాలలోని విద్యార్థులకు ఒక గొడ్డలపెట్టుగా పరిణమించింది. దీనినిగురించి అన్నిరాష్ట్రాలలోని నాయకులు తమ నిరసనను ఏకకంఠంతో వ్యక్తపరచడం అవసరమనిభావించి ఇండియన్‌సంఘం సురేంద్రనాథ్‌ను దేశమంతటా పర్యటించవలసిందిగా కోరింది. ఈకోరికమేరకు 1877 లో అతడు ఉత్తర భారతంలోని రాష్ట్రాలలో పర్యటించి, లాహోరు, ఢిల్లీ, ఆగ్రా, మీరట్, అలహాబాదు మొదలైన నగరాలలో సమావేశాలు జరిపి, అఖిలభారత సమస్యల పట్ల అన్నిరాష్ట్రాలవారు కలిసికట్టుగా కృషిచేయవలెనని ఉద్ఘాటించాడు. ఇదే విధంగా 1878 లో బొంబాయి మద్రాసు రాష్ట్రాలలో పర్యటనను సాగించాడు. ఈ పర్యటనలు రాజకీయనాయకులలో అఖిలభారతదృష్టిని పెంపొందించడం లోను, అది క్రియారూపంధరించడానికి ఒక కేంద్రసంఘం అవసరమనే అభిప్రాయాన్ని బలపరచడంలోను పటిష్టసాధనాలైనాయి.

1878 లో లిట్టన్ ప్రభువు రూపొందించిన దేశీయవార్తాపత్రికలచట్టాన్ని నిరసించడానికి కలకత్తాలో ఒకబృహత్తరమైనసభ సమావేశమైంది. దానికి వేలాదిప్రజలు హాజరుకావడమేకాక బెంగాలులోని జిల్లాకేంద్రాలనుండి, ఇతరరాష్ట్రాలనుండి నాయకులు అనేక సందేశాలను పంపినారు. ఇది ఒక విధంగా అఖిలభారత దృక్పథం ఏలాగు బలపడుతూ ఉండినది స్పష్టంచేసింది. ఈ చట్టాన్నిగురించి బ్రిటన్‌లో ప్రచారంచేసేనిమిత్తం ఇండియన్ సంఘం లాల్‌మోహన్‌ఘోసును పంపించిన సందర్భంలో సర్వజనైకసభ దానితో సహకరించి, ఘోస్ ఖర్చులలో కొంతభాగాన్ని భరించింది. 1880 లో బ్రిటన్‌లో పార్లమెంటుకు ఎన్నికలు జరిగాయి. అందులో లిబరల్‌పక్షం విజయాన్ని సాధించడం భారతదేశానికి అవసరమనేభావంతో ఈ రెండుసంఘాలు కలిసి కృషి చేశాయి. రాష్ట్రాలలోనిసంఘాలు వేర్వేరుగాకృషిచేయుటకుబదులు కలసి కట్టుగా వ్యవహరించడం పరిపాటికావడాన్ని ఈ పరస్పరసహకారం స్పష్టం చేసింది.

కేంద్ర సంఘస్థాపన చరిత్రలో రిప్పన్ రాజప్రతినిధిగా పరిపాలించిన కాలం (1880-84) అత్యంత ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. ఈ కాలంలో అతడు తలపెట్టిన సంస్కరణలు స్వల్పములైనా గొప్పవైనా వాటినన్నిటిని ప్రతిఘటించుటకు ఆంగ్లోఇండియనులు కంకణం కట్టుకొన్నారు. అందుకుగాను ఒక కేంద్ర రక్షణసంఘాన్ని స్థాపించారు. దాని ఖర్చులకుగాను ఒకటిన్నర లక్ష నిధిని సేకరించారు. వారి సుసంఘటిత ప్రతిఘటనను ఎదుర్కొని రిప్పన్‌యొక్క

సంస్కరణలను సమర్థించవలసినఅవసరం దేశంలోని రాష్ట్రాలనాయకులకు ఏర్పడింది. ఆ సందర్భంలో రిప్పన్ ప్రోత్సాహంతో హ్యూం వారికి సలహాదారు డయ్యాడు. వారుకూడా సుసంఘటితంగా కృషిచేసి ఒకజాతీయ నిధిని సమకూర్చుకోనవలసినవారైనారు. ఇది అంతా కేంద్రసంఘస్థాపనఉద్యమంపై గొప్ప ప్రభావాన్ని వహించింది.

ఈ విషయంలో ఒకవైపునుండి సురేంద్రనాథ్, ఇంకొకవైపునుండి, హ్యూం వేరువేరుగా కృషిచేశారు. 1885 లో కలకత్తా విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసంలో రిప్పన్ ప్రభువు దేశంలో అనేకప్రజాభిప్రాయాలు వ్యక్తమౌతూ ఉండడంవలన ఏది వాస్తవమైన ప్రజాభిప్రాయమో తెలుసు కొనుట ప్రభుత్వానికి కష్టసాధ్యంగా ఉన్నదనీ, నాయకులందరు కలిసి ఒకే అభిప్రాయాన్ని రూపొందించడం ప్రభుత్వానికి చాలా సహకారిగా ఉండగలదనీ సూచించాడు. దీనిపై సురేంద్రనాథ్ తన బెంగాలీ పత్రికలో వ్యాఖ్యానిస్తూ, ఇది ఆచరణయోగ్యం అనిన్నీ ఇందుకుగాను అన్నిరాష్ట్రాల ప్రతినిధులతో కూడిన ఒక జాతీయకాంగ్రెసు నిర్మాణం కావడం అవసరమనిన్నీ ఆ ఉద్దేశంతో ఇండియన్ సంఘం 1883 లో ఒక సమావేశాన్ని జరుపుటకు చర్యలు తీసుకొం టున్నదనిన్నీ తెలియపరచాడు. (కాంగ్రెసు అనే మాటను అతడు ఈ సందర్భంలో వాడడం గుర్తించదగినది). ఈ సమావేశం జరుగుటకుపూర్వం 1883 లో సంభవించిన రెండు సంఘటనలు దీని అవసరాన్ని మరింత బలపరచాయి.

వీటిలో మొదటిది ఒకసాలగ్రామ విషయమైన దావాలో హైకోర్టు న్యాయాధీశుడు నారిస్ దానిని తన పరిశీలనార్థం పూజాగృహంనుండి కోర్టుకు తెప్పించడాన్ని సురేంద్రనాద్ తన పత్రికలో విమర్శించగా అతనిపై హైకోర్టు కోర్టుధిక్కారనేరాన్ని మోపి న్యాయాధీశులలోఒకడైన రమేష్‌చంద్రమిత్తర్ అభిప్రాయాన్ని త్రోసిపుచ్చి యూరోపియన్ న్యాయాధీశుల అభిప్రాయాను సారం రెండునెలల జైలుశిక్షను విధించింది. నాయకుడుగా దేశంలో అందరిగౌర వానికి పాత్రుడైన వానికి ఈలాటి శిక్ష విధించడం ప్రజలలో అలజడి కలిగించింది. కలకత్తా వర్తకులు హర్తాల్ జరిపారు. విద్యార్థులు దౌర్జన్య చర్యలలోకి దిగారు. అప్పటికీ తమ హక్కుల సంరక్షణార్థం ఆంగ్లోఇండియన్లు ఒక కేంద్రరక్షణ సంఘాన్ని స్థాపించుకొనడం ఒకటిన్నర లక్షల రక్షణ నిధిని సేకరించడం జరి గింది. వారివలెనే తాముకూడా ఒక జాతీయ నిధిని సేకరించి తద్వారా తమ హక్కులను రక్షించుకొనవలెనని కలకత్తాలోనిప్రముఖులు సూచించారు. ఈ విధంగా బయలుదేరిన జాతీయనిధి ఉద్యమం సురేంద్రనాథ్ జైలునుండి విడు దలైన తర్వాత మరింతబలపడింది. ఇందునిమిత్తం 1888 జూలై 17న కలక త్తాలో సమావేశమైన గొప్ప సభలో ఆ నిధిని సేకరించడం అత్యావసరమని, ఆబా ధ్యతను ఇండియన్ సంఘం వహించవలెనని తీర్మానాలు చేశారు. దేశంలోని వార్తా పత్రికలు నిధిసేకరణ విషయంలో అనుకూలాభిప్రాయాలు వ్యక్తంచేసినా ఆ బాధ్యతను అన్ని రాష్ట్రాల ప్రతినిధులతో కూడిన కేంద్ర సంఘం వహించ

వలసి నట్లుగా ఉద్ఘాటించాయి. మద్రాసులోని హిందూ పత్రిక, బొంబాయి నుండి మలబారీ సంపాదకత్వాన ప్రకటితమగుచున్న ఇండియన్ స్పెక్టేటర్ వీటిలో ప్రాధాన్యం వహించాయి. ఈ విధంగా జాతీయనిధిఉద్యమం కేంద్ర సంఘస్థాపన ఉద్యమాన్ని బలపరచింది.

1883లో జరిగిన రెండవ సంఘటన ఇల్బర్టు బిల్లు విషయమై ఆంగ్లో ఇండియన్లు లేవదీసిన దేశవ్యాప్తమైన ఆందోళన- దీనిఫలితంగా తమ పురోగమనానికి అవరోధాలు కల్పిస్తున్నవారు ఆంగ్లో ఇండియన్లుఅనిన్నీ, వారిజాత్యహంకారం నిర్మూలనమైతేనే గాని తమకు విముక్తి లేదనిన్నీ, అందుకుగాను వారివలెనే తాముకూడా ఒక కేంద్రసంఘాన్ని స్థాపించుకొనవలసి ఉన్నదనిన్నీ భారతీయ నాయకులు నిశ్చయించుకొన్నారు. వారు ఈనిర్ణయానికి రావడంలో హ్యూం గొప్ప పాత్రను వహించాడు.

1882లో ఇండియన్ సంఘంచేసిన సూచనమేరకు 1883 డిసంబరు28-30 న కలకత్తాలో జాతీయసభ సమావేశమైంది. దేశంలోజరిగిన మొదటి జాతీయ సభ ఇదియే. అన్ని రాష్ట్రాల నుండి తగిన సంఖ్యలో ప్రతినిధులు ఇందులో పాల్గొనక పోయినా మూడు రోజుల సమావేశాలలో ఉన్నతోద్యోగాలలో భారతీయులకు ప్రవేశము, అందుకుగాను పోటీపరీక్షలు ఏకకాలంలో బ్రిటన్ లోను భారతదేశంలోను నిర్వహించ వలసిన అవసరము, అభ్యర్థుల వయస్సు 22కు పెంచడము, న్యాయశాఖను కార్యనిర్వాహణశాఖ నుండి వేరుపరచ డము, శాసన సభలలో ప్రజలెన్నుకొన్న భారతీయులకు ప్రాతినిధ్యము, ఆయుధ చట్టాన్ని రద్దుచేయడము, సాంకేతిక విద్యకు ప్రాధాన్యము కల్పించుట, జాతీయనిధి సేకరణము మొదలగు విషయముల గురించి తీర్మానాలు చేయబడి నవి. దీనికి రెండు సంవత్సరాల తర్వాత సమావేశమైన జాతీయ కాంగ్రెసులో చేయబడిన తీర్మానాలు కూడా ఈలాటివే అని గుర్తించడం అవసరం.

1884లో అన్ని రాష్ట్రాలవారు కలిసి రిప్పన్‌కు వీడ్కోలు సభలు జరి పారు. ఆ సందర్భంలో వారతనికి సమర్పించిన వీడ్కోలు పత్రాలు, వారు ఏర్పాటు చేసిన ఊరేగింపులు దేశమంతా ఒకత్రాటిపైన నడుచుటకు సంసిద్ధంగా ఉన్న విషయాన్ని నిరూపించాయి. డిసంబరు 18—20లలో బొంబాయి నగ రాన జరిగిన ఉత్సవాలకు అన్ని ప్రాంతాల ప్రతినిధులు హాజరయ్యారు. రాజ ప్రతినిధి స్వయంగా 140 వీడ్కోలు పత్రాలను స్వీకరించాడు, 1858కి పూర్వం జాతీయత అంటే ఏమిటో తెలియని భారతీయులు ఈ విధంగా ఐక్యజాతీయ భావంతో ఆవేశపూరితులై రిప్పన్ పదవీ విరమణ చేసి స్వదేశానికి వెళ్ళిపోవటం పట్ల తమ విచారాన్ని వెలిబుచ్చడం ఆంగ్లో ఇండియన్లకు అధికారులలో అనే కులకు ఆశ్చర్యం కలిగించింది. దేశాభిమానంగల భారతజాతి పునర్జన్మ మెత్తి నట్లు వారు భావించారు.

రాష్ట్రాలనుండి ఉత్సవాలలో పాల్గొనుటకు వచ్చిన నాయకులు ఈ ఉత్సాహం తాత్కాలితంగానుబుద్బుద ప్రాయంగానుఉండరాదనీ, దానికొక

శాశ్వత స్వరూపం ఏర్పడవలెననీ నిశ్చయించి, అందుకుగాను సమాలోచనలు జరిపారు. 1885 డిసంబరులో కాంగ్రెసు సమావేశానికి ఇవి దారితీశాయి.

ఈ ఉత్సవాలు జరుగుటకు పూర్వం సురేంద్రనాధ్ జాతీయ సమైఖ్యతను బలపరచే నిమిత్తంఉత్తరభారతంలో పర్యటననుసాగించి అనేకనగరాలలో అఖిల భారత సమస్యలగురించి ఉపన్యసించి, వాటిని పరిష్కరించడంలో ప్రజలందరు కలిసికట్టుగా ఒకజాతికి చెందినవారనే భావంతో ప్రవర్తించవలసిందిగాను జాతీయనిధికి విరాళాల నియ్యవలసినదిగాను ఉద్ఘాటించాడు. 1885 డిసంబరు 25-27 న సురేంద్రనాథ్ ఏర్పాటుచేసిన రెండవజాతీయమహాసభ కలకత్తాలో సమావేశమైంది. దీనిని సమావేశపరచుటలో ఇండియన్‌సంఘంతో బ్రిటిష్ ఇండియన్‌సంఘం, కలకత్తాలోని కేంద్ర ముస్లింసంఘం సహకరించాయి. 1883 లో ఈలాటి సహకారం దానికి లభించినదికాదు. సమావేశానికి అస్సాం, బీహార్, మీరట్, వారణాసి, అలహాబాదులనుండి ప్రతినిధులు హాజరయ్యారు. బొంబాయి నుండి కూడా నాయకుడుగా ప్రఖ్యాతిగాంచిన మండలీక్ అందులో పాల్గొన్నాడు. మూడురోజులు జరిగిన సమావేశాలలో శాసనసభల సంస్కరణము, ఉన్నతోద్యోగాలలో భారతీయులకు ఎక్కువ అవకాశము లభింపజేయుట, ఆయుధచట్ట సంస్కరణము న్యాయశాఖను కార్యనిర్వహణ శాఖనుండి వేరుచేయుట, ప్రభుత్వ ఖర్చులను తగ్గించుట, పోలీసుశాఖ సంస్కరణము మొదలైన విషయాలగురించి తీర్మానాలు చేయబడినవి. సమావేశానికి ఆహ్వానితుడై ఉన్నతఉద్యోగివర్గానికి చెందిన హెన్రీకాటన్ (Henry Cotton) వక్తగా సమావేశంలో పాల్గొనడం గుర్తించ తగినది. ఉద్యోగివర్గంలో భారతీయులపట్ల సానుభూతిని కనుపరచిన కొద్దిమందిలో అతడొకడు.

ఈవిధంగా సురేంద్రనాథ్ రెండు జాతీయసమావేశాలను - మొదటిది 1883లోను, రెండవది 1885లోను, జరుపగలిగాడు. ఈసమావేశమే దేశానికంతా కేంద్రసంస్థగా రూపొందే అవకాశం ఎంతైనా ఉండినది. ఆలాటి ఫలితం తన కృషిమూలంగా లభించగలదని అతడుభావించాడు. కాని అనేకపరిస్థితులఫలితంగా ఇది జరగక 1885 డిశంబరు 28 — 30 న, హ్యూం ప్రయత్నాల మూలంగా బొంబాయిలో సమావేశమైన భారతజాతీయ కాంగ్రెసు దేశానికంతా కేంద్ర సంస్థగా రూపొందింది. ఇందుకై హ్యూం చేసిన ప్రయత్నాల గురించిన్నీ, ఈ ప్రయత్నాలను చేయడంలో అతని ప్రధానోద్దేశాల గురించిన్నీ తెలుసుకొనవలసి ఉన్నది.

## 5

హ్యూం జీవితాన్నిగురించీ భారతీయుల సర్వతోముఖాభివృద్ధిపట్ల అతనికి ఉండిన శ్రద్ధగురించీ, అందుకుగాను అతడు ఉన్నతోద్యోగిగా ఉన్నప్పుడు చేసినకృషిగురించీ ఇదివరలో తెలియపరచాము. 1879లో అతడు ఉద్యోగాన నుండి విరమించునాటికి అతనిలో కొన్ని మౌలికములైన అభిప్రాయాలు జీర్ణించు

కొని పోయాయి. సురేంద్రనాథ్ స్థాపించిన జాతీయ కాంగ్రెసుసభను (National Conference) కాదని దానిస్థానే వేరొక కేంద్రసంఘాన్ని నిర్మాణం చేయడానికి ఈఅభిప్రాయాలే కారణభూతములైనాయి.

వీటిలో మొదటిది : భారతదేశపురోగమనానికి సౌభాగ్యానికి బ్రిటిష్ పరిపాలన శాశ్వతంగాను సుస్థిరంగాను సాగడమే ఏకైకసాధనం. ఒక శతాబ్దం పైగా రెండుదేశాలమధ్య ఏర్పడిన సంబంధం ఏపరిస్థితులలోకూడా విచ్ఛిన్నం కారాదు. ఇది దైవసంఘటితమైన అనుబంధం. దేశంలో నిర్మాణం కావలసిన కేంద్రసంఘం దీనిని బలపరచే సాధనంగా ఉండవలెను. సురేంద్రనాథ్ స్థాపించినది ఈలాటిదికాదు.

అతని అభిప్రాయాలలో రెండవది : బ్రిటిష్‌పరిపాలనమూలంగాను, ఇంగ్లీషువిద్య వ్యాపించినఫలితంగాను భారతీయ సమాజంలో విప్లవాత్మకములైన మార్పులు సంభవించాయి. 1800లో ఉండిన సమాజానికి 1880లోని సమాజానికీ ఏలాటి పోలికా లేదు. జాతీయత, ప్రజాస్వామికము మొదలైన భావాలచే ప్రభావితులైన ఒక విద్యాధికవర్గం ఏర్పడింది. ఈ వర్గంవారు స్థాపించిన సంఘాలు, వారు ఏర్పాటుచేసిన సభలు, సమావేశాలు, వారివార్తాపత్రికలు మొదలైన సాధనాలద్వారా వారు ప్రజలపై అత్యంతప్రభావాన్ని వహించినవారైనారు. ఈనాడు వారే ప్రజలకు నాయకులు. సంస్థానాధీశులు, జమీందార్లు మొదలైన ఫ్యూడల్ వర్గాలకు ప్రజలపై పలుకుబడి సన్నగిల్లింది. విద్యాధికుల సహకారం లేక బ్రిటిష్‌పరిపాలన సాగడం కష్టసాధ్యం. సైనికబలం ఉన్నంత మాత్రాన ఈపరిపాలనకు సుస్థిరత చేకూరదు. విద్యాధికులు వాంఛించినట్లు శాసనసభలలో ప్రాతినిధ్యం, ఉన్నతోద్యోగాలలో ప్రవేశం, స్థానిక స్వపరిపాలనము, ఆంగ్లోఇండియన్లు భారతీయులమధ్య సంభవించే వివాదాల పరిష్కారంలో నిష్పక్షపాతమైనన్యాయపరిపాలన, న్యాయశాఖను కార్యనిర్వహణశాఖనుండి వేరుపరచుట, ప్రభుత్వఖర్చులను పన్నులభారమును తగ్గించుట మొదలైన సంస్కరణలను ప్రవేశపెట్టడం ఎంతైనాఅవసరం. ఇవిఅన్నీ ఆచరణయోగ్యములు, ఆచరణసాధ్యములు, వీటిమూలంగా విద్యాధికులు ప్రభుభక్తిపరాయిణులు కాగలరు. ఇప్పటికికూడా దేశంలో ప్రభుభక్తిగల విద్యాధికులూ మితవాదము ననుసరించేవారూ ఎందరో ఉన్నారు. వారందరిని కూడదీసి - వారితోకూడిన కేంద్ర సంఘాన్ని స్థాపించవలసి ఉంది. రెండుదేశాల మధ్య ఏర్పడిన అనుబంధం ప్రభుభక్తి గలవారితో కూడిన కేంద్రసంఘంగా రూపొందినప్పుడే సుస్థిరమౌతుంది. సురేంద్రనాద్ స్థాపించిన జాతీయసభ ఈలాటిదికాదు. అది అతివాదసభగాను విప్లవాన్ని వాంఛించే సభగాను మారే అవకాశం ఎంతైనా ఉన్నది. సురేంద్రనాద్ ఉన్నతోద్యోగాననుండి తొలగింపబడినవాడు. ఇటలీలో స్వాతంత్ర్య సమరానికి నాయకుడై విప్లవాన్ని లేవదీసిన మ్యాజిని అతనికి గురువు. అందుచేత అతడు అతివాది కావడము విప్లవానికి దారితీసే పరిస్థితులను కల్పించడము తప్పదు. అతడు స్థాపించిన జాతీయసభ దీనికి సాధనమయ్యే ప్రమాదం ఉన్నది. దీనికి బదులు ప్రభుభక్తిగల

విద్యాధికులతో కూడిన కేంద్రసంఘాన్ని స్థాపించడం ఎంతైనా అవసరం. భారతరాజకీయకార్యక్రమాలన్నీ ఆలాటి సంఘంద్వారా సాగినప్పుడే ఉభయ దేశాలమధ్య ఏర్పడిన అనుబంధం సుస్థిరత్వం ధరించగలదు. హ్యూంలో జీర్ణించుకొనిపోయిన ఈ అభిప్రాయం కాంగ్రెసు నిర్మాణానికి దారితీసింది. దీని కార్యక్రమాలలో రాజకీయసంస్కరణలు ఎంతప్రాధాన్యం వహించాయో ప్రభుభక్తి అంతకంటే ఎక్కువ ప్రాధాన్యాన్ని వహించింది. కాంగ్రెసు సమావేశాలలో అధ్యక్షత వహించినవారు, తీర్మానాలను ప్రతిపాదించి బలపరచినవారు ప్రభుభక్తిని ప్రకటించుటకు కాంగ్రెసు వేదికను వినియోగించారని వారి ఉపన్యాసాలు స్పష్టం చేస్తున్నాయి. సురేంద్రనాద్ స్థాపించిన సభను కాదని ఇంకొక కేంద్ర సంఘాన్ని స్థాపించడంలో ఇదియే హ్యూంయొక్క ప్రధానోద్దేశమనుటకు ఇది ఒక ప్రబలమైన తార్కాణం.

ప్రభుభక్తికి అతడు అంతటి ప్రాధాన్యాన్ని ఎందుకు కల్పించాడో అతని అభిప్రాయాలలో మూడవది స్పష్టపరుస్తున్నది. భారతదేశంలో బ్రిటిష్ ఆధికారానికి అంతరంగికంగాను బాహ్యంగాను గొప్ప ప్రమాదాలు సంభవించనున్నవని అతడు భావించాడు. దేశంలోని ప్రజలలో అలజడి అసంతృప్తి అతి బాహుళ్యంగా వ్యాపించి ఉన్నవనిన్నీ, దారిద్ర్యబాధచే పీడితులైన వారు దోపిడీలు మొదలైన దౌర్జన్యచర్యలలోకి దిగడానికి సంసిద్ధులుగా ఉన్నారనిన్నీ, ఇవి క్రమక్రమంగా ఒకగొప్ప తిరుగుబాటుకు దారితీయనట్టివనిన్నీ, అందుకు రహస్యసన్నాహములు అనేకం చేయబడుతూఉన్నవనిన్నీ, ఆలాటి తిరుగుబాటుకు విద్యాధికులలో అనేకులు నాయకత్వంవహించగలరనీ అనుకొనుటకు హ్యూం ఉన్నతోద్యోగంలో ఉండినప్పుడు అతనికి లిఖితపూర్వమైన ఆధారాలనేకం లభించాయి. ఈలాటి పరిస్థితులుపూర్తిగా ఏర్పడకముందే వాటి నివారణకై తగినచర్యలు తీసుకొనవలసిందిగా అతడు రాజప్రతినిధిని అర్థించాడు. కాని ఫలితం లేకపోయింది. ఉద్యోగకాలంలో ఇంతకు మించి ఏలాటి చర్యలు తీసుకొనుటకు అతనికి సాధ్యం కాలేదు. పింఛన్ పుచ్చుకొని భారతదేశంలో స్థిరనివాసి అయిన తర్వాత అతడు దీనిని గురించి దీర్ఘంగా ఆలోచించి ప్రభుభక్తి పరాయణులై మితవాదాన్ని అనుసరించే విద్యాధికులతోకూడిన కేంద్ర సంఘం దీనికి తగిన సాధనమనీ, తద్వారా ప్రజాభిప్రాయన్ని మార్చడం సాధ్యమనీ అతడు నిర్ణయించుకొన్నాడు. ఇదికూడా సురేంద్రనాద్ స్థాపించిన సభకంటె ఇంకొక సంఘాన్ని అతడు స్థాపించుటకు కారణమైంది.

రిప్పన్ తలపెట్టిన స్థానికస్వపరిపాలనా విధానమూ, ఇల్బర్టు బిల్లు విషయంలో అతడు ఆంగ్లో ఇండియన్లతో చేసుకొన్న రాజీ, విద్యాధికులకు తృప్తి గలిగించకపోయినా హ్యూం వారిని, అతివాదంలోకి దిగకుండునట్లు సమాధాన పరచి, రిప్పన్ ప్రభువుపట్ల గౌరవాభిమానాలు కలవారినిగా మార్చాడు. విద్యాధికులను ప్రభుభక్తిగలవారుగను మితవాదులుగను మార్చులు సాధ్యమనే నమ్మకం అతనికి కలిగింది.

ఈ సందర్భంలో అతడు ఎక్కువగా బొంబాయి నాయకులతోను మద్రాసు నాయకులతోను సంప్రదించిడం గుర్తించదగిన విషయం. కలకత్తా నాయకులు అతివాదులని బొంబాయి నాయకులు విచక్షణతో ప్రవర్తించే మితవాదులని చాలాకాలాననుండి అధికారులు భావిస్తూవచ్చారు. హ్యూంకు కూడా అలాటి అభిప్రాయమే కలిగింది. పూనాలోని సర్వజనైకసభకూడా 1880 తర్వాత మితవాదధోరణిలో పడినట్లు అధికారులు గ్రహించారు. అందుచేతనే రిప్పన్ పూనాకు వచ్చినపుడు ఆ సభ సమర్పించిన ఆహ్వాన పత్రాన్ని స్వీకరించాడు. మద్రాసు నాయకులలో అతివాదమనేది ఎన్నడూ కనిపించినదికాదు. అందుచేత హ్యూం ఈలాటి వారి సహకారంతో ప్రభుభక్తి గల విద్యాధికులతో కూడిన కేంద్ర సంఘాన్ని స్థాపించడము వాంఛనీయమగుటయేగాక ఆచరణ సాధ్యమనే నిర్ణయానికి వచ్చి 1882 నుండి అందుకై కృషి చేశాడు. బ్రిటిష్ పరిపాలనకు ఆంతరంగికంగా ఏర్పడ నున్న ప్రమాదాన్ని ఎదుర్కొనుటకు ఇది తగినసాధనంగా ఆతడు భావించాడు.

ఆ రోజులలో బ్రిటిష్ అధికారాన్ని తొలగించుటకు బాహ్యాన నుండి రషియా వారు ప్రయత్నించుచున్నట్లు అధికారులంతా విశ్వసించి ఉండిరి. ప్రజలలోను విద్యాధికులలోను అసంతృప్తి నెలకొనిన కారణంగా తమ దండయాత్రలో వారు తమతో సహకరించిగలరనే అభిప్రాయం రషియావారికి కలిగిన కారణంగానే వారు ఈలాటి ప్రయత్నంలోకి దిగుతున్నారని హ్యూం భావించాడు. బ్రిటన్ భారతదేశాలమధ్య ఏర్పడిన అనుబంధంపట్ల అభిమానం గల విద్యాధికులతో కూడిన కేంద్రసంఘాన్ని స్థాపించిన పక్షాన రషియా వారికి కనువిప్పు గలిగి, వారు వారి దండయాత్ర యత్నాలను ఉపసంహరించుకొనెదరని అతడు ఈ స్థాపనకు పూనుకొన్నాడు. కాంగ్రెసువేదిక నుండి ఉపన్యసించిన వారందరూ రషియా నుండి రాగల ప్రమాదాన్ని గురించి పదేపదే ప్రస్తావించుచు, అలాటిప్రమాదం సంభవించిన పక్షంలో భారతీయులందరు తమ ప్రభుభక్తిని ప్రకటిస్తూ వారి నెదుర్కొనుటకు సంసిద్ధులుగ నున్నట్లు ఉద్ఘాటించారు,

హ్యూంయొక్క అభిప్రాయాలలో ఇంకొకటి దేశంలోని పరిపాలనలోపాలన్నిటికి ఉన్నత ఉద్యోగివర్గంయొక్క సంకుచితమనస్తత్వమే కారణమనేది. జాత్యహంకారానికి వీరే మూలం. బ్రిటన్‌ను పాలించే మహారాణి, ఆ దేశంలోని ప్రజలు భారతీయులపట్ల పూర్తి అభిమానం కలవారు. భారతదేశంలోని పరిస్థితులు వారికి తెలియనికారణంచేతనే ఉద్యోగి వర్గం నిరంకుశంగా ప్రవర్తించడం సాధ్యమైంది. భారతీయులు తగినవారిని బ్రిటన్‌కు పంపి, తమ పరిస్థితుల గురించి అక్కడి వారికి తెలియ పరచిన పక్షాన వారు భారతదేశ పరిపాలనపట్ల ఆసక్తి గల వారై అందులో ప్రవేశించిన లోపాలన్నిటినీ సరిదిద్దగలరు. అందుచేతనే 1882 నుండి హ్యూం కాంగ్రెసు సంస్థాపన ప్రయత్నాలతోపాటు దేశంలోని వివిధ పత్రికలలో వెలువడే అభిప్రాయాల మధ్య సమన్వయం చేయగల

ఒక కేంద్రపత్రిక ఉండడం అవసరమని, వాస్తవమైన సమాచారాన్ని బ్రిటన్‌కు పంపుటకు సాధనంగా ఒక కేంద్ర సంస్థ ఉండవలెనని భావించి అందుకుగాను కృషిచేశాడు. 1883 ఫిబ్రవరిలో దాదాభాయి మలబారీల సంపాదకత్వాన వెలువడిన వాయిస్ ఆఫ్ ఇండియా (Voice of India) అనే పత్రిక. ఈ కృషి ఫలితమే. సమాచారాన్ని బ్రిటన్‌కు అందజేయుటకు హ్యూం 1885 లో భారత తంతి సమాచార సంఘము (Indian Telegraph Union) అనే సంస్థను స్థాపించాడు. బొంబాయి, మద్రాసు, కలకత్తా నాయకుల సహాయాన దీనికి కావలసిన విరాళాలను సంపాదించాడు. 1885 మార్చి నుండి అతడు చేసిన దేశపర్యటన ఉద్దేశాలలో ఇది ఒకటి. బ్రిటన్‌లో ప్రచారం జరగడం చాలా ప్రధానం అనే భావంతోనే అతడు ఆ దేశంలోని పార్లమెంటులో ఒక భారతదేశ ఉపసంఘాన్ని (Indian Ccmmitee) నిర్మాణం చేయదలచాడు. ఈ ఉద్దేశంతోనే కాంగ్రెసు నిర్మాణం జరిగిన తర్వాత దాని తరపున బ్రిటన్‌లో కృషి సాగించుటకు ఒక ప్రత్యేక కమిటి స్థాపించబడింది. ఈలాటి వాటకన్నిటికీ మితవాదులతో కూడిన కేంద్ర సంఘ స్థాపన సాధనమనే భావంతో అందుకుగాను అతడు గట్టిగా మూడు సంవత్సరాలకాలం కృషిచేశాడు.

రకరకములైన ఈలాటి అభిప్రాయాలచే ప్రభావితుడైన కారణంగా సురేంద్రనాధ్ స్థాపించిన జాతీయ సభను కాదని హ్యూం కాంగ్రెసు అనే పేరుతో ఇంకొక కేంద్ర సంఘాన్ని స్థాపించి, కాంగ్రెసుకు పితామహుడనే పేరును సంపాదించాడు.

ఈ కార్యక్రమంలో అతడు 1882 నవంబరు మొదటి వారంలో పైనియర్ అనే పత్రికలో ప్రకటించిన లేఖ మొదటిమెట్టు. రిప్పన్ తలపెట్టిన సంస్కరణలన్నిటినీ ఆంగ్లోఇండియన్లు ప్రతిఘటిస్తున్నారని, దేశ పురోగమనాన్ని ఆటంకపరచే వారు వారేనని, వారి ప్రతిఘటనను ఎదుర్కొని రిప్పన్‌ను విద్యాధికులందరు కలిసి కట్టుగా సమర్థించవలసి ఉన్నదని ఆలేఖలో ఉద్ఘాటించాడు. (రిప్పన్ ప్రోత్సాహంతోనే అతడీలేఖను ప్రకటించడం గుర్తించదగిన విషయం). ఇది మొదలు అతడు విద్యాధికులకు సన్నిహితుడైనాడు.

ఇదే ధోరణిలో అతడు 1883 మార్చి 1 తేదిన కలకత్తా విశ్వవిద్యాలయ పట్టభద్రులనుద్దేశించి ఒక లేఖనువ్రాసి, దేశభవిష్యత్తు విద్యాధికులపై ఆధారపడి ఉన్నదని, వారు స్వార్థరహితులై ప్రజాహితానికిగాను కృషిచేయవలసి ఉన్నదని, అందుకుగాను వారు కలిసి ఒక కేంద్ర సంఘాన్ని స్థాపించవలసి ఉన్నదని, ఇల్బర్టు బిల్లు విషయమై ఆంగ్లోఇండియన్లు లేవదీసిన ఆందోళనను ఎదుర్కొనుటకు ఇది ఒక్కటే సాధనమని తెలియపరచాడు. కేంద్ర సంఘస్థాపనావశ్యకతను అతడు ఇందులోనే మొట్టమొదటిసారిగా ప్రస్తావించాడు. కాని రిప్పన్ సలహామేరకు దానిని వెంటనే నిర్మాణం చేయుటకు పూనలేదు. అయినా కొందరు సన్నిహితులతో కలిసి ఒక ఆంతరంగిక బృందాన్ని (Inner Cricle) ఏర్పాటు చేయగలిగాడు. 1884 లో రిప్పన్ వీడ్కోలు సభలను సమావేశ పర

చుటలో ఇది గొప్ప పాత్రను వహించింది.

రిప్పన్ బొంబాయి నుండి బ్రిటన్‌కు వెళ్ళిపోవుటకు ముందు హ్యూం బొంబాయికి వచ్చి, అతనితో సంప్రతించి, తర్వాత మూడు నెలలు అక్కడ గడిపాడు. అనేక పర్యాయాలు బొంబాయి నాయకులతో సమాలోచనలు జరిపి వారి ఆమోదంతో అదివరకు రహస్యంగా కృషిచేస్తూఉన్న ఆంతరంగిక బృందానికి "భారతీయ జాతీయసభ" (Indian National Union) అనే పేరు కల ఒక అఖిల భారత సమావేశం జరగవలసినదిగా వారు నిర్ణయించారు. భారత దేశాన నుండి సరియైన సమాచారం బ్రిటన్‌లోని పత్రికలకు అందజేయుటకూ "భారతీయ తంతి సమాచార సంఘం" (Indian Telegraph Union) అనే సంస్థను స్థాపించి, దాని ఖర్చులు నిమిత్తం బొంబాయి, మద్రాసు, కలకత్తాలో ప్రముఖుల నుండి విరాళాలు సంపాదించుటకు తీర్మానం చేశారు.

బొంబాయిలో ఈ కార్యక్రమాన్ని ముగించుకొని హ్యూం పూనాకు వెళ్లి సర్వజనైకసభ వారితో సంప్రదించి అఖిల భారత సమావేశాన్ని జరిపే బాధ్యతను వారు వహించ వలసిందిగా కోరాడు. దానికి వారు సమ్మతించారు.

పూనా నుండి మార్చి ప్రారంభంలో మద్రాసుకు వెళ్ళాడు. అప్పటికి అక్కడ మహాజన సభ స్థాపింపబడింది. దాని నాయకులతో అతడు చర్చలు సాగించి తంతి సమాచార సంఘానికి వారి మూలంగా కొంత విరాళాన్ని సంపాదించి, పూనాలో జరగబొయ్యే అఖిలత భారత సమావేశానికి ప్రతినిధులను పంపవలసిందిగా వారిని కోరాడు. అందుకు వారు సమ్మతించారు.

దీనికి కొన్ని నెలలకు ముందు 1884 డిసంబరు ఆఖరు వారంలో మద్రాసులోని అడయారులో దివ్యజ్ఞాన సాంవత్సరిక సమావేశం జరిగినప్పుడు సభలో సభ్యుడును మద్రాసు ప్రముఖులలో ఒకడును అయిన రఘునాధరావు దివ్యజ్ఞాన సభ భారతీయుల రాజకీయ సాంఘిక సమస్యలనుకూడా చర్చించ వలసినదిగా కోరాడు. కాని ఈలాటి సమస్యలను చర్చించుటకు సభా నాయకులు నిరాకరించారు. అటు తర్వాత రఘునాధరావు దివ్యజ్ఞాన సభ్యులలో కొందరిని తదితరులు కొందరిని తనబసకు ఆహ్వానించి ఒక సభను సమావేశ పరచగా భారత రాజకీయ సమస్యల చర్చించి నిర్ణయాలు తీసుకొనుటకు ఒక అఖిలభారత సంఘాన్ని, దానికి అనుబంధంగా రాష్ట్ర సంఘాలను స్థాపించ వలసినదిగా ఆ సమావేశం తీర్మానించి. ఆతీర్మానము ఆచరణలోకి తెచ్చుటకు అన్ని రాష్ట్రాల ప్రముఖులతో కూడిన ఒక కమిటీని ఏర్పాటుచేసింది.

దీనిని ఆధారం చేసుకొని కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత కాంగ్రెసుకు జన్మస్థానము దివ్యజ్ఞాన సమాజమనే కట్టుకధ ఒకటి ప్రచారంలోకి వచ్చింది. కాని ఈకధకు ఏలాటి ఆధారాలు లేవు. రఘునాధరావుబసలో ఏర్పాటైన కమిటీ అఖిలభారతసమావేశానికై ఏలాటి చర్యలు తీసుకొనలేదు. హ్యూం ప్రయత్నాలద్వారాను బొంబాయి ప్రముఖులయొక్కయు సర్వజనైకసభ వారి యొక్కయు సహకారం ద్వారాను స్థాపించబడిన "భారత జాతీయసభ"

అధ్వర్యాననే కాంగ్రెసు సమావేశం జరిగింది. ఈ సమావేశానికి రఘునాధరావు బసలో జరిగిన సమావేశానికీ ఏలాటి సంబంధమూలేదు.

హ్యూం మద్రాసు నుండి కలకత్తాకు వెళ్ళి తన సన్నిహితులు కొందరితో సమావేశాన్ని గురించి చర్చించి, తంతిసమాచారసంఘానికి కొంత విరాళాన్ని సంపాదించగలిగాడు. కాని అతడు సురేంద్రనాధుని కలుసుకోలేదు. సురేంద్రనాధ్ మిత్రుడైన ఆనందమోహన్ బోసును కలుసుకొని అనేక విషయాలు గురించి చర్చించాడు గాని అఖిల భారత సమావేశాన్ని గురించి అతనితో ప్రస్తావించలేదు. సురేంద్రనాద్ రాజకీయాలపట్ల అతడికి సుహృద్భావం లేదని ఇది స్పష్టం చేస్తున్నది.

కలకత్తానుండి ఉత్తరభారతంలోని మరికొన్ని నగరాలకు వెళ్లి అక్కడి సన్నిహితులతో మంతనాలు జరిపి మేనెలలో సిమ్లాచేరి, రాజప్రతినిధి డఫరిన్‌ను కలుసుకొని భారత జాతీయసభను నిర్మాణం చేయడము, దాని ఆధ్వర్యాన అఖిలభారతసమావేశాన్ని జరుపుటకు నిర్ణయించడము గురించి అతనికి తెలియపరచటమేగాక, ఆసమావేశానికి బొంబాయిగవర్నరు రీ ప్రభువును అధ్యక్షుడుగా ఆహ్వానించుటకు తాను తలచుచున్నట్లు చెప్పాడు. సభ నిర్మాణంపట్ల గాని సమావేశంపట్ల గాని డఫరిన్ విముఖత్వాన్ని చూపకపోయినా భారతరాజకీయ సమస్యలను చర్చించే సమావేశంలో ప్రభుత్వ విధానాలను విమర్శించడం తప్పదనీ ఆలాటి సమావేశానికి అధికార వర్గానికి చెందిన రీప్రభువు వంటివాడు అధ్యక్షుడు కావడం అనుచితమని హ్యూంకు తెలియపరిచాడు. హ్యూం ఆఅభిప్రాయంతో ఏకీభవించి సమావేశాన్ని అధికారుల అధ్యక్షతన జరిపే ప్రయత్నాన్ని మానుకొన్నాడు. డఫరిన్ తోటి సమావేశంలో ఇంతకు మించి ఏది జరగకపోయినా సమావేశాన్ని గురించి ఒక కట్టుకథ ప్రచారంలోకి వచ్చింది. దీని ప్రకారం కాంగ్రెసును స్థాపించినవాడు డఫరిన్ ప్రభువు - ప్రధమంలో హ్యూం భారతజాతీయసభలో సంఘసంస్కరణ విషయాలనుమాత్రమే చర్చించుటకు ఉద్దేశించినాడని, ఆఉద్దేశాన్ని డఫరిన్‌కు తెలియపరచగా అతడు ఆలాటి సభవలన ప్రయోజనమేమీ ఉండదనిన్నీ, అదిపరిపాలనలోని లోపాలను ప్రభుత్వ దృష్టికి తెచ్చి, వాటిని నిర్మూలించుటకు సూచనలు చేసిన పక్షంలో ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొని తద్వారా తనవిధానాలను మార్చుకొనుట సాధ్యం కాగలదని, బ్రిటన్‌లో ప్రతిపక్షం ఈలాటి పనులను నిర్వహిస్తున్నదనీ ఆలాటి పనులనే హ్యూం తలపెట్టినసభ నిర్వహించడం అవసరమనీ అతడు హ్యూంకు సలహా ఇవ్వగా హ్యూం తన తొలిఉద్దేశాన్ని మానుకొని భారత జాతీయసభనూ దాని ఆధ్వర్యాన సమావేశమైన కాంగ్రెసునూ రాజకీయసభగా మార్చినాడనీ ఈకట్టు కథ సారాంశం. ఈకథయే వాస్తవమైతే కాంగ్రెసుకు డఫరిన్ పితామహుడని చెప్పవలసివస్తుంది. ఈకథను అల్లినవాడు మొదటి కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షుడైన బోనర్జి. అతడు 1889లో - మొదటిసమావేశానికి నాలుగు సంవత్సరాల తర్వాత - దీనిని బహిరంగపరచాడు. కాని దీనికి ఏలాటి ఆధారాలు

లేవు. కాంగ్రెసుకు దివ్యజ్ఞాన సమాజం జన్మస్థానమనడం ఏలాటిదో డఫరిన్ దానికి పితామహుడనేదికూడా అలాటిదే.

ఈవిధంగా 1884 డిసంబరు నుండి 1885 మేనెలవరకు దేశము అంతటా పర్యటనను గావించి, రాజప్రతినిధి డఫరిన్‌తోకూడా సంప్రదించినతర్వాత తాను స్థాపించిన భారతజాతీయసభ (Indian National Union), దాని ఆధ్వర్యాన జరుపనెంచిన అఖిల భారత సమావేశము ప్రముఖులందరికి ఆమోదయోగ్యమైన వనే విశ్వాసము హ్యూంలో బలపడింది. దాని ఫలితంగా అతడు మేనెలలో రాష్ట్రాలలోని ప్రముఖులకు సంఘాలకు ఒక లేఖను వ్రాసి (1) 1885 డిసంబరు 25 మొదలు 31వరకు భారతజాతీయసభ సమావేశము పూనాలో జరుగునని, (2) ఆమహాసభకు బొంబాయి మద్రాసు బెంగాలు రాష్ట్రాలనుండి ఇంగ్లీషుభాష నెరిగిన రాజకీయనాయకులు వచ్చెదరని, (3) మహాసభ ఉద్దేశములు జాతీయాభ్యుదయము కొరకు హృదయపూర్వముగ కృషిచేయు వారందరిని పరస్పరము పరిచయముచేసి, రాబోవుసంవత్సరములో నిర్వర్తించవలసిన రాజకీయ కార్యక్రమములగురించి నిర్ణయించుటఅని, (4) పరోక్షముగ ఈసభ దేశీయపార్లమెంటుకు అంకురమై భారతీయులు ప్రాతినిధ్య ప్రజాస్వామికానికి అర్హులుకారనే ఆంగ్లోఇండియన్లయు తదితర బ్రిటిష్‌వారియు దురభిప్రాయాన్ని తొలగించ గలదనియు, ఈలాటి రెండవసభ ఎక్కడ జరగవలెనో సమావేశము నిర్ణయించు ననియు, (5) పూనాలోజరిగే ఈసంవత్సర సభకు సర్వజనైకసభ ఏర్పాటులన్నిటినీ గావించుటకు అంగీకరించినదనియు, (6) పూనాకువచ్చే ప్రతినిధులు వారి వారి ప్రయాణ ఖర్చులను భరించవలెననియు, పూనాకు వచ్చిన తర్వాత వారి భోజనాది వసతుల ఖర్చులన్నీ సర్వజనైకసభ భరించుననియు, (7) ప్రతినిధులు ఐచ్ఛికముగ సభకు చందాలు ఇచ్చినపక్షంలో వాటిని సమావేశఖర్చులకై వినియోగించి మిగిలిన సొమ్మును మరుసటి సంవత్సరం జరిగే సభకై కేటాయింపబడుననియు, (8) పూనావారుగాక, సింధు, బీరారు, బొంబాయి రాష్ట్రాల నుండి 20 మంది, మద్రాసు, బెంగాలు రాష్ట్రాలనుండి చెరీ 20మంది, ఉత్తర ప్రదేశ్ అయోధ్య పంజాబుల నుండి 10మంది ప్రతినిధులు వచ్చెదరనియు తెలియపరచినాడు.

హ్యూం జరిపిన సంప్రతింపులూ, ఈ లేఖా రహస్యముగా ఉంచబడిన వనే విషయాన్ని గుర్తించ వలసి ఉంది. వీటిని గురించి పత్రికలలో ఏలాటి ప్రకటనా జరగలేదు. సమావేశంకూడా రహస్యంగా జరగవలసినదిగా హ్యూం, అతని సన్నిహితులు అభిప్రాయ పడినారు.

దేశంలో జరగవలసిన కార్యక్రమమునంతా పూర్తిచేసుకొని హ్యూం ఆగస్టులో బ్రిటన్‌కు వెళ్లి అక్కడి లిబరల్ పక్షానికి చెందిన ప్రముఖులతోను భారతదేశంపట్ల అభిమానంగల ఇతరులతోను సమాలోచనలను జరిపి, తాను ఏర్పాటు చేయదలచిన సమావేశానికి వారి ఆమోదాన్నికూడా సంపాదించాడు. భారత తంతిసమాచారసంఘం పంపే వార్తలను పత్రికలలో ప్రచురించుటకు

కొందరు సంపాదకుల అంగీకారమును పొందగలిగాడు. బ్రిటన్‌లో తన పని పూర్తి చేసుకొని డిసంబరు 2న బొంబాయి చేరాడు.

పూనాలో జరుగనున్న సమావేశాన్ని గురించి సురేంద్రనాద్‌కుగానీ అతని సన్నిహితులకుగానీ తెలియనికారణంగా అతడు నవంబరులో జాతీయ మహాసభ రెండవ సమావేశం డిసంబరు 25 నుండి 27 వరకు కలకత్తాలో జరుగుననీ, దానికి ప్రతినిధులుగా రావలసినదనీ అన్ని రాష్ట్రాలలోని రాజకీయసభల నాయకులకు తెలియపరచాడు. (ఈ సమావేశాన్ని గురించి ఇంతకుపూర్వమే తెలియపరచాము.) ఒకే తేదీలలో రెండు సమావేశాలుజరుగుటకు ఏర్పాటులుగావింపబడుట పూనా లోని సర్వజనైక సభవారికి బొంబాయిలోని వారి సన్నిహితులకు తదితరులకు కలవరపాటు కలిగించింది. ఏమి చేయుటకు వారికితోచక హ్యూం బ్రిటన్‌నుండి వచ్చేవరకు వారు ఏలాటి నిర్ణయాన్ని తీసుకొనలేదు. డిసంబరు 2 తే దిన అతడు వచ్చిన వెంటనే అందరూ సమాలోచనలు జరిపి తమ సభకూ సమావేశానికీ కాంగ్రెసు అనేపేరు పెట్టుటకు, తమ సమావేశాన్ని డిసంబరు 28నుండి 30 వరకు జరుపుటకు నిర్ణయించినారు.

ఈ నిర్ణయానుసారం సమావేశం పూనాలో జరగవలసి ఉన్నా అక్కడ కలరా వ్యాధి ఉద్ధృతంగా వ్యాపించడంచేత సమావేశం బొంబాయి నగరంలో జరగవలసి వచ్చింది. బొంబాయిరాష్ట్ర సంఘం (Bombay Presidency Association) దానికి కావలసిన ఏర్పాటులను చేసింది.

## 6

సమావేశానికి బొంబాయి రాష్ట్రంలోని 6 నగరాల నుండి 38 మంది, మద్రాసులో 13 నగరాలనుండి 21 మంది, బెంగాలులో కలకత్తానుండి ఆగ్గురు ఉత్తర ప్రదేశ్ అయోధ్యలోని 4 నగరాల నుండి 7మంది, పంజాబులోని 3 నగ రాల నుండి ఆగ్గురు- మొత్తం 72 మంది ప్రతినిధులు హాజరయ్యారు. మొదటి నుండీ రాజకీయాలలో అగ్రస్థానంవహించిన బెంగాలునుండి ముగ్గురు మాత్రమే రావడం కొంత ఆశ్చర్యాన్ని కలిగించవచ్చు, 25-27 తేదీలలో సురేంద్రనాద్ ఏర్పాటుచేసిన సమావేశం అక్కడ జరగడము దీనికి కారణం. తమ రాకకు అనుకూలంగా పూనాసభ జరగకపోవడం బెంగాలీ నాయకులకు చాలా ఆశా భంగాన్ని కలిగించింది. కాని కాంగ్రెసు ప్రథమ సమావేశానికి బెంగాలు ప్రము ఖులలో ఒకడైన డబ్ల్యు.సి. బోనర్జి (W.C. Bonnerjee) అధ్యక్షుడుగా ఎన్ను కొనడం వారిని కొంతవరకు తృప్తి పరచింది. ప్రతినిధులుకాని వారెవరూ సమా వేశానికి ఆహ్వానింప బడలేదు. సమావేశం కూడా రహస్యంగానే జరిగింది. పత్రి కల ప్రతినిధులు హాజరుకాని కారణంగా అందులో జరిగిన చర్చలగురించి పత్రి కలు ప్రచురించలేక పోయినవి. కలకత్తాలోని ఒక వారపత్రిక ప్రతినిధిమాత్రం ఏలాగో సమావేశానికి హాజరై దానినిగురించి వివరంగా తన పత్రికకు నివేదికను

పంపాడు. తర్వాత కొంత కాలానికి కాంగ్రెసు కార్యవర్గంవారు సమావేశాన్ని గురించి ఒకపూర్తి నివేదికను ప్రకటించారు.

సమావేశానికి హాజరైన 72 ప్రతినిధులలో లాయర్లు, భూస్వాములు, బ్యాంకర్లు, డాక్టర్లు, పత్రికా సంపాదకులు, ఉపాధ్యాయులు, మతబోధకులు, మత సంస్కర్తలు, అనేక కులాలకు వర్గాలకుచెందిన హిందువులు, ముస్లింలు, (ఇద్దరు మాత్రమే) క్రైస్తవులు, రాజకీయ సంఘాల ప్రతినిధులు, శాసనసభ్యులు, మునిసిపల్ కౌన్సిల్ల సభ్యులు ఉండినారు. ఆనాడు అన్ని ప్రధాన వృత్తులకు, కులాలకు, మతాలకు చెందిన భారతీయులలో జాతీయచైతన్యం ఎంతటి పాత్రను వహించిందో ఇది స్పష్టం చేస్తూ ఉంది. సమావేశం వాస్తవంగా జాతీయ సమావేశం అనేపేరును సార్థక్యం చేసుకొన్నది

మూడు రోజులు జరిగిన సమావేశంలో అన్ని రాష్ట్రాలవారు ఉపన్యసించారు. చర్చల ఫలితంగా తొమ్మిది తీర్మానాలు చేయబడినాయి. (1) భారత దేశ పరిపాలన వ్యవహారాల గురించి క్షుణ్ణంగా పరిశీలించుటకు బ్రిటిష్‌వారు భారతీయులు సభ్యులుగాగల ఒక రాయల్ కమీషన్ (Royal Commission) నియామకం కావలెను. అది బ్రిటన్‌లోనే గాక భారతదేశంలోకూడా సాక్ష్యాన్ని సేకరించవలెను; (2) ఇండియా కౌన్సిల్ రద్దుకావలెను; (3) శాసనసభలలో ప్రజలు ఎన్నుకొన్న భారతీయులకు తగిన ప్రాతినిధ్యము ఉండవలెను-బడ్జెటును చర్చించుటకు, ప్రశ్నలు వేయుటకు శాసన సభలకు అధికారము ఉండవలెను; పంజాబు, ఉత్తరప్రదేశ్, అయోధ్య రాష్ట్రములలో శాసన సభలు స్థాపింపబడవలెను. శాసన సభలలోని అధిక సంఖ్యాకులు వెలుబుచ్చిన వ్యతిరేకాభిప్రాయాలను విచారణ చేయుటకు పార్లమెంటులోని కామన్‌సు సభలో ఒకస్థాయీ సంఘము ఉండవలెను. (4) పోటీపరీక్షలు ఏకకాలంలో బ్రిటన్ భారతదేశాలలో జరుగవలెను. అభ్యర్థుల వయస్సును పొడిగించవలెను; (5, 6). సైనికఖర్చులు తగ్గించవలెను; అందులో కొంతభాగాన్ని బ్రిటిష్ భరించవలెను. (8) బర్మాను జయించడము, దానిని భారతదేశంలో చేర్చడము నిరసించదగినవి. (9) కాంగ్రెసు చేసిన తీర్మానములన్నిటినీ దేశంలోని రాజకీయ సంఘాలు చర్చించి ప్రజలలో రాజకీయాల పట్ల అసక్తికలిగించవలెను.

ఈ తీర్మానాలన్నీ చాలావరకు ఇదివరలో రాష్ట్రసంఘాలు చర్చిస్తూ ఉండినవే. కాని అఖిలభారత కేంద్రసంఘం ఏర్పడడం, అది వీటిని చర్చించి దేశంలో వీటినిగురించి ఏకాభిప్రాయాన్ని కలిగించుటకు ప్రయత్నించడం, గుర్తించదగినది.

కాంగ్రెసువంటి సమావేశం దేశంలో ఇదివరకెన్నడూ జరగలేదు. ఇదియే అన్నిరాష్ట్రాల ప్రతినిధులతో కూడిన మొదటి సమావేశం. దీనితో దేశచరిత్రలో నూతనశకం ప్రారంభమైంది. సమావేశానికి వచ్చిన 72 ప్రతినిధులు ఈ నూతన శకాన్ని సృష్టించిన ప్రఖ్యాతిని సంపాదించారు. ప్రజలలో జాతీయభావం లేని కారణంగా పరాయివారు దేశాన్ని జయించి వశపరచుకొని ప్రజలు తలఎత్తనియ్య

కుండా చేశారు. వారిని సర్వవిధాలా భంగపరిచారు. యాభై సంవత్సరాలుగా విద్యాధికులు జాతీయభావాన్ని పెంపొందించుటకు చేసినకృషి సఫలతగాంచింది. కాంగ్రెసు ఈ సఫలతకు ఒక బాహ్యస్వరూపం అయింది. జాతీయ ఐక్యతకు గట్టి పునాదులు ఏర్పడినాయి.

దేశీయ పత్రికలన్నీ ఈ అభిప్రాయాన్నే వ్యక్తంచేశాయి. రాజకీయ చైతన్యంగల ప్రతి భారతీయుడు గర్వితుడైనాడు. ఈవిధంగా ప్రారంభమైన కాంగ్రెసు కాలక్రమాన బలంచేకూర్చుకొని స్వాతంత్ర్యోద్యమాన్ని లేవదీసి, అది విజయవంతం కావడంలో ప్రధానపాత్రను వహించి శాశ్వతకీర్తిని సంపాదించుకొన్నది.

## 7

ఆఖరున ఒక ప్రశ్నకు సమాధానం చెప్పవలసిఉంది. 1876నుండిప్రజలలో అఖిలభారతదృక్పథాన్ని పెంపొందించడంలోను కేంద్రసంఘసంస్థాపనకృషిలోను ప్రధానపాత్రను వహించినవాడు సురేంద్రనాథ్. 1877, 1878లో సివిల్‌సర్వీసు పరీక్షావిధానంలో జరగవలసిన మార్పులగురించి అన్నిరాష్ట్రాలలోని విద్యాధికులలో ఏకాభిప్రాయాన్ని కుదుర్చుటకు, 1884లో జాతీయనిధి సమకూర్చుటకు దేశాటనం చేశాడు. ఇండియన్‌సంఘాన్ని దేశానికంతా ఒకకేంద్ర సంఘంగా రూపొందించుటకు గొప్ప ప్రయత్నాన్ని సాగించి, 1883 డిసంబరులో ఒక పర్యాయము 1885 డిసంబరులో ఇంకొకపర్యాయము దేశీయ సమావేశాలను జరిపాడు. కాని తుదకు అతడు తలపెట్టిన జాతీయ సమావేశం దేశానికంతా కేంద్రసంస్థగా స్థిరత్వాన్ని చేకూర్చుకొనుటకు బదులు హ్యూం నిర్మాణంచేసిన కాంగ్రెసు అలాటి సంస్థగా రూపొందింది. ఈమార్పునకు కారణాలేవో తెలుసుకొనడం అవసరం.

ఈకారణాలలో ముఖ్యమైనది కాంగ్రెసును నిర్మాణం చేయడంలో ప్రముఖపాత్రనువహించినవాడు ఒక బ్రిటిష్ ప్రముఖుడు కావడమే. ఇంతేగాక అతడు పరిపాలన యంత్రాంగంలో ఉన్నతోద్యోగాలను నిర్వహించినవాడు, రాజప్రతినిధులైన రిప్పన్‌కు డఫరిన్‌కు సన్నిహితుడు. వారి అనుమతిని పరోక్షంగా సంపాదించి కాంగ్రెసును స్థాపించాడు. బ్రిటన్‌లోని లిబరల్‌పక్షానికి చెందిన ప్రముఖులనేకుల సానుభూతినికూడా ఈవిషయంలో సంపాదించాడు. బ్రిటన్ భారతదేశాలమధ్య ఏర్పడిన అనుబంధాన్ని భారతీయనాయకుల సహకారంతో బలపరచే ఉద్దేశంతో అతడు దీనిని స్థాపించడం వారికి తెలియని విషయం కాదు, తొలిదశలో వారు కాంగ్రెసుపట్ల సుముఖులుగా ఉండినారు. సురేంద్రనాథ్‌కు అధికారులనుండి ఏలాటి సానుభూతీ లభించలేదు. అతడు అతివాదిఅనీ అతని లక్ష్యం ఇటలీలో మ్యాజినీ చేసినట్లే భారతదేశంలో స్వాతంత్ర్యాన్నిసంపాదించడమేననే అభిప్రాయం వారిలో నాటుకొన్నది. ఆరోజులలో ప్రభుత్వానికి అనుమానాస్పదులైనవారి ప్రయత్నాలు విజయాన్ని సాధించడం సాధ్యంకానట్టి

విషయం. ఇందుచేతనే చాలావరకు హ్యూం నిర్మాణంచేసిన కాంగ్రెసు సుస్థిరత్వాన్ని సంపాదించడం, సురేంద్రనాథ్ స్థాపించిన జాతీయసమావేశం పలుకుబడిని కోల్పోవడం జరిగింది.

ఇదిగాక ఆనాటి భారత రాజకీయ నాయకులలో అధికసంఖ్యాకులు మితవాదులు. బ్రిటిష్‌పరిపాలన చాలాకాలం మనగలిగినగాని దేశం పురోగమించడం సాధ్యంకాదని విశ్వసించినవారు. హ్యూం స్థాపించిన కాంగ్రెసుకు ఈవిశ్వాసమే ఆధారం. ఇదికూడా దానిస్థిరత్వానికి దోహదకారి అయింది.

ఇంతేగాక ఆనాడు దేశంలో తెల్లవాడు ఏలాటివాడైనా ప్రజలకు వానిపట్ల ఒకవిధమైన గౌరవం ఏర్పడి ఉండేది. ప్రకృతిసిద్ధంగా వాడు గొప్పవాడనే భావం వ్యాపించి ఉండేది. ఇదికూడా హ్యూం స్థాపించిన కాంగ్రెసు స్థిరపడడంలో గొప్ప సాధనమైంది.

ఉద్యోగాననుండి తొలగింపబడినట్టిన్నీ కారాగార శిక్షను అనుభవించినట్టిన్నీ సురేంద్రనాథ్ స్థాపించిన జాతీయ సమావేశమే స్థిరత్వాన్ని సంపాదించ గలిగిన పక్షంలో ప్రభుత్వం ఏదోవిధంగా దానిని నిషేధించి నిర్మూలించి ఉండేది. సురేంద్రనాథ్‌కూ అతని సహచరులకూ ఇది తెలియని విషయంకాదు. ఆకారణంచేత వారు ప్రాజ్ఞతతో ప్రవర్తించి, కాంగ్రెసుతో పోటీచేయడంమాని, దానితో కలిసిపోయ్యారు. ఇది వారి రాజకీయ దూరదృష్టికి దేశాభిమానానికి గొప్ప తార్కాణం. ఈ కారణంచేత రెండుకేంద్ర సంఘాలు ఏక కాలంలో స్థాపితమై వాటిమధ్య ద్వేషం సంభవించే ప్రమాదం తప్పింది. దేశానికి లభించిన అదృష్టాలలో ఇది ఒకటి.

ఈవిధంగా అఖిలభారత కేంద్ర సంఘస్థాపనకై నలభై సంవత్సరాలుగా భారతీయులు చేసినకృషి ఫలప్రదమైంది. ప్రభుత్వానికి ఒక కేంద్ర యంత్రాంగం ఏర్పడి దానిసౌష్టవానికి తోడ్పడినట్లే ప్రజాపక్షానికికూడా ఒకే కేంద్రసంస్థ ఏర్పడి వారి రాజకీయాలకు సౌష్టవం కల్పించింది. రాజకీయనాయకులు దీని సాధనాన కలిసికట్టుగా ప్రవర్తించగలవారయ్యారు.

1858 తర్వాత జాతీయత ప్రజలలో ఏర్పడడమే దేశచరిత్రకు ప్రధాన లక్షణం. జాతీయత, జాతీయాభిమానం దేశీయాభిమానం అంటే ఏమిటో తెలియని ప్రజలలో ఇవిఅంకురించి వృద్ధిగాంచడం దేశచరిత్రలోజరిగిన అపూర్వమైనమార్పు. ఇవిలేని కారణంగానే పరాయివారు దేశాన్ని జయించి పాలించగలిగారు. వేయి సంవత్సరాలకాలం దేశం పరాయిదాస్యాన్ని అనుభవించవలసివచ్చింది. ప్రజలు లెక్కలేని కష్టాలకు నష్టాలకు గురిఅయ్యారు. 1858 తర్వాత అనేక పరిస్థితులు అనుకూలించిన కారణంగా వారు జాతీయాభిమానం కలవారయ్యారు. ఈపరిస్థితులు జాతీయభావాన్ని వారిలో - ప్రధానంగా విద్యాధికులలో ఏవిధంగా బలపరచిందో దానిచే ప్రభావితులైనవారు విద్య, మతము, ఆర్థికము, సంఘ సంస్కరణము, వార్తాపత్రికలు, సారస్వతము, రాజకీయము, మొదలైన రంగాలలో ఏలాటి కృషిని సాగించారో, ఈకృషిఫలితంగా జాతీయత ఏవిధంగా మరింత బలపడిందో

ఈ గ్రంథంలోని మొదటి ఎనిమిది అధ్యాయాలలో కొంతవరకు తెలియపరిచాము. జాతీయభావంమూలాన ప్రజలు పూర్తిగా మారిపొయ్యారు. 1885నాటి భారతీయులు 1800నాటి భారతీయుల వంటి వారుకారు. వారిమనోవైఖరి, వారిభావాలు వారిని ఆకర్షించిన కార్యక్రమాలు, వారిఆదర్శాలు పూర్తిగా మారిపోయాయి. ఈమార్పునకంతకు జాతీయతయే ప్రధాన కారణం. అందుచేత ఈకాలాన్ని జాతీయతాభ్యుదయకాలం అని పేర్కొనవచ్చు. కాంగ్రెసు దానికి బాహ్యస్వరూపంగా ఏర్పడింది. ప్రజాపక్షంవారు ఇదిమొదలు కాంగ్రెసును ప్రధాన సాధనంగా చేసుకొని, తద్వారా వారి కార్యక్రమాలనన్నిటిని సాగించారు. దేశచరిత్ర చాలావరకు కాంగ్రెసుచరిత్రతో ముడిపడిపోయింది. కాంగ్రెసు అనే ఆయుధం వారికి లభించింది. దానినివారు ప్రాజ్ఞతతో వినియోగించి క్రమక్రమంగా స్వాతంత్ర్యాన్ని సంపాదించగలిగారు. అందుచేతనే స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో దానిపుట్టుకకు ఎనలేని ప్రాధాన్యం లభించింది.

కాంగ్రెసుకు పితామహుడనే పేరు హ్యూం సంపాదించాడు, ఈపేరునకు అతడు అర్హుడనే విషయంలో ఏలాటి సందేహములేదు. కాని దీనిని అతడొక్కడే స్థాపించాడని అనుకొనరాదు, దేశానికంతా ఒక కేంద్రరాజకీయసంస్థ ఉంటేనేగాని ప్రభుత్వంలో మార్పులు ప్రవేశపెట్టడం సాధ్యంకాదనే భావాన్ని సృష్టించినవారు భారతీయులే. కలకత్తాలో భూస్వాముల సంఘం ఏర్పడినప్పటి నుండి ఈభావం ఉదయించింది. 1851లో ఏర్పడిన బ్రిటిష్ ఇండియన్ సంఘం దీనికిగాను కొంత కృషిని సాగించింది. 1876లో స్థాపింపబడిన ఇండియన్‌సంఘం దీనినే లక్ష్యంగా పెట్టుకొన్నది. రాష్ట్రాలన్నిటి నుండి ప్రతినిధులు ఢిల్లీదర్బారులో సమావేశమైనప్పుడు ఇందుకై నాయకులు సమాలోచనలు జరిపి అఖిల భారతవార్తాపత్రికల సంఘాన్ని స్థాపించి దాని ఆధ్వర్యాన రెండు సమావేశాలు జరిపారు. ఇందులో సర్వజనైకసభ గొప్పపాత్రను వహించింది. సురేంద్రనాద్ పర్యటనలు ఈభావాన్ని బలపరిచాయి. అతడు దీనిని బలపరచడమేగాక 1883 డిసంబరులో మొదటి జాతీయ సమావేశాన్ని జరిపాడు. ఈఉదంతాలన్నీ హ్యూం రాజకీయాలలో ప్రవేశించిన నాటికి అఖిలభారత కేంద్ర సంఘస్థాపన విషయంలో ఒక అనుకూలవాతవరణం ఏర్పడిన విషయాన్ని స్పష్టంచేస్తున్నది. ఆలాటి వాతావరణాన్ని హ్యూం ఆధారం చేసుకొని దానిని స్థాపించే విషయంలో అనేకుల సహకారాన్ని సంపాదించాడు. అతని నిర్మాణ కౌశలమంతా ఈసహకారాన్ని సంపాదించడంలోనే కనుపిస్తుంది. దీనితోపాటు అతడు రాజప్రతినిధుల యొక్కయు బ్రిటిష్ ప్రముఖుల యొక్కయు సానుభూతిని సంపాదించాడు. మూడు సంవత్సరాలపాటు ఇందుకుగాను పట్టుదలతో నిరంతర కృషిగావించి తుదకు విజయాన్ని సాధించాడు. అఖిలభారత కేంద్రసంస్థ ఒకటి ఉండడం అవసరమనే భావాన్ని సృష్టించినవాడు ఆలాటి సంస్థను ప్రప్రథమంగా స్థాపించినవాడు అతడు కాకపోయినా అతని నాయకత్వంలో కాంగ్రెసు నిర్మాణం జరగడం చేతను సురేంద్రనాథుని జాతీయసమావేశానికి లభించనిస్థిరత్వం దానికి లభించడం

చేతను అతడు కాంగ్రెసుకు పితామహుడనే పేరునకు అర్హుడైనాడు.

కాంగ్రెసు చరిత్రగురించీ అదిసాధించిన ఫలితాలను గురించీ మనమిప్పుడు తెలుసుకోనవలసిఉంది.

చదువదగిన గ్రంథాలు :

Bharatiya Vidya Bhavan; Vol X.

TarachandVol II.

Anil seal : The Emergence of Indian Nationalism.

S. R. Merhtotra : Emergence of the Indian National Congress.

B. L. Glover : A Documentary Study of British Policy towords Indian Nationalism.

B. Pattabhi Seetharamiah : A History of the Indian National Congress. తెలుగు అనువాదం.

# అధ్యాయము - 9

## కాంగ్రెసు ప్రథమదశ 1885-1905

మానవజీవితంలో అనేక దశలు ఉన్నట్లే కాంగ్రెసువంటి రాజకీయ సంఘాల చరిత్రలో కూడా అనేక దశలు ఉండడం సహజం. పుట్టగానే అవి పరిణతి గాంచవు. ఇది జరుగుటకు కొంతకాలం పడ్తుంది. ఈ దృష్ట్యా కాంగ్రెసు చరిత్రలో 1885 మొదలు 1905 వరకు ప్రథమదశ అనీ బాల్యదశ అనీ చెప్పవచ్చు.

ఈ దశలో తక్కిన రాజకీయ సంఘాలకు ఉన్నట్టి యంత్రాంగం దానికి ఏర్పడుటకు చాలాకాలం పట్టింది. అప్పుడుకూడా దాని యంత్రాంగం సంపూర్ణత్వాన్ని సంపాదించలేదు. సాధారణంగా 1885 కి పూర్వం రాష్ట్రాలలో కృషి చేస్తూ ఉన్న రాజకీయ సంఘాలకు (1) ఏటేట సక్రమంగా చందాలు చెల్లించే సభ్యులతోకూడిన ఒక సాధారణసభ (General body) (2) ఒక కార్య నిర్వాహక కమిటీ (Managing committee) (3) ఒక అధ్యక్షుడు, (4) ఒకరో ఇద్దరో కార్యదర్శులు, (5) ఏదో ఒక ప్రధాన నగరంలో ఒక ఆఫీసు ఉండేవి. కాని కాంగ్రెసు ఈలాంటి యంత్రాంగంతో పుట్టలేదు. దానికి ఏటేట చందాలు చెల్లించే సభ్యులు లేరు. కొన్ని సంవత్సరాలవరకు ఒక కార్యదర్శి మాత్రం దాని వ్యవహారాలను సాగిస్తూ వచ్చాడు. ఆ పదవిని హ్యూం అలంకరించాడు. కాని కొంతకాలం తర్వాత అతనిని ఏటేట కాంగ్రెసు సమావేశం ఎన్నుకొనవలసి నట్లుగా ఒక నియమం ఏర్పడింది. ఒక సమావేశానికి ఇంకో సమావేశానికి మధ్య ఏలాటి కార్యక్రమం లేకపోవడంచేత యంత్రాంగం ఏదీ అవసరం లేక పోయింది. కాంగ్రెసు అంటే ఏటేట మూడురోజులపాటు సమావేశమయ్యే అఖిలభారత కేంద్ర సంఘం అనే నిర్వచనం ఉచితమైనట్లు చెప్పవచ్చు.

సాంవత్సరిక సమావేశాలను జరుపుటకు అవసరమైన ఏర్పాటులు చేయుటకు ఒక ఆహ్వానసంఘం తాత్కాలికంగా ఏర్పడింది. ఏ నగరంలోను ఏ రాష్ట్రంలోను సమావేశం జరగవలసినదిగా నిర్ణయించబడేదో అక్కడి కాంగ్రెసు అభిమానులు ఇందులో సభ్యులు. అది సమావేశ ఖర్చులకు కావలసిన విరాళాలను వసూలుచేసి, ప్రతినిధుల భోజనాది వసతులను సమకూర్చి, సమావేశానంతరం దానిని గురించిన పూర్తి నివేదికను తయారుచేసి ప్రచురించి, అటు తర్వాత రద్దైపోయేది. ఈ విధంగా ఒక్కొక్క సమావేశానికి ఒక ఆహ్వానసంఘం ఏర్పడడం సంప్రదాయరూపం ధరించింది. ఏటేటా సమావేశంకావడం కాంగ్రెసు కార్య

క్రమంలో ప్రాధాన్యం వహించినందున ఆహ్వానసంఘానికి కూడా ప్రాధాన్యం లభించింది.

సమావేశంలో చర్చించదగిన విషయాలను తీర్మానాలను నిర్ణయించే బాధ్యతను మొదటి రెండు సమావేశాలలో కార్యదర్శి హోదాలో హ్యూం ఒక రిద్దరి ప్రముఖులసహాయంతో వహించాడు. కాని ఒకనికి ఇంతటి అధికారం ఉండడం నిరంకుశానికి దారితీయగలదని మూడవసమావేశంలో ప్రతినిధులనేకులు ఆక్షేపించారు. అప్పటినుండి ఆయా రాష్ట్రాలనుండి ప్రతినిధులుగా హాజరైన వారు తొలిరోజున ఒక విషయ నిర్ధారణ కమిటీని ఎన్నుకొనవలసిన నియమం ఏర్పడింది. ఇందులో 85 సభ్యులుండవలెనని, వారు రాష్ట్రాల వారీగా ఎన్నుకొనబడవలెనని, కాంగ్రెసు సమావేశం జరుగుతున్న రాష్ట్రానుండి పదిమంది ఎక్కువ సభ్యనుండవలెనని, సమావేశ అధ్యక్షుడు పూర్వాధ్యక్షుడు (Ex-president) కార్యదర్శులు, ఆ సంవత్సరపు స్థానిక కార్యదర్శులు, అధికార హోదాలో అందులో సభ్యులుగా ఉండవలెనని ఆ నియమం విధించింది. సమావేశంలో చర్చకు రావలసిన విషయాలను, తీర్మానాల స్వరూపాన్ని నిర్ణయించే అధికారాన్నీ బాధ్యతనూ అప్పటినుండి ఈ కమిటీ వహించింది. ఇదికూడా తాత్కాలిక కమిటీ.

కాంగ్రెసుకు పూర్తి నియమావళి ఉండవలెననే అభిప్రాయం 1887 నుండి ఏర్పడినా అన్ని రాష్ట్రాలు సమానస్థాయిలో అభివృద్ధిగాంచని కారణాన అన్నిటికీ అనుగుణమైన నియమావళిని నిరూపించడం సాధ్యంకాలేదు. కాని 1887నుండి కలకత్తా, బొంబాయి. మద్రాసులలో కాంగ్రెసుస్థాయీ కమిటీలు (Standing committees) మాత్రం ఏర్పడినాయి. ఇవి అంత శ్రద్ధతో పని చేయలేకపోయినాయి.

ఏటేట ఒక సమావేశాన్ని జరపడంతో కాంగ్రెసు తన బాధ్యతను నిర్వహించినట్లు భావించరాదనీ, సంవత్సరం పొడుగునా అది కార్యక్రమాన్ని సాగించవలెననీ కాలక్రమాన ఒక అభిప్రాయం బలపడింది. దీని ఫలితంగా లక్నోలో జరిగిన 15వ సమావేశం ఒక అఖిలభారత కాంగ్రెసు కమిటీ ఉండవలెనని, అందులో 45 సభ్యులుండవలెనని, వారిలో 40 మందిని ఆయా రాష్ట్రాలలోని కాంగ్రెసు సంఘాల సిఫార్సులననుసరించి ఏటేట జరిగే కాంగ్రెసు సమావేశం ఎన్నుకొనవలెనని, తక్కిన వారు అధికార హోదాలో సభ్యులుగా ఉండవలెనని, దానికి ఒక గౌరవ కార్యదర్శి, జీతం పుచ్చుకొని పనిచేసే ఒక సహాయ కార్యదర్శి ఉండవలెనని, అది ఏటేటమూడుపర్యాయాలు సమావేశమై కాంగ్రెసు కార్యక్రమాలను సాగించవలెనని నిర్ణయం జరిగింది. అప్పటినుండి కాంగ్రెసు యంత్రాంగంలో ఇది ప్రధానస్థానం వహించింది.

కాంగ్రెసును నిర్మాణం చేయడంలో అది పరోక్షంగా దేశీయ పార్లమెంటుకు అంకురము కాగలదని, సభను జయప్రదముగా జరిపిన యెడల కొన్ని సంవత్సరములలోనే భారతదేశం ప్రాతినిధ్యసంస్థలకు(Representative Institutions) అర్హముకాదనే బ్రిటిష్ అధికారుల దురభిప్రాయం తొలగ గలదని 1865

మార్చిలో రాష్ట్రాలలోని ప్రముఖులకు వ్రాసిన ఉత్తరంలో హ్యూం వెలిబుచ్చాడు. పార్లమెంటు అనగా ప్రజలు ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని ఎన్నుకొన్న మహాసభ. కాంగ్రెసు అలాటి స్వరూపాన్ని ధరించుటకు ఒక ఎన్నికల విధానం ఏర్పడడం అవసరం. దానిని తీర్చుటకు రెండవ సమావేశ సందర్భంలో హ్యూం ఒక ప్రణాళికను తయారుచేశారు. అందులో కాంగ్రెసు సమావేశానికి ఎవరంటేవారు హాజరు కాకూడదని, వారిని ఆయా రాష్ట్రాలలోని పట్టభద్రులు, మునిసిపల్ సంఘాల సభ్యులు, ఆదాయపు పన్నును చెల్లించే వారు, రాజకీయ సంఘాల సభ్యులు, న్యాయవాది సంఘాల సభ్యులు, వార్తా పత్రికలకు సంబంధించినవారు, వర్తక సంఘాల సభ్యులు కలిసిన ఒక నియోజకవర్గం (Electoral college) ఏర్పడి, అది కాంగ్రెస్ ప్రతినిధులను ఎన్నుకొనవలెనని సూచించాడు, ఈ విధానం అమలులోకి వచ్చిన పక్షాన కాంగ్రెసు ప్రజలు పరోక్షంగా ఎన్నుకొన్న ప్రతినిధులతో కూడిన సంఘంగా రూపొంది, పార్లమెంటు అనే పేరునకు అర్హత సంపాదించగలది అవుతుందని అతడు భావించాడు. ఈ ప్రతినిధులే రాష్ట్రీయ సంఘాలుగా వ్యవహరించవలెనని కూడా అతడు సూచించాడు.

కాని ఈ ప్రణాళిక అమలులోకి రావడం సాధ్యంకాలేదు. అతడు సూచించిన నియోజకవర్గాన్ని ఏర్పాటుచేసి ఎన్నికలు జరుపుటకు కావలసిన ఆర్థికవసతులుగాని ఇతరవసతులుగాని ఆనాటి కాంగ్రెసుకు లేకపోవడం దీనికొకకారణం. ఇదిగాక అన్నిరాష్ట్రాలలో అతడు సూచించిన సంఘాలు ఏర్పడలేదు. అవి విద్యలోను ఇతర విషయాలలోను ఎక్కువ అభివృద్ధిని సాధించిన బెంగాలు, బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలోమాత్రమే ఉండినవి. ఈ ప్రణాళికను వెనుకబడిన రాష్ట్రాలలో అమలుపరచటం సాధ్యంకాదనే అభిప్రాయం వ్యాపించింది, అందుచేత ఈ ప్రణాళిక ఆచరణ సాధ్యంకాలేదు.

హ్యూం ఉద్దేశం వంటి ఉద్దేశంతోనే మహదేవగోవిందరనడే ఇంకొక ఎన్నికల పథకాన్ని తయారుచేశాడు. ప్రతిరాష్ట్రంలో గ్రామీణప్రాంతాలనుండి కాంగ్రెసు ప్రతినిధులను ఆప్రాంతాలలోని స్థానికసంస్థల సభ్యులు (జిల్లాబోర్డులు, తాలుకా బోర్డులు, మునిసిపల్ సంఘాలు) ఎన్నుకొనవలెననీ, పట్టణప్రాంతాల ప్రతినిధులను వాటిలోని ప్రధానవర్గాలవారు, వారిసంఘాలు ఎన్నుకొనవలసినదిగానూ అతడుసూచించాడు. కాని హ్యూం ప్రణాళికను ఏకారణాలవలన అమలుపరచడం సాధ్యంకాలేదో ఆకారణాలమూలంగానే ఈ ప్రణాళికను అమలుపరచడం సాధ్యంకాలేదు. అన్నిరాష్ట్రాల పరిస్థితులు ఒకేవిధంగాలేని కారణాన అన్నిటికీ అనుగుణమైన ఎన్నికల విధానాన్ని రూపొందించడం సాధ్యం కాలేదన్న విషయం గుర్తించవలసిఉంది.

కాని కాంగ్రెసు సమావేశానికి హాజరయ్యేవారు వ్యక్తులుగాకాక ఏదో విధంగా ఎన్నుకోబడిన వారుగా ఉండవలెననే సూత్రంమాత్రం అందరికీ ఆమోదయోగ్యమైంది. అందుచేత 1886లో కలకత్తాలో జరిగిన రెండవ సమావేశాన

నుండి ఒక్కొక్క రాష్ట్రంలోని రాజకీయసంఘాలు, జిల్లాలోని ప్రధాన కేంద్రాలలోని సభలుగాని ప్రత్యేక సమావేశాలుగాని బహిరంగంగా ఎన్నుకొన్నవారే కాంగ్రెసుకు ప్రతినిధులుగా హాజరుకావడం సంప్రదాయమైంది. దీనిఫలితంగా కాంగ్రెసు ప్రజాప్రతినిధుల సమావేశం అనేపేరును సంపాదించింది. అది వ్యక్తం చేసిన అభిప్రాయాలు ప్రజాభిప్రాయాలుగా ప్రభుత్వం గుర్తించకపోయినా దేశంలోని రాజకీయచైతన్యంగలవారు గుర్తించారు. దీనిమూలంగా దానిపేరు ప్రతిష్ఠలు బలపడినాయి.

దీనికితోడు 1886 నుండి ఇంకొక సంప్రదాయంకూడా ఏర్పడింది. సమావేశం జరుగుటకుపూర్వమే అందులో చర్చకువచ్చే విషయాలగురించి కొంతవరకైనా ప్రతినిధులు ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొని, వాటిపై వారిని ఎన్నుకొన్నవారు చేసే సూచనలను గ్రహించి, సమావేశానికి హాజరుకావడమే ఈసంప్రదాయం. ఇదికూడా కాంగ్రెసు, ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించే సంస్థ అనే పేరును సార్థకంచేసింది.

పైన పేర్కొన్నస్థాయి సంఘాలు, విషయ నిర్ధారణకమిటీ, అఖిలభారత కాంగ్రెసుకమిటీ, ఆహ్వానసంఘం - వీటి మినహాగా కాంగ్రెసుకు ప్రథమదశలో మరిఏలాటి యంత్రాంగం ఏర్పడలేదు. దీనికి రెండు ప్రధానకారణాలు ఉన్నట్లు చెప్పవచ్చు. కాంగ్రెసు స్థాపనకుపూర్వం రాష్ట్రాలలో కృషిచేస్తూఉండిన రాజకీయసంఘాలు - బెంగాలులోని బ్రిటిష్‌ఇండియన్ సంఘం మినహాగా - కాంగ్రెసుకులోబడి, దాని అనుబంధసంఘాలుగా పనిచేయుటకు సిద్ధపడడం మొదటికారణం. ఆరోజులలో కాంగ్రెసు తీర్మానాలగురించి ప్రజలలో ప్రచారం సాగించడమొక్కటే రాజకీయరంగంలోని కృషి కంతా ప్రధానలక్షణమైంది. ఈకృషిని సాగించే బాధ్యతను రాష్ట్రాలలోని సంఘాలు వహించాయి. ఇదిగాక ఈసంఘాలతోపాటు అన్నిరాష్ట్రాలలో 1885 తర్వాత కాలక్రమాన జిల్లాసంఘాలు తాలుకా సంఘాలుకూడా ఏర్పడి అవికూడా కాంగ్రెసు తీర్మానాలను ప్రచారం చేసే సాధనాలుగా రూపొందాయి, దేశానికంతా ఏర్పడిన ఒక కేంద్ర సంఘపు అడుగుజాడలలో నడవడము అన్ని సంఘాలకు గర్వకారణమైంది.

దీనికితోడు కాంగ్రెసు స్థాపితమైనతర్వాత దానిని అనుకరిస్తూ రాష్ట్ర సంఘాలు జిల్లాసంఘాలు మొదలైనవి ఏటేటా సమావేశాలు జరపడం పరిపాటి అయింది. వాటిలో కాంగ్రెసు విధానాలను బలపరచడమేగాక, వాటివాటి ప్రాంతాలకు సంబంధించిన ప్రత్యేక సమస్యలను గురించి చర్చించి తీర్మానాలు చేయడం సంప్రదాయమైంది. దేశమందంతటా ఈలాటి సమావేశాలు జరుగుతూ వచ్చాయి. అందుచేత ప్రచారనిమిత్తం కాంగ్రెసు ప్రత్యేకంగా ఒక యంత్రాంగాన్ని నిర్మాణం చేసుకొనడం అవసరం లేకపోయింది.

## 2

ఈకాలంలో కాంగ్రెసు సమావేశాలకు హాజరయ్యే వారిసంఖ్య క్రమక్ర

మంగా పెరిగింది. 1885లో బొంబాయిలో జరిగిన మొదటి సమావేశానికి హాజరైనవారిసంఖ్య 72మాత్రమే. రెండవ సమావేశానికి 434, మూడవదానికి 607, నాల్గవదానికి 1248, అయిదవ దానికి 1859 ప్రతినిధులు వెళ్లారు. సంఖ్య ఈవిధంగా పెరగడంచేత వారందరికి భోజనాది సౌకర్యాలను సమకూర్చడం కష్టతరమైంది. అందుచేత 10లక్షల జనాభాకు అయిదుగురు ప్రతినిధులకంటే ఎక్కువ ఉండరాదనే నియమంచేయవలసి వచ్చింది. ఆరవ సమావేశానికి 677 ప్రతినిధులు మాత్రమే హాజరుకావడానికి ఇది ముఖ్యమైనకారణం. ఈపరిమితి ఏర్పడిన తర్వాతకూడా జనాభా పెరుగుదల కారణంగా కాలక్రమాన ప్రతినిధుల సంఖ్య పెరుగుతూనే వచ్చింది. 1894 సమావేశానికి 1163 ప్రతినిధులు, 1895వ దానికి 1584 ప్రతినిధులు హాజరయ్యారు.

రాష్ట్రాలలోను జిల్లాలలోను ప్రముఖులుగా ఉండినవారూ ప్రాముఖ్యాన్ని సంపాదించ దలచినవారూ కాంగ్రెసు సమావేశాలకు ప్రతినిధులుగావెళ్లడం ఒక గొప్ప గౌరవంగా భావించసాగారు. ఆలాటి వారికి వారివారి ప్రాంతాలలో ఎక్కువ పేరుప్రఖ్యాతులు లభించేవి. వారే స్థానికనాయకులయ్యారు. కాంగ్రెసు కమిటీలకు ఎన్నుకొనబడిన వారికి, సమావేశాలలో తీర్మానాలను ప్రతిపాదించడంలోగాని బలపరచడంలోగాని పాల్గొని ఉపన్యాసాలు చేసినవారికి వారివారి ప్రాంతాలలో మరింత పలుకుబడి లభించేది. వారిపేర్లు వార్తాపత్రికలకు ఎక్కేవి. సమావేశాలనుండి తిరిగీ వారివారి స్థానాలకువచ్చిన తర్వాత వీరే స్థానికసభలను సమావేశపరచి తీర్మానాల గురించి ప్రచారంచేయడంలో ప్రధానపాత్రను వహిస్తూవచ్చారు. ఈకారణాలన్నిటి ఫలితంగా స్థానిక ప్రముఖులనేకులకు కాంగ్రెసు సమావేశాలకు ప్రతినిధులుగా వెళ్ళడం చాలా ఆకర్షణీయమైంది.

ప్రతినిధులుగాగాక ప్రేక్షకులుగా సమావేశాలకు వెళ్ళేవారి సంఖ్యకూడా కాలక్రమాన పెరిగింది. మొదట సమావేశం రహస్యంగా జరగడంచేత ప్రేక్షకులెవ్వరు దానికి వెళ్లలేదు. రెండవ సమావేశాననుండి ప్రేక్షకులుగా వెళ్ళుటకు అవకాశం లభించింది. 3, 4, 5, 6వ సమావేశాలకు వెళ్లినవారి సంఖ్య వరుసగా 3000, 4000, 5000, 7000. ప్రజలకు కాంగ్రెసుపట్ల ఏర్పడిన గౌరవభావానికి ప్రతినిధుల సంఖ్యలోను, ప్రేక్షకుల సంఖ్యలోను కనుపించిన పెరుగుదల ఒక ప్రబలతార్కాణము. కాంగ్రెసు ఏర్పడిన ఫలితంగా ప్రజలలో రాజకీయ చైతన్యము, రాజకీయాలలో ఆసక్తి బలపడినాయి. దానిమూలంగా కలిగిన ఫలితాలలో ఇది అగ్రస్థానం వహిస్తున్నది.

ప్రతినిధులలో అధిక సంఖ్యాకులు ఇంగ్లీషువిద్యను నేర్చినలాయర్లు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, పత్రికల సంపాదకులు మొదలైనవారు. కాంగ్రెసుకు వారు మూలపురుషులు కావడం దీనికి ప్రధానకారణం. ఇదిగాక మొదటినుండి వారిలో జాతీయత, అఖిలభారత దృక్పథం, సంఘసంస్కరణాది ఉద్యమాలలో ఆసక్తివృద్ధిగాంచాయి. అందుచేత కాంగ్రెసు సమావేశాలకు వెళ్లిన ప్రతినిధులలో వారిసంఖ్య ఎక్కువగా ఉండడం సహజం. వారిలోకూడా లాయర్ల సంఖ్య

ఎక్కువగా ఉండేది. లాయర్లది ఒకవిధంగా స్వతంత్రమైనవృత్తి. అధికారుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడినట్టిది కాదు. అందుచేత వారు నిర్భయంగా ప్రభుత్వ విధానాలను విమర్శించగలవారు. ఇంతేగాక కక్షీదార్ల ద్వారా వారికి అన్నివర్గాల ప్రజలతో ఎక్కువ సన్నిహితసంబంధం ఉంటుంది. ప్రజలకష్టసుఖాలను ప్రభుత్వ దృష్టికి తెచ్చే ఉద్దేశంతో ఏర్పడిన కాంగ్రెసుకు వారు అధికసంఖ్యలోరావడం సహజం. కాంగ్రెసు సమావేశాలలో జరిగే చర్చలు చాలావరకు ఇంగ్లీషుభాష ద్వారా జరగడంకూడా ఇంగ్లీషు విద్యనభ్యసించినవారు అధికసంఖ్యలో ప్రతినిధులుగా వచ్చుటకు ఇంకొక కారణమైంది.

ప్రతినిధులుగా హాజరైనవారిలో అన్ని రాష్ట్రాలకు, మతాలకు, కులాలకు, చెందినవారు ఉండడం చేత కాంగ్రెసుకు అఖిలభారత జాతీయ సంఘం అనే పేరు అర్థవంతమైంది. 1858 తర్వాత దేశంలో క్రమక్రమంగా అభివృద్ధి గాంచిన జాతీయతను అది ప్రతిబింబించింది. 1800, 1900 మధ్య ప్రజలలో ఏలాటి మార్పు వచ్చిందో అది సూచించింది. ప్రథమంలో ముస్లిం ప్రతినిధుల సంఖ్య కొంచెం తక్కువగా ఉండేది. కాని క్రమక్రమంగా అదికూడా పెరిగింది. ఆనాటి ముస్లిం నాయకులలో అగ్రశ్రేణికి చెందిన సయ్యద్ అహమద్ ఖాన్ ప్రభుత్వ ప్రోద్బలంచేత కాంగ్రెసు హిందువుల సంఘం అనీ, అది వాంఛించే ప్రాతినిధ్య ప్రభుత్వవిధానమూ తక్కిన రాజకీయ సంస్కరణలూ హిందువులకు మాత్రమే లాభాన్ని కలిగించేవి అనీ, వాటి మూలంగా ముస్లింలు హిందువులకు దాస్యం చేయవలసి వస్తుందనీ అందుచేత ముస్లింలు కాంగ్రెసును బహిష్కరించవలసినదనీ హెచ్చరించాడు. కాని ఇది సరియైన వాదం కాదనీ, దీని మూలంగా ముస్లింలు నష్టపడే ప్రమాదం ఉన్నదనీ, మూడవ కాంగ్రెసుకు అధ్యక్షుడైన బదురుద్దీన్ త్యాబ్జీ అతనిని ప్రతిఘటించి ముస్లింలు కాంగ్రెసు సమావేశాలలో పాల్గొనవలసిందిగా ప్రోత్సహించాడు. మరికొందరు నాయకులు కూడా ఈ మార్గాన్నే అనుసరించారు. హిందువులు అత్యధిక సంఖ్యలో నివసించే భారత దేశంలో అన్ని సంఘాలలో వారి సంఖ్య ఎక్కువగా ఉండడంలో ఏలాటి విపరీతమూ లేదు. ఈలాటి నాయకుల ప్రోత్సాహంచేత నాల్గవ సమావేశం నుండి ముస్లిం ప్రతినిధుల సంఖ్య పెరుగసాగింది. మొదటి సమావేశంలో వారి సంఖ్య 2 మాత్రమే. రెండవ సమావేశంలో ఈ సంఖ్య 33, మూడవదానిలో 81, ఆరవదానిలో మొత్తం ప్రతినిధుల సంఖ్య 702 కాగా ముస్లిం ప్రతినిధుల సంఖ్య 156కు పెరిగింది.

మొత్తంమీద జమీందారులు ఎక్కువ సంఖ్యలో కాంగ్రెసు కార్యక్రమాలలో పాల్గొనలేదు. ఇదికూడా కొంతవరకు ప్రభుత్వ ప్రోద్బలంతో సంభవించింది. కాంగ్రెసు బలపడడం ప్రభుత్వానికి మొదటినుండి రుచించలేదు. కాంగ్రెసుకు అవసరమైన ధనసహాయాన్ని సమకూర్చుటకు జమీందార్లకు ఎక్కువశక్తి ఉండేది. వారు దాని కార్యక్రమాలలో పాల్గొనిపక్షంలో ఆర్థికంగా అది నష్టపడడం, దాని ఫలితంగా అది తలపెట్టిన కార్యకలాపాలు కుంటుపడడం తప్పదు. ఈ

కారణం చేతనే ప్రభుత్వం చాలావరకు జమీందార్లు, తాలూకాదార్లు మొదలైన భూస్వాములపై ఒత్తిడి చేయడం జరిగింది. దానికి జమీందార్లు లొంగి పొయ్యారు. కాని ఇంతమాత్రం చేత కాంగ్రెసు జాతీయ మహాసభ అనే పేరునకు తగినట్టిది కాకపోలేదు.

ఇంగ్లీషు విద్యనభ్యసించినవారే ఎక్కువగా కాంగ్రెసు సమావేశాలలో పాల్గొనడంచేత అది జాతీయ సంఘం కాదనీ, సామాన్య ప్రజలు అందులో పాల్గొనని కారణంగా దాని అభిప్రాయాలను ప్రజాభిప్రాయాలుగా భావించవలసింది లేదనీ ప్రభుత్వం దాని తీర్మానాలపట్ల విముఖత్వం వహించడం పరిపాటి అయింది. ఇంగ్లీషు విద్యాధికుల సంఖ్య మొత్తపు జనసంఖ్యలో చాలా స్వల్పమైనా ఆనాడు వారే ప్రజలకు నాయకులై అన్నిరంగాలలో ప్రాధాన్యం వహించిన వారైనారు. ఇదిగాక అన్ని కాలాలలోను అన్ని వేళలలోను అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొని, విప్లవాలను లేవదీసేవారి సంఖ్య చాలా స్వల్పంగానే ఉంటుంది. ప్రభుత్వం ఈ సామాన్య సూత్రాన్ని విస్మరించింది. బ్రిటన్‌లో కూడా విప్లవాలను లేవదీసినవారు, అధికారంలోకి వచ్చిన వారు స్వల్ప సంఖ్యాకులైన భూస్వాములూ, మధ్యతరగతి వారూ. అందుచేత కాంగ్రెసువిషయంలో ప్రభుత్వం చేసిన ఆక్షేపణ నిరాధారమైనట్టిది. బ్రిటిష్‌వారి జాత్యహంకారము, స్వార్థపరత్వము దానికి కారణాలు.

కాంగ్రెసు జాతీయ సంఘం అని భావించుటకు ఇంకొక కారణం కూడా ఉన్నది. అందులో ఎక్కువగా పాల్గొనువారు ఇంగ్లీషు విద్యాధికులైనా, వారు చర్చించిన విషయాలు, వారు చేసిన తీర్మానాలు, వర్గప్రయోజనాలకు మాత్రమే సంబంధించినవి కావు. అవి దేశంలోని వివిధ వర్గాలకు సంబంధించినవి. ఉన్నతోద్యోగాలలో ప్రవేశము, శాసనసభలలో భారతీయులకు ఎక్కువ ప్రాతినిధ్యము మొదలైనవి వారికి ప్రత్యేక లాభమును కలిగించేటట్టివి అయినా వారు రైతులకు, పారిశ్రామికులకు, వ్యాపారస్థులకు లాభం కలిగించే విషయాలను గురించి కూడా ఎన్నో తీర్మానాలను చేసి, వాటినిగురించి దేశంలో ప్రచారాన్ని సాగించారు.

రైతులు ప్రభుత్వానికీ జమీందార్లకూ చెల్లించే శిస్తును శాశ్వతపరచవలసిందిగాను, నీటి తీరువను తగ్గించ వలసిందిగాను, అటవీ శాసనముల మూలమున ప్రజలకు కలుగుతున్న ఇబ్బందులను తొలగించవలసిందిగాను, ఉప్పు పన్నును తగ్గించవలసిందిగాను కాంగ్రెసు చేసిన తీర్మానాలూ, క్షామబాధల నిర్మూలనానికి అది సూచించిన సాధనాలూ మొదలైనవి పల్లెప్రాంతాలలోని ప్రజల లాభం నిమిత్తము చేయబడినవి. ప్రభుత్వము కుటీరపరిశ్రమలను ప్రోత్సహించవలసినదిగాను, దూదిబట్టలపై విధించిన ఎక్సైస్ పన్నును రద్దు చేయవలసినదిగాను, చేసిన తీర్మానాలు బొంబాయి మొదలైన నగరాలలో భారీపరిశ్రమలు స్థాపించిన వారి ప్రయోజనాలకై చేయబడినవి.

సమగ్రమైన కాంగ్రెసు చరిత్ర రచయితగా ప్రఖ్యాతిగాంచిన భోగరాజు

పట్టాభి సీతారామయ్య కాంగ్రెసు తీర్మానాలను సమీక్షిస్తూ వ్రాసిన ఈ క్రింది వాక్యాలు దాని దృక్పథం ఎంత విశాలతరమైనదో స్పష్టం చేస్తున్నవి. "భారతీయులు ప్రభుత్వోద్యోగములలో ఎక్కువగా చేర్చుకొనబడవలెను; వారు విద్యావంతులై ఉన్నతోద్యోగములకర్హులయ్యేటట్లు చేయబడవలెను. విశ్వవిద్యాలయములు, స్థానికసంస్థలు, ప్రభుత్వోద్యోగములు, భారతీయులకు శిక్షణస్థలములుగా నుండవలెను. ప్రభుత్వమువారు శాసనసభలను ఎన్నికలకు వదలివేయవలెను; వాటిలో ప్రశ్నలువేసే అధికారము, ఆదాయ వ్యయపట్టికలగూర్చి చర్చించే అధికారము, ప్రజలకుండవలెను; ముద్రణాలయములు, అటవీచట్టములు కొంచెము మార్దవంగా చేయబడవలెను; పోలీసువారు ప్రజలతో స్నేహముగా మెలగవలెను; పన్నులు సరసముగా ఉండవలెను; సైనిక వ్యయములో కొంతభాగము ఇండియాతోపాటు ఇంగ్లండు కూడా పంచుకొనవలెను; న్యాయ, కార్య నిర్వహణాధికారములు వేరుచేయబడవలెను; కేంద్ర, రాష్ట్రప్రభుత్వములలోని కార్యనిర్వాహకసభలలోను, భారత రాజ్యాంగ కార్యదర్శి సభలోను, భారతీయులకు స్థానముండవలెను; రాష్ట్రములకిరువురు ప్రతినిధులవంతున ఇండియా నుండి బ్రిటిష్ పార్లమెంటుకు ఎన్నుకొనబడవలెను; అన్ని రాష్ట్రములును సమాన ప్రతిపత్తిలో చూడబడవలెను; సివిల్ సర్వీసు ఉద్యోగస్థులకుబదులు సుప్రసిద్ధ బ్రిటిష్ రాజకీయ దురంధరులు ఇండియాకు గవర్నరులుగా రావలెను; ప్రభుత్వోద్యోగముల కోసము జరుపబడే పరీక్షలు ఇండియాలోను ఇంగ్లాండులోను ఏకకాలమున జరుపబడవలెను. ఇండియానుండి ఇంగ్లాండుకు పోయే ధనప్రవాహమరికట్టవలెను; దేశీయ పరిశ్రమలు పోషింపబడవలెను; ల్యాండు రివిన్యూ తగ్గింపబడవలెను; పర్మనెంటు సెటిల్‌మెంటు పద్ధతి అమలులోనికి రావలెను." ఇదీ ఆనాటి వక్తృత్వ సారాంశము. ఉప్పుపన్ను అన్యాయమని, దేశీయ పత్తి పరిశ్రమలపైన వేయబడిన పన్ను అధర్మమనీ, సివిలియన్ ఉద్యోగస్థుల జీతములలో మారకము వలన కలిగిన నష్టమునకు పరిహారముగా ఇయ్యబడిన మొత్తము లంచమనీ, నిరసించేటంత దూరమువరకును కాంగ్రెసు పోయినది...." కాంగ్రెసు ప్రధానంగా రాజకీయ సంఘం కావడంచేత అది చర్చించిన విషయాలలోను చేసిన తీర్మానాలలోను అనేకం రాజకీయాలకు సంబంధించిఉండడం సహజమే. కాని వాటితో పాటు అది దేశంలోని అన్నివర్గాలవారి ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని దాని కార్యక్రమాలను సాగించిన విషయాన్ని విస్మరించడం పొరబాటు.

ఏ ఉద్యమాన్ని సౌష్ఠవంగా సాగించవలెననినా ధనం అవసరం, కాని కావలసినంత ధనం ప్రథమ దశలో కాంగ్రెసుకు లభించలేదు. దాని ఖర్చులుమాత్రం పెరుగుతూవచ్చాయి. మొదటిసమావేశానికి రు 300లు ఖర్చుకాగా రెండవదానికి రు 16000 లు, మూడవదానికి రు 25,000లు ఖర్చుపెట్టవలసి వచ్చింది. ఇదిగాక కాంగ్రెసు ఉద్యమానికి ప్రధానసాధనమైన ప్రచారాన్ని భారత దేశంలోను బ్రిటన్‌లోను సాగించుటకు ధనం కావలసివచ్చింది. ప్రచారానికి ప్రచారకులతో పాటు సభలను సమావేశ పరచడం, వార్తాపత్రికలు కరపత్రాలు, గ్రంథాలు

మొదలైన వాటిని ప్రచురించడం అవసరం. ధనం ఉంటేనేగాని ఇది తీరదు మహాత్మాగాంధి నాయకత్వాన 1919 తర్వాత కాంగ్రెసు సత్యాగ్రహ సమరాన్ని సాగించినప్పుడు బిర్లా మొదలైన కోటీశ్వరులు ఆయనకు సహాయ పడినారు. అలాటి సహాయం లభించడం చేతనే సమరం ఫలప్రదమైంది. కాని కాంగ్రెసు ప్రథమదశలో అంతటి సహాయం ధనికులు దానికిచేయలేదు. ఏటేటా చందాలు చెల్లించే సభ్యులు లేకపోవడంచేత ధనికుల విరాళాలపై కాంగ్రెసు ఆధారపడవలసి వచ్చింది. ఆ రోజులలో జమీందార్లు, పార్శీ వర్తకులు, సంస్థానాధీశులు ధనిక వర్గానికి చెందినవారు. కాని మొదటి రెండు మూడు సంవత్సరాలలో వీరు విరాళాలను ఇచ్చారు గాని క్రమ క్రమంగా ఇవ్వడం మానుకొన్నారు. 1888లో కాంగ్రెసుకు నాలుగు లక్షల శాశ్వత నిధిని సమకూర్చుటకు హ్యూం గొప్ప ప్రయత్నం చేశాడు. ఆ సందర్భంలో బొంబాయిలోని పార్శీ సంపన్ను లనేకులు కాంగ్రెసు హిందూ సంస్థ అనే సంకుచిత మనస్తత్వానికి లోబడిపోయి విరాళాలు ఇవ్వడం మానుకొన్నారు. కలకత్తాలో జమీందార్ల సంఘంగా ప్రఖ్యాతి గాంచిన బ్రిటిష్ ఇండియన్ సంఘం కూడా కాంగ్రెసుతో సహకరించడం మానుకొన్న కారణంగా వారి నుండి విరాళాలు లభించలేదు. అందుచేత హ్యూం చేసిన ప్రయత్నం ఫలప్రదం కాలేకపోయింది.

ఒకప్పుడు సంస్థానాధీశులు కొందరు కాంగ్రెసుకు విరాళాలను ఇస్తూ ఉండేవారు. బొంబాయి రాష్ట్రంలోని సంస్థానాధీశుల సహాయంతోనే దాదాభాయి నవరోజి ఇంగ్లండుకు వెళ్ళి పార్లమెంటులో సభ్యుడు కావడం జరిగింది. కాని ప్రభుత్వం కాంగ్రెసును అణచివేయుటకు నిర్ణయించుకొన్న తర్వాత సంస్థానాధీశులను ఒత్తిడిచేసి వారిని కాంగ్రెసుపట్ల విముఖులుగా చేసింది. అంతటితో వారి సహాయం కూడా కాంగ్రెసుకు లభించడం కష్టసాధ్యమైంది.

ఈలాటి కారణాల ఫలితంగా కాంగ్రెసుకు తగిన అర్థబలం లేకపోయింది. ప్రథమదశలో అది తలపెట్టిన కార్యక్రమాలన్నీ సౌష్టవంగా జరగకపోవుటకు, అది మితవాద తత్వాన్ని అనుసరించుటకునూ ఇది ఒక కారణంగా పరిణమించింది.

## 3

ప్రథమదశలో కాంగ్రెసు పూర్తిగా మితవాదతత్వాన్ని అనుసరించింది. అది సాధించదలచిన లక్ష్యాలలోను, వాటిసాధనకై అది వినియోగించిన సాధనాలలోను, కాంగ్రెసు సమావేశాలలో అధ్యక్షులు తదితరులు చేసిన ఉపన్యాసాలలోను. ఈ తత్వ ప్రభావం కనుపిస్తుంది.

ఆనాటి కాంగ్రెసులక్ష్యం స్వరాజ్యాన్నిగాని ఆంతరంగిక స్వపరిపాలనను గాని సంపాదించడంకాదు. దేశంలో బ్రిటిష్‌పరిపాలన శాశ్వతంగాను సుస్థిరంగాను ఉండవలెననే సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని హ్యూం కాంగ్రెసును

స్థాపించాడు. ఆస్థాపనలో అతనితో సహకరించిన భారతీయులు, తదుపరి కాంగ్రెసులో నాయకులుగా ప్రఖ్యాతి గాంచినవారు ఈ సిద్ధాంతంలో దృఢ విశ్వాసం కలిగినవారు. వారందరు ప్రభుభక్తిపరాయణులు. బ్రిటన్ భారతదేశాల మధ్య చారిత్రకంగా ఏర్పడిన అనుబంధం దైవఘటనమని, అది అవిచ్ఛిన్నంగా ఉంటేనేగాని భారతదేశం పురోగమించజాలదని వారు నమ్మినవారు. బ్రిటిష్ పరిపాలన మూలంగా భారతదేశానికి ఎన్నో లాభాలు కలిగాయని, కొన్ని నష్టాలు సంభవించినా వాటినితొలగించడం సాధ్యమనీ వారు భావించారు. అందుచేత వారు స్వరాజ్య సంపాదననుగాని, తుదకు ఆంతరంగిక స్వపరిపాలన సంపాదననుగాని తమలక్ష్యంగా పెట్టుకొనలేదు. దీనిని గురించి అధికారులలో కలిగిన అపోహలు గురించి ప్రస్తావిస్తూ 1888లో దాదాభాయి నౌరోజీ లండన్‌లో, "ఐర్లాండుకు ఆంతరంగిక స్వపరిపాలన లభించవలెనని కోరేవారిలో నేనొకడను కాని నేనుగాని భారతీయులలో మరెవ్వరుగాని భారతదేశానికి ఆలాటి పరిపాలనను కోరేవారముకాము." అని ఒకఉపన్యాసములో స్పష్టంచేశాడు. భారతీయుల ఇబ్బందులను అధికారుల దృష్టికితెచ్చి, వాటిని తొలగించుటకు తీసుకొనవలసిన చర్యలగురించీ సంస్కరణలగురించీ ప్రభుత్వానికి తెలియపరచడమే ఆనాటి కాంగ్రెసుయొక్క లక్ష్యం. 1899లో లక్నోలోజరిగిన సమావేశంలో కాంగ్రెసు నియమ నిబంధనలను క్రోడీకరించే సందర్భంలో, "భారతదేశ ప్రయోజనములను పురోభివృద్ధినీ, చట్టసమ్మతములైన విధానముల నవలంబించి ప్రోత్సహించుటయే భారతజాతీయ మహాసభోద్దేశము" అని నిర్వచింపబడినది. బ్రిటిష్‌ప్రభుత్వాన్ని తొలగించే ఉద్దేశం కాంగ్రెసుకులేదని, పరిపాలనవిధానంలోని లోపాలను సంస్కరించడమే దానివాంఛఅనీ పదేపదే అది ఉద్ఘాటించింది. ఈలక్ష్యంతోనే ప్రథమ దశలో అది దాని కార్యక్రమాలను సాగించింది.

ఈ లక్ష్యాన్ని సాధించుటకుకూడా అది మితవాదతత్వాన్ని అనుసరించింది. దౌర్జన్య సాధనాన్ని అది పూర్తిగా ఖండించింది. 1857-58 లో జరిగిన తిరుగుబాటు విఫలం కావడం, 1858 తర్వాత విద్యాధికులందరిపై ప్రభావం వహించి, శాంతియుత మార్గాలు మాత్రమే వారు వినియోగించేటట్లు వారిని ప్రోత్సహించింది. అలాటి మనస్తత్వం కలవారే కాంగ్రెసును స్థాపించారు. తిరుగుబాటు ధోరణినుండి ప్రజలను విద్యాధికులను విముఖులుగ చేయగోరియే హ్యూం కాంగ్రెసు ఉద్యమాన్ని తలపెట్టినట్లు ఇదివరలో తెలియపరచాము. అందుచేత తన లక్ష్యాన్ని సాధించుటకు చట్టబద్ధమైన ఆందోళనను మాత్రమే సాధనంగా కాంగ్రెసు వినియోగించింది.

ఆనాటి కాంగ్రెసువారు బ్రిటన్ చరిత్రచేకూడా ప్రభావితులైనవారు. ఆ దేశంలోని రాజకీయోద్యమాలన్నిటికీ చట్టబద్ధమైన ఆందోళన సాధనం కావడం, దాని మూలంగా ప్రజల వాంఛలు ఫలప్రదం కావడం వారి దృష్టిని ఆకర్షించింది. అక్కడ జరిగినట్లే భారతదేశంలో కూడా ఆలాటి ఆందోళన ఫలప్రదం కాగలదని వారు భావించారు.

ఇదిగాక ఆనాటి కాంగ్రెసులో లాయర్లు అధిక సంఖ్యాకులు, సాధారణంగా చట్టాలపట్ల వారికిగల భక్తిశ్రద్ధలు ఎక్కువ. వారి చిత్తవృత్తికి ఇది ప్రధాన లక్షణం. చట్టబద్ధమైన ఆందోళన ద్వారానే తన లక్ష్యాన్ని సాధించడం ఉత్తమ విధానమని కాంగ్రెసు భావించుటకు ఇదికూడా ఒకకారణం.

ఇంతేకాదు. హ్యూం భావించినట్లే కాంగ్రెసువారు భారతీయుల పురోగమనానికి ఆటంకాలు కలిగించేవారు. భారతదేశంలోని పరిపాలన యంత్రాంగాన్ని నడిపే ఉన్నతోద్యోగి వర్గం అనీ, వారిపైన యాజమాన్యం వహించిన బ్రిటిష్ ప్రజలకు విన్నవించుకొన్న పక్షాన తమకు న్యాయం లభించగలదనీ భావించారు. క్రింది కోర్టుతీర్పులు తృప్తి కలిగించని పక్షంలో పైకోర్టుకు అపీలు చేసుకొనడం అందరూ అనుసరించే విధానం. భారతదేశంలోని ఉద్యోగివర్గం క్రింది కోర్టు వంటిది. వారిపై యాజమాన్యం వహించిన బ్రిటిష్ ప్రజానీకం పైకోర్టు వంటిది. తమ ఆందోళన భారదేశంలో ఫలప్రదం కానప్పుడు బ్రిటిష్ ప్రజలకు తమ వినతి పత్రాలను సమర్పించి తమ వాదంసహేతుకమైనదని వారికి తెలియపరచిన పక్షంలో తమ ఆందోళన ఫలప్రదంకాగలదనే విశ్వాసం అప్పటికాంగ్రెసు వారికి కలిగింది. చట్టబద్ధమైన ఆందోళన విధానాన్ని వారు అనుసరించుటకు ఇది కూడా ఒక కారణమైంది.

బ్రిటిష్ ప్రజలు తప్పకుండా భారతదేశ ప్రజల అభీష్టాలను తీర్చగలరని కాంగ్రెసువారు విశ్వసించుటకు ప్రబల కారణం ఇంకొకటి ఉండినది. బ్రిటిష్ ప్రజలు ప్రజాస్వామిక విధానానికి అలవాటు పడినవారు. ప్రజల అభిప్రాయానుసారం పరిపాలనను సాగించడం ఈ విధానానికి ప్రధాన లక్షణం. ప్రజాభిప్రాయాన్ని మన్నించేవారు భారతదేశ ప్రజల అభిప్రాయం ఏదో తెలుసుకొన్న తర్వాత దానిని మన్నించలేకపోవడమనేది ఉండదు. అలాగు మన్నించక పోవడం బ్రిటిష్ ప్రజల సాంప్రదాయానికి పరమ విరుద్ధం. అందుచేత వారు భారతీయుల అభిప్రాయాలను మన్నించి వారు కోరిన సంస్కరణలను తప్పకుండా ప్రవేశపెట్టగలరు. ఈలాటి ఫలితం వెంటనే లభించకపోయినా కాలక్రమాన తప్పకుండా లభిస్తుంది. కావలసింది తమవాదం సహేతుకమని రుజువుచేయడమే. ఇదిగాక ఆనాటి కాంగ్రెసు వారి దృష్టిలో బ్రిటన్‌లోని ప్రజలు ప్రజాభిప్రాయాన్ని గౌరవించేవారుమాత్రమే కాదు. వారు చాలా న్యాయస్థులు, ధర్మమార్గావలంబులు, సంగతి సందర్భములు సరిగా తెలుసుకొనగలిగినయెడల వారెప్పుడును సత్యమును ధర్మమును తప్పినడవరు. ఈలాటి అభిప్రాయం కాంగ్రెసు వారిపై గొప్ప ముద్రవేసింది. సక్రమమైన ఆందోళన తప్పకుండా ఫలప్రదం కాగలదని ఇందు మూలంగా కూడా వారు విశ్వసించారు.

బ్రిటిష్ ప్రజలు ఈలాటి గుణములు కలవారనే ధోరణితోనే కాంగ్రెసు సమావేశాలలోని ప్రసంగాలన్నీ నడిచినవి. 1896లో 12వ కాంగ్రెసుకు అధ్యక్షుడైన మహమ్మదు రహింతుల్లా సయేద్, "ఈ ఆంగ్లజాతికన్నా న్యాయమైన జాతిగాని, బలిష్టమైన జాతిగాని ప్రపంచములో మఱొకటిలేద"ని చెప్పారు. భార

తీయుల విజ్ఞాపనలకును ప్రార్ధనలకును ప్రతిఫలముగా నిర్బంధ విధాన మవలంభించినప్పుడు కూడ, ఆనందమోహన్ బోసు మద్రాసు కాంగ్రెసుకు 1898లో అధ్యక్షుడై," భారతీయ విద్యావంతులు ఇంగ్లండునకు మిత్రులుగాని శత్రువులుగారు. అది చేయబోయె ఘనకార్యమునకు స్వతసిద్ధముగా సహాయము చేయవలసిన అవసరముగల మిత్రులు వారే" అని పలికెను. 1890లో రెండవ పర్యాయము కాంగ్రెసుకు అధ్యక్షుడైన దాదాభాయి నవరోజి, "ఈ కాంగ్రెసు భారత విజ్ఞాన సర్వస్వమునకు ప్రాతినిధ్యం వహిస్తున్నది. యునైటెడ్ కింగ్డం (ఇంగ్లాండు) వారి న్యాయ స్వభావమునందును, ధర్మబుద్ధి యందును. మన విశ్వాసము కొరవడలేదు. బ్రిటిష్ వారి వంటి గొప్ప జాతి న్యాయము కోసము, నిజమైన పౌరసత్వపు హక్కులకోసము, తన సామ్రాజ్య ప్రజలకు సహాయకారిగా నుండు అద్భుత దృశ్యమును ప్రపంచము వీక్షింపగల సుదినము సమీపములోనే యున్నదని నా ఆశ", అని చెప్పెను. ప్రథమదశలో తక్కిన వారి ఉపన్యాసములన్నీ ఈ ధోరణిలో సాగినవి. ఇవి ఈనాడు వందిమాగధుల స్తోత్రములవలె కనుపించవచ్చును. కాని ఆనాటి కాంగ్రెసువారు ఇవి సత్యములని త్రికరణశుద్ధిగా భావించారు. అందుచేతనే వారు వారిలక్ష్యసాధనకు దౌర్జన్యమును తిరుగుబాటును సాధనములుగా వినియోగించక శాంతియుత ఆందోళనము నొక్కదానినే సాధనముగా చేసుకొన్నారు. 1905 తర్వాత తీవ్రవాద వర్గమొకటి కాంగ్రెసులో ఏర్పడింది. వారికిని అంతకు పూర్వపు కాంగ్రెసు వారికిని ఇందులోనే ప్రధానమైన భేదము.

ఈలాటి ఆందోళనములో వారికి సభలు, సమావేశాలు, వార్తాపత్రికలు, కరపత్రాలు, సామాన్యప్రజలుకూడ సులభముగ అర్థముచేసుకొనగల చిన్న గ్రంథాలు సాధనములైనవి. ఆనాటి కాంగ్రెసువారు వాటినన్నిటినీ వినియోగించినారు. ఇందులో దేశభాషలలోని వార్తాపత్రికలు వారికి ఎంతగానో సహాయము చేసినవి.

బ్రిటన్‌లోని ప్రజలయొక్కయు ప్రముఖులయొక్కయు సానుభూతిని సంపాదించినయెడల భారతదేశానికి న్యాయముచేకూరగలదనే విశ్వాసం ఏర్పడిన కారణంగా కాంగ్రెసు తన ఆశయాలగురించి తీర్మానాలగురించి బ్రిటన్‌లో ప్రచారాన్ని సాగించుటకు నిర్ణయించింది. దాదాభాయివంటివారిలో భారత దేశంలో జరుగవలసిన ప్రచారానికంటే ఈ ప్రచారమే ఎక్కువ ప్రాధాన్యం కలది అనేభావం ఏర్పడింది.

హ్యూంకూడా మొదటినుండి ఆలాటిభావంకలవాడయ్యాడు. అందుచేతనే అతడు 1885లో కాంగ్రెసును స్థాపించుటకుపూర్వం కొన్నినెలలకాలం బ్రిటన్‌లో పర్యటించి అక్కడి ప్రముఖులందరితో చర్చలు సాగించి వారి సలహామీదనే కాంగ్రెసును స్థాపించాడు. అక్కడ జరుగవలసిన ప్రచారం నిమిత్తం 1889 లో కాంగ్రెసు బ్రిటిష్‌కమిటీ అనేపేరుతో లండన్‌లో ఒక కమిటీని స్థాపించింది. ఏటేట దానిఖర్చులనిమిత్తం రూ. 45000 లను పంపుతూ

వచ్చింది. ఈ కమిటీలో భారతదేశంపట్ల సానుభూతిగల బ్రిటిష్ ప్రముఖులనేకులు సభ్యులుగా ఉండేవారు. వారు అచ్చట సభలు సమావేశాలు జరపడం, కరపత్రాలను సులభ గ్రంథాలను ప్రకటించడం, మంత్రులు మొదలైన వారిని కలసుకొని వారితో చర్చలుసాగించడం మొదలైన కార్యక్రమాలను సక్రమంగా ఏర్పాటుచేయడం పరిపాటిఅయింది. ఇదిగాక కమిటీతరఫున ఇండియా అనే పత్రిక స్థాపించబడింది. దీనిద్వారా భారతదేశాన్నిగురించిన వాస్తవవివరాలను బ్రిటన్‌వారికి అందజేయడం, ఆంగ్లోఇండియన్ పత్రికల అసత్యప్రచారాన్ని ఖండించడం సాధ్యమైంది.

కమిటీకార్యక్రమాలకుతోడు అప్పుడప్పుడు కాంగ్రెసు బ్రిటన్‌కు ప్రచారకులను పంపడంకూడా జరుగుతూవచ్చింది. ఇదిగాక పార్లమెంటులో భారతదేశంపట్ల ప్రత్యేకశ్రద్ధవహించిన బ్రాడ్లావంటి వారిని కాంగ్రెసు సమావేశాలలో పాల్గొనుటకు ఆహ్వానించేది. వారిలోకొందరు సమావేశాలలో పాల్గొని కాంగ్రెసు నాయకులకు హితోపదేశాలు చేయడమేగాక, బ్రిటన్‌కు తిరిగివెళ్లిపోయినతర్వాత అక్కడ భారతదేశంలోని ఉద్యోగివర్గంయొక్క నిరంకుశత్వాన్నిగురించి, జాత్యహంకారాన్నిగురించి, భారతీయుల ప్రభుభక్తిని గురించి, కాంగ్రెసు నిర్ణయాలలో కొన్నిటినైనా అమలుపరచవలసిన అవసరాన్ని గురించి ప్రచారంచేయడం పరిపాటిఅయింది.

ఇదిగాక ఈలాటివారి సానుభూతికారణంగా పార్లమెంటులోని కామన్‌సు సభలో ఇండియా పార్లమెంటరీ కమిటిఒకటి ఏర్పడింది. ఇందులో దాదాపు 160 సభ్యులు ఉండేవారు వీరు భారతదేశ సమస్యలగురించి సభలోతీర్మానాలు ప్రవేశపెట్టడం, మంత్రులను ప్రశ్నించడం, అధికారపూర్వమైన సమాచారాన్ని సేకరించడం జరిగేది. వీరిప్రోద్బలంమూలాన 1893లో సివిల్ సర్వీసుపోటీపరీక్షలు ఏకకాలంలో రెండుదేశాలలో జరుగవలసినట్లుగా తీర్మానం చేయబడింది. (దీనిని ప్రభుత్వం అమలుపరచలేదు). భారతప్రభుత్వ ఖర్చులగురించి, సైనికవ్యయాన్ని రెండుదేశాలు పంచుకొనవలసిన అవసరాన్నిగురించి దర్యాప్తు జరుపుటకు వెల్బీ కమిషన్ (Welby Cammision) ఏర్పడింది. ఈ విధంగా అనేకరూపాలలో కాంగ్రెసు బ్రిటన్‌లో ప్రచారాన్ని సాగించింది ఇది దాని మితవాదతత్వానికి ఒక ప్రధానలక్షణం.

ఇంకొకరూపంలో కూడా ఆనాటి కాంగ్రెసు తన మితవాద ధోరణిని స్పష్టంచేసింది. సంఘసంస్కరణలవంటి వివాదగ్రస్థములైన విషయాలను సమావేశాలలోచర్చకు రాకూడదని నిర్ణయించింది. దేశంలో జాతీయ ఐక్యత శైశవదశలో ఉన్నప్పుడు వీటిని చర్చించడం చీలికలకు దారితీయగలదనే భావం ఈ నిర్ణయానికి కారణం. విద్యాధికులకు సంఘసంస్కరణలపట్ల ఎంతో శ్రద్ధ ఉండేది. కాని దానిని గురించి వేరొక ప్రత్యేకసభలో చర్చించడం వాంఛనీయమని వారు భావించారు. ఇందులోని సహేతుకత్వాన్ని గ్రహించి రనడేవంటి సంస్కర్తలు జాతీయ సాంఘిక సభను స్థాపించారు. ఇదేవిధంగా ఏదోఒక రాష్ట్రానికి మాత్రం

సంబంధించిన జమీందారీ రైతుల గురించినటువంటి సమస్యలను చర్చించరాదని నిర్ణయించింది. వాటిని చర్చించుటకు ఆయా రాష్ట్రాలలో ఏర్పడిన సంఘాల సమావేశాలే తగినవేదికలని అది భావించింది. ఈ నిర్ణయంకూడా సహేతుక మైనట్టిదే. అన్ని రాష్ట్రాల ప్రతినిధులతోకూడిన కాంగ్రెసుసమావేశాలలో వీటిని చర్చించడం వ్యర్థప్రయాస. వాటినిగురించి ఇతర రాష్ట్రాలవారికి ఏమీ తెలిసియుండదు. వాటిని చర్చించడం మూలాన రాష్ట్రాలమధ్య చీలికలు ఏర్పడే ప్రమాదం ఉంటుంది. ఇదిగాక ముస్లింలను కాంగ్రెసులోకి ఆకర్షించే ఉద్దేశంతో 1888 లో జరిగిన నాల్గవ కాంగ్రెసు: "హిందూ ప్రతినిధులుగాని, మహమ్మదీయ ప్రతినిధులుగాని, ఏకగ్రీవముగా గాని, లేక దాదాపు ఆ విధముగా గాని అభ్యంతర పెట్టే ఏ తీర్మానమును విషయ నిర్ధారణ సభవారు చర్చకు పెట్టరాదని నిర్ణయించింది. అధికసంఖ్యాకులైన హిందువులు ముస్లింల ప్రయోజనాలకు విరుద్ధంగా తీర్మానాలుచేసే ప్రమాదం ఉన్నదనే భావాన్ని తొలగించుటకై ఈ నిర్ణయం చేయబడింది. జాతీయ ఐక్యతను బలహీన పరచరాదనేదే దీని ఉద్దేశం.

## 4

20 సంవత్సరాలకాలం మితవాద తత్వాన్ని ఆధారంచేసుకొని శాంతియుతంగా కాంగ్రెసు ఆందోళనను సాగించినా దాని మూలంగా అది ఆశించిన ఫలితాలు లభించలేదు. 1885-1905 లో దాని తీర్మానాలను గురించి బ్రిటిష్ ప్రభుత్వం చేసిన మార్పులు రెండు మూడు మాత్రమే. వీటిలో మొదటిది శాసన సభలలో భారతీయులకు కొంచెం ఎక్కువగా ప్రాతినిధ్యం కల్పించి వాటి అధికారాలనుకొద్దిగా పెంచుటకు 1892లో పార్లమెంటుచేసిన ఇండియన్ శాసనసభల చట్టము (Indian Councils Act.) దీనిమూలంగా జరిగిన మార్పులు చాలా స్వల్పంగా ఉండడంచేత ఇది కాంగ్రెసుకు తృప్తికరంగా లేకపోయింది. మార్పులలో రెండవది పోటీ పరీక్షలలో పాల్గొనే అభ్యర్థుల వయస్సును 23కు పెంచుట. కాని దీనితోపాటు ఏకకాల పరీక్షలు ప్రవేశపెట్టని కారణంగా ఇదికూడా కాంగ్రెసుకు తృప్తికరం కాలేదు. మార్పులలో మూడవది భారతదేశ ప్రభుత్వ ఖర్చులను గురించి దర్యాప్తు చేయుటకు "వెల్బి" కమిషన్ అనే పేరుతో ఒక సంఘాన్ని నియమించుట. దీని నివేదికలో సూచించిన మార్పులు భారతదేశానికి ఎక్కువ లాభాన్ని చేకూర్చలేక పోయినవి. అందుచేత బ్రిటిష్ ప్రభుత్వం కాంగ్రెసు తీర్మానాలపట్ల ఉదాసీన వైఖరిని అనుసరించినదని చెప్పక తప్పదు.

కాంగ్రెసు గావించిన శాంతియుత ఆందోళన ఫలప్రదం కాకపోవుటకు కొన్ని ప్రధాన కారణములుండినవి. బ్రిటన్‌లో శాంతియుతంగా ప్రజలు జరిపిన ఆందోళన ఫలించినట్లే భారతదేశంలోకూడా ఫలించగలదని కాంగ్రెసు భావించడం ఈ రెండు దేశాలలోని రాజకీయ పరిస్థితులలో ఏర్పడిన భేదాన్ని గమనించక పోవడమే. బ్రిటన్‌లో చాలాకాలం నుండి ఏదో ఒక విధమైన ప్రజాస్వామికం

ఉండినందున, ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా ప్రభుత్వం ప్రవర్తించిన పక్షంలో పార్లమెంటుకు జరిగే ఎన్నికలద్వారా అలాటి ప్రభుత్వాన్ని అధికారాన నుండి తొలగించి, దాని స్థానే ప్రజలు ఇంకొక ప్రభుత్వాన్ని నెలకొల్పే అవకాశం ఉన్నది. అందుచేత ప్రభుత్వాలన్నీ ప్రజాభిప్రాయాన్ని లెక్కలోకి తీసుకొని పరిపాలనను సాగించడం సాధ్యం. కాని భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వం నిరంకుశమైనట్టిది. దాని అధికారానికి మనుగడకూ భారతీయులు పాల్గొనే ఎన్నికలు ఆధారంకావు. అది ఏలాగు పాలించినా దానిని తొలగించే అధికారం ప్రజలకు లేదు. ప్రజాస్వామికంలోని ప్రభుత్వానికీ నిరంకుశ విధానంలోని ప్రభుత్వానికీ మధ్య ఉండే ఈ సామాన్య భేదాన్ని కాంగ్రెసువారు గ్రహించక బ్రిటన్‌లో ప్రజాభిప్రాయానికి లభించిన విలువ భారతదేశంలోని అభిప్రాయానికి కూడా లభించగలదని భ్రమపడ్డారు. వారి ఆందోళన ఫలించకపోవుటకు ఈ భ్రమ ఒక గొప్ప కారణం.

ఇంతేగాక బ్రిటన్‌లోని ప్రజలు ధర్మ స్వరూపులనీ న్యాయస్థులనీ భావించడం కూడా ఒక భ్రమ వంటిదే - వాస్తవంగా వారిలో అధిక సంఖ్యాకులకు భారతదేశాన్ని గురించి ఏమీ తెలియదు; తెలుసుకొనవలెననే ఆసక్తికూడా వారికి లేదు. ఎంతో కొంత విద్యాభ్యాసంచేసి రాజకీయాల గురించి అనుభవాన్ని గడించిన పార్లమెంటు సభ్యులకు కూడా ఈలాటి జ్ఞానంగాని ఆసక్తిగాని లేనప్పుడు సామాన్య ప్రజలలో ఇవి ఉండడం కల్ల. ఇట్టి ప్రజలు భారతదేశంలోని ఉన్నతోద్యోగివర్గంచేసే నిర్ణయాలలోని న్యాయాన్యాయాలను పరిశీలించి, ఒక అపీలు కోర్టుగా వ్యవహరించగలరని భావించడం ఒక భ్రమయే. అన్ని దేశాలలో సామాన్య ప్రజలు స్వతంత్రంగా ఆలోచించే శక్తిలేనివారు. దేశంలోని ప్రముఖ వర్గాల అభిప్రాయాలను అనుసరించడం వారికి సహజం. బ్రిటన్‌లోని ప్రముఖ వర్గంవారు, భారతదేశంలోని ఉన్నతోద్యోగివర్గం వారు వ్యక్తపరచిన అభిప్రాయాలుకాదని భారతీయుల అభిప్రాయాన్ని బ్రిటన్‌లోని ప్రజలు గౌరవించడం కల్ల. కాని కాంగ్రెసువారు దీనిని గ్రహించలేకపోయినారు ఇంతేగాక బ్రిటిన్‌లో లిబరల్ పక్షానికిచెందిన వారిలో ఏ అయిబార్గురో తప్ప తక్కిన ప్రముఖవర్గానికి చెందిన వారందరు భారతదేశంపట్ల సానుభూతిలేనివారు. బ్రిటిష్ ప్రయోజనాలకు భారతదేశ ప్రయోజనాలకు మధ్య పరస్పర వైరుధ్యం ఏర్పడినప్పుడు బ్రిటిష్ ప్రయోజనాలపట్ల మాత్రమే వారు అభిమానాన్ని చూపడం సహజం. బ్రిటిష్ ప్రజల మనస్తత్వం కూడా ఈలాటిదే. భారతదేశంపై బ్రిటన్ నిరంకుశ సామ్రాజ్యాధికారాన్ని వహించినందున వీరికి ఎన్నో లాభాలు సమకూరుతూ వచ్చినవి, వీటిని విస్మరించి భారతీయులకు వారు న్యాయం కలిగించడం మానవ ప్రకృతికిపరమ విరుద్ధం. కాంగ్రెసువారి శాంతియుతమైన ఆందోళన ఫలించనందుకు ఇదికూడా ఒక కారణం.

## 5

లక్ష్యంలోను లక్ష్యసాధనలోను కాంగ్రెసు పూర్తిగా మితవాద
అనుసరించినా, బ్రిటన్ భారతదేశాల మధ్య ఏర్పడిన రాజకీయానుబంధ
తంగాను సుస్థిరంగాను ఉండవలెననేసూత్రం దాని తీర్మానాలన్నింటికీ
అయినా, అది పదేపదే దాని ప్రభుభక్తిని ఉద్ఘాటించినా బ్రిటన్‌లోని ప్రభు
భారతదేశంలోని ప్రభుత్వమూ, దానిపట్ల ద్వేషభావాన్ని వహించాయి.
లోని వార్తాపత్రికలు, భారతదేశంలోని ఆంగ్లో ఇండియన్ పత్రికలు
భావాన్నే ప్రదర్శించాయి. ఇది ఒక విపరీతంగా కనుపించినా వాస్తవం
జరిగింది.

కాంగ్రెసు స్థాపనకావడమే బ్రిటిష్‌వారిలో ఏ వర్గానికి గిట్టులేదు
తీయులలో జాతీయభావంలేని కారణంగా వారు దేశాన్ని జయించి
కొన్నారు. అదే కారణంగా వారు 1857-58 లో సంభవించిన మహా
తిరుగుబాటును అణచగలిగారు. కాని దేశానికంతా కాంగ్రెసు ఒక
సంఘంగా ఏర్పడి ఏటేట సమావేశాలు జరిపి రాజకీయ పరిజ్ఞానం
వ్యాపింపజేయడంచేత జాతీయత దేశాభిమానం క్రమక్రమంగా వా
సాగాయి. అన్ని రాష్ట్రాలవారు, అన్ని మతాలవారు, అన్ని భాషలు మా
వారు, అన్ని కులాలవారు ఒకచోట కలుసుకొని, తామంతా ఒకే తల్లి గ
పుట్టినట్టి వారనే భావంతో ప్రవర్తించడానికి అలవాటుపడడం బ్రిటిష్
కన్ను కుట్టినట్లైంది. భారతీయులలో వృద్ధి పొందుచున్న జాత్యభిమా
కాంగ్రెసు బాహ్యచిహ్నమనే భావం వారిలో నాటుకొనిపోయింది.
సామ్రాజ్యాధికారానికి అది ఎప్పటికైనా ముప్పు తేగలదనే భయం సం
వారిని పీడించసాగాయి. దానిపట్ల వారు ద్వేషభావాన్ని వహించడానికి
మూలకారణం.

బాల్యదశలో కాంగ్రెసు మితవాదాన్ని అనుసరించినా పరిణతి గా
తర్వాత దానిధోరణి అతివాదంలోకిమారి, చెల్లించుటకు సాధ్యంకాని గొం
కోరికలను కోరే ప్రమాదం ఉన్నదనీ, వాటిని చెల్లించడం సాధ్యపడన
దేశంలో అలజడి అసంతృప్తి సర్వవ్యాప్తంకాగలదనీ, వారు భయపడడం ప
అయింది. కాంగ్రెసు కోరే ప్రజాస్వామికం, ఎన్నికల విధానం, సైనిక ఖ
నుతగ్గించడం, ఉన్నత ఉద్యోగాలన్నిటిలో భారతీయులకు ఉచిత ప్రవేశం క
చడం, మొదలైనవన్నీ ఈలాటివి అనివారు అభిప్రాయపడినారు. ప్రజాస్వా
ప్రాచ్య దేశాలకు అనుగుణమైనది కాదనీ, బాధ్యతతో కూడిన ఉద్యోగా
వహించుటకు కావలసిన అర్హత భారతీయులకు లేదనీ, సైనిక ఖర్చులను
చిన పక్షంలో తమసామ్రాజ్యం నిలబడజాలదని వారుపలాగు సమర్థించదలి
ఇదివరలో వివరించాము. ఆ రోజులలో బ్రిటన్ ఎదుర్కొనవలసిన సమస్య
ఐర్లాండు సమస్య గడ్డు స్వరూపాన్ని ధరించింది. అది వారి మనస్సు
ఎప్పుడూ మెదలుతూనే వచ్చింది. కొన్ని సంస్కరణల నిమిత్తంగా అక

బయలుదేరిన ఆందోళన క్రమక్రమంగా విశాలతరమై తుదకు ఆంతరంగిక స్వపరి పాలనోద్యమంగా (Home Rule Movement) రూపొందడం వారు విస్మరించ లేక పోయారు. కాంగ్రెసుకు అలాటి ఉద్యమాన్ని లేవదీసే ఉద్దేశం లేదని దాదాభాయివంటి నాయకులు పదేపదే స్పష్టంచేసినా అధికారులకు నమ్మకం కుదరలేదు. భారత ప్రతినిధులు కొందరితో కూడిన శాసనసభలను కోరడం అంత రంగిక స్వపరిపాలనను కోరడమేనని వారు అపార్థం చేయడానికి సిద్ధపడ్డారు. భారతదేశం రెండవఐర్లాండుగా తయారయ్యే ప్రమాదం ఉన్నట్లు వారు భావించి దీనికి కారణమైన కాంగ్రెసును ద్వేషించసాగారు. ఎప్పుడో ఏదో జరగ నున్నదనే భయానికి వారు లోబడిపోయినారు.

ఇదిగాక మొదటి రెండు సంవత్సరాలలో కాంగ్రెసు సామాన్య ప్రజలతో ఎక్కువ సంబంధాన్ని పెట్టుకొనలేదు. కాని దాని తీర్మానాలను ప్రభుత్వం ఎంతమాత్రము గుర్తించకపోవడం, నాయకులలో కొందరికి ఆగ్రహకారణమైంది. వారిలో హ్యూం ఒకడు. కాంగ్రెసు సామాన్య ప్రజలతోను, రైతులతోను సంబంధం కల్పించుకొని, వారిని కూడా ఆందోళనలోకి దింపిన పక్షంలో ప్రభుత్వ వైఖరి మారగలదని భావించి, కరపత్రాలను సులభ గ్రంథాలను దేశభాషలలో ప్రచురించి, లక్షల సంఖ్యలో వాటిని గ్రామప్రాంతాలలో పంచిపెట్టి, ఆ ప్రాంతా లకు ప్రచారకులపంపి, వారిచేతఉపన్యాసాలు ఇప్పించాడు. ఇంతేగాక, రైతులు ప్రభుత్వానికీ జమీందార్లకూ చెల్లించే శిస్తు శాశ్వతంగా నిర్ణయం కావలసినట్లు కాంగ్రెసుచే తీర్మానం చేయించినాడు. ఈ చర్యలన్నీ ప్రమాదకరములని ప్రభుత్వం భావించింది. మంచిచెడుగుల మధ్య విచక్షణ చేయగలశక్తి విద్యాధికుల కున్నట్లు అక్షరజ్ఞానంలేని గ్రామీణులకు ఉండదనీ, వారిమధ్య ప్రచారం సాగిం చడం తిరుగుబాటుకు దారితీయగలదనీ, దేశవ్యాప్తమైన ప్రజల తిరుగుబాటును సాయుధ తిరుగుబాటును సైనిక సహాయంతో అణచునట్లు అణచడం సాధ్యం కాదనీ, రైతులసమస్యలపట్ల ఆందోళనకారకులు శ్రద్ధవహించిన తర్వాతనే ఐర్లాండు సమస్య క్లిష్టతరమైనదనీ అధికారులు భావించి, అలాటి ఆందోళనను సాగించ పూనుకొన్న కాంగ్రెసుపట్ల ద్వేషం వహించారు. ఈ విషయంలో కాంగ్రెసు నాయకులలో అనేకులు హ్యూంతో ఏకీభవించినవారు కారు. వారికి కూడా ప్రజలతో సన్నిహిత సంబంధం కల్పించుకొనడం ఇష్టం లేదు. అయినా ప్రభుత్వం దాని తొలిద్వేషాన్ని మానుకొనలేదు.

పరిస్థితులు విషమించకముందే కాంగ్రెసును అక్రమసంస్థగా ప్రకటించ వలసిందనీ దానిసమావేశాలను నిషేధించవలసిందని అధికారులుకొందరు (వారిలో చెస్నీ అనే సైన్యాధికారి ప్రాధాన్యం వహించాడు). ప్రభుత్వాన్ని హెచ్చరిం చారు. కాని ప్రభుత్వం అంతటి తీవ్రమైన చర్యలు తీసుకొనకపోయినా కాంగ్రె సును బలహీన పరచుటకు సర్వవిధాలా ప్రయత్నించింది.

ఈ ప్రయత్నాలలో ఒకటి ముస్లింలను జమీందార్లను కాంగ్రెసులో చేర రాదని ప్రోత్సహించుట. ఇది కారణంగా 1887 నుండి సర్ సయ్యాద్ అలీఖన్

ఉద్యమాన్ని లేవదీసి కాంగ్రెసుపట్ల పరమ విరోధియై ముస్లింలు దానితో సంబంధం పెట్టుకొనరాదని దాని సమావేశాలకు హాజరు కాకూడదని ప్రచారం చేశాడు. జమీందార్లూ అయోధ్య తాలూకాదార్లు అనేకులూ అదే మార్గాన్ని అనుసరించి ఐక్య భారత దేశాభిమాన సంఘం అనే పేరుతో కాంగ్రెసుకు ప్రత్యర్థిగా ఇంకొక సంఘాన్ని అహమ్మదుఖాన్ సహకారంతో స్థాపించారు. కాంగ్రెసుకు విరాళాల నియ్యడం కూడా వీరు మానుకొన్నారు. ఇందరు ప్రతిఘటించినా కాంగ్రెసు ఏదోవిధంగా దాని కృషిని సాగించగలిగింది.

ఇదేవిధంగా సంస్థానాధీశులు కాంగ్రెసుకు విరాళాల నియ్యకుండునట్లు ప్రభుత్వం వారిపై ఒత్తిడి తెచ్చింది. కాంగ్రెసుపట్ల ద్వేషం వహించిన వారికే బిరుదులనియ్య సంకల్పించింది. క్రమక్రమంగా పెరుగుతూన్న కాంగ్రెసుపట్ల ద్వేషం, కర్జన్ ప్రభువు రాజప్రతినిధిగా ఉండిన కాలంలో (1898-1905) ఉచ్ఛస్థితికి వచ్చింది. భారతీయులను- వారిలో ప్రధానంగా విద్యార్థికులను - తూలనాడడంలో అతడు హద్దులమీరి ప్రవర్తించాడు. ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా బెంగాలు రాష్ట్రాన్ని రెండురాష్ట్రాలుగా విభజించాడు. దీనితో అతనికీ బెంగాల్ ప్రజలకూమధ్య ఒక అఘాతం ఏర్పడింది. కాంగ్రెసు ప్రజలపక్షం వహించి, అతనితో సమరాన్ని సాగించడానికి సమకట్టింది. దీనితో కాంగ్రెసు చరిత్రలోను, దేశ చరిత్రలోను స్వాతంత్ర్యోద్యమ చరిత్రలోను నూతన అధ్యాయం ప్రారంభమైంది.

## చదువవదగిన గ్రంథాలు

1. భోగరాజు పట్టాభి సీతారామయ్య—కాంగ్రెసు చరిత్ర.
2. Bharatiya Vidya Bhavan : Vols 10 and 11.
3. Tarachand— History of the Freedom Movement in India : Vols II and III.
4, Annie Besant : How India wrought for Freedom.
5. S. B. Zglover : British attitude toward Indian Nationalism.
5. Argov : Moderates and extremists.

# అధ్యాయము - 10

## ముస్లిం రాజకీయాలు

ప్రజలలో జాతీయత లేనికారణంగా పరాయివారు దేశంపై దండెత్తివచ్చి దానిని జయించి వశపరచుకొనగలిగారని ఇంగ్లీషువిద్య నేర్చిన విద్యాధికులు గ్రహించి జాతీయాభిమానమనే సుగుణాన్ని సంపాదించి ప్రజలలో దానిని అభివృద్ధి చేయుటకు కాంగ్రెసుసాధనాన ప్రయత్నించుచుండిన సమయంలో ముస్లిం రాజకీయాలు ఆప్రయత్నానికి ప్రతిబంధకంగా ఏర్పడినాయి. వీటిప్రభావం క్రమక్రమంగా వృద్ధిగాంచి తుదకు స్వాతంత్ర్యోద్యమం ఫలప్రదమై బ్రిటిష్‌వారు దేశాననుండి వెళ్ళిపోయి స్వరాజ్యం లభించునాటికి దేశం రెండు స్వతంత్రరాజ్యాలుగా చీలిపోవడానికి దారితీశాయి. ఇందుమూలంగానే ముస్లిమ్‌రాజకీయాలకు ఒక ప్రత్యేక ప్రాధాన్యంకలిగింది.

800 సంవత్సరాలుగా భారతదేశంలో ముస్లింలు నివసిస్తూవచ్చినా హిందువులూ వారూ పూర్తిగా కలసిపోవుటకు అనుకూలమైన పరిస్థితులు ఏర్పడలేదు. ఈ రెండుమతాలవారు రెండు ప్రత్యేకవర్గాలుగా రూపొందినారు. వీరిమధ్య మనస్పర్ధలకు ఇదె మౌలికకారణం. ముస్లింలకు పూర్వం విదేశీయులనేకులు దేశంపై దండెత్తివచ్చి కొన్ని ప్రాంతాలను వశపరచుకొన్నా వారు హిందూసంస్కృతిచే ప్రభావితులై హిందువులతోకలసిపోయినారు. వారిలో అనేకులు క్షత్రియులుగా పరిగణింపబడినారు. కాని ముస్లింలు అలాగుకాక తమసంస్కృతి ఉత్కృష్టమైనదనీ, తమ మతం అత్యుత్తమమైనదనీ భావించి తమ ప్రత్యేకతను నిలబెట్టుకొనగలిగారు. హిందువులుకూడా వారిని మ్లేచ్ఛులుగాభావించి వారితోకలియడం మానుకొన్నారు. అందుచేత వారు ఒకదేశంలో ఇరుగుపొరుగున నివసించేవారైనప్పటికీ వారిమధ్య సౌహార్ద్రాధారమైన సంబంధం ఏర్పడడం సాధ్యంకాలేదు. దేశంలో చాలాభాగానికి వారు పాలకులుకావడంచేత వారు హిందువులపట్ల చులకనభావాన్ని ప్రదర్శించడం సహజమైంది. ఇదికూడా వారికలియకకు ఒక అవరోధంగా పరిణమించింది. 19వ శతాబ్దంలో బ్రిటిష్‌పరిపాలన ఏర్పడినకారణంగా హిందువులతోసమానంగా వారుకూడా బ్రిటిష్‌వారి పరిపాలనకు లోబడిపోయినా ఒకప్పుడు తాను హిందువులపై అధికారాన్నివహించడను వారిజ్ఞాపకాలలో స్థిరపడిపోయినది. ఈజ్ఞాపకముకూడా రెండు మతాలవారు కలయుటలో ఒక ప్రతిబంధకంగా ఏర్పడింది.

ఇదిగాక ప్రపంచంలో ఉత్తరఆఫ్రికా, పశ్చిమఏషియా, మధ్యఏషియా

ఆగ్నేయఆసియాలలోని దేశాలలో కోట్లకొలది ముస్లింలు నివసిస్తున్నా భారతదేశంలోని ముస్లింలకు ఆధ్యాత్మికంగాను సాంస్కృతికంగాను వీరి ఎక్కువసంబంధం ఉండడం సహజం. ముస్లింలు ఏప్రాంతంలో నివసించినా తా ప్రపంచవ్యాప్తమైన ముస్లింసమాజంలో సభ్యులన్నభావం వారిలోపూర్తి నాటుకొని ఉంటుంది. భారతదేశంలోని ముస్లింలలోకూడా ఈభావం ఏర్పడడం ఆశ్చర్యపడవలసింది ఏదీలేదు. వారిపుణ్యక్షేత్రాలన్నీ ఇతరదేశాలలో ఉంటున్న వారిఅభిమానం భారతదేశానికిమాత్రం పరిమితమైనట్టిదికాదు - హిందువుల మానం అలాగుకాక భారతదేశానికిమాత్రమే పరిమితమైనట్టిది. అరేబియా, ఇరా టర్కీ మొదలైనదేశాలు శుద్ధమైన ముస్లిందేశాలని, అక్కడిముస్లింలు భారతదే లోని ముస్లింలకంటె ఎక్కువగౌరవానికి అర్హులనేభావం మొదటినుండీఏర్పడిం అందుచేతనే అక్కడనుండివచ్చినవారికి భారతదేశంలోని ముస్లింరాజ్యాల గొప్ప పదవులు గౌరవాలు లభించేవి. వీటిఅన్నిటిఫలితంగా భారతదేశంలో ముస్లింలు ముస్లిందేశాలతోను, అక్కడిముస్లింలతోను ఎక్కువ సన్నిహితసంబం కలవారయ్యారు. హిందువులతో ఆలాటిసంబంధం ఏర్పడడానికి ఇదిఒక ప్రతి ధకమైంది.

బ్రిటిష్‌వరిపాలన స్థాపితమైన తొలిదశలో హిందువులు ముస్లింలు దా పట్ల భిన్నవైఖరులను కలవారయ్యారు. తమఅధికారాన్నినిర్మూలించి తమస్థా బ్రిటిష్‌వారు పాలకులైనందుకు ముస్లింలు వారిపట్ల ద్వేషభావము వహించా ఇది సహజమే. హిందువులు అలాగుకాక, ముస్లింపరిపాలనకాలంలో తామనుభ చుతూవచ్చిన బాధలనుండి విముక్తికలిగినదనేకారణాన బ్రిటిష్‌పరిపాలనపట్లసు ఖత్వాన్ని ప్రదర్శించారు. రెండుమతాలవారి మనోవైఖరులలో ఈవిధం ఏర్పడిన భిన్నత్వం వారికలయికకు ఒక అధనపు అవరోధంగా పరిణమించిం దీనిఫలితంగా బ్రిటిష్‌వారు హిందువులపట్ల ఎక్కువ అభిమానంకలవారయ్యా ఇంగ్లీషువిద్య హిందువులలోవ్యాపించి, వారు జాతీయభావాన్ని వృద్ధిచేసుకొ రాజకీయసంఘాలను స్థాపించి బ్రిటిష్‌వారివిధానాలను విమర్శించేవారయ్యేవ ఈఅభిమానం ఉంటూవచ్చింది. హిందువులు బ్రిటిష్‌వారికి అభిమానపాత్రు కావడం తాముకాకపోవడం ముస్లింలు హిందువులతోకలిసి రాజకీయరంగం కృషిసాగించడానికి ఒక ఆటంకమైంది.

ఇదిగాక 1820 నుండి హిందువులు ఇంగ్లీషువిద్యను ఎక్కువగా నే కొని ప్రభుత్వోద్యోగాలను సంపాదించి ముందుకు రాగలిగారు. లాయర్లు, డాక్ట ఉపాధ్యాయులు, వార్తాపత్రికల సంపాదకులుగా హిందువులే ఎక్కువ సంఖ్యా పేరు ప్రఖ్యాతులను సంపాదించగలిగారు. మత సంస్కరణము, సంఘ సంస్ ణము మొదలైన ఉద్యమాలలో శ్రద్ధవహించి, వారు అభివృద్ధిమార్గంలో న వారయ్యారు. కాని సుమారు నలభై యాభై సంవత్సరాలవరకు ముస్లిం ఇంగ్లీషు విద్యపట్ల శ్రద్ధవహించలేదు. ఎవరో కొందరు మాత్రమే దానిపట్ల కలవారయ్యారు. విద్యతో సంబంధం గల ఉద్యోగాలు వృత్తులు హిందు

వశంలోకి రావడము, తమకు అవి లభించకపోవడను ముస్లింలలో అసంతృప్తికి కారణమైంది. వారి వెనుకబడిన తనానికి హిందువులు కారణమైనట్లు వారు భావించసాగారు. రెండు మతాలవారి మధ్య సత్సంబంధాలు నెలకొనకపోవుటకు ఇదికూడా ఒకకారణమైంది.

వీటి అన్నిటి ప్రభావంచేత బెంగాలులో స్థాపించబడిన రాజకీయ సంఘాలలో ముస్లింలు ఎక్కువగా చేరలేదు. హిందువులుకూడా వారిని చేరవలసిందిగా కోరినవారు కారు. 1860 తర్వాత ముస్లింలలో రాజకీయ చైతన్యం కనుపించి, వారుకూడా రాజకీయసంఘాల స్థాపనపట్ల కొంత శ్రద్ధవహించునాటికి హిందువులతో సంబంధం లేక ప్రత్యేకంగా వారు వారి సంఘాలను స్థాపించుకొన్నారు. ఈలాటివాటిలో 1863 లో కలకత్తాలో అబ్దుల్ లతీఫ్ స్థాపించిన మహమ్మదీయ సారస్వతసంఘం (Mohammadan Literary Society) మొదటిది. ఇతడు వారిలో ఇంగ్లీషువిద్య వ్యాపించుటకు కూడా కొన్ని ప్రయత్నాలు చేశాడు. వారికి గాను కలకత్తా మద్రాసులో ఒక ప్రత్యేక ఇంగ్లీషు భాగాన్ని ఏర్పరచదలచాడు. సయ్యద్ అహ్మద్ ఖాన్ అలిఘర్ లో కళాశాలను స్థాపించుటకు పూర్వమే ఈలాటి ప్రయత్నం లతీఫ్ చేయడం గుర్తించ తగ్గది. తర్వాత కొన్ని సంవత్సరాలకు హిందువులు హిందూ మేళా, హిందూజాతీయ సంఘాన్ని స్థాపించినప్పుడు బెంగాలులోని ఇంకొక ముస్లిం నాయకుడు అమీర్ అలీ ముస్లింల పురోభివృద్ధికై ఒక ప్రత్యేక "భారతీయ మహమ్మదీయసంఘాన్ని" (National Mohammadan Association) స్థాపించాడు. రెండు మతాలవారు వేర్వేరుగా సంఘాలను స్థాపించుకొనడం పరిపాటి అయింది.

క్రమక్రమంగా బెంగాలులోని ముస్లింలు ఇంగ్లీషు విద్యపట్ల ఎక్కువ ఆసక్తిని ప్రదర్శించేవారయ్యారు. 1873 ప్రాంతాన హాజి మహమ్మద్ మోసిన్ (Haji Mohammad Mosin) అనే దాత కొన్ని లక్షలను ఇందుకుగాను దానం చేశాడు. దీని ఫలితంగా ఇతర రాష్ట్రాలలోని ముస్లింలకంటె బెంగాలులోని ముస్లింలు ఎక్కువ సంఖ్యలో ఇంగ్లీషు నేర్చుకొనగలవారయ్యారు. ఇది వారి రాజకీయ చైతన్యాభివృద్ధికి ఎంతగానో సహాయపడింది.

కాని అంతకుపూర్వం 50 సంవత్సరాలనుండి హిందువులు ఈ విషయంలో శ్రద్ధవహించిన కారణంగా ముస్లింలు వారితో తులతూగలేక పోయ్యారు. రెండు మతాలవారి ఆశయాలు భిన్నరూపాలను ధరించాయి. ముస్లింలు అన్నిరంగాలలో ప్రభుత్వాన నుండి ప్రత్యేక సదుపాయాలను కోరేవారయ్యారు. ఉన్నతోద్యోగాలలో ప్రవేశం పోటీ పరీక్షలద్వారా లభించవలసిందిగా హిందువులు కోరారు; కాని ముస్లింలు దానికి అభ్యంతరం తెలియపరచారు. సివిల్ సర్వీసుకు సంబంధించిన పోటీపరీక్షలు ఏకకాలంలో బ్రిటన్‌లోను భారతదేశంలోను జరగవలసిందిగా హిందువులు కోరారు. కాని దాని మూలంగా విద్యలో ఎక్కువ అభివృద్ధిని సాధించిన హిందువులకే లాభం చేకూరగలదనేభావంతో వాటిని ముస్లింలు ఆక్షేపించారు. రిప్పన్ తలపెట్టిన ఇల్బర్టుబిల్లును సమర్థించడంలో హిందువులలో

కలియుటకు అమీరాలీ, ఆతని సంఘం ఇష్టపడలేదు. స్థానిక స్వపరిపాలన విష యంలో హిందువులు ఎన్నికల విధానాన్ని సమర్థించగా ముస్లిం నాయకులు ఎన్నికల విధానం మూలాన అధికసంఖ్యాకులైన హిందువులకే ఎక్కువ స్థానాలు లభించగలవనీ, ముస్లింలకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండవలెనని వాదించారు. విద్యలో రెండు మతాలవారు ఏకకాలంలో సమానస్థాయికి రాని కారణంగానూ, చారిత్రక పరిస్థితులలోని విభేదాలు కారణంగాను రెండు మతాలవారు రాజ కీయ విషయాలలో విభిన్న దృక్పథాలను అనుసరించేవారయ్యారు.

అమీరాలీ తాను స్థాపించిన జాతీయ మహమ్మదీయ సంఘాన్ని అఖిల భారత ముస్లిం సంఘంగా మార్చదలచి అన్ని రాష్ట్రాలలో దానిశాఖలను నిర్మా ణంచేసి, 1884 లో ఒక అఖిలభారత ముస్లిం సమావేశాన్ని ఏర్పాటుచేయ ప్రయత్నించాడు. ఈ ప్రయత్నం కొనసాగకపోయినా కాంగ్రెసు స్థాపనకు సుమారు రెండు సంవత్సరాలకు పూర్వమే అతడు దీనిని చేయడం గుర్తించ దగినది. ముస్లింల ప్రయోజనాలు హిందువుల ప్రయోజనాలవంటివి కావనిన్నీ, వాటిని సంపాదించుటకు ప్రత్యేకకృషి అవసరమనిన్నీ, అది ఫలప్రదం కావడంలో ప్రభుత్వ సహాయం అవసరమనిన్నీ, ఈ సహాయాన్ని సంపాదించడంలో ప్రభుత్వ విధానాలను విమర్శించకుండా ఉండడము ఒక సాధనమనిన్నీ, ఆ విధానాలను విమర్శించే కాంగ్రెసుతో సహకరించడం ముస్లింలకు ప్రమాదకరమనిన్నీ అమీ రాలీ అభిప్రాయం. బెంగాలులోని ముస్లింనాయకులనేకులు ఇందులో అతనితో ఏకీభవించారు. అందుచేత రెండుమతాలవారు కలిసి కృషిచేయడం సాధ్యం కాలేదు.

అమీరాలీ తలపెట్టిన ఈ వేర్పాటు కార్యక్రమానికి పూర్తి స్వరూపాన్ని కల్పించినవాడు సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్. అతడు లేవదీసిన "అలిఘర్ ఉద్యమం" (Aligerh Movement) ఇందుకుగాను ఉద్దేశింపబడింది. జాతీయ రాజకీయాలలో కాంగ్రెసు ఉద్యమానికి ఏలాటి ప్రాధాన్యమో ఆలాటి ప్రాధా న్యమే ముస్లిం రాజకీయాలలో "అలిఘర్ ఉద్యమానికి" లభించింది. దానిని లేవదీసిన అహమ్మద్ ఖాన్ ముస్లిం నాయకులలో అగ్రస్థానాన్ని వహించినవాడు య్యాడు.

## 2

హిందువుల పునరుద్ధరణకూ పునర్వికాసానికి రాజారామ మోహనరాయ్ చేసిన కృషివంటి కృషినే సయ్యద్ అహమ్మద్ ఖాన్ ముస్లింల పునరుద్ధరణకూ పునర్వికాసానికీ గావించి ముస్లింల నవజీవిత నిర్మాత అనే ప్రఖ్యాతిని సంపా దించాడు. ఇతనికృషి సర్వతోముఖమై,మతము, విద్య, రాజకీయాది రంగాలలో ప్రభావం వహించింది.

ఇతడు 1819లో ఢిల్లీనగరంలో ఒక ప్రముఖ కుటుంబమున జన్మించాడు. 1839లో బ్రిటిష్‌వారి న్యాయస్థానంలో ఒక ఉద్యోగమందు ప్రవేశించి, ఉన్నత పదవుల ననుభవించి, 1878లో ఉద్యోగాననుండి విరమించి పించన్ పుచ్చుకొ

న్నాడు. అతడు ఉద్యోగమందు ఉన్నప్పుడే 1857-58 తిరుగుబాటు సంభవించింది. అప్పుడతడు ప్రభుభక్తి పరాయణుడై అధికారులకు ఎంతగానో సహాయపడి వారి ప్రశంసలకు పాత్రుడైనాడు. తిరుగుబాటు ఫలితంగా ముస్లింల స్థితి సర్వవిధాలా దిగజారిపోవడము అతనికి ఎంతో విచారమును కలిగించింది. వారిలో ప్రముఖవర్గానికి చెందిన వారనేకులు వారి భూములను ఉద్యోగాలను కోల్పోయ్యారు. సామాన్యులు నిరుపేదలయ్యారు. తిరుగుబాటులో వారిదే ప్రధాన పాత్ర అనిన్నీ, ఎన్నటికైనా వారిమూలంగానే తమ సామ్రాజ్యాధికారానికి ముప్పు వాటిల్లగలదనే భావం ప్రభుత్వానికి కలిగింది. ఈ కారణంచేత వారు అధికారుల అభిమానానికి దూరులయ్యారు. వారిపట్ల అధికారులు ద్వేషాన్ని కూడా వహించారు.

సయ్యద్ అహమ్మద్‌ఖాన్ ఈలాటి దుస్థితినుండి వారిని విముక్తుల జేయుటకు కంకణం కట్టుకొన్నాడు. దీనికి బ్రిటిష్ ప్రభుత్వంయొక్క సానుభూతినీ సహాయాన్నీ సంపాదించడంతప్ప వేరొకమార్గం లేదనే నిర్ణయానికి వచ్చాడు. అతని రాజకీయ కృషికంతకు ఇది మౌలిక లక్షణమైంది.

1857-58 తిరుగుబాటులో ముస్లింలు వహించినపాత్ర అధికారులు భావించినంత గొప్పదికాదనీ, అది గొప్పదైనా అట్లు ప్రవర్తించినందుకు వారు విచారపడుచున్నారనీ, స్వతహాగా వారు ప్రభుభక్తి గలవారనీ అతడు అధికారులకు నచ్చచెప్పగలిగాడు. అదేవిధముగ అతడు తాము తరించుటకు బ్రిటిష్‌వారిపట్ల పరమ విధేయులై ప్రవర్తించుట తప్ప సాధనాంతరం ఏదీ లేదనిన్నీ, తమ మతం క్రైస్తవులైన బ్రిటిష్‌వారిపై తిరుగుబాటు చేయవలసిందిగా ప్రబోధించడం లేదనిన్నీ, పురోగమించుచున్న హిందువులతో తులతూగుటకు ప్రభుత్వానుండి ప్రత్యేక సదుపాయాలను పొందుట ఒక్కటే సాధనమనిన్నీ, ప్రభుత్వ విధానాలను విమర్శించకుండా ఉన్నప్పుడే వారు ప్రభుత్వానుండి తమకు కావలసిన సహాయాన్ని సంపాదించడం సాధ్యంకాగలదనిన్నీ, అలాటి విమర్శలుచేసే కాంగ్రెసువంటి సంఘాలతో తాము చేతులు కలపరాదనిన్నీ ముస్లింలకు బోధించి, ప్రభుత్వంపట్ల వారి వైఖరిని మార్చగలిగాడు. వారిలో అధిక సంఖ్యాకులు బ్రిటిష్‌వారికి పరమ విధేయులై ప్రవర్తించుటకు నిర్ణయించుకొన్నారు. ఈలాటి పరివర్తన వారిలో కలిగించడమే సయ్యద్‌అహమ్మద్‌ఖాన్ వారికి చేసిన మహోపకారము.

బ్రిటిష్‌వారి అభిమానాన్ని సంపాదించే ప్రయత్నంలో తొలిదశయందు అతడు జాతీయోద్యమంపట్ల నిరసనభావాన్ని ప్రదర్శించలేదు. హిందూస్థానంలో నివసించేవారు హిందువులైనా మహమ్మదీయులైనా హిందువులనే పేరునకు అర్హులనీ, తానుకూడా హిందువు అనీ ఒకప్పుడు చెప్పుకొన్నాడు. హిందువు, ముస్లిం అనే మాటలు మతందృష్ట్యా మాత్రమే వారిమధ్య ఏర్పడిన భేదాన్ని సూచిస్తున్నవనీ, మతంలో భేదం ఉన్నంతమాత్రాన వారు రాజకీయంగా ఒక

జాతికి చెందినవారు కారని భావించరాదని, వాస్తవంగా వారు ఒకేజాతికి చెందిన వారనీ, వారు కలిసి రాజకీయాభివృద్ధికై కృషిచేయవలసి ఉన్నదనీ 1884లో కూడా ఉద్ఘాటించాడు. శాసనసభలలో భారతీయులకు ప్రాతినిధ్యం లేకపోవడం వల్ల ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనే అవకాశం లేకపోయిందని, అది తెలియకపోవడమువలననే 1857–58 తిరుగుబాటు సంభవించిందని, ఆలాటి ప్రాతినిధ్యం కల్పించడం అవసరమనీ 1863లోనే అతడు అధికారులకు స్పష్టం చేశాడు. విద్యలో బెంగాలీలు ముందంజ వేసిన కారణంగా పోటీపరీక్షలద్వారా ఉద్యోగులను నియమించరాదని కొందరు వ్యక్తంచేసిన అభిప్రాయాన్నికూడా అతడు ప్రథమంలో ఖండించాడు. కాని క్రమక్రమంగా ఈ అభిప్రాయాలన్నీ మారి హిందువులు ఒకజాతివారనీ, ముస్లింలు ఇంకొక జాతివారనీ, కాంగ్రెసు పేరునకు జాతీయ సంస్థ అయినా అది వాస్తవంగా హిందువుల సంస్థ అనీ, దాని వాంఛలు కొనసాగిన పక్షంలో బ్రిటిష్‌వారి అధికారానికి బదులు హిందువుల అధికారం— అందులోనూ బెంగాలీల అధికారం – కొనసాగుతుందనీ, ఒకప్పుడు హిందువులపై అధికారాన్ని వహించిన ముస్లింలకు ఈలాటి మార్పు అంగీకార యోగ్యం కాజాలదనీ, దానిని వారు సర్వవిధాలా - అవసరమైతే యుద్ధం ద్వారా కూడా - ఎదుర్కొనగలరనీ, వాదించేవాడయ్యాడు. అనేక జాతులతో కూడిన భారతదేశంలో జాతులపట్ల నిష్పక్షపాతంగా వ్యవహరించే బ్రిటిష్ వారి అధికారం శాశ్వతంగాను సుస్థిరంగాను ఉండడం అందరికీ శ్రేయస్కరమనే వాదాన్ని సమర్థించినాడు అందుచేతనే అతడు ముస్లింలు కాంగ్రెసులో చేరరాదని ఉద్ఘాటించాడు. ప్రత్యేక సంఘాలద్వారా వారు వారి పురోభివృద్ధికై కృషిసాగించడమే వారనుసరించదగిన మార్గమని వారికి బోధించి అలాటి సంస్థలను స్థాపించాడు. ఆతడు ఈవిధంగా ప్రతిపాదించిన ద్విజాతి సిద్ధాంతం తుదకు 1947లో దేశవిభజనకు దారితీసింది. ఈదృష్ట్యా పాకిస్థాన్‌కు అతడే నిర్మాతగా పేర్కొనతగినవాడు.

కాంగ్రెసు హిందువులసంస్థ అనే భావం అతనిలో ఏర్పడిన ఫలితంగా 1888లో అతడు "ఐక్య దేశాభిమానుల సంఘం" (United Patriotic Association) అనే సంస్థను స్థాపించాడు. అందులో ముస్లింలతోపాటు హిందూ జమీందార్లు కొందరు సభ్యులైనారు. కాని రెండు జాతులవారు సభ్యులుగా ఉండడం అతనికి నచ్చలేదు. అందుచేత దానిపట్ల శ్రద్ధవహించడం మానుకొని అంతకుపూర్వం 1886 అతడు స్థాపించిన "మహమ్మదీయ విద్యాసమావేశము (Mohammadan Educational Conference)ను ముస్లిం ప్రయోజనాలను సమకూర్చుటకు ప్రధాన సాధనంగా వినియోగించసాగినాడు. ఇది ఏటేట ఏదో ఒక ప్రధాననగరంలో సమావేశమై ముస్లింల విద్యాసమస్యలనేగాక రాజకీయ సమస్యలను చర్చించే వేదికగా రూపొందింది. హిందువులతో సంబంధంలేని సంస్థల సాధనాననే ముస్లింలు అభివృద్ధి గాంచగలరనే అతని ఆశయసిద్ధికి ఇది ఎంతగానో తోడ్పడింది.

ఇదే ఉద్దేశంతో అతడు 1893లో "మహమ్మదీయ ఆంగ్లో - ఇండియన్ రక్షణ సంఘాన్ని" (Muhammadan - Anglo Oriental Defence Association) స్థాపించినాడు. ఇందులో ముస్లింలూ బ్రిటిష్‌వారూ సభ్యులగుటకు అర్హులు. తక్కిన భారతీయులు సభ్యులగుటకు అనర్హులు. ముస్లింల అభిప్రాయాలను బ్రిటిష్‌వారికీ ప్రభుత్వానికీ తెలియపరచి వారి రాజకీయ హక్కులను రక్షించడం, ముస్లింలలో రాజకీయ ఆందోళన ధోరణి వ్యాపించకుండా అరికట్టడం, భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనాధికారాన్ని బలపరచడం దాని ప్రధాన ఆశయాలు. పరిపాలనాధికారాన్ని హిందువుల వశంచేయడం కాంగ్రెసు ఉద్దేశం. ఇది నెరవేరిన పక్షంలో ముస్లింలు హిందువులకు దాస్యం చేయవలసివస్తుంది. అలాటి ప్రమాదాననుండి ముస్లింలను రక్షించుటకు బ్రిటిష్ పరిపాలన సుస్థిరం కావడంతప్ప సాధనాంతరం ఏదీలేదు. ఇంతేగాక దేశంలో ప్రజాస్వామికాన్ని ప్రవేశపెట్టడం కాంగ్రెసు ఆశయం. విపరీతమైన మతభేదాలు ఉన్న దేశంలో ప్రజాస్వామికం అంటే అధికసంఖ్యాకులైన హిందువుల ప్రాబల్యమే. ఇదికూడా ముస్లింల పతనానికి దారితీసే విధానం. ఈలాటి పరిణామాన్ని అరికట్టుటకు కూడా బ్రిటిష్‌వారి నిరంకుశ పరిపాలన సుస్థిరంగా ఉండడమే సాధనం— అని ఈ సంఘానికి కార్యదర్శిగా ఎన్నికైన బెక్ ప్రచారం చేశాడు. బ్రిటన్‌లో కూడా ఈ ప్రచారాన్ని సాగించాడు. ఇందులో అహమ్మద్‌ఖాన్ అతనితో పూర్తిగా ఏకీభవించాడు. హిందువులు వేరు, ముస్లింలు వేరు అనే భావాన్ని బలపరచడంలో ఈ సంఘం గొప్ప విజయాన్ని సాధించింది.

1887 కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షుడైన బదురుద్దీన్ త్యాబ్జీ సయ్యద్ అహమ్మద్‌ఖాన్‌తో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి కాంగ్రెసుపట్ల అతడు వహించిన విరోధ భావాన్ని మాన్పింప ప్రయత్నంచేశాడు. ముస్లింలకు కొన్ని ప్రత్యేక సమస్యలున్నా మరికొన్ని విషయాలలో ముస్లిం ప్రయోజనాలు హిందువుల ప్రయోజనాలు సమానములైనట్టివని, వాటి విషయంలో రెండు మతాల వారు కలిసి కృషి చేయడం అందరికి లాభదాయకరమనీ, కాంగ్రెసు చేయదలచిన తీర్మానం ఏదైనా ముస్లింలకు ఇష్టంలేనిపక్షంలో దానిని చేయకుండా ఉండుటకు కాంగ్రెసు సిద్ధంగా ఉన్నదనీ, అందుచేత వారు కాంగ్రెసు సమావేశాలలో పాల్గొనడం మూలాన ఏలాటి నష్టమూ ఉండదని చెప్పాడు. కాని లాభం లేకపోయింది. "భారతదేశంలోని ప్రజలందరు ఒకేజాతికి సంబంధించిన వారనే ప్రాతిపదికపై నిర్మాణమైన ప్రతి కాంగ్రెసుకు నేను విరోధిని", అని నిర్మొగమాటంగా జవాబుచెప్పి, ముస్లింలెవరు కాంగ్రెసు సమావేశాలలో పాల్గొనరాదని అహమ్మద్‌ఖాన్ పునరుద్ఘాటించాడు.

ఈవిధంగా కాంగ్రెసుపైనను జాతీయోద్యమంపైనను అతడు ఎత్తిన ధ్వజానికి అతడు స్థాపించిన అలీఘర్ కళాశాలకు ప్రధాన అధ్యాపకులుగా వచ్చిన బెక్, మారిసన్ అనే బ్రిటిష్ ప్రముఖులు మరింత బలాన్ని చేకూర్చినారు. అతడు లేవదీసిన ద్విజాతి సిద్ధాంతానికి, అతనికి తోచని హేతువులను కూడా

కొన్నిటిని వారు వినియోగించినారు. ఈ విషయమై బెక్ బ్రిటన్‌లోకూ
ప్రచారాన్ని సాగించాడు. కళాశాల విద్యార్థులందరు అతనిచే ప్రభావితు
ద్విజాతి సిద్ధాంతాన్ని పరమసత్యంగా భావించిన వారయ్యారు. యువకత
వారిలో ఈ మనోవైఖరి ఏర్పడిన కారణంగా హిందువులు ముస్లింలు క
పరాయి ప్రభుత్వాన్ని ఎదుర్కొనడం సాధ్యం కాకపోయింది. దీనిమూలం
ప్రభుత్వంవారు గొప్పలాభాన్ని సంపాదించగలిగారు. "చీలించిపాలించు" అ
భేదోపాయాన్ని వారు చక్కగా వినియోగించగలిగారు. జాతీయోద్యమాని
అరికట్టడం వారికిగాని ముస్లింలకు గాని సాధ్యం కాకపోయినా అది కొం
బలాన్ని కోల్పోవడం తప్పిందికాదు.

కాంగ్రెసు ఉద్యమంపట్ల మొదటినుండి ప్రభుత్వం ద్వేషభావాన్ని వహి
చినదని ఇదివరకే తెలుసుకొన్నాము. కాంగ్రెసును ఎదుర్కొనడంలో ముస్లిం
తమకు అండగా నిలబడడం బ్రిటిష్ అధికారులకు ఎంతగానో సంతోషదాయ
మైంది. తమపాచిక పారినట్లు వారు తృప్తిపడ్డారు. ముస్లింల వాంఛల
ఆధారం చేసుకొని వారికి ప్రత్యేక సదుపాయాలను విద్యారంగంలోను ఉద్యో
రంగంలోను, శాసనసభలు మొదలైన పరిపాలక సంస్థలలోను కల్పించి రెం
మతాలవారిమధ్య చీలికలకు దోహదం కల్పించారు. సయ్యద్ అహమ్మదుఖా
తలపెట్టిన రాజకీయకృషి ఫలప్రదమైంది.

ద్విజాతి సిద్ధాంతాన్ని సమర్థించి కాంగ్రెసు రాజకీయాలతో ఏలా
సంబంధం ఉండరాదనే నిర్ణయానికివచ్చిన సయ్యద్‌అహమ్మదుఖాన్ కాంగ్రె
తీర్మానాలలో ప్రధానములైనవాటినన్నిటిని ఖండించాడు. కాంగ్రెసు త
లక్ష్యం పార్లమెంటరీ ప్రజాస్వామికాన్ని దేశంలో ప్రవేశపెట్టడం. దీనికి ఎన్ని
కలు ఆధారం. కాని హిందువులు అధికసంఖ్యాకులుగా ఉండేదేశంలో ఎన్నిక
విధానమూ ప్రజాస్వామికమూ హిందువులకుమాత్రమే ప్రయోజనక
కాగలదని హిందువుల పరిపాలనకు దారితీయగలదని దీనికి అభ్యంత
తెలిపాడు. స్థానికసంస్థలలోకూడా ఈ విధానం ఉండరాదన్నాడు. ఎన్నిక
విధానాన్ని ప్రవేశపెట్టినపక్షంలో ముస్లింలకు కొన్నిస్థానాలు కేటాయించి వా
ప్రత్యేకప్రాతినిధ్యం కల్పించవలసిందిగా కోరాడు. ఉద్యోగుల నియామకం
కాంగ్రెసు వాంఛించిన పోటీపరీక్షలు ఉండరాదన్నాడు. ఇందులోకూడా కొన్ని
స్థానాలు ముస్లింలకు కేటాయించవలసిందిగాను, వాటి విషయంలో పరీక్షల
నిమిత్తంలేకుండా నామనిర్దేశంద్వారా నియామకం జరగవలెనని కోరాడ
ముస్లింలు అల్పసంఖ్యాకులు కావడంకాకుండా, వారు విద్యలోను ఇతరవిధా
గాను వెనుకబడినవారుకావడంచేతను, ఒకప్పుడు దేశాన్ని పాలించినవా
కావడంచేతను వారికి ఈలాటి సదుపాయాలను కల్పించడం న్యాయమని వాదిం
ముస్లింలకుపూర్వం హిందువులు దేశమంతటిపై అధికారాన్నివహించినవార
మాటను విస్మరించాడు. ఇదేవిధంగా సైనికఖర్చులను తగ్గించవలసింది
కాంగ్రెసుచేసిన తీర్మానాలను ప్రతిఘటించాడు. దీనిఫలితంగా బ్రిటిష్ ప్రా

అధికారం దెబ్బతినగలదని దాని మూలంగా ముస్లింలవంటి అల్పసంఖ్యాకులకు నష్టం కలుగుతుందని తన ఆక్షేపణను తెలియపరచాడు. కాంగ్రెసు చేసిన ఇతర తీర్మానాలపట్ల ఇదే వైఖరిని అనుసరించాడు. ఈ వైఖరి బ్రిటిషు వారికి ఎంత గానో సహాయపడింది. వారు మొదటినుండి కాంగ్రెసుపట్లను జాతీయోద్యమం పట్లను ద్వేషభావాన్ని వహించినవారు. ఇందులో ముస్లింలలో ఒక ప్రధానవర్గం తమకు సహాయం చేయుటకు సిద్ధపడడం వారికి తృప్తిని కలిగించింది. అహమ్మద్ ఖాన్ రాజకీయాలు గాని అతనిద్వారా ప్రభుత్వానికి లభించిన సహాయం గాని జాతీయోద్యమాన్ని అరికట్టలేక పోయినా దాని బలాన్ని కొంతవరకు తగ్గించగలిగాయి.

కాని ఈ విషయంలో అహమ్మద్ ఖాన్‌తో ఏకీభవించని ముస్లింలు కొందరు ఉండినారన్న విషయం గుర్తించవలసి ఉన్నది. ఈలాటి వారిని రెండు వర్గాలుగా విభాగం చేయవచ్చు. వీరిలో ఒకవర్గంవారు ఉలేమాలనే (Ulemas) మతబోధకుల నాయకత్వాన ఏర్పడినట్టివారు; రెండవవర్గంవారు జాతీయ ముస్లింలనే (Nationalist Muslims) పేరుగాంచినవారు.

ముస్లింల పతనానికి వారిమతములో ప్రవేశించిన లోపాలే ప్రధానకారణాలనీ, వారు మహమ్మదు ప్రవక్త చేసిన బోధలను సిద్ధాంతాలను ఆచారాలను తూచాలుతప్పకుండ అనుసరించినగాని వారికి తరుణోపాయము లేదనీ, తొలినాటి పరిశుద్ధమైన మతమందు గాఢభక్తికలిగి వారిజీవితములను పునీతములుగ జేసుకొనుట వారి ప్రథమ కర్తవ్యమనీ, ఇంగ్లీషువిద్యయు పాశ్చాత్య సంస్కృతియు దీనికి ప్రతిబంధకములనీ, వాటిమూలమున మతమందలి విశ్వాసము తగ్గి, వారు క్రైస్తవులుగమారే ప్రమాదము ఉన్నదని, అందుచేత వారు ఇంగ్లీషువిద్య నేర్చుకొనరాదని ఉలేమాలు ప్రబోధముగావించినారు. ఇదిగాక ముస్లింలు క్రైస్తవ ప్రభుత్వమునకు లోబడియుండుట వారిమతమునకు విరుద్ధమనీ, ఆలాటి ప్రభుత్వమును నిర్మూలించుటకు వారు ప్రయత్నించవలసినదనీ, అందులో వారు హిందువులతోకలసి కృషిచేయడం అవసరమనీ, ఆలాగు కలియడం ముస్లింమతానికి విరుద్ధంకాదనీ ఉద్ఘాటించారు.

తమబోధలకు సుస్థిరత్వాన్నికల్పించే ఉద్దేశంతో వీరిలో కొందరు దేవబందులో (Deoband) ఒక విద్యాలయాన్నిస్థాపించి, సంప్రదాయబద్ధమైన ముస్లింవిద్యను మాత్రమే విద్యార్థులకు బోధించి మతప్రచారకులను తయారు చేయసాగారు. ఇదిగాక వారు ఇతర ముస్లిం దేశాలలోని సంఘటనలపట్ల ఎక్కువ శ్రద్ధనువహించారు. 1875 తర్వాత పాశ్చాత్యుల దురాక్రమణ కార్యక్రమాల ఫలితంగా ఉత్తర ఆఫ్రికాలోను పశ్చిమ ఏషియాలోను మధ్య ఏషియాలోను ముస్లిందేశాలు అనేకం రషియా, బ్రిటన్, ఫ్రాంసు మొదలైన పాశ్చాత్యదేశాల పరిపాలనలోకి ప్రత్యక్షంగాను పరోక్షంగాను రావడము, ముస్లింరాజ్యాలన్నిటిలో నాలుగు వందల సంవత్సరాలుగా అగ్రస్థానాన్నివహించిన టర్కీ సామ్రాజ్యం విచ్ఛిత్తిగాంచడము వారికి ఎంతగానో విచారంకలిగించినది. పాశ్చాత్యుల

ప్రాబల్యాన్ని అరికట్టుటకు ముస్లిందేశాలలోనివారు ఒక "అఖిల ముస్లింల ఉద్యమాన్ని" (Pan-Islamic Movement) 1875 ప్రాంతాన లేవదీసినారు. వారితరపున 1880 ప్రాంతాన జమలాల్ డీన్ ఆఫ్గన్ అనేప్రముఖుడు భారతదేశానికివచ్చి పాశ్చాత్యులపై తిరుగుబాటుచేసి, ముస్లింల స్వాతంత్ర్యాన్ని రక్షించడం వారి కర్తవ్యమని ప్రబోధించి, బ్రిటిష్ వారికి అండగానిలబడి వారిఅభిమానాన్ని సంపాదించుటకు ప్రయత్నించుచున్న సయ్యద్ అహమ్మద్ ఖాన్ రాజకీయాలను పూర్తిగాఖండించాడు. దేవబందువిద్యాలయంవారు దీనిచేప్రభావితులై, మొదటి నుండి అహమ్మద్ ఖాన్ వైఖరిపట్ల విరోధభావాన్ని వహించినవారు కావడంచేత ఆఫ్గన్ ప్రబోధాల ఫలితంగా మరింతవిరోధులైనారు. అఖిలముస్లిం ఉద్యమాన్ని అహమ్మద్ ఖాన్ పూర్తిగా నిరసించి పాశ్చాత్యరాజ్యాల విధానాలను సమర్థించే వాడయ్యాడు. ఈకారణంచేత అతనికీ ఉలేమాలకూమధ్య ఏర్పడిన వైరుధ్యం మరింత తీవ్రరూపంధరించింది.

దేవబందు విద్యాలయాధికారులు కాంగ్రెసుపట్ల అభిమానంకలవారు. దానితో సహకరించవలసినదిగా వారు ముస్లింలను కోరారు. కాని ఎంతవరకు ఇది హృదయపూర్వకమైన సహకారమోచెప్పుట సాధ్యపడదు. ఉలేమాలందరు వహాబిఉద్యమంపట్ల సానుభూతికలవారు. ఈ ఉద్యమంయొక్క ఆశయం బ్రిటిష్ అధికారస్థానే భారతదేశంలో ముస్లింల అధికారాన్ని స్థాపించడమే. వారి తుదిలక్ష్యం ఇదికావడంచేత వారితో కాంగ్రెసుకుగాని హిందువులకుగాని పొత్తుకుదరడం సాధ్యంకానట్లే చెప్పవలసివస్తుంది. అయినా సయ్యద్ అహమ్మద్ ఖాన్ రాజకీయాలను ఖండించడంలో వారు గొప్ప పాత్రను వహించినారు.

దీనిని ఖండించిన ముస్లింలలో జాతీయ ముస్లింలు (Nationalist Muslims) ఇంకొకవర్గానికి చెందినవారు. వీరు ఇంగ్లీషు విద్యనభ్యసించి జాతీయతచే ప్రభావితులైనవారు. వీరు ఎక్కువగా బొంబాయి మద్రాసురాష్ట్రాలలో ఉండినారు. వీరు జాతీయప్రయోజనాలను సాధించుటకు హిందువులు ముస్లింలుకలిసి కృషిచేయడం విధ్యుక్తధర్మమని విశ్వసించినవారు. వీరిది రాజకీయాలలో లౌకిక దృక్పథం-రాకీయాలను మతంతో ముడిపెట్టడం వీరికి ఆమోదయోగ్యం కాలేదు. అందుచేతనే వీరు కాంగ్రెసులోచేరి హిందువులతోకలిసి కృషిచేయుటకు సిద్ధపడినారు.

ఈ వర్గానికిచెందినవారిలో బొంబాయి ప్రముఖుడైన బదరుద్దీన్ త్యాబ్జీ అగ్రస్థానాన్నివహించినవాడు. ఇతడు తెలాంగు, మెహతాలతోకలిసి 1885 లో బొంబాయిరాష్ట్ర సంఘాన్ని స్థాపించినాడు. 1887 లో మద్రాసులో జరిగిన మూడవ కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షుడై ముస్లింలు అధికసంఖ్యలో కాంగ్రెసులో చేరవలసిందిగా అర్థించాడు. జాతీయ ముస్లిందరు ఈ దృక్పథంతోనే వ్యవహరించినారు. వీరికి ముస్లింలలో ఎక్కువసంఖ్యాబలం లేకపోయినా అహమ్మద్ ఖాన్ లేవదీసినవేర్పాటు ఉద్యమాన్ని ప్రతిఘటించడంలో గొప్ప

పాత్రనువహించారు.

ఈలాగు ముస్లింలలో రెండువర్గాలవారు అహమ్మద్ ఖాన్ విధానాలను ఖండించినా ఇతరపరిస్థితులుకొన్ని అతనికి అనుకూలములై 1880 తర్వాత హిందూముస్లింలమధ్య ఉద్రిక్తత తీవ్రరూపంధరించేటట్లు చేశాయి.

వీటిలో మొదటిది రెండుమతాలవారిమధ్య గోవధనుగురించి బయలుదేరిన వాదోపవాదాలు. బ్రిటిష్‌పరిపాలన స్థాపితమగుటకు పూర్వం పంజాబులో శిక్కు పరిపాలకులు గోవధను పూర్తిగా నిషేధించినారు. కాని 1849 లో బ్రిటిష్ పరిపాలన స్థాపితమైనతర్వాత ఈ నిషేధం తొలగింపబడినది. ఇది ముస్లింలకు తృప్తికలిగించినా శిక్కులకు హిందువులకు ఆగ్రహకారణమైంది. ఆర్యసమాజము వివిధ రాష్ట్రాలలో నెలకొనిన తర్వాత ఆర్యసమాజికులు అనేక ప్రదేశాలలో గోరక్షణ సంఘాలను స్థాపించి, గోరక్షణకై అనేక కార్యక్రమాలను సాగించారు. కాని ఇది ముస్లింల ఆగ్రహానికి కారణమైంది. వ్యవసాయం దృష్ట్యా గోరక్షణ అవసరమని ముస్లింఉలేమాలు కొందరు ఉద్ఘాటించినా ముస్లిం ప్రజానీకం వారి అభిప్రాయాలను గౌరవించలేదు. ఈ విషయంలో రెండు మతాలవారు విభిన్న దృక్పథాలను అనుసరించడంచేత అనేక ప్రదేశాలలో వారి మధ్య కొట్లాటలు సంభవించసాగాయి. 1881లో ముల్తానులో సంభవించిన కొట్లాటలు, 1893లో ఉత్తరప్రదేశ్ లో సంభవించినవి. అటుతర్వాత మధ్యప్రదేశ్, బొంబాయి బీహారులో సంభవించినవి తీవ్రరూపం ధరించి ప్రాణనష్టానికి దారితీశాయి. పోలీసు అధికారులు వీటివిషయంలో జాగ్రత్తవహించి యుండినయెడల వీటి తీవ్రత తగ్గే అవకాశంఉండేది. కాని వారు వారివిద్యుక్తధర్మాన్ని నిర్వహించని కారణంగా ఆ తీవ్రత తగ్గలేదు. దీనిమూలంగా రెండు మతాలవారి మధ్య ఉద్రిక్తత పెరగ సాగింది.

వీరిమధ్య ఉద్రిక్తత పెరుగుటకు రెండవకారణం ఉర్దూ, హిందీభాషల గురించి ఉత్పన్నమైన వాదోపవాదాలు. బ్రిటిష్ పరిపాలన స్థాపించిన తర్వాత కూడా అంతకు పూర్వంఉన్నట్లే ఉర్దూభాష బీహారు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో అధికారభాషగా ఉంటూవచ్చింది. ఈ ప్రాంతాలలో ఇంగ్లీషుభాష వృద్ధికాని కారణంగా ఇది ఉర్దూభాష మాట్లాడే ముస్లింలకు ఎక్కువ లాభకారిగా ఉండినది. కాని కాలక్రమాన అధికారులు హిందీభాషను న్యాయస్థానాలలోను ఇతర అధికారస్థానాలలోను అధికారభాషగా ప్రవేశపెట్టినారు. ఇదిహిందీభాష మాట్లాడే వారి ఆందోళనమూలంగా జరిగినమార్పు కాదు. అధికారులు తమంతటతామే ఈ మార్పును చేశారు. దీని ఫలితంగా ముస్లింలు అనేకులు వారి ఉద్యోగాలను కోల్పోయ్యారు. హిందీకి వారు అలవాటుపడుటకు కొంతకాలం పట్టింది, ఈ మధ్యకాలంలో హిందీ మాట్లాడేవారు ఉద్యోగాలలో ప్రవేశించగలిగారు, ఈ పరిణామాలమూలంగా బీహారు, ఉత్తరప్రదేశ్ మొదలైన రాష్ట్రాలలో హిందువులు ముస్లింల మధ్య ఉద్రిక్త పరిస్థితులు ఏర్పడి రెండువర్గాల సత్సంబంధాలకు ప్రతిబంధకాలుగా పరిణమించాయి.

ఈ ఉద్రిక్తతకు ఇంకొక కారణం ఉత్సవాల సమయంలోను ఊరేగింపులలోను హిందువులు ఉపయోగించే మేళతాళములు, మసీదుల ఎదుట వీటిని ఉపయోగించడం ముస్లింలు ఆక్షేపించసాగారు. రహదారులలో వీటిని నిరభ్యంతరంగా ఉపయోగించడం తమ హక్కు అని హిందువులు సవాలు చేయసాగారు. ఒక్కొక్కప్పుడు దసరా ఉత్సవాలు మోహరం ఊరేగింపులు ఒకే సమయంలో జరిగేవి. అప్పుడు రెండు వర్గాలమధ్య ఈలాటి ఉద్రిక్తత మరింత తీవ్రరూపం ధరించేది. ఈ విషయంలో ఏలాటి రాజీప్రయత్నం ఫలప్రదం కాని కారణంగా ఉద్రిక్తత సమసిపొయ్యే అవకాశం లేకపోయింది.

ఈలాటి కారణాల ఫలితంగా రెండు వర్గాలమధ్య విభేదాలు బలపడి అహమ్మద్ ఖాన్ లేవదీసిన అలిఘర్ ఉద్యమమూ ద్విజాతి సిద్ధాంతమూ మరింత బలాన్ని సంపాదించగలిగాయి.

ఈ విధంగా రెండు మతాలవారిమధ్య విభేధాలు బలపడడం ప్రభుత్వానికి సంతోషదాయకమైనదని ప్రత్యేకంగా చెప్పవలసినదిలేదు. అనాదిగా రాజ్యాధికారాన్ని వహించినవారందరు "చీలించి పాలించు" అనే సూత్రాన్ని ఆధారం చేసుకొని భేదోపాయాన్ని అనుసరించేవారుగా ఉన్నారు. మొదటి నుండి భారత దేశంలో బ్రిటిష్ ప్రభుత్వం కూడా ఈ ఉపాయాన్ని అనుసరిస్తూ వచ్చింది. అధికారులందరు దీనిని సమర్థించారు. బ్రిటిష్‌ప్రభుత్వ సుస్థిరత్వానికి ఇది పటిష్ట సాధనమని భావించారు. 1880కి పూర్వం వారు చాలావరకు హిందువులను అభిమానిస్తూ వచ్చారు. ముస్లింలు తమకు గర్భశత్రువులని భావిస్తూ ఉండినారు. హిందువులు ఇంగ్లీషువిద్య నభ్యసించి రాజకీయ చైతన్యంకలవారై ప్రథమంలో రాష్ట్రాలకు మాత్రమే పరిమితమైన రాజకీయ సంఘాలను, 1885లో దేశానికంతా కాంగ్రెసు అనే పేరుతో ఒక కేంద్రసంఘాన్ని స్థాపించిన కారణాన అధికారులు ముస్లింలను చేరదీయసాగారు. ఆలాంటి సమయంలో సయ్యద్ అహమ్మద్ ఖాన్ ముస్లింరాజకీయాలలో ప్రవేశపెట్టిన మార్పు వారికెంతగానో సహాయపడినది. డఫరిన్ రాజప్రతినిధిగా ఉండిన కాలంలో ముస్లింలపట్ల పక్షపాతం పరిపాలన విధానానికి ఒక ప్రధాన లక్షణమైనది. కర్జన్ కాలంలో అది మరింత బలపడింది. మింటో ప్రభుత్వంలో అది సుస్పష్టమైనది. అది మొదలు బ్రిటిష్‌వారు వారి అధికారాన్ని వదలుకొని దేశానుండి 1947లో వెళ్ళిపొయ్యే వరకూ ఈ విధానాన్నే అనుసరించారు. ఇందులో ఆశ్చర్యపడవలసింది ఏదీలేదు.

ముస్లింల ప్రయోజనాల దృష్ట్యా అహమ్మద్ ఖాన్ అనుసరించిన రాజకీయ విధానం సమర్థనీయమనే చెప్పవలసి వస్తుంది. 1857-58 తిరుగుబాటు ఫలితంగా వారి స్థితి చాలా దిగజారి పోయింది. అన్ని రంగాలలో వారు వెనుకబడినవారయ్యారు. వారి స్థితిని చక్కబెట్టుటకు ప్రభుత్వ సహాయం అవసరమైంది. ఆలాటి సహాయం లేక వారికి విముక్తి లభించడం సాధ్యం కాదని అహమ్మద్ ఖాన్ గ్రహించి, ఆసహాయాన్ని సంపాదించుటకు సర్వవిధాలా కృషి చేశాడు. ఈ విధంగా అతడు ముస్లింలకు మహోపకారం చేసిన వాడయ్యాడు. ఆ కారణం

చేతనే అతడు ఆధునిక యుగంలోని ముస్లిం నాయకులలో అగ్రస్థానాన్ని వహించాడు.

## 3

ఒక రాజకీయాలద్వారా మాత్రమే అహమ్మద్ ఖాన్ ముస్లింలను ఉద్ధరించిన వాడు కాడు. అతడు మత రంగంలోను విద్యారంగంలోను ఘనమైన కృషిని గావించి వారి పునరుద్ధరణకు పునర్వికాసానికి ఎంతగానో తోడ్పడ్డాడు. 1868లో అతడు బ్రిటన్‌కు వెళ్లి అక్కడి ప్రజల ఉన్నతమైన సంస్కృతిచే ప్రభావితుడైనాడు. ఆదేశంలో ఆధునిక విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానం వృద్ధిగాంచడం చేతనే ప్రజలు సర్వ విధాలా అభివృద్ధి పొందడాన్ని అతడు గుర్తించి, అలాంటి పరిజ్ఞానాన్ని ముస్లింలకు అందజేయడంలో గొప్ప విజయాన్ని సాధించినాడు. ఈ విధంగా కూడా అతడు ముస్లింలకు మహోపకారం చేసినవాడయ్యాడు.

ఇస్లాం మతంలో అనేక మూఢనమ్మకాలు దురాచారాలు ప్రవేశించినట్లు అతడు గ్రహించాడు. అందుచేతనే క్రైస్తవ మత ప్రచారకులు దానిని ఖండించడం జరుగుతున్నదని భావించాడు. వారి ఖండనను ఎదుర్కొనవలసిన అవసరం ఏర్పడినట్లు అతడు విశ్వసించి, దానిని ఎదుర్కొనని పక్షంలో ముస్లింలు క్రైస్తవులుగా మారే ప్రమాదం ఉన్నట్లు అతడు భయపడి, ముస్లిం మతాన్ని సంస్కరించుటకు పూనుకొన్నాడు. ఈ సంస్కరణోద్యమంలో అతడు కొరాన్ గ్రంథం ఒక్కటే ముస్లింలు అనుసరించవలసిన పవిత్ర గ్రంథమని, తక్కిన గ్రంథాలు అలాంటివి కావని, వాటిని హేతువాద సహాయాన విమర్శించి, ఏది ఆవాదానికి నిలబడగలదో దానిని మాత్రమే అనుసరించదగినదిగాను, తక్కిన భాగాలను విసర్జించుటలో ఏలాటి పాపమూ లేదని నిరూపించినాడు. హేతుబద్ధమైన ఈలాటి విమర్శ ద్వారా అతడు మతాచారాలలోను సిద్ధాంతాలలోను అనేక సంస్కరణలను ప్రవేశపెట్టుటకు ప్రయత్నించాడు. ఉలేమాలు అతనితో ఏకీభవించిన వారుకారు. వారి ప్రతిఘటనను అతడు పూర్తిగా ఎదుర్కొనలేక పోయినా కొంతవరకు మత సంస్కరణలో విజయాన్ని సాధించాడు.

విద్యారంగంలో అతడు ఇంతకంటె గొప్పవిజయాన్ని సాధించాడు. ఉలేమాలు ఇంగ్లీషు విద్యపట్ల ద్వేషాన్ని వహించి, ముస్లింలు దానిని నేర్చుకొనరాదని ప్రచారం చేశారు. అందుచేతనే వారు విద్యారంగంలో హిందువుల కంటె చాలా వెనుకబడినవారయ్యారు. దీనిఫలితంగా వారు ఆధునిక విజ్ఞానంతో పరిచయం లేనివారు కావడమేగాక, ప్రభుత్వోద్యోగాలను సంపాదించలేక పోయ్యారు. ఈ పరిస్థితులను గమనించి అతడు ముస్లింలు ఇంగ్లీషు విద్యను నేర్చుకొనవలసినదిగా ప్రచారం చేసి, అందుకుగాను విద్యాలయాలను స్థాపించి ఇతర కార్యక్రమాలను కూడా సాగించాడు. మత బోధ, నీత బోధలకు ప్రాధాన్యము కల్పించని విద్య వాస్తవమైన విద్య కాజాలదని, ప్రభుత్వం స్థాపించిన విశ్వవిద్యాలయాలద్వారా యువకులు నేర్చుకొనే విద్య ఈ కారణంచేత లోప

భూయిష్టంగా ఉన్నదని అతడు తాను స్థాపించిన విద్యాలయాలన్నిటిలో ఆధునిక విజ్ఞానశాస్త్రంతోపాటు మతబోధకు నీతిబోధకు ప్రాధాన్యం కల్పించినాడు. అందుచేత అతని విద్యా విధానం సంప్రదాయబద్ధులకు కూడా ఆమోదయోగ్యమైంది. అదేవిధంగా అతడు అరబ్బీ, పారసీక, ఉర్దూ భాషలకు ఇంగ్లీషుభాషతో సమానమైన ప్రాధాన్యాన్ని కల్పించాడు. ఇదికూడా సంప్రదాయ బద్ధులకు ఆమోదయోగ్యమైంది. పాశ్చాత్య విజ్ఞానం విద్యార్థుల అందుబాటులోకి వచ్చుటకు వీలుగా అతడు విజ్ఞాన శాస్త్రగ్రంథాలను ఇతరగ్రంథాలను ఉర్దూభాషలోకి తర్జుమా చేయించాడు. ఇదికూడా ముస్లింల విద్యాభివృద్ధికి ఎంతగానో తోడ్పడింది.

అతడు స్థాపించిన విద్యాలయములన్నిటిలో అలీఘర్‌లోని కళాశాల అగ్రస్థానాన్ని వహించింది. బ్రిటన్‌లో ఆక్సఫర్డు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయముల వంటిదిగా ఈ కళాశాలను రూపొందించుటకు అతడు గొప్ప ప్రయత్నం చేసి, చాలావరకు విజయాన్ని సాధించాడు. దీని పోషణార్థం అతడు ముస్లింలనుండి క్రైస్తవులనుండి ప్రభుత్వాననుండి విరాళాలను స్వీకరించాడు గాని హిందువుల వద్దనుండి స్వీకరించలేదు. అతడు ద్విజాతి సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవాడు కావడమే దీనికి కారణం. ఈ కళాశాలకు అతడు బ్రిటిష్ విద్యావేత్త బెక్ అనే వానిని ప్రథమంలోను, అటుతర్వాత మారిసన్ అనే వానిని ప్రధాన అధ్యాపకులు (Principals)గా నియమించాడు. వీరు విద్యార్థులను ప్రభుభక్తి పరాయణులుగను, హిందువుల పట్ల వేర్పాటు ధోరణిని అనుసరించేవారుగను రూపొందించడంలో గొప్ప పాత్రను వహించారు. అహమ్మద్ ఖాన్ రాజకీయాలకు ఈ కళాశాల ఇందులో వీరిద్దరి అధ్యాపకత్వం ఒక గొప్పసాధనమైనాయి.

ముస్లింల విద్యాభివృద్ధికై అహమ్మద్ ఖాన్ మహమ్మదీయ విద్యా సమావేశాన్ని ఏర్పాటుచేశాడు. ఈ సమావేశం ఏటేట ఒక ప్రధాన నగరంలో జరగటంచేత దేశమందంతటా ముస్లింల విద్య ఒకేవిధంగా రూపొందడంలో గొప్పపాత్రను వహించింది.

పై విధంగా అహమ్మద్ ఖాన్ ముస్లింల నవజీవిత నిర్మాతగా అనేక రంగాలలో కృషిసాగించి, తానుతలపెట్టిన ఆశయాలు సిద్ధించుటలో కృతార్థుడై 1898 లో మరణించాడు, భారతదేశంలోని ముస్లింల చరిత్రలో అతడు శాశ్వత స్థానాన్ని సంపాదించినాడు.

చదవదగిన గ్రంథాలు

Bhavan Vol X

Tarachand Vol II and III

# అధ్యాయము - 11

## జాతీయవాదులు

### 1

దేశంలో వాస్తవంగా 1905 నుండి మాత్రమే స్వాతంత్ర్యోద్యమం బయలుదేరింది. 1858 మొదలు 1885 వరకు రాష్ట్రాలలోని రాజకీయ సంఘాలు, 1885 తర్వాత అఖిల భారత జాతీయ కాంగ్రెసు రాజకీయ రంగంలో ఘనమైన కృషి చేసినా, వాటి లక్ష్యం స్వాతంత్ర్య సంపాదనము కాదు. ఇంతేగాక బ్రిటిష్ ప్రభుత్వం శాశ్వతంగాను సుస్థిరంగాను వర్ధిల్లవలెననీ, అప్పుడుగాని దేశం పురోగమించడం సాధ్యంకాదనీ, బ్రిటిష్ పరిపాలన స్థాపింపబడిన కారణంగానే 18వ శతాబ్దంలో ఏర్పడిన అరాజక పరిస్థితులు, అంతర్యుద్ధాలు, విదేశీయుల దండయాత్రల ప్రమాదం తొలగి, ప్రజలు శాంతి భద్రతలు కలవారై నెమ్మదిగా జీవితాన్ని సాగించే వారయ్యారనీ, బ్రిటిష్ సంస్కృతి మూలంగా భారతీయులు నేర్చుకొనవలసిన విషయాలు ఎన్నో ఉన్నవనీ, వాటిని నేర్చుకొనిన తర్వాతనే వారు స్వాతంత్ర్యాన్ని అనుభవించుటకు అర్హులు కాగలరని కాంగ్రెసును నడిపిన వారు విశ్వసించారు. అందుచేత వారు ప్రభుత్వాన నుండి కొన్ని సంస్కరణలను మాత్రమే కోరినారు. స్వరాజ్యం గాని, స్వాతంత్ర్యం గాని, వారి లక్ష్యంకాదు. ఇది వాంఛనీయం కాదని, సాధ్యంకాదని వారు భావించారు.

ఇందులోకూడా వారు చెప్పుకోతగ్గ ఫలితాలను సాధించలేకపొయ్యారు. ప్రభుత్వం కాంగ్రెసువారు చేసిన తీర్మానాలను లెక్కలోకి తీసుకొనక పోవడమే కాక, వారు అల్పసంఖ్యాకులని, కోటానుకోట్ల సామాన్య ప్రజల తరఫున ప్రతినిధులుగా మాట్లాడుటకు అధికారంలేని వారనీ, వారిని తూలనాడడం, హేళన చేయడం ప్రభుత్వానికి పరిపాటి అయింది. అప్పటికికూడా కాంగ్రెసువారు వారి ఆశయాలలోను, ఆశయాల సిద్ధికై అనుసరించే కార్యక్రమాలలోను ఎలాటి మార్పులను చేసుకొనుటకు సాహసించలేదు. సమావేశాలలో తీర్మానాలు చేసి, ప్రభుభక్తిని ప్రదర్శించి, ప్రార్థనలను గావించి, వినతి పత్రాలను సమర్పించిన పక్షాన ఎన్నటికైనా బ్రిటిష్‌వారు భారతదేశం పట్ల సానుభూతికలవారై, తమ వాంఛలను మన్నించి, ప్రజలకు న్యాయం చేకూర్చగలరనే మూఢనమ్మకంతో ప్రవర్తించారు.

ఈ వైఖరి కాంగ్రెసులోను కాంగ్రెసు బయటను విద్యాధికులనేకుల అసంతృప్తికి కారణమైనది. 1895 నాటికి వీరు ఈ అసంతృప్తిని వ్యక్తపరచ

సాగారు. వీరిలో యువకతరానికిచెందిన వారనేకులుండిరి. వీరందరూకలిసి క్రమ క్రమంగా ఒక జాతీయవాదవర్గంగా ఏర్పడినారు. మితవాదులూ ప్రభుత్వమూ వీరిని అతివాదులుగా పేర్కొనడం మామూలైంది. స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రారంభించినవారు వీరే.

1905 నాటికి వీరికి మహారాష్ట్రంలో బాలగంగాధరతిలక్ (1856-1920), బెంగాలులో అరవిందఘోష్ (1872-1950), బిపిన్‌చంద్రపాల్ (1858-1932), పంజాబులో లాలా లజపత్‌రాయ్ (1865-1928) నాయకులయ్యారు. జాతీయ వాదులైన వీరు ఒక ప్రత్యేక జాతీయతత్వాన్ని, దానిని ఆచరణసాధ్యం చేయుటకు ఒక విశిష్టమైన కార్యక్రమాన్ని రూపొందించినారు. దీని ననుసరించి 1905 మొదలు 1911 వరకు బెంగాలులో అతి తీవ్రంగాను, తక్కిన రాష్ట్రాలలో కొంత తక్కువ స్థాయిలోను రాజకీయోద్యమం సాగింది. 1905లో రాజ ప్రతినిధి కర్జన్ (1898-1905) బెంగాలులోని ప్రజలు సభలు సమావేశాలు మూలంగాను, వినతిపత్రాల మూలంగాను వ్యక్తంచేసిన అభిప్రాయానికి విరుద్ధంగా బెంగాలు రాష్ట్రాన్ని రెండు వేర్వేరు రాష్ట్రాలుగా విభజనచేశాడు. ఇది తమ జాతీయతకు సమైక్యతకు గొడ్డలిదెబ్బవంటిదని బెంగాలీలు భావించి, దానిని రద్దు పరచుటకు ఒక గొప్ప ఉద్యమాన్ని సాగించారు. ఈ ఉద్యమమే త్వరిత కాలంలో స్వరాజోద్యమంగా రూపొందింది. దీనికి జాతీయవాదులు ప్రతిపాదించిన తత్వమూ కార్యక్రమ విధానమూ ఆధారములైనవి. వాటిని అనుసరించే వారు ఉద్యమాన్ని నడిపారు. ఇది స్వాతంత్ర్యోద్యమంలో మొదటి మెట్టుగా ప్రఖ్యాతిగాంచింది.

దీనికి "వందేమాతర" ఉద్యమం అనే నామాంతరం లభించింది. ఇది ప్రారంభమైనదిమొదలు బంకించంద్రమహాకవి రచించిన "వందేమాతర" గేయం దేశవ్యాప్తంగా ప్రజల ఆదరణకు పాత్రమైంది. దేశంలో జరిగే సభలు సమావేశాలు వందేమాతర గీతంతో ప్రారంభం కావడం సంప్రదాయంగా ఏర్పడింది. ఉత్సవాలలోను ఊరేగింపులలోను "వందేమాతరం" అనే నినాదం ఒక మంత్రంగా మారుమోగసాగింది. వందేమాతరం అని లిఖించిన పతకాలను ధరించడం పరిపాటి అయింది. వందేమాతరం అనే మాటలతో ఒకరినొకరు నమస్కరించుకొనే అలవాటు ఏర్పడింది. దేశమందంతట వందేమాతర వాతావరణం వ్యాప్తిగాంచింది. పరాయి ప్రభుత్వం దీనిని సహించలేక వందేమాతరం అనే మాటను బహిరంగంగా పలకడాన్ని ఒక నేరంగా పరిగణించి, దానిని నిషేధించింది, అయినా ప్రజలు దానిని మానుకొనలేదు. దానిపట్ల మరింత పట్టుదలగల వారయ్యారు. ఈ పట్టుదలతోనేవారు 1905 మొదలు 1911 వరకు ఉద్యమాన్ని సాగించారు. ప్రభుత్వం ప్రజలపై ఉద్యమం వహించిన ప్రభావాన్ని గుర్తించి 1911 డిసంబరులో బెంగాలు రాష్ట్ర విభజనను రద్దుచేసింది.

ప్రజలు పరాయి ప్రభుత్వాన్ని ప్రతిఘటించి సంపాదించిన తొలి మహా విజయం ఇదే.

## 2

ఈ ప్రతిఘటనకూ, విజయానికీ ఆధారమైన జాతీయవాదులతత్వం, దానిని ఆచరణ సాధ్యం చేయడానికి వారు రూపొందించిన కార్యక్రమం ఎలాటివో తెలుసుకోనడం అవసరం.

వీరి తత్వానికి మూడు ప్రధాన లక్షణాలు ఉన్నట్లు చెప్పవచ్చు. వీరు "జాతీయత" అంటే పరిశుద్ధమైన "భారతీయత" అని వ్యాఖ్యానించారు. అనాదిగా దేశంలో ఉత్తమమైన ఒక సంస్కృతి ఏర్పడి ఉన్నది. మతం అందులో ఒకభాగం. దేశంలో ఎన్ని మార్పులు జరిగినా, పరాయివారు ఎందరో దేశంపై దండెత్తి వచ్చి, దానిని జయించి వశపరచుకొన్నా ఈ సంస్కృతి చెక్కుచెదరకుండా సుస్థిరంగా నిలబడిఉన్నది. ప్రాచీనకాలంలో భారతీయులవలెనే గ్రీకులు, రోమనులు, ఈజిప్టు దేశస్థులు, బాబిలోనియన్లు, పారశీకులు మొదలైనవారు అత్యుత్తమములైన సంస్కృతులను రూపొందించినా అవి కాలగర్భంలో అణగిపోయినాయి. భారతీయ సంస్కృతి అలాగుకాక ప్రాచీనకాలంలో మధ్య ఏషియా, చైనా, జపాన్, ఆగ్నేయ ఏషియా మొదలైన దేశాలపై ఎంతో ప్రభావాన్ని వహించి, బహుళ వ్యాప్తిగాంచి, ఇప్పటికి కూడా సజీవంగా ఉన్నది. దాని ఉత్కృష్టత, ప్రజలకు దాని పట్లగల శ్రద్ధాభక్తులు దీని స్థిరత్వానికి ప్రధాన కారణాలు. ఈ శ్రద్ధాభక్తులు ఏనాటికీ తగ్గకూడదు. దీనికి అనుగుణంగా జీవితాన్ని సాగించడమే "భారతీయత". "జాతీయత", "జాతీయాభిమానం" అంటే "భారతీయత" పట్ల అభిమానం. ఒక రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించడం మాత్రమే "జాతీయత" కాదు మత, సాంఘిక, ఆర్థిక, విద్యా, వైజ్ఞానిక రంగాలన్నిటిలో "భారతీయతను" నిలబెట్టుటయే వాస్తవమైన జాతీయత భారత సంస్కృతి మూలంగా పాశ్చాత్యులుకూడా ఈనాడు నేర్చుకొనవలసిన విషయాలు ఎన్నో ఉన్నవని వివేకానందుడు అమెరికాలోను యూరపులోను చేసిన పర్యటనల స్పష్టం చేశాయి. ఆసంస్కృతిని ఉద్ధరించవలసిందిగా అతడు బోధించాడు. అతి మొదటి జాతీయవాది. తక్కిన వారంతా అతనిచే ప్రభావితులైనారు. తన ఉ న్యాసాల మూలంగాను జీవితం మూలంగాను అతడు ఏ విధంగా ప్రజలలో దేశ భిమానాన్ని ప్రోత్సహించాడో ఇదివరకే తెలుసుకొన్నాము. జాతీయవాదుల జాతీయతకు అతడు కల్పించిన విశాలార్థాన్ని బలపరచారు.

ఈ సందర్భంలో ఇంగ్లీషు విద్యాధికులను వారు తీవ్రంగా విమర్శించార జాతీయవాదులనే పేరుతో కాంగ్రెసును స్థాపించిన విద్యాధికులు వాస్తవమై జాతీయవాదులు కారని వారు ఉద్ఘాటించారు. వీరు ఇంగ్లీషు విద్యచేత పాశ్చాత్య సంస్కృతి చేతను ప్రభావితులై వేషము, భాష, ఆహారము, విహ రము, ఆటలు, పాటలు మొదలైన వాటిలో పూర్తిగా బ్రిటిషు వారిని అను రించే వారయ్యారు. వీరు రాజకీయ రంగంలోనేగాక, అన్నిరంగాలలో పరాయి వారికి దాస్యంచేసే వారుగా రూపొందినారు. భారతీయుల జీవిత విధానంలో

గుణదోషాలను నిర్ణయించడంలో వీరికి బ్రిటిష్‌వారి సంప్రదాయాలు అలవాటులు గీటురాయిగా ఏర్పడినాయి. వీరు దేశానికి నాయకులై ప్రజల మతాన్ని సాంఘిక ఆచారాలను, విద్యావిధానాన్ని, సంప్రదాయాలను పూర్తిగా మార్చి, బ్రిటిష్‌వారి మోస్తరుగా జీవితాన్ని గడపవలసిందిగా ప్రోత్సహిస్తున్నారు. ఇది ప్రజలను పెడత్రోవలో పెట్టడమే. మన జీవిత విధానంలో దోషాలు ఉండవచ్చు; కాని వాటిని నిర్మూలించడంలో మనం మనపూర్వులు రూపొందించిన తత్వాన్ని ధర్మాన్ని విడనాడక, వాటిని ఆధారం చేసుకొని దోషాలను నిర్మూలించుకొనడం ప్రాజ్ఞతకుగాని పరాయివారిని అనుకరించడం ఉచితంకాదు. ఈ విధంగా జాతీయవాదులు బ్రిటిష్‌సంస్కృతిపట్ల వ్యామోహితులైన మితవాదులను విమర్శించి, జాతీయతకు భారతీయత అనే విశాలార్థాన్ని కల్పించి ప్రజలను వారి సంస్కృతిపట్లనూ బ్రిటిష్ పరిపాలనపట్లనూ విముఖులయ్యేటట్లు మార్చగలిగారు.

దీనితోపాటు జాతీయవాదులు- వారిలో ప్రధానంగా అరవిందుడు- జాతీయత ఒక లౌకికత్వం మాత్రమేకాదనీ, అది ఒక ఆధ్యాత్మికత్వమనీ, మతంపట్ల మానవులకు ఎలాటి భక్తి శ్రద్ధలున్నవో అలాటి భక్తిశ్రద్ధలు జాతీయత పట్ల భారతీయులకు ఏర్పడడం అవసరమని ఉద్ఘాటించాడు. మతానికి ఒక ఆరాధ్య దేవత ఉండడం మౌలిక లక్షణం. జాతీయత అనే మతానికి దేశమాత ఆరాధ్య దేవత అని అతడు ప్రతిపాదించాడు. భారతీయులు సాధారణంగా దుర్గ, కాళి, భవాని, కామాక్షీ, మీనాక్షి మొదలైన దేవతలను ఆరాధించేవారు. సర్వస్వమూ ఈ దేవతలకు అర్పించడానికి అలవాటుపడిన వారు, ఈ దేవతలందరూ భారత మాత అవతారాలనిన్నీ, వీరిని ఆరాధించినట్లే సర్వస్వమూ అర్పించి భారత మాతను ఆరాధించడం ఆధునిక యుగంలోని భారతీయుల కర్తవ్యమనీ, వారికి ఇదే తరుణోపాయమనీ అరవిందుడు బోధించాడు. అందువలననే వందేమాతర గీతం ఒక మంత్రంగా ప్రజల ఆదరణకు పాత్రమైంది. భారతమాత చిత్రపటం అందరి ఇండ్లను అలంకరించసాగింది. భగవన్నామ స్మరణ చేసినట్లు భారతమాత నామస్మరణ చేయుటకు ప్రజలు అలవాటుపడినారు.

బిపిన్ చంద్రపాల్ కూడా జాతీయతకు ఆధ్యాత్మికతత్వపరంగా అర్థం చెప్పాడు. స్వరాజ్యం అనేమాట వేదాలలో కనిపిస్తున్నదని, పరాయివారు విధించిన నిర్బంధాలకు లోబడక, స్వయంగా తాను విధించుకొన్న నిర్బంధాలకు లోబడడమే స్వరాజ్యమని, మానవులందరు భగవత్స్వరూపులని ప్రతిపాదించే వేదాంతతత్వం భారతీయులందరు ఒకే సమిష్టి కుటుంబానికి చెందినవారనే అర్థాన్ని స్ఫురింపచేస్తూ ఉన్నదని, "స్వేచ్ఛ", "స్వరాజ్యం" "జాతీయత" అనే మాటలను, వాటిలో ఇమిడిఉండే భావాలను మనం పాశ్చాత్యులనుండి ఎరువు తీసుకొనవలసిన అవసరం లేదని పాల్ వ్యాఖ్యానించాడు. సనాతన ధర్మాన్ని కాలానుగుణంగా అర్థంచేసుకొనవలసి ఉన్నదనీ, ఆధునిక యుగంలో దేశంలో ఏర్పడిన పరిస్థితులు కారణంగా దానిని "జాతీయత"కు, "దేశ స్వాతంత్ర్యానికి" అన్వయించేటట్లు అర్థం చేసుకొనవలసి ఉన్నదని నిరూపించాడు.

తిలక్ కూడా ఈలాటి భావంతోనే భారతీయుల జీవితమంతా మతంతో ముడిపడి ఉన్నదనీ, జాతీయతకు మతపరమైన అర్థాన్ని కల్పించినప్పుడే అది వారికి ఆకర్షణీయం కాగలదని, గణపతి ఉత్సవాలను ప్రజలలో జాతీయాభిమానం వృద్ధి గాంచుటకు ఒక గొప్ప సాధనంగా వినియోగించాడు. ఆర్యసమాజ మతాన్ని బోధించిన దయానందునికి అనుచరుడైన లజపత్‌రాయ్ జాతీయతకు హిందూ మతపరంగా అర్థం చెప్పాడు. ఆర్యమత, ఆర్య సంస్కృతుల పునరుద్ధరణమే జాతీయత అన్నాడు.

జాతీయవాదులు రూపొందించిన తత్వానికి మూడవలక్షణం భారతీయులు వాంఛించతగింది స్వరాజ్యం. ఇదే సంపూర్ణ స్వాతంత్ర్యం. కాంగ్రెసు ఈలాటి లక్ష్యాన్ని మాని ఏవో కొన్ని సంస్కరణలను కోరడాన్ని వారు తీవ్రంగా ఆక్షేపించారు. ప్రతి దేశాన్ని ఆ దేశంలోనివారు పాలించుకొనడం ప్రకృతి సిద్ధమైన హక్కు అనిన్నీ, దానికి వారు అర్హులాకారా అనే ప్రశ్న లేనే లేదనిన్నీ, అర్హతను సంపాదించేవరకు వారు వేచి యుండడం అవసరమనే మితవాదుల అభిప్రాయం సందర్భరహితమని వారు ప్రచారం చేశారు. ఈ భావాన్నే తిలక్ "స్వరాజ్యం నా జన్మహక్కు, దానిని ఏలాగైనా నేను సంపాదించి తీరుతాను" అనే నినాదం ద్వారా వ్యక్తం చేశాడు. లోపాలులేని దేశం ఎక్కడా ఉండదనీ, స్వాతంత్ర్యాన్ని అనుభవించే దేశాలలో కూడా ఎన్నో లోపాలు ఉన్నవని వారు నిరూపించారు. ఇంతకూ బ్రిటిష్ పరిపాలన మూలంగానే భారతీయులలోని లోపాలు అదృశ్యం కాగలవనే మితవాదుల ప్రచారం ఉపయోగ రహితమనీ, అవి స్వాతంత్ర్యం లభించి జాతీయప్రభుత్వం ఏర్పడినతర్వాతనే అదృశ్యం కాగలవనీ వారు ఉద్ఘాటించారు. మితవాదులు చెప్పినట్లు బ్రిటిష్ పరిపాలన మూలంగా దేశంలో శాంతిభద్రతలు వ్యాపించిన మాట వాస్తవమేగాని అది శ్మశానవాటికలోని కాంతివంటిదనీ, వారి పరిపాలన మూలంగా దారిద్ర్యం పెరిగి ప్రజలు జీవచ్ఛవాలైనారనీ, అది మరి కొంతకాలం సాగిన పక్షాన వారు ఏలాటి ఆశయాలు లేనివారై ప్రవర్తించడం తప్పదనే అభిప్రాయాన్ని వారు వ్యక్తం చేశారు. ఈ పరిస్థితులలో పరాయి పరిపాలన వెంటనే తొలగవలసిందిగా వారు వాంఛించారు.

ఇంతటి మహత్తరమైన లక్ష్యాన్ని సాధించుటకు వినియోగించదగిన సాధనాల గురించి కూడా జాతీయవాదులు పూర్తిగా ఆలోచించి, ఒక పథకాన్ని రూపొందించినారు. అందులోని ప్రధానాంశాలను తెలుసుకొనడం అవసరం. సాధనాల విషయంలో కూడా జాతీయవాదులు మితవాదులతో అంగీకరించినవారు కారు.

లక్ష్యసాధనకు భారతీయులు బ్రిటిష్‌వారిపై ఎంతమాత్రము ఆధారపడరాదనిన్ని, వారు స్వయంశక్తిపై ఆధారపడవలెననిన్ని, అందుకుగాను వారు సమస్త త్యాగాలు చేయుటకు సిద్ధపడవలెననిన్ని అవసరమైతే ప్రాణాలనుకూడ దేశమాత విముక్తికై అర్పించుటకు సిద్ధపడవలెననిన్ని ఉద్ఘాటించారు. మితవాదులు ఈ

సత్యాన్ని గ్రహించక, సంస్కరణలకు కూడా బ్రిటిష్‌వారిపై ఆధారపడడం, స్తుతివాక్యాలు, ప్రశంసలు, ప్రార్థనలు, వినతి పత్రాలు మొదలైనవాటి మూలంగా బ్రిటిష్‌వారు భారతదేశానికి న్యాయం చేస్తారని అనుకొనడం వట్టి భ్రమ అని జాతీయవాదులు మితవాదులవిధానాలను పూర్తిగా ఖండించారు. ఈలాటి విధానాలను అనుసరించడంచేత మితవాదులు కాంగ్రెసును ఒక భిక్షాటకుల సంఘంగా మార్చినారు; ఇది భారతీయుల గౌరవానికి తగినట్టిది కాదు. ఇది పరువుమర్యాదలు లేనివారు చేయవలసినట్టిది గాని, అత్యుత్తమమైన సంస్కృతిగల భారతీయులు చేయదగినట్టిదికాదని లజపతిరాయ్ అరవిందుడు మితవాదులను విమర్శించారు. ఈ విధానం "మంత్రాలకు మామిడికాయలు రాలుతుంది" అని అనుకొనడంవంటిది అని అన్నారు.

భారతీయులు వాంఛించే ప్రయోజనాలన్నీ బ్రిటిష్‌వారికి నష్టం కలిగించేవి, శాసనసభలలో భారతీయులకు ప్రాతినిధ్యం కల్పించడం, ఉన్నతోద్యోగాలలో బ్రిటిష్‌వారితో సమానంగా ప్రవేశాన్ని కల్పించడం, సైనిక ఖర్చులను తగ్గించడం, బ్రిటిష్ సరుకులపై సుంకాలనువిధించడం మొదలైనవి. బ్రిటిష్‌వారి అధికారానికి, పదవులకు, వర్తకలాభాలకు నష్టంకలిగించేవి. వారు భారతదేశానికి లాభాలను సంపాదించే ఉద్దేశంతో వచ్చారు. ఆ ఉద్దేశంతోనే సామ్రాజ్యాన్ని స్థాపించారు. అలాటి వారు ప్రార్థనలకు వినతిపత్రాలకు లొంగి కాంగ్రెసు కోరికలను చెల్లించడం కల్ల. ఇది తన్నుమాలిన ధర్మంవంటిది, అలాటిధర్మానికి ఐచ్ఛికంగా ఎవరూ అంగీకరించరు. అందరిలోను స్వార్థం ఉండడం నైజం, ఏ దేశంలోగాని ఏ కాలంలోగాని సామ్రాజ్యాధికారాన్ని వహించినవారు ఐచ్ఛికంగా వారి అధికారాన్ని వదలుకొనడం కనీవినీ ఎరుగనట్టిది. అలాటివారు ఏదోవిధమైన ఒత్తిడికి లొంగుతారేగాని స్తుతివాక్యాలకు లొంగరు, ఒత్తిడి చేయదలచినవారు కష్టాలను బాధలను అనుభవించుటకు సంసిద్ధులుగా ఉండడం తప్పదు. ఆత్మగౌరవం, ఆత్మశక్తి, ఆత్మత్యాగం ఆధారాలుగా చేసుకొని జాతీయవాదులు బ్రిటిష్‌వారితో పోరాటాన్ని సాగించుటకు నిర్ణయించుకొన్నారు. వారి కార్యక్రమంలోని మొదటి విశేషం ఇదే.

ఈలాటిపోరాటంలో విజయాన్ని సాధించుటకు సామాన్యప్రజల సహకారం ఎంతైనా అవసరమనీ, దానిని సంపాదించుటకు సమస్త ప్రయత్నాలను చేయుటకు జాతీయవాదులు నిర్ణయించుకొన్నారు. ఇంతవరకు కాంగ్రెసు ఆలాటి ప్రయత్నం చేయకపోవడం చేతనే దాని ఆశయాలు ఫలప్రదం కాలేదని వారు మితవాదులను విమర్శించారు. 1887లో హ్యూం సామాన్య ప్రజలను కాంగ్రెసులోకి ఆకర్షించడానికి గొప్ప ప్రయత్నం చేశాడు. కాని ప్రభుత్వం దానిని గర్హించడం చేత కాంగ్రెసువారు భయపడి దానిని మానుకొన్నారు. ఇంతేగాక సామాన్య ప్రజలు అజ్ఞానులనీ, రాజకీయాలను అర్థం చేసుకొనలేనివారనీ, ప్రభుత్వాన్ని విమర్శించే ప్రసంగాలను వారు వినినపక్షాన వారు పరిపాలనపట్ల అసంతృప్తిగాంచి ఆవేశపూరితులై తిరుగుబాటుచేసే ప్రమాదం ఉన్న

దనీ, అది శాంతియుతమైనట్టిన్నీ చట్టబద్ధమైనట్టిన్నీ ఆందోళన జరపదలచిన కాంగ్రెసువిధానాలకు పరమవిరుద్ధమైనదనీ భావించి సామాన్యప్రజలను అందులోకి ఆకర్షించడం మానుకొన్నారు. ప్రభుత్వం కాంగ్రెసులోని స్వల్పసంఖ్యాకులైన విద్యాధికులు ప్రజల తరఫున మాటలాడుటకు అర్హులుకారని విమర్శించినతర్వాత కూడా వారు సామాన్య ప్రజలను తమ ఉద్యమంలోకి ఆకర్షించడానికి ప్రయత్నం చేయలేదు. జాతీయవాదులు ఈ వైఖరిని పూర్తిగా ఖండించినారు. సామాన్యప్రజలు సభ్యులుకాని కాంగ్రెసు జాతీయసంస్థ అనే పేరునకు తగినది కాదని, ప్రజలు దానిలో చేరకపోవడంచేతనే ప్రభుత్వం దాని తీర్మానాలపట్ల నిర్లక్ష్య వైఖరిని వహించినదనీ భావించి, తాము తలపెట్టిన స్వరాజ్యసాధనకు ప్రజల సహకారం అత్యవసరమని భావించి, వారిని తమ ఉద్యమంలోకి ఆకర్షించుటకు గొప్ప ప్రయత్నం చేశారు.

ఈ ప్రయత్నం కొనసాగుటకు వారు మతాన్ని ఒక సాధనంగా ఉపయోగించారు. సామాన్యప్రజలకు మతంపట్ల ఉండే గాఢమైన శ్రద్ధాభక్తులను వారు గుర్తించారు. దేశాభిమానాన్ని రాజకీయాలను మతంతో జోడించిన పక్షాన వారిని రాజకీయాలపట్ల ఆసక్తి గలవారినిగా చేయడం సులభసాధ్యమని భావించారు. వారు జాతీయతకు మతపరంగా అర్థాన్ని ఈ ఉద్దేశంతోనే కల్పించారు. ఎవరికి ఏ భాష సులభంగా అర్థంకాగలదో వారితో ఆ భాషలో మాట్లాడడం లాభకారి కాగలదు. తర్కము. హేతువాదము మొదలైనవాటి సాధనాన విద్యాధికులను ఆకర్షించినట్లు సామాన్యులను ఆకర్షించడం సాధ్యంకాదు. మతంద్వారానే వారిని ఆకర్షించడం సాధ్యమనే కారణాన అరవిందుడు,పాల్, తిలక్, లజపతిరాయ్ ఈ సాధనాన్ని ఉపయోగించారు.

ఇందులో తిలక్ గొప్ప పాత్రను వహించాడు మహారాష్ట్రంలో గణపతి నవరాత్రులకు ప్రత్యేకప్రాధాన్యం ఉన్నది. అందులో వేలాదిజనం కలిసి పాల్గొంటారు. అలాంటి సమయాలలో కథలరూపంలో వారికి రాజకీయాలను బోధించడం సులభం. తిలక్ ఈ సత్యాన్ని గ్రహించి, గణపతి ఉత్సవాలను రాజకీయ ఉత్సవాలుగా మార్చి, సామాన్య ప్రజలను స్వరాజ్యాభిమానులుగా మార్చి స్వాతంత్ర్యసమరంలో పాల్గొనేటట్లు చేశాడు. ఇదే ఉద్దేశంతో అతడు శివాజీ వర్ధంతి ఉత్సవాలను ప్రారంభించి విజయవంతంగా సాగించాడు. బిజాపూరు సుల్తానుల యొక్కయు మొగలాయి చక్రవర్తి ఔరంగజేబు యొక్కయు నిరంకుశాధికారంనుండి మహారాష్ట్రులకు విముక్తి కలిగించి, హిందూమత ధర్మాన్ని రక్షించి, స్వరాజ్యాన్ని స్థాపించినవాడు శివాజి ఛత్రపతి. ఆ స్వరాజ్యాన్ని ఆధారం చేసుకొని మహారాష్ట్రులు 18వ శతాబ్దంలో గొప్ప సామ్రాజ్యాన్ని స్థాపించారు. ఆనాడు శివాజి స్థాపించిన స్వరాజ్యంవంటి స్వరాజ్యాన్ని ఈనాడు బ్రిటిష్ పరిపాలనను తొలగించి మహారాష్ట్రులు స్థాపించడం వారి ధర్మమనీ, అప్పుడే వారు వారి పూర్వులఋణాన్ని తీర్చుకొన్నవారు కాగలరనీ తిలక్ ప్రజలకు ప్రబోధం చేశాడు. ఈలాటి ప్రచారానికై అతడు మరాటి భాషలో కేసరి

అనే పత్రికను ఇంగ్లీషులో మరాటీ అనే పత్రికను స్థాపించి నడిపించాడు. వీటి లోని అతని రచనలు ప్రజలలో ఉద్రేకాన్ని ఆవేశాన్ని కలిగించి వారిని స్వరాజ్య ప్రియులుగా చేసినవి.

ప్రజలను రాజకీయాలలోకి ఆకర్షించుటకు ప్రచారంమాత్రమే చాలదని, వారికి లాభం కలిగించే కార్యక్రమాలను రాజకీయనాయకులు చేయవలసి ఉన్నదని తిలక్, లజపతిరాయ్ భావించి ఆలాటి కార్యక్రమాలను సాగించారు. కాంగ్రెసు మూడునాళ్ళు ముచ్చటగా సమావేశమై కొన్ని తీర్మానాలు చేసి, వాటిని అమలుపరచే బాధ్యతను ప్రభుత్వంపై విధించడం వారికి ఎంతమాత్రం నచ్చలేదు. 1896లో మహారాష్ట్రంలో గొప్ప క్షామం సంభవించింది. క్షామబాధితులకు తగిన సహాయం చేయవలసినదిగా కలెక్టర్లు మొదలైన స్థానికాధికారుల విధి అని చట్టాలు నిర్ణయించినా, వారు వాటిని అమలుపరచకపోవడమే గాక, క్షామ కాలంలో కూడా రైతులను, నిర్బంధించి, భూమిశిస్తులను వసూలు చేయడం పరిపాటిగా ఉండేది. ఈ సమయంలో తిలక్ గ్రామాలలో పర్యటించి తమకు చట్టాలదృష్ట్యా హక్కులున్నవనీ, వాటిని అమలుపరచవలసిందిగా రైతులు అధికారులను ఒత్తిడి చేయడం వారి కర్తవ్యమనీ ప్రజలకు బోధించి, వారికి సహాయపడినాడు. శిస్తులు చెల్లించ శక్తిలేనివారు వారి భూములను పశువులను అమ్మి శిస్తులు చెల్లించకూడదని వారికి సలహాచెప్పి అధికారులను ప్రతిఘటించుటకు కావలసినధైర్యాన్ని వారికి కలిగించాడు. దీనిమూలంగా వారు రాజకీయాలలో జోక్యం కలిగించుకోనడం లాభకారి అనే గుణపాఠాన్ని నేర్చుకొని రాజకీయ ఉద్యమంలో పాల్గొనేవారయ్యారు.

లజపత్‌రాయ్‌కూడా ఇదేవిధంగా ప్రవర్తించాడు. 1899-1900 లో పంజాబులో గొప్ప క్షామంసంభవించినప్పుడు అతడు రైతుల సహాయార్థం తన ఆదాయంలో చాలాభాగాన్ని ఖర్చుపెట్టాడు. ఆలాటి సమయంలో క్రైస్తవ మిషనరీలు వేలకొలది హిందువులను క్రైస్తవ మతంలోకి చేర్చుకొనడం పరిపాటిగా ఉండేది. లజపత్‌రాయ్ వారిని ప్రతిఘటించి, నిరాధారులైన పసిపిల్లలకు ప్రత్యేకంగా శిశుశరణాలయాలను స్థాపించి వారి పరిరక్షణకు తోడ్పడినాడు. అతనికార్యక్రమంలో అస్పృశ్యుల ఉద్ధరణ ఒక ప్రధానాంశంగా ఉండినది. అందుకుగాను అతడువారిని ఆర్యమతానుసారం యజ్ఞోపవీతధారులుగ చేయడమే గాక, ఆర్థికంగా వారికి ఎంతో సహాయపడినాడు. 1905లో అతడు కాంగ్రెసు ప్రతినిధిగా బ్రిటన్‌లో పర్యటించి, స్వదేశానికి వచ్చిన తర్వాత బ్రిటన్‌లోని ఏపార్టీవారుకూడా భారతీయులకు సహాయంచేసే వారుకారని, కార్మికపక్షం వారికి సహాయంచేసే అభిలాషఉండినా వారికి సంఖ్యాబలం లేదని, భారతీయులు తమకాళ్లపై తాము నిలబడుటకు సంసిద్ధులైనప్పుడే వారికి విముక్తి కలుగగలదని ఇందులో రైతులు కార్మికులు ప్రధానపాత్రవహించవలసి ఉన్నదని, జాతీయోద్యమం సోషలిస్టు ఉద్యమంగామారడం దీనికిసాధనమని ప్రచారంచేశాడ. 1907 లో భూసంస్కరణనే పేరుతో ప్రభుత్వం ఒకశాసనాన్ని తలపెట్టినప్పుడు రైతుల్లు

లజపత్‌రాయ్ సహాయంతో దానిని ప్రతిఘటించుటకు సిద్ధపడి మహత్తరమైన ఆందోళనలోకి దిగారు. కొన్ని ప్రాంతాలలో అరాచకచర్యలు, తెల్లఅధికారులను హత్యచేయడంకూడా సంభవించాయి. 1857-58 తిరుగుబాటుయొక్క 50 వ వర్ధంతి సమయాన ఈలాటిసంఘటనలు సంభవించడం ప్రభుత్వానికి భయకారణమైంది. ఈపరిస్థితులలో ప్రభుత్వం భూ సంస్కరణ బిల్లును ఉపసంహరించుకొన్నది. కాని ఆందోళనకంతా లజపత్‌రాయ్ కారణభూతుడని భావించి 1908లో అతనిని అతని సహచరుడు అజిత్‌సింగును ఏలాంటివిచారణచేయక బర్మాలో నిర్బంధంలో ఉంచింది.

ఈసందర్భంలో 1897 లో పూనాలో జరిగిన ఒకసంఘటనను గురించి ప్రస్తావించడం అవసరం. శివాజీఉత్సవంనాడు తిలక్ చేసినప్రసంగాన్ని జూన్ 15న కేసరి పత్రికలో ప్రచురించాడు. అందులో రాజకీయ ప్రయోజనాలను సాధించుటకు శివాజీ అఫ్‌జల్‌ఖాన్ అనే బిజాపూరు సైన్యాధికారిని హత్యజేయడాన్ని సమర్థిస్తూ ప్రజలను కష్టపెట్టే ప్రభుత్వాన్ని బలప్రయోగసాధనాన నిర్మూలించడంలో అధర్మం లేదనిన్ని, దొంగలు మన ఇంటిలో ప్రవేశించినప్పుడు వారిని తరిమివేయుటకు అవసరమైన బలం మనకులేనప్పుడు ఇంటికి నిప్పంటించి, మంటలలో వారిని దగ్ధంచేయవచ్చు అని అన్నాడు.

ఈరచన జరిగిన తర్వాత వారంరోజులనాడు (జూన్ 22) దామోదర్ చాపీకరు, అతని సోదరుడూ రాండ్, ఐరెస్టు అనే ఇద్దరు సైనికాధికారులను పూనాలో హత్యగావించారు. రాండ్ పూనాలోసంభవించిన ప్లేగువ్యాధిని నివారించేప్రయత్నంలో ప్రజలను నానాబాధలకు గురిచేశాడు. ప్రజలు భీతావహులై జీవితాన్ని సాగించవలసిన వారయ్యారు. ఆపరిస్థితులలో ఈ హత్యలు జరిగాయి.

శివాజీ ఉత్సవసందర్భంగా తిలక్ చేసిన ప్రసంగాలే ఈ హత్యలకు కారణమని ప్రభుత్వంభావించి, ఆయనపై రాజద్రోహనేరాన్ని ఆరోపించి, విచారణచేసి 18 నెలల జైలు శిక్షను విధించి ది. రాజకీయోద్యమంలో పాల్గొనినందుకు శిక్షను అనుభవించిన వారిలో తిలక్ మొదటివాడు. దేశస్వాతంత్రాన్ని సంపాదించదలచినవారు మాటలతో తృప్తిపడక సమస్తత్యాగాలను చేయుటకు సిద్ధంగా ఉండవలెనని జాతీయవాదులు పదేపదే ప్రచారంచేస్తూవచ్చారు. తనప్రచారానుసారం తిలక్ ప్రవర్తించి ఇతర జాతీయవాదులకు మార్గదర్శిఅయ్యాడు.

జాతీయవాదులు బ్రిటిష్‌వారు ఒత్తిడికిమాత్రమే లొంగుతారని చెప్పడమేకాక ఆ ఒత్తిడి ఏలాంటిదిగా ఉండవలెనో వివరించారు. సాధారణంగా పరాయి ప్రభుత్వాన్నిగాని, నిరంకుశ ప్రభుత్వాన్నిగాని, నిర్మూలించుటకు ప్రజలు సాయుధపోరాటాన్ని సాగించడం చరిత్ర ప్రసిద్ధం. ఇది హింసతోకూడుకొన్నా స్వరాజ్యాన్ని స్వాతంత్ర్యాన్ని సంపాదించడం ధర్మంకావడంచేతను, ధర్మరక్షణార్థం యుద్ధంచేయడం ధర్మమని మతగ్రంథాలు తత్వగ్రంథాలు చెప్పడంచేతను బ్రిటిష్‌పరిపాలనను తొలగించుటకు వారితో సాయుధపోరాటం జరిపి,

వారిని ఒత్తిడిచేయడం ధర్మమని, అందులో నీతివిరుద్ధం ఏదీలేదని జాతీయ వాదులు విశ్వసించారు. దీనికి ఆధారంగా తిలక్ అరవిందులు హిందువులకు పవిత్రగ్రంథమైన భగవద్గీతను ఉదాహరించారు. దీనికి అనుగుణంగా తిలక్ గీతకు "గీతారహస్యం" అనేవ్యాఖ్యాన గ్రంథాన్ని రచించినాడు. సిద్ధాంతదృష్ట్యా వీరికిని గాంధీమహాత్మునికిని ఇందులోనే భేదం. ఏపరిస్థితులలోను అహింసను విడనాకూడదని మహాత్ముడు విశ్వసించాడు.

జాతీయవాదులు సాయుధపోరాటం ధర్మసమ్మతమని ప్రతిపాదించినా ఆనాటి పరిస్థితులతో అది ఆచరణ సాధ్యంకాదని భావించారు. బ్రిటిష్ వారు చేసిన చట్టాలఫలితంగా ప్రజలు నిరాయుధులయ్యారు. రహస్యంగా ఆయుధాలను సంపాదించి, వాటిని ఉపయోగించుటకు కావలసిన శిక్షణను అధికసంఖ్యాకులు పొందడంసాధ్యంకానిపని. అందుచేత ప్రభుత్వంపై ఇంకొకవిధమైన ఒత్తిడిని వినియోగించి, దానిమూలంగా అధికారులను లొంగదీయవసిందిగా వారు నిర్ణయించారు. ఈ ఒత్తిడికీ వారు సాత్త్విక నిరోధమనీ (Passive Resistance) సహాయనిరాకరణమని (Non-Cooperation) అని పేరుపెట్టారు. సాయుధపోరాటంలో శత్రువును ఆయుధాలతో నిరోధిస్తారు. సాత్త్విక నిరోధంలో శత్రువులను ఆయుధాలతోగాక శాంతియుతంగా నిరోధిస్తారు. రెండింటిలో శత్రువుని నిరోధించడం తప్పదు. కాని నిరోధించేవిధానంలో రెండింటికి భేదం ఉన్నది.

ప్రజల సహకారంలేనిదీ పరాయిపరిపాలన సాధ్యంకాదనేది సాత్త్విక నిరోధానికి మూలసూత్రం. దీనిని అరవిందుడు వందేమాతరం అనే తన పత్రికలో విపులంగావివరించాడు. ప్రజలు అన్నిరంగాలలో ప్రభుత్వానికి సహాయపడడం చేతనేవారు వారికి ఇష్టంవచ్చినట్లు పరిపాలననుసాగిస్తూ ప్రజలకు అన్నివిధములైన కష్టాలను నష్టాలను కలిగిస్తున్నారు. ఉదాహరణకు : ప్రజలు నేత మొదలైన పరిశ్రమలసాధనాన సుఖంగా జీవితాన్ని సాగిస్తూవచ్చారు. కాని యంత్రసహాయంతో బ్రిటన్‌లోని ఫ్యాక్టరీ యజమానులు కార్మికులు బట్టలనూ ఇతరవాడకం వస్తువులనూ చౌకగా తయారుచేసి, భారతదేశానికి దిగుమతిచేయడం ప్రారంభమైన తర్వాత భారత ప్రజలు కొంచెం ఎక్కువధరలను పెట్టి స్వదేశీవస్తువులను కొనుటకు బదులు విదేశీవస్తువులను కొనుటకు అలవాటుపడిపోయినారు. ఈవిధంగా వారు విదేశీయులకు సహాయపడంచేతనే స్వదేశీ పరిశ్రమలు నశించడం, దేశంలో దారిద్ర్యం తాండవమాడడం జరుగుతూఉంది. ఈలాగుగాక ప్రజలు విదేశీవస్తువుల వాడకాన్ని బహిష్కరించి, స్వదేశీవస్తువులను మాత్రమే వాడుటకు నిర్ణయించుకొనిన పక్షాన బ్రిటిష్‌వారు నష్టపడడం, నష్టాన్ని భరించలేక కొంతవరకైనా జాతీయవాదులకు లొంగి వారితో రాజీకిరావడం తప్పదు. ఇది ఆర్థిక రంగంలో ప్రజలు చేయవలసిన సాత్త్వికనిరోధం (లేక సహాయనిరాకరణం).

ఈలాంటిబహిష్కరణాన్ని తిలక్ 1896 లోనే సమర్థించినాడు. "భారతీయులకు బ్రిటిష్‌వారితో సమానత్వం లభించనంతవరకు ఒక అంగుళం మాంచెస్టరు బట్టను కొనుటకు బదులు మృత్యువు నెదుర్కొనుటకు సిద్ధపడండి. ఒక

షు బట్టనుకొనే ప్రతి భారతీయుని దేశద్రోహిగా భావించండి." అని
ంటా పత్రికలో వ్రాశాడు. ఆరోజులలోనే బీహారులో ఒక ప్రదేశంలోని
గావేశాన్ని జరిపి బ్రిటిష్ వస్త్రాలను బహిష్కరించవలసిందిగాను స్వదేశీ
మాత్రమే కొనవలసిందిగాను తీర్మానించారు. కొన్ని దేశీయ పత్రికలు
చారాన్నే సాగించాయి. కాని 1905 ప్రాంతాన జాతీయవాదం బల
తనే బహిష్కరణ స్వదేశీఉద్యమాలు ఒకదేశవ్యాప్తమైన ఉద్యమరూపం
. 1906 లో లజపతిరాయ్ ఈ ఉద్యమాలగురించి ఒక వ్యాసంలో
ష్కరణలు అనేవి భారతదేశంలో ఈనాడు ఒకమతంగా అనుసరించవలసి
స్వార్థత్యాగంతోకూడిన దేశాభిమానం వాటిమూలంగా వ్యక్తంకావలసి
స్మవిశ్వాసంతో కూడిన భారతజాతి నిర్మాణానికి ఇదేసాధనం; బ్రిటిష్
ం తొలగించుటకు భారతీయులుచేసే పోరాటానికి ఇదే ఆయుధం", అని
ఇదే సత్యమని నాయకులూ ప్రజలూ భావించారు.

ేవిధంగా జాతీయవాదులు బ్రిటిషువారు ప్రవేశపెట్టిన విద్యావిధానం
ా జాతీయాభివృద్ధికి ఆటంకంగా ఉన్నట్లు భావించారు. దానిమూలం
్యాధికులూ, వారిపలుకుబడికి లోబడిన ప్రజలూ "భారతీయత"ను
ి బ్రిటిషువారిని అనుకరించేవారయ్యారు. బ్రిటిషు సామ్రాజ్యస్థిర
లపరచుటకు ఇది పటిష్టసాధనంగా రూపొందింది. కాని భారతీయులు
ను బ్రిటిషువారు స్థాపించిన విద్యాలయాలకుపంపి, అధికారులతో
డంచేతనే ఈలాటి విదేశీ విద్యావిధానం సాధ్యమైంది. ప్రజలు వారి
ిటికి పంపించడంమాని, జాతీయవిద్యాలయాలను స్థాపించి వాటికి
కు తీర్మానించుకొనిన పక్షాన పరాయివారి విద్యాలయాలు వాటం
మూతబడడం తప్పదు. ఇది విద్యారంగంలో జరగదగిన సాత్విక

రీతిగానే బ్రిటిషువారు అమిత ఖర్చులతోను అమిత జాప్యంతోను
్యాయస్థానాలను న్యాయవిచారణ విధానాలను దేశంలో ప్రవేశపెట్టి
వాస్తవమైన న్యాయంలభించకుండా జేశారు. ప్రజలు ఈలాటి
ానాలకు వెళ్ళడంమాని, పంచాయతీ కోర్టులనుస్థాపించుకొని, వాటి
ివాదాలను పరిష్కరించుకొనడం న్యాయవిచారణరంగంలో జరగవలసిన
ోధం.

ారతీయులు గుమాస్తాలుగాను, పన్నులను వసూలు చేసేవారుగాను,
ారుగాను, ఇతర ఉద్యోగాలు చేసేవారుగాను బ్రిటిష్ ప్రభుత్వానికి
డడంచేతనే వారి పరిపాలన నిలబడగలిగింది. ఈలాగు ఉద్యోగాలు
ప్రజలు మానుకొన్న పక్షాన పరిపాలన యంత్రాంగం స్తంభించిపోతుంది.
టు పన్నులను చెల్లించడం మానుకొనిన పక్షాన పరాయి ప్రభుత్వం
లొంగిపోవడం తప్పదు. ఇది పరిపాలన రంగంలో జరగవలసిన సాత్విక

స్వాతంత్ర్య సంపాదనకు సాయుధపోరాటం సాధ్యంకానప్పుడు విశ్వాసంగల ప్రజలు చేతులు ముడుచుకొని నిస్సహాయులై కూర్చుండ అవసరం లేదు. సాయుధ నిరోధం మూలంగా ఏలాటి విజయాన్ని సాధిం సాధ్యమో ఆలాటి విజయాన్ని సాత్విక నిరోధం మూలాన సాధించవచ్చు జాతీయవాదులు పై పథకాన్ని రూపొందించి దానిని గురించి ప్ర చేశారు.

1906 లో తిలక్ కలకత్తాకు వచ్చి అక్కడ జరిగిన ఒక సమావే ప్రసంగిస్తూ, "ప్రస్తుతం మనం గుమాస్తాలుగాఉండి పరాయి ప్రభుత్వం వ బాధించుటలో సాధనాలుగా ఉన్నాము. ఈ నూతన జాతీయ పార్టీ ష్యత్తు మీ చేతులలోనే ఉన్నదని గ్రహించవలసినదిగా వాంఛిస్తున్నది. స్వతంత్రులుగా ఉండగోరితే స్వతంత్రులు కాగలరు. కోరని పక్షాన మీరు నాన్ని పొందడం తప్పదు. పడిపోయిన తర్వాత తిరిగీ లేవడమనేది కల్ల. అనేకులకు ఆయుధాలను ధరించడం ఇష్టంలేకపోవచ్చు. కాని, పరాం మీపై అధికారాన్ని చెలాయించకుండా ఉండుటకు కావలసిన ఆత్మ చేసి వారికి సహాయం చేయడం మానగల శక్తి మీకు లేదా? బహిష్కరణ ఇదే. వారి వస్తువులను మనం వాడరాదు. వారు విధించే పన్నులను పసూలు చేయరాదు. శాంతి భద్రతలను రక్షించడంలో మనం వారికి పడకూడదు. మన సరిహద్దులకు ఆవల వారు చేసే యుద్ధాలలో పాల్గొ రక్తాన్ని మన ధనాన్ని ధారపోయరాదు. న్యాయపరిపాలనలో మనం సహాయం చేయరాదు. మనం మన న్యాయస్థానాలనే స్థాపించుకొన కాలం అనుకూలమైనప్పుడు పన్నులు చెల్లించడాన్ని కూడా నిరాకరించ మీరందరు సంఘటితంగా ఈ కార్యక్రమాన్ని సాగించగలరా ? సాగించ రేపే మీకు స్వాతంత్ర్యం- స్వరాజ్యం- లభిస్తుంది", అని జాతీయవాద కాన్ని సంక్షిప్తపరచి చెప్పాడు.

ఈ విధంగా జాతీయ వాదులు స్వరాజ్య సంపాదనము తమ లక్ష్య ప్రజల లక్ష్యంగాను పెట్టుకొని దానిని సాధించుటకు ఆత్మవిశ్వాసము, తా సామాన్యప్రజల సహకారము, సాత్విక నిరోధము ప్రధాన సాధనాలుగా గించదలచారు. ఇరవై సంవత్సరాలు కాంగ్రెసు కృషిచేసినా ప్రజలలో చైతన్యాన్ని గాని సంచలనాన్ని గాని కలిగించలేకపోయింది. జాతీయ ఒకటి రెండు సంవత్సరాలు కృషిచేసి ప్రజల రాజకీయ దృక్పథాన్ని మార్చగలిగారు. కాంగ్రెసు చేసిన తీర్మానాలపట్ల ఏలాంటి శ్రద్ధను వ ప్రభుత్వం జాతీయవాదులు లేవదీసిన బహిష్కరణ, స్వదేశీ, జాతీయ విధానం, మొదలైనవాటితోకూడిన సాత్వికనిరోధ ప్రభావానికిలొంగి వైఖరిని మార్చుకొని, ప్రజలు వాంఛించినట్లు బెంగాలు రాష్ట్ర విభజన చేసింది. ప్రజాశక్తిని ఎదుర్కొనడం సాధ్యం కాదని 1905-11 సం ఋజువుచేశాయి.

బెంగాలురాష్ట్ర విభజనను రద్దుచేయవలసిందిగా ప్రజలు సాగించిన ఉద్యమం మూలంగా జాతీయవాదుల తత్వమూ కార్యక్రమమూ ఆచరణసాధ్యమైనాయి. అందుచేత ఆ విభజననుగురించి మనం ఇప్పుడు తెలుసుకొనడం అవసరం.

## 3

బెంగాలు రాష్ట్రం ఆనాటి దేశంలోని రాష్ట్రాలన్నిటిలో పెద్దది. దాని వైశాల్యం 190,000 చదరపు మైళ్ళు. దాని జనసంఖ్య 785 లక్షలు. దాని సాంవత్సరిక ఆదాయం 11 కోట్లు. అందులో బీహారు, చోటా నాగపూరు, ఒరిస్సాలు కూడా మొదటి నుండి కలిసి ఉండినవి. దీనికంటె సర్వవిధాలా చిన్నవైన మద్రాసు బొంబాయి రాష్ట్రాలను ఒక కార్యనిర్వహణ సభ సహాయంతో ఒక గవర్నరు పాలిస్తుండేవాడు; కాని బెంగాలును ఒక లెఫ్టినెంటు గవర్నరు పాలించేవాడు. అంతటి పెద్ద రాష్ట్రాన్ని ఒకడు పాలించడం సాధ్యం కాదనే భావంతో 1891 నుండి కేంద్రప్రభుత్వం దాని విభజనను గురించి ఆలోచించ సాగింది.

ఒకప్పుడు అస్సాం కూడా బెంగాలులో చేరి ఉండేది. 1874లో దీనిని విడదీసి ప్రత్యేక రాష్ట్రంగా నిర్మాణం చేశారు. కాని దీని ఫలితంగా బెంగాలుకు పరిపాలన సౌలభ్యం ఎక్కువగా లభించలేదు. ఇంతేగాక అస్సాం చాలా చిన్న రాష్ట్రంగా రూపొందింది. బెంగాలులోని మరికొన్ని ప్రాంతాలను అందులో కలిపిన పక్షాన అది కొంచెం పెద్దరాష్ట్రంగా రూపొందడం సాధ్యం అనే భావం కూడా అధికారులలో వ్యాపించింది. ఒకే మార్పు మూలంగా ఏకకాలంలో బెంగాలు విస్తీర్ణాన్ని తగ్గించడం, అస్సాం రాష్ట్ర విస్తీర్ణాన్ని పెంచడం— అనే ఉద్దేశాలను రెంటిని సాధించుటకు అధికారులు వాంఛించారు.

హిందీభాషను మాట్లాడే బీహారు, చోటా నాగపూర్లను, ఒరియా భాషను మాట్లాడే ఒరిస్సాను విడదీసిన పక్షాన బెంగాలు రాష్ట్రం చిన్నదిగా రూపొందేఅవకాశం ఉండినాఅప్పట్లో భాషాప్రయుక్త సూత్రాధారంగా రాష్ట్రాలను నిర్మాణంచేసే ఉద్దేశం అధికారులకు లేని కారణంగా ఈ విధానాన్ని గురించి వారు ఎక్కువగా ఆలోచించలేదు.

బెంగాలు విభజనను గురించి రాజప్రతినిధి కర్జన్ (1898-1905) ఏదో ఒక తుదినిర్ణయాన్ని తీసుకొనుటకు సిద్ధపడ్డాడు. 1903 నుండి దీనిని గురించి ఆలోచించసాగాడు. బ్రిటన్‌లోని అధికారులతో రహస్యంగా సంప్రతింపులు జరిపాడు. తుదకు 1905, జూలై తేది 7న దీనిని గురించి అధికార ప్రకటను గావించాడు. దీనిఫలితంగా తూర్పు బెంగాలును తక్కిన బెంగాలునుండి విడదీసి దానిని అస్సాంతో కలిపి తూర్పు బెంగాలు అస్సాం అనే పేరుతో ఒక కొత్త రాష్ట్రం నిర్మాణమైంది. ఇది మినహాగా తక్కిన బెంగాలు యథాపూర్వకంగా బీహారు, చోటానాగపూర్, ఒరిస్సాలతో కలిసిన ఇంకొక రాష్ట్రంగా రూపొందింది. ప్లాసీ యుద్ధం మొదలు సుమారు 150 సంవత్సరాల కాలం ఒకేరాష్ట్రంలో ఉండిన

బెంగాలీలు ఈ విభజన ఫలితంగా రెండు రాష్ట్రాలలో నివసించేవారయ్యారు.

ఈలాగు విభజనను చేయడంలో కర్జన్ పరిపాలనసౌలభ్యాన్ని వాంఛించినవాడు కాడు. దీని మూలంగా కొన్ని రాజకీయ ఉద్దేశాలను సాధించదలచాడు. అతని ఉద్దేశాలు బెంగాలీల జాతీయ ఐక్యతకూ, ఒక శతాబ్దంగా దేశంలోని రాజకీయాలలో వారు సంపాదించిన నాయకత్వానికీ పేరుప్రతిష్ఠలకూ భంగంకలిగించడం. ఇందుచేతనే వారు ఈలాటి విభజనను కర్జన్ తలపెట్టినట్లు 1903 లో తెలియవచ్చినప్పటినుండి వారి నిరసనను అనేక విధాలుగా అధికారులకు తెలియపరచసాగారు.

దేశంలోని ప్రజలలో జాతీయభావంలేని రోజులలో బ్రిటిషువారు దేశాన్ని సులభంగా జయించి వశపరచుకొని అన్ని విధాలా లాభాలను అనుభవించగలవారయ్యారు. కాని 1820 తర్వాత ఇంగ్లీషువిద్య వ్యాపించిన కారణంగాను, దేశంలో ఒకే ప్రభుత్వం వ్యాపించిన కారణంగాను, ప్రయాణ సౌకర్యాలు వ్యాపించిన ఫలితంగాను, ఇతర మార్పులనేకం ఈలాటివి జరిగినందునను ప్రథమంలో విద్యాధికులలోను, అటుతర్వాత తక్కిన ప్రజలలోను క్రమక్రమంగా జాతీయభావం అంకురించి వృద్ధిగాంచింది. జాతీయభావం వ్యాప్తి గాంచడంలో బెంగాలీలు ముందంజవేశారు. వారిలో ప్రముఖుడైన రాజారామమోహనరాయ్ జాతీయ పునర్వికాసానికి పునరుద్ధరణకు పితామహుడయ్యాడు. తక్కినవారికంటే బెంగాలీలే అధికసంఖ్యలో ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్నారు. వారే మొదట దేశాభిమాన పూరితులైనవారు. రాజకీయ సంఘాలను వారే మొదట స్థాపించారు. దేశానికంతా ఒక కేంద్ర రాజకీయ సంఘాన్ని స్థాపించి దాని సమావేశాలను జరపినవారు వారే. తర్వాతనే కాంగ్రెసు స్థాపితమైంది. కాంగ్రెసులో కూడా వారే ప్రముఖపాత్రను ధరించారు. దేశీయ వాఙ్మయాన్ని సృష్టించినవారిలో బంకించంద్రుడు అగ్రగామి అయ్యాడు. అక్కడి దేశీయ పత్రికలే దేశానికంతా మార్గదర్శకములైనాయి. ఈ విధంగా ఒక శతాబ్దిగా బెంగాలీలు రాజకీయరంగంలో అగ్రస్థానాన్ని వహించారు.

ఇంతటి ప్రాధాన్యాన్ని బెంగాలీలు వహించడం కర్జన్‌కు ఎంతమాత్రము గిట్టినది కాదు. వారి రాజకీయ ప్రాధాన్యాన్ని ఏవిధంగానైనా నిర్మూలించుటకు అతడు నిర్ణయించుకొన్నాడు. ఈ నిర్ణయమే బెంగాలు రాష్ట్రవిభజనకు ప్రధాన కారణం.

బెంగాలీలందరు ఒకే రాష్ట్రంలో ఉండినపక్షాన వారి ప్రాబల్యం క్రమక్రమంగా ఎక్కువ కాగలదని, దాని మూలంగా ఏనాటికైనా బ్రిటిషు అధికారానికి ప్రమాదం సంభవించగలదని అతడు భావించాడు. బెంగాలీలలో జాతీయభావం నాటుకొన్నట్లు మరి ఏరాష్ట్రంలోని ప్రజలలో (ఒక మహారాష్ట్రులలో తప్ప) నాటుకొనలేదనీ, వారు క్రమక్రమంగా బలాన్ని సంపాదించి, బ్రిటిషు అధికారాన్ని నిర్మూలించి ఒక స్వతంత్ర జాతీయరాజ్యాన్ని స్థాపించే ఉద్దేశంతో ఉన్నారనీ, అది జరుగుటకు పూర్వమే దానికి విఘాతం కలిగించడం బ్రిటిషు

వారి కర్తవ్యమనీ, అందుకుగాను రాష్ట్రాన్ని రెండుగా విభజించి, వారి జాతీయ ఐక్యతకు భంగం కలిగించడం మొదటి మెట్టు అని అతడు బ్రిటన్‌లోని అధికారులకు నచ్చచెప్పాడు. అతడు తలపెట్టిన విభజనకు వారు ప్రథమంలో అంగీకరించకపోయినా ఈలాటి రాజకీయ ప్రయోజనం చేకూరగలదని వారికి నమ్మకం కలిగించి, విభజనకు వారి అంగీకారాన్ని సంపాదించినాడు. బెంగాలీలకు ఈ రహస్య ఉద్దేశం తెలియకపోలేదు. తమ జాతిని రెండుగా చీలచేయడం వారు పూర్తిగా నిరసించారు. దానిని ఏవిధంగానైనా ప్రతిఘటించుటకు కృతనిశ్చయులైనారు. 1903-1905 మధ్య సుమారు రెండువేల సమావేశాలను రాష్ట్రమందంతటా జరిపి, విభజనను నిరసిస్తూ తీర్మానాలు చేసి అధికారులకు వినతిపత్రాలను సమర్పించారు. కుగ్రామాలలో కూడా ఈలాటి సమావేశాలు జరిగాయి. పత్రికలన్నీ దీనిని ప్రతిఘటించాయి. కాని లాభం లేకపోయింది.

ఈ విభజనను చేయడంలో ఇది ఒక్కటే కర్జన్‌యొక్క ప్రధానోద్దేశం కాదు. దీనికితోడు మరిరెండు దురుద్దేశాలు కూడా అతనిపై ప్రభావం వహించాయి. వాటిలో మొదటిది ముస్లిం బెంగాలీలను హిందూ బెంగాలీలనుండి విడదీయుట. "చీలించు పాలించు" అనే భేదోపాయాన్ని చాలాకాలన నుండి బ్రిటిషువారు అనుసరించడం, 1870 తర్వాత ముస్లింలకు ప్రత్యేక సదుపాయాలు కల్పించడం, సయ్యద్ అహమ్మద్‌ఖాన్, అమీరాలీ మొదలైన ముస్లిం నాయకులను సన్నిహితులుగ చేసుకొని వారి సహాయాన వేర్పాటు ఉద్యమాన్ని బలపరచడం ఇదివరకే మనం తెలుసుకొన్నాం. బెంగాలు రాష్ట్రాన్ని విభజించడంలో కర్జన్ ఈవిధానానికి మరింతబలం చేకూర్చాడు. తూర్పు బెంగాలులోని బెంగాలీలలో అధికసంఖ్యాకులు ముస్లింలు. ఇదివరకు ఆ ప్రాంతమే రాజకీయ ఆందోళనకు ప్రధాన కేంద్రంగా ఉండినది. దానిని ప్రత్యేక రాష్ట్రంగా నిర్మాణము చేయడంతో ముస్లింలకు ఒక ప్రత్యేక రాష్ట్రం లభించడము జరిగింది. హిందువుల ప్రాబల్యం ఎక్కువగా లేకుండా తమఇష్టానుసారం తమ రాజకీయాలను సాగించుకొనే అవకాశం ముస్లింలకు లభించింది. ఈలాటి అవకాశం ఉండవలెనని ముస్లింలు వాంఛించినవారు కారు; తమకు ప్రత్యేక రాష్ట్రం కావనని వారెన్నడూ అధికారులకు తెలియపరచలేదు. ప్రథమంలో వారు కూడ రాష్ట్ర విభజనను నిరసించారు. కాని అధికారులు వారికి ప్రత్యేక రాష్ట' మూలంగా కొన్ని సదుపాయాలు లభించగలవని వారిలో కొందరి అంగీ-రాన్ని సంపాదించగలిగారు. వారికి అలాటి సదుపాయాలను కొన్నింటిని లభి జేశారు. క్రమక్రమంగా వారిని హిందువులనుండి విడదీశారు. బెంగాలీ రెండు వర్గాలుగా చీల్చడమే కాకుండా ఈ విభజన మూలంగా కర్జన్ ము' లను హిందువులనుండి వేరుచేయగలిగాడు. కర్జన్ తర్వాత రాజప్రతినిధి అ: మింటో కాలంలో ఈ వేర్పాటు ఉద్దేశం మరింత విజయవంతంగా కొనసాగి

కర్జన్‌యొక్క ఇంకొక దురుద్దేశం హిందూ బెంగాలీల ప్రాధాన్యాన్ని పూర్తిగా నిర్మూలించడము. రాజకీయ ఉద్యమాలన్నిటిలో సుమారు

శతాబ్దంగా వారే ముందంజ వేస్తూ వచ్చారు. ఈ విభజన ఫలితంగా వారు రెండు రాష్ట్రాలలో అల్పసంఖ్యాకులై వారి ప్రాబల్యాన్ని కోల్పోయ్యారు. తూర్పు బెంగాలులోని 310 లక్షల ప్రజలలో ముస్లింలు 180 లక్షలు, హిందువులు 120 లక్షలు (వీరిలో కొందరు అస్సాంవారు), పశ్చిమ బెంగాలు రాష్ట్రములో బీహారు, చోటా నాగపూరు, ఒరిస్సాలు కలిసి ఉండినందునను, 90 లక్షల బెంగాలీ ముస్లింలు ఉండినందునను హిందూ బెంగాలీల సంఖ్య అతిస్వల్పమైంది. రాష్ట్రంతరపున మాట్లాడగల అవకాశాన్ని వారు కోల్పోయ్యారు. తమకు ఒక శతాబ్దంగా ఏర్పడిన ప్రాబల్యాన్ని ఈ విధంగా కోల్పోవడం వారికి ఎంతో విచారాన్ని కలిగించి, విభజన రద్దుకు తీవ్రమైన ఆందోళన జరిపేటట్లు వారిని సర్వవిధాలా ప్రోత్సహించింది.

రాష్ట్ర విభజన ద్వారా కర్జన్ ఇంకొక ఉద్దేశాన్ని కూడా సాధించ నిర్ణయించాడు. ఆనాడు దేశానికంతా కలకత్తా నగరం అన్ని రంగాలలో ప్రధాన నగరమే కావడం కాకుండా బెంగాలు రాష్ట్రానికి కూడా ప్రధాన నగరంగా ఉండినది. రాజకీయ ఉద్యమాలన్నీ ఆనగరంలోనే ప్రారంభమై దేశమంతటి పైనా ప్రభావం వహిస్తూ ఉండినాయి. చాలావరకు దేశంలోని ప్రజాభిప్రాయాన్ని అక్కడి పత్రికలూ రాజకీయ సంఘాలూ రూపొందించేవి కలకత్తాలోని లాయర్లు, వార్తాపత్రికలసంపాదకులు బ్రిటిషుపరిపాలనను విమర్శించడంలో అగ్రస్థానాన్ని వహించినారు. ఇంతటి ప్రాధాన్యం ఆనగరానికి చేకూరడం కర్జన్‌కు ఏమాత్రం రుచించలేదు. రాష్ట్రాన్ని విభజించడం మూలంగా తూర్పు బెంగాలులో డాకా నగరం కలకత్తాతో పోటీపడి కాలక్రమాన ఇంకొక ప్రధాన నగరంగా ఏర్పడే అవకాశం లభించింది. ఈలాటి దురుద్దేశంతో కర్జన్ రాష్ట్ర విభజనకు పూనడం బెంగాలీల నిరసనకు ఇంకొక కారణమైంది. అందుచేతనే దీనిని వారు ఏమాత్రం సహించక ఎలాగైనా దాని రద్దుకై మహత్తరమైన ఆందోళనను లేవదీశారు. ఆ ఆందోళన స్వభావమూ దాని పరిణామమూ ఏలాటిదో మనం ఇప్పుడు తెలుసుకొనడం అవసరం.

## 4

ఈ సందర్భంలో కర్జన్ ధోరణిని తెలుసుకొనుటకు మరి రెండు విషయాల గురించి ప్రస్తావించడం అవసరం. అతడు హైదరాబాదు నైజాంను ఒత్తిడిచేసి అతని పరిపాలనలోఉండిన బీరారురాష్ట్రాన్ని బ్రిటిష్‌పరిపాలనలోకి తెచ్చాడు. ఇందులోని ప్రజలు మహారాష్ట్రులు. అందుచేతదీనిని మహారాష్ట్రులు అధికసంఖ్యలో ఉండిన బొంబాయి రాష్ట్రంలో కలపడం ఉచితమని ఉన్నతోద్యోగి వర్గానికి చెందినకొందరు సూచించారు. కాని కర్జన్ దీనికి ఎంతమాత్రము అంగీకరించలేదు. మహారాష్ట్రులు అప్పటికే బ్రిటిష్‌వారి పరిపాలన పట్ల ప్రబల ద్వేషం వహించి ఉన్నారని, పూనానగరం రాజద్రోహచర్యలన్నిటికీ కేంద్రమని జాతీయవాదులలో అగ్రశ్రేణికి చెందిన తిలక్ పూనావాసి అని, బీరారులోని

మహారాష్ట్రిలను బొంబాయిలో కలిపినపక్షాన మహారాష్ట్రిల ప్రాబల్యం వారి రాజద్రోహ చర్యల తీవ్రత మరింత వృద్ధిగాంచగలవని భావించి, దానిని మధ్య పరగణాలలో చేర్చాడు. భారతదేశంలో జాతీయభావం వృద్ధిగాంచడం అతనికి ఎంతమాత్రము ఇష్టంలేదు. దానిని అణచే ఉద్దేశంతోనే బెంగాలు రాష్ట్రవిభజనకు పూనుకొన్నాడు. ఇదేఉద్దేశంతో బీరారులోని మహారాష్ట్రిలను బొంబాయిలోని మహారాష్ట్రిలతో కలపడాన్ని నిరాకరించాడు.

బ్రిటిష్ అధికారులు భారతదేశం ఒకజాతి కాదనీ, ప్రజలలో మతాలు, భాషలు, ఆచారవ్యవహారాలు మొదలైనవాటిసిబట్టి అనేకచీలికలు ఏర్పడి ఉన్నవనీ విశ్వసించినట్లే కర్జన్ కూడా విశ్వసించాడు. ఈలాటి దేశంలో జాతీయ భావాన్ని సృష్టించి వృద్ధిచేయుటకు విద్యాధికులు చేసే ప్రయత్నాలన్నీ హాస్యాస్పదములన్నాడు. ఒకజాతికి చెందిన ప్రజలు ఉండేదేశంలోనే ప్రజాస్వామికం ఆచరణసాధ్యం కాగలదని, భారతదేశంలో ఆలాటి పరిపాలన విధానాన్ని ప్రవేశపెట్టవలసిందిగా వాంఛించే కాంగ్రెసు వాస్తవ పరిస్థితులను గుర్తించడంలేదని, దానిని ప్రవేశపెట్టిన పక్షంలో ప్రజలమధ్య అంతర్యుద్ధాలు తప్పవని, అందుచేత నిరంకుశమైన బ్రిటిష్‌పరిపాలనాధికారం శాశ్వతంగా ఉండడమే ప్రజల శ్రేయోభివృద్ధికి ఏకైక సాధనమనే అభిప్రాయంతో అతడుకాంగ్రెసును తూలనాడాడు. అప్పటికే కాంగ్రెసు పతనమైపోతున్నదని, తనపరిపాలనకాలంలో అది పూర్తిగా విచ్ఛిన్నం కాగలదని అతడు దానిని అవహేళన చేయసాగాడు. ఈవిధంగా అతనికి ప్రజలలోని జాతీయభావం, విద్యాధికుల వాంఛలు, కాంగ్రెసు ఆశయాలు ద్వేషకారణమైనవి. కాంగ్రెసు వాంఛలలో దేనినికూడా చెల్లించుటకు అతడు నిరాకరించాడు.

1833 చార్టరు చట్టంలోను, 1858లో విక్టోరియా మహారాణి చేసినప్రకటనలోను అర్హులైన భారతీయులకు బ్రిటిష్ వారితో సమానంగా ఉన్నతోద్యోగాలు ఇచ్చునట్లు వాగ్దానాలు చేయబడినవి. ఈ వాగ్దానాలను చెల్లించవలసిందిగా విద్యాధికులు ఆందోళన చేయసాగారు. కాంగ్రెసు వాంఛలలో ఇది ఎక్కువ ప్రాధాన్యాన్ని వహించింది. కర్జన్ దీనికివిముఖుడై ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్నంత మాత్రంచేత భారతీయులు ఉన్నతోద్యోగాలకు అర్హులు కాజాలరని, ఈ అర్హత పుట్టుకచేతను శిక్షణ చేతను సంప్రదాయాలమూలంగా మాత్రమే లభించేదనిన్ని, బ్రిటిష్‌వారికి ఈ సదుపాయాలు ఉండడంచేత ఉన్నతోద్యోగాలకు వారు మాత్రమే అర్హులని వాదించి, గతంలోచేసిన వాగ్దానాలు చెల్లించకపోయినా అందులో అధర్మం ఏదీలేదనీ, వాటిని రద్దుచేయడమే ప్రాజ్ఞత అనీ స్పష్టం చేశాడు. ఉన్నత ఉద్యోగివర్గం శాశ్వతంగా బ్రిటిష్‌వారితో కూడినట్టిదిగా ఉండవలసినట్లు అతడు భావించి, దానికి అనుగుణంగా తన పరిపాలనను సాగించాడు.

కలకత్తా మునిసిపల్ సభలో ప్రజలుఎన్నుకొన్న సభ్యులు 50మంది ఉండేవారు. దానిని 25కు తగ్గించాడు. బ్రిటిష్ సభ్యులసంఖ్యను పెంచాడు. ఉన్నత విద్య వ్యాపించడం చేతనే రాజకీయ చైతన్యమూ జాతీయభావమూ స్వారాజ్య

కొంత ప్రబలినదనే కారణాన, వాటివ్యాప్తిని అరికట్టే ఉద్దేశంతో 1904లో ఒక చట్టాన్ని చేసి విశ్వవిద్యాలయాలన్నిటిపై ప్రభుత్వ అధికారాన్ని విపరీతంగా పెంచాడు. 1904లో కలకత్తా విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసాన్నీ చేస్తూ భారతీయులకు సత్యమంటె ఏమిటో తెలియదనీ, వారు కుత్సితులనీ జాతినంతా బహిరంగంగా నిందించాడు. దీనిని నిరసిస్తూ దేశమందంతటా నిరసన సభలు జరిగినా అతడు ఏమాత్రము చలించలేదు. ఈలాటి జాత్యహంకారంతో అతడు దేశాన్ని పాలించాడు. దైనందిన పరిపాలనక్రమాన్ని పటిష్టం చేయుటకు, శిధిలావస్థలో ఉన్న ప్రాచీనకాలపు కట్టడాలను రక్షించుటకు, వ్యవసాయరంగంలో పరిశోధనలకు, పరపతి సంఘాలను స్థాపించుటకు అతడు ప్రయత్నించడం వాస్తవమే. కాని భారతీయులపట్ల అతడు వహించినద్వేషం ఈలాటి స్వల్పసంస్కరణల ప్రాధాన్యాన్ని విస్మరింపజేసింది. ఈలాటిభావాలు కలవాడు బెంగాలు రాష్ట్రాన్ని విభజించడంలో ప్రజాభిప్రాయాన్ని ఏమాత్రం గుర్తించక ప్రవర్తించడంలో ఆశ్చర్యపడవలసిందిలేదు.

కాని హిందువులపట్ల ద్వేషంవహించినఔరంగజేబు చక్రవర్తి మొగలాయి సామ్రాజ్య విచ్ఛిత్తికి ఏలాగు కారకుడయ్యాడో అదేకారణంచేత కర్జన్‌కూడా బ్రిటిష్ సామ్రాజ్య విచ్ఛిత్తికి కారణమయ్యాడు. బెంగాలురాష్ట్రవిభజన బ్రిటిష్ సామ్రాజ్య విభజనకూ దానిపతనానికీ మొదటిమెట్టుఅని మహాత్మాగాంధి 1906 ప్రాంతంలో చెప్పిన మాటలు వాస్తవమైనాయి. ఈ విభజన, వందేమాతర ఉద్యమానికి దారితీసింది. భారతస్వాతంత్ర్యోద్యమంలో ఈ ఉద్యమమే మొదటిఘట్టం. ఇది బ్రిటిష్ పరిపాలనపట్ల ప్రజలలో ద్వేషాన్ని పెంచింది. జాతీయభావాన్ని బలపరచింది. ఈభావం క్రమక్రమంగా బలపడి, జాతీయభావ ప్రాబల్యంచేత దశలువారిగా స్వాతంత్ర్యోద్యమరూపంలోసాగి 1947లో దేశస్వాతంత్ర్య సంపాదనతో ముగిసింది. అందుచేతనే కర్జన్ పరిపాలన, బెంగాలు రాష్ట్ర విభజన, వందేమాతర ఉద్యమం స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అత్యంత ప్రాధాన్యాన్ని వహిస్తున్నవి.

చదవదగిన గ్రంథాలు

Karan Singh ; Auravindo : The Prophct of Indian Nationalism

Argov : Moderates and Extremists

Bhavan : Vol Xl

Tarachand : Vol lll

B. L. Glover . British Policy towards Indian Nationalism.

# అధ్యాయము - 12

## వందేమాతర ఉద్యమము

### 1

నిరంకుశుడైన కర్జన్ ప్రభువు ప్రజాభిప్రాయాన్ని ఏమాత్రమూ లక్ష్యపెట్టక బెంగాలు రాష్ట్రాన్ని రెండుగావిభజించాడు. విభజనను రద్దుగావించుటకు ప్రజలు సాగించిన ఉద్యమానికి వందేమాతర ఉద్యమం అనేపేరు చరిత్ర గ్రంథాలలో ప్రసిద్ధికి వచ్చింది. ఈపేరు ఏవిధంగా సార్థకమైనదీ ఇదివరలోనే తెలియపరచాము. ప్రస్తుతం దీనిచరిత్రను తెలుసుకొనడం అవసరం.

ప్రథమంలో వారి అలవాటు ప్రకారం రాజకీయ నాయకులు సభలు సమావేశాలు జరిపి విభజనను నిరసిస్తూ తీర్మానాలను గావించి దానిని రద్దుచేయవలసినదిగా అధికారులకు వినతిపత్రాలను పంపారు. కర్జన్ వీటికి ఏమాత్రము చలించలేదు. అతని తర్వాత రాజప్రతినిధిగా వచ్చిన మింటో ప్రభువు (1905-1911) గాని ఆకాలంలో ఇండియా మంత్రిగాఉండిన మార్లేగాని ప్రజాభీష్టానికి లొంగక కర్జన్ విధానాన్నే అనుసరించారు. వీరినికాదని బ్రిటన్‌లోని పార్లమెంటుగాని, ప్రజలుగాని విభజనను రద్దుచేయుటకు సిద్ధపడలేదు. విభజన అన్యాయమని వీరిలో కొందరు భావించినా అధికసంఖ్యాకులు భారతీయ వ్యవహారాలపట్ల విముఖులై ఉండడం వారిప్రకృతి. ఈవిషయంలోకూడా వారు అలాటి వైఖరినే అనుసరించారు. భారతదేశంలోని ఉన్నతఉద్యోగివర్గం ఇంకొకరాష్ట్రం నిర్మాణం కావడంచేత తమకు ఉన్నతోద్యోగాలను సంపాదించుటకు ఎక్కువఅవకాశం ఉండగలదనే కారణంచేత మొదటినుండీ విభజనను సమర్థించారు. ఈవిధంగా ప్రజల అభీష్టాన్ని అర్థంచేసుకొనుటకుగాని దానిని నెరవేర్చుటకుగాని బ్రిటిష్ వారిలో అధికారులుగాని అనధికారులుగాని-ఎవరూ ముందుకు రాలేదు. బెంగాలీల అభిప్రాయం అరణ్యరోదనంగా పరిణమించింది.

కాని ఇంతమాత్రంచేత ప్రజలు ఆశాభంగాన్ని పొందలేదు. ఏ విధంగానైనా అధికారులను లొంగదీసి, వారివైఖరిని మార్చుటకు కృతనిశ్చయులైనారు. ఈ కారణంచేత 1905 మొదలు 1911 వరకు బెంగాలు ప్రభుత్వమూ ప్రజలమధ్య ఒక రణరంగంగా రూపొందింది. ఈ ప్రచ్ఛన్నయుద్ధంలో ప్రజలు ఆయుధాలను ఉపయోగించకపోయినా ప్రభుత్వాన్ని లొంగదీయుటకు సాధనాంతరాలను వినియోగించినారు. ఇందులో వారికి జాతీయవాదులతత్వము,

దానిని సాధించుటకు వారు సూచించిన సాత్త్వికనిరోధము ఎంతగానో సహాయ పడినవి.

ప్రజల ఉద్యమాన్ని అణచుటకు అన్నికాలాలలోను అన్నిదేశాలలోను ప్రభుత్వానికి దండనాధికారం తుదిసాధనం. దానిని వారు పోలీసు దళాలు, జైళ్లు, శిక్షాస్మృతి, ప్రజలపై విధించే ఇతర నిర్భంధాలు మొదలైనవాటిద్వారా వినియోగించడం పరిపాటి. ఒక్కొక్కప్పుడు అది సామదానభేదోపాయాలను వినియోగించి ప్రజాశక్తిని బలహీనపరచుటకు ప్రయత్నించవచ్చు. వందేమాతర ఉద్యమాన్ని అణచడంలో బ్రిటిష్ప్రభుత్వం ఈ ఉపాయాలనన్నిటినీ వినియోగించింది; కాని వీటిమూలంగా ప్రజాశక్తి ఎక్కువగా బలహీనతగాంచలేదు. అందుచేత వారికి దండనాధికారమే ప్రధానసాధనమైంది, జైలు శిక్షలు, ద్వీపాంతరవాసశిక్షలు, జరిమానాలు, వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, ప్రయాణస్వాతంత్ర్యము మొదలైనవాటిపై క్రొత్త నిర్బంధాలు, న్యాయస్థానాల విచారణతో నిమిత్తంలేక శిక్షలు విధించుట - ఈలాటివాటిమూలంగా ప్రభుత్వం దాని దండనాధికారాన్ని నిరంకుశంగా వినియోగించింది. కాని వీటిమూలంగా ప్రభుత్వం ఆశించిన ఫలితం పూర్తిగా లభించలేదు. బహిరంగంగా ప్రభుత్వాన్ని ఎదుర్కొనుటకుబదులు ప్రజలలో ఒకవర్గంవారు రహస్యంగా ఆయుధాలను సేకరించి అధికారులను హత్యచేయడం, ధనాగారాలను దోచుకొనడం, మొదలైన అరాచకచర్యలలోకి దిగారు. సాయుధపోరాటం మూలంగానే పరాయి ప్రభుత్వాన్ని లొంగదీయడం సాధ్యమౌతుందిగాని జాతీయవాదులు సూచించిన సాత్వికనిరోధం దీనికి తగినమార్గంకాదని వీరు విశ్వసించారు. అందుచేత వందేమాతర ఉద్యమం చాలవరకు సాత్త్వికనిరోధసాధనానను, కొంతవరకు ఉగ్రవాదులు (Terrorists) లేవదీసిన దౌర్జన్యవిధానానను, సాగింది.

ప్రజలలో రాజకీయచైతన్యంగాని రాజకీయాలపట్ల ఆసక్తిగాని లేని రోజులలో బ్రిటిష్వారు దేశాన్ని జయించి నిరంకుశంగా పాలించగలిగారు. ఆ రోజులలో ప్రభుశక్తిని ఎదుర్కొని దానితో సవాలుచేయగల ప్రజాశక్తి ఉండినదికాదు. కాని పందొమ్మిదవ శతాబ్దంలో-అందులో ముఖ్యంగా 1858 తర్వాత-ప్రజల వైఖరిపూర్తిగా మారింది. ఇంగ్లీషు విద్య వ్యాపించడంచేతను, ఖండాంతరాలలోని ప్రజలు పరాయిప్రభుత్వాలను ఏలాగు నిర్మూలించినదీ తెలియడం చేతను, మతసంస్కర్తలు సంఘసంస్కరణవాదులు గావించిన ప్రచారఫలితంగాను, ప్రాచీనకాలంలో భారతీయులు అన్నిరంగాలలో ఔన్నత్యాన్ని సాధించినవారని చారిత్రక పరిశోధకులు స్పష్టంచేయడంచేతను, వార్తాపత్రికలు, కవులు, నవలా రచయితలు, నాటకరచయితలు మొదలైనవారు రచించిన వాఙ్మయప్రభావం చేతను ప్రజలు పూర్తిగామారిపొయ్యారు. తమజాతిపట్ల వారికి గౌరవాభిమానాలు పెంపొందాయి. 1900 నాటి భారతీయులకూ 1800 నాటి వారికీ ఏలాటి పోలికాలేదు. కాని పరాయిపరిపాలకులు ఈ మార్పును గ్రహించలేకపొయ్యారు. బెంగాలురాష్ట్ర విభజనవిషయంలోను, ఇతర విషయాలలోను వారు అనుసరించిన

వితండవాదానికి ఈ అజ్ఞానమేమూలకారణం. శైశవంలోను బాల్యంలోను ఉన్న పిల్లలపట్ల వయస్సువచ్చి ప్రాజ్ఞులైనతర్వాతకూడ పూర్వంవలెనే తల్లిదండ్రులు ప్రవర్తించడం ఎంతటి అప్రాజ్ఞతయో 1900 నాటి భారతీయులపట్ల 1800 నాడు ప్రవర్తించినట్లు ప్రవర్తించడం అంతటిఅప్రాజ్ఞత అని బ్రిటిష్‌వారు గ్రహించలేకపోయ్యారు వారి విధానాలన్నీ విఫలములగుటకు ఇదియే ప్రధాన కారణం.

ప్రభుశక్తితో తులతూగగల ప్రజాశక్తి ఇంకొకటి దేశంలో అవతరించింది. రెండు శక్తులు దేశంలో ఉండడంచేతనే వందేమాతర ఉద్యమం సాధ్యమైంది. ప్రభుశక్తికంటె ప్రజాశక్తి బలవత్తరమైనదని. ఈ ఉద్యమం స్పష్టంచేసింది. ఇది రాష్ట్రవిభజనను రద్దుచేయడంలో మాత్రమే విజయాన్ని సంపాదించినట్టిదికాదు. దీనిమూలంగా ప్రజలలో రాజకీయచైతన్యం, దేశాభిమానం, జాతీయత మరింత వృద్ధిగాంచి దేశంయొక్క సంపూర్ణస్వాతంత్ర్యానికి దారితీసింది.

## 2

రాష్ట్రవిభజన జరుగుతుందని తెలిసినప్పటినుండి కలకత్తాలోను, ఇతర పట్టణాలలోను, గ్రామాలలోను సుమారు 2000 సమావేశాలు జరిగాయి. వీటిలో 500 మొదలు 50,000 జనం పాల్గొన్నారు. 1905 జనవరి 10 న కలకత్తాలో జరిగిన బ్రహ్మాండమైన సభలో రాష్ట్రవిభజనను ఖండిస్తూ, పరిపాలన సౌలభ్యార్థం సాధనాంతరాలు సూచింపబడినాయి. మార్చి 10 న జరిగిన సభలో కర్జన్ కలకత్తా విశ్వవిద్యాలయ స్నాతకసభలో చేసిన ఉపన్యాసాన్ని, అతని విధానాలనూ పూర్తిగా ఖండించారు. దీనిని గురించి దేశమందంతటా సమావేశాలు జరిగాయి. ఇండియామంత్రి విభజనను ఆమోదించినట్లు తెలిసినవెంటనే సుమారు 70,000 సంతకాలతో దానిని రద్దుచేయవలసినదిగా ఒక వినతిపత్రాన్ని పంపారు. ఈ సూచనలు, నిరసనలు నిష్ఫలములుకావడంచేత జూలై 6 న బ్రిటిష్ వస్త్రాలను బహిష్కరించడమే విభజనరద్దుకు పటిష్టసాధనమని మొట్టమొదటిసారిగా కలకత్తాలోని సంజవాణి అనే వారపత్రిక సూచించింది. క్రమక్రమంగా ఇతర పత్రికలుకూడా ఈ అభిప్రాయాన్ని వ్యక్తంచేశాయి. జూలై 13 న బాగర్ ఘాట్‌లో జరిగిన మహాసభలో బహిష్కరణను ఆమోదిస్తూ ఒక తీర్మానాన్ని చేశారు. ఈ విధంగా జూలైనుండి బహిష్కరణతప్ప మార్గాంతరంలేదనే అభిప్రాయం రాష్ట్రమందంతటా వ్యాపించింది.

1905 ఆగస్టు 7 న కలకత్తా టౌన్‌హాలులో జరిగిన సభ అంతకుపూర్వం జరిగిన సభలన్నిటికంటె ఎక్కువ ప్రాధాన్యాన్నివహించింది. వేనకువేలు జనం రావడంచేత టౌన్‌హాలులో సభ జరగడం సాధ్యంకాక మూడు ప్రత్యేక సభలు జరిగాయి. సుమారు 20,000 విద్యార్థులు వందేమాతర పతకాలనుధరించి, ఊరేగింపుగా నగరంలోని ప్రధాన ప్రాంతాలలో తిరిగి, సభకు హాజరైనారు. నగరంలో పూర్తిహర్తాళు జరిగింది. రాష్ట్రవిభజన రద్దయ్యేవరకు బ్రిటిష్‌వస్త్రా

లను బహిష్కరించవలసినట్లు ఏకగ్రీవంగా తీర్మానాన్ని చేశారు. అందరు బహిష్కరణకుసుముఖులయ్యారు.

1905 సెప్టెంబరు 28 న బెంగాలీలందరు దుర్గపూజను జరిపేపర్వదినం. ఆరోజున కుండపోతగా వర్షంపడినా వేలాది ప్రజలు కాళికాలయంలో సమావేశమై, విదేశవస్తువులను బహిష్కరించవలసినదిగాను, విదేశవస్తువులను విక్రయించే దుకాణాలలో ఏలాటి వస్తుపులను కొనరాదనిన్నీ, సర్వవిధాలా దేశమాతకు దాస్యవిముక్తి కలిగించుటకు దీక్షవహించవలసినట్లుగాను, మంత్రసహితంగా ప్రతిజ్ఞచేశారు. దీనితో బహిష్కరణ ఉద్యమం స్వాతంత్ర్యసంపాదన ఉద్యమంగా మారింది. ఇదే బెంగాలులో స్వాతంత్ర్య సమరం ప్రారంభమైన పవిత్రదినమని అనేక చరిత్రకారుల అభిప్రాయం. ఆరోజున ప్రజలు ప్రదర్శించిన ఉత్సాహాము ఆవేశము, ఉద్రేకము అపూర్వములు.

1905 అక్టోబరు 10న రాష్ట్ర విభజన అమలులోకి వచ్చింది. అది తమ జాతికి ఘోరవిపత్తును తెచ్చిపెట్టిన దుర్దినంగా బెంగాలీలు భావించారు. పరాయి ప్రభుత్వం తమ జాతిని రెండుగా విడదీసినా రెండు రాష్ట్రాలలోని బెంగాలీలు ఒకేజాతి వారని రుజువు చేయుటకు మహాకవి రవీంద్రనాథుడు చేసిన సూచన మేరకు ఉదయమే గంగలో స్నానంచేసి, ఒక్కొక్క బెంగాలీ ఇంకొక బెంగాలీ చేతిలో వసుపుతోరాన్ని కట్టి, రక్షాబంధన సంప్రదాయాన్ని పాటించారు. ఆరోజు అనేకనగరాలలో పూర్తి హర్తాలు జరిగింది. ప్రజలు ఉపవాసం చేశారు. ఏ ఇంటిలో కూడా పొయ్యి వెలగలేదు. జాతి సమైక్యతను సూచించుటకు రవీంద్రనాథుడు ఒక ప్రత్యేక గేయాన్ని రచించాడు. దానిని పాడరాదని ప్రభుత్వం నిషేధించినా ప్రజలు నిషేధాజ్ఞను ఉల్లంఘించి మరింత ఆవేశంతో దానిని పాడసాగారు. ఆరోజున కలకత్తాలో జరిగిన మహాసభలో రెండు రాష్ట్రాలు కలసి ఒక సమాఖ్యగా (Federation) ఏర్పడవలసినట్లు ఒక తీర్మానంచేసి, దానికి చిహ్నంగా ఒక సమాఖ్యాభవనాన్ని నిర్మించదలచి, దానికి పునాదులు వేశారు. బహిష్కరణ ఉద్యమానికి అనుబంధమైన స్వదేశీఉద్యమాన్ని విజయవంతంగా సాగించుటకు సభలో రు. 70,000 ల విరాళాలను వసూలు చేశారు. రాష్ట్రవిభజనరద్దుకు సాధనాలుగా భావింపబడిన బహిష్కరణ స్వదేశీ ఉద్యమాలు ఇప్పటినుంచి తీవ్రరూపం ధరించాయి. వాటి మూలంగా పరాయి ప్రభుత్వాన్ని లొంగదీయుటకు ప్రజలు నిర్ణయించుకొన్నారు.

ఇందులో అన్ని వర్గాలకూ చెందిన ప్రజలు పాల్గొన్నారు. ఎవరికి తోచినట్లు వారు బహిష్కరణోద్యమానికి బలంచేకూర్చారు. విద్యార్థులు విదేశీ కాగితాలపై పరీక్షలను వ్రాయడం నిరాకరించారు. విదేశీ కాళ్లజోళ్ళు వేసుకొనడం మాని వట్టికాళ్ళతో విద్యాలయాలకు వెళ్ళారు. ఈలాగు విద్యాలయాలకు రాకూడదని అధికారులు నిషేధించి, వారిలో కొందరికి శిక్షవిధించినా ఆ శిక్షను సంతోష పూర్వంగా అనుభవించారు. చాకలివాండ్రు విదేశీ బట్టలను ఉతుకుటకూ, కాలిజోళ్లు రిపేరుచేసేవారు విదేశీ జోళ్ళను రిపేరు చేయుటకూ

నిరాకరించారు. వంటవాండ్లు విదేశీ వస్తువులను వాడేవారి ఇండ్లలో వంట చేయడం మానుకొన్నారు. పౌరోహితులు అలాటివారి ఇండ్లలో పౌరోహిత్యం చేయరాదని తీర్మానించారు. శాస్త్ర గ్రంథాలను వ్యాఖ్యానం చేసేవారు విదేశీ వస్తువులను వాడడం శాస్త్ర విరుద్ధమని ప్రచారం చేశారు. దేశాటనం చేసే సన్యాసులు కూడా ఈలాటి ప్రచారంలో గొప్ప పాత్రను వహించారు. ఎన్నడూ ఇండ్లను విడిచి ఎరుగని సామంత కుటుంబాలకు చెందిన స్త్రీలుకూడా గోషాపద్ధతిని వదలి, వీధులవెంటతిరిగి, విదేశీవస్తువుల బహిష్కరణను స్వదేశీ వస్తువుల వాడకమును ప్రచారం చేశారు. జమీందార్లు వారి గుమాస్తాలను జమీందారీ భూములను వ్యవసాయం చేసే రైతులవద్దకు పంపి బహిష్కరణ ఉద్యమాన్ని ప్రచారం చేయవలసిందిగా ఆదేశించారు. ఈ విధంగా అన్ని కులాల వారు అన్ని వర్గాలవారు ఉద్యమంలో పాల్గొన్నారు. అందుచేతనే 1905 ఆఖరుకు ఇది రాష్ట్రవ్యాప్తమైన ఉద్యమంగా పరిణమించింది. దీనిచే ప్రభావితుడు కాని బెంగాలీ ఒకడు కూడా లేకపోయాడు. ప్రథమదశలో దీనిపట్ల ముస్లింలు కూడా హిందువులతో సమానంగా ఉత్సాహాన్ని ప్రదర్శించారు.

## 3

ప్రథమంలో ఈఉద్యమం బ్రిటన్‌లో తయారయ్యే వస్త్రములకు మాత్రమే పరిమితమైంది. కాని క్రమక్రమంగా బ్రిటిషు వస్తువులన్నింటిని బహిష్కరించవలసినదిగా ప్రచారం సాగింది. సీమచక్కెర, సీమ ఉప్పు, సీమనుండి వచ్చే ఇతర పదార్థాలు వాడరాదనే నిర్ణయానికి ప్రజలు వచ్చారు. ఇంతేకాదు, బ్రిటిషు వస్తువులను వాడడము మాత్రమేగాక బ్రిటిషువారితో ఎలాటి సంబంధమూ ఉండరాదనే అభిప్రాయం రాష్ట్రమంతటా వ్యాపించింది. బెంగాలీలు ఇంగ్లీషు భాషలో మాట్లాడరాదని, గౌరవ పదవులను విసర్జించవలసిందని, విదేశీ వస్తువులను వాడే వారి ఇండ్లలో భోజనం చేయరాదని, వారితో ఏలాటి సంబంధాలు పెట్టుకొనరాదని, వారి దుకాణాలలోని వస్తువులను కొనరాదని, వారి ఇండ్లలో మంగళ్ళుగాని, చాకళ్ళుగాని పనిచేయరాదని, వారి పిల్లలతో కలిసి ఆటలలో పాల్గొనరాదని, ప్రచారం సాగింది.

సభలు, సమావేశాలు, వినతిపత్రాలు నిష్ఫలములు కావడం చేతనే ప్రజలు బహిష్కరణోద్యమాన్ని చేపట్టారు. దీనిమూలంగా బ్రిటన్‌లోని మిల్లు యజమానులు కార్మికులు నష్టపడడం తప్పదనీ, దాని ఫలితంగా వారు బ్రిటిష్ ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి, రాష్ట్ర విభజనను రద్దు చేయగలరనే విశ్వాసంతో ఈ ఉద్యమాన్ని సాగించారు జాతీయ వాదులు సూచించిన కార్యక్రమంలో ఇది ఒక ప్రధాన అంశం అని ఇదివరకే తెలుసుకొన్నాము.

బహిష్కరణ ఉద్యమంలో స్వదేశీ ఉద్యమం ఒక ప్రధాన భాగం. ఈ రెండూ పరస్పరాశ్రయాలు. బహిష్కరణ ఉద్యమం మూలంగా విదేశ వస్తువుల వాడకం తగ్గుతుంది కాని వీటిసానే ప్రజలకు స్వదేశ వస్తువులు లభించడం చాలా

అవసరం. వస్త్రాలులేక కాలిజోళ్లు లేక చక్కెర లేక వారు జీవితాన్ని సాగించ లేరు. అందుచేత స్వదేశ వస్తువుల వాడకాన్ని ప్రోత్సహించినప్పుడే బహిష్కరణ ఉద్యమం ఫలప్రదమౌతుంది. స్వదేశ వస్తువుల ఖరీదు విదేశీ వస్తువుల ఖరీదుకంటే ఎక్కువగా ఉండడం చేతనే ఇంతకుపూర్వం విదేశీవస్తువులపట్ల ఎక్కువ మోజు ప్రజలలో వ్యాపించింది. ప్రస్తుతం వారు కొంత నష్టాన్ని భరించి అయినా, ఎక్కువ ఖరీదుపెట్టి స్వదేశ వస్తువులను కొనడం అవసరమని ప్రచారం చేయవలసి వచ్చింది. ఏక కాలంలో రెండు ఉద్యమాలను సాగించినప్పుడే అవి విజయవంతం కావడం జరుగుతుంది. ఈ సత్యాన్ని గ్రహించడం చేత బహిష్కరణ ఉద్యమంతోపాటు స్వదేశీ ఉద్యమాన్ని కూడా ప్రచారం చేశారు.

ఈరెండూ పరస్పరాశ్రయాలు అనే విషయాన్ని విస్మరించి కాంగ్రెసుకు చెందిన మితవాదులు స్వదేశీపట్ల సుముఖులైనా, బహిష్కరణపట్ల విముఖు లయ్యారు. బహిష్కరణ ద్వేషాన్ని పురికొల్పే సాధనమని వారు వాదించారు. 1907లో కాంగ్రెసులో ఏర్పడిన చీలికకు ఇది ఒక ప్రధానకారణం. మితవాదుల వాదం చాలాసంకుచిత మైనదని ప్రత్యేకంగా చెప్పవలసిందిలేదు. వందేమాతర ఉద్యమానికి, బెంగాలు రాష్ట్రవిభజనకు బ్రిటిష్ అధికారులు భారతజాతిని ద్వేషించడమే జన్మస్థానం. ఆద్వేషాన్ని ఎదుర్కొనుటకు సాధనాంతరాలు లేని కారణాననే బహిష్కరణ సాధనాన్ని చేపట్టవలసి వచ్చింది.

## 4

1905 నుండిఈ రెండుఉద్యమాలను తదేకదీక్షతో సాగించడంలో బెంగాలు రాష్ట్రంలోని వారికి అనేక సదుపాయాలు లభించినాయి. అదృష్టవశాత్తున ఆకాలంలో రాష్ట్రంలో గొప్పనాయకులనేకులుండినారు. సురేంద్రనాధుడు, బిపిన్ చంద్రపాలు, మోతిలాలుగోషు, లాల్ మోహన్ గోషు, ఆనందమోహన్ బోసు, అశ్వినీకుమారదత్తు మొదలైనవారు రాజకీయోద్యమాలను నడుపుటలో సిద్ధహస్తులు. అనేక దశాబ్దాల అనుభవం కలవారు. ప్రభుత్వ విధానాలను ఖండించడంలో ధైర్యసాహసాలను ప్రదర్శించినవారు. వీరునిజయాతీకి పేర్గాంచినవారు. వీరి దేశాభిమానాన్ని శంకించిన వారెవరూ లేరు. వారందరుగొప్ప వక్తలు. మైకులులేని రోజులలో వేలాదిజనానికి వినబడేటట్లు గంభీరంగాను ఉద్రేకపూరితంగాను ఉపన్యసించేవారు. 1906నుండి అరవిందుడు రంగంలోప్రవేశించి తక్కిన నాయకులకంటె ఎక్కువ ప్రఖ్యాతిని సంపాదించినాడు.

నాయకులేగాక ఉద్యమాన్ని సాగించడంలో అనేక సంఘాలు సమితులు సహాయ పడినవి. భూస్వాముల సంఘం, బ్రిటిష్ ఇండియా సంఘం చాలాకాలంగా రాజకీయరంగంలో కృషిచేసి ప్రఖ్యాతిగాంచి నట్టివి. ఇవి బహిష్కరణ ఉద్యమాన్ని స్వదేశీ ఉద్యమాన్ని సమర్థించడమేగాక జాతీయ విద్యవ్యాపించుటకై కొత్త విద్యాలయాలను స్థాపించుటలో ఎంతగానో సహాయ పడినవి. ఇవిగాక రాష్ట్రమందంతట ఉద్యమాన్ని ప్రచారంచేయుటకు అన్నినగరాలలో కొత్త

సంఘాలు అనేకం స్థాపింపబడినాయి ఇవి ప్రచారార్థం స్వచ్ఛంద దళాలను నెల కొల్పి, విరాళాలను సంపాదించి, మారుమూలలలో కూడా ఘనమైన కృషిని గావించినాయి.

ఉద్యమప్రచారంలో వార్తాపత్రికలు ఎంతగానో తోడ్పడినవి. బెంగాలీ, అమృతబజారు పత్రిక, నవభారతం (New India) మొదలైన పాతపత్రికలేగాక కొత్తవి అనేకం ప్రచార రంగంలోకి దిగినవి. అవికూడా ఉభయ బెంగాలులలోని ప్రాంతాలన్నిటి నుండి వెలువడినవి. వీటిలో వివేకానందుని సోదరుడు భూపేంద్రనాద్ దత్తా, అరవిందుని సోదరుడు బరేంద్రకుమార్ గోషులు కలిసిప్రచురించిన యుగాంతర్ పత్రిక, బ్రహ్మ బాంధవ ఉపాధ్యాయుని సంధ్య, అరవిందుని సంపాదకత్వాన ప్రకటించబడిన వందేమాతర పత్రిక, ప్రధానంగా పేర్కొనదగినవి. ఈ సందర్భంలో అనేకకరపత్రాలు, గ్రంథాలు వెలువడడంకూడా గుర్తించవలసిన విషయం. గ్రంథాలలో "బెంగాలుకు ఎవరురాజులు" అనేది, "సువర్ణ బెంగాలు" అనేది ప్రసిద్ధి గాంచినాయి. మొదటిదానిలో బ్రిటిషువారు బెంగాలును పాలించుటకు తగినవారు కారనియు, వారు ప్రజలరక్తాన్ని పీల్చి, సమస్త బాధలకు గురిచేసే వారనియు, ప్రజలే రాజులనియు వివరింపబడినది. రెండవ పుస్తకంలో సువర్ణబెంగాలు ఏవిధంగా బ్రిటిష్ పరిపాలన మూలంగా దారిద్ర్యాన్ని అనుభవించ వలసివచ్చినదీ స్పష్టము చేయబడినది. ఈ విధంగా వార్తా పత్రికల సంపాదకులు గ్రంధకర్తలు ఉద్యమంపట్ల ప్రజలకుగల ఉత్సాహంతగ్గకుండా ఉండేటట్లు ఉద్రేకపూరితములైన రచనలద్వారా గొప్పకృషిని గావించినారు. ఈ కాలంలో టాగూరువంటి మహాకవులు దేశాభిమాన పూరితములైన గేయాలనెన్నిటినో రచించి, ఉద్యమ వ్యాప్తికి ఎంతగానో తోడ్పడినారు.

ఈలాటివారి తోడ్పాటు ఒకఎత్తు, విద్యార్థుల తోడ్పాటు ఇంకొకఎత్తు వేనకువేలు విద్యార్థులుఉద్యమంలో స్వచ్ఛందసేవకులుగాపాల్గొనడంచేతనే నాయకులు మొదలైనవారు తలపెట్టిన బహిష్కరణ ఉద్యమం, స్వదేశీ ఉద్యమం మొదలైనవన్నీ ఫలప్రదము కాగలిగినవి. అందుచేతనే మొదటినుండి ప్రభుత్వం ఉద్యమాన్ని అణచివేయడంలో విద్యార్థులపై కఠినచర్యలను తీసుకొనడాన్ని ఒక ప్రధానసాధనంగా వినియోగించింది.

## 5

ఉద్యమానికి సహాయపడినవారు దానిని బలపరచడంలో ఒకప్రచారంమీద మాత్రమే ఆధారపడలేదు. అదిఫలప్రదం కాదని తోచినపుడు విద్యార్థులు దుకాణాల ఎదుట జట్లుగా ఏర్పడి విదేశీవస్తువులను కొనుటకు వచ్చినవారిని వాటిని కొనరాదని సర్వవిధాలా ప్రాధేయపడేవారు. ఈవిధానానికి "పికెటింగు" (Picketing) అనేపేరు వ్యవహారంలోకి వచ్చింది. విదేశీ వస్తువులను కొనినవారిని వాటిని తిరిగి దుకాణాదార్లకు ఇచ్చివేయవలసినదిగాను, వాటిఖరీదును దుకాణాదార్లు వాపసు చేయవలసిందిగాను ప్రార్థించడం "పికెటింగు"లో ఒకప్రధానాంశం.

దుకాణాదార్లు దానికి అంగీకరించని కొన్ని సమయాలలో పికెటింగు చేసేవారు తామే ఆఖరీదును ఇచ్చి, ఆవస్తువులను నడివీధిలో అగ్నిహోత్రునిపాలు చేసేవారు.

కాని "పికెటింగు" ఎల్లప్పుడు శాంతియుతంగా జరిగేదికాదు. ఒక్కొక్కప్పుడు ఇది స్వచ్ఛంద సేవకులు కొనుగోలుదార్లు దుకాణాదార్ల మధ్య కొట్లాటలకు దారితీసేది. ఆలాటి సందర్భాలలో పోలీసులు జోక్యం కలిగించుకొని పికెటింగు చేసేవారిపై లాటీలు ప్రయోగించి వారిని బాధించేవారు. కొందరిని అరెస్టుచేసి సాక్ష్యం ఉన్నా లేకపోయినా శిక్షించేవారు. ఈలాటి బాధలెన్నిటినో సహించి యువక విద్యార్థులు దేశమాతకు సేవచేయడం తమధర్మమనే భావంతో మరింత ఆవేశపరులై ఉద్యమానికి తోడ్పడినారు.

ఉద్యమాన్ని బలపరచడంలో ఉద్యమానికి విరుద్ధంగా ప్రవర్తించినవారిని అనేకవిధాలుగా బహిష్కరించడంకూడా పరిపాటి అయింది. వారితో ఏలాటి సంపర్కం ఉండరాదనేభావంతో విద్యార్థులు మొదలైనవారు ప్రవర్తించారు. మరీ మొండిపట్టుపట్టినవారిపై ఒక్కొక్కప్పుడు దౌర్జన్యచర్యలుకూడా తీసుకొనేవారు. ఆనాడు రాష్ట్రమందంతటా ఒకవిధమైన తిరుగుబాటు వాతావరణం వ్యాపించింది. ప్రభుత్వానికి ప్రజలకుమధ్య ప్రచ్ఛన్నయుద్ధంచెలరేగింది. యుద్ధంలో విజయాన్ని సంపాదించుటకు ఇరుపక్షాలవారు అన్ని ఉపాయాలను వినియోగిస్తారు. బహిష్కరణఉద్యమాన్ని నడిపినవారు ఒక్కొక్కప్పుడు ఉద్యమానికి పరమవిరోధులైనవారిపై దౌర్జన్యాన్ని వినియోగించడం ఈలాటిది.

మొదటిదశలో విదేశీవస్త్రాలకు మాత్రమే పరిమితమైన బహిష్కరణ ఉద్యమం క్రమక్రమంగా ఇతర విదేశీవస్తువులకు వ్యాపించినట్లు ఇదివరకే తెలియపరచాము. వీటిలో ఉప్పు, నూలు, పంచదార, కాలిజోళ్లు, సిగరెట్లు ఎక్కువ ప్రాధాన్యాన్నివహించాయి. మొదటి సంవత్సర బహిష్కరణఉద్యమ ఫలితంగా ఉప్పు దిగుమతులలో 1,40,000 మణుగుల తగ్గుదల, దూదివస్త్రాలలో 3 కోట్ల గజముల తగ్గుదల, నూలు దిగుమతులలో ఒక కోటి రూపాయల తగ్గుదల, కాలిజోళ్లలో 75 శాతం తగ్గుదల, సిగరెట్లలో 50 శాతం తగ్గుదల కనిపించాయి. బహిష్కరణ ఉద్యమం ఫలప్రదంకావడం ప్రారంభమైంది. 1907, 1908 లలో ఈ మొత్తాలు మరింత ఎక్కువగా పెరిగాయి. దీని ఫలితంగా బొంబాయి అహమ్మదాబాదు నగరాలలో వస్త్రాలను నూలును తయారుచేసే మిల్లులసంఖ్య వృద్ధిగాంచింది. బెంగాలులో నేనేతకూడా చాలావృద్ధిగాంచింది. సాలీల నెలసరి ఆదాయం రెండింతలు పెరిగినట్లు ఒకఅంచనా.

కాని ఈ రెండు ఉద్యమాలమూలంగా ఆర్థికలాభంకంటె రాజకీయలాభం ఎక్కువగాకలిగింది. రాష్ట్రవిభజనను రద్దుచేయించు ఉద్దేశంతో ఇవి ప్రారంభమైనాయి. కాని క్రమక్రమంగా ఈలాటి విభజనకూ, దేశం అనుభవించే ఇతర కష్టాలకూ నష్టాలకూ పరాయిపరిపాలనే మూలకారణమనీ, అది తొలగినపక్షాన అన్ని కష్టాలు నిర్మూలంకాగలవనీ, ప్రజలు వాంఛించవలసింది సంపూర్ణ

స్వాతంత్ర్యమనీ ప్రజలూ నాయకులూ భావించసాగారు. వందేమాతర ఉద్యమం యొక్క ఆశయం ఈ విధంగా విశాలతరమైంది. ప్రజల లక్ష్యం స్వరాజ్యసంపాదనగా మారింది. విభజనరద్దు అనే ఆశయం వెనుకబడిపోయింది.

## 6

జాతీయవాదులతత్వంలోను, వారు సూచించిన కార్యక్రమంలోను జాతీయవిద్యకు ఒక ప్రధానస్థానం లభించినట్లు ఇదివరకే తెలుసుకొన్నాము. బహిష్కరణఉద్యమంలో విద్యార్థులు పాల్గొనడంచేత, వారిపై ప్రభుత్వం కఠిన చర్యలు తీసుకొనినది. పోలీసుదళాలు వారిని కొరడాలతోను లాఠీలతోను కొట్టి బాధించడమేగాక ఆలాటి విద్యార్థులు చదివే విద్యాలయాలకు గ్రాంటులను ఇయ్యరాదనే నిషేధాజ్ఞలను జారీచేసింది. వారిపై జరిమానాలను విధించవలసినట్లుగాను, వారిని అవసరమైనపక్షంలో విద్యాలయాలనుండి తొలగించవలసిందిగాను, వారిని పరీక్షలకు హాజరుకాకూడదని నిషేధించవలసిందిగాను ఆదేశించింది. కొన్ని విద్యాలయాల అధికారులు ఈ విధంగా విద్యార్థులను శిక్షించడానికి ఇష్టపడక, వీటిస్థానే జాతీయవిద్యాలయాలను స్థాపించుటకు నిర్ణయించుకొని 1906 లో కొన్ని నగరాలలో ఆలాటివాటిని స్థాపించారు.

ఇంతకు పూర్వమే 1905 నవంబరు 10 న కలకత్తా పురప్రముఖులనేకులు ఒక మహాసభలో సమావేశమై జాతీయపురోభివృద్ధికి అనుగుణంగా దేశీయుల అధ్వర్యాన ఒక విద్యావిధానాన్ని రూపొందించవలసిందిగాను, అందుకు ఒక జాతీయ విద్యాసంఘాన్ని (National Council of Education) స్థాపించవలసిందిగాను తీర్మానించారు. ఇందుకుగాను సమావేశానికి హాజరైనవారిలో ముగ్గురు ఎనిమిది లక్షల రూపాయల విరాళాలను, ఇంకొకరు ఏటేట రు. 30,000 ల ఆదాయంవచ్చే స్థిరాస్తిని విరాళాలుగా ఇచ్చారు. ఈ సమావేశానికి అన్ని రాజకీయపార్టీలవారు, ఏ పార్టీకిచెందని ప్రముఖులనేకులు హాజరయ్యారు. ఆనాడు విద్యార్థులలోను, ఇతరవర్గాలలోను కలకత్తావిశ్వవిద్యాలయం ఒక గొలాంఖానా (బానిసలను తయారుచేసే ప్రదేశం) అనేభావం వ్యాపించి ఉండినది జాతీయవిద్యా సంఘస్థాపన దానిఫలితంగానే జరిగింది. 1906 డిసంబరులో కలకత్తాలో సమావేశమైన కాంగ్రెసు, జాతీయవిద్యను సమర్థిస్తూ ఒక తీర్మానంచేసింది. ఈ విధంగా బహిష్కరణ, స్వదేశీఉద్యమాలకు విశాలార్థం కల్పించబడింది. ప్రతిరంగంలో, ప్రజలు స్వదేశీఉద్యమాన్ని అనుసరించవలసి ఉన్నదని, భారతదేశ శ్రేయస్సు వృద్ధిగాంచుటకు పారిశ్రామిక, రాజకీయ, విద్యారంగాలలో పూర్తిగా స్వదేశీయతను అనుసరించవలసిఉన్నదని కాంగ్రెసులో జాతీయవిద్యకు సంబంధించిన తీర్మానాన్ని ప్రతిపాదించిన హిరేంద్రనాథ దత్తా ఉద్ఘాటించాడు. దీనిచే అన్ని రాష్ట్రాలలోనివారు ప్రభావితులైనారు.

## 7

బహిష్కరణ స్వదేశీ ఉద్యమాలకు ప్రజలు కల్పించిన అర్థం నానాటికి విపులతరం కావడమే కాకుండా ఈ ఉద్యమాలు బెంగాలుకుమాత్రం పరిమితం కాక అన్నిరాష్ట్రాలలోకి వ్యాపించాయి. బెంగాలురాష్ట్ర విభజన బెంగాలీలకు మాత్రమే పరిమితమైన సమస్యకాదనీ, అది అఖిలభారత సమస్య అనీ దానిని ఎదుర్కొని పరిష్కరించడంలో ప్రభుత్వంతో బెంగాలీలు సాగిస్తున్న పోరాటం లో భారతీయులందరు పాల్గొనడం అవసరమనీ అన్నిరాష్ట్రాలలోని నాయకులూ ప్రజలూ భావించసాగారు. దానికి చిహ్నంగా 1906లో బొంబాయి రాష్ట్రాన నుండి తిలక్, మధ్యపరగణాలనుండి కపర్ది, పంజాబునుండి లజపత్‌రాయ్ మొదలైన నాయకులు బెంగాలుకువచ్చి, ఉత్తేజకరములైన ఉపన్యాసాలు గావించి ప్రజల ఉత్సాహాన్ని ఇనుమడించారు. మొదటిసారిగా కలకత్తాలోను ఇతరనగరాలలోను శివాజి ఉత్సవాన్ని బెంగాలీలు జరిపారు. విభజన రద్దుకుగాను ప్రారంభమైన ఉద్యమం స్వరాజ్యోద్యమంగా రూపొంది అన్ని రాష్ట్రాలవారిని ఆకర్షించింది. ప్రతిరాష్ట్రంలోను బహిష్కరణ ఉద్యమాన్ని స్వదేశీ ఉద్యమాన్ని జాతీయవిద్యను ప్రచారం చేయుటకు, స్వదేశీవస్తువుల విక్రయశాలలను స్థాపించుటకు ప్రయత్నాలు జరిగినవి.

ఈ సందర్భంలో 1907 ఏప్రిలు మేనెలలలో బిపిన్ చంద్రపాల్ ఆంధ్రపర్యటన గొప్ప ప్రాధాన్యాన్ని వహించింది. ఆయన విశాఖపట్టణం, కాకినాడ, రాజమండ్రి, బెజవాడ, బందరు నగరాలకువెళ్ళి, అక్కడి ప్రజలను ఉత్తేజపరచేటట్లు స్వరాజ్యము, బహిష్కరణ, స్వదేశీ, జాతీయ విద్యలగురించి గంభీరంగా ఉపన్యసించి, మద్రాసుకువెళ్ళి అక్కడకూడా అయిదురోజులు వరుసగా ఈ విషయాలగురించి ఉపన్యసించాడు. వీరి పర్యటన సమయంలోనే రాజమండ్రి కళాశాల విద్యార్థులు వందేమాతర పతాకాలతో క్లాసులకువెళ్ళడం, అందుకుగాను శిక్షింపబడడం జరిగింది. ప్రెయినింగుకళాశాలలో ఆనాడు విద్యార్థిగాఉండిన గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారుకూడా ఈలాటి శిక్షను అనుభవించినవారిలో ఒకరు. వీరు పాల్ ఉపన్యాసంచేసిన సభలన్నిటిలో ప్రముఖపాత్రను వహించారు. వీరుగాక కృష్ణాపత్రిక సంపాదకులైన ముట్నూరు కృష్ణారావు గారు కలకత్తానుండి బందరువరకు పాల్‌తో పర్యటించారు. రచయితగా ప్రఖ్యాతిగాంచిన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు పాల్ ఉపన్యాసాలను సభలలో తెలుగులోకి తర్జుమాచేశారు. ఆసమయంలోనే వారు దేశాభిమానపూరితములైన పద్యాలనేకాన్ని రచించారు.

పాల్ పర్యటన ఫలితంగా జాతీయవిద్యను నేర్పుటకు బందరులో కోపల్లి హనుమంతరావు కంకణంకట్టుకొని, 1911లో జాతీయకళాశాలను స్థాపించారు. తక్కినరాష్ట్రాలలో జాతీయవిద్యాలయాలు వృద్ధిగాంచినట్లే ఆంధ్రరాష్ట్రంలో కూడా అవి వృద్ధిగాంచాయి. (పాల్ పర్యటన వివరాలన్నిటిని ఈ గ్రంథకర్త ఆంధ్రలో స్వాతంత్ర్యోద్యమచరిత్ర రెండవసంపుటంలో తెలియపరచారు).

## 8

ఉద్యమాన్ని అణచి, బెంగాలీలకు ఒక శాశ్వతమైన గుణపాఠాన్ని నేర్పే ఉద్దేశంతో ప్రభుత్వం దండనాధికారంతోసహా అన్ని ఉపాయాలను వినియోగించింది. ఆనాడు రాజప్రతినిధిగా ఉండిన మింటోప్రభువు నిరంకుశచర్యలను వినియోగించడంలో పూర్తివిశ్వాసం కలవాడు. అప్పుడు ఇండియామంత్రిగఉండిన మార్లే లిబరల్ పక్షానికి చెందినవాడు. బ్రిటన్‌లో ఆనాడు లిబరల్ పక్షం అధికారంలో ఉండినది. ఈపక్షం రాజకీయ స్వాతంత్ర్యంలోను, మానవుల మౌలిక హక్కులలోను విశ్వాసం కలిగినట్టిది. ఐర్లాండుకు ఆంతరంగిక స్వాతంత్ర్యం (Home Rule) ఉండవలెనని వాదించి అందుకుగాను కొన్ని చర్యలను తీసుకొనినట్టిది. అందులో మార్లే ప్రధానపాత్ర వహించినవాడు. అట్టివాడు మింటోతీసుకొన్న నిరంకుశచర్యలను ప్రతిఘటించగలడని గోఖలేవంటి మితవాదులు విశ్వసించారు. కాని ఆవిధంగా మార్లే ప్రవర్తించలేదు. కొన్ని విషయాలలో అతడు మింటోతో ఏకీభవించకపోయినా మొత్తంమీద అతని నిరంకుశచర్యలన్నిటినీ సమర్థించాడు. అందుచేత ప్రభుత్వం తన ఇష్టానుసారం ఉద్యమాన్ని అణచుటకు అన్నివిధములైన చర్యలను తీసుకొనగలిగింది.

విద్యార్థులవిషయమై అది ఏలాటి చర్యలు తీసుకొన్నదీ ఇదివరకే తెలునుకొన్నాము. ఇదిగాక ఉద్యమం ప్రబలతరమగుటకూ వ్యాప్తిగాంచుటకూ సభలు సమావేశాలు వార్తాపత్రికలు ప్రధానసాధనాలు కావడంచేత వీటిపై అనేక నిర్బంధాలను విధించింది. ఇదిగాక నాయకులనేకులను ఏలాటి విచారణలేక జైళ్ళలో నిర్బధించింది. కలకత్తాలోను గ్రామీణప్రాంతాలలోను మార్కెట్లు అనేకం జమీందార్ల వశంలో ఉండడంచేత జమీందార్లపై ఒత్తిడితెచ్చి దుకాణదార్లు ఉద్యమంలోపాల్గొనకుండ చేయుటకు ప్రయత్నించింది. అన్నిప్రాంతాలలో — అందులో ప్రధానంగా తూర్పుబెంగాలులో — ముస్లింలను హిందువులను వేరుచేసి, ఈరెండువర్గాలమధ్య కలహాలు కొట్లాటలు జరిగేటట్లు అనేక చర్యలు తీసుకొన్నది. ఈ విభేదాలమూలంగా ఉద్యమంచల్లబడుతుందనే భ్రమకులోపడి, ఈలాగు ప్రవర్తించింది. కాని అది తీసుకొన్నచర్యలు ఫలప్రదం కాలేదు.

ఈ చర్యలన్నీతూర్పుబెంగాలులోని బారిసాల్‌నగరంలోను దానిపరిసర ప్రాంతాలలోను ఉచ్చస్థాయికి వచ్చాయి. నిరంకుశవిధానాన్ని వినియోగించడంలో పరమవిశ్వాసంగల ఫుల్లర్‌ను తూర్పుబెంగాలు అస్సాంరాష్ట్రానికి లెఫ్ట్‌నెంటు గవర్నరుగా 1905 అక్టోబరున కర్జన్ నియమించాడు. ఇతడు ఉద్యమాన్ని అణచుటకు, ఉద్యమాన్ని సాగించడంలో ప్రధానపాత్రను వహించిన హిందువులను సర్వవిధాలా బాధించుటకు ముస్లింలను వారిపైకి ఉసికొల్పుటకు సర్వప్రయత్నాలు చేశాడు ఆరోజులలో ప్రపంచమందంతటా రషియా ప్రభుత్వం నిరంకుశానికి పేరుగాంచినట్టిది. ఫుల్లరు నిరంకుశత్వం దానిని మించినదని భారతీయులేగాక బ్రిటన్‌లోనివారు అనేకులు భావించారు. ఆలాటివారిల్లో మార్లేకూడా ఒకడు.

తూర్పు బెంగాలులో ఉద్యమానికి బారిసాల్ నగరం ప్రధానకేంద్రం. ఆనాటి అగ్రశ్రేణికి చెందిన నాయకులలో ఒకడైన అశ్వినీకుమార దత్తాకు ఇది నివాసస్థానం. ఇతడు బ్రహ్మసమాజకార్యక్రమాలలో గొప్పపాత్రను వహించిన వాడు. అప్పటినుంచి ప్రజాహిత కార్యక్రమాలన్నిటిలో ముందంజవేసినవాడు. రాష్ట్ర విభజన రద్దుకుగాను బెంగాలీలు లేవదీసిన బహిష్కరణ ఉద్యమానికీ స్వదేశీ ఉద్యమానికీ జాతీయ విద్యావ్యాప్తికీ ఘనమైన కృషిని చేయుటలో నిమగ్నుడైనవాడు. అందుచేత ఫుల్లరు ఆగ్రహానికి పాత్రుడైనాడు. అతనికినీ, అతని కృషికంతకూ కేంద్రమైన బారిసాల్ నగరానికి ఒక గుణపాఠాన్ని నేర్ప నిర్ణయించి, ఫుల్లరు తననిరంకుశ విధానాన్ని ఏలాంటి గొంకూజంకూ లేకుండా బారిసాల్ నగరంలో ప్రవేశపెట్టాడు.

ఇందుకుగాను అతడుగూర్ఖా పోలీసుదళాలను బారిసాల్‌కు దానిపరిసర ప్రాంతాలకు తెప్పించాడు. వీరుప్రభుత్వ నిషేధాజ్ఞలను అమలు పరచడంలోను ఇతర విషయాలలోను విశృంఖలంగా ప్రవర్తించి ప్రజలను భీతావహులుగా చేశారు. వీధులలో తిరుగుతూ కనిపించినవారిని లాటీలతోను కొరడాలతోను కొట్టడం ఒక క్రీడగా పాటించారు. దుకాణాలనుండి ఖరీదులనియ్యక తమ ఇష్టానుసారం వస్తువులను తీసుకొనివెళ్లడం వారికి పరిపాటి అయింది. ఇండ్లలో జొరబడి వస్తువులను అపహరించడం, ఇండ్లలోని వారిపై అత్యాచారాలు గావించడం, మొదలైన అవినీతి కార్యక్రమాలను సాగించారు. ఒక రాత్రి వారు నగరమందంతటా తిరిగి ప్రజల ఆస్తిపాస్తులను దోచుకొన్నారు. ప్రజలను రక్షించవలసిన పోలీసు దళాలు ఈవిధంగా వారిని భక్షించడం కనీవినీ ఎరుగని చర్యఅని ఆంగ్లో ఇండియన్ పత్రికల ప్రతినిధులును, బ్రిటన్‌నుండి అనేక పత్రికలకు ప్రతినిధిగా వచ్చిన నెవిన్‌సన్ వివరించారు. కొన్ని నెలలు ఈ ప్రాంతంలో బ్రిటిష్ పరిపాలన బదులు గూర్ఖాల పరిపాలన సాగింది.

ఫుల్లర్ నిరంకుశత్వం అనేకరూపాలను ధరించింది. అనేక జిల్లాలలో బహిరంగ సభలను నిషేధించాడు, వీధులలో వందేమాతర నినాదాన్ని చేయడం ఒక నేరంగాభావించి, నినాదంచేసినవారిని శిక్షించవలసిందిగా ఆజ్ఞాపించాడు. గౌరవప్రాయులైన నాయకులనేకులను బారిసాల్ నగరాననుండి వెళ్ళిపోవలసినదిగా ఉత్తరవుల జారీ చేయించాడు. కొందరిని ప్రత్యేక పోలీసు కాన్‌స్టేబుళ్ళు (Special Constables)గా నియమించి, పోలీసు దుస్తులతో కవాతులలో పాల్గొనవలసినదిగా ఆదేశించాడు. విదేశీవస్తువులను విక్రయించుటకు నిరాకరించిన దుకాణాదార్లపైకి గూర్ఖాలను పంపడం జరుగుతుందని భయపెట్టాడు. ఉద్యమంలో పాల్గొన్నారనే అనుమానంతో హిందూ ఉద్యోగులనేకులను ఉద్యోగాలనుండి తొలగించాడు. తనకు స్వాగత పత్రాలను సమర్పించడంలో పాల్గొనని ప్రముఖులను కూడా ప్రత్యేక పోలీసు కాన్‌స్టేబుల్సుగా నియమించవలసినట్లు ఆజ్ఞాపించాడు. తనభీభత్స పరిపాలననుగురించి కలకత్తా మొదలైన నగరాలలోని వార్తాపత్రికలకు సకాలంలో వార్తలు అందకుండా ఉండుటకు వాటిని గురించిన తంతి

సమాచారాలనుపంపరాదని తంతితపాలా శాఖలవారికి ఉత్తరువులు జారీచేశాడు.

1906 ఏప్రిలు 14, 15 తేదీలలో బారిసాల్ నగరాన జరిగిన సమావేశ సందర్భంలో ఫుల్లర్ దారుణచర్యలు ఆకాశపథాన్ని అంటుకొన్నాయి. ఈసమావేశంలో ఉభయ బెంగాలుల ప్రతినిధులు పాల్గొనడం అధికారుల ఆగ్రహానికి ప్రత్యేకంగా గురి అయింది. తాము వేరుచేసిన ప్రజలు ఏవిధంగా కలియడమూ వారికి ఎంతమాత్రము నచ్చలేదు. వారిచర్యలన్నిటికీ ఇదే మూలకారణం.

ఈ చర్యలలో మొదటిది వీధులలో వందేమాతర నినాదాన్ని చేయరాదనేఆజ్ఞ. కాని ఇట్టిఆజ్ఞ చట్టసమ్మతంకాదనీ, దీనిని ఉల్లంఘించడం నేరంకాజాలదనీ సమావేశానికి వచ్చిన నాయకులు నిర్ణయించారు. వారిలో సురేంద్రనాథుడు ఒకడు. 14మధ్యాహ్నం ప్రతినిధులు ఊరేగింపుగా వందేమాతర నినాదాన్ని చేస్తూ సమావేశం జరగవలసిన పందిరికి బయలుదేరారు. వీధులలో రెండు వైపుల ఒక సూపరింటెండెంట్ అధ్వర్యాన పోలీసుదళాలులాటీలతో నిలబడినవి. ప్రథమంలో వారు ఊరేగింపుపై ఎలాటిచర్యలు తీసుకొనలేదు. కాని యువకులనేకులు అందులో చేరగానే వారినిచావమోది, వారిలో ఒకరినికొట్టి సమీపంలో నీళ్ళతో నిండిన చెరువులో పడద్రోశారు. అతడు అతికష్టంతోలేచి, గాయాలతో సమావేశానికి వచ్చాడు. కాని పోలీసు చర్యలు చట్టవిరుద్ధములని సురేంద్రనాథుడు సూపరింటెండెంటుతో విన్నవించి, ఆలాటి చర్యలకు వారు పూనుకొనరాదని మందలించాడు. పోలీసు అధికారి క్రుద్ధుడై అతనిని అరెస్టుచేసి, మ్యాజిస్ట్రేటు బంగాళాకు తీసుకొని వెళ్ళాడు. మ్యాజిస్ట్రేటుగదిలో ప్రవేశించిన సురేంద్రనాథుడు ఒకకుర్చీమీద కూర్చొనుటకు ప్రయత్నించగా మ్యాజిస్ట్రేటు "నీవు నాఖైదీవి! కూర్చుండుటకు నీకు అర్హతలేదని''అతనిని గదమాయించాడు. ఇది చాలా అన్యాయమని అతడు నిరసనను తెలియపరచాడు. వెంటనే మ్యాజిస్ట్రేటు కోర్టుధిక్కారంచేసినట్లు ఆరోపించి రు 200లు జరిమానాను, వందేమాతర నినాదాన్ని గురించిన నిషేధాజ్ఞను ఉల్లంఘించినందుకు ఇంకొక రు. 200లు జరిమానా విధించాడు. జరిమానాలను చెల్లించి సురేంద్రనాథుడు సమావేశానికి హాజరయ్యాడు. ఆనాడు కొంతకార్యక్రమాన్నిసాగించి తక్కినకార్యక్రమాన్ని పూర్తిచేయుటకు 15తేదికి సమావేశం వాయిదా వేయబడింది.

తే 15న సమావేశం ప్రారంభం కాగానే పోలీసు అధికారి ఒకడు వచ్చి సమావేశం ముగిసిన తర్వాత ప్రతినిధులు వారిబసలకు వీధులలో వెళ్ళేటప్పుడు వందేమాతర నినాదం చేయకుండా ఉండేటట్లు హామీ ఇయ్యని పక్షంలో సమావేశం రద్దుకావలసి ఉంటుందని మ్యాజిస్ట్రేటు జారీచేసిన ఆజ్ఞను తెలియపరచాడు. కాని సురేంద్రనాథ్ మొదలైన నాయకులు, సమావేశ అధ్యక్షుడు ఆహామీ ఇచ్చుటకు నిరాకరించారు. వెంటనే సమావేశాన్ని నిషేధిస్తూ మ్యాజిస్ట్రేటు జారీచేసిన ఆజ్ఞను పోలీసు అధికారి ప్రకటించాడు. దానిని ఉల్లంఘించుటకు నాయకులు ఇష్టపడలేదు. సమావేశాన్ని రద్దుచేసి వారివారి స్వస్థలాలకు వెళ్ళిపొయ్యారు.

సమావేశాన్ని అధికారులు ఈ విధంగా రద్దుచేయడం చట్టసమ్మతము కాదని అధికారుల నిరంకుశ ప్రవర్తనను ఖండిస్తూ రాష్ట్రమంతటా సమావేశాలు జరిగాయి. బారిసాల్ నుండి కలకత్తాకు తిరుగు ప్రయాణంచేసిన సురేంద్ర నాథుని మార్గంలో ప్రతిస్టేషనులో ప్రజలు గుమిగూడి అభినందించారు. కలకత్తా స్టేషన్‌లో 10,000 జనం హాజరై అతనికి ఘనమైన స్వాగతాన్ని ఒసంగినారు. అతడు బెంగాలుకు కిరీటిధారికాని రాజు (Uncrowned King) అనే బిరుదును సంపాదించాడు. బారిసాల్ సమావేశ ఫలితాలలో ఇది ఒకటి.

సమావేశ సందర్భంలో అధికారులు తీసుకొన్న దారుణచర్యల ఫలితంగా ప్రజలు బెదరిపోయి ఉద్యమంలో పాల్గొనడం మానుతారని అధికారులు ఆశించారు. కాని దానికి బదులుగా ఉద్యమం మరింత బలపడింది. ప్రజలు ఈ విషయంలో మరింత పట్టుదలతోను ఉత్సాహంతోనూ ప్రవర్తించ సాగారు. ఇంతే కాదు. అధికారుల ప్రవర్తనను ఖండిస్తూ దేశమందంతటా సభలు సమావేశాలు జరిగాయి. వందేమాతరం ఉద్యమం అఖిలభారత ఉద్యమంగా రూపొందడంలో బారిసాల్ సమావేశం ఒక మహత్తరమైన సాధనంగా పరిణమించింది. ఇప్పటి నుంచి ఈ ఉద్యమం స్వాతంత్ర్యోద్యమంగా ప్రజలు పరిగణించసాగారు.

బారిసాల్ సభ ముగిసిన తర్వాత కొన్ని వారాలకు తిలక్ బెంగాలుకు వచ్చి జాతీయతత్వాన్ని గురించి అనేక ఉపన్యాసాలు చేశాడు. వీటిమూలంగా బెంగాలీల ఉత్సాహం ఇనుమడించింది. జూన్ నెలలో దీనిఫలితంగా శివాజీ ఉత్సవాలను వారు జరిపారు.

ఈ సమావేశం ముగిసిన తర్వాత వార్తాపత్రికల సంపాదకులపైనను ఇతర నాయకులపైనను అధికారులు రాజద్రోహనేరం చేసినట్లు ఆరోపిస్తూ న్యాయ స్థానాలలో చర్యలు తీసుకొన్నారు. వందేమాతర పత్రికకు సంపాదకుడైన అరవిందునిపై ఆలాటి చర్యలు తీసుకొన్నారు గాని దానికి అతడు సంపాదకుడని సాక్ష్యం లభించని కారణంగా అతనిని విడుదల చేయవలసి వచ్చింది. అతడు సంపాదకుడని సాక్ష్యం ఇయ్యవలసిందిగా బిపిన్‌చంద్రపాలును మ్యాజిస్ట్రేటు ఆదేశించాడు. కాని ఆదేశాన్ని పాల్ తిరస్కరించి, కోర్టుధిక్కారం చేసినందుకు ఆరునెలల జైలుశిక్షను అనుభవించాడు.

ఇదేసమయంలో "సంధ్య" పత్రికకు సంపాదకుడైన బ్రహ్మబాంధవ ఉపాధ్యాయునికూడా రాజద్రోహనేరానికి అరెస్టుచేసి విచారణచేశారు. అతడు విచారణలోపాల్గొనుటకు నిరాకరించి స్వరాజ్యసంపాదనాన్ని గురించి ప్రచారం చేయడం ఏనాటికీ నేరంకాజాలదనీ, పరాయిపరిపాలకుల న్యాయస్థానం ఈలాటి విషయాన్ని నిర్ణయించుటకు అర్హతలేనట్టిదనీ నిర్దాక్షిణ్యంగాను నిర్భయంగాను పలికాడు. కాని శిక్షను విధించుటకు కొన్నిరోజులు ముందుగా అతడు అకాల మరణానికిగురియై శిక్షను తప్పించుకొన్నాడు.

యుగాంతర పత్రికకు సంపాదకుడైన బిరేంద్రకుమార్ గోషు (అరవిందుని సోదరుడు) ఈ కాలంలో అనేకపర్యాయాలు శిక్షను అనుభవించాడు.

ఈలాటి చర్యలమూలంగా వందేమాతరఉద్యమం అఖిలభారత ఉద్యమంగా రూపొంది మరింతబలపడింది. ప్రభుత్వం ఆశించిన ఫలితాలు లభించలేదు.

## 9

ప్రథమంలో ముస్లింలు రాష్ట్రవిభజనకు విముఖులై, దానిని ప్రతిఘటించుటకు జరిగిన సభలలో పాల్గొన్నారు. 1905 సెప్టెంబరు 23న కలకత్తా నగరంలో వారు అబ్దుల్‌రసూల్ అధ్యక్షతన ప్రత్యేకసభను సమావేశపరచి విభజనను పూర్తిగా ఖండించారు. ఊరేగింపులలో హిందువులతో కలిసి వారుకూడా వందేమాతర పతాకాలను ధరించి వందేమాతర నినాదాన్ని చేస్తూ గొప్ప పాత్రనువహించారు. బహిష్కరణ స్వదేశీఉద్యమాలు విభజనరద్దుకు పటిష్టసాధనాలనే అభిప్రాయంతో వారుకూడా ఏకీభవించి, వాటిని సాగించుటలో గణనీయమైన కృషిగావించారు.

కాని క్రమక్రమంగా వారివైఖరి పూర్తిగా మారింది. రాష్ట్ర విభజనకు సుముఖులైన వారి సంఖ్య పెరిగింది. విముఖుల సంఖ్య తరిగింది. సయ్యాద్ అహమ్మద్‌ఖాన్ లేవదీసిన అలీఘర్‌ఉద్యమంచే ప్రభావితులైనవారు ఉత్తరప్రదేశ్‌లోను బెంగాలులోను అనేకులు ఉండినారు. వారు ద్విజాతిసిద్ధాంతంలో విశ్వసించినవారు. ఏలాగైనా వారిని రాష్ట్రవిభజనపట్ల సుముఖులుగాచేసే ఉద్దేశంతో 1904లోనే కర్జన్ తూర్పుబెంగాలులో పర్యటననుసాగించి, ముస్లిం ప్రముఖులలో అగ్రస్థానాన్ని వహించిన ఢక్కానవాబును రాష్ట్ర విభజనను సమర్థించేటట్లు ప్రోత్సహించగలిగాడు. ఇందుకుగాను అతనికి 14 లక్షల రూపాయలను స్వల్ప వడ్డీతో రుణంగా ఇచ్చాడు. ఇది మొదలు అతడూ అతని అనుచరులూ రాష్ట్ర విభజనను సమర్థించేవారయ్యారు. క్రమక్రమంగా వారు తక్కిన ముస్లింలలో అధికసంఖ్యాకులను తమతో ఏకీభవించేటట్లు చేయగలిగారు. రోజులు గడిచేకొద్దీ హిందువులు ముస్లింలు వేర్వేరు మార్గాలలో నడిచేవారయ్యారు.

1905 అక్టోబరులో ఫుల్లర్ తూర్పుబెంగాలు రాష్ట్రానికి లెఫ్ట్‌నెంటు గవర్నరుగా పదవీస్వీకారం చేసిన తర్వాత ఈ రెండు వర్గాలమధ్య విభేదాలను వృద్ధిచేయసాగాడు. అతని పరిపాలనకు ఇది ఒక ప్రధాన లక్ష్యంగా రూపొందింది. ఫుల్లర్ ఒక ఉపన్యాసంలో ముస్లింప్రజ తనకు ఒక భార్య అనీ, హిందూ ప్రజ ఇంకొక భార్య అనీ, వీరిలో ముస్లింభార్య మాత్రమే తనకు ప్రియమైనట్టిది అనీ బహిరంగంగా చెప్పుటకు సాహసించాడు. బారిసాల్ వంటి ప్రదేశాలలో అతడు తీసుకొన్న దారుణ చర్యలకు హిందువులు మాత్రమే గురిఅయ్యారు. అతని పరిపాలనలో హిందూ విద్యాలయాలు పూర్తిగా దెబ్బతిన్నాయి. హిందూ విద్యార్థులే అన్నిరకముల శిక్షలకు పాత్రులయ్యారు. హిందువులే ఉద్యోగాలు పోగొట్టుకొన్నారు. హిందూనాయకులే నిర్బంధంలో ఉంచబడ్డారు. ముస్లింలపట్ల అతడు పక్షపాతియై వారికి ప్రత్యేకసదుపాయాలను

సమకూర్చాడు. హిందువులపై ముస్లింలు అత్యాచారాలు గావించినా ప్రభుత్వం ఏలాటి జోక్యం కలిగించుకొనదనే భావం ముస్లింలలో వ్యాపించింది.

దీని ఫలితంగా 1907లో తూర్పు బెంగాలులోని అనేక ప్రాంతాలలో ముస్లింలు హిందువులు మధ్య అనేక కలహాలు కొట్లాటలు సంభవించాయి. ప్రభుత్వ వైఖరిని గమనించి ముస్లింముల్లాలు (మతప్రచారకులు) హిందువులపై ద్వేషాన్ని పురికొల్పే చిన్న చిన్న గ్రంథాలను (Pamphlets) ప్రకటించారు. వాటిలో లాల్ ఇష్టహార్ (Red Pamphlet) అనేదానిలో ఈ ద్వేషభావం హద్దులుమీరి ప్రజలందరి దృష్టిని ఆకర్షించింది ఇందులో, ముస్లింల పతనానికి, వారి దారిద్ర్యానికి, వారికష్టనష్టాలకు హిందువులే కారణమని, వారిని ముస్లింలు పూర్తిగా బహిష్కరించడమే కర్తవ్యమని ఉద్ఘాటించబడినది. వారిని అణచి వేయుటకున్నూ, వారిని ఇస్లాం మతంలోకి మార్చుటకున్నూ తగిన సమయం వచ్చిందనే భావం ఈలాటి గ్రంథాల మూలంగా సామాన్య ప్రజలలో నాటు కొన్నది.

1907లో సంభవించిన మతకలహాలలో కొమిల్లాలోను జమాల్‌పూరు లోను సంభవించినవి అతి దారుణమైన కృత్యాలకు దారితీశాయి. వీటిలో ముస్లింలు హిందువుల దుకాణాలను ఇండ్లను ఇష్టానుసారం దోచుకొన్నారు. వాటిని దగ్ధం చేసినారు. కొన్ని దేవాలయాలను పడగొట్టారు. విగ్రహాలను పగులగొట్టారు. స్త్రీలపై అత్యాచారాలుగావించారు. వితంతువులను ఎత్తుకొని పోయినారు. ఈ ప్రాంతాలలో హిందువులు అల్పసంఖ్యాకులు. వారు ఎలాటి ప్రతిక్రియలు చేయగలస్థితిలోలేరు. అందుచేత వారు రోజులపాటు భీతావహులై ఏలాగో కాలాన్ని వెళ్ళబుచ్చవలసి వచ్చింది.

హిందువులపై ముస్లింలు ఇన్ని ఘోరకృత్యాలు గావించినా అధికారులు కలహాలలో జోక్యం కలిగించుకొని హిందువులను రక్షించరైరి.

బ్రిటన్‌లోని కొన్ని ప్రముఖ పత్రికలకు ప్రతినిధిగా ఆరోజులలో తూర్పు బెంగాలులో పర్యటనను సాగించిన నెవిన్‌సన్ ఈ ఘోరాలను కన్నులకు కట్టి నట్లు వివరించాడు. అధికారుల ఉదాసీనతను పూర్తిగా ఖండించి, ఇది నాగరి కతగాంచిన ప్రభుత్వం వహించదగిన వైఖరి కాదని తన నివేదికలో వ్రాశాడు. ఆనాడు ప్రభుత్వం ముస్లింలపట్ల పూర్తిగా పక్షపాతం వహించినట్టిదనీ, హిందువు లపై ఏలాటి అత్యాచారాలు జరిపినా పట్టించుకొనదనీ, మూడు నెలలపాటు న్యాయస్థానాలన్నీ మూతబడిపోయినవనీ, బహిరంగంగా వదంతులు బయలు దేరినా వాటిని ఖండించడానికి అధికారులు ఏలాటి ప్రయత్నమూ చేయకపోవ డాన్ని అతడు పూర్తిగా ఖండించాడు.

కొట్లాటలలో పాల్గొనినట్లు విచారణ చేయబడిన వారిలో హిందువులే శిక్షకు పాత్రులయ్యారు. న్యాయాధీశులు హిందువుల సాక్ష్యాన్ని నిరాకరించి ముస్లింల సాక్ష్యాన్నే ఎక్కువగా విశ్వసించారు. అధికారుల పక్షపాతం ఈ విధంగా న్యాయస్థానాలలోనికికూడా ప్రవేశించింది.

రాష్ట్ర విభజనను రద్దు గావించుటకు హిందువులు సాగించిన ఉద్యమాలలో వారు ప్రభుత్వం యొక్క ఆగ్రహానికేగాక ముస్లింల దారుణ చర్యలకు కూడా పాత్రులయ్యారు కాని ఇది వారి పట్టుదలను దేశాభిమానాన్ని ఏ విధంగా కూడా బలహీన పరచలేదు. ఈ సందర్భంలో ఈ విషయాన్ని ప్రధానంగా గుర్తించడం అవసరం.

## 10

జాతీయవాదులకు ప్రఖ్యాతిగాంచిననాయకులు, అనుచరులనేకులు ఉండినా వారితత్వానికీ కార్యక్రమానికీ కట్టుబడి వాటిని ఆచరణలో పెట్టుటకు ఒక ప్రత్యేక రాజకీయసంఘం లేకపోయింది. అలాంటిసంఘం ఒకదానిని నిర్మాణం చేసుకొనడంకూడా వారికినచ్చలేదు. ఆలాంటిదానిని ప్రభుత్వం అక్రమసంఘంగా ప్రకటించి దాని సమావేశాలను నిషేధించే ప్రమాదం లేకపోలేదు. అట్టిపరిస్థితిలో వారు కాంగ్రెసులో సంఖ్యాబలాన్ని సంపాదించి, దానిని జాతీయవాద సంస్థగా మార్చి, దాని అధ్వర్యాన వారి కార్యక్రమాన్ని కొనసాగించడమే ఉత్తమ విధానమనిభావించి 1905నుండి అందుకుగాను గొప్పప్రయత్నం చేశారు. కాంగ్రెసు దేశానికంతా ఒక కేంద్ర సంస్థగా ఏర్పడి, 20 సంవత్సరాలుగా ఘనమైన కృషి గావించి, పేరుప్రతిష్టలు సంపాదించి, ప్రజలఆదరణకు పాత్రమైనదిగా ఉండినది. తిలక్, లజపత్‌రాయ్ పాల్ మొదలైన జాతీయవాదులు అందులో సభ్యులుగా ఉండినారు. అరవిందుడుకూడా అందులో సభ్యుడయ్యాడు. దాని ఆశయాలు, విధానాలు వారికిపూర్తిగాతృప్తికలిగించలేకపోయినాదానిపట్ల వారికి ఎక్కువ గౌరవము ఉండినది. దానిని ఎలాగైనా తమవశంలోకి తెచ్చుకొనిన పక్షాన తమకు ప్రఖ్యాతిగాంచిన కేంద్రసంఘం ఒకటిలభించి తమకార్యక్రమాల సాగుట సులభతరం కాగలదని విశ్వసించారు. 1905, 1906, 1907లలో అందుకుగాను వారుచేసిన ప్రయత్నమే ఆకాలపు కాంగ్రెసు చరిత్రలోను, దేశంలోని రాజకీయ పరిణామాలలోను గొప్ప ప్రాధాన్యం వహించింది.

1903, 1904లలో జరిగిన కాంగ్రెసు సమావేశాలలో బెంగాలు రాష్ట్ర విభజన, విషయ నిర్ధారణ సభలో బెంగాలు ప్రతినిధులు ప్రస్తావించారు. ఇదిఒక రాష్ట్రానికి మాత్రము పరిమితమైన సమస్య అనీ, అఖిలభారత సమస్య కాదనీ, ఆలాటి సమస్యను చర్చించడం కాంగ్రెసుసంప్రదాయాలకు విరుద్ధమనీ అనేకులు ఉద్ఘాటించినా బెంగాలు ప్రతినిధుల ఒత్తిడి మూలంగా రాష్ట్రవిభజనను ఖండిస్తూ కాంగ్రెసు తీర్మానాలను చేసింది. 1905 ప్రారంభాన కాంగ్రెసు ప్రతినిధివర్గం ఒకటి కర్జన్‌ను కలుసుకొని, విభజనను గురించి అతనితో ముఖాముఖి చర్చలు జరుపుటకు ప్రయత్నించింది కాని ఆలాంటి వర్గాన్ని కలుసుకొనుటకు అతడు ఇష్టపడలేదు.

1905లో విభజన అమలులోకి వచ్చింది. బెంగాలీలు దానిని రద్దుచేయించుటకు ఏవిధంగా నిరసన సభలు జరిపిందీ, అవి నిష్ఫలమైన తర్వాత ఇందుకుగాను

బహిష్కరణ స్వదేశీ ఉద్యమాలను ప్రారంభించి సాగించింది ఇదివరకే తెలుసుకొన్నాము. ఉద్రేకతతో కూడిన ఈలాటి రాజకీయ వాతావరణంలో 1905 డిసెంబరులో గోఖలే అధ్యక్షతన కాంగ్రెసు వారణాసిలో సమావేశమైంది.

సమావేశానికివచ్చిన జాతీయవాదులు బహిష్కరణ స్వదేశీ ఉద్యమాలను సమర్థిస్తూ కాంగ్రెసు తీర్మానం చేయవలసినదిగా కోరారు. కాని సంఖ్యాబలం గల మితవాదులు స్వదేశీపట్ల సుముఖులుగా ఉండినా బహిష్కరణ ఉద్యమానికి విముఖులైనారు. ఈ ఉద్యమం బ్రిటిష్‌వారి పట్లను బ్రిటిష్ ప్రభుత్వం పట్లను ద్వేషాన్ని పురికొల్పేదనీ, ప్రభుత్వంతో సహకరించి చట్టబద్ధమైన ఆందోళన ద్వారాను వినతిపత్రాలద్వారాను తనవాంఛలను తీర్చుకొనుటకు మొదటినుండీ కాంగ్రెసు అలవాటుపడిన సంస్థఅనీ, బహిష్కరణ ఉద్యమం దీనికి పూర్తిగా భిన్నమైనట్టిదనీ మదనమోహన మాళవ్యా మొదలైన మితవాద నాయకులు వాదించి, జాతీయవాదుల కోరికను తిరస్కరించ సిద్ధపడ్డారు.

ఈ పరిస్థితులలో జాతీయవాదులు మితవాదులను లొంగదీయుటకు ఒక ఉపాయాన్ని కనిపెట్టారు. 1906 ప్రారంభాన వేల్సుయువరాజు యువరాణులు భారతదేశ సందర్శనార్థం రాదలచి ఉండినారు. వారికి ఘనమైన స్వాగత సందేశాన్ని సమర్పించడం అవసరమని మితవాదులుభావించి అందునిమిత్తంకాంగ్రెసులో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. కాని ఇది విషయనిర్ధారణ సభలోచర్చకు వచ్చినప్పుడు తాము దానికి విరోధులనీ, సంఖ్యాబల సహాయాన మితవాదులు విషయ నిర్ధారణ సభలో దానిని నెగ్గించినా, బహిరంగ సమావేశంలో దానిని ఖండించుటకు తాము సిద్ధంగా ఉన్నట్లు జాతీయ వాదులు స్పష్టంచేశారు. సమావేశంలోకూడా మితవాదులకు సంఖ్యాబలం ఉండుటచేత ఆతీర్మానం తప్పకుండా నెగ్గే అవకాశం ఉండినది. కాని ఈలాటి తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడినప్పుడే గౌరవప్రదంగా ఉంటుందని మితవాదులు భావించి జాతీయవాదులతో ఒకవిధమైన రాజీ కుదుర్చుకొన్నారు. ఈ తీర్మానం చర్చకు వచ్చినప్పుడు జాతీయవాదులు సభనుండి బయటికి వెళ్ళిపోవుటకు అంగీకరించారు. అందుచేత ఏలాటి వైరుధ్యమూ లేక, మితవాదులు తీర్మానాన్ని ఏకగ్రీవంగా నెగ్గించి తృప్తి పొందారు. దీనికిబదులుగావారు బహిష్కరణఉద్యమాన్ని ప్రత్యక్షంగా కాకపోయినా ప్రచ్ఛన్నంగా సమర్థించి అందునిమిత్తం ఈ క్రింది తీర్మానానికి అంగీకరించారు. "ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా ప్రభుత్వం గావించిన రాష్ట్ర విభజనను బ్రిటన్‌లోని ప్రజల దృష్టికి తెచ్చుటకు సాధనాంతరాలన్నిటిని వినియోగించిన తర్వాత బెంగాలు ప్రజలు విదేశీసరుకులను బహిష్కరించుటకు తీర్మానించుకొన్నారు. ఇదిఒక్కటే రాజ్యాంగబద్ధమైనట్టిన్నీ ఫలప్రదం కాదగినట్టిన్నీ వారికిమిగిలిన తుదిసాధనంగా వారు భావించారు. ఈ సందర్భంలో ప్రజలను అణచుటకు ప్రభుత్వం తీసుకొన్న కఠిన చర్యలను ఈ కాంగ్రెసు నిరసిస్తున్నది." ఈలాటి తీర్మానాన్ని కాంగ్రెసు చేయడం మూలాన తమకు పాక్షిక విజయం చేకూరినట్లు జాతీయవాదులు భావించారు.

ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ మితవాదిఅయిన మదనమోహన మాళవ్యా కాంగ్రెసు బహిష్కరణను సమర్థించడంలేదని అది ఇతరరాష్ట్రాలకు వ్యాపించడం అది ప్రతిఘటిస్తున్నదని చెప్పాడు. లజపత్ రాయ్ తీర్మానాన్ని బలపరుస్తూ అతనికిన్నీ మితవాదులందరికిన్నీ జవాబుగా, "బహిష్కరణ ఉద్యమంతో మనదేశ చరిత్రలో ఒకనూతన శకం ప్రారంభమైంది. నాద్వారా బ్రిటన్‌లోని ప్రజలు మీకొక సందేశాన్ని పంపినారు. (1905లో కాంగ్రెసు ప్రతినిధిగా లజపత్ రాయ్ బ్రిటన్ లో పర్యటించాడు.) మన ఆందోళనలోను స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు మనముసాగించే సమరంలోను ఇంతవరకు మనం ప్రదర్శించిన దానికంటె ఎక్కువ పౌరుషం ప్రదర్శించవలెననేది ఈ సందేశం. బ్రిటిష్‌వారు భిక్షమెత్తే వారిని అసహ్యించుకొంటారు. మనం ఇకమీదట భిక్షాటకులం కామని, బ్రిటిష్ సామ్రాజ్యంలో స్వేచ్ఛను సంపాదించుటకున్నూ, ప్రకృతి సిద్ధంగాను మీకు లభించిన హక్కులను సంపాదించుటకున్నూ పోరాటాన్ని సాగించేవారమనిరుజువుచేయడం మనకర్తవ్యం. బెంగాలు ప్రజల పట్టుదల అన్ని రాష్ట్రాలవారు అనుసరించదగిన విధానం. అది జరిగినపక్షంలో దగ్గరలోనే బ్రిటిష్‌వారు మనహక్కులను మనకు ప్రసాదించి తీరుతారు మీహక్కులకై పోరాడగల శక్తిమీకు కలదనే భావంతో గాక, భిక్షాటకులవలె మీరు అక్కడికి (బ్రిటన్‌కు) వెళ్ళిన పక్షంలో మీ కోర్కెలను వారు నిరాకరించడం తప్పదు. ఒకసారి నిద్రనుండి మేల్కొన్న ప్రజలను అణచడం ప్రభుత్వానికి సాధ్యంకాదని ప్రభుత్వమూమీరూ జ్ఞాపకముంచుకొనండి. బ్రిటిష్ పరిపాలనలో ఒక శతాబ్దంగా స్వేచ్ఛను పురిగొల్పే ఇంగ్లీషు విద్యను అభ్యసించిన తర్వాత కుక్కలవలెను జానిసలసలెను మనలను అణచుట సాధ్యం కాదు. ప్రభుభక్తిని ఎందుకు చూపవలెను? బహిష్కరణవిధానానికి కట్టుబడి దాని ఫలితాలను అనుభవించుటకు సిద్ధపడండి. పిరికిపందలవలె ప్రవర్తించకండి", అని ఘంటాపథంగా ఉద్ఘాటించాడు. కాని మితవాద దృక్పథంలో ఎలాటిమార్పూ కనుపించలేదు.

వారణాసి సమావేశంలో బహిష్కరణ విధానాన్ని కొంతవరకైనా కాంగ్రెసు సమర్థించడంవల్ల దానిచరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమైనట్లు వ్యాఖ్యాతలనేకులు అభిప్రాయ పడినారు.

సమావేశం ముగిసినతర్వాత జాతీయవాదులు కొందరు ప్రత్యేకంగా అక్కడనే సమావేశమై తామొక కొత్త పార్టీగా రూపొందవలసినట్లుగాను, కాంగ్రెసులో సభ్యత్వాన్ని మానుకొనక అందులో ఉండి తమ కార్యక్రమాలను సాగించవలసినట్లుగాను తీర్మానించుకొన్నారు. రెండు పక్షాలమధ్య పొత్తుకుదరడం సాధ్యంకానట్లు కనుపించింది

1906లో వందేమాతర ఉద్యమం ఏవిధంగా తీవ్రరూపం ధరించినదీ, దాని ప్రభావం ఇతర రాష్ట్రాలకు ఎట్లు వ్యాపించినదీ, దానిని అణచుటకు ప్రభుత్వం ప్రధానంగా తూర్పు బెంగాలులో తీసుకొన్న చర్యలు విపరీతరూపం ధరించడం ఇదివరకే తెలుసుకొన్నాము. ప్రభుత్వ విధానాలమూలంగా ప్రజల

ఉత్సాహంగాని పట్టుదలగాని ఏమాత్రం తగ్గలేదు. అవి మరింతగా పెరిగాయి. 1906 ప్రారంభాన జపాన్‌వారు రష్యావారిని పూర్తిగా ఓడించి ఘనవిజయాన్ని సాధించడం భారతదేశాన్నీ జాతీయవాదులనూ మరింత ఉత్తేజ పరచింది. శ్వేతజాతివారి ఆధిక్యత దీనిమూలంగా గొప్పదెబ్బతిన్నది. వందేమాతర ఉద్యమం అఖిలభారత ఉద్యమంగా రూపొందసాగింది. ఇదిగాక వందేమాతర ఉద్యమం మూలంగా సాధించవలసింది బెంగాలురాష్ట్రవిభజన రద్దుమాత్రమేకాదని అది సంపూర్ణ స్వరాజ్యమనే భావంకూడా వ్యాపించింది. ఈ విధంగా జాతీయ వాదులకు ప్రాబల్యం లభించుచున్న కాలంలో బ్రిటన్‌లో జరిగిన ఎన్నికల ఫలితంగా, లిబరల్ పక్షం అధికారంలోకి రావడం మితవాదులకు కొంత ఉత్తేజకరంగా పరిణమించింది. దీనిమూలంగా తాముకోరిన సంస్కరణలు ప్రవేశపెట్టడం జరుగుతుందని వారు ఆశించి, జాతీయ వాదుల విధానాలపట్ల మరింత విముఖులైనారు.

1906లో కాంగ్రెసు సమావేశం కలకత్తాలో జరిగింది. దానికి అధ్యక్షునిగా తిలక్‌ను ఎన్నుకొనుటకు జాతీయ వాదులు కొంత ప్రయత్నం చేశారు. అతనితో పోటీ చేయగల నాయకుడు భారతదేశంలో మితవాదులకు లభించలేదు. అందుచేత వారు బ్రిటన్‌లో చాలాకాలాననుండి నివాసిగాఉండిన దాదాభాయి నవరోజీని అధ్యక్షుడుగా ఉండవలసిందిగా అర్థించారు. అతడు అన్నివర్గాల మన్ననలకు పాత్రమైన వాడు. అతనికి ప్రత్యర్థిగా తిలక్‌ను నిలబెట్టడం ప్రాజ్ఞతకాదని జాతీయవాదులు వారి ప్రయత్నాలను మానుకొన్నారు. కలకత్తా సమావేశం నవరోజీ అధ్యక్షతన జరిగింది.

దీనికి 1663 ప్రతినిధులు హాజరయ్యారు. 1889 తర్వాత ఏ సమావేశానికి ఇందరు హాజరుకాలేదు. కలకత్తా వాతావరణం జాతీయ వాదులకు అనుకూలంగా ఉండినది. బెంగాలు ప్రతినిధుల సంఖ్య కూడా ఎక్కువగా ఉండినది. ఈ పరిస్థితులలో జాతీయవాదులను పూర్తిగా ప్రతిఘటించడం సాధ్యంకాదని మితవాదులు భావించారు. బహిష్కరణ స్వదేశీ ఉద్యమాలు అన్ని రాష్ట్రాలకు వ్యాపించవలసినదిగాను, వీటి లక్ష్యం సంపూర్ణ స్వరాజ్య సంపాదన అనిన్నీ బహిష్కరణ ఉద్యమం అన్ని రంగాలకు వ్యాపించవలసిందిగాను కాంగ్రెసు తీర్మానాలు చేయవలసినట్లుగా జాతీయ వాదులు కోరారు. కాని మితవాదులు ఇంతదూరం వెళ్ళుటకు అంగీకరించలేదు.

తన అధ్యక్ష ఉపన్యాసంలో నవరోజీ కాంగ్రెసు లక్ష్యం స్వరాజ్యం అని పలికినాడు. "స్వరాజ్యం" అనే మాటను మొట్టమొదటిసారిగా ఉపయోగించిన అధ్యక్షుడు అతడే. ఇది జాతీయ వాదులకు కొంత ఉత్సాహం కలిగించిందిగాని స్వరాజ్యం అంటే ఏమిటో అతడు సందిగ్ధంగా వదలివేయడంతో ఆ ఉత్సాహం తగ్గింది. ఇది తప్ప నవరోజీ ఉపన్యాసంలో ఏలాటి నవ్యత కనిపించలేదు. అతడు పాతకాలపు ధోరణిలోనే మాట్లాడాడు.

బహిష్కరణాది ఉద్యమాలకు సంబంధించిన తీర్మానాల గురించి రెండు

వర్గాలకు మధ్య కొంత ఘర్షణజరిగి సమావేశమే భగ్నమై పోతుందనే భయం కలిగినా తుదకు రెండువర్గాలవారూ ఈ క్రింది తీర్మానాలను ఆమోదించారు.

వీటిలో మొదటిది బహిష్కరణకు సంబంధించింది. అది ఈ విధంగా ఉండినది. "ఈ దేశాన్ని పరిపాలించే విషయంలో ప్రజలకు ఏలాటి భాగస్వామ్యం లేకపోవడం చేతను, ప్రభుత్వానికి వారు చేసే విన్నపాలకు ఏలాటి గుర్తింపు లేకపోవడం చేతను, రాష్ట్ర విభజనకు నిరసనగా బెంగాలు ప్రజలు ప్రారంభించిన బహిష్కరణ ఉద్యమం సక్రమమైనట్టిదని ఈ కాంగ్రెసు అభిప్రాయ పడుతున్నది". ఉద్యమం సక్రమమైనదని కాంగ్రెసు తీర్మానించడం జాతీయ వాదులకు కొంత తృప్తిని కలిగించింది. ఉద్యమం అన్ని రాష్ట్రాలకు వ్యాప్తి గాంచవలెననీ, అది అన్ని రంగాలకు వర్తించవలెననీ వారు కోరినట్లు తీర్మానం లేకపోవడం వారికి కొంత ఆశాభంగం కలిగించింది.

తీర్మానాలలో రెండవది స్వదేశీకి సంబంధించినట్టిది. అది ఈ విధంగా ఉండినది "ఈ కాంగ్రెసు స్వదేశీ ఉద్యమమును హృదయపూర్వకముగా ఆమోదిస్తున్నది. అది జయప్రదముగా కొనసాగుటకు ప్రజలెల్ల కొంత నష్టానికి కూడా సిద్ధపడి, దిగుమతి సరుకులకు బదులుగా దేశీయ వస్తువుల ఉత్పత్తి కొరకును, దేశీయపరిశ్రమల అభివృద్ధికొరకును, గట్టిప్రయత్నము చేయవలెనని కోరుతున్నది". ఈ తీర్మానంలో "కొంత నష్టానికికూడా సిద్ధపడి" అనే మాటలు జాతీయవాదుల సూచనమేరకు చేర్చబడినవి. ప్రజలు కొంత త్యాగంచేసినగాని స్వదేశీవృద్ధి కాజాలదని ఈమాటలు స్పష్టంచేస్తూ ఉన్నవి.

తీర్మానాలలో మూడవది జాతీయ విద్యకు సంబంధించినట్టిది. అది ఈ క్రింది విధంగా ఉండినది. "ప్రజలెల్లరు తమ పిల్లల - బాలబాలికల - జాతీయ విద్యను గూర్చి ఆసక్తితో ఆలోచించుటకును, దేశీయుల అధికారము క్రింద దేశీయ అవసరములకు అనుగుణమైన పారిశ్రామిక, వైజ్ఞానిక, సాహిత్య విషయక విద్యావిధానమును జాతీయ పద్ధతులపైన ఏర్పాటు చేయుటకును, తగిన తరుణము వచ్చినదని, ఈ మహాసభ వారు తీర్మానిస్తున్నారు." ఇది పూర్తిగా జాతీయ వాదులు తలపెట్టిన విద్యా విధానమును సమర్థించునట్టి తీర్మానము.

తీర్మానములలో నాల్గవది స్వయం పరిపాలనమునకు సంబంధించినట్టిది. అందులో "బ్రిటిష్ వలస రాష్ట్రములు అనుభవిస్తున్న స్వయంపరిపాలనము వంటి పరిపాలన పద్ధతిని భారతదేశమునకుకూడా వర్తింపజేయవలెనని ఈసభవారు తీర్మానిస్తున్నారు", అని స్వయంపరిపాలన వివరింపబడినది. అధ్యక్షు ఉపన్యాసంలో దాదాభాయి సూచించిన స్వరాజ్యము సంపూర్ణస్వాతంత్ర్యము కాదనీ, కెనడా, ఆస్ట్రేలియా మొదలైన వలస రాష్ట్రములు అనుభవిస్తున్న స్వయంపరిపాలనము వంటిదని (Colonial self-Government) ఇందులో నిర్వచింపబడినది." ఇది జాతీయవాదులకు తృప్తిని కలిగించలేదు. కాని, ఇంతకుపూర్వం తన రాజకీయ లక్ష్యమేదియో కాంగ్రెసు స్పష్టపరచి ఉండలేదు. ఈ తీర్మానము మూలముగ

ఆ లోపము తీరినది.

1907లో రెండు పక్షాల మధ్య వాదోపవాదాలు దేశమంతటా చెలరేగినవి. కలకత్తా సమావేశంలో చేసిన తీర్మానాలను బట్టి మితవాదులు అతివాదులకు లొంగిపోయినారని ప్రభుత్వం భావించింది. ఈలాటి భావం అధికారులకు కలగడం వారికెంతమాత్రము ఇష్టంలేదు. లిబరల్ పక్షం తలపెట్టిన సంస్కరణలు వెనుకబడిపోవునేమో అని వారు భయపడి బహిష్కరణ జాతీయ విద్యల విషయమై కలకత్తా సమావేశాలలోచేయబడిన తీర్మానాలను గురించి పునరాలోచన చేసి, సాధ్యమైతే 1907లో జరిగే సమావేశంలో వీటినిగురించి ఏలాటి ప్రస్తావనా ఉండరాదనే భావంతోను, వీలైతే వాటిని రద్దు చేసే భావంతోను ఉండినారు. అందుచేత రెండు పక్షాలమధ్య ఏర్పడిన విభేదాలు 1907లో మరింత ముదిరినవి.

1907 కాంగ్రెసు నాగపూరులో సమావేశం కావలసిందిగా కలకత్తా కాంగ్రెసు నిర్ణయించింది. నాగపూరు జాతీయవాదులకు ఒక ప్రధాన కేంద్రం సమావేశానికి ఏర్పాటు చేయుటకు నిర్మాణమైన ఆహ్వానసంఘంలో రెండు పక్షాలు కలిసి పనిచేయలేకపోయినవి. జాతీయవాదులు 1907 సమావేశానికి లజపత్‌రాయ్ అధ్యక్షుడుగా ఉండవలసినట్లు కోరారు. మితవాదులు రాష్ బిహారీఘోషును ఎన్నుకోదలచారు. ఆహ్వాన సభలో దీనినిగురించి ఏలాటి నిర్ణయం జరగడం సాధ్యంకాలేదు. ఆ పరిస్థితులలో కాంగ్రెసు నాగపూరు బదులు సూరట్‌లో జరగవలసినదిగా మితవాదులు నిర్ణయించారు. వారికి సంఖ్యాబలం ఉండడంచేత ఆ నిర్ణయం నెగ్గింది.

సూరట్ మితవాదుల కేంద్రం. అక్కడ ఫిరోజిషా మెహతాకు అత్యధికమైన పలుకుబడి. అధ్యక్షుని ఎన్నిక విషయంలో లజపత్‌రాయ్ తనకుఆపదవి అక్కరలేదనడంచేత, మితవాదులఅభ్యర్థి రాష్‌బిహారుఘోషు ఎన్నికయ్యాడు. ఇది మితవాదులకు గొప్పవిజయంగా భావించవచ్చు.

కాంగ్రెసు సమావేశానికి పదిరోజులు ముందుగా, సూరట్‌లోని ఆహ్వాన సంఘం, చర్చకువచ్చే విషయాల జాబితాను ప్రకటించింది. అందులో బహిష్కరణ, జాతీయవిద్య, స్వయంపరిపాలనా విషయాలు చేర్చబడలేదు. వీటినిగురించి కలకత్తాలో చేయబడిన తీర్మానాలను సూరట్ సమావేశం పునరుద్ఘాటించవలసిందిగా జాతీయవాదులు వాంఛించారు. వీటిని జాబితాలో చేర్చకపోవడం వారి ఆగ్రహానికి కారణమైంది. సమావేశంలో ఏదోవిధంగా దీనినిగురించి తమ నిరసనను తెలియపరచుటకు వారు నిర్ణయించుకొన్నారు.

కాంగ్రెసు సమావేశానికి నాలుగురోజులు ముందుగా- డిసంబరు 21న- తిలక్ సూరట్‌చేరి, ఆరోజు సాయంత్రం ఒక బహిరంగసభలో కలకత్తా తీర్మానాలను పునరుద్ఘాటించవలసిన అవసరాన్ని తెలియపరచాడు. 24న జాతీయ వాదులు అరవిందుని అధ్యక్షతన సమావేశమై, ఈవిషయంలో ఆహ్వానసంఘాన్ని విషయనిర్ధారణ సంఘాన్ని ఎదుర్కొనవలసినదిగాను, అవసరమనితోచినపక్షంలో అధ్యక్షుని ఎన్నికను కాంగ్రెసు సమావేశంలో ఆక్షేపించవలసినదిగాను నిర్ణ

యించారు. 25న ప్రతినిధులను సమావేశపరచి వారికి ఈవిషయాన్ని తిలక్ స్పష్టపరచాడు. ఆహ్వానసంఘ అధ్యక్షుని కలుసుకొని అతనితో దీనిని గురించి చర్చించుటకుకూడా ప్రయత్నించాడుగాని అతడు తిలక్‌ను కలుసుకొనుటకు నిరాకరించాడు.

26 మధ్యాహ్నం కాంగ్రెసు సమావేశమైంది. సాంప్రదాయానుసారం ఆహ్వాన సంఘాధ్యక్షుడు తన ఉపన్యాసాన్ని చదివాడు. తర్వాత రాష్‌బిహారీ ఘోష్ అధ్యక్షుడుగా ఎన్నుకొనే తీర్మానాన్ని ఒక సభ్యుడు ప్రతిపాదించాడు. దానిని బలపరచుటకు సురేంద్రనాథుడు లేవగానే సభలో గందరగోళం ప్రారంభమైంది. అది క్రమక్రమంగా వృద్ధిగాంచింది. మరి సమావేశం జరగడం సాధ్యంకాదని ఆహ్వానసంఘాధ్యక్షుడు సమావేశాన్ని 27కు వాయిదా వేశాడు.

27న తిలక్ రాజీప్రయత్నాలు చేశాడు. కలకత్తా తీర్మానాలను పునరుద్ఘాటించిన పక్షాన, అధ్యక్షుని ఎన్నికకు జాతీయవాదులు ఏలాటి ఆక్షేపణను చేయరని చెప్పాడు. కాని మితవాదనాయకులు ఏలాటిరాజీకి అంగీకరించలేదు. అంతటితో తిలక్ ఆహ్వాన సంఘాధ్యక్షునికి ఒక ఉత్తరంవ్రాసి, అధ్యక్షుని ఎన్నికను బలపరచిన తర్వాత తాను సమావేశం వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించదలచి ఉన్నట్లు, దానికి అనుజ్ఞ ఇవ్వవలసినట్లు తెలియపరచాడు.

27 మధ్యాహ్నం సమావేశం ప్రారంభం కాగానే అధ్యక్షుని ఎన్నికను సురేంద్రనాథుడు బలపరచాడు. సభలోకొందరు దానికి ఆమోదాన్ని, కొందరు ఆక్షేపణను తెలియపరచుచు నినాదాలు చేశారు. తీర్మానం నెగ్గినట్లు ఆహ్వాన సంఘాధ్యక్షుడు ప్రకటించగానే రాష్‌బిహారీఘోష్ తన ఉపన్యాసాన్ని చదువుటకు లేచాడు వెంటనే తిలక్ వేదికపైకి వచ్చి, వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించుటకు అనుజ్ఞను కోరాడు. కాని ఆహ్వాన సంఘాధ్యక్షుడు అనుజ్ఞను నిరాకరించాడు. తిలక్ తాను తీర్మానాన్ని ప్రతిపాదించినగాని వేదికనుండి వెళ్ళిపోవడం జరగదని పట్టుపట్టాడు. అతనిని బలవంతంగా దింపుటకు కొందరు ప్రయత్నించారు. సభలో రెండుపక్షాల మధ్య కొట్లాటలు ప్రారంభమైనాయి. ఆ సమయంలో సభనుండి ఎవరోఒకరు వేదికపైకి ఒక పాదరక్షను విసరగా అది ఫిరోజిషా మెహతాకు సురేంద్రనాథుకు తగిలింది. సభలోశాంతినెలకొనే అవకాశం లేనట్లు భావించి ఆహ్వానసంఘాధ్యక్షుడు సమావేశాన్ని నిరవధికంగా వాయిదా వేశాడు. ఈవిధంగా సూరట్ సమావేశం భగ్నమైంది.

28న తిలక్ రాజీకి ప్రయత్నించాడు కలకత్తా తీర్మానాలను పునరుద్ఘాటించుటకు మితవాదులు అంగీకరించిన యెడల జాతీయవాదులు అధ్యక్షుని ఎన్నికను ఆక్షేపించడం మానుకొంటారని హామీ యిచ్చాడు. కాని మితవాదులు అలాగు అంగీకరించడం సాధ్యంకాదన్నారు. తిలక్ ప్రారంభించిన సంప్రతింపులు ఫలప్రదంకాలేదు.

29న మితవాదులుసమావేశమై కాంగ్రెసుకు ఒకరాజ్యాంగాన్ని రూపొం

దించుటకు ఒక ఉపసంఘాన్ని నియమించారు. అది 1908, ఏప్రిలులో అలహా బాదులో సమావేశమై జాతీయవాదులు కాంగ్రెసులో సభ్యులుగా ఉండుటకు వీలులేనట్లుగా రాజ్యాంగాన్ని ఏర్పరచింది. అదిమొదలు కాంగ్రెసు అన్నిపక్షాలు కలిసిన జాతీయసంఘంగా ఉండుటకు బదులు పూర్తిమితవాదపక్ష సంఘంగా మారింది.

కలకత్తా సమావేశంలో జాతీయవాదులు గొప్పవిజయాన్ని సంపాదించి నారు. బహిష్కరణ, స్వదేశీ, జాతీయవిద్యలను కాంగ్రెసు సమర్థించడం ఈ విజయానికి చిహ్నం కాని సూరత్‌లో మితవాదులు పన్నిన పన్నాగాల మూలంగా వారు ఓటమిని ఎదుర్కొనవలసిన వారయ్యారు. ప్రభుత్వం సంస్కరణలు అనే ఎరను చూపడం మూలంగా మితవాదులు కలకత్తా తీర్మానాల పట్ల విముఖులై జాతీయ వాదులనుండి పూర్తిగా విడిపోవుటకు నిర్ణయించు కొన్నారు. ఈ విడిపోవడంలో ప్రభుత్వం యొక్కయు, అందులో ప్రధానంగా ఇండియా మంత్రి మార్లేయొక్కయు ప్రభావం ఎంతైనా ఉన్నది. వారు తెర వెనుకనుండి మితవాదుల కార్యక్రమాన్ని నడిపారు. ప్రభుభక్తి పరాయణులైన మితవాదులు ఈ కుతంత్రాలకు లోబడి జాతీయవాదులనుండి విడిపోవడమూ కాంగ్రెసులో వారికి స్థానంలేకుండా చేయడమూ జరిగింది. ప్రభుత్వం ముస్లిం లను హిందువులనుండి వేరుపరచిన విధంగానే మితవాదులను జాతీయవాదుల నుండి విడదీసింది. "చీలించు పాలించు" అనే ప్రభుత్వ విధానంలో ఇదిఒకభాగం.

1905నుండి జాతీయవాదులు కాంగ్రెసును తమ వశంలోకి తెచ్చుకొను టకు గొప్ప ప్రయత్నం చేశారు. 1906 కాంగ్రెసు సమావేశంలో ఆవిషయమై కొంతవిజయాన్ని సంపాదించారు కాని 1907లో జరిగిన పరిణామాలమూలంగా వారి ప్రయత్నం పూర్తిగా విఫలమైంది. అందుచేతనే సూరత్ కాంగ్రెసుకు సంబంధించిన ఉదంతం కాంగ్రెసు చరిత్రలోను స్వాతంత్ర్యోద్యమ చరిత్రలోను ప్రాధాన్యాన్ని వహిస్తున్నది.

## 11

1905 ఆగస్టు 7న కలకత్తాలో జరిగిన బ్రహ్మాండమైన సభలో రాష్ట్ర విభజన రద్దుకు విదేశీవస్తువుల బహిష్కరణము ఏకైక సాధనమని ప్రజలు తీర్మా నించి, అప్పటినుంచి దానిని అమలు పరచుటకు తీవ్రచర్యలు తీసుకొనడము, స్వదేశీ ఉద్యమము జాతీయవిద్యలను దీనితో జోడించి వాటి విషయమై గొప్ప కృషిచేయడము, ఇదివరలో తెలియపరచాము. 1905నుండి 1907 ఆఖరువరకు ఉద్యమం అతితీవ్రంగా సాగింది. దానిని అణచుటకు ప్రభుత్వం అనేకచర్యలను తీసుకొన్నది. బహిరంగసభలను సమావేశాలను నిషేధించింది. వార్తాపత్రికలపై కఠినములైన ఆంక్షలను విధించింది. అనేకులపై రాజద్రోహ నేరాన్ని ఆరోపించి శిక్షించింది. ఉద్యమాన్ని సాగించడంలో విద్యార్థులు గొప్పపాత్రను వహించడం చేత వారిని అనేకవిధాలుగా హింసించింది. వారిని కొరడాలతోకొట్టడం, వారిపై జరిమానాలను విధించడం, విద్యాలయాలనుండి వారిని తొలగించడం, వార్లు

పబ్లిక్ పరీక్షలకు వెళ్ళరాదని నిషేధించడం, వారికి ప్రభుత్వోద్యోగాలు లభించవని ప్రకటించడం, వారుచదివే విద్యాలయాలకు గ్రాంటులు మంజూరుచేయకపోవడం, వాటిలోని ఉపాధ్యాయులపై ప్రత్యేకనిర్బంధాలను విధించడం, పరిపాటి అయింది. కాని వీటిమూలంగా ఉద్యమం అణగకపోవడమేగాక మరింత తీవ్ర రూపం ధరించింది. అది ఇతరరాష్ట్రాలకుకూడా వ్యాపించింది. ఉద్యమ ఉద్దేశం స్వరాజ్య సంపాదనమనే అభిప్రాయంకూడా వ్యాపించింది.

ఇంతేగాక ఇంతకంటె ప్రమాదకరమైన పరిణామం ఇంకొకటి సంభవించింది. బహిరంగచర్యలను నిషేధించడంచేత, ఉద్యమాన్ని సాగించేవారిలో కొందరు — ప్రధానంగా యువకులూ విద్యార్థులూ — రహస్య సంఘాలను స్థాపించి, తమ కార్యకలాపాలను రహస్యంగా సాగించవలసిందిగా నిర్ణయించుకొన్నారు. వీరిదృష్టిలో రాష్ట్రవిభజన రద్దుకంటె పరాయిపరిపాలనను నిర్మూలించి స్వరాజ్యమును సంపాదించడము ఎక్కువప్రాధాన్యాన్ని వహించింది. తమ ఆశయసిద్ధికి బహిష్కరణాది ఉద్యమాలతోకూడిన సాత్విక నిరోధానికంటె సాయుధపోరాటమే పటిష్టసాధనమని వీరు భావించారు. అందుచేత వీరికి ఉగ్రవాదులు (Terrorists), విప్లవకర్తలు (Revolutionaries) అనేపేర్లు వ్యవహారంలోకి వచ్చాయి. ఆయుధాలను రహస్యంగా సేకరించి, బాంబులను తయారుచేసి వాటిని అధికారులను హత్యజేయుటకు, తమకు కావలసినధనాన్ని సంపాదించుటకు దోపిడీలుచేయుటకు పూనుకొన్నారు. ఈలాటి చర్యలు సాయుధ పోరాటానికి మొదటిమెట్టుగా వారు భావించారు. దీనిఫలితంగా రాష్ట్రమందంతటా దౌర్జన్యము అరాచకము వ్యాపించాయి. (ఉగ్రవాదుల కార్యకలాపాలను 16వ అధ్యాయంలో విపులంగా వివరించాము).

వందేమాతర ఉద్యమం సాగుతుండినకాలంలో లిబరల్ పక్షానికి చెందిన మార్లే ఇండియామంత్రిగాను, టోరీపక్షానికి చెందిన మింటోప్రభువు రాజప్రతినిధిగాను ఉండినారు. మార్లే లిబరల్ పక్షానికి చెందినవాడుమాత్రమేగాక స్వేచ్ఛాప్రియుడుగాను, రాజకీయ తత్వవేత్తగాను, ఐర్లాండుకు ఆంతరంగిక స్వపరిపాలనను వాంఛించినవాడుగాను ప్రఖ్యాతిగాంచినవాడు. అతడు భారతదేశంపట్ల ఉదారంగా ప్రవర్తించగలవాడనీ బెంగాలురాష్ట్ర విభజనను రద్దుచేయుననీ పరిపాలనలో భారతీయులకు భాగస్వామ్యంకల్పిస్తూ సంస్కరణలను ప్రవేశపెట్టుననీ మితవాదులు భావించారు. కాని రాష్ట్రవిభజన స్థిరపడిపోయినదనీ దానిని రద్దుచేసే ప్రసక్తేలేదని అధికారంలోకి వచ్చినవెంటనే స్పష్టంచేశాడు. వందేమాతర ఉద్యమానికీ, దానిమూలంగా ఏర్పడిన అశాంతికీ, అరాచకానికీ రాష్ట్రవిభజన మూలకారణమని భావించినప్పటికీ అతడు దానిని రద్దుచేయకపోవడం చాలా విచారకరం. మింటోకూడా రద్దుకు విరోధికావడమేగాక, ఉద్యమాన్ని అణచుటకు కఠినమైన దమననీతి (Repression) ఒక్కటే సాధనమని విశ్వసించి, అందుకుగాను కొన్ని ప్రత్యేకచట్టాలను గావించాడు. ఈ విషయంలో చాలావరకూ మార్లే అతనితో ఏకీభవించాడు. అతడు చేసినచట్టాలన్నిటికీ ఆమోదం తెలియపర

చాడు. అతడు తీసుకొన్న చర్యలలో కొన్నిటిని నిరసించాడుగాని మొత్తంమీద దమనవిధానమే ఉద్యమాన్ని అణచుటకూ, ఉగ్రవాదుల ప్రయత్నాలను ప్రతిఘటించుటకూ సాధనమని అంగీకరించాడు. భారతదేశంపట్ల టోరీపక్షంవారు లిబరల్ పక్షంవారు ఒకేవైఖరికలవారని లజపత్‌రాయ్ 1905 కాంగ్రెసు సమావేశంలో చెప్పినమాటలు యదార్థములని మార్లే మింటోతో ఏకీభవించడం రుజువుచేసింది.

మామూలు శిక్షాస్మృతి (Indian Penal code) లోని నియమాలతో గాని న్యాయవిచారణ విధానంతోగాని నిమిత్తంలేకుండా ఉద్యమాన్ని అణచుటలో తమకు ఇష్టంవచ్చినచర్యలను తీసుకొనుటకు జిల్లామ్యాజిస్ట్రేటులకు పోలీసు ఉద్యోగులకు నిరంకుశాధికారాన్ని ఇయ్యడమే మింటోచేసిన ప్రత్యేకచట్టాలకు ప్రధానలక్షణం.

ఈలాటి చట్టాలలో మొదటిది 1907లో చేయబడిన రాజద్రోహసమావేశాలచట్టం (Seditious Meetings Act). దీనిమూలంగా సమావేశం ఏలాటిదైనా దానినిగురించి కార్యకర్తలు మూడురోజులకుముందు మ్యాజిస్ట్రేటుకు తెలియపరచవలెను. సమావేశం జరగరాదని జిల్లాకలెక్టరు ఉత్తరువు జారీచేయవచ్చు. నిషేధించిన సమావేశాన్ని జరిపినవారు శిక్షార్హులు. సమావేశంజరుగుటకు కలెక్టరు అనుమతించినా, అందులో ఉపన్యసించదలచినవారిని అతడు నిషేధించవచ్చు. సమావేశకార్యక్రమాలను పర్యవేక్షించుటకు పోలీసువారిని పంపవచ్చు. 20మందికంటె ఎక్కువగా పాల్గొనే ప్రతిసమావేశానికి ఈ చట్టం వర్తించేది. వారు స్వంతఇంటిలో టీపార్టీకిగాని, పండుగచేసుకొనుటకుగాని సమావేశమైనా అదికూడా బహిరంగసమావేశంగా పరిగణింపబడవచ్చు. ఈ చట్టం ప్రథమంలో తాత్కాలికంగా చేయబడి 1911లో శిక్షాస్మృతిలో శాశ్వతస్థానాన్ని సంపాదించింది. దీనిమూలంగా బహిరంగసమావేశాలు చాలావరకు అంతరించాయి. ఉద్యమాన్ని గురించిన ప్రచారమంతా అప్పటివరకు ఆలాటి సభలద్వారా జరుగుతూ వచ్చింది. ఇప్పుడు ఆలాటిప్రచారం సాధ్యంకాలేదు. దీనిఫలితంగా రహస్య సంఘాలసంఖ్య. హత్యలసంఖ్య, దోపిడీలసంఖ్య పెరిగాయి. ఉద్యమాన్ని అణచడం సాధ్యంకాలేదు.

బాంబులుమూలంగా హత్యలు జరగడం అధికారులను భయకంపితులుగాచేసింది. పిడికిలిలో ప్రాణంపెట్టుకొని వారు వీధులలో తిరగవలసినవారయ్యారు. ఈలాటి హత్యలను అరికట్టేనిమిత్తం ప్రభుత్వం ప్రేలుడువస్తువుల చట్టాన్ని (Explosive Substances Act) 1908లో చేసింది. బాంబులుగాని, వాటిని తయారుచేయుటకు కావలసిన వస్తువులుగాని ఎవరివశంలోనైనా ఉన్న పక్షాన వారికి 14సంవత్సరాల ద్వీపాంతరవాసశిక్ష. బాంబును ప్రయోగించినవారికి లేదా దానిని ప్రయోగించుటకు ప్రయత్నించినవారికి - దానిమూలంగాప్రాణనష్టం కలిగినా కలగకపోయినా - 20సంవత్సరాల ద్వీపాంతరవాసశిక్ష. బాంబులు తయారుచేయుటలో సహాయపడినవారికి కొన్నిసంవత్సరాలజైలుశిక్ష. ఈలాటిచట్టం చేసిన తర్వాతకూడా బాంబుల ప్రేలుళ్ళు తగ్గలేదు అధికారుల అను

మానాలకు గురియైన వారనేకులు శిక్షను అనుభవించడమే దీనిమూలంగా కలిగిన ఫలితం.

ప్రభుత్వంచేసిన మూడవచట్టం వార్తాపత్రికల (నేరాలను ప్రోత్సహించే) చట్టం (News Papers Incitement To Offences Act). ఈ చట్టంక్రింద అధికారులు పత్రికల ప్రకటనను నిషేధించవచ్చు. అవి అచ్చయ్యేముద్రణాలయాలను వశపరచుకొనవచ్చు. దీనిఫలితంగా వందేమాతరం, సంధ్య, యుగాంతర్ మొదలైన ప్రఖ్యాతిగాంచిన పత్రికల ప్రకటన ఆగిపోయింది.

ప్రభుత్వం చేసిన నాల్గవచట్టం శిక్షాస్మృతి సవరణచట్టం (Criminal Law Amendment Act). ఇది నేరం చేసినట్లు ఆరోపింపబడినవారిని మామూలు న్యాయ విచారణ విధానాన్ని అనుసరించక, మ్యాజిస్ట్రేటు ముగ్గురు హైకోర్టు న్యాయాధీశులతో కూడిన ఒక ప్రత్యేకన్యాయస్థానానికి విచారణనిమిత్తం పంపవచ్చు. అది ఏలాటిసాక్ష్యమైనా ఆధారంచేసుకొని, జ్యూరీతోనిమిత్తంలేకుండా అతనికి శిక్ష విధించవచ్చు. ఈ చట్టంప్రకారం ప్రభుత్వం ఏసంఘాన్నైనా అక్రమ సంఘంగా ప్రకటించవచ్చు. ఆలాటిప్రకటన జరిగినతర్వాత దాని కార్యకర్తలు సంఘాన్ని సమావేశపరచినపక్షంలో వారు శిక్షార్హులు. దాని భవనాన్నీ అందులోని సామానులనూ అధికారులు వశపరచుకొనవచ్చు.

ఇవి అన్నీ న్యాయస్థానాలతో నిమిత్తం లేకుండా నిరంకుశంగా ప్రవర్తించుటకు అధికారులకు అవకాశాన్ని కలిగించినా ప్రభుత్వం వీటితో తృప్తిపడక 1910లో ముద్రణాలయ చట్టాన్ని (Indian Press Act) చేసింది. ముద్రణాలయ స్వంతదార్లు, వార్తా పత్రికలను ప్రకటించేవారు రు. 500 లు మొదలు రు 5000ల వరకు ధరావత్తు కట్టవలసిందిగాను, అవి ప్రభుత్వ దృష్టిలో ఆక్షేపణీయ విషయమును ముద్రించి ప్రకటించినపక్షంలో ధరావత్తును కోల్పోవ వలసినట్లుగాను, రెండవ పర్యాయం ఈలాటి నేరాన్ని చేసినప్పుడు ధరావత్తునేగాక ముద్రణాలయాన్ని కూడా ప్రభుత్వం వశపరచుకొనుటకు వీలుగాను చట్టం రూపొందింది. మ్యాజిస్ట్రేటు తీర్పునుండి హైకోర్టుకు అపీలు చేసుకొనుటకు వీలులేదు. ప్రభుత్వం నియమించిన ఒక ప్రత్యేక న్యాయస్థానానికి ఆలాటి అపీలు చేసుకొనుటకు అవకాశం కల్పించబడింది.

ఈ చట్టాన్ని మింటో మార్లే సంస్కరణల ఫలితంగా ఏర్పడిన శాసనసభ ఆమోదించడం గుర్తించదగిన విషయం. ఇందులోని అనధికార సభ్యులు మితవాదులు. గోకలే వంటివాడుకూడా అందులో సభ్యుడై చట్టాన్ని సమర్థించాడు. తమ ప్రభుభక్తిని ఈవిధంగా వీరు ప్రదర్శించారు.

పై చట్టాలను చేయడమే గాక, అధికారుల నిరంకుశాన్ని బలపరచి, పౌరుల సామాన్య హక్కులకు భంగం కలిగించేటట్లుగా శిక్షాస్మృతిలోని 124A 153A, 503 సెక్షన్లను సవరించారు. వీటిఅన్నిటి ఫలితంగా న్యాయానుసార పరిపాలన (Rule of Law) అంతరించింది. నిష్పక్షపాతమైన న్యాయవిచారణకు

అవకాశం లేకపోయింది. అధికారుల ఇష్టమే న్యాయంగా పరిణమించింది. వారి దృష్టిలో అనుమానాస్పదులైనవారు నిర్దోషులైనా శిక్షను అనుభవించవలసి వచ్చింది.

ముద్రణాలయచట్ట ఫలితంగా 1917 నాటికి 991 వార్తాపత్రికలపై ఏదో విధమైన చర్యతీసుకొనడం జరిగింది. అనేక పత్రికలు ప్రభుత్వం కోరిన ధరావత్తును చెల్లించలేక ప్రకటనను ఆపివేశాయి. 705 పత్రికలు చెల్లించిన ధరావత్తును కోల్పోయినవి. ధరావత్తు చెల్లించవలసిన కారణంగా 173 ముద్రణాలయాలు, 126 వార్తాపత్రికలు స్థాపింపబడలేదు. 500 ల గ్రంథాలు నిషేధించబడినాయి. ఈ కఠినచర్యలన్నీ దేశీయపత్రికలపైన మాత్రమే తీసుకొనబడినవి. అత్యధికంగా ద్వేషాన్ని పురిగొల్పిన ఆంగ్లోఇండియన్ పత్రికలపై ప్రభుత్వం ఏలాటి చర్యలను తీసుకోలేదు.

ఈవిధంగా దేశంలో వాక్స్వాతంత్ర్యమూ పత్రికా స్వాతంత్ర్యమూ దెబ్బతిన్నాయి. ప్రభుత్వచర్యలు ఎంతటి దారుణమైనా వాటిని విమర్శించడం సాధ్యంకాకపోయింది. నిరంకుశత్వం విశృంఖలంగా తాండవమాడింది.

1907న సూరత్‌లో జరిగిన కాంగ్రెసు సమావేశం భగ్నమైన తర్వాత జాతీయనాయకులపై ప్రభుత్వం కఠినచర్యలను తీసుకొని రాజకీయరంగాననుండి వారినితొలగించి, వారిబెడద తప్పిందని సంతోషించింది. శిక్షకుపాత్రులైన వారిలో తిలక్ అగ్రస్థానం వహించాడు. 1908లో అతనిపై రాజద్రోహ నేరాన్ని ఆరోపించి, విచారణచేసి, ఆరుసంవత్సరాల జైలుశిక్షను విధించడం జరిగింది. దేశంలోని జైళ్లలో అతనిని నిర్బంధించడం ప్రమాదకరమని భావించి బర్మాలోని మాండలీలో అతనిని నిర్బంధించారు. ఇది ఘోరాతిఘోరమైన శిక్షగా భావించి బొంబాయిలోని కార్మికులు కొన్నిరోజులపాటు సమ్మెచేశారు. వారి ఊరేగింపులను చెదరగొట్టే మిషతో పోలీసులు కాల్పులు జరిపారు. కొందరు మరణించారు. కానిఅటుతర్వాతకూడా కొన్నిరోజులపాటు సమ్మె జరుగుతూనేవచ్చింది. దీనికితోడు మార్కెట్టులు దుకాణాలుమూతబడిపోయినవి. తిలక్‌నుబంధించిన ఫలితంగా ప్రజలకు అతనిపట్ల ఉండిన గౌరవం వృద్ధిగాంచింది. 1914లో అతడు జైలునుండి విడుదలై స్వదేశానికి వచ్చినప్పుడు ప్రజలు అతనిని దేశానికి ఏకైక నాయకుడుగా గుర్తించారు. అతని కీర్తి ప్రతిష్ఠలు ఇనుమడించాయి. 1920లో అతడు మరణించేవరకు అతడు దేశానికి కిరీటంలేని రాజుగా (Uncrowned King) పరిగణింపబడినాడు.

1908లో అలిపూర్ బాంబు కుట్ర కేసులో జోక్యంఉన్నదని నేరారోపణ చేసి ఒక సంవత్సరం అరవిందుని విచారణకాలంలో జైలులో నిర్బంధించారు. కాని నేరంరుజువుకాని కారణంగా 1909లో ఆయన విడుదలయ్యాడు. 1910లో ఆయన రాజకీయాలపట్ల విరక్తిగాంచి, ఫ్రెంచివారి నగరమైన పుదుచ్చేరికి వెళ్ళి జీవితాంతంవరకు అక్కడనే యోగాభ్యాసంలోను, గ్రంథరచనలోను, కాలం గడి

పాడు. స్వతంత్రంగా రాజకీయాలలో కృషిచేయడం సాధ్యంకాకపోవడంచేత లజపత్‌రాయ్, పాల్ ఐచ్ఛికంగానే దేశాన్నివదలి విదేశాలకు వెళ్ళిపోయ్యారు.

ఈవిధంగా జాతీయఉద్యమానికి అగ్రనాయకులైనవారు రాజకీయరంగాన నుండి నిష్క్రమించడం చేతను, కాంగ్రెసు మితవాదుల వశంకావడం చేతను ఉద్యమం కొంతవరకు బాహ్యంగా చల్లారినట్లు కనుపించింది. కాని వాస్తవంగా అది చల్లారలేదు. దాని ఫలితంగా స్వరాజ్యకాంక్ష ప్రజల హృదయాలలో శాశ్వత స్థానం కల్పించుకొన్నది.

మింటో పరిపాలన కాలంలో తిలక్‌తోపాటు ఇతరులనేకులు రాజద్రోహానికై శిక్షను అనుభవించారు. అనేకుల విషయంలో అతికఠినములైన శిక్షలను విధించారు. ఆంధ్రలో గాడిచెర్లహరి సర్వోత్తమరావుకు క్రిందికోర్టు ఆరుమాసాల శిక్షను విధించినా ప్రభుత్వం హైకోర్టుకు అపీలుచేయగా అది మూడుసంవత్సరాలకు పొడిగించబడింది. తిరున్వేలిలో చిదంబరం పిళ్ళకు యావజ్జీవ ద్వీపాంతర వాస శిక్షను విధించినా అపీలులోహైకోర్టు దానిని ఆరుసంవత్సరాలకు తగ్గించింది. ఇదికూడా చాలా కఠినమైన శిక్షగా ప్రజలు భావించారు. ఏదోఒక రాజద్రోహాన్ని పురిగొల్పే చిన్నగ్రంధాన్ని వ్రాసినందుకు ఒకనికి ఏడుసంవత్సరాల ద్వీపాంతర శిక్షను విధించారు. మార్లేకూడా ఈలాటి కఠినశిక్షలను నిరసించాడు. శాంతిభద్రతలనూ ప్రభుత్వాధికారాన్నీ రక్షించడం అవసరమైనా దానికి ఇంతటి కఠినశిక్షలు సాధనంకాదని అతడు మింటోకు తెలియపరచాడు. కాని మింటో దమన విధానలోం ఎక్కువమార్పు రాలేదు.

అతని దమన విధానం ఇంకొక రూపాన్నికూడా ధరించింది. 1907లో ప్రభుత్వం తలపెట్టిన భూసంస్కరణల ఫలితంగా పంజాబులో అలజడి, అశాంతి వ్యాపించి అనేక ప్రదేశాలలో ఒక విధమైన తిరుగుబాటు జరిగింది. తెల్లవారు కొందరు హత్యచేయబడినారు. ప్రభుత్వ భవనాలు అగ్నిహోత్రుని పాలైనాయి. సంస్కరణలకు సంబంధించి పంజాబు ప్రభుత్వం చేసినచట్టాన్ని కేంద్ర ప్రభుత్వం ఆమోదించని కారణంగా అశాంతి అలజడి తగ్గింది. కాని పంజాబు ప్రభుత్వం అల్లరులకంతా లజపత్‌రాయ్, అతని అనుచరుడు అజీత్‌సింగ్ కారకులని భావించి 1818లో తూర్పుఇండియా కంపెనీకాలంలో చేయబడిన ఒకతుప్పుపట్టిపోయిన శాసనంక్రింద (Regulation III of 1818) వారిపై ఏలాటినేరాన్నీ ఆరోపించక, నిరంకుశంగా బర్మాకు బంధితులుగా పంపించివేసింది. తాము ఏనేరాన్ని చేసిందీతెలియపరచక, తాముచెప్పగలసంజాయిషీని తెలియపరచుటకు అవకాశం ఇయ్యక, ఏలాటి విచారణాలేక, ప్రవాసశిక్షను విధించడం చాలా అన్యాయమని మార్లే నిరసించి దీనినిగురించి ఘాటుగా మింటోకు తెలియపరచాడు. కొన్ని నెలల తర్వాత లజపత్‌రాయ్‌ని విడుదలచేసినా తూర్పుబెంగాలులో అశ్వినీకుమారదత్తు మొదలైన తొమ్మండుగురు నాయకులను 1818 చట్టంక్రింద ప్రవాసానికి (Deportation) పంపివేశారు. ఆ సందర్భంలో మార్లే మరి క తీవ్రంగా

తన ఆక్షేపణను తెలియపరచి 1818 చట్టాన్ని రద్దుచేసేటట్లు హెచ్చరించాడు. అంతటితో మింటో కొంతదారిలోకి వచ్చి వీరిని విడుదల చేశాడు. దీనితర్వాత కూడా సుమారు 50మందిపై 1818 చట్టాన్ని ప్రయోగించదలచాడు. మార్లే దానికి ఆమోదించని కారణంగా ప్రయత్నాన్ని మానుకొన్నాడు. ఈ విధంగా 1818 చట్టాన్నిదేశంలోని పరిస్థితులు కంపెనీకాలంనాటి పరిస్థితులంటె భిన్నంగా ఉన్నప్పుడు ప్రయోగించ పూనడం మింటో దమనవిధానాన్ని సుస్పష్టంచేస్తుంది. ఈ విధానంలో అతనికి ఏర్పడిన విశ్వాసానికి మిలిమేరలు లేకపోయినాయి.

ఈవిధంగా దమనవిధానాన్ని ప్రయోగించి అయిదుసంవత్సరాలు మింటో దేశాన్ని పాలించాడు. నిర్దోషులెందరో జైళ్ళలో కఠినశిక్షలను అనుభవించారు. జైళ్ళలో వారుపడిన బాధలు వర్ణనాతీతములు. విచారణ కాలంలో నేరంచేసినట్లు వారిని ఒప్పించుటకు పోలీసులు వారిని పరిపరివిధాలుగా హింసించేవారు. ఈలాటి హింసాత్మక చర్యలు కనీవినీ ఎరుగనట్టివి. 1930 తర్వాత జర్మనీ పరిపాలకుడైన హిట్లరు చర్యలతో ఇవిపోల్చదగినవి. కాని ఈహింసావిధానం మూలంగా మింటో ఆశించిన ఫలితాలేవీ లభించలేదు. బెంగాలులోను ఇతర ప్రాంతాలలోను అశాంతి ఏవిధంగాను తగ్గలేదు. వందేమాతర ఉద్యమంలో పాల్గొన్నవారు బహిరంగంగా తమ ప్రచారాన్నీ కార్యక్రమాలనూ సాగించలేకపోయినా ఉగ్రవాదులు లేవదీసిన విప్లవం సాగుతూనే వచ్చింది.

## 12

1910 నవంబరులో మింటో వెళ్ళిపోవడం అతనిస్థానంలో హార్డింజి రాజు ప్రతినిధిగా పదవీస్వీకారం చేయడం జరిగింది. పదవిలోకిరాగానే బెంగాలు పరిస్థితులగురించి పూర్తిదర్యాప్తు జరిపాడు. ఉభయబెంగాలులలో అశాంతి ప్రబలడం, ప్రజలు దమనవిధానానికి ఏమాత్రంజంకక నిర్భయంగా బహిష్కరణాది ఉద్యమాలను సాగించడం, ఉగ్రవాదుల చర్యలు ప్రాబల్యం గాంచడం, కలకత్తా పరిసరాలలోకూడా హత్యలు దోపిడీలు నిరాటంకంగా జరుగుతూ ఉండడం గమనించాడు. రాజద్రోహ కేసులలో సాక్ష్యంపలుకుటకు పోలీసువారిలంచాలకూ ఒత్తిడికీ లోబడినవారు తప్ప తక్కినవారెవ్వరు ముందుకురాకపోవడం, తత్ఫలితంగా అనేక కేసులు పరిష్కారం కాకుండడం, పరిష్కారమైనవాటిలో విశ్వసనీయమైన సాక్ష్యం లభించని కారణంగా నేరస్థులు విడుదలకావడం, దానిమూలాన ప్రభుత్వప్రతిష్ఠ దెబ్బతినడం గుర్తించాడు. పరిస్థితులు ఇంతగా విషమించి ఉన్నట్లు అతడు భారతదేశానికి రాకపూర్వం గ్రహించలేదు. స్వయంగా వాటిని చూచినపిమ్మటనే అశాంతి, విప్లవధోరణి ఎంతగాపెరిగినవో అతనికితెలియవచ్చింది. శాంతిని ఏవిధంగానయినా అనాలస్యంగా నెలకొల్పడం అవసరమనే నిర్ణయానికి వచ్చాడు.

ఈలాటి నిర్ణయానికి అతడు రావడంలో ఇంకొకవిషయంకూడాఅతనిపై ప్రభావం వహించింది. 1911 డిసంబరులో కొత్తగా సింహాసనాధిష్ఠుడైన జార్జి

సార్వభౌముడు సతీసమేతంగా భారతదేశానికి వచ్చుటకు తలపెట్టాడు, అప్పటికైనా దేశంలో శాంతినెలకొనడం ఎంతైనా అవసరమని హార్డింజి అభిప్రాయపడినాడు. శాంతినెలకొనని పక్షంలో సార్వభౌముని రాకసందర్భంలో ఏలాటి అవాంఛనీయములైన పరిణామాలైనా సంభవించవచ్చు ఆలాటివి సంభవించకుండా చేయడం తనవిధి. కాని దానికి దమనవిధానం సాధనం కాజాలదు. అది మింటో పరిపాలనకాలంలో పూర్తిగా విఫలమైంది. ప్రజలను ఏదోవిధంగా తృప్తిపరచడమే దానికి సాధనం అని హార్డింజి భావించి దానికి మొదటిమెట్టుగా తన అనుజ్ఞలేక ఎవరిపైనా రాజద్రోహకేసులను పెట్టరాదని ఉత్తరువులు జారీచేశాడు. అందుకుగాను తీసుకొనవలసిన ఇతరచర్యలగురించి ఆలోచించసాగాడు.

1910 నవంబరులో మార్లే కూడా తన పదవికి రాజీనామా చేశాడు. అతనిస్థానే క్ర్యూప్రభువు ఇండియా మంత్రి అయ్యాడు. ఇతడు కూడా భారత దేశంలో శాంతి నెలకొనవలసిన అవసరాన్ని గ్రహించాడు. ప్రజల అశాంతికీ, విప్లవకారుల దౌర్జన్య చర్యలకూ మూలకారణం రాష్ట్ర విభజన అనిన్నీ, దానిని రద్దుచేస్తేతప్ప పరిస్థితులు మారవని గుర్తించి, రద్దు విషయమై తన అభిప్రాయాన్ని తెలియపరచవలసినదిగా 1911 జనవరిలో హార్డింజిని కోరాడు. హార్డింజి తన కార్యనిర్వాహణసభలోని సభ్యులతోను, ఉన్నతోద్యోగులు మరికొందరితోను సంప్రతించగా వారందరు విభజనరద్దు జరగరాదని సలహా చెప్పారు.

అదే తన అభిప్రాయమని క్ర్యూకు తెలియపరచాడు. కాని నానాటికీ పరిస్థితులు మరింత విషమించడం గమనించాడు. తుదకు తన తొలిఅభిప్రాయాన్ని మార్చుకొని విభజనను రద్దు చేయడం తప్ప ప్రజలను తృప్తిపరచి, శాంతిని స్థాపించుటకు మార్గాంతరంలేదనీ, రద్దు విషయంలో తాను క్ర్యూతో ఏకీభవిస్తున్నట్లున్నూ, కాని దానితో మరికొన్ని మార్పులు చేయవలసినట్లుగానూ ఈ మార్పులన్నిటినీ సార్వభౌముడు వచ్చినప్పుడు ఢిల్లీలో జరుగనున్న దర్బారులో అతడే స్వయముగ ప్రకటించడం ఉచితమనీ, ఆలాటి ప్రకటన అతని రాకకు ఒక ప్రత్యేక ప్రాదాన్యం కల్పించగలదనీ, ప్రజలు దాని మూలంగా ఎక్కువ సంతోషాన్ని పొందగలరనీ తెలియ పరచాడు. క్ర్యూ వీటినన్నింటిని ఆమోదించాడు.

జరగవలసిన మార్పులు నాలుగని హార్డింజి అభిప్రాయపడినాడు. వాటిలో మొదటిది దేశ రాజధానిని కలకత్తా నుండి ఢిల్లీకి మార్చుట. దీనిని క్ర్యూ ప్రభువే మొదట సూచించాడు. రెండవది బంగాలు రాష్ట్ర విభజన రద్దు. మూడవది బీహారు, 'చోటా' నాగపూరు, ఒరిస్సాలను బెంగాలు నుండి విడదీసి ప్రత్యేక రాష్ట్రంగా నిర్మాణంచేయుట. నాల్గవది అస్సాను 1905 కు పూర్వం ఉన్నట్లే ప్రత్యేక రాష్ట్రంగా రూపొందించుట. ఈ మార్పులన్నీ సమర్థనీయములని హార్డింజ ఇండియా మంత్రికి తెలియపరచాడు.

భౌగోళికంగా ఢిల్లీ దేశం నడిభాగంలో ఉన్నందున రాజధానిగా ఉండుటకు దానికి ఎక్కువ అర్హతఉన్నట్లు హార్డింజి భావించాడు. చారిత్రకంగాకూడా అది మొగలాయీలకు రాజధానిగా ఉండడంచేతను, పురాణకాలంలో ఇంద్రప్రస్థమనే పేరుతో అది అనేక చక్రవర్తుల రాజధానిగా ఉండడంచేతను, బ్రిటిష్ పరిపాలకులకు కూడా అది రాజధానికావడం ఉచితంగా ఉంటుంది. ఇది ముస్లింలకు హిందువులకు కూడా సంతృప్తిని కలిగిస్తుంది. ఇంతేగాక పరిపాలన దృష్ట్యా కూడా ఈ మార్పు లాభకారి. ఒక రాష్ట్రానికి రాజధానియైన కలకత్తా నగరం, కేంద్ర ప్రభుత్వానికి కూడా రాజధానిగా ఉండడం కొన్ని చిక్కులకు దారితీసింది. ఆ రాష్ట్ర ప్రభుత్వానికి ఆ రాష్ట్రవాసులకూ దీని మూలంగా కేంద్ర ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసే అవకాశం లభించింది. ఆలాంటి చిక్కు నుండి కేంద్ర ప్రభుత్వం విముక్తి కావలసి ఉంది. ఢిల్లీ నగరం దేశానికి రాజధానియైన పక్షంలో ఈ విముక్తి లభిస్తుంది. కేంద్ర ప్రభుత్వ వ్యక్తిత్వాన్నీ బెంగాలు రాష్ట్ర ప్రభుత్వ వ్యక్తిత్వాన్నీ రక్షించుటకు ఈ మార్పు గొప్పసాధనం. ఈ కారణాలన్నీ ఇండియా మంత్రికి, బ్రిటన్‌లోని మంత్రివర్గానికి సమంజసంగా కనుపించాయి. అందుచేత వారు ఈ మార్పులకు అంగీకరించారు.

బెంగాలు రాష్ట్ర విభజన రద్దు కూడా అందరికీ ఆమోదయోగ్యమైంది. రాష్ట్రంలోను దేశంలోను శాంతి సంస్థాపనకు అది ప్రధానసాధనమని అందరూ భావించారు. ఇదిగాక విభజన మూలంగా హిందూ బెంగాలీలు అనేక విధాలుగా నష్టపడినారని, వారిలో రాజకీయ చైతన్యం జాతీయత ఎక్కువగా అభివృద్ధిగాంచినదని, రాష్ట్ర విభజన మూలంగా వారు రాజకీయ ప్రాధాన్యాన్ని కోల్పోయినారని, వారిని తృప్తిపరచడం శాంతిస్థాపనకు ఎక్కువ అవసరమని, విభజనను రద్దుచేసిన పక్షంలో ఈ అవసరంతీరగలదని అధికారులందరు అభిప్రాయపడినారు. విభజనమూలంగా రెండు బెంగాలులలో వారు అల్పసంఖ్యాకులయినారు. 1909 సంస్కరణల ఫలితంగా రాష్ట్రాలలోని శాసనసభలలో ప్రజా ప్రతినిధుల సంఖ్య పెరిగినా వారికి తగిన ప్రాతినిధ్యం లభించలేదు. వారి రాజకీయ పరిజ్ఞానము, అనుభవము వ్యర్థమైనట్లు వారుభావించారు. ఇది సహజమే. విభజనరద్దై, బీహారు ఒరిస్సాలూ అస్సాం వేరు రాష్ట్రాలుగా నిర్మాణంకావడం చేత విభజనకు పూర్వం వారికి ఉండిన ప్రాధాన్యంతిరిగీ లభిస్తుంది విభజనను ఖండించడంలో వారు రాజకీయంగా ప్రాధాన్యం కోల్పోవడం జరిగిందని వారు వాదించారు. కాని ఆనాడు వారివాదాన్ని అధికారులు పట్టించుకోలేదు. తమ తొలిప్రాధాన్యాన్ని సంపాదించుకొనుటకు వారుసాగించిన పోరాట ఫలితంగా అధికారులు ఆ వాదంలోని న్యాయాన్ని సత్యాన్ని గ్రహించారు. దీనిని గ్రహించడానికి అలాటి పోరాటం అవసరం కావలసివచ్చింది.

మూడవ మార్పు బీహారు, చోటా నాగపూరు, ఒరిస్సాలనుకలిపి ఒక ప్రత్యేక రాష్ట్రంగా నిర్మాణం చేయడం. బీహారు ప్రజలు హిందీ భాషను

మాట్లాడేవారు. ఇంతేగాక ఇంగ్లీషు విద్యను కొంత ఆలస్యంగా నేర్చుకొన్నారు. అందుచేత బీహారులోని ఉద్యోగాలనేకం బెంగాలీలు సంపాదించారు. ఇతర రంగాలలో కూడా వారు ఆధిక్యతను సంపాదించారు. బీహారు ప్రజలలో రాజకీయ చైతన్యం క్రమక్రమంగా వృద్ధిగాంచింది. దానిఫలితంగా వారు బెంగాలీల ఆధిక్యతను విమర్శించసాగారు. ఈ పరిస్థితులలో బీహారును బెంగాలు నుండి విడదీసి, ప్రత్యేక రాష్ట్రంగా నిర్మాణం చేయడం, దానికి పాట్నానగరం ప్రధాన పట్టణం కావడం వారికి ఎంతో తృప్తినికలిగించింది. ఇందులో ఒక విధంగా రాష్ట్రాలు భాషాప్రయుక్తంగా ఉండవలెననే సూత్రాన్ని ప్రభుత్వం గుర్తించింది. ఒరిస్సాను దానిని అన్వయింపజేయకపోవడం క్రమక్రమంగా ఉత్కళులలో అసంతృప్తిని కలిగించింది. కొన్ని సంవత్సరాల తర్వాతగాని ఈ మార్పు జరగలేదు.

బెంగాలునుండి అస్సాం విడిపోవడం అస్సాం ప్రజలకు తృప్తికలిగించింది. అందుచేత మొత్తంమీద హార్డింజి సూచించిన నాలుగు మార్పులు ప్రజలు ఆమోదించినట్లు చెప్పవచ్చు. రాజధానిని కలకత్తా నుండి ఢిల్లీకి మార్చడాన్ని కలకత్తాలోని బ్రిటీష్ వర్తకులు కొంత విమర్శించారు. వారి వర్తక వ్యాపారాలకు నష్టం కలుగుతుందని వారు భావించారు. బెంగాలీలకు కూడా ఈ మార్పు అంతగా నచ్చలేదు. కాని రాష్ట్ర విభజన రద్దుకావడంచేత వారు ఈ విషయమై ఎక్కువగా పట్టించుకోలేదు.

జార్జి సార్వభౌముడు సతీసమేతంగా 1911 డిసెంబరు 7న ఢిల్లీకి వచ్చాడు. 12న అత్యంత వైభవంతో దర్బారు జరిగి మొగలాయీ దర్బారులను స్మరణకు తెచ్చింది. 200 సంస్థానాధీశులూ అన్ని రాష్ట్రాల గవర్నరులూ ఇతర ప్రముఖులూ దర్బారుకువచ్చి సార్వభౌమునిపట్ల వారి భక్తిని ప్రదర్శించారు. సార్వభౌముడు సింహాసనాధిష్ఠితుడై రాజధానిని మార్చడం గురించీ రాష్ట్రాల పునర్నిర్మాణం గురించీ స్వయంగా ప్రకటించాడు. సార్వభౌముడుగా దేశానికివచ్చి స్వయంగా వాటిని ప్రకటించడం ఆసేతు హిమాచల పర్యంతం ప్రజలలో అత్యంత సంతోషాన్ని కలిగించింది. దర్బారు ముగియగానే సార్వభౌముడు కొత్త ఢిల్లీకి శంఖుస్థాపన గావించాడు. తదుపరి నేపాలులో కొన్నిరోజులుగడపి 1912 జనవరి 8న బ్రిటన్‌కు తిరుగుప్రయాణం సాగించాడు. బ్రిటిష్‌సార్వభౌములలో ఎవరూ అతనికి ముందుగాని అతని తర్వాతగాని భారతదేశానికి వచ్చినవారు కారు. ఇది కూడా అతని రాకకూ, దర్బారుకూ మరింత ప్రాధాన్యాన్ని కల్పించింది.

1905 నుండి 1911 వరకూ ప్రజాశక్తి ప్రభుశక్తులమధ్య పోరాటంజరిగి తుదకు ప్రజాశక్తి విజయాన్ని గాంచింది. ఇది విప్లవకారులలో తాము సాగించే విప్లవం జయప్రదం కాగలదనే విశ్వాసాన్ని కల్పించింది. బహిష్కరణ, స్వదేశీ, జాతీయ విద్యల గురించిన ఉద్యమ ఫలితంగా ప్రజలలో గొప్ప

మార్పు సంభవించింది. బహిష్కరణ అనగా విదేశీవస్తువులను బహిష్కరించడం మాత్రమేకాదనీ, అన్నిరంగాలలో విదేశీయుల ప్రాబల్యాన్ని, విదేశప్రభుత్వాన్ని బహిష్కరించడమనే భావం ఈ అయిదు సంవత్సరాలలో వారిలో పూర్తిగా నాటుకొన్నది. అదేవిధంగా స్వదేశీ అంటే స్వదేశంలో ఉత్పత్తి అయిన వస్తువులలో అభిమానం కలగడం, కొంత నష్టాన్నైనాభరించి వాటినే వాడడంమాత్రమే కాదని ఆధ్యాత్మిక, సాంస్కృతిక, వైజ్ఞానాది రంగాలన్నిటిలో ఈలాటి అభిమానం కలిగి ఉండడమనేభావం వ్యాపించింది. అరవిందుడు మొదలైన జాతీయవాదులు ఈ తత్వాన్ని ప్రచారం చేశారు. జాతీయతఅంటే భారతీయతఅని వారు బోధించారు. 1905–11 లో ఈ విపులార్థం క్రియారూపంధరించింది. రవీంద్రుని వంటి కవులు వారి రచనల ద్వారా దీనికి ప్రజాదరణను సంపాదించారు. స్వరాజ్యాన్ని సంపాదించినప్పుడే స్వదేశీ, భారతీయతలు పూర్ణస్వరూపాన్ని ధరించగలవనే భావం ప్రజలలో నాటుకొన్నది. విద్యాధికులకుమాత్రమే పరిమితమై ఉండిన జాతీయ భావం 1905-11 మధ్య జరిగిన సంఘటనల మూలంగా ప్రజలందరిలో వ్యాపించింది.

ప్రజలలో ఈలాటి భావాలు నాటుకొనడంచేత రాష్ట్ర విభజన రద్దైనా శాంతి పూర్తిగా నెలకొనలేదు. 1912 డిసంబరు 23న హార్డింజి భార్యతో కలిసి గజారూఢుడై ఢిల్లీ ప్రవేశించి ఊరేగింపుగా వీధులలోవెళ్ళినపుడు అతనిపై ఒక బాంబుపడి, దానిమూలంగా అతనికి గాయాలుతగిలి కొన్నిరోజులపాటు చికిత్స పొంది ఏదో విధంగా తేరుకొన్నాడు. తాను చేసిన మార్పులమూలంగా దేశంలో శాంతిభద్రతలు ఏర్పడగలవని అతడు ఆశించాడు, ఈ బాంబుప్రేలుడు అట్టిఆశకు అవకాశం లేదని రుజువుచేసింది. ఉగ్రవాదులు వారి ప్రయత్నాలను మానుకోలేదు. విదేశాలలోని భారతీయులు సాయుధపోరాటాన్ని జరిపి స్వరాజ్యాన్ని సంపాదించుటకు తలపెట్టి ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో (1914-18) భారత దేశానికి ఆయుధాలతో వచ్చి అందుకు గాను పంజాబులోను ఇతర ప్రాంతాలలోను తిరుగుబాటులు లేవదీశారు, దివ్యజ్ఞానసమాజ నాయకురాలైన అనిబిసెంటు ఇదేకాలంలో రాజకీయరంగంలో ప్రవేశించి హోంరూల్ (ఆంతరంగిక స్వపరిపాలన) ఉద్యమాన్ని సాగించింది. 1914లో తిలక్ జైలునుండి విడుదలైన తర్వాత ఇదే ఉద్యమాన్ని పశ్చిమ ఇండియాలో సాగించాడు. వీరిద్దరుకలిసి పని చేయడంమూలాన ఉద్యమం దేశవ్యాప్తమైంది. వందేమాతర ఉద్యమం ప్రజలందరిలో జాతీయతను బలపరచి, వారిని స్వరాజ్యసంపాదనపట్ల దీక్ష వహించినవారినిగా చేసింది. హార్డింజి బెంగాలురాష్ట్ర విభజనను రద్దుచేసినా ప్రజలలో అంకురించిన ఈ భావాన్ని మాన్పలేకపోయినాడు. 1920 తర్వాత దీనిని ఆధారంచేసుకొని గాంధీమహాత్ముడు అహింసాపూర్వకమైన సహాయ నిరాకరణోద్యమాన్ని సాగించాడు. వందేమాతరం దీనికి దారితీసిందని గుర్తించడం అవసరం.

చదువదగిన గ్రంథాలు :

M. Venkatarangaiya : The Freedom Struggle in Andhra Pradesh Vol II.

Bhavan - Vol IX.

Tarachand - Vol III

Argov : Moderates and Extremists.

B. L. Glover : British Policy towards Indian Nationalism.

Annie Besant : How India Wrought For Freedom.

Sankar Ghose : From Renaissance to Militant Nationalism in India.

# అధ్యాయము - 13

## మార్లే మింటో సంస్కరణలు

### 1

వందేమాతర ఉద్యమాన్ని అణచుటకు మార్లే మింటోలు మూడువిధానాలను వినియోగించారు. వాటిలో మొదటిది దమనవిధానం. దీనిని గురించి గత అధ్యాయంలో వివరించాము. వీటిలో రెండవది భేదోపాయం. దీనిని ప్రజల మధ్య విభేదాలను కల్పించి, వారిలో కొన్నివర్గాలవారిని జాతీయ ఉద్యమాన్ని ప్రతిఘటించే ప్రతిపక్షంగా ఏర్పరచుటకు ఉద్దేశించారు దీనిని ఆచరణయోగ్యం చేయడంలో ముస్లింలను హిందువులనుండి విడదీశారు. జమీందార్లూ సంపన్నులైన భూస్వాములూ మొదలైనవారిని పూర్తిగా ప్రభుత్వవిధానాలను సమర్థించే వారినిగా రూపొందించారు. ఇదే ఉద్దేశంతో కాంగ్రెసులోని మితవాదులను జాతీయవాదులనుండి చీలదీశారు. వారు అనుసరించిన మూడవవిధానం కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టడం. ఈసందర్భంలో వారు ముస్లింలకు చాలావరకు భూస్వాములు మొదలైన ధనికవర్గాలకు కొంతవరకు ప్రత్యేకసదుపాయాలు కల్పించి వారిని ప్రభుభక్తిపరాయణులుగా చేయగలిగారు. ఇందుచేత వారు అనుసరించిన విధానాలలో రెండవది మూడవది పరస్పరాశ్రయములైనాయి.

మొదటినుండి మార్లే సంస్కరణలపట్ల ఎక్కువశ్రద్ధను వహించాడు. తాత్కాలిక ఫలితాలకు దమనవిధానం ఉపయోగపడినా శాశ్వతఫలితాలను సంపాదించుటకూ శాంతిభద్రతలను సుస్థిరంచేయుటకూ ప్రజలను తృప్తిపరచే సంస్కరణలలో కొన్నిటినైనా ప్రవేశపెట్టడం అవసరమని భావించాడు. మింటో ప్రథమంలో అతనితో ఏకీభవించలేకపోయినా తుదకు తన అభిప్రాయాన్ని మార్చుకొన్నాడు. కాని సంస్కరణలలో భేదోపాయానికి గొప్పస్థానం కల్పించి, వాటిస్వరూపాన్ని పూర్తిగా మార్చగలిగాడు. అందుచేతనే అవి మితవాదులనుకూడా తృప్తిపరచజాలకపోయినవి.

మార్లే సంస్కరణలపట్ల శ్రద్ధవహించుటకు ఒక ప్రబలకారణం ఉండినది. మొదటినుంచీ సంస్కరణలను వాంఛించినవారు విద్యాధికులు. 1885లో కాంగ్రెసు స్థాపితమైనప్పటినుండి, దాని తీర్మానాలలో శాసనసభల సంస్కరణ ప్రాధాన్యం వహించింది. 1905నాటికి విద్యాధికవర్గమూ కాంగ్రెసూ దేశంలో ఎక్కువ పలుకుబడి సంపాదించగలిగినాయి. ఈలాంటి పరిస్థితులలో విద్యాధికులనుగాని కాంగ్రెసువారినిగాని తూలనాడడం ప్రాజ్ఞతకాదని మార్లే భావించాడు.

వారిని గుర్తించి, వారివాంఛలను కొంతవరకైనా చెల్లించడం పరిపాలన సుస్థిరత్వానికి దోహదకారి కాగలదని అతడు విశ్వసించాడు. మింటోకూడా కాంగ్రెసును గుర్తించడం అవసరమనీ, అదికోరిన సంస్కరణలను కొంతవరకైనా ప్రవేశపెట్టనిపక్షంలో మితవాదులుకూడా జాతీయవాదులుగా మారిపొయ్యే ప్రమాదం ఉన్నదనీ భావించి సంస్కరణలపట్ల సుముఖుడయ్యాడు.

కాని వారు ప్రవేశపెట్టదలచిన సంస్కరణలు కాంగ్రెసులక్ష్యానికి లేశమాత్రంకూడా అనుగుణంగాలేకపోయినవి. 1905లో కాంగ్రెసు తనలక్ష్యం కెనడా, ఆస్ట్రేలియా మొదలైన బ్రిటిష్ వలసదేశాలలోఉన్నట్టి స్వయంపరిపాలన విధానమని (Colonial Self Government) మొదటిసారిగా అభిప్రాయాన్ని వ్యక్తంచేసింది. 1906 కలకత్తాసమావేశానికి అధ్యక్షతవహించిన దాదాభాయి నౌరోజీ స్వరాజ్యం అనేమాటను ఈవిధంగానే నిర్వచించాడు. కాంగ్రెసుకూడా ఇందునిమిత్తం ఒక తీర్మానంచేసింది. అలాటి పరిపాలనవిధానంలో ప్రజలెన్నుకొన్న ప్రతినిధులు దేశంలోని ఆంతరంగిక వ్యవహారాలపై అధికారంవహిస్తారు. ఇది వెంటనే కాకపోయినా క్రమక్రమంగానైనా బ్రిటిష్‌వారు భారతదేశంలో ప్రవేశపెట్టవలసిందిగాను, మార్లే ప్రవేశపెట్టదలచిన సంస్కరణలు దీనికి మొదటిమెట్టుగా ఉండవలసినట్లుగాను కాంగ్రెసు వాంఛించింది. ఈవిషయాన్నిగురించి 1906లో గోకలే మార్లేతో చర్చించుటకు బ్రిటన్‌కువెళ్ళి అయిదుపర్యాయాలు చర్చలు సాగించాడు. కాని వలసరాష్ట్రపరిపాలన విధానంలో ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులు ఆంతరంగికవ్యవహారాలలో సర్వాధికారం వహించడం ప్రధానలక్షణమనీ అలాటి ప్రజాస్వామికానికి భారతీయులు అర్హులుకారనీ, అందుచేత తాను తలపెట్టిన సంస్కరణలు అలాటి లక్ష్యసాధనకు ఉద్దేశింపబడినవి కావనీ గోకలేకు మార్లే స్పష్టంచేశాడు. తన ఉద్దేశం శాసనసభలలో ప్రజాప్రతినిధులకు ఎక్కువసంఖ్యలో స్థానంకల్పించి, ప్రశ్నలు వేయడంలోను, బడ్జెటుగురించిన్నీ మరికొన్ని పబ్లిక్‌వ్యవహారాల గురించిన్నీ తీర్మానాలను ప్రతిపాదించుటకు వారికి ఎక్కువ అవకాశం కల్పించడమును మాత్రమేనని తెలియపరచాడు. బ్రిటిష్‌వారు మొదటినుండీ భారతీయులు ప్రజాస్వామికానికి అర్హులుకారనే అభిప్రాయంతో ఉండినారు. దానినే మార్లే పునరుద్ఘాటించాడు. (వారి అభిప్రాయంలో ఎందుచేత అలాటి పరిపాలనవిధానం భారతదేశానికి అనుగుణమైనదికాదో ఇదివరలో వివరించాము). ఇంతేకాదు. జాతీయవాదుల ప్రభావానికి లోబడి మితవాదులు వాటిని ప్రతిఘటించినపక్షంలో సంస్కరణల ప్రయత్నాన్ని తాను మానుకొనవలసి ఉంటుందని బెదరించాడు. మితవాదులు ఈ బెదరింపుకు భయపడి, 1907లో జాతీయవాదులతో ఏలాటిరాజీ చేసుకొనుటకు ఇష్టపడక సూరత్‌లో జరిగిన కాంగ్రెసు సమావేశాన్ని భగ్నం చేసి కాంగ్రెసులో జాతీయవాదులకు ఏలాటి స్థానం లేకుండా చేశారు. ఈ విధంగా మార్లే మితవాదులను జాతీయవాదులనుండి విడదీయగలిగాడు. అతడు తలపెట్టిన సంస్కరణలు కాంగ్రెసు

లక్ష్యసాధనకు ఎంతమాత్రమూ తోడ్పడవని తెలిసికూడా మితవాదులు జాతీయ వాదులను కాంగ్రెసునుండి తొలగించడం గుర్తించతగిన విషయం.

## 2

మితవాదులను జాతీయ వాదులనుండి విడదీయుటకు మార్లే విజయవంతంగా భేదోపాయాన్ని వినియోగించినట్లే మింటో ముస్లింలను హిందువుల నుండి విడదీయుటకు ఇదే సమయంలో ఆ ఉపాయాన్ని వినియోగించి విజయాన్ని సాధించాడు.

ఆలీఘర్ ఉద్యమానికి పితామహుడైన సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్ ముస్లింల పునర్వికాసానికి ఇంగ్లీషువిద్యవారిలో వ్యాపించడానికి గొప్పకృషిగావించినా రాజకీయాలలో వారు హిందువులతో కలియరాదని, కాంగ్రెసు హిందూసంస్థ అనీ, అందుచేత దాని కార్యక్రమాలలో వారు పాల్గొనరాదని, బ్రిటిష్ పరిపాలకులపట్ల వారు సర్వదా వినయవిధేయలతో ప్రవర్తించుట వారి కర్తవ్యమనీ, తమ ప్రయోజనాలు సమకూరుటకు బ్రిటిష్ ప్రభుత్వమే సాధనమని, దాని విధానాలను వారు ఎంత మాత్రము విమర్శించరాదని, అందుచేత వారికి ప్రత్యేక రాజకీయ సంఘం అవసరంలేదని, ఆలాటి సంఘాన్ని స్థాపించుటకు వారు ప్రయత్నం చేయరాదనీ, ముస్లింలు ఒక ప్రత్యేకజాతికి చెందిన వారనీ, వారూ హిందువులూకలిసి ఒకే జాతిగా రూపొందడం సాధ్యంకాదనీ వారికి భోదించాడు. ఈలాటి రాజకీయ తత్వాలలో అతనికి విశ్వాసం కలగడంలో ఆలీఘర్ కళాశాలకు ప్రిన్సిపాలుగా ఉండిన బెక్, అతని తర్వాత మారిసన్ చాలా సహాయపడినారు. రాజకీయాలలో ముస్లింలను హిందువుల నుండి విడతీయడంలో విత్తనాన్నినాటి అది మొలకలెత్తి పెరగడంలో ఈ విధంగా తొలి ప్రయత్నంచేసినవాడు సర్ సయ్యద్ అహమ్మద్ఖాన్. ఉత్తరప్రదేశ్‌లో ప్రధానంగానూ, తక్కినరాష్ట్రాలలో చాలావరకున్నూ ప్రముఖవర్గాలకుచెందిన ముస్లింలు అతనితో ఏకీభవించారు.

కాని 1893లో ఉత్తరప్రదేశ్‌లో అంతకు పూర్వం బీహారులో ప్రవేశపెట్టినట్లె హిందీ భాషను ప్రభుత్వం అధికార భాషగా ప్రవేశపెట్టిన కారణంగా ముస్లింల వైఖరిలో కొంత మార్పు వచ్చింది. అప్పట్లో ఆలీఘర్ కళాశాలకు కార్యదర్శిగా ఉండిన నవాబ్ మోసిక్ ఉల్ ముల్క్ ముస్లింల ప్రయోజనాలు సమకూరుటకు ఒక ప్రత్యేక రాజకీయ సంఘం ఉండడం అవసరమని భావించి ఆలాటి సంఘాన్ని 1893లో స్థాపించాడు. కాని ఇది చాలాకాలం పని చేయలేదు. ఆ నాటి హిందీ-ఉర్దూల మధ్య ఏర్పడిన వివాదాల మూలంగా రెండు మత వర్గాల మధ్య ద్వేషభావం కొంత బలపడింది.

1905లో కర్జన్ బెంగాలు రాష్ట్రాన్ని విభజించి, ముస్లింలు అధిక సంఖ్యలో ఉండేటట్లు తూర్పు బెంగాలు అస్సాం రాష్ట్రాన్ని నిర్మాణం చేయడంతో రెండు మతవర్గాల మధ్య ద్వేషభావం మరింత బలపడింది. తమకొక్క

ప్రత్యేక రాష్ట్రం లభించినదనే కారణంగా ముస్లింలు అధిక సంఖ్యలో విభజనను సమర్థించారు విభజన మూలంగా తమ రాజకీయ ప్రాధాన్యతకు నష్టం కలిగిందని హిందువులు దానిని ప్రతిఘటించి దాని రద్దుకై మహత్తరమైన వందేమాతర ఉద్యమాన్ని సాగించారు. రాజకీయాలలో ముస్లింలు హిందువుల నుండి విడిపోవడంలో రాష్ట్ర విభజన ఈ విధంగా ఒక ప్రధాన కారణమైంది. తూర్పు బెంగాలు పరిపాలనలో ఫుల్లర్ వహించిన పక్షపాత వైఖరి ముస్లింల వేర్పాటు ధోరణిని మరింత బలపరచింది. ఇది రెండు వర్గాల మధ్య మతకలహాలకు దారి తీసిందని ఇది వరకే తెలుసుకొన్నాము.

పరిస్థితులు ఈలాగు ముస్లింలకు అనుకూలంగా ఏర్పడడంచేత వారు తృప్తిగాంచిన సమయంలో వారిలో కొంత అలజడికి కారణమైన రెండు పరిణామాలు సంభవించినాయి. 1906 ఆగస్టులో మింటోఫుల్లర్ల మధ్య అభిప్రాయ భేదాలు ఉత్పన్నం కావడంతో ఫుల్లర్ తన పదవికి రాజీనామా చేశాడు. మింటో రాజీనామాను ఆమోదించి, పదవి నుండి అతనిని తొలగించాడు. ముస్లింల అసంతృప్తికి ఇది ఒక కారణమైంది. ఇదిగాక బ్రిటన్‌లో జరిగిన ఎన్నికల ఫలితంగా లిబరల్ పక్షంవారు అధికారంలోకి వచ్చారు. ఇది ముస్లింలకు ఆశాభంగాన్ని కలిగించినది. లిబరల్ పక్షంవారు టర్కీ సామ్రాజ్యం పట్ల ద్వేషాన్ని వహించినవారు కావడం దీనికి ప్రధాన కారణం. దీనికితోడు భారతదేశంలో శాసనసభల విషయంలో కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టదలచినట్లు ఇండియా మంత్రి మార్లే పార్లమెంటులో ఒక ప్రకటనను చేశాడు. సంస్కరణలు తమవర్గ ప్రయోజనాలకు అనుకూలంగా ఉంటవో ప్రతికూలంగా ఉంటవో అనే అనుమానం ముస్లింలకు కలిగింది. సమయుం మించిపోకముందే దీనిని గురించి జాగ్రత్త పడుట అవసరమని నవాబ్ మోసిన్ ఉల్ ముల్క్ భావించి మరికొందరు ప్రముఖులతో సంప్రతించి, ఈ విషయంలో ముస్లింలకు ఉచితమైన సలహాలనిచ్చి వారికి సహాయ పడవలసినదిగా ఆలీఘర్ కళాశాల ప్రిన్సిపాల్ ఆర్చిబోల్డును కోరాడు.

ఆర్చిబోల్డు దీనికి సమ్మతించి, రాజ ప్రతినిధి యొక్క ఆంతరంగిక కార్యదర్శితోను, ఉన్నత ఉద్యోగ వర్గానికి చెందిన కొందరు ప్రముఖులతోను సంప్రతించి, నవాబుకు ఒక ఉపాయాన్ని సూచించాడు. ముస్లిం ప్రముఖులు కొందరు రాజ ప్రతినిధిని కలుసుకొని, తాము వాంఛించే ప్రత్యేక సదుపాయాలను వివరిస్తూ ఒక వినతిపత్రాన్ని అతనికి సమర్పించ వలసిందిగా సలహా చెప్పాడు. ఆ సదుపాయాలు ఏలాటివిగా ఉండవలెనో, వారు ప్రత్యేక సదుపాయాలు కోరుటకు కారణాలేవో వినతిపత్రంలో చేర్చడం అవసరమనీ, వినతిపత్రాన్ని తయారు చేయుటంలో తాను సహాయపడగలడనీ నవాబుకు తెలియ పరచాడు. ముస్లిం ప్రముఖులు అతనితో చర్చలుసాగించి, వారి అభిప్రాయాలను వ్యక్తం చేశారు. వీటినివిని ఆర్చిబోల్డు అధికారుల సలహాలను కూడా

తీసుకొని వినతిపత్రాన్ని తయారు చేశాడు. ముస్లిం ప్రముఖులు దానిపై సంతకాలు చేశారు.

1906 అక్టోబరు 1న ముస్లిం ప్రతినిధివర్గాన్ని కలుసుకొనుటకూ, వారు సమర్పించదలచిన వినతిపత్రాన్ని స్వీకరించి దానికి సమాధానం చెప్పుటకూ మింటో అంగీకరించాడు. ఆ రోజున 35 ముస్లిం ప్రముఖులు ఆగాఖాన్ నాయకత్వాన సిమ్లాలో రాజ ప్రతినిధిని కలుసుకొని, వినతిపత్రాన్ని సమర్పించారు. వీరందరు ముస్లింలలో ఉన్నత భూస్వామికవర్గానికి చెందినవారు, వారిలో పదకొండుగురు ఉత్తరప్రదేశ్‌కు, ఎనమండుగురు పంజాబుకు, ఎనమండుగురు బెంగాలుకు, నలుగురు బొంబాయికి, తక్కిన రాష్ట్రాలలో ఒక్కొక్కదానికి ఒకడు, నైజాంరాజ్యానికి ఒకడు సంబంధించినవారు, మొత్తంమీద వారిలో అత్యధిక సంఖ్యాకులు ఉత్తర భారతదేశానికి చెందినవారు, ముల్లాలు ఉలేమాలు మొదలైన మతప్రచారకుల ప్రభావానికి లోబడిన సామాన్య ప్రజల తరఫున మాటలాడుటకు ఏలాటి అర్హతాలేనివారు. అయినా రాజప్రతినిధి వారిని ముస్లింల ప్రతినిధులుగా ప్రశంసించి వారి వినతి పత్రాన్ని స్వీకరించి వారికి అనుకూలంగా సమాధానం చెప్పాడు.

ఈ వినతిపత్రంలో వారు భారతదేశంలో ముస్లింలకు ఒక ప్రత్యేకస్థానం ఉన్నట్లూ, ఆకారణంచేత వారు ప్రత్యేక సదుపాయాలకు అర్హులలైనట్లు విశద పరచారు. జనాభాలో వారు అల్పసంఖ్యాకులైనా రాజకీయ రంగంలో వారికి ప్రత్యేక ప్రాధాన్యం ఉన్నదని, దేశ సంరక్షణలో వారు గొప్పపాత్రను వహిస్తున్నారని, బ్రిటిష్ పరిపాలనకు పూర్వం వారు దేశాన్ని 700 సంవత్సరాల కాలం పాలించినవారని అందుచేత వారికి ప్రత్యేక సదుపాయాలు కల్పించ వలసిందిగా కోరారు.

ఈ సదుపాయాలలో కొన్నింటిని వారు సూచించారు. (1) శాసన సభలలోను, జిల్లా బోర్డులలోను మునిసిపల్ సభలలోను వారికి కొన్ని స్థానాలను కేటాయించవలెను (2) ఈ స్థానాలసంఖ్య మొత్తపు జనాభాలో ముస్లింల సంఖ్య దామాషాలోగాక దానికంటె ఎక్కువగా ఉండవలెను. (Weightage). (3) ఎన్నుకోవలసిన ముస్లిం సభ్యులను ముస్లింలతో మాత్రము కూడిన ప్రత్యేక నియోజక వర్గాలలో ఎన్నుకోవలెను. అలాటి నియోజక వర్గాలలో ముస్లింలు కానివారికి స్థానంఉండరాదు (Communal Electorates) (4) ఉద్యోగాలన్నిటిలోనూ, హైకోర్టు న్యాయాధీశుల పదవులలోనూ కొన్ని స్థానాలు వారికి కేటాయించవలెను. ఉద్యోగాల విషయంలో పోటీ పరీక్షలు ఉండరాదు. (5) కార్యనిర్వాహణ సభలలో (Executive Councils) భారతీయులను నియమించే సందర్భంలో ముస్లింలకు కొంత ప్రాతినిధ్యం ఉండవలెను.

రాజ ప్రతినిధి తన సమాధానంలో ముస్లింల ప్రత్యేక ప్రాధాన్యాన్ని గుర్తించుటకున్నూ శాసనసభలలో వారు కోరినట్లు అధిక సంఖ్యలో వారికి స్థానాలను కేటాయించుటకున్నూ, ఎన్నుకొనవలసిన వారిని ప్రత్యేక నియోజక

వర్గాలు మాత్రమే (communal electorates) ఎన్నుకొనుటకున్నా అను గుణంగా సంస్కరణలు చేయుటకు అంగీకరించాడు. తక్కిన కోరికల గురించి వారికి అనుకూలంగా ఆలోచించదలచినట్లు వారికి హామీ ఇచ్చాడు. తాము గొప్పవిజయాన్ని సాధించినందుకు పరమానంద భరితులై ప్రతినిధివర్గం తమ్మి తాము అభినందించుకొని వెళ్ళిపొయ్యారు. వాస్తవంగా వర్గ ప్రయోజనాల దృష్ట్యా ఇది అఖండమైన విజయమే.

మింటో, ముస్లిం ప్రతినిధివర్గానికిచేసిన వాగ్దానాలు అపూర్వములైనవి. ఏ దేశంలో కూడా ఒక మతానికి చెందినవారిని, రాజకీయాలలో ఒక ప్రత్యేక వర్గంగా గుర్తించడం, శాసనసభలలో వారి ప్రతినిధులను ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా ఎన్నుకొనే సంప్రదాయం లేదు దానిని బ్రిటిష్ వారు భారత దేశంలో హిందువుల నుండి ముస్లింలను విడదీయుటకు ప్రవేశపెట్టినారు. సంస్కరణలలో దీనికి స్థానంకల్పించారు. దీని ఫలితంగా ముస్లింలు ఒక ప్రత్యేక జాతివారని హిందువులు ఇంకొక జాతివారనే ద్విజాతిసిద్ధాంతానికి వారు అధికార ముద్రను వేశారు. ఇది మొదలు రెండు వర్గాల మధ్య విభేదాలు మరింత పెరగసాగాయి. తుదకు వాటిమూలంగా 1947 లో దేశంలో రెండు స్వతంత్ర రాజ్యాలు ఏర్పడినాయి. ఈ విధంగా మింటోచేసిన వాగ్దానాలు 1909 లో మార్లేచేసిన సంస్కరణలు దేశ విభజనకూ పాకిస్థాన్ నిర్మాణానికీ దారితీశాయి.

ముస్లింలకు ప్రత్యేకప్రాధాన్యం ఉన్నట్లు మింటో అంగీకరించి వారుకోరిన ప్రత్యేక సదుపాయాలనన్నిటినీ కల్పించుటకు సిద్ధపడ్డాడు. కాని వారి వాదాన్ని సమర్థిస్తూ, వినతి పత్రంలో వారుచూపిన కారణాలు సమర్థనీయాలు కావు. బ్రిటిష్ పరిపాలన స్థాపనకు కొంతకాలంముందేవారు వారి రాజకీయాధికారాన్ని కోల్పోయ్యారు, వారి స్థానంలో మహారాష్ట్రులు దేశంలో చాలా భాగాన్ని జయించి వశపరచుకొన్నారు. కొన్ని భాగాలను శిక్కులు వశపరచుకొన్నారు. ముస్లింల పరిపాలన కాలంలోకూడా రాజపుత్రులు మొదలైనవారు అనేక స్వతంత్ర రాజ్యాలకు పాలకులుగా ఉండినారు. 700 సంవత్సరాలకాలం వారు దేశాన్ని పాలించినా వారికిపూర్వం హిందువులు 2500 సంవత్సరాలు దేశాన్ని పాలించారు. ఈవిషయాలన్నీ వారూ, మింటో విస్మరించారు. దేశ రక్షణలోవారు ఏలాటిపాత్రను వహించారో అంతకంటే ఎక్కువ పాత్రను శిక్కులు, రాజపుత్రులు, గూర్ఖాలు, జాటులు వహించారు. సైన్యంలో ముస్లింల కంటె వీరిసంఖ్యే ఎక్కువ. ఇది తెలిసికూడా బ్రిటిష్ప్రయోజనాలను మాత్రమే దృష్టిలో ఉంచుకొని మింటో ముస్లింల ప్రతినిధి వర్గంతో ఏకీభవించాడు. మార్లేకు ప్రత్యేక నియోజక వర్గాలు ప్రథమంలో అంగీకారయోగ్యం కాలేదు, నియోజక వర్గాలు మిశ్రమంగా ఉండడమే ఉత్తమవిధానమని పదేపదేఅతడు మింటోకు తెలియపరచాడు. కాని మింటో దానికి అంగీకరించలేదు, దానిమూలంగా ముస్లింలు బ్రిటిష్వారిపై తిరుగుబాటు చేసే ప్రమాదం ఉన్నదని అతనిని భయపెట్టాడు. అందుచేత అతడుకూడా ప్రత్యేకనియోజక వర్గాలను ద్విజాతి సిద్ధాం

తాన్ని ఆమోదించాడు.

ఇదిగాక అభ్యర్థుల విషయంలోను, పోటీదార్లకు ఉండతగ్గ అర్హత విషయంలోను ముస్లింలకు ఇతరులకులేని కొన్ని అనుకూలాలు కల్పించబడినవి. సంస్కరణలనే పేరుతో ప్రభుత్వం ముస్లింలపట్ల వహించిన పక్షపాతానికి ఇది ఇంకొక దృష్టాంతం.

సిమ్లా సమావేశం జరిగిన తర్వాత ముస్లిం ప్రముఖులలో రాజకీయాల పట్ల ఆసక్తి ప్రాబల్యంగాంచింది. దానిఫలితంగా వారు 1906 డిసంబరు 30న డక్కాలో సమావేశమై, తమవర్గప్రయోజనాలను రక్షించుకొనే నిమిత్తం అఖిల భారత ముస్లింలీగ్ అనేపేరుతో ఒక ప్రత్యేక రాజకీయ సంఘాన్ని స్థాపించుకొన్నారు. ముస్లింలలో బ్రిటిష్ ప్రభుత్వంపట్ల భక్తిని వృద్ధిచేయుటకున్నూ, ముస్లింల ప్రయోజనాలను రక్షించి వృద్ధిచేయుటకున్నూ, వారి అవసరాలను భక్తిపూర్వకంగా ప్రభుత్వానికి విన్నవించుటకున్నూ, దేశంలోని ఇతర వర్గాలతో ద్వేషభావం ఏర్పడకుండా పై ఉద్దేశాలను సాధించుటకున్నూ ఈ సంఘం స్థాపితమైనది. కాంగ్రెసుఆశయాలు ముస్లింల ఆశయాలకు భిన్నంగాఉండడంచేతను, కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వాన్ని బలహీనపరచే కార్యక్రమాలను సాగించుచుండడం చేతను ముస్లింలకు ఈలాటి ప్రత్యేక సంఘం ఏర్పడడం అవసరమని లీగుకార్యకర్తలు ఉద్ఘాటించారు. బ్రిటిష్‌వారు అధికారాన్ని కోల్పోయి భారతదేశాననుండి వెళ్ళిపోయిన పక్షంలో హిందువుల పరిపాలనలో ముస్లింలు ఉండవలసి వస్తుంది. అది వారెన్నడూ సహించలేరు. అందుచేత సర్వవిధాలా బ్రిటిష్ ప్రభుత్వం శాశ్వతంగా ఉండుటకు తగిన చర్యలను తీసుకొనడం ముస్లింలకర్తవ్యం అనీ, అందుకు లీగు సాధనమనీ తర్వాత ఒకముస్లిం ప్రముఖుడు లీగు స్థాపనను సమర్థించాడు. ఈవిధంగా కాంగ్రెసుకు ప్రత్యర్థిగా ముస్లింలు ఒకప్రత్యేక రాజకీయ సంఘాన్ని నిర్మాణం చేసుకొన్నారు.

### 3

సంస్కరణలను ప్రవేశపెట్టే సందర్భంలో మితవాదులను జాతీయవాదుల నుండి, ముస్లింలను హిందువులనుండి చీలదీయడమేకాక జాతీయోద్యమాన్ని, కాంగ్రెసును బలహీనపరచుటకు మింటో మరికొన్ని ప్రయత్నాలు చేశాడు. వాటిలో మొదటిది కాంగ్రెసుకు ప్రత్యర్థిగా సంస్థానాధీశులతోను జమీందార్లు మొదలైన సంపన్నులగు భూస్వాములతోనుకూడిన సలహాసంఘాలను నిర్మాణం చేయుట. కాని జమీందార్లతోకూడిన సంఘంలో చేరుట తమ గౌరవానికి హానికరమనే కారణాన సంస్థానాధీశులు ఈ ప్రయత్నాన్ని ప్రతిఘటించారు. మార్లే కూడా దీనిని తిరస్కరించాడు. అందుచేత మింటో ఈ ఉద్దేశాన్ని మానుకోవలసి వచ్చింది,

మింటో తలపెట్టిన రెండవ విధానం శాసనసభలలో ముస్లింలకు ప్రత్యేక స్థానాలు కల్పించినపక్షంలో భూస్వాములకూ వర్తకసంసంఘాలకూ (ఇవి యూరో

పియన్ల సంఘాలు) తేయాకు తోటల యజమానులకూ, విశ్వవిద్యాలయా లకూ, మరికొన్ని సంస్థలకూ కొన్ని స్థానాలకు కేటాయించుట. భూస్వాములు, వర్తకులు, సంస్థల ప్రతినిధులు ప్రభుత్వంపట్ల భక్తిగల వారినీ, జాతీయవాదుల తత్వాన్నీ విప్లవ కార్యక్రమాలనూ ప్రతిఘటించేవారనీ భావించి ఈ విధానాన్ని ప్రవేశపెట్టాడు. దీనికి మార్లే అంగీకరించాడు. దీనిమూలంగా శాసనసభలలో ఎన్నికలమూలంగా సభ్యత్వం వహించిన వారందరు కలిసి పనిచేయడం సాధ్యం కాలేదు. ఏవర్గంవారు, వారి వర్గప్రయోజనాలను మాత్రమే దృష్టిలో ఉంచుకొని శాసనసభలకార్యక్రమాలలో పాల్గొనేవారయ్యారు.

ఎన్నికల విధానం అమలులోఉండిన ఏదేశంలోకూడా ఈలాగు మతవర్గాలకూ భూస్వామిక వర్గాలకూ ఇతర వర్గాలకూ ప్రాతినిధ్యం కల్పించబడలేదు. అన్ని దేశాలలో ఈలాటి వర్గాలు లేకపోలేదు. యూరోపుఖండంలోని దేశాలలోను అమెరికా, కెనడా మొదలైన వాటిలోను ప్రొటెస్టాంటులు కాతలిక్కులు అనే మతవర్గాలు ఉన్నవి. యూరపులో ఒకప్పుడు ఈ వర్గాలకు చెందినవారు, పరస్పర యుద్ధాలనుకూడా చేసినవారు. వారిలో మతవైషమ్యం ప్రాబల్యంగాంచి ఉండేది. అయినా 19వ శతాబ్దంలో ప్రజాస్వామికం అములులోకివచ్చి, ప్రజలు పార్లమెంటు సభ్యులను ఎన్నుకొనే పద్ధతిని ప్రవేశపెట్టినప్పుడు ఈవర్గ విభేదాలను బట్టి నియోజకవర్గాల ఏర్పాటు జరగలేదు. నియోజకవర్గాలు ప్రాంతీయ నియోజక వర్గాలుగా (Territorial Constituencies) ఏర్పడినవి. అన్నిమతాలకు చెందినవారు, భూస్వాములు, వర్తకులు, పారిశ్రామికులు. కార్మికులు మొదలైనవారందరు ఒకే నియోజక వర్గంగా ఏర్పడి, ఓటుచేయడం పరిపాటిఅయింది. రాజకీయాలలో ఈలాటి విభేదాలకు స్థానంఉండరాదనే సూత్రాన్ని అన్ని దేశాలలో అనుసరించారు. కాని భారతదేశంలో బ్రిటిష్‌వారు మతభేదాలకు ఇతర వర్గ విభేదాలకు రాజకీయాలలో ప్రాధాన్యం కల్పించి, ప్రజలలో ఈ విభేదాలను మరింత బలపరచారు. ప్రజలలో ఈలాటి విభేదాలు ఉండినా రాజకీయాలలో వారందరు ఒకజాతికి చెందిన వారనే భావాన్ని వృద్ధిచేయుటకు కాంగ్రెసు కంకణం కట్టుకొన్నది. ఇందులో గొప్పవిజయాన్నికూడా సంపాదించింది. కాని ప్రజలలో జాతీయభావం పెంపొందడంపరాయివారైన బ్రిటిష్‌వారికి ఎంతమాత్రం గిట్టలేదు. దానిమూలంగా తమపరిపాలనకు ప్రమాదం సంభవిస్తుందనే భయంతో ఎన్నికల విధానంలో ఈలాటి విభేదాలను ప్రవేశపెట్టారు.

కానిదీనిమూలంగా వారుఆశించిన ఫలితాలు లభించలేదు. దేశంలోజాతీయ తత్వం బలహీనత గాంచలేదు. అదిక్రమక్రమంగా వృద్ధిగాంచి మహాత్మాగాంధి నాయకత్వాన సహాయనిరాకరణోద్యమానికి దారితీసింది. ఈ ఉద్యమకాలంలో ప్రజాశక్తి మరింత బలపడింది. తుదకు అది విజయాన్ని సంపాదించింది 1947లో అనగా సంస్కరణలు ప్రవేశపెట్టిన తర్వాత ముప్పై ఏ సంవత్సరాల లోపుగానే— బ్రిటిష్‌వారు తమ అధికారాన్ని కాంగ్రెసుకు అప్పగించి దేశాననుండి వెళ్ళిపోయ్యారు.

## 4

మార్లే మింటోలు ప్రవేశపెట్టిన సంస్కరణలు పది సంవత్సరాలపాటు అములులో ఉండినవి. 1919లో దానిస్థానే ఇంకొకచట్టాన్ని పార్లమెంటు చేసి, ప్రజాస్వామికానికి పునాదులు వేసింది. పది సంవత్సరాలుమాత్రమే అములులో ఉండిన ఈ సంస్కరణల గురించి విపులంగా వివరించడం అనవసరం. వాటిలోని కొన్ని ప్రధాన లక్షణాలను-ముస్లింలకు అధికసంఖ్యలో ప్రాతినిధ్యం కల్పించుట, వర్గ ప్రాతిపదికపై ఎన్నికలను ఏర్పరుచుట-పైన వివరించాము. అందుచేత వాటిలోని ప్రధానాంశాలను సంక్షిప్తంగా తెలియపరచుచున్నాము.

ఈ సంస్కరణల ఉద్దేశం దేశంలో ప్రజాస్వామికాన్ని ప్రవేశపెట్టడం కాదని మార్లే మింటోలు పదేపదే ఉద్ఘాటించారు. అందుచేత వీటిలో ప్రజా స్వామిక ఛాయలుగానీ, బాధ్యతాయుత పార్లమెంటరీ ప్రభుత్వ ఛాయలుగానీ ఏలాటివీ లేవు. సంస్కరణలకు పూర్వం ఉన్నట్లే తర్వాత కూడా పరిపాలనాధి కారమంతా నిరంకుశమైన ప్రభుత్వ వశంలోనే ఉంటూవచ్చింది.

సంస్కరణల మూలంగా కేంద్ర శాసన సభలోను రాష్ట్ర శాసనసభల లోను మొత్తపు సభ్యుల సంఖ్యయు, అనధికార సభ్యుల సంఖ్యయు, ఎన్నుకో బడిన సభ్యుల సంఖ్యయు పెరిగింది. కాని కేంద్ర సభలో యథాపూర్వంగా అధికార సభ్యుల సంఖ్య అధికసంఖ్యలో (Majority) ఉండినది. రాష్ట్ర శాసన సభలలోమాత్రం అనధికార సభ్యులు అధిక సంఖ్యలో (Majority) ఉండినారు. కాని వీరిలో కొందరు ప్రభుత్వనామ నిర్దేశంచేత సభ్యులు కావడంచేత వీరూ ఎన్నుకోబడిన సభ్యులూ కలిసి పనిచేసే అవకాశం లేక, వీరి సంఖ్యకు తగినబలం లభించలేదు.

సభ్యులను ఎన్నుకొనడంలో మూడు రకములైన నియోజక వర్గాలు ఏర్పడినవి. వాటిలో మొదటిది సాధారణ (General) నియోజకవర్గం; రెండ వది భూస్వాముల నియోజకవర్గాలు; ముస్లింల నియోజక వర్గాలు; మూడవది వర్తక సంఘాలవంటి ప్రత్యేక నియోజక వర్గాలు.

ఉదాహరణకు—కేంద్ర శాసనసభలో ఎన్నుకోబడిన సభ్యులసంఖ్య 27. వీరిలో 13 గ్గురు రాష్ట్ర శాసన సభలచే ఎన్నుకోబడినవారు. 6 సభ్యులు భూస్వాములచేతను, 6 సభ్యులు ముస్లింలచేతను ఎన్నుకోబడినవారు. తక్కిన ఇద్దరు వర్తక సంఘాలచే ఎన్నుకొనబడినవారు. వీరుగాక ప్రభుత్వ నామ నిర్దేశం ద్వారా 5 అనధికారులు, 36 అధికారులు (officials) సభ్యులుగా ఉండినారు. మొత్తం సభ్యుల సంఖ్య 68.

ఈలాగే రాష్ట్ర శాసనసభలలో పై మూడురకములైన నియోజకవర్గాల ద్వారా సభ్యులు కొందరిని ఎన్నుకొనడం జరిగింది. ఉదాహరణకు — మద్రాసు రాష్ట్రంలో వీరిసంఖ్య 21. వీరుగాక ప్రభుత్వం నామనిర్దేశం చేసినవారు 5; అధికారులు 20; మొత్తం 46.

సంస్కరణల మూలంగా సభ్యుల అధికారాలు వృద్ధిగాంచినవి. వారు

ప్రశ్నలు వేయడమేగాక, అదనపు (supplementary) ప్రశ్నలువేసే అధికారం సంపాదించారు. ఇదిగాక సభలో ఏటేట ప్రవేశపెట్టబడే బడ్జెటు (ప్రభుత్వ జమాఖర్చుల)ను చర్చించుటకు, దానిలో మార్పులు చేయవలసిందిగా తీర్మానాలను ప్రతిపాదించి, వాటిని సభలో వోటుకు పెట్టుటకు అధికారం లభించింది. ఇదేవిధంగా ప్రజల ప్రయోజనాలకు సంబంధించిన విషయాలను గురించి (Matters of Public Interest) తీర్మానాలను ప్రతిపాదించి, వోటుకు పెట్టే అధికారం కూడా లభించింది. కేంద్ర శాసనసభలో ఎన్నుకొన్న సభ్యుల సంఖ్య స్వల్పంగా ఉండడంచేత వారు ప్రతిపాదించిన తీర్మానాలునెగ్గే అవకాశం లేదు. రాష్ట్ర శాసనసభలలో అనధికారులు అధిక సంఖ్యలో ఉండడంచేత వారందరు కలిసిన పక్షంలో ఈలాటి తీర్మానాలు నెగ్గే అవకాశం ఉండినది. కాని వారు వివిధ నియోజక వర్గాలచే ఎన్నుకొనబడిన కారణంగాను, కొందరు ప్రభుత్వంచే నామ నిర్దేశం చేయబడిన సభ్యులు కావడంచేతను వారందరు కలిసి వోటు చేయడం సాధ్యంకాలేదు. అందుచేత తీర్మానాల ప్రతిపాదనలు, వాటిని గురించిన చర్చలు ప్రజాభిప్రాయం ఏలాగుఉండేదీ తెలుసుకొనుటలో మాత్రమే ప్రభుత్వానికి సాధనమైంది. ఇదివరలో ఉండినదానికంటె ఎన్నుకొన్న సభ్యుల సంఖ్య ఎక్కువగా ఉండినందున విద్యాధికులు తమ అభిప్రాయాలను వ్యక్తపరచుటకు ఎక్కువ అవకాశం లభించింది. కొత్త శాసనసభల మూలంగా కలిగిన ప్రయోజనాలలో ఇవే ప్రధానములైనవి.

మొత్తంమీద ఈ సంస్కరణలు ముస్లింలకుతప్ప తక్కినవర్గాలకు తృ కలిగించలేదు. జాతీయవాదులు వీటిని పూర్తిగా తిరస్కరించారు. వాదులు ప్రథమంలో సంతోషించారుగాని ముస్లింలకు ప్రత్యేక నియో వర్గాలు కల్పింపబడిన విషయం తెలియగానే వారుకూడా సంతృప్తిని కో య్యారు. అందుచేత ఇవి విఫలమైనవని చెప్పకతప్పదు. అధికారంలో క భాగమైనా ప్రజాప్రతినిధులకు పరివర్తన కావలసిందిగా అనేకులు కోరారు. అలాటిది ఏదీ జరగలేదు. ప్రభుత్వ నిరంకుశత్వం లేశమాత్రం కూడా సడలలే

అందుచేతనే సంస్కరణలు ప్రవేశపెట్టిన తర్వాత కూడా విప్లవ వాద వారి కార్యక్రమాలను సాగిస్తూనే వచ్చారు. క్రమక్రమంగా హోంరు ఉద్యమం ప్రారంభమై కొన్ని సంవత్సరాలపాటు తీవ్రంగాసాగింది. అటుతరా గాంధీమహాత్ముడు రాజకీయ రంగంలో ప్రవేశించి స్వాతంత్ర్య సమరం రెండవ ఘట్టాన్ని ప్రారంభించాడు.

శాసనసభలను సంస్కరించేవిషయమై చర్చలు జరుగుతున్న సమయంలో రాజప్రతినిధి కార్యనిర్వహణ సభలోను (executive council), గవర్నరుల కార్యనిర్వహణ సభలలోను ఒక భారతీయుని సభ్యునిగా నియమించడం వాంఛనీయమని మింటో సూచించాడు. కాని మార్లేకు ఇది అంగీకారయోగ్యంకాలేదు. మొదటినుండి ఈ సభలలో బ్రిటిష్‌వారుమాత్రమే సభ్యులుగా ఉంటూవచ్చారు. అందుచేత ఉన్నత ఉద్యోగ వర్గానికి కూడా ఈమార్పు నచ్చలేదు. కార్యనిర్వ

హణ సభలలో రహస్యంగా ఉంచవలసిన విషయాలు అనేకం చర్చకు రాగలవనీ, వాటినిగురించి భారతీయులకు వెల్లడి చేయడం ప్రమాదకరమనీ, సభ్యులుగా ఉండుటకు అర్హతగల విశ్వసనీయులైన భారతీయులు లేరనీ ఉద్యోగులు అభిప్రాయపడినారు. మార్లే కూడా వారితో ఏకీభవించాడు. కాని మింటో ఈ విషయమై పట్టుబట్టడంచేత మార్లే దీనిని ఆమోదించవలసి వచ్చింది. ఈమార్పు ఫలితంగా దేశ పరిపాలనలో ప్రధాన బాధ్యత వహించిన కార్యనిర్వాహణ సభలలో భారతీయులకు ప్రవేశం లభించింది. ఇది ప్రశంసింపదగిన మార్పు.

ఈ సందర్భంలోనే బ్రిటన్‌లో ఇండియామంత్రి సభలో (India council) కూడా రెండు స్థానాలు భారతీయులకు కేటాయించబడినవి. వాటిలో ఒకదానికి హిందువును, ఇంకొకదానికి ముస్లింను నియమించడం సంప్రదాయమైంది.

చదువదగిన గ్రంథాలు :

Bhavan : Vol. XI

Tarachand : Vol. III

Mntague-Chelmseford Report on Indian Constitutional Reforms.

Annie Besant : How India Wrought for Freedom.

# అధ్యాయము - 14

## హోంరూల్ (అంతరంగిక స్వపరిపాలన) ఉద్యమము.

### 1

1911లో బెంగాలు రాష్ట్రవిభజన రద్దుకావడంతో వందేమాతర ఉద్యమం ముగిసినట్లు భావించవచ్చును. కాని అదిముగిసినా దానిఫలితంగా ప్రజలలో స్వాతంత్ర్య పిపాస బాగా నాటుకొన్నది. పరాయి ప్రభుత్వం అంటే భయం తగ్గింది. దేశమాత విముక్తికై ప్రాణాలైనా త్యాగంచేయడం అవసరమనే భావం ప్రబలింది. విప్లవవాదులువారిదౌర్జన్య కార్యక్రమాలను సాగిస్తూ ఉండడం చేత దేశస్వాతంత్ర్యంపట్ల ప్రజలు దీక్షవహించినవారయ్యారు. వారికితగిన నాయకులు లేకపోవడంచేత ఇది వెంటనే కార్యక్రమ రూపం ధరించలేదు. 1914లో తిలక్ జైలునుండి విడుదలగాంచి రాజకీయరంగంలో ప్రవేశించాడు. అప్పటికి దివ్యజ్ఞాన సభకు నాయకురాలై ప్రజల మన్ననలకు పాత్రురాలైన అనీబెసెంటుకూడా రాజకీయరంగంలో ప్రవేశించి భారతదేశ స్వాతంత్ర్య సంపాదనకై గొప్పకృషి చేయసాగింది. ఈ కృషిలో ఆమె తిలక్ సహకారాన్నికూడా సంపాదించింది. వారిద్దరు కలిసి హోంరూల్ (అంతరంగిక స్వపరిపాలన) ఉద్యమమును సాగించి ప్రభుత్వాన్ని కొంతవరకు లొంగదీయగలిగారు. దానిఫలితంగా 1919లో మాంటెగు - చెమ్స్‌ఫర్డు సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి, ఈ పరిణామాలన్నిటికి కొన్ని అనుకూల పరిస్థితులు దారితీశాయి.

వీటిలో ప్రధానంగా గుర్తించదగినవి మూడు, మొదటిది కాంగ్రెసులో జాతీయవాదులు మితవాదులు కలిసిపోవుట. రెండవది ప్రభుత్వంపట్ల ముస్లింల వైఖరిమారి ముస్లింలీగు కాంగ్రెసులమధ్య సన్నిహిత సంబంధాలు ఏర్పడుట; మూడవది ప్రథమప్రపంచసంగ్రామ (1914-18)ఫలితంగా దేశంలోస్వాతంత్ర్యాభిలాష బలపడుట. దీనికితోడు భారతదేశంపట్ల బ్రిటిష్ ప్రభుత్వవైఖరిలో కొంత మార్పు వచ్చింది.

1907 డిసంబరులో సూరత్ కాంగ్రెసు సమావేశం భగ్నమైన తర్వాత మితవాదులు కాంగ్రెసుకు ఒక నూతన నియమావళిని రూపొందించినారు. కాంగ్రెసు లక్ష్యం వలస రాష్ట్రాలలోని స్వపరిపాలన విధానమని (colonial Self-Government), దీనిని చట్టసమ్మతములైన కార్యక్రమాల ద్వారా మాత్రమే సాధించవలెనని, ఈ రెండు సూత్రాలకు బద్ధులైనవారు మాత్రమే

కాంగ్రెసు సమావేశాలకు ప్రతినిధులుగా ఎన్నుకొనుటకు అర్హులనీ, వీరినికూడా రాష్ట్రాలలోని కాంగ్రెసు శాఖలు ఎన్నుకొనవలెనని ఈ నియమావళి విధించింది. సంపూర్ణ స్వరాజ్యములక్ష్యంగాను, బహిష్కరణాదిసాత్విక నిరోధచర్యలు దానిని సాధించుటకు సాధనాలుగాను విశ్వసించిన జాతీయవాదులకు ఈ నియమావళి మూలంగా కాంగ్రెసులో స్థానంలేకపోయింది. అందుచేత 1908 నుండి కాంగ్రెసు దేశానికంతా ప్రాతినిధ్యం వహించిన సంస్థగా ఉండుటకు బదులు ఒక మితవాద సంస్థగా మారింది.

ఇదిమొదలు కాంగ్రెసు యధాపూర్వంగా ఏటేటా సమావేశాలను జరుపుతూ, చర్విత చర్వణంగా పాతకాలపు తీర్మానాలను పునరుద్ఘాటిస్తూ, వాటిని అములుపరచవలసిందిగా ప్రభుత్వానికి వినతిపత్రాలను సమర్పిస్తూవచ్చింది, మింటో దమన విధానాన్ని బలపరచి, ప్రజల స్వాతంత్ర్యాలకు భంగకరములైన దారుణ శాసనాలను చేసి, వేలాది నిర్దోషులను జైళ్ళలో బంధించి, వారిలో అనేకులకు ద్వీపాంతరవాస శిక్షను విధించి, బంధితులందరినీ చిత్రవధకూ కనీవినీఎరుగని బాధలకూ గురిచేసిన తర్వాతకూడా మితవాద కాంగ్రెసు బ్రిటిష్‌వారు న్యాయబుద్ధి గలవారనీ, ధర్మస్వరూపులనీ ప్రస్తుతించడం మానలేదు, కాని ప్రజలకు ఇది అంతా హాస్యాస్పదంగా కనుపించింది. కాంగ్రెసు పూర్తిగా ప్రజాదరణను పోగొట్టుకొన్నది. సమావేశాలకు హాజరయ్యే ప్రతినిధుల సంఖ్యకూడా తగ్గుతూ వచ్చింది. 1912 సమావేశానికి 207 ప్రనిధులు మాత్రమే హాజరయ్యారు.

ఇదిగాక మార్లేమింటో సంస్కరణల ఫలితంగా కేంద్ర శాసనసభలోను రాష్ట్రాల శాసన సభలలోను అనధికార సభ్యులసంఖ్య పెరిగింది. ప్రముఖమితవాద నాయకులు వాటిలో సభ్యులయ్యారు. ఈ సభలలో ప్రభుత్వ విధానాలను విమర్శించుటకూ ప్రజలవాంఛలను ప్రభుత్వానికి తెలియపరచుటకూ వారికి ఎక్కువ అవకాశం లభించింది. బాహ్యంగా కాంగ్రెసు వేదికనుండి ఈపనులను చేయుటకు బదులు ప్రభుత్వం ఏర్పరచిన సభలలోనే వీటినిచేయడం ఎక్కువ లాభకారిగా కనుపించింది. అధికారులతో ముఖాముఖి చర్చలు సాగించడం సాధ్యమైంది. ఇందుచేత శాసనసభలకు ఎక్కువ ప్రాధాన్యం లభించడం కాంగ్రెసుకు అంతకుపూర్వం ఉండిన ప్రాధాన్యం తగ్గడం జరిగింది.

1916లో జాతీయవాదులు కాంగ్రెసులోచేరడంతో అదితనతొలి ప్రాధాన్యాన్ని తిరిగీ సంపాదించగలిగింది.

1908 తర్వాత జాతీయ వాదుల దృక్పథంలోకూడా కొంతమార్పువచ్చి క్రమక్రమంగా రెండుపక్షాల కలయికకు దారితీసింది.

స్వదేశాన్ని శాశ్వతంగా వదలి, ఫ్రెంచివారి స్థావరమైన పుదుచ్చేరికి ప్రవాసిగా వెళ్ళుటకు కొంతపూర్వం 1909లో అరవిందుడు తనసోదర భారతీయుల నుద్దేశించి. ఒక బహిరంగ లేఖను (ఇదే అతని ఆఖరి సందేశం) వ్రాసి, అందులో స్వరాజ్యం అంటే బ్రిటిష్ సామ్రాజ్యాననుండి పూర్తిగా విడిపోవడం కాదని, అంతరంగిక స్వపరిపాలనమని, దానిని సాధించుటకు దౌర్జన్య చర్యలు

సాగించరాదని తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. బహుశా మింటో అను సరించిన దమనవిధాన మూలంగా అతనిలో ఈలాటిమార్పు వచ్చి ఉండవచ్చు. అదే సమయంలో బిపిన్‌చంద్రపాల్ కూడా ఇదేఅభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. జాతీయవాదుల నాయకులలో ఈలాటిమార్పురావడంచేత వారికి మితవాదులకూ మధ్య ఏర్పడిన అభిప్రాయభేదాలు చాలావరకుతగ్గినవి. 1910నుండి లజపత్‌రాయ్ కూడా రాజకీయాలపట్ల విరక్తికలవాడై అస్పృశ్యుల ఉద్ధరణకు సంబంధించిన ఉద్యమాలలోను, క్షామబాధితులకు సహాయం చేయడంలోను, క్రైస్తవ మిషనరీల ప్రచారాన్ని అరికట్టడంలోను కాలంగడిపి, 1914లో దేశాన్నివదలి అమెరికాకు వెళ్లిపోయ్యాడు. సాయుధ విప్లవాన్ని భారతదేశంలో లేవదీయుటకు జర్మనుల సహాయాన్ని సంపాదించ ప్రయత్నించుచున్న అక్కడి భారతీయులను మందలించి, వారి ప్రయత్నం ఫలప్రదమైతే భారతదేశంపై జర్మనుల పరిపాలన ఏర్పడుతుందని, బ్రిటిష్ పరిపాలన దానికంటె సర్వవిధాలా ఉత్తమమైనదని, ఈలాటి ప్రయత్నాలను విరమించవలసినదని వారికి సలహాచెప్పాడు. ఈవిధంగా 1908 తర్వాత జాతీయవాదులు తమతొలి అభిప్రాయాలను మార్చుకొనడం జరిగింది.

1914 జూన్‌లో తిలక్ ఆరుసంవత్సరాల కారాగారశిక్షను అనుభవించి మాండలేజైలునుండి విడుదలై స్వదేశానికి వచ్చాడు. వెంటనే ఒకబహిరంగ ప్రకటనను చేసి, అందులో తనఉద్దేశం ఎన్నడూ భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యాననుండి విడిపోవడంకాదనీ, రాజకీయ పురోభివృద్ధికి విప్లవవాదులు అనుసరించే హత్యలు దోపిడీలు మొదలైన దౌర్జన్య కార్యక్రమాలు సాధనాలు కాజాలవనీ ఉద్ఘాటించాడు. 1915లో అతడు పూనాలో రాష్ట్రీయ మహాసభను సమావేశపరచి, ప్రపంచసంగ్రామంలో బ్రిటన్ విజయాన్ని సాధించడమే వాంఛనీయమని, బ్రిటిష్ సామ్రాజ్యంలోనే భారతదేశం స్వరాజ్యాన్ని సంపాదించుటకు ఎక్కువ అవకాశం ఉన్నదని తనఅభిప్రాయాన్నిస్పష్టపరచాడు. భారతదేశ లక్ష్యాలను సాధించుటకు కాంగ్రెసులో జాతీయవాదులు కలియడం అవసరమనీ దానికి తగినట్లుగా కాంగ్రెసు నియమావళి మారవలసిఉన్నదనీ తెలియపరచాడు.

అప్పటికి దివ్యజ్ఞాన సమాజానికి నాయకురాలైన అనిబిసెంటు రాజకీయ రంగంలో ప్రవేశించింది. దివ్యజ్ఞాన సభలో చేరుటకు పూర్వం ఆమెబ్రిటన్‌లో కార్మిక ఉద్యమంలోను, సోషలిస్టు ఉద్యమంలోను, స్త్రీల స్వాతంత్ర్య ఉద్యమంలోను ఘనమైన కృషిని గావించినట్టిది. మానవస్వేచ్ఛయందు ఆమెకు అసమానమైన ఉత్సాహము. ఆమె దివ్యజ్ఞాన సభలో చేరినతర్వాత 1893 లో భారతదేశానికివచ్చి, ఆధ్యాత్మిక, విద్యా, సంఘ సంస్కరణ రంగాలలో గొప్ప కృషిని గావించి, విద్యార్థులలో జాతీయాభిమానమును పురికొల్పి వారిమన్ననలకు పాత్రమైనది. దేశమందంతా దివ్యజ్ఞాన సమాజశాఖలు ఏర్పాటు చేయబడినవి. అందులోని సభ్యులందరు ఆమె శిష్యులు. ఆమెకు దివ్యజ్ఞాన సమాజము ద్వారా అంతర్జాతీయ రంగంలో పేరు ప్రఖ్యాతులు లభించినవి. 1914 నుండి ఆమె

భావాలలో గొప్ప పరివర్తన కలిగింది. భారతదేశం రాజకీయంగా ఆంతరంగిక స్వపరిపాలన అనుభవించినగాని తక్కిన రంగాలలో పురోభివృద్ధిని సాధించడం కష్టసాధ్యమనే నిర్ణయానికివచ్చి, ఆ నిర్ణయాన్ని అములు పరచుటకు దీక్షవహించింది. ఇందుకుగాను కాంగ్రెసులో జాతీయ వాదులను మితవాదులను కలపడం అవసరమని భావించింది. తిలక్ ఆశయాలలో గొప్ప మార్పు వచ్చినందునను, 1915 నాటికి జాతీయ నాయకులందరిలో అతడే ప్రసిద్ధుడుకావడంచేతను, రెండు రాజకీయ పక్షాలు కలియుటకు అతని సహకారం అవసరమని భావించి అతనితో సంప్రతింపులు సాగించింది. అతడు కాంగ్రెసులో చేరుటకు సుముఖుడే గాని, దాని నియమావళిలో కొంత మార్పు వచ్చిన గాని అది సాధ్యం కాదని స్పష్టం చేశాడు. అటుతర్వాత బిసెంటు మితవాద నాయకులతో ఈ విషయమై సంప్రతింపులు సాగించింది. వారిలో అనేకులు జాతీయ వాదులు కాంగ్రెసులో చేరడంపట్ల సుముఖులుగా ఉండినా గోకలే ఫిరోజిషామెహతాలు దానిని ప్రతిఘటించారు. తిలక్ నాయకత్వంలో జాతీయ వాదులు కాంగ్రెసులోచేరిన పక్షంలో అతడు ఏదోవిధంగా కాంగ్రెసు పై నాయకత్వం వహించి దాని కార్యక్రమాలను మార్చే ప్రమాదం ఉన్నదని వారు భావించారు. కాని 1915 ఫిబ్రవరిలో గోకలె, నవంబరులో మెహతా స్వర్గస్థులు కావడంచేత వారి ప్రతిఘటన అంతరించింది. అంతటితో బిసెంటు ప్రారంభించిన సంప్రతింపులు ఫలించాయి. జాతీయ వాదుల ప్రవేశానికి అనుకూలంగా 1915 డిసెంబరులో జరిగిన సమావేశంలో కాంగ్రెసు, తన నియమావళిని మార్చింది. అంతటితో జాతీయవాదులు మితవాదులు ఎనిమిది సంవత్సరాలైన తర్వాత కాంగ్రెసులో తిరిగికలిసి పోయ్యారు. దీని ఫలితంగా కాంగ్రెసుకు దేశంలో తిరిగీ పలుకుబడి కలిగింది. దాని ప్రాబల్యం కూడా పెరిగింది.

ఈ కలయికఫలితంగా 1916లో లక్నోలో సమావేశమైన కాంగ్రెసు, అతిత్వరితకాలంలోనే భారతదేశంలో స్వపరిపాలన విధానాన్ని (Self-Government) ప్రవేశపెట్టడం బ్రిటిష్‌వారి లక్ష్యమని వెంటనే చక్రవర్తి ఒక ప్రకటనను చేయవలసిందిగాను, అందుకుగాను కాంగ్రెసు ముస్లింలీగులుకలిసి తయారుచేసిన సంస్కరణ ప్రణాళికకు అనుగుణంగా కొన్నిచర్యలు తీసుకొనవలసిందిగాను ఒక తీర్మానాన్ని చేసింది. మితవాదులకు జాతీయవాదులకు స్వపరిపాలన లక్ష్యం కావడం గుర్తించదగినవిషయం.

## 2

ఈ కలియకను గురించిన సంప్రతింపులు జరుగుచున్న కాలంలోనే ముస్లింలీగు కాంగ్రెసు కలిసి పనిచేయుటకు కొన్ని పరిస్థితులు ఏర్పడినవి. వీటిలో ఒకటి 1911లో బ్రిటిష్ ప్రభుత్వం ముస్లింలీగుతో సంప్రతించకుండా బెంగాలు రాష్ట్ర విభజనను రద్దుచేయడం. తూర్పుబెంగాలు-అస్సాంరాష్ట్రాన్ని ముస్లింల ప్రత్యేక ప్రయోజనాలను ఉద్దేశించి ఏర్పాటుచేసినట్లు 1905నుండి ప్రభుత్వం

ఘోషిస్తూవచ్చింది. తమకొక ప్రత్యేకరాష్ట్రం నిర్మాణంకావడం గొప్పవిజయంగా ముస్లింలు భావించారు. కాని వందేమాతర ఉద్యమాన్ని విప్లవవాదుల దౌర్జన్యచర్యలనూ ఎదుర్కొనలేక, ప్రభుత్వం 1911 లో రాష్ట్రవిభజనను రద్దుచేసింది. ఇది ఒక నమ్మకద్రోహమని బ్రిటిష్ ప్రభుత్వపు వాగ్దానాలు నమ్మదగినవికావని ముస్లింలలో అనేకులు భావించసాగారు. హిందువులతోను కాంగ్రెసుతోను కలిసి కృషిచేయడమే తమపురోభివృద్ధికి పటిష్టసాధనమని వీరు భావించారు. ఇది వారిని కాంగ్రెసుతో సన్నిహితులుగ చేయడానికి దారితీసింది.

ఇదిగాక ఇదేకాలంలో ముస్లింరాజ్యాలపట్ల బ్రిటిష్‌వారు, వారిసహాయంతో తక్కిన యూరోపియన్ దేశాలవారు వహించిన వైఖరికూడా భారతదేశంలోని ముస్లింలను ఆగ్రహపరవశులనుచేసింది. ముస్లిందేశమైన ఈజిప్టును బ్రిటిష్‌వారు వశపరచుకొన్నారు. రష్యాతోకలిసి, వారు పర్షియాదేశాన్ని ప్రచ్ఛన్నంగా పంచుకొన్నారు. ఫ్రెంచివారు ఇటలీవారు ఉత్తరఆఫ్రికాలోని ముస్లిందేశాలను ఆక్రమించుకొనడంలో సహాయపడినారు. ఇదిగాక అయిదు శతాబ్దాలుగా గొప్ప సామ్రాజ్యానికి అధినేతలై పేరుప్రతిష్ఠలు సంపాదించిన టర్కీవారి సామ్రాజ్యంతో 1912లో బాల్కన్‌రాజ్యాలు చేసినయుద్ధంలో వారు టర్కీకి ఏలాటిసహాయాన్నీ చేయలేదు. యూరపుఖండంలోని రాష్ట్రాలన్నిటినీ (ఒకటి రెండు ప్రదేశాలనుతప్ప తక్కినవాటిని) టర్కీ పోగొట్టుకొన్నది. ఈలాగు ప్రపంచంలో ముస్లింలప్రతిభ, ఆధిక్యం నిర్మూలం కావడమూ, దానికి చాలావరకూ బ్రిటిషువారు కారకులు కావడమూ భారతదేశంలోని ముస్లింలలో బ్రిటిష్‌వారిపట్ల కొంతకాలాననుండి ఉండిన భక్తివిశ్వాసాలకు ఒక గొడ్డలిదెబ్బగా పరిణమించింది. భారతదేశాన్ని బ్రిటిష్‌వారు వశపరచుకొనడంపట్ల ఏలాటి అసంతృప్తినిచెందక, పరాయి ముస్లిందేశాలను వారు వశపరచుకున్నందుకు కోపోద్దీపితులు కావడం కొంతవిపరీతంగా కనుపించవచ్చు. కాని భారతదేశంలోని హిందువులతో 7శతాబ్దాలుగా వారు కలిసి వాసం చేసేవారైనా మతంలో రెండువర్గాల మధ్య భేదం ఉండడంచేత వారు విదేశాలలోని ముస్లింలతోనే తమకు ఎక్కువ సన్నిహిత సంబంధం ఉన్నట్లు భావించడం జరిగింది. కాని అంతర్జాతీయరంగంలో సంభవించిన పరిణామాలు కారణంగా బ్రిటిష్‌వారిపట్ల వారి విశ్వాసం సన్నగిల్లి హిందువులతోను కాంగ్రెసుతోను కలిసి కృషిచేయునట్లు వారిని ప్రోత్సహించాయి.

ఇదిగాక 1912 నాటికి ముస్లింలీగుపై, లీగును 1905లో స్థాపించిన భూస్వాములు పలుకుబడిని కోల్పోయ్యారు. ఆధునిక దృక్పథము, జాతీయ దృక్పథముగల జిన్నా, మహమ్మదాలీ, అజాద్ మొదలైనవారు పలుకుబడిని సంపాదించారు. బ్రిటిష్‌వారికి దాసానుదాసులై ప్రవర్తించడం వీరికి అంగీకారయోగ్యం కాలేదు. ఇదికూడా కాంగ్రెసులీగులమధ్య సన్నిహిత సంబంధం ఏర్పడుటలో ఒకసాధనమైంది. కొంతవరకు కాంగ్రెసులక్ష్యమే లీగులక్ష్యంగా

రూపొందింది.

1913లో జరిగిన సమావేశంలో లీగు తనలక్ష్యం వలసరాష్ట్రాలలోని స్వపరిపాలన (Colonial Self Government) భారతదేశంలో ప్రవేశపెట్టడమే నని, దీనిని సాధించుటకు కాంగ్రెసుతోకలిసి పనిచేయుట అవసరమని తీర్మానించింది. కాంగ్రెసులక్ష్యంకూడా ఇదేకావడంచేత రెండుసంస్థలుకలిసి కృషిచేయడం సాధ్యమైంది. 1915లో కాంగ్రెసు ముస్లింలీగులు బొంబాయిలో సమావేశమైనాయి. రెండుసంస్థల నాయకులు పరస్పరం సంప్రతించి స్వపరిపాలన విధానానికి అనుగుణమైన ఒక ప్రణాళికను తయారుచేయుటకు ఒక కమిటీని ఏర్పాటు చేశాయి. ఈకమిటీవారు కలిసి ఒక ప్రణాళికను తయారుచేశారు. 1916లో లక్నోలో జరిగిన కాంగ్రెసు సమావేశము, లీగుసమావేశము దానిని అంగీకరించాయి. రెండువర్గాలు కలిసి రాజకీయరంగంలో కృషిచేయుటకు ఇదిగొప్ప సాధనమైంది.

ఇందులోని ప్రధానసూత్రాలు ఈక్రిందివిధంగా ఉండినవి. (1) రాజ ప్రతినిధి కార్యనిర్వహణ సభలో (Executive Council) సగం సభ్యులను కేంద్ర శాసనసభలో ఎన్నికమూలంగా సభ్యత్వం వహించిన సభ్యులు (Elected Members) ఎన్నుకొనవలెను; (2) కేంద్ర శాసనసభలో 4/5 సభ్యులు ఎన్నుకొనబడేవారుగా ఉండవలెను. వారిలో మూడవ వంతును ముస్లింలు ప్రత్యేక నియోజక వర్గములద్వారా ఎన్నుకొనవలెను.; (3) సామాన్యంగా రాష్ట్ర వ్యవహారాలలో కేంద్రం జోక్యం కలిగించుకొనరాదు; (4) దేశ రక్షణ, విదేశీ వ్యవహారాలలో తప్ప తక్కినవాటిలో రాష్ట్ర శాసనసభలకు పూర్తి అధికారం ఉండవలెను; (5) రాష్ట్ర శాసనసభలలో 4/5 సభ్యులను ప్రజలు ప్రత్యక్షంగా ఎన్నుకొనవలెను. ఒక్కొక్క రాష్ట్ర శాసనసభలో ఎందరు ముస్లింలు ఉండవలసింది. ఈ ప్రణాళిక నిర్ణయించింది. వీరిని ముస్లింలు మాత్రమే ప్రత్యేక నియోజక వర్గాలద్వారా ఎన్నుకోవలెను; (6) రాష్ట్ర వ్యవహారాలన్నిటిపై ఆయా రాష్ట్రాల శాసన సభకు పూర్తి అధికారం ఉండవలెను; (7) శాసనసభలలో ఏవర్గానికి చెందినవారిలో 3/4 సభ్యులు ఒక విషయాన్ని గురించి చర్చించుటకు అంగీకరించని పక్షంలో ఆ విషయం చర్చకు రాకూడదు.

మార్లే మింటోలు ప్రవేశపెట్టిన సంస్కరణల మూలంగా ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పడినవనీ, ముస్లింలకు అధికసంఖ్యలో సభ్యత్వం లభించినదనీ కాంగ్రెసు వీటిని ఆక్షేపించింది. కాని పై ప్రణాళిక వీటిని అంగీకరించింది. 1916 నాటికి కాంగ్రెసువారు తమ అభిప్రాయాలను మార్చుకొన్నారు. ముస్లింలు ఒక జాతికి చెందినవారనీ హిందువులు ఇంకొకజాతికి చెందినవారనీ ఈరెండు వర్గాలు కలిసి ఒకే నియోజకవర్గాలద్వారా సభ్యులను ఎన్నుకొనడం వాంఛనీయం కాదనే ముస్లింల వాదంతో ఈ ప్రణాళిక ఏకీభవించింది. కాంగ్రెసు 1909 లో తిరస్కరించిన విధానాన్నే 1916 లో ఆమోదించింది.

ఈలాగు చేయడం మూలంగా అది సయ్యద్ అహమ్మదు ఖాన్ లేవదీసిన ద్విజాతి సిద్ధాంతాన్ని అంగీకరించింది. ఈ అంగీకారము 1947లో దేశ విభజనకు దారి తీసింది. కాని ముస్లింల సానుభూతిని సంపాదించుటకు మార్గాంతరం లేని కారణంగా అది ఈలాగు చేసింది. ఇది తాత్కాలికంగా రెండు వర్గాలమధ్య కలియకకు దోహదకారి అయినా ముస్లింలలో వేర్పాటుభావాన్ని బలపరచింది.

పై ప్రణాళికను కాంగ్రెసు ఆమోదించడంలో తిలక్ గొప్ప పాత్రను వహించాడు. కావలసింది బ్రిటిష్‌వారి అధికారం తొలగడమనీ, వారి తర్వాత ఆ అధికారం ముస్లింలవంటి ఏదో ఒక వర్గానికి లభించినా ఇబ్బందిలేదని కాంగ్రెసుకు నచ్చచెప్పాడు. అతడు ఈ విషయంలో పట్టుపట్టడంచేతనే 1916లో రెండు మతవర్గాలు కలియడం జరిగింది.

ఇది జరిగిన ఫలితంగా కాంగ్రెసువలెనే ముస్లింలీగుకూడా లక్నో సమావేశంలో స్వపరిపాలనను భారతదేశంలో ప్రవేశపెట్టడం బ్రిటిష్‌వారి లక్ష్యమని చక్రవర్తి ప్రకటించవలసిందిగాను అది క్రియారూపం ధరించుటకు వెంటనే కొన్ని చర్యలను తీసుకొనవలసిందిగాను తీర్మానం చేసింది. కాంగ్రెసు లీగులు ఒకే బాటమీద నడుచుటకు సిద్ధపడ్డాయి.

ఇదేకాలంలో కేంద్ర శాసనసభలోని ఎన్నుకొనబడిన సభ్యులలో 19గురు స్వపరిపాలనను కోరుతూ ఈలాటి ప్రణాళికనే వైస్రాయికి సమర్పించారు. దేశంలో స్వపరిపాలన వాంఛ ఏకకాలంలో అనేక వర్గాలలో బలపడినదని చెప్పుటకు ఇదికూడా ఒక తార్కాణము. వీటి అన్నిటిమూలంగా 1916వ సంవత్సరం స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో గొప్ప ప్రాధాన్యాన్ని వహిస్తున్నది.

## 3

1914 ఆగస్టులో ప్రథమ ప్రపంచ సంగ్రామం ప్రారంభమై 1918 నవంబరు వరకు సాగింది. ఇది భారతదేశ రాజకీయ పరిణామాలపై గొప్ప ప్రభావాన్ని వహించింది.

ఈ సంగ్రామంలో ఒక పక్షాన బ్రిటన్, ఫ్రాన్సు, రషియాలు, ఇంకొక పక్షాన జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీలు చేరాయి. కొంతకాలం గడచిన తర్వాత అమెరికా బ్రిటిష్ పక్షాన్ని, టర్కీ జర్మన్ పక్షాన్ని వహించి, యుద్ధంలో పాల్గొన్నాయి ఇవిగాక ఇతర దేశాలుకూడా అనేకం ఏదో ఒక పక్షంలో చేరాయి. అందుచేత యూరపు, ఏషియా, ఆఫ్రికా మొదలైన ఖండాలన్నిటిలోకి యుద్ధం వ్యాపించింది. అందుచేతనే దీనికి ప్రపంచ యుద్ధం అనే పేరు సార్థకమైంది.

భారతదేశం బ్రిటన్‌కు లోబడిన దేశం కావడంచేత బ్రిటిష్ పక్షాన చేరి యుద్ధంలో పాల్గొనవలసి వచ్చింది. యుద్ధంలో భారత సైన్యాలు అత్యధిక సంఖ్యలో పాల్గొన్నాయి. 1,161,789 భారతీయులు కొత్తగా యుద్ధకాలంలో సైన్యాలలో చేరారు. 1,215,382 సైనికులు విదేశాలలోని యుద్ధరంగాలకు

వెళ్ళి అత్యంత ధైర్యసాహసాలను ప్రదర్శించారు. వీరిలో 101,439 సైనికులు ప్రాణాలను కోల్పోయ్యారు. ప్రారంభదశలో బ్రిటిష్ సైన్యాలు ఫ్రాన్సులోను ప్లాండర్సులోను పరాజితులై అపరిమిత నష్టానికి గురియైనప్పుడు సకాలంలో భారత సైన్యాలు అక్కడికి వెళ్ళి, జర్మనులను అడ్డగించాయి. ఇంతటి గొప్ప సైన్యాన్ని తర్ఫీదుచేసి, విదేశాలకు పంపుటకగాను చేయవలసిన ఖర్చునంతను భారతదేశ ప్రభుత్వం భరించింది. 1918 మార్చి ఆఖరుకు మొత్తపు ఖర్చు 127,800,000 పౌనులకు (1917,000,000 రూపాయలకు) పెరిగింది. భరించలేని పన్నుల భారాన్ని ప్రజలు భరించారు. ఇదిగాక భారతప్రభుత్వం బ్రిటన్‌కు 100 కోట్ల రూపాయలు ఉచితంగా దానరూపంలో సమర్పించింది. సంస్థానాధీశులు ప్రజలు 2,100,000 పౌనులను (31,500,000 రూపాయలను) విరాళాలుగా ఇచ్చారు. జాతీయ ఋణం (National debt) అనేకరెట్లు పెరిగింది. ఏఁటేట దానిపైన 60 లక్షల పౌనులు (900లక్షల రూపాయలను) వడ్డీరూపంలో చెల్లించవలసి వచ్చింది. ప్రజలు కనీస అవసరాలుకూడా లభించక అనేక కష్టాలను అనుభవించారు.

బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన దేశాలు వాటి వాటి స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనుటకు, వాటి సామ్రాజ్యాన్ని విస్తరింపజేసికొనుటకు యుద్ధంలో పాల్గొన్నాయి. భారతీయులు ఆలాగు కాక పరాయి పరిపాలకుల ప్రయోజనాలకై యుద్ధం చేయవలసివచ్చింది. రాజకీయ చైతన్యం గలవారిలో ఇది అసంతృప్తికి అలజడికి కారణమై ప్రజలలో దేశాభిమానం జాతీయత, స్వాతంత్ర్య పిపాస వృద్ధిగాంచాయి.

ఇంతటి సహాయం చేసినందుకు ప్రతిఫలంగా బ్రిటిష్‌వారు భారతీయులకు స్వపరిపాలనాధికారాన్ని అందజేయగలరనే ఆశ రాజకీయపార్టీ లన్నిటికీ కలిగింది. బ్రిటిష్‌వారు అమెరికనులు చేసిన ప్రకటనలలో యుద్ధం చేయడంలో తమ ఉద్దేశం స్వార్థంకాదనీ, ప్రపంచంలో నిరంకుశ పరిపాలనను అంతరింపజేసి దానిస్థానే ప్రజాస్వామికాన్ని వ్యాపింపజేయడమనీ, అన్ని దేశాలలో సామ్రాజ్య తత్వాన్ని పరాయి పరిపాలనను నిర్మూలించి ప్రజలకు స్వాతంత్ర్యాన్ని ప్రసాదించడమనీ, ఘంటాపథంగా చెప్పినారు. యుద్ధఫలితంగా తాము చిరకాలాన నుండి వాంఛించిన స్వపరిపాలన తమకు లభించగలదనే ఆశ భారతీయులలో ఈ ప్రకటనలమూలంగా బలపడింది.

ఇది బలపడడంలో ఇంకొక పరిణామంకూడా ప్రభావం వహించింది. వలస రాష్ట్రాలైన కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా మొదలైనవి తామది వరకు అనుభవించుచుండిన స్వపరిపాలనతో తృప్తిచెందక, మరికొన్ని అధికారాలను కూడా వాంఛించాయి. వాటి ఒత్తిడిని భరించలేక వాటి వాంఛల నన్నిటినీ చెల్లించుటకు బ్రిటిష్‌వారు సిద్ధపడ్డారు. సామ్రాజ్య పరిపాలనలో కూడా వారిని భాగస్వాములుగా చేయుటకు అంగీకరించారు. దీని ఫలితంగా భారతదేశం వంటి దేశాలు బ్రిటన్‌కేగాక రంగుజాతులపట్ల అత్యంత ద్వేషాన్ని ప్రదర్శిస్తూ

ఉండే దక్షిణ ఆఫ్రికావంటి దేశాలకు లోబడవలసిన ప్రమాదం సంభవించగలదనే భావం భారతీయుల అలజడికి ఇంకొక కారణమైంది. ఇది సంభవించుటకు పూర్వమే దానిని అరికట్టుటకు కావలసిన చర్యలు తీసుకొనడం అవసరమని, వాటిలో ప్రధానమైనది స్వపరిపాలనను సంపాదించడమని వారు భావించారు. స్వాతంత్ర్య తృష్ణ తీవ్రరూపం ధరించడంలో ఇది దోహదకారిఅయింది. జాతీయ వాదులలో అగ్రగణ్యులైన తిలక్, బీసెంటులు హోంరూల్ (ఆంతరంగిక స్వపరిపాలన) ఉద్యమాన్ని ప్రారంభించి అతిఉమ్మరంగా దానిని సాగించడంలో పైన సూచింపబడిన పరిణామాలన్నీ కారణములైనాయి.

యుద్ధఫలితంగా ప్రభుత్వం అంతకుపూర్వం అనుసరిస్తున్న ధమనవిధానం మరింత తీవ్రరూపంధరించింది. దేశంలో విప్లవవాదుల చర్యలను అణచుటకు, శాంతిభద్రతలను స్థాపించుటకు, ఇది అవసరమైనదని ప్రజలకు నచ్చచెప్పుటకు అధికారులు ప్రయత్నించారు. కాని ప్రజలకు విశ్వాసంకలగలేదు. విప్లవవాదులను అణచుటకేగాక సామాన్య ప్రజల స్వాతంత్ర్యానికికూడా దమనవిధానాన్ని అనుసరించి చేయబడిన శాసనాలు భంగకరంగా పరిణమించాయి.

ఈ శాసనాలలో మొదటిది 1913 లో చేయబడిన నేరచట్ట సవరణ శాసనము (Indian Criminal Law Amendment Act). ఇందులో "కుట్ర" అనేమాటకు కొత్త నిర్వచనాన్ని కల్పించి, హార్డింజి ప్రభువును హత్య చేయుటకు ప్రయత్నించిన నేరానికై అనేకులను విచారణచేసి, నలుగురికి ఉరిశిక్షను ఇద్దరికి ఏడేసి సంవత్సరాల కఠిన కారాగార శిక్షను విధించారు.

దీని తర్వాత 1915లో దేశరక్షణ చట్టాన్ని (Defence of India Act) చేశారు. ఇది బహుదారుణమైన చట్టమని దేశమందంతటా గగ్గోలుపుట్టింది. కాని మితవాదులందరు దానిని సమర్థించుటచేత దానిని కేంద్ర శాసనసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. ఈలాటి శాసనాలు ఏలాటివైనా వాటిని సమర్థించుటకు మితవాదులు సిద్ధంగా ఉన్నట్లు వారి నాయకుడైన గోకలె హార్డింజి హత్యాప్రయత్నము జరిగిన వెంటనే ప్రభుత్వానికి హామీ ఇచ్చాడు. దానిని దేశరక్షణచట్టనిర్మాణ సందర్భంలో చెల్లించాడు, తమకు కావలసింది శాశ్వతంగా భారత దేశాన్ని బ్రిటిష్ వారు పాలించడమేనని అన్నాడు. ఈ చట్టం క్రింద దేశ రక్షణకు గాని దేశ క్షేమానికి గాని అన్యదాగా ప్రవర్తించుటకు తలపెట్టినట్లు అనుమానింపబడిన వారికి మామూలు శిక్షా స్మృతితోను సాక్ష్య విధానంతోను నిమిత్తంలేకుండా ముగ్గురు అధికారులతోకూడిన ప్రత్యేక కోర్టులు ఉరిశిక్షను, ద్వీపాంతర వాసశిక్షను, పది సంవత్సరాల కఠిన కారాగార శిక్షనువిధించవచ్చు. ఈ కోర్టుల నుండి హైకోర్టుకు అపీలుచేసుకొనే హక్కు శిక్షితులకు లేదు. అధికారులు ఇష్టానుసారం అనుమానాస్పదులందరు శిక్షకు పాత్రులైనారు. ఈలాటి చట్టాన్ని యుద్ధకాలంలో బ్రిటన్‌లోకూడా పార్లమెంటుచేసింది. కాని అందులో ప్రత్యేక కోర్టులకు ఇంతటి నిరంకుశాధికారం ఇయ్యబడలేదు. అది సైనిక నౌకాదళాల స్థావరాలకూ, ఆయుధాగారాలకు సంబంధించిన

నేరాలుచేసినవారికే పరిమితమైంది.

ఈ చట్టంక్రింద నిర్దోషులనేకులను వారివారికి ఏర్పాటు చేయబడిన ప్రత్యేక ప్రదేశాలలో నిర్బంధించారు (Internment). వారు అక్కడనుండి కదలి వెళ్ళుటకు వీలులేనట్లు నియమాలను విధించారు. అనేకుల ప్రాణాలను, ఆస్తులను మామూలు శిక్షాస్మృతితో నిమిత్తం లేకుండా హరించారు.

అనేకులపై కుట్ర చేసినట్లు కేసులు పెట్టారు. వీటిలో లాహోరు కుట్ర కేసు ప్రజలదృష్టిని ఆకర్షించి, గొప్ప అలజడికి కారణమైంది. పంజాబులో ఈలాటి కేసులు అనేకం పెట్టడం జరిగింది. మొత్తం తొమ్మిది కేసులలో 175 గురు విచారణ చేయబడినారు. వారిలో 80 మందికి ఉరిశిక్షను, 58 మందికి యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షను, 58 మందికి కొన్ని సంవత్సరాల ద్వీపాంతర వాస శిక్షనో కఠిన కారాగార శిక్షనో విధించారు. ఏకకాలంలో అనేకులకు ఈలాటి దారుణ శిక్షలను విధించడం చాలా అన్యాయమని హార్డింజి ప్రభువు భావించి స్వయంగా లాహోరుకు వెళ్ళి, లెఫ్టనెంటు గవర్నరు సర్ మైకల్ బడైరును మందలించి, శిక్షితులనేకుల శిక్షను తగ్గించాడు. కాని ఈలాటి జోక్యాన్ని అన్ని కేసులలో కలిగించుకొనడానికి రాజప్రతినిధికి సాధ్యంకాలేదు. అందుచేత పోలీసు అధికారులూ, మ్యాజిస్ట్రేటులూ ఇష్టంవచ్చినట్లు నిరంకుశంగా దేశాన్ని పాలించారు. న్యాయం, ధర్మం అనేవి పూర్తిగా అదృశ్యమైనాయి.

ఈలాటి శిక్షలకు పాత్రులైనవారిలో అధికసంఖ్యాకులు బెంగాలీలు. వారే విప్లవ ఉద్యమాన్ని ఉధృతంగా అనేక సంవత్సరాలు సాగించారు. ఈలాటివారిపై అబద్ధసాక్ష్యాలను చెప్పుటకు పోలీసువారు అనేకులకు లంచాలు ఇచ్చి సిద్ధంచేశారు. ఇట్టి లంచాలకుగాను లక్షలాదిదుర్వ్యయంజరుగుతూ వచ్చింది. ఆనాడు ఈవిధంగా శిక్షింపబడినవారు అనుభవించిన నరకబాధలు వర్ణనాతీత ములు. న్యాయస్థులని ధర్మస్వరూపులని మితవాదులు ప్రస్తుతించిన బ్రిటిష్‌వారి న్యాయధర్మం పూర్తిగా దిగజారిపోయింది. దేశంలో దీనిఫలితంగా యుద్ధకాలంలో అతృప్తి, ఆందోళన నాటుకొన్నాయి. 1919నుండి గాంధీమహాత్ముడు సాగించిన సహాయనిరాకరణోద్యమంలో అనేకులు పాల్గొనుటకూ, అందులో పాల్గొనకపోయినా అనేకులుదానిపట్ల సానుభూతిని ప్రదర్శించుటకూ ఇదే ప్రధాన కారణం. బ్రిటిష్‌ప్రభుత్వాన్ని సైతాన్ ప్రభుత్వమని (Satanic Government) ఒకప్పుడు మహాత్మాగాంధి పేర్కొన్నాడు. ప్రపంచయుద్ధం కాలంలోను అటు తర్వాతను అది వాస్తవంగా సైతాన్ ప్రభుత్వంగానే దేశాన్ని పాలించింది.

## 4

కాంగ్రెసులో జాతీయవాదులు మితవాదులు కలియడంచేతను, కాంగ్రెసు ముస్లింలీగులు కలియడంచేతను 1916వ సంవత్సరం స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో గొప్పప్రాధాన్యంవహించింది. ఇదేకాలంలో తిలక్ పశ్చిమఇండియాలోను, బిసెంట్ మద్రాసులోను హోంరూల్ లీగులను స్థాపించి హోంరూలును (ఆంతరంగిక

పరిపాలనము గురించి తీవ్రప్రచారం చేయడము 1916కు పైకలియుకలకంటె ఎక్కువ ప్రాధాన్యాన్ని కల్పించింది. ఈ ప్రచారఫలితంగా హోంరూల్ పట్ల ప్రజలలో అత్యంత ఉత్సాహము రేకెత్తి బ్రిటిష్‌వారి వైఖరిలోకూడా గొప్ప మార్పును తేగలిగింది.

1912 తర్వాత బిసెంటు భారతరాజకీయరంగంలో ప్రవేశించుటను గురించి ఇదివరకే తెలుసుకొన్నాము. ఆమె వాంఛించిన రాజకీయాభివృద్ధి మితవాదులతో కూడిన కాంగ్రెసుద్వారా జరుగుటసాధ్యంకాదని, అందుకుగాను ప్రత్యేక సంఘం ఏర్పడడం అవసరమనే నిర్ణయానికి 1913లో ఆమె వచ్చింది. దానికి మొదటిమెట్టుగా 1914లో ఆమె కామన్‌వీల్ (Commonweal) అనే వార పత్రికను స్థాపించి అందులో రాజకీయ విషయాలగురించి ఆవేశపూరితములగు వ్యాసాలను వ్రాయుసాగింది,

ఆసంవత్సరంలోనే ఆమె బ్రిటన్‌కు వెళ్లి హోంరూలుపట్ల సుముఖులుగా ఉండే పార్లమెంటు సభ్యులతో కూడిన ఒక కమిటీని స్థాపింప ప్రయత్నించింది. కాని అది ఫలప్రదం కాలేదు. అంతటితో తన ఉద్యమాన్ని విరమించక బ్రిటన్‌లో అనేక సభలను సమావేశపరచి హోంరూలు గురించి అనేక ఉపన్యాసాలు చేసింది. హోంరూలు అంటె బ్రిటిష్ సామ్రాజ్యాననుంచి భారతదేశం విడిపోవడం కాదనీ, కెనడా మొదలైన వలస దేశాలలో ఉన్నట్లే ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులతోకూడిన పార్లమెంటుకు ఆంతరంగిక వ్యవహారాలలో అధికారం లభించడమనీ, అలాటి పార్లమెంటుకు భారతదేశంలోని ప్రభుత్వం బాధ్యతను వహించి, పరిపాలనను సాగించడమనీ, అలాటి పరిపాలనా విధానానికి ప్రకృతి సిద్ధంగా భారతీయులు అర్హులనీ, బ్రిటన్‌పట్ల భక్తికి అదిమాత్రమే సాధనము కాగలదనీ ఆమెవివరించింది. బ్రిటిష్‌వారిలో కొందరు ఆమె అభిప్రాయాలతో ఏకీభవించారు.

1914లో భారత దేశానికి వచ్చినతర్వాత ఆమె "నవభారతం" (New India) అనే దినపత్రికను స్థాపించి దానిద్వారా కొంతప్రచారాన్ని సాగించింది. 1915 సెప్టెంబరు 25న హోంరూల్ లీగు అనేపేరుతో ఒక ప్రత్యేక సంఘాన్ని స్థాపించ దలచినట్లున్ను, అది కాంగ్రెసుకు సహకారిగా పనిచేయునట్లును ఒక ప్రకటనను గావించింది. డిసంబరులో బొంబాయిలో సమావేశమైన కాంగ్రెసుకు వెళ్లి, దానిలో తన లీగు గురించి దాని ఆశయాలగురించి ఒక తీర్మానాన్ని ప్రతిపాదించ ప్రయత్నించింది. కాని మితవాద నాయకులు దానికి విముఖులైనారు. కాంగ్రెసుకు ప్రత్యర్థిగా ఆమెలీగు ఏర్పడి దేశంలో ఎక్కువ పలుకుబడిని సంపాదించునని వారు భయపడినారు. అయినా హోంరూలుకు అనుకూలంగా 1916 సెప్టెంబరునాటికి కాంగ్రెసు ఒక ప్రణాళికను సిద్ధపరచ గలదని ఆమెకు వాగ్దానం చేశారు. అందుచేత తాత్కాలికంగా ఆమె లీగు సంస్థాపన ప్రయత్నాన్ని విరమించుకొన్నది. కాని దాని వాగ్దానంమేరకు కాంగ్రెసు ప్రణాళికను సిద్ధపరచలేదు. మరి కాలయాపన చేయరాదని భావించి ఆమె

(20)

1916లో హోంరూల్ లీగును స్థాపించింది.

త్వరితకాలంలోనే బొంబాయి, కాన్‌పూరు, వారణాసి, మధుర, కాలికట్, అహమదాబాదు, మద్రాసు మొదలైన నగరాలలో దాని శాఖలు ఏర్పడినవి. దేశంలో దివ్యజ్ఞానసభలు అనేకం ఉండినవి. అవి అన్నీ కూడా ఒకవిధంగా హోంరూలు శాఖలుగా మారినవి. దివ్యజ్ఞానసభ్యులు హోంరూలును సమర్థించేవారయ్యారు. అనేకులు దానినిగురించి ప్రచారంచేశారు. ఆమె నడుపుతున్న కామన్‌వీలు నవభారతపత్రికలు ప్రచారసాధనాలైనాయి. ఆమె దేశమందంతటా పర్యటించి ఆమె వక్తృత్వంతో వేలాదిప్రజలను ఆవేశపరచగలిగింది. ఆమెకుగల నిర్మాణశక్తి అద్భుతము. ఆమె ఐర్లాండులో పుట్టిపెరిగినకారణంగాను, బ్రిటన్‌లో అనేక సంవత్సరాలు మానవస్వేచ్ఛకు సంబంధించిన ఉద్యమాలలో ప్రసిద్ధనాయకులతోకలిసి కృషిచేసినకారణానను, ఉద్యమాన్ని ఏవిధంగాసాగించవలెనో స్వానుభవంద్వారా తెలుసుకొన్నది. ఆమె ఒక సంవత్సరకాలంలో ప్రజలనందరినీ ఉర్రూతలూగించగలిగింది.

ప్రచారార్థం ఆమె అనేకగ్రంథాలయాలను పఠనాలయాలను స్థాపించింది. అనేక కరపత్రాలను చిన్నచిన్నపుస్తకాలను ప్రకటించింది. భారతీయులెందరో ఆమెతో సహకరించారు. ఆంధ్రదేశంలో గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రశాఖకు కార్యదర్శిగా గొప్పకృషిని గావించారు. తక్కినరాష్ట్రాలలోకూడా ఈలాటివారెందరో ఆమెకు సహాయపడినారు.

ఇదేకాలంలో పశ్చిమఇండియాలో తిలక్ హోంరూల్ ఉద్యమాన్ని ప్రారంభించాడు. ఆనాడు జాతీయవాదులకు ఆయన ఏకైకనాయకుడు. 1915లో ఆయన బొంబాయి, మధ్యపరగణాలు, బీరార్లలోని వేయిమంది జాతీయవాదులను పూనాలో సమావేశపరచి తన ఉద్యమాన్నిగురించి ప్రసంగించాడు సమావేశం ఆయనసూచనలకు అంగీకరించి, వాటినిగురించి సమగ్రంగా ఆలోచించి ఒక నివేదికను సమర్పించుటకు ఒక కమిటీని నియమించింది. ఈకమిటీ తయారుచేసిన నివేదికను 1916లో బెల్గాంలోజరిగిన జాతీయమహాసభ చర్చించి హోంరూల్ లీగును స్థాపించుటకు తీర్మానించింది. ఆతీర్మానాన్ని అనుసరించి తిలక్ 1916 ఏప్రెలు 28న హోంరూల్ లీగును స్థాపించాడు. ఈస్థాపన బిసెంటులీగుకంటె అయిదునెలలకుపూర్వం జరిగింది

తిలక్ తనప్రచారాన్ని ఎక్కువగా బొంబాయి, మధ్యపరగణాలు, బీరారు, కర్ణాటకాలలో సాగించాడు. ఇందుకుగాను ఆయన కేసరి మరాటీపత్రికలను వినియోగించాడు. ఈలాటిప్రచారాన్ని వాస్తవంగా సాగించవలసినసంస్థ కాంగ్రెసే. కాని అప్పటికి అది మితవాదులసంస్థగానే ఉండినది. జాతీయవాదులు ఇంకా దానిలో కలియలేదు. మితవాదులు ఈలాటిప్రచారాన్ని సాగించుటకు సిద్ధంగాలేరు. దానికికావలసిన పలుకుబడిని ప్రజాదరణను వారు కోల్పోయ్యారు. అంతేకాదు. అది ఏటేట మూడురోజులు సమావేశమయ్యేసంస్థ. దైనందినప్రచారాన్ని సాగించుటకు కావలసిన యంత్రాంగం దానికిఏర్పడలేదు.

అలాటిపరిస్థితులలో దాని సాధనాన ప్రచారంసాగడం కల్ల. అందుచేతనే లీగు ఉద్దేశమూ కాంగ్రెసుఉద్దేశమూ అంతరంగిక స్వపరిపాలన సంపాదనమే అయినా దానికికావలసిన ప్రచారం లీగువంటి ఒక ప్రత్యేకసంస్థద్వారానే జరగడం సాధ్యమని తిలక్ లీగుసంస్థాపనను, అది సాగించిన ప్రచారాన్ని సమర్థించాడు.

తిలక్ తనప్రచారాన్ని చాలావరకు మరాటీభాషలోనే సాగించినందున గ్రామాలలోని సామాన్యప్రజలుకూడా దానిచే ప్రభావితులైనారు. అతడు దేశస్వాతంత్ర్యానికై కఠిన కారాగారశిక్షను అనుభవించినాడు. ప్రజలు అతనిని శివాజీ అవతారంగా భావించారు. శివాజీవలెనే అతడు దేశానికి పరాయిపరిపాలనమునుండి విముక్తిని సంపాదించి స్వరాజ్యాన్ని స్థాపించగలడనే విశ్వాసం వారికి కలిగింది. వారు ఆయనను దేశానికి మకుటంలేని రాజుగాను లోకమాన్యుడనిన్నీ సంబోధించసాగారు. అనేకులు లీగులో సభ్యులయ్యారు,

దేశంలో రెండు హోంరూల్ లీగులు ఏర్పడినా తిలక్ బిసెంటులు కలిసికట్టుగా కృషిచేయుటకు నిర్ణయించుకొన్నారు. అందుచేత వాటిమధ్య ఏలాటి పోటీగాని స్పర్థలుగాని సంభవించలేదు.

ఇద్దరు ఈ విధంగా ప్రచారంచేయడం, హోంరూలుకు అనుకూలంగా ప్రజాభిప్రాయాన్నిమార్చడం ప్రభుత్వానికి ఎంతమాత్రము నచ్చినదికాదు. వారిప్రచారాన్ని అణచుటకు అధికారులు నిర్ణయించుకొన్నారు.

ఇందులో వారు మొట్టమొదట తిలక్‌పై చర్యలు తీసుకొన్నారు. పంజాబు ప్రభుత్వము ఆయన పంజాబు ఢిల్లీ రాష్ట్రాలలో ప్రవేశించరాదని నిషేధపు ఉత్తరువులను జారీచేసింది. ప్రచారముద్వారా ప్రజలలో రాజద్రోహభావమును వ్యాపింపజేయుచున్నాడని భావించి ఆయనసొంతముగా ఇరవై వేల రూపాయలకును మరిఇద్దరు చెరిపదివేలరూపాయలకును సత్ప్రవర్తనకొరకు పూచీపడవలసినదని బొంబాయిప్రభుత్వంతరపున మ్యాజిస్ట్రేటు ఆజ్ఞాపించినాడు. కాని హైకోర్టు ఆ ఉత్తరువును రద్దుచేసింది. దీనిఫలితంగా ఆయనకూ ఆయనప్రచారానికీ మరింత ప్రజాదరణ లభించింది. ఈ విధంగా పశ్చిమభారతదేశంలో తిలక్, తక్కిన ప్రాంతాలలో బిసెంటు స్వయంపరిపాలన సంపాదనావశ్యకతనుగురించి తీవ్ర ప్రచారాన్ని సాగించారు.

ప్రచారాన్నిసాగించడంలో బిసెంటు పత్రికలు ప్రధానసాధనాలని మద్రాసుప్రభుత్వం భావించి, ముద్రణాలయ చట్టంక్రింద (Press Act) దఫాలవారీగా రు 20, 000ల ధరావత్తు కట్టవలసిందిగా ఉత్తరువులు జారీచేసింది. ఆమె ఆ మొత్తాన్ని కట్టి, తుదకు దానిని పోగొట్టుకొన్నది. అందుపై హైకోర్టుకు బ్రిటన్‌లోని ప్రివికౌన్సిలుకు అపీలు చేసింది. అవి అపీళ్ళను కొట్టివేశాయి. ఆమె కొన్నిరోజులపాటు న్యూఇండియాపత్రిక ప్రకటనను ఆపి, అటుతర్వాత ఇంకొక అనుచరుని సంపాదకత్వాన దానిని ప్రకటించసాగింది.

1917 జూన్ 15న బిసెంటును, ఆమె అనుచరులైన అరండేలు వాడియాలను ప్రభుత్వం కోయంబత్తూరులో నివసించవలసిందిగా నిర్బంధించింది.

ఇది హోంరూల్ ఉద్యమానికి మరింతబలాన్ని ప్రజాదరణను చేకూర్చింది. నిర్బంధాన్ని నిరసిస్తూ, నిర్బంధితులను వెంటనేవిడుదలచేయవలసిందిగాకోరుతూ దేశమందంతటా సభలుజరిగాయి. బ్రిటన్ అమెరికాలలోకూడా ఈలాటిసభలు కొన్ని జరిగాయి. దేశంలో స్త్రీలనేకులు ఉద్యమంలో పాల్గొన ప్రారంభించారు. దేవాలయాలలో ప్రార్థనలతో హోంరూల్ లీనమైపోయింది. మతమూ రాజకీయాలూ కలిసిపోవడం వుదేహూతరఉద్యమాన్ని స్మరణకుతెచ్చింది, ఇదివరకు లీగులోచేరని జిన్నావంటి ప్రముఖులు అందులోచేరారు. కాని వీటిమూలంగా ప్రభుత్వ విధానాలలో ఏలాటిమార్పూ రాలేదు.

అందుచేత కాంగ్రెసు ముస్లింలీగులు సాత్వికనిరోధం ఒక్కటే నిర్బంది తుల విడుదలకూ హోంరూలును సంపాదించుటకూ తగినసాధనమని భావించి దానినిగురించి తమఅభిప్రాయాలను తెలియపరచవలసిందిగా రాష్ట్రాల కాంగ్రెసు కమిటీలను ఆదేశించాయి. 1917 ఆగస్టు 14న మద్రాసురాష్ట్ర కాంగ్రెసు కమిటీ సాత్వికనిరోధానికి దాని అనుకూలతను తెలియపరచింది. అప్పటికే ఉద్యమవ్యాప్తి ప్రభుత్వవర్గాలలో గొప్ప ఆందోళనకు కారణమైంది. మితవాదులు దానిని అణచలేకపోవడాన్నికూడా ప్రభుత్వం గుర్తించింది. తరుణం మించిపోకముందే భారతీయులను తృప్తిపరచి యుద్ధంలో వారిసహకారాన్ని సంపాదించడం ప్రాజ్ఞత అనేభావంతో ఇండియామంత్రి మాంటేగు ఆగస్టు 20న బ్రిటన్‌లక్ష్యం భారతదేశంలో బాధ్యతాయుతప్రభుత్వాన్ని ప్రవేశపెట్టడమని ఒక చరిత్రాత్మకమైన ప్రకటననుచేశాడు. హోంరూల్‌ఉద్యమ ప్రభావంచేతనే ఈ ప్రకటన చేయబడింది. అటుతర్వాత సెప్టెంబరు 16న బిసెంటూ ఆమె అనుచరులిద్దరూ నిర్బంధాననుండి విడుదలఅయ్యారు. ఆగస్టు 20న ఇండియామంత్రిచేసిన ప్రకటనదృష్ట్యా హోంరూల్‌ఉద్యమాన్ని సాగించడం అనవసరమని బిసెంటు దానిని ఆపివేసింది.

తిలక్‌మాత్రం ప్రకటనజరిగిన తర్వాతకూడా ఉద్యమాన్ని ప్రచారం చేస్తూనేవచ్చాడు. దేశంలో ఆయన ప్రఖ్యాతి ఇనుమడించింది. కాంగ్రెసులో మితవాదుల పలుకుబడి పూర్తిగా అదృశ్యమైంది; 1917 కాంగ్రెసుసమావేశానికి బిసెంటును అధ్యక్షురాలుగా ఎన్నుకొనవలెనని ఆయన పట్టుపట్టాడు. మితవాదులు ఆయనవాంఛకు అన్యథాగా ప్రవర్తించినా ఆయనపట్టు ఫలప్రదమై కాంగ్రెసు ఆమె అధ్యక్షతన 1917 డిసంబరులో కలకత్తాలో సమావేశమైంది. మితవాదుల ఓటమికి ఇది గొప్పతార్కాణము.

పార్లమెంటులో ప్రకటనజరిగిననాటికి ప్రపంచ సంగ్రామంలో బ్రిటన్ అమెరికా ఫ్రాన్‌సు మొదలైన మిత్రమండలి దేశాలకు విజయంచేకూరేచిహ్నాలు ఏవీకనుపించలేదు. జర్మనులదేపైచెయ్యిగా ఉండినది. 1917 అక్టోబరులో రష్యాలో కమ్యూనిస్టు విప్లవం సంభవించి లెనిన్ ఆధ్వర్యాన నూతనప్రభుత్వం ఏర్పడింది. దేశపరిస్థితులు అతిక్లిష్టంగా ఉన్నకాలంలో జర్మనులతోయుద్ధం చేయడం సాధ్యంకాదని అతడు అనేక తాత్కాలిక నష్టాలకుకూడా సిద్ధపడి జర్మను

లతో సంధిచేసుకొన్నాడు. దానితో జర్మనులు వారిమూలబలంలో చాలాభాగాన్ని పశ్చిమరంగానికి తరలించి మరింతవిజయవంతంగా యుద్ధాన్నిసాగించడమేకాక తమవశంలోకివచ్చిన దక్షిణరష్యియామీదుగ టర్కీసహాయంతో భారతదేశంపై దండెత్తివచ్చేప్రయత్నంలోకి దిగినారు,

దీనిమూలంగా బ్రిటిష్‌వారు భయకంపితులైనారు. 1918 ఏప్రిలు 2న బ్రిటిష్‌ప్రధాని భారతీయులు మరింత ఉత్సాహంతో యుద్ధంలో ప్రభుత్వంతో తోడ్పడవలసినట్లుగా వెంటనే చర్యలు తీసుకొనవలసినదని భారతప్రభుత్వాని తెలియపరచాడు. ఆ ఆదేశంమేరకు రాజప్రతినిధి ఏప్రిలు 27న ఢిల్లీలో ఒక ప్రత్యేకసభను సమావేశపరచి సంస్థానాధీశులను ప్రజానాయకులను (తిలక్ మినహాగా) దానికి ఆహ్వానించి సమావేశఉద్దేశాన్ని వారికితెలియపరచాడు. సంస్థానాధీశులందరు పూర్తిసహాయాన్ని అందజేయుటకు వాగ్దానంచేశారు. కాని ఆహ్వానితులలో తిలక్ అనుచరుడైన కపర్దీ ప్రజలపూర్తిసహకారాన్నీ, భారతదేశం సమర్పించదగిన అంగబలాన్నీ అర్థబలాన్నీ సంపాదించుటకు దేశంలో అనతికాలంలోనే బాధ్యతాయుత పరిపాలన స్థాపించుటకు అనుగుణంగా పార్లమెంటులో ఒకబిల్లును ప్రవేశపెట్టవలసినదిగా సమావేశంతీర్మానాన్ని చేయవలెనని కోరాడు. కాని ఇది సమావేశఉద్దేశాలకు విరుద్ధమనీ, దానిని ప్రతిపాదించుటకు వీలులేదనీ కపర్దీని రాజప్రతినిధి ప్రతిఘటించాడు. అయినా దేశంలోని ప్రజలలో ఏలాటి రాజకీయాభిప్రాయాలు వ్యాపించినవో కపర్దీప్రవర్తన స్పష్టంచేసింది.

ఈలాటిసభలనే రాష్ట్రగవర్నరులుకూడా సమావేశపరచారు. బెంగాలుసమావేశంలో పాల్గొనిన యస్. చక్రవర్తి కపర్దీతీర్మానంవంటి తీర్మానాన్ని ప్రతిపాదించ ప్రయత్నించి విఫలుడయ్యాడు. బొంబాయి సమావేశానికి తిలక్ కూడా ఆహ్వానితుడైనాడు. ఆ సమావేశాన్ని ఏర్పాటుచేసినగవర్నరు విల్లింగ్డన్ హోంరూల్ఉద్యమాన్ని లేవదీసినవారిని విమర్శిస్తూ, అనతికాలంలో హోంరూల్‌ను ప్రవేశపెట్టితేతప్ప భారతదేశప్రజలు బ్రిటన్‌కు సహాయపడరాదని వారు ప్రచారంచేస్తున్నారని, వారిని నిందించాడు. తిలక్ బ్రిటన్‌కు సహాయంచేయుటకుముందు కొన్ని హామీలనుకోరడం సహేతుకమనీ, హోంరూల్ ఉద్యమాన్ని సాగిస్తున్నవారిని విమర్శించడంకూడదనీ గవర్నరుకు సమాధానంచెప్పుటకు ప్రయత్నించాడు. కాని ఆలాటిప్రసంగం సందర్భోచితంకాదని అతనిని మందలించడంచేత అతడు సభలోపాల్గొనక వెళ్ళిపోయాడు. మరికొందరుసభ్యులుకూడా ఈలాటిప్రయత్నంచేసి గవర్నరు ఆక్షేపణకారణంగా విఫలులై సభనుండినిష్క్రమించారు. గవర్నరు హోంరూల్ నాయకులను నిందించడంపట్ల నిరసనను తెలియపరచి, నిర్బంధించి సైనికులను సైన్యంలోచేర్పించడం పొరబాటని, ఉత్సాహంతో సమరంలోపాల్గొనుటకు ఒక జాతీయసైన్యాన్ని ఏర్పరచడం అవసరమనీ తనఅభిప్రాయాన్ని జిన్నా వ్యక్తపరచాడు. సమావేశంజరిగిందేగాని, ఈలాటిఅభిప్రాయాలు వ్యక్తంకావడం గవర్నరుకూ ఇతరఅధికారులకూ దేశంలో ఏలాటి అభిప్రాయాలు వ్యాపిస్తున్నవో స్పష్టమైంది. హోంరూల్ ఉద్యమం ఫల

ప్రదమైనందుకు ఇది ప్రబలతార్కాణము. ప్రపంచయుద్ధప్రారంభంలో ఉండిన భారతదేశం 1918నాటికి పూర్తిగా మారిపోయింది. బ్రిటిష్‌ప్రభుత్వం అనుసరించిన దారుణమైన దమనవిధానమూ, బలప్రయోగంచేసి సైనికులను సైన్యంలో చేర్చుకొనడమూ, చందాలను విరాళాలను వసూలుచేయడమూ భారతీయుల వైఖరిలో గొప్ప మార్పును తెచ్చింది. ఈమార్పు ప్రాబల్యంగాంచడంలో హోంరూల్ ఉద్యమం గొప్పసాధనమైంది.

ఈ ఉద్యమం భారతదేశంలోనేగాక బ్రిటన్ అమెరికాలలోకూడావ్యాపించింది. మద్రాసులోని లీగుకు ఒకప్పుడు హైకోర్టుజడ్జీగాను తాత్కాలిక ప్రధాన జడ్జీగానుఉండి, ఫించన్‌పుచ్చుకొన్న సర్ సుబ్రహ్మణ్యంఅయ్యర్ అధ్యక్షుడు. ఈహోదాలో ఆయన అనుచరులతోసహా బిసెంటు నిర్బంధంలోఉంచబడిన వారం రోజులతర్వాత 1917 జూన్ 24న అమెరికాకు మిత్రులలోఒకరై ప్రపంచ సంగ్రామంన్ని సాగిస్తున్న బ్రిటిష్‌వారు భారతదేశంలో అనుసరిస్తున్న దారుణమైన దమన విధానాన్ని నిరంకుశత్వాన్ని వివరిస్తూ అమెరికాఅధ్యక్షుడు విల్సన్‌కు ఒక లేఖనువ్రాసి, సంగ్రామలక్ష్యం ప్రపంచంలోని దేశాలన్నిటిలో ప్రజాస్వామికాన్ని ప్రవేశపెట్టడమనీ, వలసపరిపాలనకూ సామ్రాజ్యాధికారానికీలోబడిన ప్రజలందరికి స్వాతంత్ర్యమును కల్పించడమనీ అతడు నిర్వచించిన సూత్రాలను భారతదేశానికి వర్తింపజేసి వెంటనే ప్రజలు కోరిన హోంరూలును ప్రవేశపెట్టినపక్షంలో మిత్రమండలి సహాయార్థం మూడునెలలకాలంలో 50లక్షలసైన్యాన్ని యుద్ధరంగాలకు పంపగలదనీ, మరిమూడునెలల్లో ఇంకొక50లక్షలసైన్యాన్నిసమకూర్చగలదనీ తెలియపరచాడు. ఈలేఖ అమెరికాలో గొప్ప సంచలనాన్ని కలిగించింది. ఇండియామంత్రి మాంటెగు లేఖనువ్రాయడంలో అయ్యర్ మర్యాదరహితంగాను అవమానకరంగాను ప్రవర్తించినాడని పార్లమెంటులో ప్రకటించాడు. అయ్యరు దానికి క్రుద్ధుడై బ్రిటిష్‌ప్రభుత్వం తనకుప్రసాదించిన సర్, దివాన్‌బహదూర్, కే. సి. ఐ. ఇ (K. C. I. E) బిరుదములన్నిటినీ విసర్జించి తననిరసనను బహిరంగంగా తెలియపరచాడు. కాని లేఖకుసంబంధించినఉదంతం ఇంతటితోముగియలేదు.

అయ్యరులేఖ అమెరికాకాంగ్రెసులోని ఉభయసభలకు సమర్పించబడినది. దానిని అమెరికాలోని1500 పత్రికలు ప్రచురించినవి. లక్షలాదిప్రజలు దానిని చదివేఅవకాశం లభించింది. బ్రిటిష్‌పరిపాలనను అందరు నిరసించసాగారు. లక్షలాదిసైనికులను యుద్ధరంగాలకు పంపుటకు భారతదేశంసిద్ధంగాఉన్నప్పుడు అనాలస్యంగా స్వపరిపాలనను ప్రవేశపెట్టడం బ్రిటిష్‌వారికర్తవ్యమనే భావం వ్యాపించింది.

ఈ అనుకూల వాతావరణాన్ని పూర్తిగా వినియోగించదలచి హోంరూల్ లీగుశాఖనొకదానిని న్యూయార్కునగరంలో స్థాపించారు. దానితరఫున ఒక పత్రిక స్థాపింపబడింది. భారతదేశానికిసంబంధించిన వాస్తవమైన సమాచారాన్ని అమెరికాప్రజలకు అందజేసి, హోంరూల్‌పట్ల వారికి మరింతశ్రద్ధను కలి

గించుటకు అది గొప్పకృషిచేసింది. ప్రచారాన్ని బలపరచుటకు తిలక్, లజపతి రాయ్‌ని మరికొందరిని అమెరికాకు పంపినాడు. వారుసభలను ప్రధాననగరాలలో సమావేశపరచి లీగుశాఖలను మరికొన్నిటిని స్థాపించి విజయవంతంగా తమప్రయత్నాలనుసాగించి స్వదేశానికి వచ్చారు.

ఇదేవిధంగా లీగుశాఖనొకదానిని లండన్‌లో స్థాపించారు. అది సాగించిన ప్రచారఫలితంగా బ్రిటిష్‌వారిలో అనేకులు భారతదేశ స్వపరిపాలనపట్ల సుముఖులయ్యారు. హోంరూల్ ఉద్యమాన్ని బలపరచుటకు పార్లమెంటుసభ్యులు కొందరు ఒక కమిటీగా ఏర్పడినారు. 1919 ప్రారంభంలో సమావేశమైన కార్మికపక్షమహాసభ హోంరూల్‌కు అనుకూలంగా ఒక తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది.

ఇంతకుపూర్వమే 1917లో మొదట బిసెంటు, అటుతర్వాత తిలక్ వారి లీగులతరఫున బ్రిటన్‌లో ప్రచారాన్నిసాగించుటకు ఒక ప్రతినిధివర్గాన్ని పంపినారు. వారు అనేకసభలను సమావేశపరచి ఉపన్యాసాలుచేసి ప్రజాభిప్రాయాన్ని కొంతవరకు తమవైపు త్రిప్పుకొనగలిగారు. దీనినిసహించలేక భారతదేశంలో ఉద్యోగంచేసి పించన్‌పుచ్చుకొన్న ఆంగ్లోఇండియన్‌లూ మరికొందరు బ్రిటిష్‌వారూ కలిసి ఇండో — బ్రిటిష్ అసోసియేషన్ అనేపేరుతో ఒకసంఘాన్నిస్థాపించి, ఏ పరిస్థితులలోకూడా భారతదేశానికి స్వపరిపాలనను ప్రసాదించరాదనిన్ని, ఆలాటి పరిపాలనకు భారతీయులు అర్హులుకారనీ, దానిమూలంగా బ్రిటిష్‌వర్తకులకు, మిల్లుయజమానులకు, కార్మికులకు అపారనష్టం కలగడం తప్పదనీ, మధ్యతరగతి కుటుంబాల యువకులు భారతదేశంలో ఉన్నతోద్యోగాలనుసంపాదించేఅవకాశం పోగొట్టుకొనెదరనీ దుష్ప్రచారం చేయసాగింది. ఈలాటిప్రచారాన్ని ప్రతిఘటించుటకు తిలక్ ఒక ప్రతినిధివర్గాన్ని బ్రిటన్‌కుపంపదలచాడు. వారికికావలసిన ప్యాసుపోర్టులను (Passports) ప్రభుత్వంఇచ్చింది. కాని వారు జిబ్రాల్టరు చేరగానే వాటినిరద్దుచేసినట్లు అధికారులు తెలియపరచారు. వారు ఆశాభంగాన్ని పొంది స్వదేశానికి మరలివచ్చారు.

అటుతర్వాత తిలక్, కపర్ది, పాల్ మొదలైనవారితోకూడిన ఇంకొక ప్రతినిధివర్గం ఇదే ఉద్దేశంతో సింహళంలోని కొలంబోమీదుగా బ్రిటన్‌కు ప్రయాణంచేయుటకు బయలుదేరింది. కాని వారు కొలంబోచేరినపిమ్మట వారి ప్యాస్‌పోర్టులనుకూడా ప్రభుత్వం రద్దుచేసింది. ఇది చాలాఅన్యాయమని భారతదేశంలోని ప్రముఖులందరు నిరసనసభలను జరిపారు. అప్పుడు ఇండియామంత్రి మాంటెగు ఆరోజులలో తానుతలపెట్టిన సంస్కరణలనుగురించి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనుటకు భారతదేశంలో పర్యటననుసాగిస్తూ ఉండినాడు. అతడుకూడా ప్రభుత్వప్రవర్తనను నిరసించాడుగాని దానిని మార్చలేకపోయినాడు. ఈవిధంగా బ్రిటన్‌లో ఇండోబ్రిటిష్‌సంఘం వారి దుష్ప్రచారాలను ప్రతిఘటించుటకు తిలక్ చేసిన రెండుప్రయత్నాలు ఫలప్రదంకాలేదు.

తర్వాత కొన్నినెలలకు 1918, సెప్టెంబరులో తన సొంతకేసునిమిత్తం

తిలక్ బ్రిటన్‌కు వెళ్ళాడు. ఆయన బ్రిటన్‌లో ఉండగా స్వపరిపాలననుగురించి ప్రచారంచేయుటకు కాంగ్రెసు ఒక ప్రతినిధివర్గాన్ని పంపింది. దానిలో తిలక్‌ను కూడా ప్రతినిధిగా చేర్చింది. అప్పటికి ప్రపంచసంగ్రామం ముగిసింది, మిత్రమండలివారు ఘనవిజయాన్ని సంపాదించారు. యుద్ధకాలంలో భారతదేశ స్వపరిపాలననుగురించి ప్రచారంచేయడం ప్రమాదమనిభావించిన బ్రిటిష్ ప్రభుత్వం 1919లో ప్రతినిధివర్గానికి ఏలాంటిచిక్కులు కలిగించలేదు. అందుచేత తక్కిన ప్రతినిధులతో కలిసి తిలక్ అనేకసభలలో హోంరూలుగురించి ప్రచారాన్ని సాగించగలిగాడు. దీనిమూలంగా ఆయన ఉద్యమం ఏలాంటిదో ప్రజలు స్పష్టంగా తెలుసుకోనగలిగారు ఈవిధంగాతిలక్ తనఉద్యమాన్నిగురించి భారతదేశంలోనేగాక బ్రిటన్ అమెరికాలలోకూడా ప్రచారంచేసి దానిపట్ల విదేశీయుల ఆనుకూల్యాన్ని సంపాదించాడు.

ప్రపంచ సంగ్రామం ముగిసినతర్వాత బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా మొదలైన మిత్రమండలిదేశాల ప్రతినిధులు భవిష్యత్తులో జరగవలసిన మార్పులగురించి నిర్ణయాలుచేయుటకు పారిస్‌నగరంలో ఫ్రెంచి ప్రధాని క్లెమింకో (Clemenceau) అధ్యక్షతన సమావేశమైనాయి ఆసమయంలో తిలక్ అతనికి ఒక లేఖనువ్రాసి భారతదేశానికి స్వపరిపాలనను ప్రసాదించవలసిందిగా కోరాడు.

ఈలాగు 1916 - 1919మధ్య హోంరూల్ ఉద్యమం గొప్ప ప్రఖ్యాతిని వహించింది. దీనిఫలితంగా భారతరాజకీయాలు పూర్తిగామారిపోయినవి. స్వపరిపాలనపట్ల ప్రజాభిమానం అనేకరెట్లు పెరిగింది. వందేమాతర ఉద్యమంకూడా ఈలాటి ఆసక్తినిపెంచిందిగాని అది ప్రధానంగా బెంగాలురాష్ట్రానికిమాత్రమే పరిమితమైంది. హోంరూల్ ఉద్యమం ఆలాగుకాక దేశమంతటిపై ప్రభావాన్ని వహించింది. 1919 నుండి ప్రజలు పరాయి పరిపాలనను పూర్తిగా నిరసించారు. దానిని నిర్మూలించుటకు మహాత్మాగాంధి సహాయ నిరాకరణోద్యమాన్ని సాగించినప్పుడు వారు అన్నిరకములైన త్యాగాలకు సిద్ధపడి ఆయనను అనుసరించుటకు 1916నుండి బిసెంటు తిలక్ - వీరిలో ప్రధానంగా తిలక్ - సాగించిన హోంరూల్ ఉద్యమం ప్రధానకారణమైంది. స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో దానికి ఈ కారణంచేతనే ప్రాధాన్యంలభించింది. మహాత్ముని ఉద్యమానికి తిలక్ పునాదులు వేసినాడు.

చదువదగిన గ్రంథాలు :

Bhavan - Vol XI.

Tarachand - Vol III

# అధ్యాయము - 15

## మాంటేగు, చెమ్స్‌ఫర్డు సంస్కరణలు

### 1

జాతీయవాదులు మితవాదులు 1916లో కాంగ్రెసులో కలియడంచేతను, కాంగ్రెసు ముస్లింలీగులు కూడా కలిసి రాజకీయరంగంలో కృషిచేయుటకు నిర్ణయించుకొనడంచేతను దేశంలోని ప్రధాన రాజకీయపక్షాలన్నీ కెనడా ఆస్ట్రేలియా మొదలైన వలసదేశాలకు బ్రిటన్ సమర్పించిన స్వపరిపాలనప్రతిపత్తిని భారతదేశానికికూడా సమర్పించవలసిందనీ, అందుకుగాను వెంటనే కొన్ని చర్యలను తీసుకొనవలసిందని కోరడంలో ఏకాభిప్రాయానికివచ్చాయి. కేంద్రశాసనసభలోని 19 అనధికారసభ్యులు తయారుచేసి రాజప్రతినిధికి 1916లో సమర్పించిన సంస్కరణలప్రణాళిక, కాంగ్రెసు ముస్లింలీగులు అదేకాలంలో సమర్పించిన ప్రణాళిక దీనిఫలితాలే.

అప్పటికే ప్రథమ ప్రపంచ సంగ్రామంలో భారతదేశం బ్రిటన్‌కు ఘనమైన సహాయంచేసింది. ఆలాటిసహాయంచేసి బ్రిటిష్‌వారి విజయానికి తోడ్పడవలసిందిగా జాతీయవాదులకు నాయకుడైనతిలక్ దేశీయులకు ప్రభోధంచేశాడు మహాత్మా గాంధీ కూడా భారతీయులు అధికసంఖ్యలో సైన్యంలో చేరి, యుద్ధంలో నైపుణ్యాన్నిసంపాదించి ప్రభుత్వానికి సహాయపడవలసిందిగా ప్రచారంచేశాడు. ఈవిషయంలో తిలక్‌గాని, మహాత్ముడుగాని నిష్కామకర్మసూత్రాన్ని అనుసరించినవారుకారు. ఈలాగుసహాయంచేసినందుకు భారతస్వాతంత్ర్యంఅనే ప్రతిఫలాన్ని ఆపేక్షించారు. కృతజ్ఞతాసూచకంగా బ్రిటన్ ఆలాంటి ప్రతిఫలాన్ని అందజేయగలదని విశ్వసించారు.

ఇందుకుగాను బ్రిటిష్ ప్రభుత్వం 1916 వరకుకూడా ఏలాటి చర్యలూ తీసుకొనక పోవడం చేతనే తిలక్, బిసెంటులు హోంరూల్ ఉద్యమాన్ని ప్రారంభించి తీవ్రంగా సాగించారు. ప్రజలలో విప్లవ భావాలు వ్యాపించాయి. హూంరూల్ సంపాదించుటకు సాత్విక నిరోధ సాధనాన్ని వినియోగించవలసిందిగా మద్రాసు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ కోరడంకూడా జరిగింది.

ఈలాగు భారతదేశ రాజకీయ రంగంలో మార్పులు జరుగుచున్నకాలంలో బ్రిటిష్ ప్రభుత్వం యొక్కయు ప్రముఖుల యొక్కయు వైఖరి ఏలాటిదిగా ఉండినదో, అది క్రమక్రమంగా ఏవిధంగా మారిందో తెలుసుకొనడం అవసరం.

ఇంతకుపూర్వమే వందేమాతర ఉద్యమ ఫలితంగా అధికారులు కొందరి వైఖరిలో మార్పు వచ్చినట్లు రాష్ట్ర విభజనరద్దుకు సంబంధించి రాజప్రతినిధి హార్డింజి ఇండియా మంత్రి క్ర్యూకు పంపిన అధికారపత్రం (despatch) సూచిస్తున్నది. ఆ పత్రంలో, "భారతదేశంలో బ్రిటిష్ పరిపాలన సుస్థిరంగా ఉండుటకు కౌన్సిలుతో కూడి గవర్నర్ జనరల్ ఆధిపత్యం చెక్కు చెదరకుండా ఉండడంతప్పదు...కాని దేశపరిపాలనలో భాగస్వామ్యం ఉండవలెననే భారతీయుల న్యాయమైన వాంఛను ఎప్పటికైనా చెల్లించడం అవసరం. బ్రిటిష్ ఆధిపత్యానికి ఏ విధమైన లోపంకలగకుండా దీనిని ఏవిధంగా చెల్లించడమనేది పరిష్కరించ వలసిన ప్రధానసమస్య. రాష్ట్రాలకు కొన్ని అధికారాలను అప్పగించడమే దీనికి పరిష్కారం. ఆలాటిఅధికార వికేంద్రీకరణము జరిగినపక్షాన భారతదేశం రాష్ట్ర వ్యవహారాలన్నిటిలో స్వాతంత్ర్యాన్ని అనుభవించే రాష్ట్రాలతో కూడిన (provincial autonomy) సమాఖ్యగా(federation) రూపొందుతుంది. ఆలాటి సమాఖ్యలో కేంద్రప్రభుత్వం రాష్ట్రాలలో దుష్పరిపాలన జరగకుండా ఉండుటకు వాటిపై అజమాయిషీఅధికారాలను వహిస్తూ దేశమంతటికి సంబంధించిన సామ్రాజ్యవ్యవహారాలలో మాత్రమే అధికారంకలదిగా ఏర్పడుతుంది.'' అని హార్డింజి ప్రభువు తెలియపరచాడు.

దేశపరిపాలనలో భాగస్వామ్యాన్ని భారతీయులు వాంఛించడం న్యాయమైన వాంఛఅనీ, దానినిఎప్పటికైనా చెల్లించడం అవసరమనీ ఒక గొప్పఅధికారి గుర్తించడం ఇదే ప్రథమం, ఇదిగాక దీనికి రాష్ట్రాలకు కొన్ని విషయాలలో స్వాతంత్ర్యాన్ని ప్రసాదించడం సాధనమనికూడా ఈ పత్రం గుర్తించింది. భారతీయులను తృప్తిపరచుటకు మార్గమేదో స్పష్టపరచిన అధికార పత్రం ఇది మొదటిది కావడంచేతను, కాలక్రమాన ఈ లక్ష్యాలతోనే బ్రిటిష్‌వారు భారత రాజ్యాంగంలో మార్పులు చేయడంచేతను ఈ పత్రానికి చరిత్రలో గొప్ప ప్రాధాన్యం లభించింది. మితవాదుల ఆధీనంలో ఉండిన ఆనాటి కాంగ్రెసు దీని పట్ల హర్షాన్ని వెలిబుచ్చింది. కాని జాతీయవాదులకు ఇది ఏలాటి తృప్తినీ కలిగించలేదు. ప్రభుత్వం స్వరాజ్య ప్రణాళికను తయారుచేసి, దానిని ఆచరణలో పెట్టినప్పుడే ప్రజలకు తృప్తికలుగుతుందని వారు ఉద్ఘాటించారు. లజపత్‌రాయి ఈ విషయాన్ని విమర్శిస్తూ, "భారతదేశ వైజ్ఞానిక రాజకీయ గౌరవాన్ని వృద్ధి చేయుటకు మేము రాజకీయాధికారాన్ని వాంఛిస్తున్నాము. మా లక్ష్యం వాస్తవమైన స్వేచ్ఛ, సమానత్వము, ప్రజలందరికీ సమానావకాశాలు... మా ఇష్టానుసారం శాసనాలను చేయుటకు, ఆర్థికవిధానాన్ని రూపొందించుటకు మాకు స్వేచ్ఛ కావలెను. ఈ ఉద్దేశంతోనే మేము హోంరూలును వాంఛిస్తున్నాము" అని జాతీయవాదుల వైఖరిని అధికారుల దృష్టికితెచ్చాడు.

భారత రాజకీయ నాయకులలో పత్రాన్ని గురించి ఈలాటి అభిప్రాయ భేదాలు కలిగినప్పటికీ, అందులో వ్యక్తంచేసిన రెండు ప్రధాన విషయాలు అధికారులలో సంచలనంకలిగించింది. పరిపాలనలో భారతీయులను భాగస్వాములుగా

చేయడమంటె ప్రజాస్వామికాన్ని దేశంలో ప్రవేశపెట్టడమే. ఇది భారతదేశా తగిన విధానం కాదని అప్పట్లో రాజప్రతినిధి కార్య నిర్వాహక సభ (Executive Council) ప్రముఖుడైన క్రాడక్, "ఇప్పుడేకాదు, భవిష్యత్తు కూడా భారతదేశం ఎలాటి స్వాతంత్ర్యానికీ అర్హమైనట్టిదికాజాలదు. భారతీ లందరు ఒక జాతికి సంబంధించినవారుకారు. వారిలో జాతీయభావం ఏర్ప సాధ్యంకాదు. వారిలోని జాతిద్వేషాలు, మత ద్వేషాలు అదృశ్యాలు కాజా వర్ణభేదాలు, కులభేదాలు నిర్మూలం కావడం కల్ల, ఈ పరిస్థితు స్వాతంత్ర్యం అనేది ఆచరణ సాధ్యంకాని లక్ష్యం. రాష్ట్రాలకు అంతర స్వాతంత్ర్యాన్ని కల్పించడం కూడా వాంఛనీయం కాదు. అది కేంద్ర త్వాన్ని బలహీనపరచే విధానం, అందుచేత స్వపరిపాలన ప్రసక్తిని భారతీయు పెట్టుకొనరాదు", అని హార్డింజి అభిప్రాయాలను ఖండించాడు హార్డింజి కూ తన ఉద్దేశం భారతదేశానికి వలసరాష్ట్ర స్వపరిపాలన విధానాన్ని కల్పించడ కాదని అతనికి తెలియపరచాడు. తూర్పు ఇండియా సంఘ కాలాననుండి ఉన్నత ఉద్యోగ వర్గానికి చెందిన క్రాడక్ వంటివారు తమ ఉద్యోగ పదవుల మూలంగా ఎన్నో లాభాలను గౌరవాలను అనుభవిస్తూవచ్చినారు. పరిపాలనలో భారతీయు లకు భాగస్వామ్యం లభించినపక్షాన వాటిని వదలుకొనవలసివస్తుంది. స్వపరిపాలన పట్ల వారుగాని బ్రిటన్‌లోని అధికసంఖ్యాకులుగాని సుముఖులుకావడం ఆకా శంలో భవనాలను కట్టడంవంటిదే.

ఇండియా మంత్రి క్ర్యూ హార్డింజి పత్రం భారతదేశానికి ఏలాటి స్వాతంత్ర్యాన్ని కల్పించుటకు ఉద్దేశించలేదని, అది ఎన్నటికి సాధ్యంకాదని స్పష్టంచేశాడు. కాని సహాయ ఇండియా మంత్రిగా ఉండిన మాంటేగు అతని అభిప్రాయంతో ఏకీభవించక, హార్డింజి పత్రం బ్రిటిష్ ప్రభుత్వ తుది లక్ష్యాన్ని సూచిస్తున్నదని, అదియే అనుసరించిదగిన లక్ష్యమని అన్నాడు. అయినా మొత్తం మీద అధికారుల ధోరణిలో చెప్పుకోతగిన మార్పు ఏదీ రాలేదు. భార తీయులు ఏలాటి స్వాతంత్ర్యానికీ ప్రజాస్వామికానికీ అర్హులు కారనే పాతపాటనే వారు పాడేవారయ్యారు.

1914 నుంచి ప్రపంచ సంగ్రామం జరిగింది. దీని ఉద్దేశం ప్రపంచంలో ప్రజాస్వామికాన్ని వ్యాపింపజేసి సుస్థిర పరచడమనీ, అన్నిదేశాల ప్రజలను పరాయి పరిపాలన నుండి విముక్తుల గావించి స్వపరిపాలనను అనుభవించే వారి నిగ చేయడమనీ, బ్రిటిష్ ప్రభుత్వమూ అమెరికా అధ్యక్షుడు విల్సన్ పదే పదే ఉద్ఘాటించారు. దీనిచే భారతీయులు ప్రభావితులైనారనీ, తమకు కూడా స్వాతంత్ర్యమూ స్వపరిపాలన హక్కూ లభించగలదనే భావం వారిలో వ్యాపిం చిందనీ, అలాగు వ్యాపించడం న్యాయమేనని బ్రిటిష్ ప్రభుత్వం కొంతవరకూ గ్రహించింది. కాంగ్రెసులో మితవాదులు జాతీయవాదులు కలియడమూ, కాంగ్రెసు ముస్లింలీగులు కలిసి ఒక రాజకీయ ప్రణాళికను రూపొందించి అధి కారులకు సమర్పించడమూ, బ్రిటన్‌లోని అధికారుల వైఖరిని కొంతవరకు

మార్చింది. అనేక సంవత్సరాల నుండి తాము అనుసరిస్తూ వచ్చిన "చీలించి పరిపాలించు" అనే విధానానికి కాలదోషం పట్టినదనీ, అది ఆచరణసాధ్యం కాదనీ వారు తెలుసుకొన్నారు. యుద్ధాన్ని సాగించడంలో బ్రిటన్‌కు భారతదేశ సహాయం అవసరం కావడంచేత కూడా వారి వైఖరిలో కొంత మార్పును తెచ్చింది. 1916లో హోంరూల్ ఉద్యమం తీవ్రరూపం ధరించడం కూడా ఈ మార్పునకు కొంత కారణమైంది. అందుచేత అప్పట్లో ఇండియా మంత్రిగా ఉండిన చేంబర్లెన్ (Chamberlain) భారతదేశ పరిపాలనలో బ్రిటిష్ వారి లక్ష్యాన్ని భారతీయులకు కొంత సంతృప్తికరంగా నిర్ణయించడమూ దాని సాధనకై కొన్ని సంస్కరణలను వెంటనే ప్రవేశపెట్టడమూ అవసరమని నిర్ణయించి, అప్పట్లో రాజప్రతినిధిగా ఉండిన చెమ్స్‌ఫర్డు ప్రభువును కొన్ని సూచనలను చేయవలసినదిగా కోరాడు.

చెమ్స్‌ఫర్డు స్వతహాగా గొప్ప మార్పులు చేయడం పట్ల విరోధి. అదిగాక అతడు పరిపాలన విషయంలో కార్యనిర్వాహక సభలోని ఉద్యోగ వర్గానికి చెందిన సభ్యులపై ఆధారపడినవాడు. వారి సలహాలమేరకు భారతదేశ పరిపాలన విధానంలో శాసనసభలలో మరకొందరు భారతీయులను చేర్చుకొనడమూ, ఎన్నికలలో పాల్గొనే హక్కును విస్తృతపరచడమూ, స్థానిక సంస్థల అధికారాలను కొంత పెంచడమూ జరగడంతప్ప మరి ఏలాటి మార్పులూ అవసరం లేదని ఒక నివేదికను పంపాడు. కాని ఈలాటి స్వల్పసంస్కరణలు ప్రజలను తృప్తిపరచజాలవని చేంబర్లెన్ భావించి వీటికంటె ఉదారములైన మార్పులను చేయ సంకల్పించాడు. క్యాబినెట్టులోని మంత్రులు కూడా అతనితో ఏకీభవించారు.

అతని సంకల్పం కార్యరూపం ధరించడానికి పూర్వమే మరికొన్ని సంఘటనల ఫలితంగా అతడు తన పదవికి రాజీనామా చేయవలసివచ్చింది. అతనిస్థానే ఆదివరకు సహాయ మంత్రిగా ఉండిన మాంటేగు ఇండియా మంత్రిపదవిలోకి వచ్చాడు. ఇతడు భారతదేశ స్వపరిపాలనపట్ల కొంత సుముఖుడు. చేంబర్లెన్ సంకల్పంతో ఏకీభవించి, అతడు చేయదలచినమార్పులకు పూర్తిస్వరూపాన్ని కల్పించి, 1917, ఆగస్టు 20న పార్లమెంటు కామన్స్‌సభలో ఒక చరిత్రాత్మకమైన ప్రకటనను కాబినెట్టుమంత్రులందరి సమ్మతితోచేశాడు. ఆ ప్రకటన ఈక్రిందివిధంగా ఉండినది.

"భారతదేశపు ప్రతిపరిపాలనశాఖలో భారతీయులకు ఎక్కువసంబంధాన్ని కలుగజేయడము, బ్రిటిష్‌సామ్రాజ్యంలో ప్రధానభాగంగా ఉంటూ భారతదేశంలో క్రమక్రమంగా బాధ్యతాయుతప్రభుత్వాన్ని స్థాపించుటకు అనుగుణమైన స్వపరిపాలన సంస్థలను క్రమక్రమంగా వృద్ధిచేయడము బ్రిటిష్‌ప్రభుత్వమవలంబించదలచిన పరిపాలనవిధానము. దీనితో భారతదేశప్రభుత్వముకూడా పూర్తిగా అంగీకరిస్తున్నది. ఈ విధానాన్ని అచరణలో పెట్టుటకు అవసరమైన ప్రధానచర్యలను సాధ్యమైనంతత్వరలో తీసుకొనుటకు ఉభయప్రభుత్వాలు నిర్ణయించుకొన్నాయి.

ఈవిధానములో అభివృద్ధి క్రమానుగతముగమాత్రమే జరుగునని స్పష్టం

చేయడం అవసరం. భారతదేశప్రజల శ్రేయోభివృద్ధులకు బాధ్యతవహించిన ఉభయ ప్రభుత్వములుమాత్రమే. ఇది సార్థకమగుటకు కాలనిర్ణయమును చేయుటకు, ఏయేకాలములో ఏలాటిచర్యలను తీసుకొనవలసినది నిర్ణయించుటకు అర్హులు. దేశసేవలో నూతనావకాశములను సంపాదించినప్రజలు ఈవిషయములో (ప్రభుత్వాలకు) చేసేసహాకారముపట్లను బాధ్యతతోకూడిన ప్రవర్తనపట్లను ప్రభుత్వాలకుకలిగే విశ్వాసమునుబట్టి ఈ అభివృద్ధి కొనసాగును. దీనినిగురించి పార్లమెంటులో ప్రవేశపెట్టే సంస్కరణలవిషయంలో ప్రజలందరు వారి అభిప్రాయములను తెలియపరచుటకు పూర్తి అవకాశము ప్రభుత్వము కల్పించును". ఇందుకుగాను తాను భారతదేశమునకు వెళ్ళి అందరి అభిప్రాయాలను తెలుసుకొనుటకు సిద్ధంగాఉన్నట్లుకూడా మాంటెగు తెలియపరచినాడు.

భారతదేశపరిపాలనవిధానంలో బ్రిటిష్ ప్రభుత్వపు తుదిలక్ష్యమేదియో ఈ ప్రకటన అధికారయుతంగాను బహిరంగంగాను స్పష్టంచేసింది. దీనిలోని "బాధ్యతాయుతప్రభుత్వం," అనేమాటలు దానికి చారిత్రాత్మక ప్రాధాన్యాన్ని కల్పించాయి. బాధ్యతాయుతప్రభుత్వానికి ప్రజలుఎన్నుకొన్న శాసనసభకు ప్రభుత్వం బాధ్యతవహించి పరిపాలన సాగించడం ప్రధానలక్షణం. శాసనసభలో అధికసంఖ్యాబలం (Majority) గలవారు అధికారంలోకిరావడం, ఆ బలాన్ని కోల్పోయినపుడు అధికారాననుండి తొలగిపోవడం ఈ విధానంలో జరుగుతుంది. ఇంతవరకు దేశాన్ని పాలిస్తూవచ్చిన ప్రభుత్వం ఈలాటిదికాదు. రాజప్రతినిధి అధికారాన్ని, అతని కార్యనిర్వాహకసభ అధికారాన్ని, బ్రిటన్‌లోని ప్రభుత్వం నిర్ణయిస్తూవచ్చింది. వారు ఎంతకాలం అధికారంలో ఉండవలసిందికూడా ఆ ప్రభుత్వమే నిర్ణయించేది. భారతదేశంలో పై ప్రకటానుసారం బాధ్యతాయుతప్రభుత్వం ఏర్పడినపక్షాన ఈపద్ధతిమారి ప్రభుత్వంయొక్కయు అధికారులయొక్కయు ఉద్యోగ కాలనిర్ణయం ప్రజలెన్నుకొనిన శాసనసభపై ఆధారపడడంజరుగుతుంది. ఇదే బ్రిటన్‌లోను కెనడా మొదలైన రాష్ట్రాలలోను ఉండేవిధానం. కేంద్రశాసనసభలోని 19 సభ్యులూ, కాంగ్రెసు ముస్లింలీగులు తయారుచేసిన ప్రణాళికలలో ఈ విధానాన్నిగురించి ప్రస్తావనేలేదు. వారి ప్రణాళికలకంటె మాంటెగు చేసిన ప్రకటన ఈదృష్ట్యా ఉత్తమమని భావించవలసిఉంది.

కాని ఇది తుదిలక్ష్యమనీ, ఇది క్రమక్రమంగామాత్రమే ఆచరణలోకిరాగలదనీ, ఆ క్రమాన్ని ఉభయప్రభుత్వాలుమాత్రమే నిర్ణయించుటకు అర్హములనీ ప్రకటనలోని వాక్యాలు జాతీయవాదులకు ఆశాభంగం కలిగించింది. ఇది ఆచరణలోకి వచ్చుటకు చాలాకాలం పట్టగలదని వారు భయపడినారు. మితవాదులు మాత్రం పూర్తిగా తృప్తిగాంచారు. దానికి అనుగుణంగా వెంటనే కొన్నిచర్యలను బ్రిటిష్‌ప్రభుత్వం తీసుకోగలదని ప్రకటనలోనివాక్యం వారికి తృప్తినికలిగించింది. ప్రకటనపట్ల ఈలాటి అభిప్రాయభేదాలుకలగడంచేత రెండుపక్షాలు తిరిగీ విడిపొయ్యేసూచనలు కనుపించాయి

అది 1917 డిసెంబరులో కలకత్తాలోజరిగిన కాంగ్రెసుసమావేశంలో

కొంతవరకు వ్యక్తమైంది. దానికి బిసెంటు అధ్యక్షుతవహించవలసిందిగా జాతీయవాదులు కోరారు. మితవాదులకు అది ఆమోదయోగ్యంకాలేదు. తుదకు ఏలాగో బిసెంటు అధ్యక్షురాలగుటకు వారు అంగీకరించవలసివచ్చింది. ఆమె అధ్యక్షోపన్యాసంలో 1929లోపున బాధ్యతాయుతప్రభుత్వాన్ని ప్రవేశపెట్ట వలసిందిగా సూచించింది. అది మితవాదులకు అంగీకారయోగ్యంకాలేదు. తుదకు రెండుపక్షాలవారూ రాజీకివచ్చి ఈక్రిందితీర్మానాన్ని ఆమోదించారు.

"బాధ్యతాయుతప్రభుత్వం తుదిలక్ష్యమని ప్రకటన చేసిన ఇండియామంత్రికి కాంగ్రెసు కృతజ్ఞతను తెలియపరచు చున్నది.

భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని స్థాపించుటకు అనుగుణంగా వెంటనే పార్లమెంటు ఒకశాసనాన్ని చేయువలసిందిగాను, అందులో ఎప్పుడు ఆలాటి ప్రభుత్వం ఏర్పడేదినిర్ణయించ వలసిందిగాను, ఈకాంగ్రెసు ప్రభుత్వాన్ని కోరుతున్నది.

ఈ కార్యక్రమంలో కాంగ్రెసు ముస్లింలీగులు తయారుచేసిన ప్రణాళికను వెంటనే శాసనంగాచేసి అమలుపరచడం మొదటిమెట్టుగా కాంగ్రెసుభావిస్తున్నది".

ఈ విశాలతీర్మానంలో మొదటిభాగం మితవాదులను తృప్తిపరచింది. తక్కిన రెండుభాగాలు జాతీయవాదులను తృప్తిపరచాయి.

దేశంలోని అనధికార యూరోపియన్లందరు మాంటేగు చేసిన ప్రకటనను నిరసించారు. బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రవేశ పెట్టడం మూలాన తమకు అపారనష్టం కలుగుతుందని వారు భావించారు. దానిని ప్రవేశపెట్టిన పక్షంలో తమకుప్రత్యేక ప్రాతినిధ్యాన్ని శాసనసభలలోకల్పించ వలసిందిగావారుకోరారు. మద్రాసు లోని బ్రాహ్మణేతరులలో అనేకులు సమాజంలో బ్రాహ్మణులకు యుగయుగాలుగాఏర్పడినఆధిక్యతను అప్పటికేనిరసించసాగారు. బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టిన పక్షాన వారికి రాజకీయాలలో కూడా ఆధిక్యత కలుగుతుందని భావించి, తమకు శాసన సభలో ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండవలెనని కోరారు. జనాభాలోవారు అధికసంఖ్యాకులు. ఎన్నికలలోవారు అధికసంఖ్యలో విజయాన్ని సాధించడం సులభంఅయినా వారు ఈలాటి ప్రాతినిధ్యాన్ని కోరారు. శిక్కులు కూడా ఈలాటి కోరికనే వ్యక్తం చేశారు. ఈవిధంగా మాంటేగు ప్రకట అన్ని పక్షాలలోను వర్గాలలోను గొప్ప సంచలనం కలిగించింది.

## 2

మాంటేగు 1917 నవంబరు 10న చెమ్స్‌ఫర్డుతోను, వివిధ రాజకీయపక్షాలతోను, నాయకులతోను తాను తలపెట్టిన సంస్కరణలగురించి చర్చలుసాగించి వారి అభిప్రాయాలను తెలుసుకొనేఉద్దేశంతో భారతదేశానికివచ్చి, చెమ్స్‌ఫర్డుతో కలిసి అయిదునెలలు దేశంలోపర్యటించాడు. అప్పటికే తానుప్రవేశపెట్టదలచిన సంస్కరణల స్వరూపాన్నిగురించి ఒకనిర్ణయానికివచ్చాడు. బ్రిటన్‌లో రాజకీయ

నిపుణులుకొందరు లైనల్ కర్టిస్ (Lionel Curtis) అధ్వర్యాన రౌండ్ టేబిల్ బృందము (Round Table Group) గాఏర్పడి భారతదేశంలో ప్రవేశపెట్టదగిన సంస్కరణలగురించి 1916నాటికే ఒకప్రణాళికను తయారుచేశారు. "బాధ్యతాయుత ప్రభుత్వాన్ని" ప్రవేశపెట్టడం అవసరమని ప్రప్రథమంగా సూచించిన వారు వీరే. దేశప్రభుత్వం మూడుస్థాయీలలో జరుగుతున్నదని, అన్నిస్థాయీలలో వెంటనే ఈలాటి ప్రభుత్వం ప్రవేశపెట్టడం ఉచితంకాదని, క్రిందిస్థాయీలలో దానిని మొదట ప్రవేశపెట్టి, అక్కడ అది ఫలప్రదంగాసాగినపక్షంలో, దానిని పైస్థాయిలో ప్రవేశపెట్టడం జరగవలసిందని, ఇందులో ఒక సోపానవిధానాన్ని అనుసరించడం అవసరమని వారు ప్రతిపాదించినారు దీనిని తయారు చేయడంలో భారతదేశపరిపాలనలో అనుభవాన్ని గడించినవారు కొందరు పాల్గొన్నారు ఇందులోని సూచనలు ఆచరణయోగ్యమని బ్రిటన్‌లోని అధికార వర్గానికిచెందినవారు భావించారు. మాంటెగు అలాటివారిలోఒకడు. అతడుచేసిన ప్రకటనలో సంస్కరణలు క్రమక్రమంగా ప్రవేశపెట్టబడుననేవిషయాన్ని నొక్కిచెప్పినాడు, రౌండ్ టేబిల్ బృందం తయారుచేసినపథకాన్ని ప్రవేశపెట్ట నిర్ణయించుకొనే భారతదేశానికివచ్చినాడు. అతడుచేసిన చర్చలలో అనేకులు అనేకసూచనలనుచేశారు. కాని అతడు నిర్ణయించుకొన్న పథకంలో వీటిఫలితంగా ఎక్కువమార్పులు జరగలేదు. చెమ్స్‌ఫర్డుతోకలిసి అతడుచేసిన పర్యటనమంతా తన పథకంపట్ల కొందరు రాజకీయనాయకుల సహకారాన్ని సంపాదించుటకు ఉద్దేశింపబడినది జాతీయవాదుల సహకారాన్ని సంపాదించడం సాధ్యంకాదని అతనికితెలుసు; మితవాదులతో సంప్రతించి వారిసమ్మతిని సంపాదించడం సులభమని అతడుభావించాడు. ఇందులో విజయాన్నిసాధించినాడు. మార్లేమింటో సంస్కరణల సందర్భంలో అధికారులు మితవాదులను జాతీయవాదులనుండి చీల దీసినట్లు, మాంటెగు — చెమ్స్‌ఫర్డు సంస్కరణల సందర్భంలో వారు తెరవెనుక నుండిమితవాదులను జాతీయవాదులనుండి, బ్రాహ్మణేతర "జస్టీసు" పార్టీ పక్షాన్ని కాంగ్రెసునుండి విడదీయగలిగారు. మాంటెగు భారతదేశానికి రావడంలో ఇదే ప్రధానోద్దేశం, ఇది పూర్తిగా కొనసాగింది.

సంస్కరణలగురించి మాంటెగు చెమ్స్‌ఫర్డులు తయారుచేసిన నివేదిక 1918 ఏప్రిలులో సిద్ధమైంది. జూలైలో క్యాబినెట్టు దానిని ఆమోదించినవెంటనే దానిని ప్రకటించారు మితవాదులంతా దానిపట్ల హర్షాన్ని వెలిబుచ్చారు. తిలక్, బిసెంటు మొదలైననాయకులు అది ఆశాభంగాన్ని కలిగించేనివేదిక అనీ, అందులో అనేకమార్పులుజరిగినగాని అది ప్రజలకు ఆమోదయోగ్యం కాజాలదనే అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని వాంఛించిన శిక్కులు, జస్టీసుపార్టీవారు, యూరోపియన్లు, మరికొన్ని వర్గాలవారు వారి, వాంఛలను నివేదిక చెల్లించనందుకు విచారాన్ని వెలిబుచ్చి, వాటినిగురించి బ్రిటన్‌లో ఆందోళనజరుపుటకు ప్రతినిధివర్గాలను పంపారు. వీటిఫలితంగా సం

స్కరణలగురించి పార్లమెంటు 1919లో చేసినచట్టం వారి అభీష్టాలను చాలా వరకు నెరవేర్చింది.

మొదటినుండీ ప్రకటనపట్ల ఉన్నత ఉద్యోగవర్గం ద్వేషాన్నివహించింది. మాంటెగు భారతదేశానికివచ్చినప్పుడు వారిని సముదాయపరచుటకు చాలాప్రయత్నంచేశాడు. కాని వారూ చెమ్స్‌ఫర్డూ పట్టుపట్టడంచేత తన తొలిఉద్దేశాలను చాలావరకు మార్చుకొన్నాడు. సంస్కరణలలోని లోపాలనేకం వారి ప్రతిఘటన ఫలితమే నివేదిక వారికి పూర్తితృప్తిని కలిగించలేదు గాని దానిలోనిశిఫారస్సులను అమలుపరచడంలో వారు తమ ఆశయాలను చాలావరకు సాధించగలిగారు.

నివేదికపట్ల ఈలాటి విభిన్నాభిప్రాయాలు కలగడంలో ఆశ్చర్యపడవలసిందిలేదు. దానినిగురించి కుణ్ణంగా చర్చించి సహేతుకమ్మైన నిర్ణయాలను తీసుకొనేఉద్దేశంతో 1918 ఆగస్టు29న హసాన్ ఇమామ్ అధ్యక్షతన బొంబాయిలో కాంగ్రెసు ప్రత్యేకసమావేశాన్ని జరిపింది. కాంగ్రెసులో జాతీయవాదులకు సంఖ్యాబలం ఉండడంచేత అది నివేదికను పూర్తిగాఖండించి తిరస్కరించగలదనే భీతి మితవాదులకు కలిగింది. ఈ భీతికి ఏలాటి ఆధారాలులేవు. అయినా వారు ఆలాగుభావించి కాంగ్రెసుసమావేశాన్ని బహిష్కరించారు. అటుతర్వాత వారు నవంబరు 1న బొంబాయిలో వేరుగా సమావేశమై నివేదికను చర్చించారు. వారుకూడా నివేదికలోని శిఫారస్సులలో అనేకమార్పులు జరగవలసినట్లుగా సూచించారు. కాంగ్రెసుకూడా ఆలాటిసూచనలనేచేసింది. ఉభయపక్షాలు చేసిన సూచనలమధ్య చెప్పుకోతగ్గభేదాలు ఏలాటివీలేవు. అందుచేత మితవాదులు కాంగ్రెసును బహిష్కరించి విడిపోవుటకు నివేదికపట్ల వారికిగల భిన్నాభిప్రాయాలు కారణాలుకావు. అధికారుల ప్రోద్బలమే దానికి ప్రధానకారణం. వారు కొంతకాలానికి, "అఖిలభారత లిబరల్ సమాఖ్య" (All India Liberal Federation) అనేపేరుతో ఒక ప్రత్యేకపక్షంగా ఏర్పడినారు. 1907లో కాంగ్రెసునుండి జాతీయవాదులను వారు తొలగించారు. 1918లో వారే కాంగ్రెసునుండి తొలగిపొయ్యారు.

ఇంతేగాక, 1907 చీలికకు 1918 చీలికకు ఇంకొకభేదంఉంది. 1907లో జాతీయవాదులు కాంగ్రెసునుండితొలగింపబడినా, దేశంలో వారిపలుకుబడి, వారితత్వానికిగల ప్రభావం తగ్గలేదు. వందేమాతరఉద్యమం సాగుతూనేవచ్చింది. తిలక్ జైలునుండివిడుదలై 1914లో స్వదేశానికివచ్చినతర్వాత దేశరాజకీయాలపై అతడు ఏకైకనాయకత్వాన్నివహించి ప్రజాదరణను సంపాదించి హోంరూల్ ఉద్యమాన్ని నడిపించాడు. కాని 1918 చీలికమూలంగా కాంగ్రెసునుండి వెళ్ళిపోయినతర్వాత దేశంలో మితవాదులపక్షానికి ఏలాటిప్రాధాన్యమూ లేకపోయింది. మహాత్మాగాంధీనాయకత్వాన కాంగ్రెసు 1919 చట్టంక్రిందఏర్పడిన శాసనసభలను బహిష్కరించినకారణంగా శాసనసభలలోను మంత్రివర్గాలలోను తాత్కాలికబలాన్ని వీరు సంపాదించినదిగాని కాంగ్రెసుతిరిగీ రాజకీయాలలోప్రవేశించినతర్వాత ఊరూపేరూలేనిపక్షంగా మితవాదులపక్షం మనుగడసాగించింది.

సహాయనిరాకరణోద్యమం, సత్యాగ్రహాలు మొదలైనవాటితోకూడిన స్వాతంత్ర్యోద్యమసమరాన్ని 1920మొదలు దేశస్వాతంత్ర్యంలభించేంతవరకు జాతీయవాదులకునిలయమైనకాంగ్రెసు సాగించింది. 1918 చీలికతో మితవాదపక్షం అదృశ్యమైనదని చెప్పవచ్చును.

1918డిసంబరులో కాంగ్రెసు ఢిల్లీలో మదనమోహనమాళవ్యా అధ్యక్షతన సమావేశమైంది. మాంటేగు చెమ్స్‌ఫర్డు సంస్కరణలు ఆశాభంగంకలిగించేవిగాను అసంతృప్తినికలిగించేవిగానుఉన్నవని, కేంద్రప్రభుత్వంలోకూడా కొన్ని అధికారాలను శాసనసభకు బాధ్యతవహించిన మంత్రుల వశం చేయవలసిందిగాను, రాష్ట్రప్రభుత్వవిధానంలో ఏలాటి ద్వంద్వపరిపాలనంలేక, పరిపాలన శాఖలన్నిటినీ శాసనసభకు బాధ్యతవహించిన మంత్రులవశం చేయవలసిందిగాను, సామ్రాజ్యపరిపాలనకు సంబంధించిన సభలన్నిటిలో కెనడా మొదలైన డొమినియన్‌లవలెనే భారతదేశానికికూడా ప్రాతినిధ్యం ఉండవలసినదిగాను, పారిస్‌లో జరుగుచున్న శాంతిసమావేశంలో (Peace Conference) భారతదేశానికి ప్రత్యక్షప్రాతినిధ్యం ఉండవలసిందిగాను, తిలక్, గాంధి, హసాన్‌ఇమామ్‌లను ప్రతినిధులుగా ఆ సమావేశానికి పంపవలసినదిగాను తీర్మానాలుచేసింది.

ఈ తీర్మానాలలో దేనినికూడా బ్రిటిష్‌ప్రభుత్వం లెక్కలోకి తీసుకొనలేదు. నివేదికలోని సూచనలను శిఫారస్సులను ఆధారంచేసుకొని, మాంటేగు 1919 జులైలో భారతదేశపరిపాలన బిల్లును (Government of India Bill) పార్లమెంటులో ప్రవేశపెట్టినాడు. దానిని ఉభయసభల సంయుక్తకమిటీ పరిశీలించి నివేదికను సమర్పించింది. దానిని పూర్తిగా చర్చించినతర్వాత 1919 డిసంబరు 23న పార్లమెంటు బిల్లుకు ఆమోదాన్ని తెలియపరచింది. దానిఫలితంగా భారతదేశపరిపాలనచట్టం (Government of India Act) అములులోకి వచ్చింది.

చట్టానికిసంబంధించిన నియమ నిబంధనలను (Regulations) చేయుటకు కొంతకాలం పట్టింది. ఈ తంతు అంతా పూర్తిఅయినపిమ్మట 1921 జనవరి 3 నుండి భారతదేశపరిపాలన కొత్తచట్టానుసారం సాగడం ప్రారంభమైంది. ఈ చట్టంమూలంగా పరిపాలనలో ఏలాటిమార్పులువచ్చినవో మనం ఇప్పుడు తెలుసుకొనడం అవసరం,

## 3

బ్రిటిష్‌పరిపాలన కాలంలో దేశపరిపాలన నాలుగు స్థాయీలలో జరుగుతూవచ్చింది. వీటిలో మొదటిది అత్యున్నతస్థాయికిచెందిన బ్రిటన్‌లోని యంత్రాంగం. ఇది పార్లమెంటు, ఇండియామంత్రి, ఇండియాకౌన్సిలుతో కూడినట్టిది, వీటిలో సిద్ధాంతదృష్ట్యా పార్లమెంటుకు బ్రిటిష్ సామ్రాజ్యమంతటిపై సర్వస్వామ్యాధికారం (Sovereingty) ఉండినది. 1919 చట్టంమూలాన ఇందులో

ఏలాటిమార్పూ రాలేదు. 1919కు పూర్వం ఉన్నట్లే 1919 తర్వాతకూడా భారతదేశంపై తుది అధికారం పార్లమెంటుదే. కాని ఆచరణలో రాష్ట్రప్రభుత్వాలలో ఏర్పడిన "ట్రాన్స్‌ఫర్డు" (Transferred) శాఖలపై దీని అధికారం సడలింది.

1919 చట్టం చేయబడినతర్వాత ఇండియామంత్రి జీతబత్యాలఖర్చునంతా బ్రిటన్ వహించసాగింది. అంతకుపూర్వం వీటిని భారతదేశం భరించేది. ఇదిచాలా అన్యాయమని మొదటినుండి కాంగ్రెసు భావిస్తూవచ్చింది. అది కోరినమార్పు 1919లో జరిగింది. ఇండియామంత్రి అధికారాలుకూడా కొద్దిగా సడలాయి.

దేశపరిపాలన యంత్రాంగంలో రెండవస్థాయిలోనిది భారతదేశంలోని కేంద్రప్రభుత్వం. 1919 చట్టఫలితంగా దీని నిర్మాణంలో కొన్ని ప్రధానములైన మార్పులు వచ్చాయి.

కేంద్ర శాసనసభలో రెండు శాఖలు ఏర్పడినవి: దిగువశాఖకు (Lower House) శాసనసభ (Lagislative Assembly) అని, ఎగువశాఖకు (Upper House) కౌన్సిల్ ఆఫ్ స్టేట్ (Council of state) అని పేర్లు పెట్టబడినాయి. శాసనసభలో ఎన్నుకొన్న సభ్యులు 103 రు. నామనిర్దేశంమూలాన సభ్యులైన వారు 42 మంది. ఎన్నుకొన్న సభ్యులు అధికసంఖ్యలో (Majority) ఉండడం ప్రత్యేకంగా గుర్తింపదగిన మార్పు. నామనిర్దేశ సభ్యులలోకూడా 25 రు. అనధికారులు; ఉద్యోగివర్గానికి చెందినవారి సంఖ్య 17 మాత్రమే. అధికార సభ్యుల ప్రాధాన్యం తగ్గింది. ప్రజాభిప్రాయాన్ని వ్యక్తంచేయుటకు ఎక్కువ అవకాశం లభించింది.

ఎగువ సభలో ఎన్నుకొన్న సభ్యుల సంఖ్య 33; తక్కిన 27 సభ్యులు గవర్నరు జనరల్ నామనిర్దేశంమూలాన సభ్యత్వంవహించిన వారు. దీనికాలపరిమితి 5 సంవత్సరాలు, దిగువ సభ కాలపరిమితి 3 సంవత్సరాలు.

దిగువ సభలోని ఎన్నుకొన్న సభ్యులలో 51రు సాధారణ నియోజకవర్గాలు (General Constituencies), 30 మంది ముస్లిం ప్రత్యేక నియోజకవర్గాలు, ఇద్దరు శిక్కుల ప్రత్యేక నియోజకవర్గాలు, ఎన్నుకొన్నవారు. ఏడ్గురు భూస్వాములచేతను, తొమ్మండుగురు యూరోపియనులచేతను, నలుగురు భారతీయ వాణిజ్యసంఘాలచేతను ఎన్నుకొనబడినవారు. 1919 చట్టం మతపరమైనట్టిన్నీ ప్రత్యేకమైనట్టిన్నీ నియోజకవర్గాలను విస్తృతంచేసింది.

ఎన్నికలలో ఓటు చేసే హక్కు గలవారి సంఖ్య చాలా తక్కువ. ఈ అర్హత అన్ని రాష్ట్రాలలో అన్ని వర్గాలలలోను ఒకేవిధంగా ఉండలేదు. ఈ కారణంచేత ఎన్నుకొన్న సభ్యులందరుకలిసి కృషిచేయడం కష్టసాధ్యమైంది. ఎగువసభకు వోటు చేసేహక్కు ధనికులకు మాత్రమే లభించింది. దేశమందంతటా వారి సంఖ్య 17364; దిగువసభకు వోటుచేసేవారి సంఖ్య 1920లో 909, 874; అనేక కోట్ల జనాభా కలిగిన దేశంలో ఈ సంఖ్య చాలా స్వల్పమని చెప్పక తప్పదు.

కొన్ని మినహాయింపులకు లోబడి శాసనసభలకు పరిపాలనకు సంబంధించిన అన్ని వ్యవహారాల గురించి శాసనాలుచేసే అధికారం లభించింది. కాని అవి ఆమోదించిన బిల్లులు గవర్నరు జనరల్ ఆమోదాన్ని పొందినతర్వాతనే చట్టమయ్యేవి. ఇదేవిధంగా కొన్ని మినహాయింపులకు లోబడి బడ్జెట్ పద్దులన్నిటినీ చర్చించుటకూ కోత తీర్మానాలను ప్రతిపాదించి ఓటుకు పెట్టుటకూ శాసన సభకు అధికారం లభించింది.

కాని ఈ విషయంలో గవర్నరు జనరల్‌కు ఒక ప్రత్యేక అధికారం ఇయ్యబడింది. శాసనసభలు ఆమోదించని బిల్లు తప్పకుండా చట్టంకావడం అవసరమని అతడు భావించిన పక్షంలో అలాటి చట్టాన్ని చేయుటకు అతనికి ప్రత్యేకాధికారం లభించింది. ఈలాగే శాసనసభ నిరాకరించిన బడ్జెటు పద్దులను చట్టసమ్మతం చేసే అధికారం అతనికి ఇయ్యబడింది. ఈ ప్రత్యేక అధికారానికి సర్టిఫికేషన్ (Certification) అధికారమని పేరు. ఈ కారణాల మూలంగా కేంద్రంలో 1919కి పూర్వం ఉన్నట్లే 1919 తర్వాతకూడా అధికారం నిరంకుశంగానే ఉంటూ వచ్చింది. మాంటేగు ప్రకటనలోని బాధ్యతాయుతలక్షణం దీనికి ఎంతమాత్రం వర్తించలేదు.

ఇదివరలో రాష్ట్రాలపై కేంద్రప్రభుత్వం వహిస్తూండిన అధికారం కొంత వరకు తగ్గింది. రాష్ట్రాల పరిపాలనకు కొన్ని శాఖలు ప్రత్యేకింపబడినవి; కొన్ని ప్రత్యేక ఆర్థికవనరులు కూడా కల్పించబడినవి. ఈశాఖల పరిపాలనలో కేంద్రం ఎక్కువ జోక్యాన్ని కలిగించుకొనడం మానింది. దీని ఫలితంగా రాష్ట్రాల స్వాతంత్ర్యం బలపడింది.

పరిపాలన యంత్రాంగపు మూడవస్థాయిలో రాష్ట్రప్రభుత్వాలు ఉండినవి. వీటిలో మద్రాసు, బొంబాయి, బెంగాలు, ఉత్తరప్రదేశ్. పంజాబు. బీహారు-ఒరిస్సా, మధ్యపరగణాలు, అస్సాం, బర్మాలు 1919 చట్టం మూలాన గవర్నరుల పరిపాలనలోకి వచ్చాయి. వీటి పరిపాలన విధానంలోనే కొంతవరకు బాధ్యతాయుత ప్రభుత్వం ప్రవేశపెట్టబడింది. మాంటేగుప్రకటన ప్రధానంగా వీటికి మాత్రమే వర్తించింది.

వీటిని పరిపాలించడంలో గవర్నరుకు సహాయంగా ఒక కార్యనిర్వాహక సభ (executive council), ఒక మంత్రివర్గము ఏర్పడినాయి. 1919 కు పూర్వం ఒక కార్యనిర్వాహకసభ మాత్రమే ఉండేది. ఇదిగాక రాష్ట్రపరిధిలోని పరిపాలనశాఖలన్నిటినీ రెండువర్గాలుగా విభాగంచేశారు. ఒకవర్గంలోనివి రిజర్వ్డు (Reserved) శాఖలు; ఇవి కార్యనిర్వాహక సభ ఆధీనంలోనివి, రెండోవర్గంలోనివి ట్రాన్స్‌ఫర్డు (Transferred) శాఖలు; ఇవి మంత్రివర్గం ఆధీనంలోకి వచ్చినవి.

కార్యనిర్వాహక సభలో గవర్నరు తన ఇష్టం వచ్చిన వారిని నియమించ వచ్చు; మంత్రులుమాత్రం తప్పకుండా శాసనసభలో సభ్యులుగా ఉండవలెను. ఇదిగాక వారికి శాసనసభలో అధికసంఖ్యాబలం (majority)ఉండవలెను. అలాటి

బలంగలవారిని మాత్రమే అతడు మంత్రులుగా నియమించవలెను. వారు శాసన సభ విశ్వాసాన్ని కోల్పోయిన పక్షాన ఉద్యోగాలకు రాజీనామా చేయవలెను. ఇవి అన్నీ బాధ్యతాయుత ప్రభుత్వ లక్షణాలు, ఇవి మంత్రులకూ వారిపరిపాలన లోని శాఖలకూ వర్తించేవి. దీని ఫలితాలంగా రాష్ట్రపరిపాలన రెండు విధానాలుగా సాగింది. అందుచేత దీనికి ద్వంద్వపరిపాలన (dyarchy) అనే పేరు వ్యవహారంలోకి వచ్చింది, ఇది సార్ధకమైన నామధేయమే.

అన్ని రాష్ట్రాలలో స్థానికస్వపరిపాలనము. వైద్యము, విద్య, వ్యవసాయము, పశుపోషణ, సహకారసంఘాలు, త్రాగుడు, రిజిస్ట్రేషన్, దేవాదాయాలు, పరిశ్రమాభివృద్ధి మంత్రుల ఆధీనంలోకివచ్చిన శాఖలు. వీటిలో మంత్రుల ఇష్టాను సారం శాసనసభ ఆమోదంతో మార్పులుచేయగల అవకాశం లభించింది. ఈ విధంగా 1919 చట్టం ఒక పరిమితరంగంలో బాధ్యతాయుత ప్రజాస్వామికాన్ని ప్రప్రధమంగా ప్రవేశపెట్టింది. ఇది కారణంగా ఆచట్టానికి ప్రాధాన్యంలభించింది.

గవర్నరు రాష్ట్రాలలో ఒక్కొక్కదానిలో ఒక శాసనసభ ఏర్పడింది. శాసన సభలో 70 శాతం ఎన్నిక మూలంగా సభ్యత్వాన్ని సంపాదించినవారు. తక్కిన 30 శాతం గవర్నరు నామనిర్దేశం మూలాన సభ్యులైనవారు. ఎన్నిక సభ్యులు అధికసంఖ్యలో ఉండడం గుర్తించవలసిన విషయం, దీనివలననే బాధ్యతాయుత విధానానికి సార్థక్యం కలిగింది.

రాష్ట్రరంగంలోని అన్నిశాఖల గురించి శాసనాలుచేసే అధికారం శాసన సభలకు లభించింది. కాని శాసనసభ ఆమోదంతోపాటు ప్రతి బిల్లుకు గవర్నరు, గవర్నరు జనరల్ ఆమోదం అవసరం. బడ్జెటును చర్చించి, కోత తీర్మానాలను ప్రతిపాదించి, బడ్జెటును ఆమోదించే అధికారం దానిని తిరస్కరించే అధికారం శాసన సభకు లభించింది.

కాని ఈ అధికారాలన్నిటికి ఒక హద్దు ఏర్పడింది. రిజర్వ్‌డ్ శాఖలకు చెందిన బిల్లులను శాసనసభ ఆమోదించినా ఆమోదించక పోయినా అవి చట్ట రూపం ధరించడం అవసరమని గవర్నరు నిర్ణయించిన పక్షాన వాటిని చట్టం చేసే ప్రత్యేకాధికారం గవర్నరుకు 1919 చట్టం ఇచ్చింది. రిజర్వ్‌డ్ శాఖలకు చెందిన బడ్జెటు పద్దుల విషయంలోకూడా అతనికి ఈలాటి ప్రత్యేకాధికారం ఇయ్యబడింది. సంఖ్యలో రిజర్వ్‌డ్ శాఖలే ఎక్కువగా ఉండడంచేతను అవి ఎక్కువ ప్రాధాన్యం కలవి కావడంచేతను ఈసర్టిఫికేషన్ అధికారం గవర్నరు నిరంకుశంగా ప్రవర్తించే అవకాశాన్ని కల్పించింది.

ఎన్నిక సభ్యులలో కొందరిని సాధారణ నియోజక వర్గాలు, కొందరిని ముస్లిం నియోజక వర్గాలు, మరికొందరిని భూస్వాములు, వర్తక సంఘాలు, విశ్వవిద్యాలయాలు మొదలైన ప్రత్యేకనియోజకవర్గాలు ఎన్నుకొనేవి. ఓటింగు హక్కుకూడా చాలా కొద్దిమందికి మాత్రమే లభించింది.

పరిపాలన యంత్రాంగంలో నాల్గవ స్థాయిలో లోకల్ బోర్డులు, మునిసిపల్ సంఘాలు మొదలైన స్థానికసంస్థలు ఉండినవి. వీటికిఎక్కువ స్వాతంత్ర్యం

లభించవలసిందిగా మాంటేగు చేమ్స్‌ఫర్డు నివేదిక శిఫారసులు చేసింది. పైస్థాయీల పరిపాలనలో బాధ్యతతో ప్రవర్తించుటకు ఇవి శిక్షణశాలలనే అభిప్రాయాన్ని అది వ్యక్తంచేసింది. కాని 1919 చట్టంలో వీటినిగురించి ఏలాటి ప్రసక్తిలేదు. ఇవి మంత్రుల ఆధీనంలోకివచ్చే శాఖలనీ వాటినిగురించిన సంస్కరణలను చేసేభాధ్యతను వారు వహించడం యుక్తమనే కారణంతో 1919 చట్టం వీటిని గురించి ఏలాటి చర్యను తీసుకొనలేదు. ఇదే సరియైన నిర్ణయమని భావించవచ్చును.

1919 చట్టం 1921లో అములులోకి వచ్చింది. అది ఏ విధంగా పనిచేసినదీ మూడవ భాగంలో వివరించబడుతుంది. ప్రస్తుత (రెండవ) భాగం 1858 మొదలు 1918 వరకు జరిగిన పరిణామాల చరిత్రను వివరించుటకు ఉద్దేశింపబడినది. మాంటేగు చెమ్స్‌పర్డు సంస్కరణలు 1919లో చట్టరూపాన్ని ధరించినా వాటి పుట్టుక వాటిని గురించిన వాదోపవాదాలు మొదలైనవన్ని 1917-18లో సంభవించిన కారణంగా వాటిని గురించి ఈ భాగంలోనే వివరించడం జరిగింది.

చదువదగిన గ్రంథాలు :

Montagu-Chelmsford Report

Bhavan : Vol Xl

Tarachand : Vol 3

# అధ్యాయము - 16

## విప్లవ ఉద్యమము

1900నుండి 1918 వరకు రాజకీయరంగంలో కృషిచేసిన వారిని మితవాదులు, జాతీయవాదులు, విప్లవవాదులు అని మూడు వర్గాలుగా విభాగించేయవచ్చు. మితవాదులు జాతీయవాదులమధ్య రాజకీయలక్ష్యంలోను, లక్ష్యసాధనకు వినియోగించదగిన సాధనాలలోను ఏలాటిభేదాలు ఏర్పడినవో ఇదివరకే తెలుసుకొన్నాము. ఇప్పుడు విప్లవవాదుల లక్ష్యాన్ని గురించి, వారుసాగించిన కార్యక్రమాలను గురించి తెలుసుకొనవలసి ఉంది.

సమాజంలో మహత్తరమైన మార్పుకు విప్లవమని పేరు. ఇదిఏదో ఒకరంగంలో మాత్రంగాని అనేకరంగాలలోగాని జరగవచ్చు. ప్రథమంలో ఏదో ఒకరంగంలో సంభవించినా అది క్రమక్రమంగా ఇతర రంగాలకు వ్యాపిస్తుంది.

ఆధునికయుగంలో ప్రఖ్యాతిగాంచిన విప్లవాలు ప్రధానంగా రాజకీయరంగానికి సంబంధించినట్టివి. ఇవి పరాయిపరిపాలననుగాని నిరంకుశ పరిపాలననుగాని నిర్మూలించుటకు ఉద్దేశింపబడినవి. ఇవి ఎక్కువగా పాశ్చాత్య ప్రపంచంలో జరిగినట్టివి. 16వ శతాబ్దంలో హాలెండు దేశంలోను, 18వ శతాబ్దంలో అమెరికాలోను జరిగిన విప్లవాలు పరాయి పరిపాలనను తొలగించి స్వరాజ్యాన్ని సంపాదించుటకు ఉద్దేశింపబడినవి; 17వ శతాబ్దంలో బ్రిటన్‌లోజరిగినవిప్లవం, 18వ శతాబ్దంలో ఫ్రాన్స్‌లో జరిగిన విప్లవం, 20వ శతాబ్దంలో చైనాలోను రషియాలోను జరిగిన విప్లవాలు నిరంకుశ పరిపాలనను నిర్మూలించి ప్రజాస్వామికాన్ని స్థాపించుటకు ఉద్దేశింపబడినవి.

విప్లవాలన్నిటికి సాయుధపోరాటం ప్రధానసాధనం. దానిని వినియోగించే పై విప్లవాలను సాగించినవారు వారి లక్ష్యాలను సాధించారు. బలప్రయోగమూ రక్తపాతమూ లేక ఇదివరకు ఏ విప్లవము సాగలేదు. భారతదేశంలో అహింస సాధనాన గాంధీమహాత్ముడు సాగించిన విప్లవం ఈ సామాన్య సూత్రానికి మినహాయింపుగా (Exception) భావించదగినది.

విప్లవానికి ఇంకొక లక్షణంకూడా ఉన్నది. ఇది మహత్తరమైన మార్పును స్వల్పకాలంలో తెచ్చుటకు ప్రయత్నిస్తుంది, ఇందులోనే విప్లవానికి (Revolution) పరిణామ విధానానికి (Evolution) గొప్పభేదం. త్వరితకాలంలో మహత్తరమైన మార్పులను ప్రవేశపెట్టదలచినవారు విప్లవాన్ని సాధనంగా వినియోగించడం ఈ సందర్భంలో గుర్తించదగిన విషయం.

ప్రజలలో విపరీతమైన అసంతృప్తి అలజడి వ్యాపించినప్పుడు విప్లవం సాధ్యం. విప్లవాలకు ఇదే ఆధారం. కాని దీనికితోడు విప్లవాన్ని సాగించగల ప్రముఖవర్గంవారు కూడా ఉండడం అవసరం. అన్ని విప్లవాలకు ఈలాటివర్గం వారు నాయకత్వం వహిస్తారు. అసంతృప్తిగాంచిన ప్రజలు తమంతటతాము విప్లవాలను లేవదీయ సమర్థులుకారు.

1900 నాటికి భారతదేశంలో సామాన్య ప్రజలు ఎంతో అసంతృప్తికి గురి అయినారు. దీనికి ప్రధానంగా వారి ఆర్థికదుస్థితి కారణమైంది. దేశంలోని ఆర్థిక పరిస్థితులు 1858 తర్వాత ఏ విధంగా దిగజారిపోయినవో నాల్గవ అధ్యాయంలో వివరించాము. ప్రజలలో అధికసంఖ్యాకులు దారిద్ర్యాన్ని అనుభవించ వలసినవారయ్యారు. బ్రిటన్‌లోని పరిశ్రమల పోటీకి నిలబడలేక భారత పరిశ్రమలన్ని క్షీణ దశలోకి వచ్చినాయి. కొన్ని అదృశ్యములైనాయి. అందరికీ వ్యవసాయం ఒక్కటే జీవన సాధనమైంది. కాని అందరికీ కావలసినంత వ్యవసాయ యోగ్యమైన భూమి లభించలేదు. లభించినా వ్యవసాయంపట్ల ప్రభుత్వం తగిన శ్రద్ధను వహించి జలాధారాలను ఇతర సదుపాయాలను నిర్మాణంచేయక పోవడంచేత రైతులకు తగిన ఆదాయం లభించక అప్పులపాలుకావడం పరిపాటి అయింది. అనేకులు కూలిపని చేసుకొని జీవించవలసిన వారయ్యారు. కాని వారందరికి కూలి దొరకడం సాధ్యం కాలేదు. నిరుద్యోగం విపరీతంగా పెరిగి పోయింది. క్షామాలు తరుచుగా సంభవించేవి. ప్రభుత్వ సహాయం లభించని కారణంగా ఒక్కొక్క క్షామంలో లక్షలాది జనం, లక్షలాదిపశువులు ప్రాణనష్టానికి గురి కావడం తప్పిందికాదు. ఈలాటి ఆర్థిక పరిస్థితులు ప్రజల అసంతృప్తికి కారణమైంది. దీనిని నిర్మూలించుటకు కృషిచేసే నాయకులను అనుసరించుటకు వారు సిద్ధంగా ఉండినారు.

దేశంలో సామాన్యులేగాక ప్రముఖవర్గంవారు- వారిలో ప్రధానంగా విద్యాధికులైన మేధావులు – పాశ్చాత్యుల పరిపాలన కారణంగా దేశంలో పాశ్చాత్య సంస్కృతి వ్యాపించి తరతరాలుగా ప్రజలమన్ననలకు పాత్రమైన జాతీయ సంస్కృతి నామ రూపాలు లేక క్షీణించే పరిస్థితులు ఏర్పడినందుకు విచారించ సాగారు. దీనికి పరాయిపరిపాలనే ప్రధాన కారణమని వారు భావించారు. ధనిక వర్గానికి చెందిన వారు యంత్ర సహాయంతో భారీపరిశ్రమలను స్థాపించ దలచినా ప్రభుత్వం వారికి తగిన రక్షణను కల్పించడానికి సిద్ధపడలేదు. అలాటి పరిశ్రమలమూలంగా బ్రిటన్‌లోని పరిశ్రమలకు నష్టం సంభవించడం ప్రభుత్వానికి ఆమోదయోగ్యం కాలేదు. ఈ విధంగా దేశంలో 1900 నాటికి సామాన్య ప్రజలు ప్రముఖవర్గాలవారు పరాయిపాలనపట్ల అసంతృప్తిని గాంచి దానిని తొలగించి స్వరాజ్యాన్ని సంపాదించినగాని దేశానికి విముక్తిలేదనే నిర్ణయానికి వచ్చారు.

ఈ పరిస్థితి అరవిందుడు, తిలక్, పాల్, లజపత్ రాయ్ మొదలైన జాతీయ వాదులపై ఏలాటి ప్రభావం వహించింది. పరాయిప్రభుత్వాన్ని తొలగించి,

స్వరాజ్యాన్ని సంపాదించే ఉద్దేశంతో వారు తలపెట్టిన సాత్విక నిరోధాన్ని గురించి ఇంతకుపూర్వం వివరించాము. వందేమాతరఉద్యమకాలంలో (1905-11) ఈ విధానం ఆచరణలోకి వచ్చింది. బహిష్కరణ ఉద్యమం, స్వదేశీ ఉద్యమం, జాతీయ విద్యావిధానం దీని ఫలితాలే. వీటిమూలంగా రాష్ట్రవిభజన రద్దుకాగ లదని, స్వరాజ్యసంపాదన సాధ్యంకాగలదని వారు భావించి, అతిపట్టుదలతో అనేక కష్టాలను బాధలను సహించి ఈ కార్యక్రమాన్ని సాగించారని. ఇందులో సామాన్య ప్రజల సహకారాన్ని వారు సంపాదించ గలిగారనీ ఇదివరలో తెలుసు కొన్నాము. కాని వారు ఆశించిన ఫలితాలు రెండుసంవత్సరాల తర్వాతకూడా లభ్యంకాలేదు. ఈలాటి వాతావరణంలో విప్లవవాదులు చురుకుగా రాజకీయ రంగంలో ప్రవేశించారు. 1900 నుండియే వారువారి కృషిని ప్రారంభించారు. 1906 నుండి అది తీవ్రరూపం ధరించింది.

## 2

విప్లవోద్యమ కర్తలందరు జాతీతావాదులే. తత్వంలోను, సాధించవలసిన లక్ష్యంలోను వారికీ జాతీయవాదులకూ మధ్య ఏలాటి బేదంలేదు. అరవిందుడు తిలక్, పాల్, లజపత్‌రాయ్ మొదలైన వారివలెనే వారుకూడా వెంటనే స్వ రాజ్యాన్ని సంపాదించడం లక్ష్యంగా పెట్టుకొన్నారు. వారందరు జాతీయవా దుల తత్వం చేత ప్రభావితులైనవారు, కాని లక్ష్యసాధన విషయంలో వారిమధ్య భేదం ఏర్పడింది. విప్లవకారులు సాయుధపోరాటం మూలంగామాత్రమే పరా యి పరిపాలనను నిర్మూలించడం సాధ్యంకాగలదనీ. అందుకుగాను కృషిచే యడం అవసరమనీ, బహిష్కరణాధి సాధనాలతో కూడిన సాత్వికనిరోధం నిరుపయోగమనీ, విశ్వసించారు. పరాయి పరిపాలనకు సైన్యాలు పోలీసు దళా లు మొదలైన సాధనాలతోకూడిన బల ప్రయోగమే ఆధారం. దానిని లొంగ దీయుటకు సాయుధ బలప్రయోగం ఒక్కటే సాధనం. ఈ విశ్వాసంతోవారు ఈ సాధనాన్ని సంపాదించి దానిని వినియోగించుటకు సిద్ధపడ్డారు.

1900 నాటికి ఈలాటివారు బెంగాలులోను, మహారాష్ట్రంలోను, పంజా బులోను ఏర్పడినారు. తమ ఉద్యమానికి మొదటిమెట్టుగా బెంగాలులోనివారు "సమితుల' ను పేరటకొన్ని సంఘాలను స్థాపించారు. ఈ సమితులలో కలకత్తా లో స్థాపింపబడిన "అనుశీలన" సమితి గొప్ప ప్రాధాన్యాన్ని ప్రాముఖ్యాన్ని వహించింది. దీనిని స్థాపించిన వారందరు విప్లవవాదులుకారు; కాని జాతీయో ద్యమం ఏలాటిదైనా అది ఫలప్రదమగుటకు దేశసేవకు కంకణం కట్టుకొని, దేశ విముక్తికై పాటుపడేవారంధరు కొన్ని లక్షణాలు కలవారుగా ఉండవలెననీ ఆలాటి వారిని తర్ఫీదుచేయడం సమితియొక్క ప్రధాన కార్యక్రమంగా భావిం చారు. యువకులను విద్యార్థులను ఈ లక్షణాలను కలవారినిగా తర్ఫీదు చేయ డం ఎక్కువ లాభకారి కాగలదని వీరు విశ్వసించి అలాటివారినే ఎక్కువ సంఖ్యలో సమితిలో సభ్యులుగా చేర్చుకొన్నారు.

వీరిలో ఉండదగిన లక్షణాలలో మొదటిది దేహ దార్ఢ్యం. వీరు ఈలాగు

భావించడానికి యువకులు ఇందులో వారితో ఏకీభవించడానికి రెండు ప్రధాన కారణాలని చెప్పవచ్చు. మొదటినుండి బ్రిటిష్‌వారు బెంగాలీలు పిరికిపందలనీ ధైర్యసాహసాలు లేనివారనీ, వారు కలం పట్టగలరేగాని కత్తి పట్టలేనివారనీ హేళన చేయడం పరిపాటి అయింది. అందుచేతనే వారిని సైన్యంలో చేర్చుకొనరైరి. ఇదిఒక కళంకంగా సమితులను స్థాపించినవారుభావించి దానిని తొలగించి ధైర్యసాహసాలలో బెంగాలీలు తక్కిన భారతీయులకుగాని పాశ్చాత్యులకుగాని తక్కువకారని రుజువుచేయదలచి యువరుల శిక్షణలో శరీరవ్యాయామ ప్రధానస్థానం కల్పించారు.

దీనికి ఇంకొక కారణంకూడా ఉండినది. ఆరోజులలో బ్రిటిష్‌వారు అహంకారం కలవారై, తమపట్ల వినయవిధేయతలను ప్రదర్శించని భారతీయులను వీధులలోను పార్కులు మొదలైనబహిరంగ స్థలాలలోను, రైలుబండ్లలోను కొట్టడం సామాన్యంగా జరిగేది. వారుకొందరిని హత్యకూడాచేసేవారు. వారు పరిపాలనవర్గానికి చెందినవారుకావడంచేత న్యాయస్థానాలు నేరాలను చేసినవారికి శిక్షానస్మృతి ననుసరించి శిక్షను విధించుటచు వెను హత్యచేసిని వారిని కూడా ఏదోకొంత జరిమానాను విధించి వదలి ఈలాటి దుండగుల మూలంగా బాధపడే భారతీయులకు పోలీసు రక్షణ దికాదు. ఈ పరిస్థితులలో బ్రిటిష్ దుండగులకు బుద్ధిచెప్పడం అవస సమితులను స్థాపించినవారు భావించి, శరీరదార్ఢ్యంగల యువకులే ఆ రాన్ని తీర్చగలవారని సమితుల కార్యక్రమాలలో శరీరవ్యాయామ ప్రాధాన్యం కల్పించారు. వాటిలోచేరిన యువకులందరికీ వ్యాయామంతోపాటు కుస్తీ పట్టడం, ముష్టియుద్ధ విధానం, జపాన్‌వారి జిజిట్సు, కత్తిసాము, కర్రసాము, గుర్రపుస్వారి మొదలైనవాటిని నేర్పేవారు దీని ఫలితంగా యువకులూ విద్యార్థులూ శరీరబలం, ధైర్యసాహసాలు, శత్రువుల నెదుర్కొనుటకు కావలసిన నైపుణ్యాన్ని సంపాదించారు. వారొక స్వచ్ఛంద సైన్యంగా రూపొందినారు, క్రమక్రమంగా విప్లవానికి ఇదిఒక పటిష్ట సాధనమైంది.

1900 ప్రాంతాన బరోడా మహారాజాకళాశాలలో ఉద్యోగంచేస్తున్న అరవిందుడు ఒక విప్లవవాది. అదే అభిప్రాయంగల తిలక్‌తో ఇతనికి సన్నిహిత సంబంధం ఏర్పడింది. పరాయిపరిపాలనను తొలగించుటకు సాయుధపోరాటం సాధనమని, దానిని వినియోగించడంలో ధర్మవిరుద్ధం ఏదీలేదని, గీతమొదలైన పవిత్రగ్రంథాలు ధర్మయుద్ధాన్ని సమర్థిస్తున్నవని, సాయుధపోరాటం ఆనాటి పరిస్థితులలో సాధ్యంకాని కారణంచేతనే సాత్వికనిరోధాన్ని సాధనంగా వినియోగించవలసినదని విశ్వసించినవారు. సాధ్యమైనపక్షంలో సాయుధపోరాటానికే దిగడం ఉత్తమమని వీరిద్దరిలో అరవిందుడు భావించాడు. అందుకుగాను తనతమ్ముడు బరీంద్రుని 1901లో బెంగాలుకుపంపాడు. బరీంద్రుడు రెండుసంవత్సరాలకాలం బెంగాలులోపర్యటించి, విద్యార్థులలో కొందరిని విప్లవోద్యమానికి

అనుకూలురుగాచేశాడు. కాని ఎక్కువ ఫలితాన్ని సంపాదించలేక బరోడాకువెళ్ళి 1904లో బెంగాలుకు తిరిగివచ్చాడు. భారతీయులకు మతంపట్ల ఎక్కువ శ్రద్ధా భక్తులుకలవనీ, దానిసాధనాననే విప్లవతత్వం ప్రచారంచేయడం అవసరమని భావించాడు. అరవిందునిభావంకూడా ఈలాటిదే. అందుచేత సమితులలోని యువకులకు శరీరవ్యాయామంతోపాటు మతాన్ని, నీతిని, బోధించవలసినదిగా సమితి కార్యకర్తలను ప్రోత్సహించాడు. వారుకూడాఆలాటిభావంకలవారే. యువకులు దేశసేవాపరాయణులైనప్పుడే వారి దేహదార్ఢ్యం ప్రజలశ్రేయస్సుకుసాధనం కాగలదని విశ్వసించినవారు. అందుచేత యువకులందరికి భగవద్గీత, ఉపనిషత్తులు, రామాయణభారతాదిగ్రంధాలు, వివేకానందుని ఉపన్యాసాలుపాఠ్యగ్రంధాలుగా ఏర్పరచారు. జీవితానికి మానవసేవయే పరమార్ధమని, దానిద్వారానే ముక్తిని సాధించవలసినదని వారికి బోధించారు. శరీరానికేగాని ఆత్మకు మృత్యువులేదని, మరణానంతరం పునర్జన్మసాధ్యమని, మరణమంటె భయపడవలసిన అవసరంలేదని, దేశసేవలో ప్రాణత్యాగంచేయడానికికూడా సిద్ధపడవలసిందని, స్వార్ధాన్నికోరక తన విద్యుక్తధర్మాన్ని నిష్కామకర్మ సూత్రానికి అనుగుణంగా నిర్వహించవలసినదని యువకులకు మతబోధను, నీతిబోధను చేశారు. దేశసేవ చేయదలచినవారు ధనార్జనచేయరాదని, బ్రహ్మచర్యవ్రతాన్ని అనుష్ఠించవలసినదనీ, జీవితాన్ని నిరాడంబరంగా సాగించవలసినదని బోధించారు. సమితులలో చేరిన యువకులందరు ఈలాటి ఆదర్శాలుకలవారుగా శిక్షితులయ్యారు. వీటికితోడు ఆనాటిపరిస్థితులలో పరాయిపరిపాలనను తొలగించి, దేశమాతకు విముక్తికలిగించడమే ఆమె సంతానానికి ప్రధమ కర్తవ్యమని ప్రబోధంగావించారు. వివేకానందునితత్వం ఈప్రబోధానికి ఆధారమైంది. యువకులందరికి దేశానికి స్వాతంత్ర్యం సంపాదించడం లక్ష్యమైంది.

బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన విద్యావిధానం పరాయివారి పరిపాలనను సమర్ధించే యువకులను తయారుచేసేటట్టిదనీ. జాతీయఅవసరాలను తీర్చేటట్టిది కాదనీ, దానిస్థానే జాతీయవిద్యావిధానం ప్రవేశపెట్టడం అవసరమనీ బెంగాలులోని ప్రముఖులలో ఆనాటికే ఒక అభిప్రాయం వ్యాపించి ఉండినది సమితులు ఆలాటి విద్యావిధానాన్ని ప్రవేశపెట్టినట్లు వీరుభావించి. వాటికార్యక్రమాలలో పాల్గొని, యువకులనుద్దేశించి ఉపన్యాసాలుచేసేవారు. రామకృష్ణ ఆశ్రమంలోని స్వాములుకూడా సమితులతో ఈలాటి సంబంధం కల్పించుకొన్నారు. వివేకానందునికి శిష్యురాలైన పాశ్చాత్యవనిత సిస్టరు నివేదిత ఈలాటివారిలో ఒకర్తె.

ఈవిధంగా విప్లవోద్యమంలో పాల్గొనుటకు సమర్ధులైన ఒక యువకబృందాన్ని సమితులు సిద్ధపరచగలిగాయి. వందేమాతర ఉద్యమంలో పోలీసు లాటీదెబ్బలనుభరించి, అధికారులను ఎదిరించి, అన్ని బాధలను సహించి బహిష్కరణ స్వదేశఉద్యమాలలో విద్యార్థులు యువకులు ప్రధానపాత్రను వహించుటకు ఈ సమితుల శిక్షణే ప్రధానకారణమని చెప్పవచ్చు. అనుశీలన సమితిశాఖలు రాష్ట్రమందంతటా ఏర్పడడంచేత దానిప్రభావం రాష్ట్రవ్యాప్తమైంది.

ఆనాడు ఎందరోసన్యాసులు సమితులకార్యక్రమాలలోను, విప్లవోద్యమం లోను ప్రత్యక్షంగానో పరోక్షంగానో పాల్గొన్నారు. వారెవరో, వారిపుట్టు పూర్వోత్తరాలేవో ఎవరికీ తెలియవు. వారిలోకొందరు యువకులుగా 1857-58 తిరుగుబాటులోపాల్గొని, సన్యాసాశ్రమాన్ని స్వీకరించి, పరాయిపరిపాలనను తొలగించుటకు ప్రచారంసాగించినవారని ఒకప్రతీతి. వారు 1905 తర్వాత బెంగాలులోని కొన్నిప్రాంతాలలోనివసించి, ఆశ్రమాలనుస్థాపించి, విప్లవ తత్వాన్ని ప్రచారంచేసి అదృశ్యమయ్యేవారు. ఢక్కాలోకొంతకాలంనివసించి విప్లవతత్వాన్ని ప్రచారంచేసిన ధైలానందస్వామి, (ఇతనితొలిపేరు త్రిపురలింగ స్వామి), అగమ్య పరమహంస, భాగీరథి బ్రహ్మచారి, ఈ లా టి వా రి లో ప్రఖ్యాతిగాంచినవారు. వీరందరు వివేకానందునిచేకూడా ప్రభావితులైనవారు. విప్లవతత్వాన్ని ప్రబోధించిన సన్యాసులలో ఇతనిదేఅగ్రస్థానం. అందుచేతనే అనుశీలనసమితిలోని యువకులందరికి అతనిరచనలు పాఠ్యగ్రంథాలైనవి.

విప్లవోద్యమంలోకృషిచేసినవారిలో అనేకులు తర్వాతికాలంలో సన్యా సాశ్రమాన్ని స్వీకరించారు. వీరిలోకొందరు రామకృష్ణాశ్రమాన్ని ప్రవేశించి వేదాంతాన్ని ప్రచారంచేయడంలో ప్రఖ్యాతినివహించారు.

అనాదిగా భారతదేశంలో సన్యాసాశ్రమాన్నిస్వీకరించినవారు మతప్రచా రాన్నిసాగించి ప్రజాజీవితంలో గొప్పపాత్రనువహించారు. 1900 తర్వాత వారిలోకొందరు స్వీయవిముక్తికై కృషిచేయుటకుబదులు దేశవిముక్తికై కృషి చేసినవారయ్యారు.

అనుశీలన సమితి మోస్తరుగానే ఆత్మోన్నతిసమితి, డాన్ (ఉదయ) సంఘాలుకూడా యువకులకు తగినశిక్షణను గరపడంలో శ్రద్ధవహించాయి. ఈలాటియువకులే సంఘసంక్షేమకార్యక్రమాలనుప్రారంభించి వాటిఅభివృద్ధికి తోడ్పడినారు. కార్మికులవిద్యకై వంగీయ శ్రమజీవి విద్యాలయాన్ని స్థాపించారు. నగరాలలోను పల్లెప్రాంతాలలోను వయోజన విద్యావిధానాన్ని తొలిసారిగా ప్రవేశపెట్టినవారువీరే. స్వదేశదుకాణాలను, సహకారసంఘాలను, కుటీరపరిశ్రమలను స్థాపించుటలో వీరిదేప్రథమప్రయత్నం. విప్లవోద్యమంలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో సంబంధంకలిగిన యువకులలో అనేకులు — మేఘనాధసాహా, సత్యేంద్రనాద్‌బోస్, వినాయక కుమారసర్కారు, రాధా కమాల్‌ముఖర్జీ మొదలైనవారు - విజ్ఞానవేత్తలుగా, పరిశోధకులుగా ప్రఖ్యాతి గాంచారు. సమితులు, వాటి అధ్వర్యానసాగిన విప్లవోద్యమం బెంగాలుయువ కుల జీవితాలపై శాశ్వతప్రభావాన్ని వహించాయి. విప్లవోద్యమం విఫలమైనట్లు కనుపించినా అదిబెంగాలీలపై శాశ్వతముద్రనువేసింది. అందుచేతనే సమితుల కార్యక్రమాన్ని తెలుసుకొనడం అవసరం.

## 3

అనుశీలన సమితి, దాని కార్యక్రమాలన్నిటినీ బహిరంగంగానే జరుపుతూ వచ్చింది. కాని అందులో ఒక బృందంవారు సాయుధపోరాటానికి ప్రాధాన్యం కల్పించి రహస్య కార్యక్రమాలను సాగించేవారయ్యారు. వీరికి అరవిందుని ప్రోత్సాహంలభించింది. అతని తమ్ముడు బరీంద్రుడు వీరికి నాయకుడయ్యాడు. ఆయుధాలను సేకరించడం, బాంబులను తయారుచేయడం వీరి కార్యక్రమాలలో ప్రాధాన్యంవహించాయి. బాంబుల తయారుచేయడానికి వారు ఇద్దరు యువకులను ఫ్రాన్సుకు పంపించి, వారు తిరిగివచ్చిన తర్వాత వాటిని చేయుటకు 1906 లో కలకత్తాలోని మానిక్‌టోలాతోటలో ఒక కర్మాగారాన్ని స్థాపించారు. అక్కడ రహస్యంగా బాంబులు తయారు జరుగుతూవచ్చింది.

సాయుధపోరాట సాధనాన బ్రిటిష్ పరిపాలనను నిర్మూలించదలచిన విప్లవవాదులలో రెండు వర్గాలు ఏర్పడినవి. ఇందులో ఒక వర్గంవారు 1857-58 లో జరిగినట్లు ఒక సైనిక తిరుగుబాటుకు ప్రయత్నించారు. సైన్యంలోని కొన్ని పటాలాలతో రహస్యమంతనాలు జరిపారు. ఇదిగాక అంతర్జాతీయ రంగంలో సంభవించిన పరిణామాలను ఆధారంచేసుకొని బ్రిటిష్‌వారికి శత్రువులైనవారి సహకారాన్ని సంపాదించి దానిమూలంగా ఒక సాయుధపోరాటాన్ని జరిపింపదలచారు. విదేశాలలోని భారతీయులు ఇందులో ఎక్కువగా పాల్గొన్నారు. ప్రపంచ సంగ్రామం 1914 లో ప్రారంభమైన తర్వాతనే వీరి ప్రయత్నానికి జర్మనుల సహాయం లభించి అది ఆచరణ సాధ్యమయ్యే సూచనలు కనుపించాయి.

రెండవవర్గం వారు పై ప్రయత్నాలపట్ల సుముఖులైనా అవి కష్టసాధ్యమనీ ఆలస్యంతోకూడుకొన్నవనీ భావించి, వాటికంటె చురుకుగా సాగించుటకు సాధ్యమైన ఇంకొక కార్యక్రమానికి ప్రాధాన్యం కల్పించారు. దేశంలో ఒక్కొక్క జిల్లాలోని బ్రిటిష్ అధికారుల సంఖ్య చాలా స్వల్పం. వారిలో కొందరినైనా హత్యగావించినపక్షంలో పరిపాలన యంత్రాంగం వెంటనే స్తంభించిపోవడం, అధికారులు భయభ్రాంతులై కొంతవరకైనా లొంగిపోవడం జరుగుతుందని వీరు భావించారు. ఆయుధాలను బాంబులను ఈలాటి హత్యలకు వినియోగించడం వీరి ప్రధానోద్దేశం. దీనిమూలంగా బ్రిటిష్ పరిపాలన నిర్మూలం కాకపోయినా కొంతవరకైనా బ్రిటిష్‌వారి వైఖరిలో మార్పురావడం తప్పదని వారుభావించారు. ఇంతేగాక ఈలాటి దేశాభిమానంతోకూడిన సాహసకృత్యాలు యుగయుగాలుగా కుంభకర్ణునివలె నిద్రలోనున్నట్టిన్నీ రాజకీయచైతన్యం లేనట్టిన్నీ సామాన్యప్రజలను మేల్కొల్పడం సత్యం. ఎన్నటికైనా మేల్కొన్న ప్రజల సహాయం లేక ఏలాటి విప్లవం ఫలప్రదం కాజాలదు. ఈ విధంగా రాజకీయ హత్యలు (political murders) రెండు రకములైన ప్రయోజనాలను చేకూర్చగలవని వీరు విశ్వసించి, ఈలాటి కార్యక్రమంలో తమ దృష్టిని శక్తి సామర్థ్యాలను కేంద్రీకరించారు.

కాని ఆయుధ సేకరణకు బాంబుల తయారుచేయుటకు వాటిని ఉపయోగించుటకు ధనం అవసరం. ధనికుల విరాళాలద్వారా వారు కొంత ధనాన్ని సంపాదించగలిగినా అది చాలలేదు. విరాళాలుకూడా సకాలంలో అందేవికావు. అనేకులు విప్లవకార్యక్రమాలపట్ల సుముఖులైనా వాటికి సహాయంచేయడం ప్రమాదమని భయపడసాగారు. అందుచేత వీరు ధనికుల ఇండ్లలో దోపిడీలు సాగించి తమకు కావలసిన ధనాన్ని సంపాదించుటకు నిర్ణయించారు. తాము తీసుకొన్న ధనం ఋణమనిన్నీ, స్వరాజ్యం ఏర్పడిన తర్వాత అది తిరిగీ చెల్లించడం జరుగుతుందని వారు చెప్పేవారు. దోపిడీలుచేసినవారు స్త్రీలు ధరించిన నగలను ముట్టుకొనేవారుకారు. పరస్త్రీలను ముట్టుకొనడం వారి బ్రహ్మచర్య వ్రతానికి విరుద్ధంగా భావించారు.

రాజకీయ హత్యలకు దోపిడీలకు వారికి సమకాలిక చరిత్ర దారిచూపింది. అంతకుపూర్వం ఆస్ట్రియా పరిపాలనకు లోబడిన ఇటలీ దేశంలో మ్యాజినీ నాయకత్వాన స్వాతంత్ర్యోద్యమం సాగింది. అతడు దానికిగాను రహస్య సంఘాలను స్థాపించి, యువకులను అందులోచేర్చి హత్యలు తన కార్యక్రమంలో ఒక భాగంగా చేర్చాడు. అతని జీవితానికి సంబంధించిన గ్రంథాన్ని సురేంద్రనాథుడు 1870 ప్రాంతాన బెంగాలీభాషలో రచించాడు. అప్పటినుంచి బెంగాలులోని యువకులు దానిచే ప్రభావితులైనారు. ఇటలీలో జరిగినట్లే భారతదేశంలోకూడా అధికారుల హత్యలు ఒక పటిష్టసాధనం కాగలదని వారు విశ్వసించారు. ఐర్లాండు స్వాతంత్ర్యోద్యమంలోకూడా ఆనాడు బ్రిటిష్ అధికారులను భూస్వాములను హత్యచేయడం జరిగింది. అది జరిగిన తర్వాతనే బ్రిటిష్ ప్రభుత్వం తన వైఖరిని మార్చుకొని ఐర్లాండులో భూసంస్కరణలను ప్రవేశపెట్టడం, హోంరూల్ ప్రసాదించుటకు సిద్ధపడడం జరిగింది. ఇదిగాక ఆనాడు నిరంకుశపరిపాలనకు గురియైన రష్యాలో నిరంకుశత్వాన్ని నిర్మూలించుటకు సాధనాంతరం లేక అధికారులను హత్యచేసేవర్గం ఒకటి ఏర్పడి అనేక హత్యలను గావించింది. ఆ సందర్భంలో ఒక చక్రవర్తికూడా హత్యగావింపబడినాడు. సమకాలిక చరిత్రలోని ఈ కార్యక్రమం బెంగాలులోని విప్లవకారులను ప్రోత్సహించింది. అన్ని దేశాలలో సమకాలంలోనేగాక, ప్రాచీనకాలంలోకూడా దుష్టపరిపాలకులను హత్యగావించి ప్రజలకు విముక్తి కలిగించినవారు ప్రజల ప్రశంసలకు పాత్రులుకావడం బెంగాలు ఉద్యమకారులకు తెలియనివిషయం కాదు.

కలకత్తా సమీపంలో ఫ్రెంచిస్థావరంగా ఉండిన చంద్రనగరాన నుండి వీరు రహస్యంగా ఆయుధాలను సంపాదించేవారు. ఇదిగాక కలకత్తా నౌకాశ్రయానికి వచ్చిన విదేశీ నౌకలలోని నావికులతో బేరసారాలుచేసి, కొన్ని ఆయుధాలను సంపాదించగలిగారు. జమీందార్ల కచ్చేరీలలో కాపలాకాచేవారివద్ద కొన్ని ఆయుధాలు ఉండేవి. వాటినికూడా వీరు అపహరించేవారు. విదేశాలతో దొంగ వ్యాపారంచేసేవారి సహాయానకూడా వీరు కొన్ని ఆయుధాలను సంపా

దించారు. ఈ సందర్భంలో ఒక విప్లవకారుడు ఆయుధాలను దిగుమతిచేసే కలకత్తా కంపెనీ ఒకదానిలో గుమాస్తాగా చేరి 1914లో కంపెనీ దిగుమతి చేసిన 50 పిస్టోలులను 46,000 తోటాలను ఏలాగో సాహసించి ఉద్యమకారులకు అందజేయడం ప్రజల దృష్టిని ఆకర్షించింది. ఈ విధంగా పరిపరిమార్గాల ద్వారా ఆయుధసేకరణ జరుగుతూ వచ్చింది.

1906లో బాంబుల తయారుచేయడంతోపాటు అరవిందుడు అతనిసహచరులు విప్లవప్రచారాన్ని తీవ్రంగాసాగించారు. బంకించంద్రుని ఆనందమఠాన్ని ఆధారంచేసుకొని భవానీమందిరం అనేగ్రంథాన్ని అరవిందుడు ప్రకటించాడు. భవాని విశ్వమాత, భారతమాత ఆమెఅవతారం. భారతీయులు ఆమెసంతానం. వారుశారీరిక, ఆధ్యాత్మిక, నైతిక, రాజకీయబలాన్ని సంపాదించి, ఆమెవిముక్తికై పాటుబడడం వారికర్తవ్యం. భవానిమందిరం వారికి ఇందుకుకావలసిన శిక్షణ ఇచ్చేఆశ్రమం. శిక్షణను పొందినతర్వాత వారు వారివిధులను ఏవిధంగా నిర్వహించవలసినదీ అరవిందుడు ఇందులోవివరించాడు. ప్రచారార్థం ఉద్యమకర్తలు ప్రకటించిన రెండవగ్రంథం వర్తమానరణనీతి. ఇది యువకులు సైనికశిక్షణనుపొంది, గొరిల్లాయుద్ధసాధనాన పరాయిపాలకులనెదిరించి, దేశవిముక్తికై ప్రాణాలనుసహితం త్యాగంచేసి వీరస్వర్గాన్ని అనుభవించవలసిందిగా ఉద్ఘాటించింది. ఇదే ఉద్దేశంతో వారు "ముక్తిమార్గమేది" అనే గ్రంథాన్ని ప్రచురించారు. ముక్తిఅనగా దేశవిముక్తిఅనీ, దీనికై పాటుపడేసంఘాలలోనే విప్లవకారులు చేరవలసిందనీ, యూరోపియన్లను తుపాకీలతోకాల్చిచంపడం సులభసాధ్యమనీ, ఈకార్యక్రమంలో సైనికులసహాయాన్ని సంపాదించవలసిందనీ సైనికులుకూడా భారతీయులేకావడంచేత వారిలో దేశాభిమానంఉంటుందని, అందుచేత వారిసహాయాన్ని సంపాదించడం కష్టసాధ్యంకాదనీ, ఈగ్రంథం ఉపదేశించింది.

విప్లవప్రచారాన్ని సాగించే ఉద్దేశంతోనే అరవిందుడు తనసహచరులతో 1906లో "యుగాంతర్" (ఇంకొకయుగం) అనేపత్రికను స్థాపించి రెండు సంవత్సరాలకాలం నడిపించాడు. బ్రిటిష్‌వారిపై ద్వేషాన్ని పురికొల్పడంలోను, దేశవిముక్తికై సర్వవిధాలా పోరాడవలసిన ఆవశ్యకతను నిరూపించడంలోను, హత్యలు మొదలైన కార్యక్రమాలను సాగించడంలోను అన్నిపత్రికలకంటె ఇది ఎక్కువకృషిని గావించింది. రాజద్రోహనేరానికై ఇది అనేకపర్యాయాలు జరిమానాశిక్షలను అనుభవించింది. తుదకు 1908లో దీనిప్రకటనను ప్రభుత్వం నిషేధించింది. అయినా అప్పుడప్పుడు ఇది వెలువడుతూ విప్లవధోరణినిప్రదర్శిస్తూనేవచ్చింది. అనేక కరపత్రాలను చిన్నచిన్నగ్రంథాలను రహస్యంగా ప్రకటించి ప్రచారాన్ని చాలాకాలంవరకు సాగించింది అరవిందుడు స్థాపించినవందేమాతరపత్రిక, సంధ్యఅనే ఇంకొకపత్రిక విప్లవభావాలను ప్రచారంచేయడంలో గొప్పపాత్రను వహించాయి.

మానిక్‌టోలా తోటలో తయారైన బాంబులను తూర్పు బెంగాలు

లెఫ్టనెంటు గవర్నరు పైన రెండు పర్యాయాలు, బెంగాలు లెఫ్టనెంటుగవర్నరు పైన రెండు పర్యాయాలు ప్రయోగించివిప్లవకర్తలు విఫలులయ్యారు. తర్వాత వారు కలకత్తాలో మ్యాజిస్ట్రేటుగా ఉండి, రాజద్రోహ నేరాలకై కఠిన శిక్షలను విధించుటకు అలవాటుపడిన కింగ్సుఫర్డు (Kingsford) ను హత్యచేయదలచారు. ఇతడు ఒక సమయంలో కోర్టుచుట్టూ గుమికూడిన వారిలో ఒకడైన సుశీలసేన్ అనే 14 సంవత్సరాల పిల్లవానిని వందేమాతరం నినాదం చేసినందుకు తనపర్యవేక్షణలో 15 కొరడాదెబ్బలు కొట్టించాడు. ఇంతటి క్రౌర్యాన్ని ఏ అధికారి ప్రదర్శించలేదు. విప్లవకారులు ఆగ్రహ పరవశులై అతనిని హత్య చేయ సిద్ధపడ్డారు. అతనిని కలకత్తాలో ఉంచడం ప్రమాదకరమని ప్రభుత్వం అతనిని బీహారులో ముజఫర్ నగరు మ్యాజిస్ట్రేటుగా బదిలీచేసింది. అతనినిహత్య చేయుటకు గాను కుదీరాంబోస్, ప్రఫుల్లచౌకి అనే యువకులను విప్లవబృందం నియోగించింది. వారు ముజిఫర్ పూరుకు వెళ్ళి, 1908 ఏప్రిల్ 30న కింగ్సుఫర్డు కోచిబండి అనే భ్రమతో కెన్నడీ సతి ఆమె కుమార్తె ప్రయాణం చేస్తూ ఉన్న కోచిబండిపై బాంబు వేశారు. అది వెంటనే ప్రేలి వారిద్దరికి ప్రాణనష్టం కలిగించింది. తర్వాత కొద్దిరోజులకు పోలీసులు కుదీరాంను అరెస్టుచేసి విచారణ గావించి ఉరిశిక్ష విధించారు. ప్రఫుల్లచౌకి పోలీస వారి చేతులలో పడకముందే ఆత్మహత్య చేసుకొన్నాడు. వీరిద్దరి సాహసాన్ని దేశంలోని ప్రజలందరు ప్రశంసించారు. వారి మరణానికి విచారపడ్డారు. ఆ సందర్భంలోనే వీరిని ప్రశంశిస్తూ తిలక్ తన కేసరి పత్రికలో ఒక వ్యాసాన్ని వ్రాసినందుకు ప్రభుత్వం అతనిపై రాజద్రోహ కేసుపెట్టి విచారణతర్వాత ఆరు సంవత్సరాల శిక్షను విధించి మాండలే జైలుకు పంపించింది.

బిరేంద్రుడు మొదలైన వారి విచారణ సందర్భంలో అరెస్టైనవారిలో ఒకడైన నరేంద్రగోసాయన్ పోలీసుపక్షంవహించి బాంబులు తయారుచేసే ఫ్యాక్టరీని గురించి ఇతర రహస్యాలగురించి వారికి తెలియపరచాడు. ఇది అతని సహచరులనేకులకు కోపకారణమైంది. వారిలో ఇద్దరు-కనయలాల్ దత్తా, సత్యన్ బోసు-అనే వారలు- అతడు సాక్ష్యం చెప్పే అవకాశం లేకుండా జేయుటకు అతనిని హత్యజేయ నిర్ణయించు కొన్నారు. వారు ఏలాగో జైలులోకి ఒక పిస్తోలును తెప్పించి అతనిని కాల్చి చంపారు. జైలులో బహిరంగంగా ఈలాటి సాహసానికి వారు పూనుకొనడం గుర్తించదగిన విషయం. ఇది అనుశీలన సమితి యువకులకు ఇచ్చిన శిక్షణ ఫలితమే. ఈ హత్యవిషయం తెలియగానే దేశద్రోహియైన గోసాయన్‌కు తగినశాస్తి జరిగినట్లు ప్రజలందరు భావించారు. జైలులోకి ఎవరు ఏవిధంగా పిస్తోలును పంపగలిగారో ఇప్పటికికూడా అజ్ఞాతంగానే ఉన్నది. హత్యచేసిన నేరానికి దత్తాకు బోసుకు ఉరిశిక్షను విధించారు. వీరి మరణానికి విచారం తెలుపని ప్రజలెవరూ లేరని చెప్పవచ్చు. జాతీయవీరులుగా వీరిని అందరు ప్రశంసించారు. దత్తా మృతదేహానికి జోహారులర్పిస్తూ

లక్షలాది జనం దాని ఊరేగింపులో పాల్గొని, దహన క్రియలను జరిపారు. ప్రతి తల్లీ తన కుమారుడు మరణించినట్లె భావించింది.

అరెస్టైనవారు ఒక సంవత్సరంపైగా అలీపూరు జైలులో నిర్బంధితులయ్యారు. విచారణలో తగినసాక్ష్యందొరకనందున అరవిందుడు ఇంకొకడు విడుదలయ్యారు. క్రిందికోర్టులో బరీంద్రునికి మరి ముగ్గురికి మరణశిక్ష విధించబడినా హైకోర్టులో దానిని యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్షగామార్చారు. మరి పదిమందికి కొన్ని సంవత్సరాల జైలుశిక్ష విధింపబడింది. తక్కినవారు విడుదలయ్యారు. విచారణకాలంలో ప్రభుత్వపక్షానవాదించిన పబ్లిక్ ప్రాసిక్యూటర్ నూ ఒక పోలీసు డిప్యూటీ సూపరింటెండును హైకోర్టు అవరణలో బహిరంగగా కాల్చిచంపారు.

రాజకీయ రంగాననుండీ విప్లవోద్యమానికి నాయకుడైన బరీంద్రుడు తొలగిపోయినా ఉద్యమం మాత్రం చల్లారలేదు, బాంబుల తయారుచేసినట్టిన్నీ వాటిని ప్రయోగించి నట్టిన్నీ యువకుల ధైర్యసాహసాలను అందరూ ప్రశంసించారు. ప్రముఖవర్గానికి చెంది, సామాన్యంగా రాజకీయాలలో పాల్గొననివారు కూడా వారిని ప్రస్తుతించారు. 1910లో రాజకీయాలపట్ల విరక్తినిపొంది యోగ సాధనద్వారా జీవితపరమార్థాన్ని సాధించే ఉద్దేశంతో అరవిందుడు ఫ్రెంచి స్థావరమైన పుదుచ్చేరిలో స్థిరనివాసియై ఒకఆశ్రమాన్ని స్థాపించాడు. రంగాననుండి వెళ్లిపోయిన నాయకుల స్థానంలోకి జతీన్ ముఖర్జీ ప్రవేశించాడు. ఇతని శక్తి సామర్థ్యాల మూలంగా విప్లవఉద్యమం సాగుతూనే వచ్చింది.

అనుశీలన సమితిలో సాయుధవిప్లవాన్ని తలపెట్టినవారు 1907 నాటికి యుగాంతర బృందంగా ఏర్పడినారు. 1910నుండి దీనికి జతీన్ ముఖర్జీ నాయకుడై దాని కార్యక్రమాలను సాగించాడు. ప్రతిజిల్లాలో దాని శాఖలు ఏర్పడినవి. అవి ఉద్యమ ప్రచారాన్ని సాగించాయి. సభ్యులలో కొందరు నిర్మాణ కార్యక్రమాలలో ఎక్కువగా పాల్గొని పల్లె ప్రాంతాలకువెళ్ళి గ్రంథాలయాలను వయోజన విద్యాలయాలను సహకార సంఘాలను కుటీర పరిశ్రమలను స్థాపించి, క్షామకాలంలోను వరదలు సంభవించినపుడూ ప్రజల బాధలను నివారించుటకు ఎంతోకృషి గావించారు ప్రభుత్వంతో నిమిత్తం లేకుండా, తమ వ్యవహారాలనుతామే పరిష్కరించుకొనే ఆత్మవిశ్వాసాన్ని ప్రజలలో కల్పించి క్రమక్రమంగా ఒక ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని (Parallel Government) ప్రవేశపెట్టడమే వీరిలక్ష్యం. సంఘసేవ దీనికొక సాధనంగా వీరు భావించారు. ఈ కార్యక్రమాలను ప్రజలలో విప్లవభావాలను అంకురింప జేయుటకు వీరు వినియోగించారు.

యుగాంతర బృందానికి చెందిన మరికొందరు ప్రచారాన్ని సాగించడమే గాక యథాపూర్వంగా ఆయుధసేకరణ, బాంబుల తయారుమొదలైన కార్యక్రమాలను సాగించారు. ప్రతిజిల్లాలోను విప్లవ కేంద్రాలు అనేకం ఉండేవి. ఒక్కొక్క కేంద్రం దాని ఇష్టానుసారం ఈలాటి కార్యక్రమాలను సాగించేది,

జతీన్‌ముఖర్జీ ఈ కేంద్రాలన్నిటినీ సుసంఘటితం చేసి తన నాయకత్వంలోకి తీసుకొని రాగలిగాడు. 1914 నాటికి ఇది ఒక బలిష్టమైన పార్టీగా రూపొందింది. ఇదే మోస్తారుగా ఢాకాలోని సమితికూడా అనేక శాఖోపశాఖలను స్థాపించి దాని కార్యక్రమాలను సాగిస్తూవచ్చింది.

అలిపూరు కుట్రకేసు తర్వాత, మిడ్నాపూరు, హౌరా, ఖుల్నా, ఢాకా కుట్రకేసులు జరిగాయి. వీటిలో విప్లవకారులనేకులు అరెస్టయ్యారు. వారి తరపున వాదించుటకుఎక్కువఫీజులిచ్చి లాయర్లను ఏర్పాటు చేయవలసివచ్చింది. దీనికీ, ఆయుధాలు మొదలైన వాటిని సేకరించుటకూ కొన్ని దోపిడీలుచేసి ధనాన్ని సంపాదించారు. దీనికితోడు కొందరు పోలీసు అధికారులను, వారితరపున సాక్ష్యమిచ్చిన వారిని, వారిగూఢచారులను, అరెస్టయిన వారిలో ప్రభుత్వంపక్షం వహించి రహస్యాలను బయటపెట్టిన వారిని హత్యలు చేయడం జరిగింది. విప్లవ ఉద్యమంలో పాల్గొన్న వారిదృష్టి ఈ కేసులవైపు కేంద్రీకరించవలసివచ్చింది.

మొత్తంపైన వీరిలో అనేకులు ఈకేసులనుండి బయటపడగలిగారు. 1914 నాటికి ప్రపంచయుద్ధం సంభవించే సూచనలు కనుపించాయి. భారీయెత్తున సాయుధఘోరాటాన్ని సాగించుటకు అది మంచితరుణంకాగలదనే కారణాన యుగాంతర బృందందానికి సన్నాహాలనుచేయసాగింది.

## 4

విప్లవ ఉద్యమం బెంగాలుకు మాత్రమే పరిమితంకాలేదు. అది తక్కిన రాష్ట్రాలకుకూడా వ్యాపించింది. ఆలాటి రాష్ట్రాలలో కొన్నిసంవత్సరాల వరకు మహారాష్ట్రం ప్రాధాన్యంవహించింది.

మహారాష్ట్రంలో మొదటి నుండి బ్రిటిష్ పరిపాలన ప్రజలకు అంగీకారము కాలేదు. మొగలాయి సామ్రాజ్యాధికారాన్ని నిర్మూలించి మహారాష్ట్రంలో శివాజీ స్వరాజ్యాన్ని స్థాపించడము, అటుతర్వాత పీష్వాలు దిగ్విజయంచేసి భారత దేశంలో చాలా భాగానికి సార్వభౌములు కావడము, వారిజ్ఞాపకాలలో స్థిరపడి పోయినాయి. బ్రిటిష్ అధికారాన్ని తొలిగించి, తిరిగీ స్వరాజ్యాన్ని స్థాపించడంతమకర్తవ్యంగా వారిలో అనేకులు భావించారు. కొండ ప్రాంతాలలో నివసించే తెగలవారి సహాయంతోనే శివాజీ స్వరాజ్యాన్ని స్థాపించాడు. ఆ తెగల వారే తిరిగి బ్రిటిష్ వారిపై తిరుగు బాటు చేశారు.

1820 ప్రాంతాన ఉమా నాయక్ నాయకత్వాన రామోషి (రామవంశ) తెగవారి తిరుగుబాటు, 1830—50 మధ్య రాయచంద్ర గణేశ్ గోరే నాయకత్వాన కోలి తెగవారి తిరుగుబాటు, 1879లో ఫాడ్కె నాయకత్వాన వీరేగాక మరికొన్ని తెగలవారి తిరుగుబాటులు వీటిలో ప్రఖ్యాతిగాంచాయి. కాని ఇవి అన్నీవిఫలమైనాయి. 1857-58లో సంభవించిన మహత్తరమైన తిరుగుబాటులో మహారాష్ట్ర ప్రజలు పాల్గొనకపోవడం కొంత వింతగానే కనుపిస్తుంది.

1880 తర్వాత ఇంగ్లీషు విద్యాధికులనేకులు రాజకీయ రంగంలో

ప్రవేశించి, ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని పునరంకురింప జేశారు. వీరు సర్వజ్ఞనైకసభ ద్వారా ఏలాటి కృషినిసాగించిందీ ఇంతకు పూర్వం వివరించాము. వీరందరిలో బాలగంగాధర్ తిలక్ విప్లవఉద్యమాన్ని ప్రచారం చేయడంలో అగ్రస్థానాన్ని వహించాడు. అందుకుగాను తన కేసరి మరాటా అనే పత్రికలను వినియోగించాడు. ఆనాడు సామాన్య ప్రజలు, రైతులు, భూమిశిస్తు విధానం మూలంగాను, క్షామాల మూలంగాను ఎన్నో బాధలకు గురియై అసంతృప్తిగాంచి ఉండినారు. వారిలో విప్లవభావాలను నాటుటకు ఇవి ఆధారమైనాయి, ఇందుకుగానుగణపతి ఉత్సవాలను పునరుద్ధరించి వినియోగించినాడు. శివాజీ ఉత్సవాలను కూడా ఇదే ఉద్దేశంతో జరిపాడు. దేశ స్వాతంత్ర్యం ప్రజల జన్మహక్కు అని ప్రచారంచేశాడు. ఇందుకుగాను బలప్రయోగం చేయడంలో అధర్మం ఏదీ లేదని, అందుచేతనే శివాజి అఫ్జల్ ఖాన్‌ను హత్య చేశాడని, క్షాత్రధర్మం ప్రత్యేక లక్షణాలతో కూడుకొన్నదని ప్రతిపాదించాడు.

ఈ లాటి ప్రచార ఫలితంగా యువకులు ప్రభావితులై వ్యాయామ శాలలను పూనాలో స్థాపించారు. ఈలాటి కార్యక్రమాలలో ఛాపేకర్ సోదరులు ఎక్కువగా పాల్గొన్నారు. ప్లేగువ్యాధి నివారణార్థం ప్రభుత్వం తరపున సైనికాధికారి రాండు తీసుకొంటూ వచ్చిన చర్యలు ప్రజల అలజడికి కారణమైనాయి. ఛాపేకర్ సోదరులు 1897 లో రాండును అతని సహచరుడు ఐరెస్టును హత్యచేశారు. మహారాష్ట్రంలోని రాజకీయహత్యలలో ఇదే మొదటిది. ప్రభుత్వం వీరిని పట్టుకొని విచారణ చేసి వీరికి ఉరి శిక్ష విధించింది. విచారణ కాలంలో ప్రభుత్వపక్షాన సాక్ష్యమిచ్చిన ఇద్దరూ హత్య చేయబడినారు. ఈ సందర్భంలోనే రాజద్రోహానికై తిలకుకు 18 నెలల కారాగార శిక్షను విధించారు.

చాపేకర్ సోదరులతర్వాత విప్లవకార్యక్రమాలలో ప్రఖ్యాతినిసంపాదించినవారు సావర్కారు సోదరులు. వీరిలోపెద్దవాడు గణేశ్‌సావర్కారు, చిన్నవాడు వినాయకసావర్కారు. వీరు 1899లో మిత్రమేలఅనే సంఘాన్నిస్థాపించి హిందూసమాజ పునరుద్ధరణకు గొప్పకృషిగావించారు. బెంగాలులో అంతకుపూర్వం స్థాపించబడిన హిందూమేల వీరికి మార్గదర్శకమైంది. వినాయకసావర్కారు 1902ప్రాంతాన అగమ్యగురు పరమహంస అనేసన్యాసితో సన్నిహితసంబంధం కలవాడయ్యాడు. ఇతడు ఆనాడు విప్లవభావాలను ప్రచారంచేస్తూవుండినవాడు. సమాజానికి క్రైస్తవమిషనరీలు పరమశత్రువులని, వారి ప్రచారాన్ని అరికట్టి హిందువులకు స్వీయమతంపట్ల ఎక్కువ గౌరవాభిమానాలు పర్పడేటట్లు వారి మనోవైఖరినిమార్చడం ఇతనికార్యక్రమంలో ఒకప్రధానభాగంగాఉండినది. అందుకుగాను ఒకకమిటీని ఏర్పాటుచేశాడు. దీనిమూలంగా రాజకీయ విప్లవానికి హిందూమత పునరుద్ధరణతో సంబంధంపర్పడింది. ప్రధానంగా వినాయక సావర్కారు ఈ కార్యక్రమంలో పాల్గొన్నాడు.

1903లో ఉన్నతవిద్యకై ఇతడు లండన్‌కువెళ్ళాడు. అప్పటికే అతనిలో

విప్లవభావాలు బాగానాటుకొని ఉండినవి. లండన్‌లో శ్యామ్‌జీకృష్ణవర్మ ఆలాటి భావాలనే ప్రచారంచేస్తూవచ్చాడు. వినాయకసావర్కార్ అతనికి సన్నిహితుడై అతడు లండన్ వదలి తనకార్యక్రమాలకు పారిస్ నగరాన్ని కేంద్రంగాచేసుకొన్న తర్వాత అతడు లండన్‌లోస్థాపించిన "ఇండియాహౌస్" (India House) కార్యక్రమాలను సాగిస్తూ, వాటిద్వారా బ్రిటన్‌లోని భారతీయవిద్యార్థులలో విప్లవభావాలు నాటుటకై గొప్పకృషిగావించాడు. 1857-58లో సంభవించిన తిరుగుబాటు సిపాయీలతిరుగుబాటుకాదని, అది భారతీయులుసాగించిన ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామమని ప్రచారంచేసి, ఆ పేరుతో ఒకగ్రంథంకూడా వ్రాశాడు. తుపాకులకాల్చడం, బాంబులుతయారుచేయడం యువకులునేర్చుకొనుటకు ఏర్పాటులుచేశాడు. కొన్ని పిస్టలులను, మరతుపాకులను స్నేహితులద్వారా తనఅన్నకు అందజేశాడు.

1906లో గణేశ్‌సావర్కార్ అభినవభారత సమాజమనేపేర ఒకవిప్లవసంఘాన్ని స్థాపించాడు. యువకులను అందులోచేర్చి వారికి శరీరవ్యాయామంతో పాటు నైతికవిద్యను, హిందూమతంపట్లభక్తిశ్రద్ధలను నేర్పి, దేశవిముక్తికి సాధనమైన విప్లవతత్వంలో శిక్షణనుగరిపాడు. పూనా బొంబాయి నగరాలలోని ప్రతి కళాశాలవిద్యార్థులలో సమాజసభ్యులు ఉండేవారు. వారిమూలంగా విప్లవ భావాలు బొంబాయిరాష్ట్రమందంతటా వ్యాపించినవి. ఈవిద్యార్థులే విద్యను పూర్తిచేసికొనినతర్వాత ప్రభుత్వకార్యాలయాలలోను సంస్థానాలలోను ఉద్యోగులుగా ప్రవేశించి ఉద్యమానికి అనేకవిధాలుగా తోడ్పడినారు.

బెంగాలురాష్ట్రవిభజనరద్దుకై బెంగాలీలు లేవదీసిన బహిష్కరణ స్వదేశీ ఉద్యమాలు, యుగాంతర్ బృందంవారి విప్లవకార్యక్రమాలు మహారాష్ట్రంపైనా అభినవభారతసమాజంపైనా గొప్పప్రభావాన్ని వహించాయి. అంతకుపూర్వమే తిలక్ అరవిందులు సన్నిహితులయ్యారు. దేశవిముక్తికై సాయుధపోరాటం ధర్మవిరుద్ధంకాదనే సిద్ధాంతంలో ఇద్దరు ఏకీభవించారు. 1908లో, కుదిరాంబోస్ ప్రఫుల్లచాకి ముజఫర్‌పూర్‌లోచేసిన హత్యలను తిలక్ సమర్థించి, వారిని గొప్ప దేశభక్తులుగా ప్రశంసించాడు. వారి ఉరిశిక్ష మహారాష్ట్రంలో ఎంతోవిచారాన్ని కలిగించింది.

ఈ ప్రాంతంలో అభినవ భారత సమాజంతోపాటు మరికొన్ని విప్లవ సంఘాలు స్థాపితమైనవి. వీటి అన్నిటి కార్యక్రమాలలో అధికారుల హత్యలు ఒక ప్రధానాంశమైంది. 1908లో రాజద్రోహ నేరాన్నికై తిలకుకు ఆరుసంవత్సరాల శిక్షను విధించడం, కాల్ పత్రిక సంపాదకునికి 18 నెలల శిక్షను విధించడం వీరిని ఆగ్రహావేశవశుల చేశాయి. వీరు నాసిక్ జిల్లా కలెక్టరు జాక్సనును హత్య జేయ నిర్ణయించుకొన్నారు. ఇతడు ఒక భారతీయుని హత్య జేసిన బ్రిటిష్ వానిని శిక్షించక విడుదల చేశాడు రాజద్రోహ నేరానికి గణేశ్ సావర్కారునకు 1909 జూన్‌లో యావజ్జీవ ద్వీపాంతర వాస శిక్షను విధించాడు. 1909 డిసెంబరు 21న నాసిక్‌లో ఒక సభలో పాల్గొనుటకు అతడు రాగానే అతనిపై కాల్పులు

జరిపి హత్యజేశారు. ఇందుకుగాను ప్రభుత్వం ఏడ్గురిని అరెస్టుచేసి విచారణ గావించి ముగ్గురికి మరణశిక్షను ముగ్గురికి యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్షను ఒకనికి రెండు సంవత్సరాల శిక్షను విధించింది.

గణేశ్ సావర్కారుకు శిక్ష విధించినతర్వాత వారంరోజులకు లండన్‌లో వినాయక సావర్కారుకు సన్నిహితుడును ఇంజనీరింగు విద్యార్థి అయిన మదన్ లాల్ ధింగ్రా (Madanlal Dhingra) ఇండియా ఆఫీసులో ఉన్నతోద్యోగిగా ఉండిన సర కర్జన్ విల్లీని కాల్చిచంపాడు. బ్రిటన్‌లోని ప్రజలలో ఇది గొప్ప ఆందోళనను కలిగించింది, పరిపాలన విధానంలో ఏదో గొప్పలోపం ఉండడం చేతనే భారతీయులు ఈలాటి దారుణ కృత్యాలకు సిద్ధపడుతున్నారని అనేకులు భావించారు. ధింగ్రా ప్రవర్తన నింద్యార్హమైనా అతని దేశభక్తి ప్రశంసనీయ మైనదని ప్రముఖవర్గానికి చెందిన లాయిడ్ జార్జి, విన్‌స్టన్ చర్చిల్ ప్రశంసించారు. ఐరిష్ ప్రజలు అతనిని ఒక మహావీరునిగా ప్రస్తుతించారు. బ్రిటిష్ కోర్టు అతనిని విచారణచేసి ఉరిశిక్షను విధించింది.

విల్లీ హత్య జరిగినవెంటనే ఇండియహౌసును పోలీసులు సోదాచేసి నాసిక్ హత్యలో వినాయక సావర్కారుకు ప్రమేయం ఉన్నట్లుభావించి, అతనిని అరెస్టుచేసి నౌకలో భారతదేశానికి విచారణనిమిత్తం పంపారు. మార్గమధ్యంలో నౌక ఫ్రాన్‌సులోని మార్సేల్ నౌకాశ్రయానికిరాగా సావర్కారు అతిసాహసంతో నౌకనుండి తప్పించుకొని, సముద్రంలో ఈది, రేవులో దిగాడు. కాని నౌకలోని పోలీసులు అతనిని వెంటనంటి పట్టుకొని నౌకలోకి చేర్చారు. ఫ్రాన్‌సు భూభాగంలో ఉన్నవానిని అన్యదేశపు పోలీసువారు పట్టుకోవడం అంతర్జాతీయ న్యాయశాస్త్రానికి విరుద్ధమని అతడు వాదించినా ఫ్రెంచి అధికారులుగాని బ్రిటిష్ వారుగాని దానిని లెక్కకుతీసుకొనలేదు. అతడు భారతదేశం చేరినవెంటనే అతనితోకూడా మరి 37 మందిని నాసిక్ కుట్రకేసులో విచారణచేసి అతనికి యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్షను విధించి అండమాను దీవులకు పంపారు. అప్పటికే అతని అన్న అక్కడ అదేశిక్షను అనుభవిస్తూ ఉండినాడు.

అభినవ భారత సమాజశాఖ ఒకటి గ్వాలియర్ సంస్థానంలోను, ఇంకొకటి సతారా సంస్థానంలోను, కృషిచేసినకారణంగా ఈ రెండు నగరాలలో కొందరిపై కుట్రకేసులు పెట్టబడి అనేకులు శిక్షకుపాత్రులయ్యారు. కొల్హాపూరులో 1893 నుంచి శివాజీక్లబ్ అనే పేరుతో ఒక విప్లవసంఘం కృషిచేస్తూవచ్చింది. 1908 లో ఈ సంఘసభ్యులు కొందరు బ్రిటిష్ రెసిడెంటు కర్నల్ ఫేరీని హత్య జేయప్రయత్నించి విఫలులైనారు. వెంటనే ప్రభుత్వం దానిని అక్రమసంఘంగా ప్రకటించింది. అంతటితో అది రంగాననుండి అదృశ్యమైంది.

ఈ విధంగా 1910 వరకు మహారాష్ట్రంలో విప్లవ ఉద్యమం తీవ్రరూపం ధరించి విప్లవభావాలను వ్యాపింపజేసింది. అటుతర్వాత రాష్ట్రంలో ఉద్యమం

పూర్తిగా క్షీణించింది

విప్లవఉద్యమ ప్రభావం గుజరాత్‌లోకి కూడా వ్యాపించింది. బరోడా మహారాజా కళాశాలలో అరవిందుడు 1905కు పూర్వం అధ్యాపకుడుగా ఉండడం దీనికొక ప్రధానకారణం. అటుతర్వాతయుగాంతర బృందానికి చెందినవారు కొందరు అక్కడికి వచ్చి రహస్య ప్రచారం సాగించారు. వారిలో జతీన్ బ్యానర్జి (ఇతడు తర్వాత స్వామీ నిరాలంబ అనేపేరుతో సన్యాసాశ్రమాన్ని స్వీకరించాడు) ప్రఖ్యాతి వహించాడు. దీని ప్రభావం చేత 1909 లో మింటో ప్రభువు సతీ సమేతంగా అహమ్మదాబాదుకు వచ్చినప్పుడు వారిపై ఒక బాంబు ప్రయోగించ బడినది. కాని అది ప్రేలలేదు. లండన్‌లోను పారిస్‌లోను విప్లవానికై కృషిచేసిన శ్యాంజీ కృష్ణవర్మ, పార్సీ వనితకామా, సర్దార్ రాణా గుజరాటుకు చెందినవారు. కాని ఈప్రాంతంలో ఉద్యమం తీవ్రరూపంధరించలేదు.

## 5

బీహారు ఒరిస్సాలలో విప్లవ ఉద్యమం తీవ్రరూపం ధరించలేదు. బెంగాలులో ఉద్యమాన్ని లేవదీసి, దానిపై నాయకత్వం వహించి, దానిని పట్టుదలతో ఫలప్రదంగా సాగించినవారు ఇంగ్లీషు విద్యనభ్యసించిన మధ్యతరగతి వారు. బీహారు ఒరిస్సాలలో చాలా కాలంవరకు ఇంగ్లీషు విద్య వృద్ధిగాంచలేదు. ఆకారణంచేత వాటిలో విద్యనేర్చిన మధ్యతరగతి ఏర్పడలేదు. ఇంతేగాక 1911 వరకు అవి బెంగాలు రాష్ట్రంలో చేరి ఉండినందున వాటిలో బెంగాలీలే ఎక్కువగా ఉద్యోగంచేసే వారయ్యారు. ఈకారణాల మూలంగా బీహారీలు గాని ఉత్కళులుగాని ఉద్యమంలో చెప్పుకోనదగిన పాత్రను వహించలేదు. కొన్ని ఉద్యమకేంద్రాలు ఏర్పడినా వాటిలో కృషిచేసినవారిలో అధిక సంఖ్యాకులు బెంగాలీలే. వీరిలోకూడా అనేకులు బెంగాలులోని అను శీలన సమితికి యుగాంతర్ బృందానికి చెందినవారు.

బెంగాలులో జరిగినట్లె వీరుకూడా కొన్నిహత్యలు గావించారు. కొన్ని దోపిడీలు సాగించారు. ఆయుధాలను సేకరించారు. ఒకసమయంలో 17 గురు యువకులు ఒరిస్సాలోని జయపూరు సమీపాన చైన్‌పూరు అనే గ్రామంలో సాగించిన దోపిడి కొంత ప్రఖ్యాతిని వహించింది.

ఉత్తరప్రదేశ్‌లోని పరిస్థితులు కూడా ఈలాటివే. అక్కడకూడా ఇంగ్లీషు విద్యావ్యాప్తి చాలా ఆలస్యంగా ప్రారంభంకావడంచేత విప్లవ ఉద్యమాన్ని సాగించదగిన నాయకులు లేకైరెరి. సచీన్ సన్యాల్ అనే ఒక బెంగాలీ యువకుడు వారణాసిలో ఒకసంఘాన్ని స్థాపించి యువకులకు శరీరవ్యాయామం లోను, నైతిక ఆధ్యాత్మికగ్రంథాలలోను వివేకానందుని రచనలలోను, ఆసక్తికల వారినిగా తర్ఫీదు చేశాడు. ఒకపిస్తలును సంపాదించి హార్డింజి ప్రభువును హత్య చేయదలచి అనేక పర్యాయాలు బెంగాలుకు వెళ్లి అక్కడి ఉద్యమనాయకులు జిదుగోపాల్ ముఖర్జి మొదలైనవారి సహాయాన్ని అర్థించాడు. కానివారెవరు

ఇతనికి పిస్టలును అందజేయలేదు. తర్వాతకూడా వారితో ఉత్తరప్రత్యుత్తరాలు సాగిస్తూనే వచ్చాడు. ప్రపంచ సంగ్రామం ప్రారంభమైన తర్వాత జర్మనుల సహాయంతో సాయుధపోరాటాన్ని లేవదీయుటకు సన్నాహాలు జరిగినాయి ఆసమయంలో ఉద్యమనాయకుడుగా ప్రఖ్యాతిగాంచి ఉత్తర్ప్రదేశ్ పంజాబులలో కొన్ని సంవత్సరాలుగా కార్యక్రమాలు సాగిస్తూ ఉండిన రాష్‌బిహారీబోసు వారణాసికివచ్చి కొంతకాలం సన్యాల్‌తో కలిసి పనిచేశాడు. కానిసాయుధ పోరాటం సాధ్యంకాలేదు.

1915 నాటికి వారణాసిలో సన్యాల్ మొదలైనవారి చర్యల గురించి పోలీసువారు ఏలాగో తెలుసుకొని వారిపై వారణాసి కుట్రకేసును సాగించారు. దానిఫలితంగా సన్యాల్ యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షకు పాత్రుడయ్యాడు. కాని నాలుగు సంవత్సరాల తర్వాత అతనిని విడుదల చేశారు. రాష్‌బిహారీ కూడా ఈకేసులో ముద్దాయిగా చేర్చబడినా అతడు ఏలాగో తప్పించు కొని బెంగాలుకు వెళ్లి అక్కడ నుండి తుదకు జపాన్ చేరాడు. ఇదితప్ప ఉత్తర ప్రదేశ్‌లో విప్లవ సంఘటనలేవీ సంభవించలేదు.

ఈ సందర్భంలో ఉత్తరప్రదేశ్‌కు చెందిన రాజా మహేంద్ర ప్రతాపుని గురించి ప్రస్తావించవలసిఉంది. ఇతడు హత్రాస్ సంస్థానాధీశుని కుమారుడు ఆ సంస్థానాన్ని బ్రిటిష్‌వారు వశపరచుకొనిన కారణంగా వారిపట్ల ద్వేషాన్ని వహించాడు. బెంగాలులోని స్వదేశీఉద్యమం ఇతనిపై ప్రభావంవహించింది. 20 సంవత్సరాల వయస్సున్న ఇతడు 1906 లో జరిగిన కాంగ్రెసుకు వెళ్లాడు. అది మొదలు స్వదేశీప్రచారానికి జాతీయవిద్యకూ ఎక్కువ కృషిగావించాడు. ఇందుకుగాను బృందావనంలో ప్రఖ్యాతిగాంచిన ప్రేమ మహావిద్యాలయాన్ని స్థాపించి విద్యార్థులకు దేశసేవయందు ఆసక్తినికలిగించే విద్యను నేర్పాడు. కాని దేశంలోని విప్లవోద్యమంలో పాల్గొనలేదు.

అటుతర్వాత ప్రథమ ప్రపంచసంగ్రామకాలంలో యూరపునకువెళ్ళి జర్మనుల సహాయంతో భారతదేశంలో భారీయెత్తున సాయుధపోరాటాన్ని జరుపుటకు విదేశాలలోని భారతీయులు చేసిన ప్రయత్నంలోపాల్గొన్నాడు. కాని ఈప్రయత్నం విఫలమైంది. అటుతర్వాతకూడా విదేశాలలోనే జీవితాన్నిసాగించి రెండవప్రపంచ యుద్ధానంతరం దేశానికి స్వాతంత్ర్యంలభించినతర్వాతనే తిరిగివచ్చాడు. కొంత కాలం లోక్‌సభలో సభ్యత్వంవహించాడు దేశానికి సమస్తత్యాగాలుచేసినవాడనే ప్రఖ్యాతిని సంపాదించి ఇటీవలనే కాలధర్మాన్నిపొందాడు.

మద్రాసు మొదటినుండి మితవాదరాజకీయాలకు ప్రసిద్ధిగాంచినరాష్ట్రం. విద్యాధికులలో ప్రప్రథమంగా విప్లవాత్మకములైన జాతీయభావాలను నాటిన వాడు వివేకానందుడు. అతడు అమెరికాపర్యటనను ముగించుకొనివచ్చినతర్వాత మద్రాసురాష్ట్రంలోనే తన ఉద్రేకపూరితములైన ఉపన్యాసాలను చేశాడు. హరిజనఉద్ధరణ, స్త్రీలఉద్ధరణనుగురించి ప్రబోధంచేశాడు. విద్యానేత్తగాభవిష్యత్తులో ప్రఖ్యాతిగాంచిన తారకనాథదాసు 1906లో తాత్కాలికంగా తారకనాథబ్రహ్మ

చారి అనే పేరుతో సన్యాసాశ్రమాన్ని స్వీకరించి, మద్రాసులో విప్లవఉద్యమాన్ని గురించి ప్రచారంచేసేనిమిత్తం బెంగాలునుండివచ్చి, సాయుధపోరాటానికి సన్నాహంచేయుటకు దక్షిణప్రాంతంలో ఒక రహస్యసంఘాన్ని స్థాపించాడు. అందులో చిదంబరంపిళ్ళ అనేన్యాయవాది, సుబ్రహ్మణ్యశివం, నీలకంఠబ్రహ్మ చారి, వి. వి. యస్. అయ్యర్ మొదలైనవారు సభ్యులయ్యారు. చిదంబరంపిళ్ళ న్యాయవాదివృత్తినివదలి, స్వదేశీఉద్యమాన్ని ప్రచారంచేస్తూ, ఒక స్వదేశీనౌకా కంపెనీని 10లక్షల మూలధనంతో స్థాపించాడు. ఈలాటి భారతీయకంపెనీలలో ఇదే మొదటిది. కాని ప్రభుత్వందీనికి ప్రోత్సాహం కల్పించనికారణంగాను, అదివరకే తీరవ్యాపారంలో పాతుకొనిపోయిన విదేశీకంపెనీల పోటీమూలానను ఇది చాలాకాలం పనిచేయలేకపోయింది. ప్రథమదశలో ఇతడూ, రహస్యసంఘంలోని ఇతరులూ స్వదేశీఉద్యమ ప్రచారంలోనే ఎక్కువశ్రద్ధవహించారు.

1907లో బిపిన్‌చంద్రపాల్ మద్రాసులోని కోస్తా ఆంధ్రజిల్లాలలో పర్యటననుసాగించి, విశాఖపట్టణం, కాకినాడ, రాజమండ్రి, విజయవాడ, బందరు మొదలైన నగరాలలో స్వరాజ్య సంపాదనావశ్యకతనుగురించి, బహిష్కరణ స్వదేశీఉద్యమాలగురించి. జాతీయవిద్యనుగురించి ఉద్రేకపూరితములైన ఉపన్యాసాలుచేసి ప్రజలను జాతీయ ఉద్యమాభిముఖులుగ చేయగలిగాడు. ఇతనిపర్యటన ఫలితంగా వందేమాతరనినాదం సర్వత్రా మారుమ్రోగసాగింది. కాకినాడలోని ప్రజలు తెల్లవారి క్లబ్బుపై దాడిచేయడం, అందుకుగాను అనేకులపై ప్రభుత్వం నేరారోపణచేసి శిక్షించడం, పట్టణంలోకి ప్రత్యేక పోలీసుదళాన్ని తెప్పించి,దాని ఖర్చులను ప్రజలనుండి వసూలుచేయడం మొదలైనసంఘటనలు సంభవించాయి. రాజమండ్రి కళాశాలలోనివిద్యార్థులు ప్రిన్సిపాలును ప్రతిఘటించి వందేమాతర పతకాలనుధరించడం, శిక్షాపాత్రులుకావడం జరిగింది. క్రైస్తవకళాశాలలో విద్యార్థిగాఉండిన గాడిచెర్ల హరిసర్వోత్తమరావు కళాశాలనుండితొలగింపబడడం భవిష్యత్తులో ఏలాటి ప్రభుత్వోద్యోగానికి అర్హుడుకానట్లు ప్రకటింపబడడంజరిగింది. ఈలాటి అవాంఛనీయ పరిణామాలతోకూడా పాల్ పర్యటనమూలంగా నిర్మాణాత్మకమైన పరిణామాలు సంభవించాయి. పట్టణాలన్నిటిలో స్వదేశీవస్తువుల విక్రయశాలలు ఏర్పడినాయి. విద్యార్థులను సాంకేతికవిద్యను నేర్చుకొనుటకై విదేశాలకుపంపి, వారు తిరిగివచ్చినతర్వాత కొన్ని స్వదేశపరిశ్రమలను స్థాపించేప్రయత్నం కార్యరూపంధరించింది. బందరులో కోపల్లె హనుమంతరావు తనజీవితాన్ని జాతీయవిద్యావ్యాప్తికి అంకితంచేసి జాతీయకళాశాలనుస్థాపించడం కూడా పాల్ పర్యటనఫలితమే. జాతీయరాజకీయాలపట్ల ప్రజలు ఆసక్తిగలవారయ్యారు. అందుకుగాను ముట్నూరికృష్ణారావుకృష్ణాపత్రికనుప్రత్యేకంగా వినియోగించాడు. హరిసర్వోత్తమరావు రాజకీయరంగంలోను, గ్రంథాలయోద్యమంలోను వయోజన విద్యావ్యాప్తిలోను ఘనమైన కృషిగావించి పేరుప్రఖ్యాతులు సంపాదించినాడు.

పాల్ సాయుధపోరాటంపట్ల విముఖత్వం వహించినవాడు. అందుచేత

అతని పర్యటనమూలంగా బెంగాలులోని విప్లవవాదుల కార్యక్రమాలు ఆంధ్ర ప్రదేశంపై ఏలాటిప్రభావం వహించలేదు. 1908 ప్రాంతాన విప్లవపక్షానికి చెందినవారు ఆంధ్రదేశానికివచ్చి బాంబులను తయారుచేసే కార్యక్రమంలో ఆంధ్రులు పాల్గొనవలసినదిగా ప్రముఖులు కొందరితో సంప్రతింపులు జరిపినట్లు ఒక ప్రతీతికలదు. కాని ఇది ఎంతవరకు విశ్వసనీయమో చెప్పుట సాధ్యంకాదు.

తిరునల్వేలి జిల్లాలో సాయుధవిప్లవాన్ని చిదంబరపిళ్లె బృందం తలపెట్టింది. అందుకుగాను అతడు వివేకవాణి అనే తమిళపత్రికను, నీలకంఠ బ్రహ్మచారి సూర్యోదయమనే ఇంకొక పత్రికను, ఇండియా అనే మరియొక పత్రికను ప్రకటించారు. ఇండియా పత్రికలో రాజద్రోహాన్ని పురికొల్పే రచనలనేకం ఉన్నట్లు భావించి ప్రభుత్వం దానిని అచ్చువేస్తూఉండిన శ్రీనివాసయ్యంగారుకు 5 సంవత్సరాల ద్వీపాంతరవాస శిక్షను విధించింది. అటుతర్వాత పత్రిక పుదుచ్చేరి నుండి ప్రకటింపబడేది. ఆరోజులలో ఫ్రెంచిస్థావరమైన పుదుచ్చేరి విప్లవభావాలు కలవారిలో అనేకులకు కేంద్రంగా ఉండేది. సుప్రసిద్ధ తమిళ జాతీయకవి సుబ్రహ్మణ్యభారతి ఈలాటివారిలో ఒకడు. అతడుకూడా అనేక పత్రికలను స్థాపించి విప్లవభావాలను ప్రచారంచేశాడు.

1908 లో రాజద్రోహ నేరాన్ని ఆరోపిస్తూ చిదంబరపిళ్లను సుబ్రహ్మణ్యశివం మొదలైన నాయకులను అరెస్టుచేయగా తిరునల్వేలి, ట్యూటికోరిన్‌లలోని ప్రజలు తిరుగుబాటుచేసి, ప్రభుత్వ భవనాలను దగ్ధంగావించి, చాలా ఆస్తి నష్టాన్ని కలిగించారు. అప్పుడు జిల్లా జాయింటు మెజిస్ట్రేటుగా ఉండిన ఆష్ కాల్పులు జరపవలసిందిగా పోలీసువారికి ఉత్తరువులు జారిచేయగా కాల్పులలో కొందరు మరణించారు. విచారణ ఫలితంగా చిదంబరపిళ్లకు సుబ్రహ్మణ్యశివంకు యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షను విధించారు కాని హైకోర్టు దీనిని ఆరు సంవత్సరాలకు తగ్గించింది.

ఈ కాల్పులను నిరసిస్తూ హరి సర్వోత్తమరావు విజయవాడలోని తన స్వరాజ్యపత్రికలో ఒక వ్యాసం వ్రాసినందుకు రాజద్రోహనేరానికై అరెస్టయ్యాడు. బందరు జిల్లా కోర్టులో విచారణజరిగి ఆరు నెలలశిక్ష విధించబడింది. కాని ప్రభుత్వం ఇది చాలా స్వల్పశిక్ష అని భావించి హైకోర్టుకు అపీలుచేయగా ఇది మూడు సంవత్సరాలకు పొడిగించబడింది.

తర్వాత కొంతకాలానికి నీలకంఠబ్రహ్మచారి, వంచుఅయ్యర్ మరి కొందరు భారతమాత సంఘం అనేపేర ఒక విప్లవసంఘాన్ని స్థాపించారు వీరికి కాళి ఆరాధ్యదేవత. వీరు జిల్లాలోని బ్రిటిష్ అధికారులను హత్యజేయ నిర్ణయించుకొన్నారు 1911 జూన్‌లో కలెక్టరుగా ఉండిన ఆష్‌ను వంచుఅయ్యర్ హత్యజేశాడు. ఉరిశిక్షను తప్పించుకొనుటకు వెంటనే ఆత్మహత్య చేసుకొన్నాడు తక్కినవారిని హత్యజేయుటకుముందే ప్రభుత్వం వీరందరిపై — 14 గురుపై —తిరునల్వేలి కుట్రకేసును పెట్టింది. నీలకంఠబ్రహ్మచారికి 7 సంవత్సరాల కఠినశిక్షను విధించారు తక్కినవారికికూడా శిక్షను విధించారు ఇంతటితో

మద్రాసు రాష్ట్రంలోని విప్లవఉద్యమం అంతరించింది మితవాదతత్వానికి ప్రసిద్ధి గాంచిన మద్రాసురాష్ట్రంలోకూడా ఈ ఉద్యమం వ్యాపించడం గుర్తించవలసి ఉంది. అందుచేతనే దీనిని గురించి విపులంగా వివరించాము.

పంజాబులోకూడా 1904నుండి ఈఉద్యమంవ్యాపించింది. విప్లవానికంతా ప్రజల అసంతృప్తి మూలకారణం. 1900 తర్వాత వరుసగా మూడుసంవత్సరాలలో క్షామంసంభవించడంచేతను, ప్లేగువ్యాధి వ్యాపించడంచేతను, ప్రభుత్వం బాధితులకు తగిన సహాయం చేయకపోవడంచేతను, లక్షలాదిజనం ప్రాణనష్టానికి గురిఅయ్యారు. దీనికితోడు ఆరోజులలోనే ప్రభుత్వం భూమిశిస్తునుపెంచింది. భూసంస్కరణలనేపేరుతో చాలాకాలాననుండి రైతులు అనుభవిస్తున్న హక్కులకు భంగంకలిగించింది. వీటిని నిరసిస్తూ సభలుజరిపిన నాయకులను పత్రికాసంపాదకులను కఠినంగాశిక్షించింది. రావల్పిండి, లాహోరు మొదలైన నగరాలలో 1907-8న ప్రజలు అల్లరులలోకిదిగి, భవనాలు మొదలైన ఆస్తికి విపరీతనష్టం కలిగించారు. 1857-58 తిరుగుబాటుకు 50వ వర్ధంతిని తలపెట్టి అలాంటితిరుగుబాటునేచేయుటకు ప్రజలు ప్రయత్నిస్తున్నారనే భయసందేహాలతో అనుమానాస్పదులపై మరింతకఠినంగా ప్రభుత్వం ప్రవర్తించింది. 1907లో ఈ కారణం చేతనే లజపతిరాయ్ అజిత్‌సింగులను ఏలాంటివిచారణలేక బర్మాలో నిర్బంధించి ఆరు మాసాలతర్వాత విడుదలచేసింది. బెంగాలురాష్ట్ర విభజనఫలితంగా బయలుదేరిన బహిష్కరణ స్వదేశీ ఉద్యమాలు పంజాబుకు వ్యాపించి ప్రజలతిరుగుబాటు ధోరణిని మరింత వృద్ధిచేశాయి.

ఈలాంటిపరిస్థితులను ఆధారంచేసుకొని, సాయుధపోరాటాన్ని సాగించ నిర్ణయించుకొన్న విప్లవకారులు 1904లో షహరన్‌పూరుజిల్లాలో ఒక రహస్య సంఘాన్ని స్థాపించారు. తర్వాత రూర్కీ దానికి ప్రధానకేంద్రమైంది. అక్కడి ఇంజినీరింగు కళాశాల విద్యార్థులనేకులు అందులో సభ్యులయ్యారు. భవిష్యత్తులో విప్లవనాయకుడుగా ప్రసిద్ధిగాంచిన హారిదయాళ్ ఇందులోసభ్యుడై దానిపై నాయకత్వంవహించాడు. అజీత్‌సింగ్ సూఫీ, అంబాప్రసాద్ అతనితో సహకరించారు. 1909లో హారిదయాళ్ అమెరికాకువెళ్ళినతర్వాత దీననాద్, రాష్‌బిహారీబోసులు దాని కార్యక్రమాలను సాగించారు. ఆయుధాలసేకరణ, బాంబులనుతయారుచేయడం, అధికారులను హత్యగావించడం దీనికార్యక్రమాలలో ప్రాధాన్యంవహించాయి. 1912లో హార్డింజిప్రభువుపై బాంబుప్రయోగం రాష్‌బిహారీబోసు అధ్వర్యంలోనేజరిగింది. 1913లో లాహోరులో ఉన్నతాధికారిగాఉండిన గార్డన్‌పై బాంబుప్రయోగ సన్నాహంచేసినవాడుకూడా ఇతడే.

మొదటినుండి ఇతడు విప్లవోద్యమంలో బిరేంద్రుడు, జతిన్‌బ్యానర్జీ, జతిన్ ముఖర్జీ మొదలైనవారితో సమానమైనపాత్రను నిర్వహించి, ఉత్తరప్రదేశ్, వారణాసి, ఢిల్లీ, పంజాబు ప్రాంతాలలో గొప్ప కృషిగావించినా, పోలీసువారి చేతులలోపడక తప్పించుకొనుటలో అద్వితీయమైన నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. అలీపూరు కుట్రకేసుసమయాన బెంగాలునువదలి, డెహరాడూన్ (ఉత్తరప్రదేశ్) లో

ప్రభుత్వఅటవీశాఖలో ఉద్యోగాన్ని సంపాదించాడు. అక్కడనివసిస్తున్న ప్రఖ్యాత టాగూరుకుటుంబంలోని పిల్లలకు ఉపాధ్యాయుడుగాపనిచేశాడు. ఉన్నతపోలీసు అధికారులతో సంబధం కలవాడై కొంతకాలం వారివిశ్వాసానికి పాత్రుడయ్యాడు. హార్డింజిహత్యకు సన్నాహంచేసి, విశ్వాస్ అనేవానిని బాంబుప్రయోగానికి నియోగించి, అదిజరిగినతర్వాత రెండురోజులకు డెహరాడూన్‌లో దానిని నిరసిస్తూ హార్డింజి తప్పించుకొన్నందుకు సంతోషాన్ని వెలిబుచ్చుటకు ఒక బహిరంగ సభను సమావేశపరచి, అధ్యక్షుడుగా దానినిజరిపాడు తర్వాత కొన్నాళ్ళకు విశ్రాంతినిమిత్తం హార్డింజి డెహరాడూన్‌కు వచ్చినప్పుడు అతనికి స్వాగతం చెప్పాడు, తర్వాత అతనిప్రవర్తనను పోలీసులు తెలుసుకొని వారణాసి, ఢిల్లీ, లాహోరు కుట్రకేసులలో అతనినికూడాచేర్చినా, ఏలాగో వారికండ్లలో దుమ్ముపోసి, అదృశ్యుడై జపాన్ చేరాడు. అందుచేతనే అతని నైపుణ్యం అందరిప్రశంసలకు పాత్రమైంది.

ఢిల్లీ కుట్రకేసులో నలుగురికి ఉరిశిక్షను, ఇద్దరికి యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్షను విధించారు. లాహోరుకుట్రకేసులో అనేకులు ఉరిశిక్షకు, ద్వీపాంతరవాసశిక్షలకు పాత్రులయ్యారు. ఈకుట్రకేసులో ప్రపంచ సంగ్రామకాలంలో విదేశాలనుండి సాయుధపోరాటాన్ని సాగించ తలపెట్టిన భారతీయులనేకులు శిక్షలకు పాత్రులయ్యారు. విప్లవ ఉద్యమంలో వారువహించినపాత్ర ఏలాటిదో ఇప్పుడుమనం తెలుసుకొనవలసిఉంది.

## 6

పరాయిపరిపాలనను తొలగించి దేశస్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు విదేశాలలో ప్రజలు భారీయెత్తున యుద్ధాలుచేయడం ప్రధానసాధనమని ప్రపంచ చరిత్ర సాటిస్తున్నది అరవిందుడు, బిరేంద్రుడు మొదలైన విప్లవవాదులకు ఇది తెలియని విషయంకాదు. కాని బ్రిటిష్‌ప్రభుత్వం భారతీయులను నిరాయుధులుగాచేసింది. వారికితగిన పరిమాణంలో ఆధునిక ఆయుధాలను అందజేసి, వాటిని ఉపయోగించుటను కావలసిన శిక్షణను వారికినేర్పుట, అటుతర్వాత యుద్ధాన్నిసాగించుట ఆచరణసాధ్యం కాదనేభావంతో వారు బాంబులతయారు చేసి అధికారుల హత్యచేయుటకు, వారి కార్యక్రమాలకు కావలసినధనాన్ని దోపిడీలమూలంగా సంపాదించుటకు నిర్ణయించుకొన్నారు. ఇది గుడ్డిలోమెల్ల అనేభావంతో వారుప్రవర్తించారు. ఈకార్యక్రమం కొంతవరకుకొనసాగినా, దీనిమూలంగా పరాయిపరిపాలన నిర్మూలమయ్యేసూచనలు కనుపించలేదు. అందుచేత భారీయెత్తున సాయుధపోరాటాన్ని సాగించడమొక్కటే వాంఛనీయమనే భావం అనేకులకు కలిగింది. విదేశాలలో ఉండిన భారతీయులలో ఇది ఎక్కువగా నాటుకొన్నది. అందుకుగాను వారు అనేకప్రయత్నాలు చేశారు.

దేశస్వాతంత్ర్యానికి పాటుబడినవారు విదేశాలలో ఆశ్రయంసంపాదించి తమకార్యక్రమాలను సాగించడంకూడా చరిత్రప్రసిద్ధమే. ఇటలీ స్వాతంత్ర్యానికి

పాటుబడిన శ్యాజిని బ్రిటన్‌నుండి తనకార్యక్రమాలను సాగించాడు. రషియాలోని విప్లవకారులుకూడా అలాగే ప్రవర్తించారు. కమ్యూనిస్టుతత్వాన్ని ప్రచారంచేసినమార్క్సు, ఎంగెల్సులు బ్రిటన్‌నుండియే తమప్రచారాన్ని సాగించారు. ఈలాంటివారికి బ్రిటన్ ఆశ్రయమిచ్చి అంతర్జాతీయరంగంలో గొప్ప ప్రఖ్యాతిని సంపాదించింది.

విదేశాలలోని భారతీయులుకూడా ఈ మార్గాన్నే అనుసరించారు. భారతదేశంలో విప్లవఉద్యమాన్ని తలపెట్టినవారు అనేకపర్యాయాలకు పోలీసు బాధలకు గురిఅయ్యారు. అధికసంఖ్యలో జైళ్లలో నిర్బంధితులై, నరకబాధలను అనుభవించారు. విదేశాలలో అలాంటి బాధలకు లోనుగాక స్వేచ్ఛగా తమ కార్యక్రమాలను సాగించడం సాధ్యమైంది. ఇదిగాక బ్రిటిష్ పరిపాలనలోని నిరంకుశత్వాన్ని, స్వార్థాన్ని విదేశాలవారికి తెలియపరచుటకు స్వాతంత్ర్యోద్యమంపట్ల వారి సానుభూతిని సంపాదించుటకు విదేశాలలోని భారతీయులకు ఎక్కువ అవకాశం లభించింది. ఇందుచేతనే వారు వారి కార్యక్రమాలకు విదేశాలను కేంద్రంగా చేసుకొన్నారు.

ఈలాంటి వారిలో ప్రథమంగా పేర్కొనవలసినవాడు శ్యాంజీకృష్ణవర్మ. ఇతడు భారతదేశంలోను, ఇంగ్లండులోను ఉన్నతవిద్య నభ్యసించి బారిష్టరు పరీక్షలో ఉత్తీర్ణుడై స్వదేశానికివచ్చి కొన్ని సంస్థానాలలో ఉద్యోగంచేసి, అక్కడి బ్రిటిష్ రెసిడెంట్ల (British Residents) నిరంకుశత్వాన్ని నిరసిస్తూ, దేశానికి స్వాతంత్ర్యం లభించినగాని ముక్తిలేదనే విప్లవభావంతో 1897 లో బ్రిటన్ నివాసిఅయ్యాడు. విప్లవభావాలను ప్రచారంచేసే నిమిత్తం ఇండియా హౌస్ (India House) ను కేంద్రంగాచేశాడు. ఇండియన్ సోషియాలజిస్టు (Indian Sociologist) అనే పత్రికను నడిపాడు. భారతదేశ పరిస్థితులను గురించి ఉపన్యాసాలు చేయగల యువకులను ఆకర్షించే ఉద్దేశంతో కొన్ని విద్యార్థి వేతనాలను ప్రవేశపెట్టాడు. ఇందులో అతనితో సహకరించిన వారిలో వినాయక సావర్కారు, హారిదయాళ్, మదన్‌లాల్ ధింగ్రా ప్రధానంగా పేర్కొనదగినవారు. ఇతడు స్వాతంత్ర్య సంపాదనార్థం సాత్వికనిరోధాన్ని వినియోగించవలసిందిగాను, అవసరమైనపక్షంలో దౌర్జన్యపూర్వకమైన కార్యక్రమాలనుకూడా వినియోగించవచ్చునని ప్రతిపాదించాడు.

ఇతని కార్యక్రమాలు బ్రిటిష్ అధికారులకు నచ్చలేదు. వారు ఇతనిపై కఠినచర్యలు తీసుకొనుటకు సంకల్పించగా ఇతడు ఫ్రాన్సులోని ప్యారిస్‌నగరాన నుండి తన కార్యక్రమాలను సాగించాడు. అప్పటికే అక్కడ పార్సీ వనితె కామా, సర్దార్ రాణా ఈలాంటి కార్యక్రమాన్నే సాగిస్తూఉండినారు. వీరందరు కలిసి ప్యారిసును భారతీయ విప్లవానికి ఒక కేంద్రంగా రూపొందించారు.

లండన్‌లోని ఇతని ఇండియా హౌసులో కృషిచేసిన సావర్కారు ధింగ్రాల గురించి ఇదివరకే తెలుసుకొన్నాము. వీరికి సహచరుడైన హారిదయాళ్ పంజాబు విశ్వవిద్యాలయ విద్యార్థులలో గొప్పప్రతిభాశాలి అనే విఖ్యాతినిగాంచి

ప్రభుత్వం ఇచ్చిన విద్యార్థి వేతనాన్ని ఆధారంచేసుకొని ఉన్నతవిద్య నిమిత్తం బ్రిటన్‌లోని ఆక్సఫర్డు విశ్వవిద్యాలయానికి 1905లో వెళ్ళాడు. అప్పటికే అతనిలో విప్లవభావాలు అంకురించిఉండినవి. కృష్ణవర్మతోటి సంపర్కం మూలాన అవి మరింత ప్రాబల్యంగాంచాయి. 1906 లో విద్యార్థివేతనాన్ని వదలుకొని పంజాబుకు తిరిగివచ్చి విప్లవసంఘంలో చేరాడు. పోలీసు అధికారులు అతనిపై చర్యలు తీసుకొనదలచినట్లు వదంతులు బయలుదేరగా అతడు 1909లో అమెరికాకు వెళ్ళిపొయ్యాడు.

## 7

అప్పటికి అమెరికాలో సుమారు 30,000 భారతీయులు ఉండేవారు. వీరిలో అధికసంఖ్యాకులు శిక్కులు. పంజాబులో వీరికి తగినజీవనాధారం లభించనికారణంగా వీరు కార్మికులుగా పనిచేయుటకు అమెరికాకు వెళ్లారు. అక్కడ వీరికి ఎక్కువ వేతనాలు లభిస్తూవచ్చాయి. వీరు పొదుపుగాజీవిస్తూ ధనాన్నికూడ బెట్టుకొని అప్పుడప్పుడు పంజాబులోని తమ బంధువులకు సహాయంచేయ గలిగారు.

కాని అమెరికాలోని తెల్లకార్మికులు వీరిపట్ల ద్వేషభావం వహించారు. వీరు తెల్లవారికంటె తక్కువ వేతనాలతో తృప్తిపడడంచేత తెల్లకార్మికుల ఉద్యోగావకాశాలు తగ్గడం దీనికి ప్రధానకారణం. ఇదిగాక వీరిపట్ల తెల్లవారందరు చులకనభావంతో ప్రవర్తించసాగారు. వీరిని వారు బానిసలకంటె హీనంగా పరిగణిస్తూ, వీరిని అస్పృశ్యులవలె భావించడం పరిపాటిఅయింది. వీరు పరాయి పరిపాలనకు లోబడిన జాతివారని, ఆత్మగౌరవంలేనివారని, స్వేచ్ఛఅంటె ఏమో తెలియనివారని, మానవత్వంలేనివారని అవమానపరుస్తూ ఉండేవారు. ఈలాటి అవమానాలు శిక్కులకు తదితరభారతీయులకు దుర్భరమైనాయి. తమదేశానికి స్వాతంత్ర్యం లేకపోవడంచేతనే తమ్ము తెల్లవారు ఈలాగు అవమానిస్తున్నారనే భావం వీరిలో ఏర్పడింది. తమదేశానికి స్వాతంత్ర్యం సంపాదించడమే తమ కర్తవ్యంగా వీరు భావించారు.

ఈలాటి భావసంచలనం వీరిలో కలిగినసమయంలో హారిదయాళ్ అమెరికాకు వెళ్ళాడు వీరిని సుసంఘటితపరచి వీరిసహాయాన భారతదేశంలో విప్లవోద్యమాన్ని బలపరచడం సాధ్యంకాగలదనేనిర్ణయానికివచ్చాడు. అమెరికాలోని భారతీయులు ఇందులో ఇతనితో పూర్తిగా ఏకీభవించారు. తమకు తగిననాయకుడు లభించినందుకు వారు గర్వపడినారు.

అతని ప్రయత్నాలఫలితంగా 1913లో ఘదర్ (Ghadar) అనేపేరుతో ఒక విప్లవపార్టీ నిర్మాణమైంది. ఘదర్ అంటె తిరుగుబాటు అనిఅర్థం. భారతదేశంలో పాలిస్తున్న బ్రిటిష్‌వారిపై తిరుగుబాటుకార్యక్రమాన్ని సాగించడమే దీనిలక్ష్యం. అది సాయుధపోరాటంద్వారామాత్రమే సాధ్యంకాగలదనీ దానికి తగినసన్నాహం చేయడం తమ కర్తవ్యమనీ ఘదర్‌పార్టీవారు నిర్ణయించు

కొన్నారు. ఇందుకుగాను హారిదయాళ్ ఘదర్ అనేపత్రికను స్థాపించాడు. భారతదేశ పరిపాలనలో బ్రిటిష్‌వారు అనుసరించిన నిరంకుశత్వాన్ని, స్వార్థాన్ని, దానిమూలంగా ప్రజలకు సంభవించిన కష్టనష్టాలనూ, స్వాతంత్ర్యసంపాదనా వశ్యకతనుగురించి ఈపత్రిక అమెరికాలో ప్రచారంసాగించింది. స్వాతంత్ర్యసంపాదనకు భారీయెత్తున సాయుధపోరాటాన్ని లేవదీయడం ఒక్కటె సాధనమనీ దానికికావలసిన సన్నాహాలను చేయడం అవసరమనీ ఇది ఉద్ఘాటించింది. దీనిని ఇంగ్లీషులోనేగాక హిందూస్థానీ, ఉర్దూ మొదలైనదేశభాషలలో ప్రకటించేవారు. అమెరికాలోని భారతీయులేగాక, తక్కిన విదేశాలలో నివసిస్తున్న భారతీయులు, భారతదేశంలోని ప్రజలు దీనిచే ఉత్తేజితులైనారు.

దీనిమూలంగా అమెరికాప్రజలలో భారతస్వాతంత్ర్యోద్యమంపట్ల సుముఖత్వంఏర్పడి అనేకులు ఘదర్‌పార్టీతో సహకరించారు.

తమ సాయుధపోరాట సన్నాహాలు ఫలప్రదం కాగలందులకు ఘదర్ పార్టీవారు భారతసైనికులలో తిరుగుబాటుధోరణిని బలపరచుట, అధికారులనూ వారికిసహాయవడే భారతీయులనూ హత్యచేయుట, జైళ్ళలో నిర్బంధితులైన వారిని విడుదలజేయుట. ప్రభుత్వఖజానాలను దోపిడీచేయుట, ఆయుధాగారాలపైదాడిచేసి ఆయుధాలనుసంపాదించుట, బ్రిటిష్‌వారికి శత్రువులైన జర్మనులు మొదలైనవారి సహాయాన్ని సంపాదించుట, విదేశాలనుండి ఆయుధాలను సేకరించుట, బాంబులనుతయారుచేయుట, రైళ్ళకు తంతితీగెలకు నష్టంకలిగించుట, విప్లవకార్యక్రమాలకు యువకులను ప్రోత్సహించుట మొదలగు అంశాలతో కూడిన ఒక బృహత్కార్యక్రమాన్ని రూపొందించి, అములుపరచసాగారు.

ఘదర్‌కార్యక్రమం బ్రిటన్‌లోని అధికారులకు ఎంతమాత్రంగిట్టలేదు. వారు అమెరికాప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి, హారిదయాళ్ అరెస్టుకు కుట్రపన్నారు. 1914 మార్చిలో అతడు అరెస్టయ్యాడు. కాని అతడు ఏలాగో తప్పించుకొని యూరపులోని స్విట్జర్లాండుకువచ్చి, జనీవానగరాననుండి తన విప్లవకార్యక్రమాలను సాగించ పూనుకొన్నాడు. అప్పటికేఅక్కడ విప్లవాభిముఖులైన శ్యాంజీ కృష్ణవర్మ, వీరేంద్రచటోపాధ్యాయ(సతీసరోజినీదేవి సోదరుడు), తారకనాథదాస్, చంపకరామన్‌పిళ్ళ, చంద్రచక్రవర్తి, బారక్‌తుల్లా మొదలైనవారు సమిష్టిగా విప్లవకార్యక్రమాలను సాగిస్తూఉండినారు. హారిదయాళ్ వారితోకలిశాడు.

## 8

1914 ఆగస్టులో ప్రథమ ప్రపంచసంగ్రామం ప్రారంభమైంది. జర్మనీ, ఆస్ట్రియా, టర్కీదేశాలు ఒకపక్షంలోను, బ్రిటన్, ఫ్రాన్సు, రషియాలు రెండవ పక్షంలోను చేరాయి. జనీవా, తదితర ప్రాంతాలలో ఉండిన విప్లవవాదులు జర్మన్‌రాజధానియైన బర్లినును తమకేంద్రంగా ఏర్పరచుకొని, భారతస్వాతంత్ర్య కమిటీ అనేపేరుతో ఒక కమిటీనిస్థాపించి, జర్మన్‌ప్రభుత్వ సహాయంతో భారతదేశంలో భారీయెత్తున సాయుధపోరాటాన్ని లేవదీయుటకు సంకల్పించి, అధి

కారులతో సంప్రతింపులుజరిపారు. అధికారులుకూడావీరిపట్ల సుముఖులయ్యారు. భారతదేశంలో బ్రిటిష్‌వారిపై తిరుగుబాటు జరిగినపక్షంలో బ్రిటన్‌దానిబలాన్ని కోల్పోగలదని, భారతదేశాననుండి యూరపులోని యుద్ధరంగాలకువచ్చే సిపాయి సైనికదళాలరాక ఆగిపోతుందని వారు భావించారు. భారతీయస్వాతంత్ర్య కమిటీకిచెందినవారు యూరపులోని భారతీయులందరు ఒక సైనికదళంగా ఏర్పడి జర్మనులకు సహాయపడేటట్లున్ను, ఖైదీలైన భారతసైనికులను జర్మన్ పక్షాన యుద్ధంచేయగలవారిగా ప్రోత్సహించుటకున్ను, జర్మనులసహాయంతో భారతదేశంలో పోరాటాన్ని సాగించుటకున్ను హామీఇచ్చారు. ఈవిధంగాపరస్పర సహాయంతో రెండుపక్షాలవారు వారివారి ఉద్దేశాలు నెరవేరగలదని ఆశించారు.

బర్లిన్‌కమిటీ చురుకుగా పనిచేయసాగింది. భారతదేశంలోను, ఇతరదేశాలలోనుఉన్న భారతీయవిప్లవవాదులతో సంప్రతింపులుసాగించి, అందరుకలిసి ఒక ప్రణాళికమేరకు సాయుధపోరాటంలో పాల్గొనవలసిందిగా సలహాఇచ్చింది. భారతదేశంలోని విప్లవవాదులకు కొంతధనాన్నిపంపి, జర్మన్ ఆయుధాలురాగలవని, అప్పటికివారు సాయుధపోరాటానికి సన్నాహాలుపూర్తిచేసుకొనవలసిందిగా ఆదేశించింది. కొందరు ఉద్యమవాదులను జపాన్, చైనా, ఫిలిప్పైన్స్, జావా, ఇండోచైనా, సయ్యాంలకుపంపి, అక్కడిభారతీయులు జర్మనులతో సహకరించి బర్మామీదుగాభారతదేశాన్నిప్రవేశించి. సాయుధపోరాటంలోపాల్గొనవలసిందిగా తెలియపరచింది.

కొందరు జర్మన్‌సైనికాధికారులు సైనికులు ఆయుధాలనుతీసుకొని, అండమాన్ ద్వీపాలను వశపరచుకొని, అక్కడి ఖైదీలనువిడుదలచేయుటకున్నూ ఇంకొక జర్మన్‌నౌక ఆయుధాలతో బెంగాలుచేరుటకున్నూ, మరియొకటి ఆయుధాలతో పశ్చిమతీరాన్ని చేరుటకున్నూ బర్లిన్‌కమిటీ ఏర్పాటులుచేసింది.

ప్రపంచసంగ్రామం ప్రారంభంకాగానే రాజామహేంద్రప్రతాప్ బర్లిన్ చేరి భారతస్వాతంత్ర్యకమిటీ సహాయంతో చక్రవర్తిని కలుసుకొని జర్మనులు సహాయంచేసినపక్షాన భారతదేశంలో సాయుధపోరాటాన్నిసాగించడం సులభ సాధ్యమని విన్నవించాడు. చక్రవర్తి సహాయంచేయుటకు అంగీకరించాడు. అటుతర్వాత ఉన్నత జర్మన్‌అధికారులు ఆఫ్‌గన్‌రాజునకు, భారతదేశంలోని కొందరు సంస్థానాధీశులకు, నేపాలుమహారాజునకు ఇచ్చిన ఉత్తరాలతో మహేంద్రప్రతాప్, బారకతుల్లా మొదలైనవారితోకలసి ఆఫ్‌గనస్థానానికి ప్రయాణమై మార్గంలో టర్కీసుల్తానుమకలిసికొని ఆఫ్‌గనురాజుకు అతడు వ్రాసిన ఉత్తరాన్నికూడాతీసికొని ఇరాన్‌మీదుగా ప్రయాణంచేసి 1915 అక్టోబరున కాబూలుచేరాడు.

ప్రథమంలో ఆఫ్‌గన్‌రాజు మహేంద్రప్రతాప్‌పట్ల సుముఖుడు కాకపోయినా, తర్వాత తన అభిప్రాయాన్ని మార్చుకొని, భారత స్వాతంత్ర్య సంపాదనలో అతనికి సహాయం అందజేయుటకు హామీ ఇచ్చాడు. అప్పటికి భారతదేశంలోని ముస్లిం నాయకులు కొందరు— ప్రధానంగా దేవబందులోని

మత ప్రచార సంఘానికి చెందిన జబిదుల్లా, మౌలాన మహమ్మద్ హసన్, అన్‌సారి — పశ్చిమ ఏషియాలోని ఇస్లాం దేశాలలో పర్యటనను సాగిస్తూ ఉండినారు. వారు అరేబియాలో టర్కీ అధికారులను కలుసుకొని భారతదేశంలోని ముస్లింలు బ్రిటిష్‌వారిపై మతయుద్ధాన్ని చేయడం కర్తవ్యమని వారు వ్రాసి ఇచ్చిన లేఖను భారతదేశంలోని ఒకనికి పంపినారు. కాని ఆ లేఖను అతడు అధికారులకు అందజేయడంతో వారి ఉద్యమ స్వభావం ప్రభుత్వానికి తెలిసింది. దానిని ప్రతిఘటించుటకు వారు సకాలంలో కొన్ని చర్యలను తీసుకొనగలిగారు. పశ్చిమ ఏషియాలో పర్యటిస్తున్న మరికొందరు ఉద్యమ నాయకులు అక్కడ ఆనాడు టర్కీతో యుద్ధంచేస్తూఉన్న సిపాయీలతో సంబంధం పెట్టుకొని వారు తిరుగుబాటు చేయవలసిందిగా ప్రచారం చేయుటకు ప్రయత్నించారు. వీరిలో మద్రాసుకు చెందిన తిరుమలాచారి బెంగాలుకు చెందిన బిరేన్‌దాస్‌గుప్త సూయజ్‌కాలువను ఈది ఈజిప్టులో ఉండిన సిపాయి దళాలను కలుసుకొనుటకు ప్రయత్నించారు. వీరి ప్రయత్నం కొనసాగలేదు. కాని ఆనాటి విప్లవకారుల సాహసం ఏలాటిదో ఇది వ్యక్తంచేస్తూ ఉన్నది.

ఆనాడు అరబ్‌జాతికి చెందిన దేశాలన్నీ టర్కీ సుల్తానుల పాలనలో ఉండేవి. కాని అరబ్బులకు వారి పరిపాలన గిట్టలేదు. వారు సుల్తానుపై తిరుగుబాటు సన్నాహాలు చేస్తూ వచ్చారు. ముస్లిం పవిత్ర స్థలాలైన మక్కా మదీనాలపై అధికారంవహిస్తున్నవారు ఈ సన్నాహాలలో బ్రిటిష్‌వారి సహాయాన్ని సంపాదించి వారితో కలిసిపొయ్యారు. ఈ కారణంచేత భారతదేశంలోని ముస్లింలకు వారి సహాయం లభించలేదు.

ఆఫ్‌గన్‌రాజుయొక్క సహాయాన్ని పొందిన మహేంద్రప్రతాప్ తన అనుచరులతో కాబూలులో స్వతంత్ర భారతానికి తాత్కాలిక ప్రభుత్వాన్ని 1915 ఆఖరున ఏర్పాటు చేశాడు. అందులో అతడు అధ్యక్షుడుగాను, బారక్‌తుల్లా ప్రధానిగాను, ఒబిదుల్లా విదేశ వ్యవహారాల మంత్రిగాను కృషిచేశారు. వారు టర్కీ, రషియా దేశాలప్రభుత్వాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినారు. భారతదేశంలోని సంస్థానాధీశులకు నేపాలు మహారాజుకు జర్మన్‌చక్రవర్తి ఇచ్చిన ఉత్తరాలను పంపినారు. కాని ఏలాటిలాభం లేకపోయింది. మరి కాబూలులో ఉండడం ప్రయోజన రహితమనే భావంతో మహేంద్రప్రతాప్ తిరిగి బర్లిన్ చేరాడు. ఇంతటితో ఆఫ్‌గన్‌స్థానంలోను, పశ్చిమ ఏషియాలోను భారతీయుల విప్లవ ఉద్యమం ఆగిపోయింది.

## 9

1914లో హారిదయాళ్ అమెరికాను వదలి యూరపుకు వెళ్ళిపోయిన తర్వాత ఘదర్ కార్యక్రమాల నన్నిటినీ రామచంద్రభరద్వాజ్ సమర్థవంతంగా జరిపాడు. బర్లిన్ కమిటి ఆదేశానుసారం అమెరికాలోని జర్మన్ రాయబార వర్గంతో భారతదేశానికి ఆయుధాలనుపంపేవిషయంలోనూ ప్రతింపులు సాగించాడు.

కొంతకాలం తర్వాత బర్లిన్ కమిటి ఇందుకుగాను మొదట హిరాంబులాల్ గుప్తాను అటుపిమ్మట చంద్రచక్రవర్తిని నియమించింది. వీరందరిమధ్య పూర్తి సహకారం లేనికారణంగా ఘదర్ కార్యక్రమాలు కుంటుబడినవి. ఇంతేగాక పసిఫిక్ తీరంలోని శిక్కులు కొందరికి లంచాలుఇచ్చి బ్రిటిష్ అధికారులు భారతీయులమధ్య చీలికలు కల్పించారు. ఇదికూడా ఘదర్ పార్టీ బలహీనతకు కారణమైంది. కాని జర్మన్ రాయబారవర్గం, పైన వివరించినట్లు ఆయుధాలను భారత దేశానికి పంపే ప్రయత్నాన్ని చురుకుగా సాగించింది.

ఈ ప్రయత్నాలు ఫలప్రదం కాకపోవుటకు కారణమైన ఇంకొక ఉదంతాన్నికూడా ఈ సందర్భంలో ప్రస్తావించవలసి ఉంది. అమెరికాలోని భారతీయులు దేశ స్వాతంత్ర్యానికై పాటుబడుచుండినట్లే, యూరపుఖండంలో ఆస్ట్రియా పాలనకు అనేకశతాబ్దాలుగా లోబడిన జెక్కులు (Czechs) కూడా అమెరికాలో అలాటి ప్రయత్నాలు చేస్తూవచ్చారు. వీరూ భారతీయులూ అప్పుడప్పుడు కలుసుకొంటూ ఒకరి ప్రయత్నాలు ఇంకొకరికి తెలియజేస్తూ ఉండేవారు. దీని మూలంగా జర్మనులు భారతదేశానికి ఆయుధాలను పంపదలచిన రహస్యం జెక్కులకు తెలియవచ్చింది. ఆస్ట్రియన్ల పక్షం వహించిన జర్మనులు జెక్కులకు బద్ధ విరోధులు. ప్రపంచ సంగ్రామంలో వారు విజయాన్ని సంపాదించడం వారికి అంగీకారయోగ్యం కాలేదు. బ్రిటిష్‌వారి విజయాన్నే వారు వాంఛించారు. ఈ పరిస్థితులలో వారు జర్మనులు భారతదేశానికి ఆయుధాలను పంపుటకు చేసే రహస్య ప్రయత్నాన్ని బ్రిటిష్ అధికారులకు తెలియపరచారు. దాని ఫలితంగా పసిఫిక్ హిందూ మహాసముద్రాలలోని బ్రిటిష్ యుద్ధనౌకలు, చైనా, జపాన్, ఫిలిప్పైన్స్, జావా మొదలైనదేశాలలోని బ్రిటిష్ రాయబార వర్గాలు ఆయుధసామగ్రిని చేరవేయదలచిన నౌకలను సకాలంలో వశపరచుకొనడం సులభసాధ్యమైంది. ఈ విధంగా భారత విప్లవ ప్రయత్నం విఫలం కావడంలో జెక్కులుకూడా కొంత పాత్రను వహించారు.

1914-17 వరకు అమెరికా ప్రపంచ సంగ్రామంలో తటస్థంగా ఉండినందున భారతీయుల విప్లవ కార్యక్రమాలకు గొప్ప ఆటంకాన్ని కలిగించలేదు. క్రమక్రమంగా బ్రిటిష్ ప్రభుత్వం అమెరికా ప్రభుత్వంపై ఈ విషయంలో ఎక్కువ ఒత్తిడిని కలిగించింది. దానికిలోబడి, అమెరికన్ అధికారులు భారతీయ విప్లవవాదులు అంతర్జాతీయ స్మృతికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారనే నేరాన్ని ఆరోపించి చంద్ర చక్రవర్తి, రామచంద్ర భరద్వాజ్ మొదలైన 106 గురిపై కేసు పెట్టారు. చంద్ర చక్రవర్తి రహస్యాల నన్నిటిని బహిరంగపరచి స్వల్ప శిక్షతో తప్పించుకొన్నాడు. తక్కినవారిలో అధిక సంఖ్యాకులు గొప్ప శిక్షలను అనుభవించారు. 1917 ఏప్రిలు 7న అమెరికా బ్రిటన్‌పక్షాన్ని వహించి ప్రపంచ సంగ్రామంలో చేరిపోయింది. అటుతర్వాత బ్రిటిష్‌వారికి విరుద్ధంగా అమెరికాలో ఏలాటి చర్యలు తీసుకొనడం భారతీయులకు సాధ్యంకాలేదు. ఇంతటితో అమెరికాలోని విప్లవ కార్యక్రమాలు ఆగిపోయినవి,

ఈ సంఘటనలు జరుగుతున్న కాలంలో అమెరికాలో ఘదర్ పార్టీకి చెందిన శిక్కులు తదితరులు భారతదేశానికివెళ్ళి ప్రపంచ సంగ్రామకాలంలో అక్కడ సాయుధపోరాటాన్ని సాగించడం దేశవిముక్తికి ఒక్కటే ఉపాయమని, అందులో జర్మనుల సహాయం తమకు లభించగలదని భావించి అధిక సంఖ్యలో అమెరికాను వదలి భారతదేశానికి వెళ్ళారు. సముద్రప్రయాణ కాలంలో వీరు చైనా మొదలైన దేశాలలోని నౌకాశ్రయాలలో వారి నౌకలు చేరినప్పుడు అక్కడ నివసించే భారతీయులను కలుసుకొని వారుకూడా భారత దేశాన్ని చేర వలసిందిగా ప్రోత్సహించారు. కొన్ని నగరాలలో భారత సిపాయిదళాలను కలుసుకొని వారు తిరుగుబాటు చేయవలసిందిగా ప్రేరేపించారు. ఈ ప్రయత్నా లన్నిటి ఫలితంగా 1914, 1915 లలో విదేశాలనుండి భారతీయులు భారత దేశానికి వచ్చారు. వారిలో కొందరిని ప్రభుత్వం నిర్బంధించినా సుమారు అయిదారువేలు భారతీయులు ప్రధానంగా పంజాబును చేరగలిగారు. 1915లో వీరు సాయుధపోరాటానికై బృహత్ప్రయత్నం చేశారు.

ఈ కాలంలో సయాం (ఇప్పటి తైలాండు) లోను చైనాలోను ఉండిన జర్మనులూ భారతీయులూ బర్మాను ప్రవేశించి, అక్కడనుండి భారతదేశపు ఈశాన్యప్రాంతాలకువెళ్ళి బెంగాలులో యుగాంతర్ పార్టీవారు లేవదీయదలచిన సాయుధపోరాటంలో పాల్గొన ప్రయత్నించారు. కాని వీరి ప్రయత్నం కొన సాగలేదు. దీని ఫలితంగా అనేకులను ప్రభుత్వం అరెస్టుచేసి మాండలేకుట్ర కేసులో 1915–16 లో విచారణచేసి అనేకులకు శిక్షవిధించింది.

బర్మాపైనను అండమాన్సుపైనను దాడిచేసే కార్యక్రమాలలో సింగపూరులోఉన్న సిపాయీల దళం 1915లో చేసిన తిరుగుబాటు ఒకభాగం. వీరు తిరుగుబాటుచేసి, సింగపూరు నగరాన్ని వశపరచుకొని ఏడురోజులు దానిపై ఆధ్వర్యం వహించారు. అక్కడ నిర్బంధితులైన 300 జర్మనుల సహాయాన్ని కోరారు కాని వారు సహాయంచేయడానికి నిరాకరించారు. 7 రోజులు తర్వాత బ్రిటిష్ నౌకాదళంవచ్చి. తిరుగుబాటుదార్లను పట్టుకొని, సైనిక శిక్షాస్మృతి ప్రకారం వారిని విచారణచేసి, 41 రికి ఉరిశిక్షను 125 మందికి దీర్ఘకాల జైలు శిక్షను విధించింది. ఇంతటితో దూరప్రాచ్యంలోని జర్మనులూ భారతీయులు కలిసి తలపెట్టిన విప్లవఉద్యమం ఆగిపోయింది.

## 10

భారతదేశానికి ఆవల ఈలాటి కార్యక్రమాలు జరుగుతున్న కాలంలో దేశంలోపలి విప్లవకారులు వారి ప్రయత్నాలపట్ల మరింత శ్రద్ధనువహించారు. వీటికి బెంగాలు, పంజాబు రాష్ట్రాలు ప్రధాన కేంద్రాలైనాయి. అమెరికా నా ఘదర్ పార్టీకి చెందిన భారతీయులు అధిక సంఖ్యలో స్వదేశానికివచ్చి నేకులు పోరాటాన్ని సాగించుటకు నిర్ణయించుకొనడం, జర్మనులు ఆయుధ ధాలను జేయుటకు సిద్ధపడడం, వీరిని ఉత్తేజపరచాయి. బ్రిటిష్‌వారు లవదీయుటకు

మంలో మునిగియున్నప్పుడే దేశస్వాతంత్ర్యానికి బృహత్ప్రయత్నం చేయుటకు తగిన తరుణమని వీరు భావించారు. ఈ పరిస్థితులన్నిటి ప్రభావంచేత వారు 1915 లో భారీఎత్తున సాయుధపోరాటాన్ని లేవదీయసమకట్టారు.

బెంగాలులో ఈ ప్రయత్నాన్ని సాగించినవారు యుగాంతరపార్టీకి నాయకుడైన జతీన్‌ముఖర్జీ. అరవిందుడు, అతని తమ్ముడు బరీంద్రుడు రాజకీయ రంగాన నుండి నిష్క్రమించిన తర్వాత ఇతడు వారి స్థానంలో విప్లవ ఉద్యమానికి ప్రధాన నాయకుడయ్యాడు. ఇతడు గొప్ప మేధావి. ప్రఖ్యాతిగాంచిన భోలానందగిరి అనే సన్యాసికి శిష్యుడై ఆధ్యాత్మవిలువలపట్ల అత్యంత శ్రద్ధాభక్తులు కలవాడయ్యాడు. ఇతని సౌశీల్యము, దేశాభిమానము, దేశస్వాతంత్ర్య సంపాదనపట్ల దీక్ష, త్యాగశీలత ఇతనిని ఉద్యమంలో కృషిచేసే వారికేగాక రాష్ట్రంలోని ఇతర ప్రముఖులకుగూడ గౌరవపాత్రునిగ జేశాయి. ఇతనితో అన్నివిధాలా సమానుడైన జిడుగోపాల ముఖర్జీ ఇతనికి కుడిభుజమై ఇతనితో సహకరించి ఉద్యమ కార్యక్రమాలను నిర్వహించాడు.

ఇతడు జిల్లాలలో అదివరకు విప్లవ కార్యక్రమాలను స్వతంత్రంగా నిర్వహిస్తున్న విప్లవ బృందాలన్నిటినీ ఒక సుసంఘటిత పార్టీగా నిర్మాణం చేశాడు. అందరుకలిసి ఒక త్రాటిపైన నడుచుటకు సిద్ధపడినగాని సాయుధపోరాటాన్ని సాగించడం సాధ్యం కాదనే సత్యాన్ని గ్రహించి దానిని ఆచరణలో పెట్టాడు. దీనికి కావలసిన అంగబలం రాష్ట్రంలో సమృద్ధిగా ఉండినది. విజయానికి కావలసినది అర్థబలం, ఆయుధబలం. జర్మనులు వీటిని అందజేయగలరనే ఆశ విప్లవకారులందరిలో నాటుకొని ఉండినా, అదిలభించుటకు కొంతకాలం పట్టగలదని భావించి కొంత ధనాన్ని రాష్ట్రంలోనే సమకూర్చుకొనుటకు 1915లో అనేక దోపిడీలను చేయించాడు. వీటిలో టాక్సీ కారులను (Taxi cars) ఎక్కువగా ఉపయోగించాడు. వీటిమూలంగా కొన్ని లక్షలధనం సమకూరింది. ఈసందర్భంలో వీరిని ప్రతికూలించుటకు పూనుకొన్న పోలీసు అధికారులను అతిసాహసంతో హత్యగావించాడు. యుగాంతర్ పేరుతో అనేక కరపత్రాలను ప్రకటించి సాయుధపోరాటంలో పాల్గొనవలసిందిగా ప్రజలను ఉద్బోధించాడు. పార్టీ కార్యక్రమాలను వివరిస్తూ ప్రభుత్వం మామూలుగా విడుదలజేసే పరిపాలన నివేదిక మోస్తరుగా ఒక నివేదికను ప్రకటించాడు. తమది ఒక ప్రత్యామ్నాయ ప్రభుత్వం అనే భావంతో విప్లవకారులందరు ప్రవర్తించారు. తమ అధికారానికి చిహ్నంగా ఒకసీలు (seal) నుకూడా తయారుచేశారు. జర్మన్ ఆయుధాల సహాయంతో తాము తలపెట్టిన సాయుధపోరాటం విజయవంతం కాగలదనీ, దేశమాతకు విముక్తి కలుగుతుందని దృఢంగా విశ్వసించారు. ఈ విధంగా 1915 ప్రారంభంలో విప్లవ కార్యక్రమాలు ఉచ్ఛస్థాయిని అందుకొన్నవి.

బర్లిన్ కమిటీ అమెరికానుండి జర్మనులుపంపే ఆయుధాలను భారతదేశా[illegible]ంలో విప్లవనాయకులు కొందరు జావాద్వీపంలోను బటేవియానగరా[illegible]ం (ఇప్పటి తైలాండు) కూ వెళ్ళవలసిందిగా సలహా ఇచ్చింది.

దానిమేరకు జతీన్ ముఖర్జీ తనతో మొదటినుండి విప్లవకార్యక్రమాలలో సహకరిస్తున్న నరేన్ భట్టాచార్యాను (ఇతడే తర్వాతికాలంలో యం. యన్. రాయ్ అనేపేరుతో రాజకీయరంగంలో గొప్పఖ్యాతిని సంపాదించాడు.) రెండు పర్యాయాలు బటేవియాకు పంపాడు. ఇతడు మార్టిన్ అనేమారుపేరుతో అక్కడి జర్మన్ రాయబారివర్గంతో సంప్రతింపులుజరిపి మావ్రెక్ నౌకద్వారా భారతదేశానికి వచ్చే ఆయుధాలలో ఒకభాగాన్ని బెంగాలు తీరంలోని రాయ్‌మంగల్ ద్వీపంలోకి చేరవేయవలసిందిగాను ఇంకొకభాగాన్ని ఒరిస్సాతీరంలోని బాలసోరు (Balasore) రేవులోకి చేరవేయవలసిందిగాను ఏర్పాటుచేసి స్వదేశానికి తిరిగి వచ్చాడు. జర్మన్ రాయబారులు కొంతధనాన్నికూడా ఇతనికి అందజేశారు.

వచ్చిన ఆయుధాలు కొన్నిటితో చిట్టగాంగునుండి తూర్పుబెంగాలులోను, కొన్నిటిని కలకత్తానుండి పశ్చిమబెంగాలులోను, కొన్నిటిని ఒరిస్సా ప్రాంతంలోను వినియోగించి సాయుధ పోరాటానికి వీరు సన్నాహాలు చేశారు. రాష్ట్రంలోని మోటారుకార్లు, లారీలు మొదలైనవాటిని వశపరచుకొని పోరాటంలో వినియోగించుటకు ఒక పథకాన్ని రూపొందించారు.

సాయుధపోరాటం ఆయా ప్రాంతాలలో ప్రారంభంకాగానే ప్రభుత్వం అదనపు సైనికదళాలను ఇతర ప్రాంతాలనుండి బెంగాలు రాష్ట్రానికి తరలించగలదని, ఆ కార్యక్రమాన్ని భంగపరచే ఉద్దేశంతో అన్ని రైలు మార్గాలలోని ప్రధానములైన వంతెనలను నాశనంచేయుటకు కొందరు ప్రత్యేకంగా నియోగించబడినారు. పోరాటానికి కావలసిన సన్నాహాలన్నిటనీ చేశారు.

రాయ్‌మంగల్ ద్వీపంలో దిగే ఆయుధాలనన్నిటినీ రాష్ట్రంలోకి తెచ్చే కార్యభారాన్ని జదుగోపాల్ ముఖర్జీ వహించాడు. ఇందులో కోస్తాలోఉండిన ఒక జమీందారు ఇతనికి సహాయపడినాడు. ఆయుధాలు 1915 జూన్‌లో రాగలవని భావించి, ఆ ద్వీపానికి అనేక పడవలను పంపారు. కాని పది రోజులపాటు వేచిఉండినా వాటిజాడ ఏదీ కనుపించలేదు. అందుచేత వారు నిరాశగాంచి సందిగ్ధదశలో పడిపొయ్యారు. ఆయుధాలను తెచ్చుటకు నియోగింపబడిన ఆనీ లార్సెన్, మావరెక్ నౌకలను బ్రిటిష్‌వారు ఏ విధంగా వశపరచుకొన్నదీ ఇదివరకే తెలుసుకొన్నాము. జదుగోపాల్ ముఖర్జీ మొదలైన ఉద్యమనాయకులకు ఈ ఉదంతం తెలిసిందికాదు.

అమెరికాలోనే జెక్కు విప్లవకారులు జర్మనులు భారతదేశానికి పంపసంకల్పించిన ఆయుధాలగురించిన రహస్యాన్ని బ్రిటిష్ అధికారులకు తెలయపరచిన తర్వాత బెంగాలులోని పోలీసువారుకూడా మరింత జాగ్రతతో స్వాతంత్ర్యయోధులు సమావేశమయ్యే రహస్యకేంద్రాలను కనుగొని వాటిని సోదాచేసి వారి రహస్యాలలో అనేకాన్ని కనుగొన్నారు. దాని ఫలితంగా అనేకులు నిర్బంధితులయ్యారు. ఈ సోదాలలోనే వారికి బాలసోరుకుచేరే ఆయుధాలను వశపరచుకొనుటకు, ఒరిస్సా ప్రాంతంలో సాయుధపోరాటాన్ని లేవదీయుటకు

కొందరు సహచరులతో జతీన్‌ముఖర్జీ అక్కడికి వెళ్లినట్లు కొంత దాఖలాలు లభించాయి.

వాస్తవంగానే జతీన్‌ముఖర్జీ కొందరి సహచరులతో బాలసోరుకు వెళ్లి అక్కడ పేరునకు ఒక సైకిల్ కంపెనీని స్థాపించి దానిని తన విప్లవకార్యక్రమాలకు వినియోగిస్తూవచ్చాడు. పోలీసువారికి కొంతదూరంగా ఉండే ప్రదేశంలో నివసించడం అవసరమనేభావంతో బాలసోరుకు కొన్ని మైళ్ళ దూరంలో మయూర్ భంజ్ సంస్థానంలోని కప్తపాద (Kapthpada) గ్రామంలో మకాం పెట్టాడు. సైకిల్ కంపెనీని సోదాచేసినప్పుడు పోలీసులకు ఈ రహస్యం తెలియవచ్చింది. వెంటనే వారు వారిని పట్టుకొనుటకు ఆ గ్రామానికి వెళ్లారు. వారి రాక కొంచెం ముందుగానే జతీన్‌కు తెలిసింది. అందుచేత అతడు గ్రామాన్ని వదలి, సమీపంలోని అడవులలో తన సహచరులతో సంచారంచేస్తూ చాలా అలసిపొయ్యాడు. వీరెవరో దోపిడీగాండ్రనే భావంతో అడవులలోని గ్రామాలవారు పోలీసులకు వారినిగురించి తెలియపరచారు. పోలీసులు అక్కడికి 1915 సెప్టెంబరు 9 న వచ్చి వారిని చుట్టుముట్టదలచారు. కాని వారు సమీపంలో ఒక పొలంలోఉన్న మట్టిదిబ్బపై నిలబడి అరగంటసేపు తమ తుపాకులతో పోలీసుబృందంతో పోరాడారు. కాని పోలీసుబృందం సంఖ్యాబలంకలది కావడంచేత వారి పోరాటం వ్యర్థమైంది. పోరాటంలో గుండుదెబ్బ తగిలి ఒక విప్లవకారుడు అక్కడికక్కడే మరణించాడు. జతీన్‌కు బలమైన గాయాలు తగిలి మరణావస్థలో ఉండిపొయ్యాడు. ఇంకొకనికికూడా గాయాలు తగిలాయి. తక్కిన ఇద్దరిని పోలీసులు వశపరచుకోకలిగారు.

గాయాలు తగిలిన జతీన్ తర్వాత రెండు రోజులకు బాలసోర్ ఆసుపత్రిలో మరణించాడు. అతడు ప్రదర్శించిన సాహస పౌరుషాలకు పోలీసు అధికారులుకూడా ముగ్ధులైనారు. వారిలో ఒకడు జతీన్‌ను సమీపించి, "నేను నీకు చేయగలిగిన సహాయం ఏదైనాఉన్నదా", అని అడుగగా, "నేను చాలా కృతజ్ఞుడను. మా ఉద్యమం ఆఖరుదశలోపడింది" అని జవాబుచెప్తూ కన్నులు మూశాడు. ఈవిధంగా ఉద్యమనాయకులలో అందరి గౌరవానికి పాత్రుడైన ఒక మహామహుడు వీరమరణాన్ని పొందినాడు. అతనితో ఉద్యమంకూడా ఆగిపోయింది.

1915లో ప్రభుత్వం దేశసంరక్షణచట్టాన్ని (Defence of India Act) చేసి, మ్యాజిస్ట్రేటులకు అనుమానాస్పదులను నిర్బంధించుటకు, శిక్షాస్మృతితో అవసరంలేకుండా వారిని విచారణచేసి ఇష్టంవచ్చిన శిక్షల విధించుటకు ప్రత్యేక న్యాయస్థానాలకు అధికారాలను ఇచ్చింది. ఈ చట్టంఫలితంగా వందలాది ఉద్యమకారులు నాయకులతోసహా నిర్బంధితులయ్యారు. అనేకులు ఉరిశిక్షకూ ద్వీపాంతరవాస శిక్షకూ పాత్రులయ్యారు. వాటిని తప్పించుకొన్న జదు గోపాల్ ముఖర్జీ వంటివారు అజ్ఞాతంలో ఊరూర సంచారంచేస్తూ అష్టకష్టాలను అనుభవించారు. ఆ పరిస్థితులలో విప్లవ నాయకుడుగా ప్రసిద్ధిగాంచిన ప్రజ్ఞానంద సర

స్వతి అనే పేరుతో సన్యాసాన్ని స్వీకరించిన సతీష్‌చంద్ర ముఖర్జీ నిర్బంధంలో ఉండినా, ఉద్యమాన్ని పూర్తిగా ఆపివేయడం గౌరవకరం కాదని, 150మందికి సరిపడే ఆయుధాలు విప్లవకారుల వశంలో ఉండడం గుర్తించి వారు బ్రిటిష్ వారితో సాయుధపోరాటాన్ని సాగించవలసిందిగా జడుగోపాల్ ముఖర్జీని ప్రోత్స హించాడు. అందులో వారు ఓడిపోయి, ప్రాణాలను పోగొట్టుకోనడం తథ్య మైనా, భవిష్యత్తులో స్వాతంత్ర్యయోధులకు వారు మార్గదర్శకులు కాగలరని భావించాడు. కాని అదికూడా సాధ్యంకాలేదు. ఈవిధంగా 1906లో బెంగా లులో ప్రారంభమై 10 సంవత్సరాలపాటు అనేకదశలలోసాగిన విప్లవ ఉద్యమం ముగిసింది.

## 11

1914, 1915లలో పంజాబులో విప్లవాన్ని లేవదీయుటలో ప్రధాన పాత్రను వహించినవారు అమెరికాలో ఘదర్ పార్టీకి చెంది, 1914లో భారత దేశానికి వచ్చిన భారతీయులు. వీరి కార్యక్రమాలను వివరించుటకు పూర్వం ఇంకొక ఉదంతాన్ని గురించి ప్రస్తాపించడం అవసరం.

పంజాబులో 19వ శతాబ్దం ఆఖరునను, 20వశతాబ్ద ప్రారంభానను ఆర్థిక పరిస్థితులు అధ్వాన్నం కావడంచేతను నిరుద్యోగం పెరగడంచేతను అనేకులు అమెరికాకు వెళ్ళినట్లు ఇదివరలో వివరించాము. వీరిలో కొందరు కనడాలో స్థిర నివాసాలు ఏర్పరచుకొన్నారు. రంగుజాతివారు అధిక సంఖ్యలో తమ దేశానికి రావడం కనడా ప్రభుత్వానికిగాని కార్మికులకుగాని అంగీకారం కాక, వారి రాకను గురించి అనేక నియమ నిబంధనలు చేశారు. వారి రాకను అరిగట్టడమే వీటి ఉద్దేశం.

కాని 1914 ఏప్రిల్ 14న హాంకాంగులో నివసిస్తున్న 165 భారతీయులు బాబా గురుదత్‌సింగ్ నాయకత్వాన కనడాలో వాంకువార్ (Vancuver) నగరానికి కోమగటమారు (Komagata Maru) అనే ఒక జపాన్ నౌకలో ప్రయాణమయ్యారు. మార్గంలో మరికొన్ని రేవుపట్టణాలలో నివసించే భారతీ యులుకూడా వారితో కలిశారు. ఈ విధంగా 376 ప్రయాణికులతో (వీరిలో 25 గురుతప్ప తక్కినవారు శిక్కులు) మే 23 న నౌక, వాంకువార్ రేవును చేరింది. వీరందరు కనడా ప్రభుత్వం విధించిన నియమాలకు లోబడి ప్రయాణం చేసినా వారి ప్రవేశాన్ని నిషేధించి సౌకాశ్రయంలో వారిని నానాబాధలకు గురిచేసింది. తుదకు వారు తిరిగి వెనుకకుమరలి సెప్టెంబరు 29 న కలకత్తా సమీపంలోని బుడ్జిబుడ్జి (Budge-Budge) ని చేరారు. వీరు ఘదర్ పార్టీకి చెందిన విప్లవకారులనే అనుమానంతో కలకత్తా ప్రభుత్వం వీరినందరిని పంజాబుకు పంపి వేయుటకు అంతకుపూర్వమే ఏర్పాటుగావించి బుడ్జిబుడ్జిలో ఒక రైలుబండిని సిద్ధపరచింది. కాని వీరు కలకత్తాకు వెళ్లదలచారు. ప్రభుత్వం దానికి అంగీకరిం చక బలవంతపరచి వీరిని రైలుబండిలో ఎక్కించుటకు పోలీసుదళాలను పంపిం

చింది. పోలీసులకూ వీరికీమధ్య సంఘర్షణ సంభవించి; పోలీసు కాల్పులమూలంగా 18 గురు మరణించారు; 29 గురు తప్పించుకొని పారిపొయ్యారు. 60 మంది మాత్రం రైలుబండిని ఎక్కారు. తక్కినవారు అరెస్టై నిర్బంధంలో ఉంచబడినారు.

ఈ విధంగా కనడా ప్రభుత్వానికంటే కఠినంగా భారతదేశ ప్రభుత్వం వీరిపట్ల ప్రవర్తించింది. (వీరి దేశాభిమానాన్ని గుర్తించి, 1975 లో పంజాబులో కాంగ్రెసు సమావేశం జరిగిన ప్రదేశానికి కోమగాటునగర్ అనేపేరు పెట్టబడింది). అప్పటికే పంజాబులోని పరిస్థితులు విషమించి, విప్లవఉద్యమాన్ని ఉద్ధృతంచేస్తూ ఉండినవి. కోమగాటు మారు ఉదంతం వాటిని మరింత విషమింపజేసింది.

అమెరికానుండి పంజాబు చేరిన భారతీయులు జర్మన్ ఆయుధాల సహాయంతో భారీఎత్తున సాయుధపోరాటాన్ని లేవదీసేఉద్దేశంతో వచ్చారు. వారు అనేకబృందాలుగా చీలిపోయి సాయుధపోరాటానికి మొదటిమెట్టుగా ధనాన్ని ఆర్జించుటకూ, ప్రభుత్వానికి నష్టం కలిగించుటకూ అనేక విడివిడి కార్యక్రమాలను సాగించారు. అటుతర్వాతనే వారు సాయుధపోరాటానికి చర్యలు తీసుకొన్నారు.

మొదటిరకపు కార్యక్రమాలలో అనేకం 1914లో సంభవించాయి. వీటిలో ధనికుల ఇండ్లను, ప్రభుత్వ ఖజానాలను దోపిడీ చేయడం, రైళ్ళను పట్టాలనుండి తప్పించి వాటికి ప్రమాదం కలిగించడం, తంతి తీగెలను తెంపివేయడం, పోలీసు స్టేషన్లపై దాడిచేసి తుపాకులు మొదలైన ఆయుధాలను అపహరించడం ప్రాధాన్యం వహించాయి. ఇవిగాక వారు ఘదర్ కరపత్రాలను ప్రకటించి ప్రజలందరు తిరుగుబాటు చేయవలసిందిగా ప్రచారం చేశారు. పంజాబులోని సైనిక శిబిరాలలోని సిపాయి పటాళాలతో సంబంధం సంపాదించి, వారిమధ్య కూడా ప్రచారం సాగించి, వారు తిరుగుబాటు చేయవలసిందిగా ప్రోత్సహించారు. బెంగాలునుండి కొన్ని బాంబులను తెప్పించారు. బాంబులు తయారు చేయుటకు కొన్ని రహస్య కర్మాగారాలను స్థాపించారు. రైలు వంతెనలు కొన్నిటిని నాశనం చేశారు. సమావేశాలు జరిపి విప్లవంలో పాల్గొనవలసిందిగా ఉపన్యాసాలు చేశారు.

కాని వీరిలో ఒక గొప్ప లోపం కనుపించింది. బెంగాలులోని విప్లవకారులు యుగాంతర్ పార్టీగాఏర్పడి ఒకరి నాయకత్వాన పనిచేయుటకు సిద్ధపడ్డారు పంజాబుకు అమెరికానుండి వచ్చిన భారతీయులు ఈలాటి పార్టీని నిర్మాణం చేసుకొనలేకపోయినారు. వారందరిపైనా ఎవరూ నాయకత్వం వహించలేకపోయినారు. వారు వారివారి కార్యక్రమాల విషయంలో రహస్య విధానాన్ని పాటించరైరి. వారు తీసుకొనదలచిన విప్లవచర్యలు గురించి పోలీసులకు ఎప్పటికప్పుడు సమాచారం అందుతూనే వచ్చింది. కొందరు పోలీసు గూఢచారులు వారితో కలిసిపోయి వారి చర్యలను గురించి ముందుగానే పోలీసు అధికారులకు తెలియ

పరచసాగారు. ఈలాటి లోపాలమూలంగా వారు తలపెట్టిన కార్యక్రమా లన్నీ జరగకపోయినాయి. వారిలో అనేకులను సకాలంలో అరెస్టుచేసి నిర్బంధంలో ఉంచే అవకాశం ప్రభుత్వానికి లభించింది. ఈ విధంగా వారుచేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థములైనాయి. తిరుగుబాటు చేయనెంచిన సిపాయీ పటాళాల రహస్యాలుకూడా సకాలంలో ప్రభుత్వానికి తెలిసి ఆ పటాళాలపై కఠినచర్యలు తీసుకొనడం సాధ్యమైంది.

ఈ విడివిడి కార్యక్రమాలకుతోడు వారు బెంగాలు విప్లవవాదులతో కలిసి దేశవ్యాప్తమైన సాయుధపోరాటాన్ని సాగించ ప్రయత్నించారు. ఈ ప్రయత్నంలో రాష్‌బిహారి బోసు ప్రధానపాత్రను వహించాడు. అతని నిర్మాణ శక్తిని, రహస్య కార్యక్రమాలను సాగించుటలో నైపుణ్యం ఇదివరకే వివరించాము. ఇతడు 1914 లో వారణాసి కేంద్రంగాచేసుకొని, అక్కడ అదివరకు కృషిచేస్తూఉన్న సచీంద్రనాథ్ సన్యాల్ సహాయాన్ని సంపాదించాడు. ఇదిగాక 1914 లో అమెరికానుండి విప్లవాన్ని లేవదీసే ఉద్దేశంతో భారతదేశానికి వచ్చిన ప్రముఖులలో అనేకులు అతనితోకలిశారు. వారందరిలో పింగ్లె అనే మహారాష్ట్రుడు ప్రఖ్యాతిగాంచినవాడు.

ఇతడు వీరి సహాయంతో బెంగాలు పంజాబులలోని విప్లవకారులమధ్య సంబంధం కలపడమేగాక, ఉత్తరభారతంలోని ప్రధాన సైనికస్థావరాలలోని సిపాయీదళాలతో రాయబారంజరుపుటకు నమ్మకస్థులైన తనసహచరులను పంపాడు. ఒకరోజు రాత్రి ఈ పటాళాలోని సిపాయీలు తిరుగుబాటుచేసి, శిబిరాలలోని బ్రిటిష్ సైనికులను హత్యజేసి, జైళ్ళలోని నిర్బంధితులనువిడుదలజేసి సమాచార సాధనాలైన తంతితీగెలను విచ్ఛిన్నంచేసి, ఆయా కేంద్రాలలో పరిపాలనను సాగించుటకు భారతీయుల నియమించి, అందరూ లాహోరునగరంలో కలియవలసిందిగా ఒక పథకాన్ని వేసుకొన్నారు. అనుకొన్నట్లు సిపాయిదళాలు తిరుగుబాటు చేయగలరనే విశ్వాసమే వీరి ప్రయత్నాలకు ఆధారం.

ఈ ఏర్పాటులను చేసి 1915 ఫిబ్రవరిలో రాష్‌బిహారిబోసు లాహోరుకు వెళ్ళాడు. సిపాయీల తిరుగుబాటు 1915 ఫిబ్రవరి 21న జరిగేటట్లు నిర్ణయించబడింది. కాని అప్పటికేకొంతకాలాననుండి కృపాల్‌సింగ్ అనే పోలీసుగూఢచారి రాష్‌బిహారీ బృందంలో సభ్యుడై ఈ రహస్యాన్ని అధికారులకు తెలియపరచాడు. అందుచేత తిరుగుబాటు తేదీని ఫిబ్రవరి 19 కి మార్చారు. కాని దానినికూడా కృపాల్‌సింగ్ అధికారులకు తెలియపరచాడు. అధికారులు అనుమానాస్పదములైన సిపాయీదళాలను వెంటనే ఇతరసైనిక స్థావరాలకుతరలించి వాటిని నిరాయుధులగావించి సిపాయీలను శిక్షలకు పాలు చేసింది. ఈకుట్రలో పాల్గొన్న వారిననేకులను అరెస్టుచేసి నిర్బంధంలో ఉంచింది. కాని రాష్‌బిహారి, పింగ్లేలు ఎలాగో అరెస్టులనుండి తప్పించుకొన్నారు. రాష్‌బిహారి బెంగాలుకువెళ్ళాడు. పింగ్లే కొన్నాళ్ళయినతర్వాత పోలీసువారికి పట్టుబడినాడు.

ఇంతటితో పంజాబులోని విప్లవ ఉద్యమం ఆగిపోయింది. వందలాది అను

మానాస్పదులను దేశరక్షణ చట్టంక్రింద ప్రభుత్వం అరెస్టుచేసి వారిపై తొమ్మిది కుట్రకేసులను పెట్టి ది. వీటికి లాహోరు కుట్రకేసులని పేరు. వీటిఫలితతంగా 28 మందికి ఉరిశిక్షను విధించారు. 29మంది విడుదలయ్యారు; తక్కినవారు ద్వీపాంతర వాస శిక్షనో, జైలుశిక్షనో అనుభవించారు.

ఈ విధంగా 1917 నాటికి బెంగాలు పంజాబులలో విప్లవ ఉద్యమం అంతరించింది. జతీన్‌ముకర్జీ, జదుగోపాల్‌ముకర్జీ, రాష్‌బిహారి మొదలైన వారుచేసిన ప్రయత్నాలన్నీ ఫలప్రదములు కాలేకపోయినాయి. స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఒక ఉజ్వల అధ్యాయం ముగిసి, ఇంకొక అధ్యాయం ప్రారంభమైంది.

ప్రభుత్వం చేసిన శాసనాలమూలంగాను, కంపెనీ కాలమునాటి చట్టాల మూలంగాను సుమారు మూడువేలమంది నిర్బంధితులైనారు. జైళ్ళలో వీరు అనుభవించిన బాధలు, అధికారులు వీరి విషయంలో గావించిన చిత్రవధలు, వర్ణనాతీతములు. అండమాన్సు ద్వీపాలలో ద్వీపాంతరవాస శిక్షను అనుభవించుటకు పంపబడిన బిరేంద్రుడు, సావర్కారు, భాయ్ పరమానందుడు మొదలైన మేధావులు నరకబాధలకంటె ఎక్కువ బాధలను అనుభవించారు. జైళ్ళలోని బాధలమూలంగా అనేకులు యావజ్జీవం రోగపీడితులైనారు. అనేకులు ఆత్మహత్య చేసుకొన్నారు; అనేకులు ఉన్మాదులైనారు; అనేకులు 60, 70 రోజుల పాటు నిరాహారదీక్షను సాగించారు. కాని వారిమొరలను ఆలకించే అధికారులు లేకపొయ్యారు. మహాకవి రవీంద్రనాథుడు, రామానంద చటర్జీ మొదలైన పత్రికా సంపాదకులు, అనిబిసెంటు, మొదలైనవారు తమ నిరసనను తెలియపరచి, వీరు అనుభవించుచుండిన బాధలను ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. కాని ప్రభుత్వ వైఖరిలో మార్పురాలేదు.

మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణను ప్రవేశపెట్టే సందర్భంలో 1919, డిశంబరు 25న చక్రవర్తి రాజకీయ ఖైదీలను క్షమించినట్లును, వారిని విడుదల చేయవలసినదిగాను భారతప్రభుత్వాన్ని ఆదేశిస్తూ ఒక ప్రకటన చేశాడు. కాని దీనిని అమలుపరచడంలో ఉన్నత ఉద్యోగివర్గం ఎంతో జాప్యం చేసింది. 1920 ఆఖరునకు అనేకులు విడుదలైనా, కొందరు జైళ్ళలోను, అండమాను ద్వీపాలలోను అనేక సంవత్సరాలవరకు నిర్బంధంలో ఉండినారు. దేవుడు వరమిచ్చినా పూజారి దానికి భంగం కలిగించాడనే సూత్రం వీరిపట్ల సార్థకమైంది.

దేశ స్వాతంత్ర్యానికై ఆత్మార్పణ చేసిన మహావీరులు వీరు.

## 12

విప్లవ ఉద్యమంలో పాల్గొన్నవారిని ఉగ్రవాదులు (Terrorists) గాను, అరాచకవాదులు (Anarchists) గాను, హంతకులుగాను, దోపిడీలు చేసే వారినిగాను బ్రిటిష్‌ప్రభుత్వం చిత్రించి, వారి చర్యలన్నిటిని ఖండించి, వారందరికి కఠినశిక్షలు విధించింది. ఈ ప్రవర్తన బ్రిటిష్‌వారి పక్షపాతాన్ని స్వార్థాన్ని

వ్యక్తంచేస్తున్నదేగాని విప్లవకారుల వాస్తవ లక్షణాలను వ్యక్తం చేయడంలేదు. ఆవాస్తవ లక్షణం ఏదో మనం ఇప్పుడు తెలుసుకోనవలసి ఉంది.

స్వార్థానికిగాని వ్యక్తిప్రయోజనానికిగాని ఇతరులను హత్యజేసినవారిని దోపిడీజేసినవారిని సమాజం నేరస్థులుగా పరిగణిస్తున్నది. శిక్షాస్మృతికంతకూ ఈలాటి పరిగణన ఆధారం, కాని విప్లవ ఉద్యమంలో పాల్గొన్నవారిలో స్వార్థం లేశమాత్రంకూడా లేదు. వారు అనుసరించిన హత్యాది విధానాలన్నీ దేశ స్వాతంత్ర్య సంపాదనమనే ఉన్నత లక్ష్యాన్ని సాధించుటకు వినియోగింప బడినవి. ఈకారణంచేత వారిని హంతకులుగాను దోపిడీచేసే వారినిగాను చిత్రించడం ఎన్నటికీ న్యాయం కాజాలదు. శత్రువులతో యుద్ధంచేసేవారిని హంతకులుగా ఎవరూ పరిగణించరు.

ఉన్నత లక్ష్యసాధనకైనా ఈలాటి కార్యక్రమాలలోకి దిగడం న్యాయమా అనే ప్రశ్న ఒకటి ఉన్నది. దీనికి ప్రపంచ చరిత్రయే సమాధానం చెప్తూ ఉంది. అన్నికాలాలలో దుష్టపరిపాలనను అంతరింపజేయుటకు అలాటి పరిపాలకులను హత్యజేయడం పరిపాటి అని, అలాటి హత్యలు గావించి దుష్టపరిపాలనను అంతరింపజేసిన వారిని సమాజం గొప్ప దేశాభిమానులుగాను చిరస్మరణీయులుగాను ప్రస్తుతించడం జరిగింది. ఆధునిక యుగంలో దేశస్వాతంత్ర్యానికి కృషిచేసిన ఐర్లాండు, ఇటలీ, రషియా మొదలైన దేశాలలో ఇందుకుగాను రహస్య సంఘాలు స్థాపితం కావడం, అందులోని సభ్యులు అధికారులను హత్యచేయడం, తమ కార్యక్రమాలను సాగించుటకు దోపిడీలద్వారా ధనాన్ని సమకూర్చడం జరిగింది. పాశ్చాత్య దేశాల చరిత్రతో భారతదేశంలోని విద్యాధికుల కంతకూ పరిచయం లభించింది. ఇటలీ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రధానపాత్రను వహించి ఈలాటి దౌర్జన్యకార్యక్రమాలను ప్రోత్సహించిన మ్యాజనీ జీవితాన్ని సురేంద్రనాదుడు బెంగాలీభాషలోను, లజపత్‌రాయ్ హిందీలోను వినాయక సావర్కార్ మరాటీలోను వ్రాశారు దీనిని యువకులనేకులు చదివి దానిచే ప్రభావితులైనారు. పాశ్చాత్య దేశాలలో సమర్థనీయమైన హత్యాధి కార్యక్రమాలను తాము అనుసరించడంలో ఏలాటి అన్యాయంగాని అధర్మంగాని లేవని వారు బావించడం సహజం. భారతదేశంలోని విప్లవోద్యమానికి పాశ్చాత్యుల చరిత్ర మార్గాన్ని చూపింది. బ్రిటిష్‌వారు ఇటలీ రషియాలలోని విప్లవ వాదులకు ఆశ్రయమిచ్చి, వారిని ప్రస్తుతించారు. భారతదేశంలోని ఆంగ్లో ఇండియన్ పత్రికలుకూడా రషియాలోని విప్లవవాదులుచేసిన హత్యలను సమర్థించాయి. నిరంకుశ ప్రభుత్వాన్ని నిర్మూలించుటకు క్రమబద్ధమైన ఆందోళనాది సాధనలకు అవకాశంలేని దేశాలలోను, భారీయెత్తున సాయుధ సమరాన్ని సాగించడం సాధ్యంకాని రషియావంటి దేశాలలోను ఈలాటి హత్యలే నిరంకుశ విధానాన్ని తొలగించుటకు సాధనాలని ఉద్ఘాటించాయి. రషియాలో ఏర్పడినఈలాటి పరిస్థితులే బ్రిటిష్ పరిపాలన కాలంలో భారతదేశంలో కూడా ఏర్పడినాయి. ఆదేశంలో విప్లవకారులు గావించిన హత్యలు దోపిడీలు సమర్థనీయములైనట్లే

భారతదేశంలోకూడాసమర్థనీయములైనవి. ఈలాటిఅభిప్రాయాలచేతను. పాశ్చాత్యదేశాల చరిత్రచేతను భారతదేశంలోని విప్లవకారులు ప్రభావితులు కావడం సహజం. విప్లవోద్యమాలను లేవదీసిన వారు అన్ని దేశాలలో అనుసరించిన విధానం ఇదే, ఇది సర్వసమ్మతమైనట్టిది.

ఈ విధానం పాశ్చాత్య చరిత్రకు సంస్కృతికి అనుగుణమైనా భారతీయ సంస్కృతికి సంప్రదాయానికి విరుద్ధమనీ భారతీయులు కొందరు బెంగాలు విప్లవ కారులను ఖండించారు. కాని ఈ ఖండనకు ఆధారాలు లేవు. ఇది భారత సంస్కృతికి ఎందువల్ల విరుద్ధమో వారు రుజువు చేయలేకపొయ్యారు. భారత దేశ చరిత్రలో పరాయిపరిపాలనను నిర్మూలించుటకు ప్రజలు ఎన్నడూ ప్రయత్నించలేదు, ఆలాటి ప్రయత్నాలను గొప్పసైన్యాలుగల క్షత్రియ వీరులే చేశారు. వారికి ఈలాటి హత్యలు దోపిడీలు చేయవలసిన అవసరం లేకపోయింది. ఇదిగాక శివాజీ వంటివారు అవసరమైనప్పుడు ఈలాటివిధానాలను అనుసరించారు. రాజనీతినిగురించిన గ్రంథాలలో ఇవి గర్హింపబడలేదు సరిగదా, అవసరమైనప్పుడు వీటిని అనుసరించవచ్చునని చెప్పబడింది. వీటి అన్నిటి దృష్ట్యా బెంగాలులోని విప్లవకారులు అనుసరించిన విధానాలు భారత సంస్కృతికి విరుద్ధమనే వాదం నిరాధారమని చెప్పవలసి వస్తుంది.

దౌర్జన్యంతో నిమిత్తంలేకుండా విదేశవస్తువుల బహిష్కరణ, స్వదేశీవస్తువులవాడకం మొదలైన శాంతియుత కార్యక్రమాల సాధనాననే జాతీయవాదులు ప్రథమదశలో స్వరాజ్యసంపాదనకు ప్రయత్నించారు. కాని ఈ ప్రయత్నాలలో పాల్గొన్నవారినికూడా ప్రభుత్వం కఠినంగా శిక్షించింది. అందుకుగాను మామూలు శిక్షాస్మృతికి విరుద్ధంగా అనేకచట్టాలనుచేసింది. ప్రభుత్వం ఈ దమన విధానాన్ని అనుసరించిన తర్వాతనే విప్లవ ఉద్యమం బయలుదేరింది. హత్యలు మూలంగానే అధికారులకు బుద్ధిచెప్పడం సాధ్యమనే నిర్ణయానికి విప్లవకారులు రావడానికి ఇదేకారణం లండన్‌లో కర్జన్‌విల్లీని హత్యజేసినందుకు ఉరిశిక్షకు పాత్రుడైన ధింగ్రా బ్రిటిష్ న్యాయాధీశులకు, "దేశాభిమానపూరితులైన భారతీయ యువకులకు దారుణమైన ఉరిశిక్షలను విధించినందుకు నేనీహత్యనుచేశాను. నా కసిని తీర్చుకొనుటకు ఇది ఒక్కటే తగినచర్య ... ఆయుధాలను, సైన్యాలను ఆధారంచేసుకొని పరాయివారు ఒక దేశాన్ని పాలిస్తున్నప్పుడు ఆ దేశ వాసులకూ పరాయిపరిపాలకులకూ మధ్య నిరంతరం పోరాటం జరుగుతూనే ఉంటుంది. ఈ పోరాటంలో ఆయుధాలను ఉపయోగించి పరాయివారిని ఎదుర్కొనడం సాధ్యంకాకపోవడంచేతనే నేను పిస్టలుతో విల్లీని హత్యజేశాను" అని స్పష్టంగా చెప్పాడు. విప్లవ కారులందరి వైఖరి ఈలాటిదే. ఈ అభిప్రాయాలను ఇంతకుముందే బంకించంద్రుడు, దేశీయపత్రికల సంపాదకులు వ్యక్తంచేశారు. ఈలాటి పోరాటంలో సాధారణంగా యుద్ధంలో ఇరుపక్షాలు వినియోగించే ఆయుధాలను తాము బ్రిటిష్ అధికారులపై వినియోగించడంలో ఏలాటి అధర్మం లేదని విప్లవకారులు భావించారు.

ఆనాటి ప్రముఖులందరు అధికారులను హత్యగావించిన విప్లవకారులను ప్రస్తుతించారు. వారి దేశాభిమానం, సాహసం, నిర్భయం వారిని ముగ్ధుల గావించింది. ప్రస్తుతించినవారిలో అరవిందుడు, తిలక్, లజపత్‌రాయ్, ఆచార్య ప్రఫుల్ల, చంద్రరే, రామకృష్ణాశ్రమానికి చెందిన సన్యాసులు, సిస్టర్ నివేదిత, పాల్, అశ్వినీ కుమారదత్తు, మహాకవి రవీంద్రుడు మొదలైన వారున్నారు. పుల్లరును హత్యచేయవలసిందిగా సురేంద్రనాథుడు కూడా కొందరు విప్లవ కారులను ప్రోత్సహించెనని భావించుటకు ఆధారాలున్నాయి. ఈలాటి మహా మహుల ప్రశంసలకు పాత్రులైన వారిని సామాన్య హంతకులని భావించడంలో అర్థంలేదు. కుదీరాంబోసు ప్రఫుల్లచౌకీ మొదలైన విప్లవకారులు గావించిన హత్యలను ప్రస్తుతిస్తూ ఎందరో జానపదగేయాలు రచించారు. వాటిని పాడడం సామాన్య ప్రజలకు పరిపాటిఅయింది.

ఇంతకూ విప్లవవాదులు 1906-17 మధ్య చేసిన హత్యలు 64 మాత్రమే: దోపిడీలు మూలంగా వారుసంపాదించిన ధనం 7 లక్షలకు మించలేదు. పరాయి పరిపాలనను నిరంకుశ పరిపాలనను నిర్మూలించుటకు పాశ్చాత్యులు లేవదీసిన అమెరికా, ఫ్రెంచి, రషియా విప్లవాదులలో లక్షలాది సంఖ్యలో ప్రజలు హతులైనారు. కోట్ల మొత్తంలో ఆస్తినష్టం సంభవించింది.

ఈ సందర్భంలో ఇంకొక విషయాన్నిగూడా గుర్తించడం అవసరం. భారీ ఎత్తున సాయుధ పోరాటం సాధ్యం కాకపోవడంచేతనే విప్లవకారులు ఈలాటి కార్యక్రమాలలోకి దిగారు. 1914లో ప్రపంచ మహాసంగ్రామం సంభవించడంతో జర్మనుల ఆయుధాల సహాయంతో సాయుధపోరాటాన్ని సాగించడం సాధ్యమనే విశ్వాసం వారికి కలిగింది. అందులో సిపాయీ పటాళాలుకూడా పాల్గొనునట్లు చేయుటకు వారు అనేక ప్రయత్నాలు గావించారు. ఈ కార్యక్రమమంతా ఏవిధంగా భగ్నమైనదో ఇదివరకే తెలుసుకొన్నాము. స్వరాజ్య సంపాదనమనే ఉన్నత లక్ష్యాన్ని సాధించుటకు యుద్ధవిధానం సాధ్యం కాక పోవడంచేతనే వారు హత్యలలోకి దోపిడీలలోకి దిగినారని గుర్తించడం అవసరం.

విప్లవ ఉద్యమం మూలంగా స్వరాజ్యం లభించిందా? ఉద్యమకారుల కష్టమంతా ప్రయోజనరహితమైనదికదా? ఈలాటి ఉద్యమాన్ని లేవదీయడం ప్రాజ్ఞతయేనా? అనే ప్రశ్నలు లేకపోలేదు. వాటికి 1909 లోనే బిరేంద్రుడు సమాధానం చెప్పాడు ప్రపంచవ్యాప్తమై అపార సైనికబలాన్ని నౌకాబలాన్ని అర్థబలాన్నిగల బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని అధికారులు కొందరిని హత్య జేయడం మూలాన నిర్మూలించడం సాధ్యం కాగలదని విప్లవకారులు భావించ లేదు. ఇందులో వారి ఉద్దేశాలు ప్రధానంగా రెండు అని చెప్పవచ్చు. వాటిలో మొదటిది ప్రజలలో పరాయి పరిపాలనపట్ల ద్వేషాన్ని స్వరాజ్య సంపాదనపట్ల భక్తిశ్రద్ధలను పురికొల్పుట. ఈ ఆశయాన్ని వారు సాధించగలిగారు. సామాన్య ప్రజలు తెల్లవారంటే ఎంతో భయపడేవారు. విప్లవకారులు వారి దేశాభిమానం మూలంగాను, ధైర్యసాహసాల మూలంగాను, అధికారులను ఎదుర్కొనుటలో

ప్రాణాలను సహితం కోల్పోవుటకు సంసిద్ధులు కావడం మూలంగాను తెల్లవా రంటే భయపడవలసిన అవసరం లేదని, వారిని ఎదుర్కొనడం సాధ్యమని రుజువు చేశారు. దీనిఫలితంగా ప్రజలుకూడా తెల్లవారిపట్ల నిర్భయంగా ప్రవర్తించ డానికి అలవాటుపడ్డారు. పరాయిపరిపాలనను ద్వేషించేవారయ్యారు. స్వరాజ్య సంపాదనలో పాల్గొనుట తమ కర్తవ్యమని భావించారు. వారి మనోవైఖరిలో ఈలాంటిమార్పు వచ్చిన కారణంగా మహాత్మాగాంధి 1919 నుండి ప్రారం భించిన స్వాతంత్ర్య సమరంలో సామాన్య ప్రజలు పాల్గొన్నారు. విప్లవ ఉద్యమం ప్రజలను కుంభకర్ణుని నిద్రనుండి మేల్కొల్పింది.

ఈ ఉద్యమం బ్రిటిష్‌వారి మనోవైఖరిలోకూడా మార్పుతేగలిగింది. తమ పరిపాలనను ఎదిరించి, పరిపాలన యంత్రాంగాన్ని స్తంభింపజేయుటకు భారతీయులు సమస్తత్యాగాలు చేయుటకు సంసిద్ధులుగా ఉన్నారని వారు గ్రహించారు. విప్లవకారులు గావించిన హత్యలు, సాయుధపోరాట ప్రయ త్నాలు వారు దీనిని గ్రహించుటకు ప్రధానకారణాలు. ప్రజలను కొంతవరకైనా తృప్తిపరచడం అవసరమనే నిర్ణయానికివచ్చి అందునిమిత్తం 1909 మార్లెమింటో సంస్కరణలను 1919 లో మాంటెగు చెమ్స్‌ఫర్డు సంస్కరణలను ప్రవేశపెట్టారు.

ఈ దృష్ట్యా విప్లవఉద్యమం ఫలప్రదమైనట్లుగా భావించవచ్చు. ఇది గాంధీ మహాత్ముని నాయకత్వంలో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామానికి పునాదులు వేసింది.

## చదువదగిన గ్రంథాలు

Arun Chandra Guha : First Spark of Revolution, Orient Longman.

Sankar Ghose : From The Rennaissance to Militant Nationalism in India.

Vidya Bhavan Vol. XI.

R. C. Majumdar : History of the Freedom Movement in India Vol. III.

Tarachand Vol. III

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 10 | అణచివేయుట | అణచివేయుటకు |
| ,, | ,, | నిరింకుశా | నిరంకుశా |
| 11 | 27 | ఉదయించడంలోలు | ఉదయించడంలోను |
| 13 | 5 | విద్వార్థులు | విద్యార్థులు |
| ,, | 28 | పరిమాలన | పరిపాలన |
| 14 | 16 | మొగలైన | మొదలైన |
| 15 | 9 | బ్రిటిష్‌లో | బ్రిటన్‌లో |
| ,, | 28 | వారిలో | వారితో |
| 21 | 21 | దేశ | దేశం |
| 22 | 25 | ప్రభుత్వ్యో | ప్రభుత్వో |
| 31 | 7 | దేశయుల | దేశీయుల |
| ,, | 26 | విమర్యంచ | విమర్శించ |
| 32 | 4 | బ్రిటిష్ | బ్రిటన్ |
| ,, | 21 | బ్రిటిష్ | బ్రిటన్ |
| 37 | 26 | సంబదిచి | సంబంధించి |
| 39 | 30 | అగ్రహ | ఆగ్రహా |
| 40 | 13 | కప్పించు | తప్పించు |
| ,, | 26 | బూతులు | జాతులు |
| 44 | 6 | పండిచ | పండించ |
| 47 | 18 | పండిచే | పండించే |
| 56 | 1 | సంబంధించిన | సంబంధించని |
| 58 | 31 | ఏర్పడం | ఏర్పడడం |
| 62 | 3 | తమమత | తమతమ |
| 62 | 23 | త్రత్యేక | ప్రత్యేక |
| 63 | 17 | శతాబ్దానము | శతాబ్దము |
| 64 | 25 | సంసృత | సంస్కృత |
| 67 | 34 | కల్పించారు | కల్పించాడు |
| 69 | 5 | కందకూరి | కందుకూరి |
| 71 | 10 | పాటించు | సాటించు |
| 75 | 22 | పాశ్చాతుల | పాశ్చాత్యుల |
| 88 | 6 | ఒకే | ఒక |
| ,, | 33 | పాటించి | సాటించి |
| 97 | 1 | కార్యము | కారణము |
| 98 | 28 | వహించింది | వహించారు |
| 99 | 33 | ఒకే | ఒక |
| 100 | 32 | కులకట్లు | కులకట్టుబాట్లు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 109 | 36 | సిద్ధాతం | సిద్ధాంతం |
| 111 | 32 | పాటిస్తూ | సాటిస్తూ |
| 112 | 18 | సమాజం | సహజం |
| 116 | 16 | సాగించాయి | సాగించారు |
| 117 | 18 | National | Native |
| 119 | 24 | దిగర్శ | దిగ్దర్శ |
| 120 | 7 | వక్తి | వ్యక్త |
| ,, | 23 | వేరే | వీరే |
| 130 | 36 | కషాలను | కష్టాలను |
| 134 | 8 | బ్రిటిష్ | బ్రిటన్ |
| 150 | 6 | ఎన్నిటికో | ఎన్నటికో |
| ,, | 25 | బ్రిటిష్ | బ్రిటన్ |
| 153 | 6 | పరిణమా | పరిణామా |
| ,, | 12 | సత్యాన్ని | సత్యాన్ని |
| 158 | 24 | ఆన్యధాగా | అన్యధాగా |
| 167 | 7 | 1885 | 1882 |
| 171 | 18 | దారితీయ | దారితీయు |
| ,, | 36 | మార్పులు | మార్చుట |
| 178 | 15 | సాడాన్ని | సాడ్యాన్ని |
| ,, | 20 | వెలుబుచ్చిన | వెలిబుచ్చిన |
| 189 | 11 | వేశల | దేశాల |
| 198 | 9 | గిట్టు | గిట్ట |
| 207 | 35 | బెన్ | బెక్ |
| 213 | 32 | నీత | నీతి |
| 218 | 8 | ప్రాజ్ఞతకు | ప్రాజ్ఞత |
| 218 | 32 | స్మురింప | స్ఫురింప |
| 222 | 35 | చేశార | చేశాడు |
| ,, | 36 | సంస్కరణనే | సంస్కరణఅనే |
| 224 | 8 | పరిస్థితులతో | పరిస్థితులలో |
| 225 | 2 | బీహారు | బీరారు |
| 246 | 14 | పరిణమించిది | పరిణమించింది |
| 286 | 24 | స్వార్థం | స్వార్థం |
| 289 | 2 | కల్పించించింది | కల్పించింది |
| ,, | 3 | ఎపజల | ప్రజల |
| 302 | 28 | ప్రకట | ప్రకటన |
| 312 | 12 | జాతీతా | జాతీయ |
| 330 | 24 | ఉపయోగించుటను | ఉపయోగించుటకు |